# రమణీయము

## బాలవ్యాకరణసమీక్ష

దువ్వూరి వేంకటరమణశాస్త్రి

వాల్తేరు

1964

సర్వస్వామ్య సంకలితము

ప్రథమ ముద్రణము : 2,000 ప్రతులు

డిసెంబరు, 1964

ప్రాప్తిస్థానము :

దువ్వూరి వేంకటరమణశాస్త్రి

నందినీమందిరం

రామనగర్, విశాఖపట్టణం-3

వెల : 15-00

ముద్రణము : ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు

# అంకితము

ఆంధ్ర భాషార్ణవ బాలవ్యాకరణనౌకా కర్ణధారునకు

చిన్నయసూరి మహోదయునకు

శబ్దశాస్త్రసరస్వతీసమారాధకులకు

సకలాంధ్రభాషాధ్యాపకులకు

ఆనందముతో

శివాయ గురవే నమః

# అవతారిక

ఇది చిరకాంక్షితము. నేఁటికి కొంతకుఁగొంత నెఱవేఱినట్లున్నది. ఎంతకంతే సంతోషము.

సంస్కృత భాషాకృషి నొకమేరకుఁదెచ్చి మాతృభాషావ్యాసంగాభిలాషతో బాలవ్యాకరణముచేతఁబూనిన బాల్యదశయందె (1915 – 1918) దాని రచనా గంభీరిమ రేఖారూపమునఁ బొడసూపి విస్మయజనకమయి ఆకర్షకమగుటచే బాలవ్యాకరణము లక్షణవాఙ్మయమున ఉదాత్త మనోజ్ఞరచనాసంభరితమయిన ఉత్తమగ్రంథమని ఒకభావ మంకురించినది. ఆదిని ఈ భావమును నాలో బీజరూపమున నిక్షేపించినవారు మా గురువర్యులు కళాప్రపూర్ణులు శ్రీ పజ్జల చినసీతారామస్వామిశాస్త్రి మహోదయులు. ఆ యుపదేశబల మెట్టిదోగాని మా గురువులు తలంచినకంటెను ఆభావము నాలో ప్రబలమయి నానాఁటికి గాఢముగా నాటుకొన్నది. చూచినకొలఁది అనూనంబగు దాని మానోజ్ఞకంబునకు మానసంబున నానందంబునిట్టవొడువ, మఱిమఱి పరికించి దీని విశిష్టతను సమగ్రముగా నాకళింపవలయునను కుతూహల మధికమయినది. అట్టి కౌతుకమునకు దోహదముగా చిట్టిగూడూరు నారసింహ సంస్కృత గురుకులమున రమారమి యిరువది వత్సరములును, ఆంధ్ర విశ్వవిద్యాలయమున సుమారిరువదివత్సరములును పరిణతబుద్ధులగు బాలురకు ఆంధ్రవ్యాకరణాధ్యాపనము గావించు నవకాశమేర్పడినది. జీవితమున నట్టి సదవకాశము నొక భాగ్యవిశేషముగ భావింతును. సద్గురువు లభింపవచ్చుఁగాని, సచ్ఛిష్యులు లభించుట సాధారణముకాదు. నిజమారసినచో, అధ్యాపకులకు శిష్యసంపదకంటె మించినసంపద లోకమందేదియుఁ గానము. అది యటుండ నిండు. ప్రకృతము :

నా అధ్యాపనకాలమున తొలుత చిట్టిగూడూరు గురుకులమున ఉభయభాషాప్రవీణులును, పిదప విశ్వవిద్యాలయమున M. A. లును అధ్యేతలయి బాలవ్యాకరణమునెడఁ జూపిన ఆసక్త్యుల్లాసములు నా బాలవ్యాకరణ పరిశీలనోత్సాహమును ఇనుమడింపఁజేసినవి. నూతనములని తోఁచిన యంశములు వాయువిలీనములు గావింపక చిన్నయసూరి వైదుష్యమును వెల్లడించుచు, ఆయన యాంతర్యము వెలువరించుచు, బాలవ్యాకరణవిశిష్టతను నిరూపించుచు నొక సమీక్ష రచింతమను సంకల్పము ముప్పదేండ్లకుముందే ఉదయించినది. కాని, రచనోపక్రమణమునకు ప్రవృత్తి మాత్రము వెంటనే కలుగదయ్యెను. నా జనన సంవత్సరము విలంబి. దాని మహిమ నా రచనాసంకల్పముపయి రవంత సోఁకియుండునేమొ ! జననకాలప్రభావము లూరకపోవు.

సూరిగారివాక్య మేదిచూచినను స్థూలముగ గోచరించు నర్థము గాక గూఢమగు తాత్పర్య మింకను నుండఁబోలు నను భావము అడుగడుగునను బొడగట్టు చుండెడిది. తోఁచినంతవట్టు లిఖింతమాయనియు, ఆంతర్యమును మఱికొంతకాల మాకళించుకొనక రచనమునకు తత్తఱపాటేల యనియు ఈరీతి సంకల్ప వికల్పములతో నలుపదేండ్ల అధ్యాపనకాలమును, ఇరువదేండ్ల పయఃకాలమును ఇట్టె గడచిపోయినవి.

ఆపిమ్మట, శ్రీ కె. జోగయ్యశర్మగారు చిరకాలసన్నిహితత్వముచే నా రచనాసంకల్పము నెఱింగి ఈ రచనమున కింక జాగుసేయక ఉపక్రమింపక తప్పదని నిరంతరము ప్రేరేచుట రచనారంభమునకు ప్రవర్తకమయినది. ఉపక్రమణమాత్రమునం దెగాక గ్రంథము వెలువడుదాఁక పలువిధముల పాల్గొని ఆయన చూపిన యుత్సాహము సహకారియయి మిక్కిలి తృప్తి నొదవించినది.

ఈ సమీక్షను బాలవ్యాకరణమునకు టీకగా రచించుట నాసంకల్పము కాదు. ప్రతిసూత్రమునకు అర్థవివరణము, లక్ష్యలక్షణసమన్వయము, రూపసాధన ప్రక్రియాప్రదర్శనము మున్నగు వ్యాఖ్యానరీతులు ఇంతకుముందున్న టీకలవల్ల బాలవఱకు గతార్థములుకావచ్చు ననియు, చర్వితచర్వణ మేల యనియు, ఆ మార్గము తలపెట్టనయితిని. పూర్వటీకలలోని కొన్ని యంశములందు నా కభిప్రాయభేదములున్నను వానిలో ప్రాసంగికముగా అనివార్యములయి తారసిల్లిన కొలఁదితావులుదక్క ఉన్నవానినెల్ల పనిఁబూని పరామర్శించుటయు ఈ సమీక్షలో సంకల్పితము కాదు.

వ్యాఖ్యానపద్ధతిని చిన్నయసూరిమాటలకర్థము వివరించి తెలుపుట అనావశ్యకము కాదుగాని అంతమాత్రమగాక, ఆయన ఏమనుకొనుచు, ఎట్లు చర్చించుకొనుచు, ఎట్టి తలంపులతో ఏవాక్యము రచించియుందురో ఆహృదయ రీతిని గ్రహించు ప్రయత్నము మిక్కిలి యావశ్యకమని నా తలంపు. అట్టి దృక్పథముతోడనే యీ సమీక్ష గావించితిని. కాని, యీ ప్రయత్నమున సంపూర్ణ కృతార్థత నందితిననిమాత్రము చెప్పఁజాలను. అయినను, రమణీయకృతిస్వీకర్త లగు నధ్యాపకులు ఇటమీఁద ఈ దృక్పథముతోను, ఇట్టి మఱికొన్ని నూతన దృక్పథములతోను భిన్నభిన్న దృక్కోణములతో బాలవ్యాకరణము సమీక్షింతు రనియు, ఆ ప్రయత్నమున సూరిహృదయము మఱింతగా నావిష్కృతమయి బాలవ్యాకరణ విశిష్టత సమగ్రముగా చదువరుల కందఁగలదనియు విశ్వాసము మాత్ర మధికముగాఁ గలదు. ఇదియే యీ గ్రంథమునకు ఫలశ్రుతి.

ఈ సమీక్షాగ్రంథమును పూర్వోత్తరభాగములుగ విభజింపవచ్చును.

పూర్వభాగమున ప్రాచీనములగు చింతామణ్యాదులును, చిన్నయసూరి ప్రణీతములగు సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణాదులును తరతమ భావదృష్టితో పరిశీలితములయి, తత్పరిశీలనమున వ్యక్తిగతములుగ, గ్రంథగతములుగ తేలిన

చిన్నయసూరీయములగు విశేషాంశములు జీవిత సంగ్రహము మొదలు అనువాద వివేచన ప్రకరణాంతముదనుక వివరింపఁబడినవి.

ఉత్తరభాగమున బాలవ్యాకరణమూలము సమగ్రముగా ప్రదర్శింపఁబడినది. నూతనములని తోఁచిన విశేషములుగల సూత్రములయొద్దమాత్రము సమీక్ష రచింపఁబడినది.

మఱియు, అర్థావబోధ సౌకర్యమునకయి బాలవ్యాకరణ మూల గ్రంథమున (Text) పూర్వముద్రణరీతికి సంస్కారము (Typographical Editing) గావింపఁబడినది. అంతియగాక, వివిధములగు ముద్రణములందు భిన్నభిన్నముగఁ గానవచ్చు పాఠభేదముల పరిశీలనముతో సహేతుకముగా సాధుపాఠములు నిర్దేశింపఁబడినవి.

సమీక్షారచనమున వాక్యములందు స్పష్టతాప్రతిపత్తికిని అన్వయానుకూల్యమునకును, విరుద్ధార్థస్ఫురణనివారణమునకును, అచ్చటచ్చట సంధులు చేయకుండుటయే సమంజసమని తోఁచుటవల్లను, ఇట్టిపట్ల సంధ్యభావము సూరిగారికిని సమ్మతమే యయినటులు ఆయన రచనమునఁ గానవచ్చుచుండుటవల్లను (చూ. సంధి-౬౫-సమీక్ష) కొన్నితావుల సంధులు ఉపేక్షింపఁబడినవి.

సాధారణముగా బుద్ధికి ప్రమాదములుండుట ప్రకృతి ; అవి లేకుండుట వికృతి. కావున, నా రచనమున ఎటనయిన ఎట్టివయిన ప్రమాదములు దొరలియుండవచ్చును. వచ్చునుకాదు....దొరలియే యుండును. ఎవరికెట్టి ప్రమాదము స్ఫురించినను తమకింపక మఱొక్కమాఱు నిదానించి తమకుఁదామె సవరించుకొనఁ గోరుదును. 'పూరంబు విచారించి చేసిన దానం గొఱంతలేదు': అనిగదా మన సూరిగారి పలుకు.

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఎకాడమీవారు తాము జరిపిన చిన్నయసూరి శతవార్షికోత్సవపు సందర్భమున (1962) నా ఈ సమీక్షాప్రసంగము నారసి ఆమోదముతో దీని ప్రకటనమునకయి వేయి రూప్యములు పారితోషిక మొసంగినందులకు ఎకాడమీ సభ్యులకును, అధ్యక్షులు, సారస్వతరసికులు Dr. బెజవాడ గోపాలరెడ్డిగారికిని, సమీక్షా సత్వరప్రకటనమునకు సాదరముగా హెచ్చరించుచు శ్రద్ధచూపిన ఆప్తులు ఎకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికిని నా కృతజ్ఞతాభివందనములు.

మఱియు, నా గ్రంథ ముద్రణ భారమును దెలిపినంతనే నాయెడ ఆదర భావమునెఱపుచు ఆంధ్ర విశ్వకళా పరిషత్తు సిండికేటువారు ముద్రణ సౌకర్యమునకయి వేయిరూప్యములొసంగి గ్రంథప్రకటనమున నాకు ప్రోత్సాహము కలిగించినందులకు సిండికేటు సభ్యులకును, పరిశోధన గ్రంథ ప్రకాశన తత్పరులగు వైస్-చాన్సలరు Dr. A. L. నారాయణగారికిని కృతజ్ఞతతో వందనములు సమర్పింతును.

ఉన్నతశైలిని మనోహరముగా ముద్రణకార్యములు నిర్వహించుచున్న ఆంధ్రా యూనివర్సిటి ప్రెస్సునందె నా సమీక్షను ముద్రింపించు కుతూహలము కలిగి తన్ముద్రణాలయమున ప్రధాన పర్యవేక్షకులుగనున్న (Special Officer) నా ఆప్తమిత్త్రులు శ్రీ ముత్తుస్వామిగారితో ప్రసంగింప, వారు తోడనే ఆమోదము దెలుపుచు, 'విశ్వవిద్యాలయ ముద్రణకార్యముల ఒత్తిడిచే విలంబమగునేమొ' అని, వారికి సహజమగు దూరదర్శితాసంకలిత మితభాషణరీతితో ఇంచుక సంకోచమును మెల్లన సూచించినారు. అయినను, ఎల్లవిషయములందును స్వచ్ఛతా రామణీయకములనే అధికముగా నభిలషించు వారి దృక్పథము నాకు చిరపరిచితమగుటచే వారి పర్యవేక్షణమూలముననే గ్రంథమునకు రమ్యత చేకూరునను కౌతుకముతో ఆలస్యప్రసక్తిని పరిగణింపక వ్రాఁతప్రతిని వెంటనే వారికొసంగితిని. పిమ్మట అతర్కితములు, అనివార్యములునగు కొన్ని ప్రతిబంధకములచే ముద్రణమునకుఁ గొంత యాలస్యము తప్పకున్నను, తుదికి పర్యవేక్షకులు బహువిధానుభవసంభరితమగు తమ సునిశితపరివీక్షణవల్లను, లలితకళానుభూతికౌశలముగల తమ సహాయులు శ్రీ M. R. B. నరసింహారావు సోత్సాహమగు పూనికవల్లను, ముద్రణ కార్యనిపుణుల సముచితసాహాయ్యము వల్లను నా సమీక్షను రమ్యరూపముతో సంతరించినందులకు నిండుతృప్తితో వారికి నా అభివందనము లర్పింతును.

సూరిగారి రూపచిత్రముతో ఈ గ్రంథము నలంకరింపఁదలంచి విద్యాకుమారుఁడు చిత్రకళాకుశలుఁడునయిన శ్రీ A. కోటీశ్వరరావుతోఁ బ్రసంగింప, అతఁడుత్సాహముతో ఇప్పటికి లభించియున్న సూరిగారి చిత్రములనుబట్టి వాస్తవికరూపమునకు ప్రతిబింబముగా తాను చిత్రము రూపొందుపఱిచి, సమయమున కందించి సంతసము గూర్చినందులకయి ఆ వర్ధిష్ణువునకు శుభాకాంక్షలతో నా యభినందనములు.

మఱియు, విశ్వవిద్యాలయమున ఆప్తులతో, ఆత్మీయులతో, అంతేవాసులతో నిండియున్న తెనుఁగుశాఖలో నందఱును ఈ సమీక్షయందలి చర్చాప్రసంగములను ఆసక్తితో సాకల్యముగానాలకించుచు చూపిన యుల్లాసము మఱపునకురాదు. ఆ యనుబంధములు చిరస్థాయులు. ఇఁక, కుమారులు పార్వతీశజగన్నాథులును, విద్యాకుమారులు సుబ్రహ్మణ్యకామేశ్వరులును, కుమారికలు సీతాలక్ష్మీమలయవాసినులును ఈ గ్రంథసందర్భమున చేదోడులయి సహకరించినారు. వ్యాకరణప్రణయులయి వెలయుండని యీ చిరంజీవులను ఆశాసింతును.

అధ్యాపకులు రమణీయము నాత్మీయముగఁ జేకొని సూరిపలుకుల సౌగంధ్యమును మఱింతగాఁ బ్రసరింపఁజేయుదురని సంతృప్తిఁజెందియుందును.

తరుః ప్రసూతే పుష్పాణి .... మరుద్వహతి సౌరభమ్.

వాల్తేరు

డిసెంబరు 31, 1964

(శ్రీ)వేటూరి శివరామశాస్త్రి

# విషయసూచిక

## పూర్వభాగము :



## ఉత్తరభాగము :



## అనుబంధములు :

# జీవిత సంగ్రహము

పంధొమ్మిదవశతాబ్దిని ప్రతిభావంతులయి పేరెన్నికగన్న యాంధ్ర పండితులలో మొట్టమొదటఁ జెప్పఁదగిన వ్యక్తి శ్రీమాన్ పరవస్తు చిన్నయసూరి. సుమారు నూఱు సంవత్సరములనుండియుఁ బడిపాఠశాలలలో బహుళప్రచారము నందిన బాలవ్యాకరణ నీతిచంద్రికల ద్వారమున ఆ మహనీయుని పేరెఱుంగని యక్షరాస్యు లాంధ్రదేశమున నుండుట యరుదు.

చిన్నయసూరి జీవితచరితమును, ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక, 10, 20 సంపుటములందు 1921, 1931 సంవత్సరములలోఁ దొలుత నావిష్కరించినది. ఆ పిమ్మట బహువిధ విషయ విశేష సంభరితమయి 'చిన్నయసూరి జీవితము' అను గ్రంథము వెలువడి బహుళ ప్రచారము గాంచినది. దీనివలన సూరి చరితము సుప్రకాశితమయి యెల్లరకుఁ దెల్లమయినదే గావున దాని నంతగా విపులీకరింపఁ బనిలేదు. బొత్తిగా విడుచుటయు నుచితముకాదు. కావున నయ్యది యిట సంక్షిప్తముగా నిరూపింపఁబడును.

చిన్నయసూరి కాలము : 1806 – 1862.

ఈతఁడు చాత్తాద వైష్ణవశాఖకుఁ జెందినవాఁడు. వీరి పూర్వు లుత్తర దేశమున పరవస్తు మఠమువారి శిష్యులు. తండ్రియగు శ్రీ వేంకటరంగ రామానుజాచార్యుల కాలమున మద్రాసు వచ్చి అట స్థిరనివాస మేర్పఱచుకొన్నవారు.

తలిదండ్రులకు లేకలేక కలిగిన యేకైకపుత్రుఁడు చిన్నయసూరి. ఇతఁడు బాల్యమునఁ బదునాలేండ్ల ప్రాయమువఱక ఆటపాటలతోఁ గాలము గడపి, యా పిమ్మట శ్రీ కంచి రామానుజాచార్యుల యొద్ద నక్షరాభ్యాసము నుపక్రమించి, ఏకసంధాగ్రహణశాలిగావున నత్యల్పకాలముననే ప్రాథమికవిద్య నధిగమించి, పిమ్మట వేఱువేఱు పండితులయొద్ద సంస్కృతాంధ్రములయందుఁ గూలంకషమగు పాండిత్యము సంపాదించుటయగాక అఱవము, ప్రాకృతము మున్నగు భాషలలోఁగూడఁ బరిపూర్ణమగు పరిచయము గడించినవాఁడు. ఆపయిని తర్కాలంకార వ్యాకరణ శాస్త్రములందును, ఉభయవేదాంతముల యందును, జక్కని పరిశ్రమ మొనర్చినవాఁడు. సహజమగు మేధాసంపత్తి వల్లను, విశేషించి హయగ్రీవ మంత్రోపాసనా బలమువల్లను నీయనకు నచిర కాలముననే సంపూర్ణమగు శాస్త్రవిజ్ఞానము సంపన్నమయినది.

ఈ విధముగా ననేకభాషలయందును శాస్త్రములయందును జక్కని ప్రావీణ్యము సంపాదించి, దానితోపాటుగ నాంగ్లభాషాపరిచయముగూడ గడించుటచే నా కాలమున హైందవులతోపాటు పాదరీలును, ఆంగ్లేయోద్యోగులును, నీయనకు శిష్యులై తెనుఁగు నేర్చుకొనుచుండెడివారు.

ఈతఁడు తొలుత మదరాసులోని ఆష్టను పాఠశాలయందును, పచ్చయప్ప కళాశాలయందును, గొంత కొంతకాలము (క్రీ.శ. 1844 – 1847) తెనుఁగు పండితుఁడుగా నుండి యటుతరువాత నేఁటి ప్రెసిడెన్సీ కళాశాలకు మూలమైన యానాఁటి రాజధానీ పాఠశాలయందు ప్రప్రథమముగా నేర్పఱుపఁబడిన యాచార్యపదవిని చిరకాలము (1847 – 1861) అలంకరించెను. ఆ రాజధానీ కళాశాలలోని పండితపదవియే యీతనికి శాశ్వతముగు ప్రఖ్యాతిని గలిగించినది.

ఈతని పాండితీపటిమకును, విశేషించి సౌజన్యగరిమకును విస్మితులగుచు ఆర్బత్‌నాట్, సి. పి. బ్రౌన్ మున్నగు నాంగ్లేయ పండితులును, గాజుల నరసింహశ్రేష్ఠి, రంగనాథశాస్త్రి మొదలగు స్థానిక ప్రముఖులును, నీతనియెడ నత్యంత గౌరవాదరములు నెఱపుచుండెడివారు. వేదము పట్టాభిరామశాస్త్రి, రావిపాటి గురుమూర్తిశాస్త్రి, పుదూరి సీతారామశాస్త్రి, వేదము వేంకటరమణశాస్త్రి మున్నగువారు చిన్నయసూరికి సమకాలికులగు పండితులు. ఆంధ్ర విశ్వగుణాదర్శకర్త పంచాంగం తేపెప్పెరుమాళ్ళయ్య, శబ్దరత్నాకరకారులు బహుజనపల్లి సీతారామాచార్యులును, నీతని శిష్యవర్గమునకుఁ జెందినవారు.

పాండితీ ప్రకర్షమునుబట్టియు, స్వభావ సారళ్యమునుబట్టియు, రచనా లాలిత్యమునుబట్టియు నేర్పడిన విశిష్టతవల్ల సూరి యానాఁటి పండితమండలి యందగ్రగణ్యుఁ డగుటచే సమకాల పండితులలో అల్పమతులు కొందఱసూయఁ జెందునంతటి ప్రఖ్యాతి వ్యాపించినది. విద్యాధికారివర్గమువారు సూరి యెడల మిక్కిలి గౌరవాదరములు నెఱపుచుండెడివారు. ఊరక మాటలతో గారవించుటయ కాదు; ఈతని పాండిత్యమునకును, బోధనాసక్తికిని, రచనాశక్తికిని సబ్బురపడి కళాశాలాధికారియగు ఆర్బత్‌నాట్ దొర యంతకు మున్నున్న 'చిన్నయ' యను నామమునకు 'సూరి' యను బిరుదము చేర్చి 'చిన్నయసూరి' యను నామాక్షరములు చెక్కఁబడిన బంగారుకడియమును సీమనుండి తెప్పించి యీతనికిఁ బారితోషికమొసంగి సమ్మానించినాఁడఁట. విద్యాశాలియగు పురుషుని సకలజనులు సన్మానింతురు.

ఈ విధముగాఁ జిన్నయసూరి సమకాలిక పండితమండలిలో మిన్నయై, కళాశాలయందలి ప్రధానాంధ్రాధ్యాపక పదవికి వన్నెయు వాసియుఁగల్గించుచు

ననేకులకు విద్యాదానము చేయుచుండెడివాఁడు. మఱియుఁ గేవలము అర్థా
పకత్వమాత్రమునఁ దృప్తిఁజెందక విజ్ఞానమునకు సమపథమును జూపించి,
ప్రాచీనాంధ్రగ్రంథములను బరిశీలించుచు, వానియందలి విశేషములు సేకరించు
కొనుచు, నిరంతరము నేదో యొక నూత్నవిషయ సంగ్రహణమున వ్యసనము
గలిగి సారస్వతపరిశోధనము సాగించుచుండెడివాఁడు. తాను గావించు పరి
శోధనము సార్థకమగుటకు వాణీదర్పణమను ముద్రాక్షరశాలను నెలకొల్పి,
సుజనరంజనియను మాసపత్త్రికను ముద్రించుచు, ననేకవిధములగు వ్యాస
ములను గ్రంథములను బ్రకటించుచు భాషాసేవ యొనరించుచుండెడివాఁడు.

అంతియగాదు. ఆ కాలమున నాంధ్రమున బాలురకుఁ బఠనీయ
ముగా నుండఁదగిన లలితమగు వచనరచనయు, నియమబద్ధమయి గ్రాంథి
కాంధ్ర స్వరూపము నిరూపించు సుబోధమగు వ్యాకరణమును, సమగ్రము
అకారాద్యనుక్రమ సంపన్నము, ప్రయోగప్రదర్శకమునగు ఆంధ్రపదకోశ
మును, లేకపోవుట సూరిదృష్టికి గొప్పలోపముగా గోచరించినది. ఆ కొఱంతను
వారింపఁబూని కాలక్రమమున, ఆ గ్రంథత్రయమును రచింప సంకల్పించెను.

తొలుత నీతిచంద్రికను, మిత్రలాభ మిత్రభేదములను మాత్రము రచించి
1853 లో ప్రథమముద్రణముగా నావిష్కరించెను.

నీతిచంద్రిక స్వరూపమును గూర్చిగాని, ఆంధ్ర వచనవాఙ్మయమున
దానికిఁగల స్థానమును గూర్చిగాని చెప్పవలసినది యెంతేనిఁ గలదు. కాని యీ
సమీక్షలో ఆ ప్రసంగములకుఁ దావు తక్కువ. అది పుట్టిన నాఁటినుండి నేఁటి
దాఁకఁ బాఠశాలలయందుఁ బఠన పాఠనాదులలో విరామములేకుండ నెలవు
కొనుటయే దాని విలువకుఁ దార్కాణము. ఈ సందర్భమున నొక్కయంశము
మాత్ర ముగ్గడింపక యూరకుండ మనసొప్పకున్నది.

అంతకుమున్ను వర్ణనాబహుళముగను, దండాన్వయ ప్రాయముగను,
నస్తవ్యస్తముగను నున్న వచనరచన, చిన్నయసూరిచేతిలో లాలిత్యమును,
విషయప్రాధాన్యమును, జాతీయతను, నుడికారపుసొంపును, సంతరించుకొని
బాలురకేగాక ప్రౌఢులకును బఠనీయమై యాంధ్రవచనవాఙ్మయమున నద్వితీయ
మగు పదవిని గడించుకొన్నది. ఇంతయేల! నీతిచంద్రిక నేఁటి గ్రాంథి
కాంధ్ర వచనరచనలకుఁ జాలవఱకు నొఱవడియైనదని చెప్పినను నతిశయోక్తి
కానేరదు. నీతిచంద్రిక ననుకరించి యట్టి వచనరచన సేయవలయునను కుతు
కముతోఁ బెద్దలు కొందఱు సంధి విగ్రహములు రచించి, శేషపూరణము
గావించి, యాశైలి ననుకరించుటకు ననేకవిధముల యత్నించిరి. కాని, యా
జిగిబిగుల యందము సందుకొనలేకపోయిరి. ఆ పలుకుబడిలోని పసందు

పట్టువడినదికాదు. ఇది తత్పాఠకుల కెల్లరకును దెల్లమయిన యంశము. మాటలుపెక్కులేల! ఆతని రచనలోని యందచందములు, ఆ కూర్పులోని యింపుసొంపులు, మఱి యెవ్వరికిని బట్టువడవు. ఆ వాక్యరచన మప్రతిమానము. అది యాతని సొత్తు.

చిన్నయసూరి రచనలలోఁ బెద్దగాఁ బేర్కొనఁదగినది బాలవ్యాకరణము.

సూరి భారతాదుల ప్రయోగసరణిని బరిశీలించి, ప్రాచీన లక్షణ గ్రంథ విధానమును నిదానించి, తన బోధనానుభవమునుబట్టి నూతన ప్రణాళిక నిర్ణయించుకొని, పటుబంధముగలిగి శ్రోత్రపేయములగు సూత్రములతో, వివరణ సమన్వయములతో, ఉదాహరణ ప్రదర్శనముతో, సక్రమమగు ప్రక్రియా మార్గమున, ఈ వ్యాకరణమును సంతరించెను.

భాష యనంతమగుటవల్లను, దాని యాకృతి నానాముఖమగుటవల్లను, రచించునది లక్షణగ్రంథ మగుటవల్లను, ఏపేని స్వల్పములగు లోపములుండుట యసంభవము కాదు. అట్టి నెరసులు కావు కష్టపడి యన్వేషింపవలసినవి. శబ్దరూప నిర్ణయమునందును, సాధ్వసాధువివేచనమునందును, సూత్రపటుత్వమునందును, విషయ సంగ్రహణమునందును, వివరణ వైశద్యమునందును, లక్ష్యనిర్దేశమునందును, పరమత పరామర్శము నందును, వ్యాకరణమున కుండవలయు గుణములు దీనియం దెటులున్నవి? అని పరికింపవలయును. ఆ దృష్టిని సమీక్షించినచో నిది యాంధ్రవ్యాకరణములలో సగ్రగణ్య మనుటకు సందియము గలుగదు. ఇది 1858లో సూరిసమక్షమున ప్రథమ ముద్రణము నందినది. సుమారు నూఱు వత్సరములనుండి బహు ముద్రణము లందుచు, బాలబాలికల పఠన పాఠనాదులలోఁ బ్రధానవ్యాకృతియయి పాదుకొనుటయే దీని ప్రశస్తిని వేయినోళ్ళ వెల్లడింపఁగలదు.

చిన్నయసూరి రచనలలో ముఖ్యముగాఁ బేర్కొనఁదగినదియు, నాంధ్ర వాఙ్మయమునఁ జిరస్థాయిగా నుండవలసినదియు నగు మఱియొక మహాగ్రంథము ఆంధ్రనిఘంటువు.

సూరి మన వాఙ్మయమునంతను బరిశోధించి, పదజాలము కూర్చుకొని, ప్రయోగములు సేకరించుకొని, సంపూర్ణమగు నిఘంటువు వ్రాఁతప్రతిని సిద్ధపఱిచెను. అది ముద్రితము కాదయ్యెను. శబ్దరత్నాకరమునకు నదియే యాకరమని జనశ్రుతి. జనశ్రుతి మాత్రమ కాదు. శబ్దరత్నాకర పీఠికయు, ఆయంశమును స్పష్టముగా సూచించుచున్నది.

చిన్నయసూరి స్వహస్తలేఖనముతో ముద్దులు మూటగట్టు ముత్యముల వంటి యక్కరములతో నొప్పారు 7 సంపుటముల యీ వ్రాఁతప్రతి నాంధ్ర

సాహిత్య పరిషత్తువారు సంపాదించి చిరకాలము సంరక్షించి, తమ సూర్యరాయనిఘంటు నిర్మాణావసరమున వలసిన పట్టుల నుపయోగించుకొనుచుండిరి. వారి కార్యాలయముల తాఱుమాఱులలో నది యెచటనో యెటులో యంతరించినట్లు వినఁబడుచున్నది. నిన్నమొన్నటి చిన్నయసూరి గ్రంథసంచయమును నయితము, శ్రద్ధతో భద్రపఱచుకొనఁజాలని మన యజాగరూకత మిక్కిలి శోచనీయము.

ఇవిగాక విశ్వనిఘంటుటీక, నీతిసంగ్రహము, అక్షరగుచ్ఛము, విభక్తిబోధిని, ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య, హంసాపక్షశాస్త్ర సంగ్రహము మున్నగునవి చిన్నయసూరి రచనయగా మఱికొన్ని వినంబడుచున్నవి. వీనిలో ధర్మశాస్త్ర సంగ్రహము ప్రతిని లండను బ్రిటిష్ మ్యూజియము గ్రంథాలయమునుండి సంపాదించి నిడుదవోలువారు ఈ నడుమనే ప్రకటించియున్నారు.

ఇట్లు చిన్నయసూరి యొకవంక మంచి లాక్షణికుఁడై, వేఱొకవంకఁ జక్కని కవియైనట్లును దెలియుచున్నది. ఆతఁడు ప్రత్యేకించి రచించిన పద్యకావ్యమేదియుఁ గానరాకున్నను, కళాశాలోత్సవ సమావేశాది సందర్భములందు నాతఁడు రచించిన పచ్చయప్పయశోమండనాది పద్యరచనలు చూచినచో చిన్నయసూరి, కవితాధోరణిలో ఏ ప్రాచీనాంధ్రకవికిని దీసిపోఁడేమో యనిపించును. పద్యకవితా శైలినిబట్టి చూడ నాతనికి (నాచన) సోమన శ్రీనాథుల రచనలయెడ నభిరుచి యధికమేమో యనియుఁ దోఁచును. మచ్చున కొంతు రెండు పద్యములు :

"గగనంబట్లు రసప్రపూర్ణ విలసత్కాందంబుల న్మీఱి, య
భ్రగసాలంబుగతిన్ సితచ్ఛదములన్ భాసిల్లి, మేరుక్రియన్
జగదామోద సువర్ణభాస్వరముగా జానొందు పచ్చావనీ
శ గుణంబు ల్గణుతింప కోశమిది యిచ్చ న్మెచ్చుగావించెడిన్.

ఆశావధూటికా కేశపాశములకు
మల్లిమతల్లి సంపత్తి నెఱపి
యామినీకామినీ స్వామివక్షమునకు
స్వచ్ఛాంగరాగ విభ్రమ మమర్చి
వారాశిఁ గూరుకు వారిజేక్షణునకు
హీరవర్మ శ్రీ రహింపఁజేసి
యామర సామజాతాస్య బింబమునకు
ముత్యాలమొగముట్టు మురువుసూపి

పట్టుపడినదికాదు. ఇది తత్పాఠకుల కెల్లరకును దెల్లమయిన యంశము. మాటలుపెక్కు-లేల! ఆతని రచనలోని యందచందములు, ఆ కూర్పులోని యింపుసొంపులు, మఱి యెవ్వరికిని బట్టుపడవు. ఆ వాక్యరచన మప్రతిమానము. అది యాతని సొత్తు.

చిన్నయసూరి రచనలలోఁ బెద్దగాఁ బేర్కొ-నఁదగినది బాలవ్యాకరణము.

సూరి భారతాదుల ప్రయోగసరణిని బరిశీలించి, ప్రాచీన లక్షణ గ్రంథ విధానమును నిదానించి, తన బోధనానుభవమునుబట్టి నూతన ప్రణాళిక నిర్ణయించుకొని, పటుబంధముగలిగి శ్రోత్రపేయములగు సూత్రములతో, వివరణ సమన్వయములతో, ఉదాహరణ ప్రదర్శనముతో, సక్రమమగు ప్రక్రియా మార్గమున, ఈ వ్యాకరణమును సంతరించెను.

భాష యనంతమగుటవల్లను, దాని యాకృతి నానాముఖమగుటవల్లను, రచించునది లక్షణగ్రంథ మగుటవల్లను, ఏవేని స్వల్పములగు లోపములుండుట యసంభవము కాదు. అట్టి నెరసులు కొవు కష్టపడి యన్వేషింపవలసినవి. శబ్దరూప నిర్ణయమునందును, సాధ్వసాధువివేచనమునందును, సూత్రపటుత్వమునందును, విషయ సంగ్రహణమునందును, వివరణ వైశద్యమునందును, లక్ష్యనిర్దేశమునందును, పరస్పర పరామర్శము నందును, వ్యాకరణమున కుండవలయు గుణములు దీనియం దెటులున్నవి? అని పరికింపవలయును. ఆ దృష్టిని సమీక్షించినచో నిది యాంధ్రవ్యాకరణములలో నగ్రగణ్య మనుటకు సందియము గలుగదు. ఇది 1858లో సూరిసమక్షమున ప్రథమ ముద్రణము నందినది. సుమారు నూఱు వత్సరములనుండి బహు ముద్రణము లందుచు, బాలబాలికల పఠన పాఠనాదులలోఁ బ్రధానవ్యాకృతియయి పాదుకొనుటయే దీని ప్రశస్తిని వేయినోళ్ళ వెల్లడింపఁగలదు.

చిన్నయసూరి రచనలలో ముఖ్యముగాఁ బేర్కొ-నఁదగినదియు, నాంధ్ర వాఙ్మయమునఁ జిరస్థాయిగా నుండవలసినదియు నగు మఱియొక మహాగ్రంథము ఆంధ్రనిఘంటువు.

సూరి మన వాఙ్మయమునంతను బరిశోధించి, పదజాలము కూర్చుకొని, ప్రయోగములు సేకరించుకొని, సంపూర్ణమగు నిఘంటువు వ్రాఁతప్రతిని సిద్ధపఱిచెను. అది ముద్రితము కాదయ్యెను. శబ్దరత్నాకరమునకు నదియే యాకరమని జనశ్రుతి. జనశ్రుతి మాత్రమ కాదు. శబ్దరత్నాకర పీఠికయు, ఆయంశమును స్పష్టముగా సూచించుచున్నది.

చిన్నయసూరి స్వహస్తలేఖనముతో ముద్దులు మూటగట్టు ముత్యముల వంటి యక్కరములతో నొప్పారు 7 సంపుటముల యీ వ్రాఁతప్రతి నాంధ్ర

సాహిత్య పరిషత్తువారు సంపాదించి చిరకాలము సంరక్షించి, తమ సూర్య
రాయనిఘంటు నిర్మాణావసరమున వలసిన పట్టుల నుపయోగించుకొనుచుండిరి.
వారి కార్యాలయముల తాఱుమాఱులలో నది యెచటనో యెటులో యంతరించి
నట్లు వినఁబడుచున్నది. నిన్నమొన్నటి చిన్నయసూరి గ్రంథసంచయమును
నయితము, శ్రద్ధతో భద్రపఱచుకొనఁజాలని మన యజాగరూకత మిక్కిలి
శోచనీయము.

ఇవిగాక విశ్వనిఘంటుటీక, నీతిసంగ్రహము, అక్షరగుచ్ఛము, విభక్తి
బోధిని, ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య, హిందూధర్మశాస్త్ర సంగ్రహము మున్నగు
నవి చిన్నయసూరి రచనలుగా మఱికొన్ని వినంబడుచున్నవి. వీనిలో ధర్మ
శాస్త్ర సంగ్రహము ప్రతిని లండను బ్రిటిష్ మ్యూజియము గ్రంథాలయమునుండి
సంపాదించి నిడుదవోలువారు ఈ నడుమనే ప్రకటించియున్నారు.

ఇట్లు చిన్నయసూరి యొకవంక మంచి లాక్షణికుఁడై, వేఱొకవంకఁ
జక్కని కవియైనట్లును దెలియుచున్నది. ఆతఁడు ప్రత్యేకించి రచించిన పద్య
కావ్యమేదియుఁ గానరాకున్నను, కళాశాలోత్సవ సమావేశాది సందర్భములందు
నాతఁడు రచించిన పచ్చయప్పయశోమండనాది పద్యరచనలు చూచినచో
చిన్నయసూరి, కవితాధోరణిలో ఏ ప్రాచీనాంధ్రకవికిని దీసిపోఁడేమో యనిపిం
చును. పద్యకవితా శైలినిబట్టి చూడ నాతనికి (నాచన) సోమన శ్రీనాథుల
రచనలయెడ నభిరుచి యధికమేమో యనియుఁ దోఁచును. మచ్చున కొండు
రెండు పద్యములు :

"గగనంబట్లు రసప్రపూర్ణ విలసత్కుందంబుల న్మెఱి, య
భ్రగసాలంబుగతిన్ సితచ్ఛదములన్ భాసిల్లి, మేరుక్రియన్
జగదామోద సువర్ణభాస్వరముగా జానొందు పచ్చావనీ
శ గుణంబు ల్గణుతించు కోశమిది యిచ్చ న్మెచ్చుగావించెడిన్.

ఆశావధూటికా కేశపాశములకు
మల్లీమతల్లి సంపత్తి నెఱపి
యామినీకామినీ స్వామివక్షమునకు
స్వచ్ఛాంగరాగ విభ్రమ మమర్చి
వారాశిఁ గూరుకు వారిజేక్షణునకు
హీరవర్మ శ్రీ రహింపఁజేసి
యామర సామజాతాన్య బింబమునకు
ముత్యాలమొగముట్టు మురువుసూపి

డంబుదళుకొత్త నెపనియశంబు నిష్ట
పంబునకు రిపణంబు నందంబు మీఱు
నప్పృపాశీలు సుగుణలతాలవాలుఁ
బచ్చపనృపాలు నిలఁబోలువారు గలరె!" మఱియు

"గుణస్య బాధికాం వృద్ధిం కృతవాన్పాణినిః పురా,
అబాధితగుణాం వృద్ధి మకరో త్పచ్చపప్రభుః."

ఈ శ్లోకరచనావిధానము చూచినచో సూరికిఁ గవితలో వ్యాకరణ వినోదమును, వ్యాకరణములోఁ గవితాలాలిత్యమును, పొదిగి పొందుపఱుచు నుల్లాసము, చాతచక్యమును గలదనుట తేటతెల్లమగును.

చిన్నయసూరి, అపారమగు పాండిత్యము, అసాధారణమగు ప్రతిభ, సూక్ష్మగ్రాహియయిన బుద్ధికౌశలము, సౌష్ఠవమయి యాకర్షకమగురూపము, స్వచ్ఛమయి ముచ్చటగొలుపు వేషము, నియమపరిపాలనమును నిబ్బరమయిన దీక్ష, నిర్మలమగు ప్రవర్తనము, మితభాషణ స్వభావము, పరలఘూకరణ వైముఖ్యము, అభిజ్ఞులు మెచ్చుకొను సౌమ్యత, భాషాశాస్త్రములందు విసుగులేని వ్యాసంగము, సరసరచనమందు నిరంతరవ్యసనమును గలవాఁడని ప్రతీతి. అంతియగాదు, భగవద్భక్తి పరాయణుఁడై, విశేషించి వేంకటేశ్వర భక్తుఁడై, హయగ్రీవ మంత్రోపాసకుఁడై, నిత్య దేవతార్చనావిధానమునను, మత సంప్రదాయ ప్రవర్తనమునను, శిష్టుఁడై, యాధ్యాత్మిక జీవితమునఁగూడ నతిపరిశుద్ధుఁడు, అనియుఁబ్రతీతి. ఈ విశేషము లెల్లఁ బయిపయి పరంపరోక్తులే గాక, యాతనిరచనములందును బ్రతిఫలించును. ఆ ప్రతిఫలన ప్రకారములు ప్రకరణాంతరములందు పరికింపఁగలరు.

ఈ విధముగాఁ జిన్నయసూరి విద్యారంగమునందును, ఆధ్యాత్మిక జీవితమునందును పరిపూర్ణుఁడయి, కవితాలాలిత్యముగల లాక్షణికుఁడయి, పండితమండలియందు నగ్రగణ్యుఁడయి సహృదయాకర్షకుఁడయి, సుమారు నలుబది వత్సరములు భాషాసేవయొనర్చి, యసాధారణములగు కృతులను సంతరించి, యాంధ్రులకుఁ జిరస్మరణీయుఁడయినాఁడు. ఆ మహనీయుని ఖ్యాతితో పాటు, రచనలును అజరములు, అమరములును.

వానిలోఁ బ్రధానమును, బ్రకృతమునునగు బాలవ్యాకరణ మవతరించిన మార్గమును ననంతర ప్రకరణమున నాలోకింపఁగలరు.

---

# గ్రంథావతరణము

నన్నయభట్టారకుని కాలము పదునొకండవశతాబ్దినుండియు మన తెనుఁగుగ్రంథములలో నుపయోగింపఁబడుచుండిన భాష, కొన్ని నియమము లకుఁగట్టువడి సంస్కారవంతమయి, సలక్షణమయి వెలయుచున్నది. ఇదియే గ్రాంథికము.

జనవ్యవహారమున నిత్యము నుపయోగింపఁబడుచు వచ్చుచున్న భాష ప్రవాహరూపమయి, యెట్టి కట్టుపాటులకును లోపడక, వేఱువేఱు ప్రాంతము లందు భిన్నభిన్నరూపమయి, అనుదినము ననేకరీతులఁ బరిణామము నందు చున్నది. ఇదే వ్యావహారికము.

అనఁగా, ప్రాచీనకాలమునుండియు గ్రాంథికాంధ్ర మొకతీరుగను, వ్యావహారికాంధ్రము వేఱొకతీరుగను మనభాషలో రెండు శాఖలు చూపట్టుచున్న వన్నమాట.

శతాబ్దులకొలఁది శాశ్వతముగా నుండవలసిన యుత్తమగ్రంథములలో భాషకు ఐకరూప్య మావశ్యకము. ఒకేతీరున సుస్థిరమగు భాష గ్రంథములం దున్నచో, ఏప్రాంతము వారికయినను, ఏ కాలము వారికయినను, పూర్వరచన ములు అల్పపరిశ్రమ మాత్రమున నవగతములగుటకు నవకాశము గలుగును. అట్లుగాక, నిత్యపరిణామ శీలమయి నిలుకడలేని వ్యవహారభాషలో రచితములయి నచో, నట్టి గ్రంథములు తాత్కాలికముగ పెక్కుమందికి మిక్కిలి సుగమము లగుటకు సందియము లేదుగాని, భిన్నప్రాంతములవారికిని, భావికాలమువారికిని దురవగాహములగుట తప్పదు.

తాత్కాలిక ప్రయోజనముగల రచనలలో పెక్కుమందికి నందుపాటుగా నుండుటకయి వ్యవహారభాష నుపయోగించినను, నంతమాత్రాన దోషము సంభవింపదుగాని, పూర్వపూర్వుల యాశయములను, ఆచరణములను, అనుభవములను, ఉత్తరోత్తర కాలికులకును, భిన్నభిన్న ప్రాంతీయులకును బోధింపవలసినవయి చిరస్థాయులుకాఁదగిన యుత్తమగ్రంథములందు మాత్రము సుస్థిరమగు నేకరూపతగల భాషనే యుపయోగించుట మిక్కిలి యావశ్యకము.

ఇంచుమించుగా ఇదే పెక్కుమంది భాషాభిజ్ఞుల నిర్ణయము.

ఇట్టి దృష్టితోడనే నియమబద్ధమయి బహుకవిప్రయుక్తమయి ఏక రూప్యముతో పారంపర్యమున సాగుచున్న గ్రాంథికాంధ్రముయొక్క స్వరూప విశేషములు విశదపఱచుటకును, నిరంతరము ననేకరీతుల పరిణామములతో అవ్యవస్థితమయియున్న వ్యావహారిక పదజాలము గ్రాంథికమునఁ జేరకుండ వారించుటకును, ఉత్తరోత్తర రచయితలకు నాధారముగా నాంధ్రమున లక్షణ గ్రంథము లావిర్భవించినవి.

ఆంధ్రశబ్దచింతామణి, వికృతివివేకము, ఆంధ్రభాషాభూషణము, కావ్యాలంకార చూడామణి, అప్పకవీయము, కవిలోకచింతామణి, కవిజనసంజీవని, కవిశిరోభూషణము, ఆంధ్రకౌముది, సర్వలక్షణసార సంగ్రహము, కవిసంశయ విచ్ఛేదము మున్నగునవన్నియు నిట్టి ప్రయోజనము నుద్దేశించి రచితములయిన లక్షణ గ్రంథములే. ఇవియన్నియు నన్నయాది ప్రాచీనకవుల కృతులయందలి భాషాస్వరూపమును నిరూపించునవే. వీని ననుసరించి కవులు గ్రంథరచనము చేయుచుండుటయు, వారిరచనలలోఁ గాలక్రమమున నూతన ప్రయోగవిశేషములు చేరి ప్రాచుర్యము నందినచో వానినిగూడఁ బరిగ్రహించి యనంతర లాక్షణికులు తమ లక్షణగ్రంథములలోఁ జేర్చుకొనుచుండుటయు, అనుస్యూతముగ సాగుచున్న సంప్రదాయము.

ఎవ్వరెంతగాఁ బరిహరించుచున్నను, గొన్నికొన్ని వ్యావహారిక శబ్దములు ఏ కొంతకాలమునకో శిష్టజనాదరమునంది గ్రాంథికాంధ్రమునఁ దావు గుదుర్చుకొనుచుండుట స్వాభావికము, అనివార్యము.

ప్రాచీనాంధ్రకృతులను, లక్షణగ్రంథములను, నిదానముగాఁ బరిశీలించినచో, ఆదిని నన్నయభట్టారకులు తమభారతభాగమున భద్రపఱిచిన గ్రాంథికాంధ్రమును దరువాతివారు గౌరవాదరములతో ననుసరించి, యా నియమములకు లోపడుచు, కాలానుగుణముగా మార్పులను జేర్పులను జేసికొనుచు, గ్రంథరచనము సాగించుచు వచ్చిరనియు, వానిననుసరించియే లక్షణగ్రంథములు బయలువెడలినవనియు సుస్పష్టముగాఁ దేటపడును.

ఇటు లావిర్భవించిన ప్రాచీనవ్యాకరణములలోఁ జింతామణి, వికృతివివేకాదులు ఛందోబద్ధములయి సంస్కృతభాషలో సంతరింపఁబడిన వగుటచే నయ్యవి పండితైకవేద్యములయి బాలురకు నందుపాటులో లేకపోయినవి. ఇఁక, భూషణ చూడామణ్యాదులు తెనుఁగురచనములైనను, అయ్యవి స్థూల దృష్టి సంకలితములయి, కతిపయ సిద్ధరూప ప్రదర్శన మాత్రప్రవృత్తములయి, ప్రక్రియాక్రమ రహితములయి యుండుటచే బాలకులకు సమగ్రోపకారకములు కాకపోయినవి. అంతియగాక, యించుమించు సూరి నాఁటికి వెలువడియున్న

వ్యాకరణము లన్నిటను తత్సమభాషాస్వరూపమే విపులముగా నిరూపింపఁబడి నదిగాని, యాచ్ఛికపదస్వరూప మంతగా వివరింపఁబడదయ్యెను.

ఇది యిటుండ, మనదేశమున ఆంగ్లేయుల పరిపాలనము ప్రారంభింపఁ బడిన కాలమున ఆంధ్రము నభ్యసించు నాంగ్లేయ రాజకీయోద్యోగుల కనుకూల ముగ, సులభశైలిలోఁ గొన్ని వ్యాకరణములుండుట యావశ్యక మను సంకల్ప మంకురించినది. అప్పట్టునఁ గొందఱు సంకీర్ణముగా గ్రాంథిక వ్యావహారిక పదస్వరూపమును వ్యవహారభాషలో నిరూపించుచుఁ గొన్ని వ్యాకరణములు రచించిరి. ఈ విధముగా నొకకొన్ని నూతనములగు తెలుఁగు వ్యాకరణము లా కాలమున బయలుదేఱినవి. కాని యివి కొలఁదిపాటి భాషాపరిజ్ఞానమును మాత్రము గలిగించునవియుఁ, గేవల వ్యవహారమునకు మాత్రముపకరించు నవియు నగుటయేగాక, చాలవఱకు వ్యావహారిక భాషా నిబద్ధములగుటచే వీని వలనఁ గాలక్రమమున గ్రాంథిక వ్యావహారికములకు సాంకర్యముగూడ నేర్పడుచు వచ్చినది.

ఈ రీతిగా సూరికాలమునకుముందు సిద్ధమయియుండిన ప్రాచీన నవీన వ్యాకరణములలోఁ బలువిధములగు కొఱంతలు ఆతనికిఁ దోడకట్టినవి.

ఆ లోపములఁ దీర్పనెంచి, సూరి, అటు ప్రాచీనపద్ధతిని వ్యాకరణ రచనా మర్యాదలు పర్యాలోచించియు, ఇటు నవీనమార్గమున బోధనసౌకర్య ములు గమనించియు, ఆ యుభయరీతులను మేళవించుచుఁ, బ్రాచీన కవి ప్రయోగముల స్వరూపమును సంక్షేపరీతిని సోదాహరణముగా నిరూపించుచు, పాఠశాలలలోని బాలురకు సౌలభ్యము సమకూర్చుచు వ్యావహారికాంధ్రమును వేఱుసేయుచు, ప్రాచీన నవీనాంధ్ర భాషాప్రవాహద్వయమునకు నడుమ సేతు బంధముగా నంతరించిన లక్షణ గ్రంథమే బాలవ్యాకరణము.

బాలురే భావిరచయితలు గావున వారి భాషను దిద్దితీర్చుట చిన్నయసూరి ప్రధానలక్ష్యము.

కొంతకుఁగొంత భాషాపరిజ్ఞానము గడించి, శాస్త్రీయ విషయగ్రహణ ధారణ పటుత్వము గలవారే సూరి దృష్టిలోని బాలురు.

ఈ బాలవ్యాకరణమును వెలువరించుటకు ముందు, సూరి, దీనికిఁ బూర్వ రూపములుగా మఱినాలుగు వ్యాకరణములు రచించియుండెను.

రచనారీతిని బట్టి వానిలో మొదటిదిగాఁ బేర్కొనఁదగినది పద్యాంధ్ర వ్యాకరణము. దీని రచనాకాలము 1840. ఇది

"శ్రీ మహి ముఖ్య దివ్యమహిషీ నయనోత్పల చారుదీధితి
స్తోమ మనారతం బగుచుఁ జొప్పున బర్వటనాఁగ మేచక
శ్రీ మెయిఁదోఁప నొప్పలరు శేషధరాగ్ర నికేతనుండు భ
క్తామరపాదపోత్తము ముదారఫలప్రతిపాది గాపుతన్.

ఆద్యభాషకు నేఁబది యక్కరములు;
ప్రకృతి కవి పది కొఱవడి పదులు; నిందు
ముప్పదాఱగు నవి; యన్యములును శబ్ద
యోగవశమునఁ బిఱుసొచ్చు నుదధిశయన!"

అను నుపక్రమణముతో, భూషణ చూడామణ్యాదులవలెఁ, బద్యరూపమున రచింపఁబడుచు మొదటి ప్రకరణముననే విరమింపఁబడినది.

సూరి ప్రాచీన లాక్షణిక క్షుణ్ణమగు పద్యమార్గముననే తొలుత నుపక్రమించి, రచన కొంతదూరము సాగిన వెనుక, సూత్రరూపమున సంక్షిప్తముగ నుండఁదగిన వ్యాకరణమునకు నీ ఛందోబంధమేల యని సమాలోచించి, ఆ రచన మంతటితో నిలిపి, సూత్ర రచనము తలపెట్టెను.

ఆ సంకల్ప ముదయింపఁగనే తాను చిరకాలము పరిశ్రమించిన పాణినీయము నాదర్శముగ నెంచుకొని

"అస్తి కల్పద్రుమః కోపి జాతరూప లతావృతః
వేఙ్కటాద్రి శిఖారూఢః స్మరతాం పరమార్థదః
శ్రేయః ప్రమేయ విజ్ఞానమ్
సిద్ధి ర్లోకతః
శాసన మిదం దిక్ప్రదర్శనమ్
సంస్కృత ప్రాకృతే ప్రకృతీ
ఏషా వికృతిః"

అని యీ రీతి నుపక్రమించి, సంస్కృతసూత్రములతో, అష్టాధ్యాయిమార్గమున రచన సాగించెను. ఇది యీతని వ్యాకరణ రచనలలో రెండవది. ఈ గ్రంథము మనకు సంపూర్ణముగ లభింపకుండుట దురదృష్టము.

సూరికి దూరబంధువయి పరోక్షశిష్యుఁడయిన నారాయణవనము వకుళాభరణమనునాతఁడు, ఏప్రతిని బట్టియో లేఖనప్రమాదములతో పునరుక్తులతో గ్రంథపాతములతో నసమగ్రముగా వ్రాసికొనినప్రతి యొక్కటిమాత్రము లభించినది. ఆంధ్ర సాహిత్యపరిషత్తు, ఆ ప్రతి నెటులో సంపాదించి అందదుకులుగా నస్తవ్యస్తముగ నున్నదానిని యథామతి సంస్కరించి, శబ్ద

శాసన పద్యాంధ్ర వ్యాకరణములతోపాటు 1931లోఁ బ్రకటించినది. ఇప్పటికి నిదే మనకు నాధారము. సమగ్రమగుప్రతి లభించునను నాశగూడ సన్నగిల్లినది. ఇందు సంజ్ఞా సంఖ్యాజంత సర్వనామ కారక సమాస తద్ధిత పరిచ్ఛేదములు కాననగును. దీనిరచన మల్పావశిష్టముగా సమాప్తికి సమీపించి యుండునని యూహించుటకు నాధారములు గలవు. దీని రచనాకాలము ఇంచుమించు 1842.

సుమారము రచన సాగినను, సకలవిషయ సంపన్నమయి తనకు సంతృప్తికరముగా నున్నను, సంస్కృతమున రచితమగుటచే నియ్యది బాలురకు సులభము కాకుండుట, అధ్యాపనానుభవముచే నాతనికి నవగతమయినది.

పిమ్మట ఈ సూత్రములను తెనుఁగున ననువదించి శబ్దశాసన మనుపేర నొకగ్రంథము రచియించెను (1844). ఇది మూఁడవది.

"సిద్ధి లోకంబువలన గ్రాహ్యంబు"
"శాసనం బీయది దిక్ప్రదర్శనంబు"
"సంస్కృత ప్రాకృతంబులు ప్రకృతులు"
"ఈయది వికృతి"

మున్నగు సూత్రములతో ఈ గ్రంథము సాగినది.

పిదప నాతఁడు దీనిని బలుమాఱు పరిశీలించి, మెఱుఁగులుపెట్టి, సంజ్ఞా సంధి శబ్ద క్రియా ప్రకీర్ణము లను నయిదు పరిచ్ఛేదములతో 'శబ్దలక్షణసంగ్రహ' మనుపేర 1853లో ముద్రింపించి ప్రకటించి యుండెను. ఇది నాలుగవ రచనము.

అప్పటికిఁ బదుమూఁడేండ్లకాలము అంతగాఁ బరిశ్రమించి, అన్ని విధములగు మార్పులతో రచన సాగించినను, తన వ్యాకరణము బాలురకు సులభమయి యత్యంతోపయుక్తము కావలయునన్న ప్రధానలక్ష్యము సంపూర్ణ సిద్ధి నందినట్లు సంతృప్తి యాతనికిఁ గలుగదయ్యెను.

ఏలయన, ఈ తుట్టతుది శబ్దలక్షణసంగ్రహమున సంస్కృతము తెలుఁగుగా మాఱినదేగాని, అష్టాధ్యాయిఫక్కికనే యనుసరించుటలో ఈ సూత్రములందు నొక క్లేశము సంభవించినది. ఎట్టిదన :

కేవల సంక్షేప సౌకర్యమునకయి యవలంబింపఁబడిన యీ యష్టాధ్యాయి పద్ధతిలో, ఏ సూత్రమును నర్థావబోధమున స్వయంసంపూర్ణము కాక పోయెను. ఎట్లన :

'డాకు లకారంబగు' — (ఎట్టి డా కో యెఱుఁగరాదు.)
'క గ చ త ప మ వ' లు — (ఏమగునో తెలియదు.)
'న కారంబునకు' — (ఏది వచ్చునో యెఱుకపడదు.)
'నీ మీ లకుం గాదు' — (ఏది కాదో విశదపడదు.)

ఈ రీతిగా సూత్రముల యర్థము సుబోధము కాకుండెను. ఇంచుమించు ప్రతి సూత్రమునను బూర్వోత్తర సూత్రములనుండి కొన్నిపదములను ఎరవు తెచ్చుకొని, కలిపి, సమన్వయించుకొన్నఁగాని, సూత్రార్థము తేటపడదు. అట్టి సూత్రము లయినను బ్రక్రియా క్రమమునకు ననువుగా నొకేచోట లభించు నవకాశమును గుదురుపడదు. నిజమునకు నిది మిక్కిలి క్లిష్టమార్గము. అది ఆ యష్టాధ్యాయికే చెల్లినది.

ఈ క్లేశమును బర్యాలోచించి, సూరి, పూర్వపద్ధతి మార్చుకొని, నూతన ప్రణాళిక నూహించి, తన పూర్వ రచనములందలి విధులలో అసార్వత్రిక ములు, అనతి ప్రధానములు నని తోఁచినవాని నుపేక్షించి, బాలురకు నిరంత రోపాదేయములయి యత్యంతావశ్యకములగు విషయములను మాత్రము సేక రించి, వర్గీకరించి, ప్రకరణవిభాగము గావించి ప్రక్రియాక్రమము నేర్పఱిచి, సూత్రాంతరస్థ పదాపేక్షా రహితముగా స్వయంసుబోధములయి స్వతంత్రము లగునట్లు సూత్రములు సంతరించి, వివరణోదాహరణములతోఁ దన పరిశ్రమ కంతకును సారభూతముగా పరిణామ రమణీయమయిన బాలవ్యాకరణము నావిష్కరించినాఁడు. ఇది 1858లో సూరి పర్యవేక్షణమునఁ బ్రథమ ముద్రణము నందినది.

పయిని నిర్దేశించిన పద్యాంధ్రవ్యాకరణము, సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము, శబ్దశాసనము, శబ్దలక్షణసంగ్రహమ్ము, బాలవ్యాకరణము అను వీని యన్నిటిరచనారీతిని, క్రమపరిణామమును, సావధానముగఁ బరిశీలించినచో, చిన్నయసూరి, యాంధ్రవ్యాకరణ రచనకయి సుమారు పదునెనిమిదేండ్లు, ఎన్నెన్ని ప్రస్థానములతో, ఎంతగాఁ బరిశ్రమించెనో తేటతెల్లము కాఁగలదు.

ఈ సందర్భమున, అంతగా అప్రకృతము కానిది ఒక్కమాట.

ఆ వకుళాభరణము పద్యాంధ్రవ్యాకరణమును, శబ్దశాసనమును, సూత్రాంధ్ర వ్యాకరణమును దనకు లభించినంతవఱకు నేదో యొకతీరున వ్రాసి కొని భద్రపఱుచుట మహోపకారకమయినది. అది చిత్తుప్రతి యయినను, దాని నెటులో ప్రయాసపడి సంపాదించి, పరిషత్తు ప్రకటింపకున్నచో సూరిలక్షణ పరిశ్రమ వృత్తాంతము లోకమునకు రేఖామాత్రమయినఁ దెలియక మఱుఁగు వడి మాసిపోయెడిది.

తన వ్రాఁతప్రతిమూలమునఁ దన భావనాగురువు పరిశ్రమమును వెలుఁగు నకుఁ దెచ్చి కృతార్థుఁడయిన యీ వకులాభరణ మెవ్వరోగాని, లక్షణ ప్రియులగు నెల్లవారి శాశ్వత కృతజ్ఞతకుఁ బాత్రుఁడయినాఁడు.

ఈ విషయమునఁ బరిషత్తు చూపిన శ్రద్ధాసక్తులును మిక్కిలి యభినంద్యము లయినవి. అవి యటుండనిండు.

సూరి భారతాదుల ప్రయోగములు పలుమాఱు పరిశీలించి, ప్రాచీన లక్షణ గ్రంథరీతులు పలుదెఱఁగులఁ బరిశోధించి, యనేకవిధములగు రచనా ప్రక్రియల నేర్పఱచుకొని, యెంతకును తృప్తిచెందని మార్పులతో సోపానక్రమమున రచించిన వివిధ వ్యాకరణ గ్రంథ సముద్రమునుండి సర్వాంగసుందరమును, సకలవిషయ సారసంభరితమయి యావిర్భవించిన అమృతకలశమే బాల వ్యాకరణము.

సంస్కృత వ్యాకరణ గ్రంథములలో వైయాకరణసిద్ధాంతకౌముది యెట్టిదో, తెలుఁగువ్యాకరణములలో బాలవ్యాకరణ మట్టిది.

ఇట్టి యీ క్షీరకలశమును చేతికందించుచు, అధ్యాపకమండలికి సూరి గావించిన విజ్ఞాపనము నాలకింపుఁడు :

'మానితపు నడక పేరిమి
మానసమున కింపుఁ బెంప మను నంచలకున్
బోనిడి నీరస నీరము
జానుగ క్షీరంబు గొనుట సహజము కాదే !'

అని తన హృదయాభిలాషమునకును, ఆత్మవిశ్వాసమునకును, వ్యంజకముగా సుప్రసిద్ధమయిన యప్రకృతాంశము నొకదానిని స్ఫురణకుఁదెచ్చి, అంతతో నూరకున్నాఁడు.

ప్రసన్నమయిన యీ విన్నపమునందలి వినయగరిమ యెట్టిదో, యిందు గర్భితమయియున్న గాంభీర్య మెంతటిదో, యీ ప్రతిపాదనరీతిలోని చిత్త సమున్నతి ఏ యెత్తున నున్నదో గమనింపుఁడు.

సూత్రములపటుత్వము, లక్ష్యలక్షణ సమన్వయము, ప్రక్రియాక్రమ ప్రదర్శనము, భాషావైశద్యము, శైలీసౌకుమార్యము, సంక్షిప్తకథనము మున్నగు ననేకములయిన వ్యాకరణ గుణవిశేషములు గలదగుటచే ఈ గ్రంథ మావిర్భవించిన యచిరకాలముననే బాలకులు మొదలు పండితులవఱకు భాషా లక్షణ జిజ్ఞాసువుల దృష్టి నాకర్షించి తెలుఁగువ్యాకరణములలో నుత్తమస్థానము నందుకొని, యాంధ్రదేశ మంతటను బఠనపాఠనాదులలో నవిచ్ఛిన్నముగా

బహుతరప్రచారము నొందుచున్నది. ఇప్పటికే లెక్కలేనన్ని ముద్రణముల కెక్కినది. దేనికయినను, ఉత్కర్షనిర్ణయమునకు ప్రచారబాహుళ్యమే ప్రబల మగు నాధారము కాఁగలదు.

ఇట్టి బాలవ్యాకరణము బయలువడుటకు సూరియొనర్చిన పరిశ్రమను గూర్చి యీ ప్రకరణమున వివరింపఁబడిన యంశములు బాలవ్యాకరణ ప్రారంభ పరిసమాప్తులందు సూరి యుగ్గడించిన వాక్యములందే బీజప్రాయ ములుగా నిక్షిప్తములయి యున్నవి. ఆ వాక్యములు పరికింపుఁడు :

"ఆంధ్రభాషకు లక్షణగ్రంథములు ప్రాచీనులు చేసినవి పెక్కులు కానఁ బడుచున్నవి. కొన్ని లక్షణగ్రంథముల పేళ్లుమాత్ర మిప్పుడు వినఁబడుచున్నవి. కానఁబడు గ్రంథములందు సంస్కృతసమములకు లక్షణములు బహుతర ముగా రచింపఁబడినవిగాని, తక్కిన భాషకు విశేషాకారముగా రచింపఁబడినవి కావు. కాఁబట్టి యా లక్షణగ్రంథములు చదువువారికి నిస్సందేహముగా వచన రచనసేయు కౌశలము చిరకాలము బహులక్ష్యములందుఁ బరిశ్రమ చేయక రానేరదు. భాషాసమష్టికి లక్షణగ్రంథము కుదిరినపక్షమం దంత శ్రమపడఁ బనిలేదు. తుదకు లక్ష్యపరిజ్ఞానము చాలని లక్షణ పరిజ్ఞాన మంత శ్లాఘ్యము కాదుగాని, తుదముట్ట సర్వలక్షణపరిజ్ఞానము లక్ష్య పరిజ్ఞానముచేతనే సాధించుట మిక్కిలి దుష్కరము. కాఁబట్టి యిట్టి కొఱఁత వారింపఁబూని పెక్కులక్ష్యములు పలుమాఱు సావధానముగాఁ బరిశీలించి రచనాప్రణాళిక నిర్ణ యించుకొని నా నేర్పు కొలఁదిని సంస్కృతభాషలో సూత్ర గ్రంథ మొకటి రావించితిని. ఆ గ్రంథము బాలురకు సుసాధము గాకుండుటవలన దానియందలి సూత్రములు కొన్ని తెనిఁగించి ప్రకృత గ్రంథ రూపముగా రచించినాఁడ."

—బాలవ్యాకరణ పీఠిక.

"మును మదుపజ్ఞంబగుచుం
దనరిన వ్యాకృతిని సూత్రతతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధమగు భంగిఁదగన్.

"తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్కనందిన వారల్
తనరఁగ నీ వ్యాకరణం
బున మూలం బయిన కృతిని బోలఁ గనఁదగున్."

—గ్రంథాంత పద్యములు.

అను నీ వాక్యములయందు బాలవ్యాకరణ రచనమునకయి సాగిన ప్రయత్న మంతయు సూచితమగుట చదువరులు గ్రహింపఁగలరు.

ఇఁక సూరి తనపీఠికలో నిర్దేశించిన ప్రయోగపరిశీలన మెట్టిదో, ప్రబంధ కవులయెడ నాతని ప్రామాణ్యదృష్టి యెట్టిదో, శబ్దసాధుత్వ నిర్ణయమున నాతని దృక్పథ మెట్టిదో, అనంతర ప్రకరణమున నాలోకింతము.

---

# ప్రయోగ పరిశీలనము

ఏ భాషయందయినను వ్యాకరణమునకు ప్రధానాధారములు కవిప్రయోగములు. భాషా సమష్టిస్వరూపమును సుకరముగా బోధించు కుతూహలముగల లక్షణపరిశీలకులు వాఙ్మయపరిశోధనము గావించి, యా భాషాలక్షణములనెల్ల గుర్తించి, సంగ్రహణరీతికి ననువుగా అనుగమములు కల్పించుకొని, సూత్రప్రాయముగా నాయా లక్షణములు బోధింతురు. తాము కల్పించిన లక్షణములకు నాధారములగు కవిప్రయోగములను వారు చూపినఁ జూపవచ్చుఁగాని, చూపి తీరవలయునను నిర్బంధముండుట యంతగా సముచితము కాదు. సమన్వయ సౌలభ్యమునకయి ఆ యా లక్షణములకు నుచితములగు నుదాహరణములు చూపినం జాలును.

వాఙ్మయమునఁగల భాషాలక్షణములను భద్రముగా గుర్తించి, అనవధానాదులచేఁ దాఱుమాఱు కానీక, ఉన్నవున్నటులు సూత్రించి, ప్రామాణికతను గడించుకొనుట లాక్షణికుల ధర్మము.

మన సౌకర్యమునకయి కడుంగడు పరిశ్రమించి రచించిన యా లక్షణములను శిరసావహించి, వానికి నాధారములు చూప నిరోధింపక, వానియెడ ప్రామాణ్యబుద్ధినిడి, లాక్షణికుల ప్రామాణికతను నిలఁబెట్టుట పాఠకుల ధర్మము.

ప్రయోగములకు విరుద్ధమగు లక్షణములు కల్పించుట జిజ్ఞాసువగు లోకమును మోసగించుట. ప్రయోగము చూపుమని నిర్బంధించుట లాక్షణికుని లఘూకరించుట.

లక్షణ కర్తలును, లక్షణ జిజ్ఞాసువులును బయిని జెప్పిన రీతిని నుండ వలసిన పరిధులలో నుండుటకును జిక్కులనేకములు లేకపోలేదు.

కవులు భిన్నభిన్న ప్రాంతీయులుగను, భిన్నకాలికులుగను, భిన్నాభిప్రాయులుగను, భిన్నాభిరుచులుగను నుండక తప్పదు గాన, వారి భిన్నభిన్న రీతులుగల ప్రయోగముల లక్షణమును ఇదమిత్థమని ఏకరూపముగా నిర్ణయించుట సుకరమయిన పనికాదు. అక్కారణమున లాక్షణికులలో మతభేదములు జనింపక తప్పదు. అట్టి సందర్భములందు నెవరిమతము పరిగ్రాహ్యమో, యెవరిది పరిత్యాజ్యమో, వివేచించుకొనుటకయి, చదువరులకు కవిప్రయోగ స్వరూపజిజ్ఞాస ఉదయింపకను మానదు.

సువిశాలములగు భాషలలో వివిధములగు రూపములను వర్గీకరించి, యనుగమములు కల్పించి, యెంత భద్రముగా సూత్రించినను, వానిలో అవ్యాప్తులో, అతివ్యాప్తులో సంభవించుటయుఁ దప్పదు.

దివ్యదర్శనులయిన పాణిన్యాది మహర్షులు రచించిన వ్యాకరణములందే కొన్ని కొఱఁతలు గానవచ్చుటయు, ననంతరకాలికు లాలోపములు పూరించు కొనుచుండుటయు ననివార్యమయినది. ఇఁక సామాన్యులమాట చెప్పనేల!

సంస్కృతవ్యాకరణ ప్రణేతలెవ్వరును దాము నిరూపించిన లక్షణములకుఁ బ్రమాణములుగా, కవిప్రయోగములు ప్రదర్శించినవారు కానరారు. అట్లు ప్రయోగములు చూపకుండుటను సంస్కృత వ్యాకరణాధ్యేత లెల్లరును గుణముగాను, ఘనతగాను భావింతురుగాని లోపముగాఁ దలంచినవారును గానరారు. ఒక దృష్టిని బర్యాలోచించినచో నట్లు ప్రయోగములను బ్రమాణములుగఁ జూపకుండుటలోనే ఘనతగలదు.

లోకుల సౌకర్యమునకయి వాఙ్మయపరిశీలనమే పరమపురుషార్థముగా పెక్కుకాలము పరిశ్రమించి, భాషాలక్షణములు క్రోడీకరించి, సంగ్రహరూపమున సమకూర్చి, యాదర భావముతో మనకు నందించిన యా మహామహులను 'మీ లక్షణములకుఁ బ్రమాణములు ప్రదర్శింపుఁ'డనికోరుట వారి ప్రామాణికతను శంకించుట, వారి గురుత్వమును లఘూకరించుట.

ఇఁక లక్షణగ్రంథకర్తలు తమ లక్షణములకుఁ బ్రమాణములుగ కవి ప్రయోగములను దామే చూపఁబూనుటలో తమయెడఁ దగినంత ప్రామాణ్యమును, విశ్వాసమును, లోకమున కుండునో లేదోయని తామే శంకించుకొను తీరుగూడ కొంతకుఁగొంత గోచరించును.

లక్ష్యపరిశోధనమున భ్రమప్రమాదములఁ జేరనీని జాగరూకతయు, లక్షణ నిర్మాణమునఁ దాఱుమాఱులేని యథారూప నిరూపణ దృష్టియుఁ దమలో నున్నటులు ధైర్యమును ఆత్మవిశ్వాసమును గల లాక్షణికులు సాధారణముగా కవిప్రయోగములు ప్రదర్శింపరు. ప్రదర్శింప నక్కఱయు లేదు.

అట్టివారే యయినను గొందఱు ప్రదర్శించుటయుఁగలదు. అట్లు కవి ప్రయోగములు చూపుట గుణమనిగాని, చూపమి లోపమనిగాని యెంతమాత్రమును దలంపరాదు.

ప్రయోగములు చూపని వ్యాకరణములు ప్రభుసమ్మితములు. చూపిన వ్యాకరణములు మిత్రసమ్మితములు. అది బోధన మార్గమందలి దృష్టిభేదము గాని లక్ష్యమొక్కటే. ఉభయమార్గములును నుపాదేయములే.

చిన్నయసూరి సంస్కృతవ్యాకర్తల సరణియందు గౌరవాదరములు కలవాఁడు గాన వారివలెనే తానును దన సూత్రవిధులకుఁ బ్రమాణములుగాఁ దాను సేకరించిన కవిప్రయోగములను ఎక్కడికక్కడఁ జూపఁదలంపఁడయ్యెను. అట్లని అసలే చూపకపోను లేదు. సాధారణ విధులయెడ్డఁగాక విశేషములని తోఁచిన తావులందుఁ గొలఁది ప్రయోగములు ప్రదర్శించియు నున్నాఁడు.

సూరి పరిశ్రమను, ప్రయోగసంగ్రహమును, ప్రయోగప్రామాణ్యమును, తత్ప్రదర్శనవిధానమును, శబ్దసాధుతానిర్ణయ దృక్పథమును, సూక్ష్మముగ నిదానించు చూపుపెట్టు నోపిక చాలక, స్థూలముగ నాలోకించువారు కొంద ఱుందురు. అట్టివారు చిన్నయసూరికి భారతకవులే ప్రామాణికులనియు, ప్రబంధకవులయెడ నాతనికి ప్రామాణ్యము లేదనియు, ప్రబంధప్రణేతలగు మహాకవుల ప్రయోగముల నీతఁడు నిరాకరించుననియు, నితనిది ముక్కాలి సంకుచిత భావమనియు ఏమేమో యనుచుందురు.

అట్టి యభిప్రాయములు అపరిశీలనమూలకములు, అనవబోధకల్పితములు గాని, వాస్తవికములు గావు.

సూరి, తనముక్కునకుం జక్కని మీఁదిచే యాకాశం బనువాఁడు కాఁడు. తన గొందియ లోకం బనుకొన్నవాఁడును గాఁడు. మఱి —

విశాల హృదయుఁడు, వివేచన దక్షుఁడు, భాషాకోవిదులలో ప్రవీణుఁడు, పరిశోధకులలో నగ్రగణ్యుఁడు, లోకజ్ఞులలో ధురీణుఁడు, నాగరకులలో విచక్షణుఁడు. బాలవ్యాకరణమున లక్షణవిశేషములు నిరూపించు పట్టులందు ప్రబంధములనుగూడఁ బ్రమాణములుగా నెన్నిటిని బరిగ్రహించినాఁడో పఠికింపుఁడు :

(1) నిర్వచ నోత్తర రామాయణము; (2) ఉత్తర హరివంశము;
(3) భీమ ఖండము ; (4) భాగవతము ; (5) మనుచరిత్రము ;
(6) ఆముక్తమాల్యద; (7) రామాభ్యుదయము; (8) కళాపూర్ణోదయము

మున్నగు ప్రబంధములలోని కేవల పదములేగాక పద్యభాగములకు భాగములే యాతఁడెత్తి చూపినవి బాలవ్యాకరణమునఁ గలవు.

పద్యభాగములు ప్రమాణములుగఁ జూపుటయగాని, అవి యే ప్రబంధము లందలివో, యే తావులందుఁ గానవచ్చునో, ఆ వివరములు (reference) నిర్దేశించు దృష్టి యాతని కెచ్చటను లేదు. అట్లు స్పష్టముగాఁ బేర్కొనకుండుటం బట్టి యవి ప్రబంధగతములని పెక్కుమంది గుర్తింపరు. పద్యభాగములని యైన గుర్తింపనివారును కొందఱుందురు. ఈపాటి శ్రద్ధాసక్తులు చూపఁజాలని వారు సూత్రకారులను నోల్లింతనముగా తూలనాడుటకు సిద్ధపడుదురు. ఏమను కొనుట !

ఆ ప్రయోగములు తిలకింపుఁడు :

1. కారక-34 "గర్వగరిష్ఠుండగుసస్న నిప్రైసకుఁ దేరంజాలుటన్ వానపీ" —నిర్వచనో—7-91

2. సంధి-48 "సమ్మకిటు పీఁద నేను బ్రాణానఁగలిమి"—ఉ.హరి—5-92.

3. కారక-20 "భిక్ష గొనరమ్మ మాటలుపెక్కు లేల"—భీమఖండ—2-118

4. కారక-15 "నాకుందమ్ముఁడుమీకునెచ్చెలి రణన్యాయైక దక్షుండు" —భాగవత—7-30

5. సంధి-30 "ఏకాంతముసందునుస్న జవరాంద్ర నెపంబిడి పల్కరించులాఁ గింతియగాక". —మనుచ—2-41

6. సంధి-54 "దుర్బలస్య బలంరాజా యనవినవే ధరణీ। నాయకులకు నార్తరక్షణంబులె క్రతువుల్" —మనుచ—4-74

7. సంధి-4 "చెడనికడంక దంచెనపుఁజేతుల గంగనుకాసె మాఱఁగా" —ఆముక్త—2-9

8. క్రియ-119 "పేరు ఋష్యశృంగుఁడంట పిల్వఁబంపు పంపఁగా ఆఋషీశ్వరుండువచ్చెనా ఫలించుఁగార్యముల్" —రామాభ్యు—2-75

9. సంధి-51 "ఆ యుత్తము। శ్లోకుం బోలిచినన్ గతానుగతికో లోకోయటంచుండుటల్".— కళాపూ-7-107

10. కారక-34 "మీరలుపెద్దలు త్రైలో। క్యారాధ్యుల లేమియన్న నంటిరిగాక" —కళాపూ—1-57

ఎన్ని ప్రయోగములు ప్రబంధములనుండి గైకొనఁబడినవో చూడుఁడు.

ఇట్లు బాలవ్యాకరణముననేగాక దీనికి ముందటి సూత్రాంధ్ర వ్యాకరణము నఁగూడ సూరి చూపిన భారతేతరప్రయోగము లెన్నియో గానవచ్చును. చూడుఁడు.

1. దనుజాల యావుల వరుణుఁడు
దప దిక్కున నునిచినాఁడు తత్కార్యముకై
మనకుం బోవలె నిద్దెస
కనఘా, చనఁదీరునేని యరుగు మచటికిన్.

2. కృశమధ్య ల్పదివేవు రంగనలతోఁ గ్రీడింప.

3. అలరుచు జాతివైరాదులు లేక । మెలఁగు నానావిధ మృగ సమూహముల. —ఇతి రఙ్గనాథః—బాలకాణ్డే.

4. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి ........
....ముడికొక్క భంగిగా నెత్తులు వట్టియిచ్చు. —నిర్వచనో-8-22

5. వచ్చినవిన్నపంబుల నవారణమై విని నిశ్చయంబుగా. —నిర్వచనో-8-12

6. ఇ । ప్పుడమికి నిన్ను శాశ్వత విభుండుగఁ గోరెద రెల్ల వారలున్. —నిర్వచనో-8-15

7. పంద్రెండేఁడులు నీ గతిం జనఁగ. —ఉ.హరి—2-167

8. కలికి జక్కవచంటి యా కలువకంటి. —ఘటికాచల....

ఇట్లు సూత్రాంధ్ర వ్యాకరణమునవే గాక యాతని శబ్దశాసనమునఁగూడ

1. సతియుఁ దాను వెలుఁగు శతమఖుండును బోలె.

2. సులభమయ్యె నీ కిహపర శోభనములు.

3. పురమునక కాదు నాదగు । సిరి.

4. కోలలఁ బరఁగింపంగాఁ గేలుంగవ వడిగలట్టి కృతహస్తుండై । క్రాలుకతంబున జిష్ణుఁడు పోలుం గవ్వడి యనంగ భుజగశయానా.

అను కవి ప్రయోగములు గానంబడుచున్నవి.

ఈ రీతిగా భారతేతరప్రయోగముల నెన్నిటినో ప్రమాణములుగా ఎత్తి చూపుచుండ, నీతఁడు ప్రాబంధిక ప్రయోగముల నాదరింపఁడని, సంకుచిత హృదయుఁడని, అసత్య ప్రవాదములు కల్పించుట సమంజసము కాదు.

మఱిమఱి పరికింప, శబ్ద సాధుతా నిర్ణయమున ప్రయోగము భారతము నందలిదా ? ప్రబంధములలోనిదా ? ఏ కవిది ? ఏ గ్రంథములోనిది ? ఏ శతాబ్ది లోనిది? అనికాదు సూరిదృక్పథము. ఏ శబ్దము, ఏ రూపముతో, ఎంతమంది కవులకు రుచించినది? దేశము మొత్తమున దేనికి ప్రచారమధికము ? దేనికి విరళము? దేని శ్రావ్యత యెట్టిది? అని యీ తీరు వివేచన మాతని చూపులో నధికముగా నున్నటులు గోచరించును. ఒక్క యంశము వివేచింపుఁడు.

పోతనామాత్యుని భక్త్యావేశమునకును, దివ్యానుభూతికిని, కవితా సారళ్యమునకును, రచనారమ్యతకును, చేతులెత్తి మ్రొక్కనివారు లేరు. లక్షణప్రామాణ్య ప్రసంగములందు భాగవతమునుగూర్చి సాధారణముగా పెదవి విఱువనివారును గానంబడరు.

పోతరాజులాక్షణికతను సమర్థింపఁబూనినవారు తిమ్మకవిప్రభృతులు పూర్వులు కొలఁదిమంది కలరుగాని, మొత్తముమీఁద విషయప్రాశస్త్యమును బట్టియు, కవితాసారళ్యమునుబట్టియు, భాగవతమునకు లోకమున నేర్పడిన యసాధారణ గౌరవాదరములు లక్షణ ప్రసంగములందుఁ గొంత కొఱవడిన మాట యథార్థము. ఏ కొఱఁతయు లేకున్నచోఁ బ్రాచీన లాక్షణిక సమాజముననే ఔనని కొందఱు, కాదని కొందఱు చర్చలు సాగించుటయే సంభవింప కుండెడిది. ఏది యెటు కానిండు. భాగవతకవితలో లక్షణదృష్టి తక్కువ యను నభిప్రాయముమాత్రము లోకమున నాటుకొన్నది.

చిన్నయసూరి సంబంధార్థమున 'యొక్క' షష్ఠియేగాక 'కు' వర్ణ కంబును గలుగునను లక్షణమునకు (కారక-15)

"నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి"

అని భాగవత పద్యభాగమును బ్రమాణముగాఁ జూపియున్నాఁడు. పోతరాజు ప్రయోగము. మఱేదియోగాక, యాదృచ్ఛికముగాఁ జక్కని పద్యభాగమే యమరినది. హరిభక్తితత్పరత్వమునందుఁగాఁబోలు చిన్నయసూరి తనకు తమ్ముఁడఁట: లక్షణప్రసంగములందుఁ గాఁబోలు మనకు నెచ్చెలియఁట. 'నాకుం దమ్ముఁడు, మీకు నెచ్చెలి'.

చక్కని మాట. పోతనగారి మాటలు మాటలుగావు. ముద్దుల మూటలు. నిజమునకు బాలవ్యాకరణమున సూరి భక్తాగ్రేసరుఁడుగనే గానంబడును.

పయి భాగవత ప్రయోగముమీఁది దృష్టి చెదరనీక, అటులే యుంచి, మఱొకవంక పరికింపుఁడు.

"ఇచ్చునకు సర్వంబున కీయగు". —క్రియా-92.

ఈ సూత్రముచే ఇచ్చు ధాతువునకు "ఈ" అను నాదేశము విహితమయినది.

ఇమ్ము, ఇండు, ఈఁడు, ఈని మున్నగునవి యీ సూత్రము సాధించు రూపములు.

భారతమున "ఈయని" అని ప్రయోగము గలదు. దానిని సాధించు సూత్రము బాలవ్యాకరణమునఁ గానరాదు.

పయి సూత్రమున వివరణములో "ఈయ" యను నాదేశంబును నొకానొకచోఁ గానంబడియెడి.

"బలిమి నీయని భూమి వలయ పతుల"

అని మాత్రము పరామర్శించి, సూరి యంతటితో సుదాసీనత వహించినాఁడు.

ఇది భారత ప్రయోగమాయె. అందును నన్నయభట్టారకులది. భట్టారకు లయినను, గ్రంథమధ్యమున ఏ యనవధాన సందర్భముననో ప్రయోగించినది కాదు. భారత రచనకు నుపక్రమించిన ప్రప్రథమదివసమున, పట్టుగా రచించిన మొట్టమొదటి పద్యములు పదింటిలోనిది. ఇంతకంటెఁ బవిత్రము, పరిగ్రాహ్యమునయిన శబ్దము మఱేది యుండును? అయినను సరే.

భట్టారక ప్రయోగము శిరోధార్య మనుటకు సందియములేదు గాని, వారయినను ఈ యొక్కచోటఁ దక్క తిరిగి యెచ్చటను ప్రయోగింపరయిరే! సముద్రమంత భారతము మొత్తమున ఏ పర్వమునందును ఒక్కచోట నయిన మఱి కానరాదాయెనే! ప్రాచీన ప్రబంధములలో నయితము మిక్కిలి యరుదాయెనే! ఇట్లు విరళాతివిరళమగు ఈ శబ్దమున కొక్కదానికై ఒక సూత్రము రచించుట యీ బాలవ్యాకరణమున లక్షణ నిరూపణ విధానమున నిర్ణయించుకొన్న మన ప్రధాన దృక్పథమునకు విరుద్ధమగునే!

అను నీ చూపులతోఁ బ్రయోగమును మాత్రము ప్రదర్శించి, ఔఁగా దనక అట్టె యూరకున్నాఁడు.

పోతనప్రయోగమును బ్రమాణముగా ప్రదర్శించుట, నన్నయార్యుని ప్రయోగమును సాధించుటకు వెనుదీయుట ఈ రెండిటిని మేళవించి యాలోచించినచో, ప్రయోగము ఏ కవిది అను నంశముగాక, దేనికి ప్రసిద్ధ కవులలో ప్రాచుర్య మధికము? అను చూపాతనిలో హెచ్చుగా నున్నటులు గోచరింపక తప్పదు. దూరము యోచింపుఁడు.

ఇఁక, శబ్దసాధుతా నిరూపణమున సూరిహృదయము సంకుచితమా? విశాలమా? అను విషయము, పరిశీలింపవలసిన వానిలో నొకటి.

ఈ యంశము తేల్చుకొనుటకు నొక్క బాలవ్యాకరణము చాలదు. దీనికిఁ బూర్వ రూపములుగా నీతఁడు రచించియుంచిన యితరవ్యాకరణములు గూడఁ బరిశీలించినంగాని యాతని హృదయము సాంతముగ గోచరింపదు.

తన మొదటి వ్యాకరణము లందలి విషయములు పెక్కిటిని విడిచి పుచ్చియుఁ, గొన్నిటిని మార్చుకొనియు, సార్వత్రికములయి సకలసమ్మతములగు

లక్షణములు మాత్రము గైకొని, సంగ్రహరూపమున బాలవ్యాకరణము రచించినాఁడు. ఇది మనయూహ కాదు. ఈ యంశము లన్నిటిని 'మును మదుపజ్ఞంబగుచున్' ఇత్యాది గ్రంథాంతపద్యములందు నాతఁడే స్పష్టముగా సూచించియు నున్నాఁడు. ఆ పద్యములు పూర్వ ప్రకరణమునఁ బ్రదర్శింపఁబడి యున్నవి.

కావున బాలవ్యాకరణమును మాత్రమే పరికించి సూరిహృదయము నిర్ణయింపఁ బూనినచో వాస్తవము తేటపడదు.

బాల ప్రౌఢ వ్యాకరణముల ప్రక్రియలను, ఉపస్థితియం దుంచుకొన్నవారు సూత్రాంధ్రవ్యాకరణ శబ్దశాసనాదులందలి విశేషములుగూడఁ బరిశీలించినచో, సూరి, కవి ప్రయోగములు పరిగ్రహించుపట్ల, ఇంతటి విశాలహృదయుఁడా యని యబ్బురపాటుఁ జెందక మానరు.

బాలవ్యాకరణమున సాధింపఁబడని ప్రయోగవిశేషములు కొన్నిటిని ప్రౌఢవ్యాకరణమునఁ గాంచి, కవిప్రయుక్తములయిన యా విశేషములను సూరి సమ్మతించినవాఁడు కాఁడనియు, ఆతని దృక్పథము మిక్కిలి సంకుచిత మనియు పెక్కుమంది యనుచుందురు. శివశివా! అదంతయు వట్టి యపోహము, అన్యాయము. ఆ విశేషములు పెక్కిటిని సూరి తన మొదటిరచనములందు నిరూపించియే యుండెను. నిరూపించియు, అందు మిక్కిలి విరళములని తోఁచిన విశేషముల నుపేక్షించి, యెల్లరకు నిత్యమును నత్యంతావశ్యకములని తోఁచినవానిని మాత్రమే గైకొని బాల వ్యాకరణము రచించెను. అట్లు విడిచి యుంచిన యా విశేషములను సంగ్రహించుకొని, వానినిబట్టియే ప్రౌఢ వ్యాకరణము రచింపఁబడి యుండును. ఆ పిమ్మట నెన్నో యేండ్లకు వెదకి వెదకి సంపాదించి సూరిమొదటిరచనములను పరిషత్తువారు ప్రకటించినారు. వీరి కయినను సమగ్రములగు ప్రతులు లభింపలేదు. చిన్నయసూరి చిత్తుప్రతులను బట్టి యెవరో వ్రాసికొన్న యసమగ్ర భాగములు మాత్రమే లభించినవి. వీనిలోఁ గాననగు నాలుగు జాతుల విశేషములు మచ్చునకయి కొలఁదిఁగా నీ దిగువఁ జూపఁబడును. వీని నుపలక్షించినచో శబ్దసాధుత్వమును సమ్మతించుపట్ల సూరిహృదయము సంకుచితమో వ్యాకుచితమో తమంత దాము నిర్ణయించు కొనఁగలరు.

1. కొన్ని సుబంత శబ్దముల ప్రసంగము గమనింపుఁడు.

i. కమలదళాక్షిరో, తల్లికాన. —ప్రౌఢ-శబ్ద-25.

ii. ధర్మువు, అర్థువు, వర్గువు — వర్గు. —ప్రౌఢ-శబ్ద-14-15.

iii. ఆళ్ళు, చోళ్ళు, వడ్లు, కందులు
(నిత్య బహుత్వము) —ప్రౌఢ-శబ్ద-39-40.

iv. అయ్యగారు, అయ్యగారిన్. —ప్రౌఢ-శబ్ద-37.

ఇవన్నియు త్రిలింగలక్షణశేషమున ప్రదర్శింపఁబడినవి. ఇవి చూచినవారు సూరి వీనిని సమ్మతింపక సాధింపకుండెనని తలంతురు. బాల వ్యాకరణమునఁ జూపకున్నను దన ప్రాథమికరచనములందు వీని నన్నిటిని నాతఁడు సాధించియే యుంచినాఁడు. చూడుఁడు.

i. మీఁదట రో, కానయు నగు. —శబ్దలక్షణ-3-82.

ii. { ధర్మాదులకు వు వర్ణకంబగు. —శబ్దలక్షణ-3-38.
వర్గాదేర్వా. —సూత్రాంధ్ర-పుట 6.

iii. సస్యవాచికి ధాన్యంబున బహువచనంబు నిత్యంబు.
—శబ్దశాసన-పుట 32.

iv. { పూజ్యత్వంబున గారు బహుత్వంబునందగు
శసాదులం దీ రు వర్ణంబు రి వర్ణంబగు. } —శబ్దశాసన-పుట 31.

ఇట్టివియేగాక

సఖుఁడు — సఖము ; ఊళ్ళు — గోళ్ళు ; అద్దమరేయి — నడికిరేయి ;
పగలు — అంపలు ; చిచ్చులు — చిచ్చలు ; చిన్ని — సీతాయి ;
పావరమ్ము — బొమ్మరిల్లు ; రేవగలు — వేనవేలు

మున్నగు నెన్నియో విశేషశబ్దములకు ప్రౌఢవ్యాకరణమున లేనివానికిఁగూడ సూరి రచించి యుంచిన సూత్రములు శబ్దలక్షణ సూత్రాంధ్రవ్యాకరణాదులందుఁ జాలఁగలవు. పరిశీలింపుఁడు.

2. ఇఁక ధాతురూపములకు సంబంధించు విశేషములు కొన్ని పరికింపుఁడు.

i. ప్రోవఁగదె, ప్రోవఁగదే — మొ. —ప్రౌఢ-క్రియా-9.

ఇందలి "కద" శబ్దానుప్రయోగమును

"ప్రార్థనంబునన్, తుమర్థంబు మీఁద, ఎత్వాద్యంతంబయి కద యగు"
—(శబ్దశాసన-పుట 35)

అని సూరి విధించియే యుండెను.

ii. చూపుకొఱకు, కలుగుకంటె.

ఈ టవర్ణక లోపము

"ట వర్ణకంబు కొఱకు కంటెలు రా లోపించునొండె"
అని శబ్దశాసనమున (36 పుట) స్పష్టముగా నిరూపితమయి యున్నది.
రాన్ అనఁగా పరమగుచో అని యర్థము.
"రానసంబరంబగుచో నని యెఱుంగునది" అని శబ్దలక్షణ సంగ్రహమున నొక సంజ్ఞ కల్పించుకొనఁబడినది.

iii. చొక్కఁజేయు, వహింపఁజేయు. —ప్రౌఢ-క్రియా-18.

ప్రేరణార్థమున, ఈ చేయుధాత్వనుప్రయోగమును

"ణ్యర్థంబునన్ తుమర్థంబుతో చేయుక్రియ వాడంబడు: చను ప్రభృతులకు నిత్యంబు"
అను శబ్దశాసన సూత్రము (36 పుట) మునుపే విధించియున్నది.

సాధారణముగా విధించుటయగాక "చను" మున్నగు ధాతువులలో, ఈ యనుప్రయోగము నిత్యమను విశేషమునుగూడ నిరూపించియున్నది.

తక్కిన ధాతువులకు ప్రేరణార్థమునఁ గలుగు, ఇంచుక్, చుక్, పుగాగమములలో, ఏదియు చనుధాతువునకు రాదు.
చనించు, చనుచు, చనుపు అను రూపము లుండవు.
చనఁజేయు, అనునది యొక్కటే దీని ప్రేరణార్థక రూపము.
సూరి చూపియున్న యీ విశేషాంశము ప్రౌఢవ్యాకరణమునఁ గానరాదు.

iv. లేలెమ్ము — పోపొమ్ము.

ఇట్టి రూపములలో మువర్ణకము పరమయినపుడు హ్రస్వము వచ్చుచున్నది (పొమ్ము).

మువర్ణకము లోపించినచోట దీర్ఘమే నిలుచుచున్నది (పో).

ఇదీ: ఈ రూపములందున్న విశేషము.

ఈ విషయము వెల్లడించుటకు ప్రౌ. వ్యా. కారులు "ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగు" (ప్రౌఢ-సంధి-23) అని సూత్రము రచించి యుండిరి.

ఇచ్చటఁ గొందఱు లెమ్ములెమ్ము, పొమ్ముపొమ్ము — అను చోటులందుఁగూడ ఆమ్రేడితముపరమయినదిగావున నీ సూత్రముచే హ్రస్వమునకు

దీర్ఘము కలిగి లేమ్ములెమ్ము, పోమ్ముపొమ్ము అను అపరూపములు సంభవించుచున్నవే! ఈ దీర్ఘములను వారించుట యెట్లు? అని ప్రశ్నింప వచ్చును.

మఱియు, ఈ సూత్రమున ఆమ్రేడితము పరమగునపుడు మాత్రమే దీర్ఘము విధింపఁబడుచున్నదే; ఆమ్రేడితములేని "లే, రా, పో" మున్నగు కేవల శబ్దములందును దీర్ఘములు వినంబడుచున్నవే! అవి సిద్ధించుట యెట్లు? ఇట్టి రూపములు వ్యవహారములందెగాక భారతాదులయందును పెక్కులు గాన వచ్చుచున్నవే! వీనిగతి యేమి! అని మఱికొందఱడుగవచ్చును.

నిజమే గాని, మనకుఁ బ్రకృత కర్తవ్యము, ప్రౌఢవ్యాకరణ సూత్రము నందలి అవ్యాప్త్యతివ్యాప్తులను బరిశోధించుట కాదు. ఆ ప్రశ్నములు సమాధేయములో, నిరుత్తరములో, ప్రౌఢవ్యాకరణ సమీక్షలోఁ బరిశీలించుకొందము. ప్రౌఢవ్యాకరణ ప్రదర్శితములగు విశేషములు పెక్కిటిని చిన్నయసూరియే సాధించి యుంచెననియు, అవి యాతనికిని సమ్మతములే యనియు, చూపుట మాత్రమే మన కిప్పటి కర్తవ్యము.

లే లెమ్ము, పో పొమ్ము అను రూపములను

"మధ్యమ ముడుజ్జులు రా హ్రస్వంబగు. తల్లోపంబునం గలుగదు".
—శబ్దలక్షణ-4-56, 57.

అను శబ్దలక్షణ సూత్రములు స్పష్టముగా సాధించియున్నవి. అంతమాత్రమ గాక ఆమ్రేడితస్థలములతోపాటు లే, పో, రా, తే మున్నగు కేవల రూపములను గూడ సంపాదింపఁ జాలియున్నవి. మఱియు లెమ్ములెమ్ము, పొమ్ము పొమ్ము, మున్నగు చోటులందు దీర్ఘప్రసక్తి కలుగకుండ కాచుకొనుచును నున్నవి.

3. ఇఁక సమాసము లందలి కొలఁది కార్యములు గమనింపుఁడు.

i. రామరాజు, రామారాయఁడు, రామిసెట్టి.

ఇట్టి సమాసములందు పూర్వపదమున దీర్ఘమును, ఇత్వమును ప్రౌఢ వ్యాకరణమున ప్రతిపాదింపఁబడినవి. —ప్రౌఢ-సమాస-2, 3.

ఇట్టి రూపములను సమ్మతించుటంబట్టియే సూరి శబ్దశాసనమున

"జన నామంబులకు రాజాదులు రాన్
అత్వం బాత్వం బిత్వంబునుం గానంబడియెడు".
—శబ్దశాసన-పుట 33.

అను సూత్రముచే ధారాళముగా సాధించియుండెను.

ii. విని వినములు.

ఈ సమాస విశేషరూపము ప్రౌఢవ్యాకరణమున నిర్దేశింపఁబడినది. శబ్దశాసనమున ఈ ఒక్క శబ్దమునేగాక "చేసి చేయములు" మున్నగునట్టి శబ్దములను ననేకములను సాధించుట కనుకూలముగా "క్త్వ్యాదంతంబు సమ వ్యతిరేకంబుతో ద్వంద్వంబగు" అను సూత్రము గానవచ్చుచున్నది.

—శబ్దశాసన-పుట 33.

విని + వినము అను పద విభాగ దృష్టితో ఈ సూత్రము రచింపఁబడినది. అర్థానురూప్యమునకుఁగాని ప్రక్రియానుకూలతకుఁగాని యీ విభాగమే సరిపడుచున్నది.

ప్రౌఢవ్యాకరణమున వినికి + వినము = వినివినములు అని విభాగమనియు, పూర్వపదమున కృత్ ప్రత్యయము లోపించుననియు ప్రక్రియ నిరూపింపఁబడినది.

—ప్రౌఢ-సమాస-31.

ఈ ప్రక్రియ రూపసిద్ధి కనుకూలము కాదు.

విను ధాతువునకు "ఇకి" అనునది కృత్ ప్రత్యయము. అది లోపించినచో "వినువినములు" అని సంభవించును గాని "వినివినములు" అని కావలసిన రూపము సిద్ధింపదు. ప్రౌఢవ్యాకరణ విధానరీతిలో ఈ ఇకారము లభించు మార్గమే గోచరింపదు.

ఈ చిక్కు తొలఁగింపఁబోయి ప్రౌ. వ్యా. టీకలు మఱికొన్ని చిక్కులు తెచ్చికొనినట్లున్నది. పరిశీలింపుఁడు.

"విని వినములు", "చేసి చేయములు" మున్నగు సమాసములలోని విశేషమును అథర్వణాచార్యులు ఏనాఁడో గుర్తించి

"ద్వన్ద్వః కేషాంచి దిష్టస్స్యాత్ క్త్వార్థశబ్దేన కుత్రచిత్"

అను కారిక రచించియుండిరి. అది పరికించి

"వచ్చి రాములు, చేసి చేయములు, చొచ్చి చొరములు, ఇత్యాదావపి ద్వన్ద్వ సమాస స్స్యాదేవ"

అని యహోబలపండితుఁడు ఈ ద్వంద్వసమాసములు సాధువులని వ్యాఖ్యానించియుండెను.

వాని నన్నిటిని పర్యాలోచించి ప్రయోగరూఢిని గమనించి చిన్నయసూరియు, క్త్వార్థ కేకారాంతములకు తద్ధాతు వ్యతిరేక విశేష్యములతో ద్వంద్వము కలుగునని సూత్రించియుండెను.

ఇంతమంది యీ సమాసములందలి పూర్వపదములు క్త్వార్థాంతము లని వక్కాణించుచుండ "వినివినము" లలోని మొదటిపదము "వినికి" శబ్దమని ప్రౌ. వ్యా. కారులకు ఎందులకు స్ఫురించెనో, దానిని సరిపుచ్చు మార్గ మెద్దియో తెలియరాకున్నది. ఆ సూత్రమును, తట్టీకలను ఈ చూపుతోఁ బరిశీలింపుఁడు.

శాఖా చంక్రమణము జరుగకున్నను ప్రకృత ప్రసంగము వేఱొక వంకకు రవంత ఒఱగుచున్నట్లున్నది. ఇంతటితో దీనిని విడిచిపుత్తము.

(4) ఇఁక సంధుల విశేషములు కొన్ని పరికింపుఁడు. దీనితో ప్రకరణము ముగింతము.

కమ్మని లతాంతముల కుమ్మొనసి —భారత-ఆది-5-138.

i. ఇందలిది మకారద్విత్వప్రాసము. ద్రుతమునకు మకారాదేశము కలిగినఁ గాని యీప్రాసము కుదురుపడదు. కావున దీనికయి:

"ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు
—ప్రౌఢ-సంధి-22.

అనుసూత్రము త్రిలింగలక్షణశేషమున రచింపఁబడినది.

ఈ ప్రసంగము బాలవ్యాకరణమునఁ గానరాకుండుటంబట్టి సూరి ప్రాస నిబద్ధములయిన భారత ప్రయోగములనే గుర్తింపకపోయెనే యని ఆపాతతః కొంద అనుకొందురు. అట్లనుకొనరాదు. సూరిదృష్టి కందని భారత ప్రయోగము లుండుట ముక్కాలు మ్ముమ్మ్వీసము అసంభవము. ఆతఁడీ ప్రాసప్రయోగములు గుర్తించి, ప్రాసములందెగాక పయిచోటులందుఁగూడ అరుదుగా ఈ మకారాదేశ ముండుట గమనించి, అన్నిటికి ననుకూలముగా

"ద్రుతంబునకు మకారంబు రాఁ బరసవర్ణంబు విభాషనగు"
—శబ్దలక్షణ-5-64.

అని మకారమును విధించియే యున్నాఁడు.

దీనినిబట్టి (మూఁడున్+ముప్పాతిక=) మూఁడు మ్ముప్పాతిక, నాలుగు మ్ముప్పాతిక, ముక్కాలు మ్ముమ్వీసము మొదలగు చోటులందలి మకార ద్విత్వమును సయితము నాతఁడు సమ్మతించినట్లు కానవచ్చును.

ii. "తామర కాకు పరంబగునపుడు పుగాగమంబగు"—ప్రౌఢ-సంధి-8. అని సూత్రించి ప్రౌ.వ్యా.కర్త ఉత్తర హరివంశ ప్రయోగమును జూపియుండెను.

ఒక్క శబ్దమునకయి నూతన ప్రక్రియ చూపనేలయని సూరి "తామర పాకు" (సూత్రాంధ్ర-పుట 27) అని యీ రూపమును నిపాతసూత్రమున సంగ్రహించియుండెను. సర్వజ్ఞుఁడని తాను భావించిన సోమనాథుని ప్రయోగమును సమ్మతింపక సూరి నిరసించునా: 'తామరపాకు నీరుబలెఁ దల్లడమందరె పౌరులందఱున్'.

iii. పెన్నుద్ది, పెన్నూఁత, పెన్నొడలు మొ. —ప్రౌఢ-సంధి-9.

ఇట్టివానిలో పెనుశబ్దనకారమునకు ప్రౌఢవ్యాకరణమున ద్విత్వము విధింపఁబడినది.

"పెన్నురచి" (పెన్ను+అచి) అని సూత్రాంధ్ర వ్యాకరణమున పెను శబ్దమునకు "పెన్ను" ఆదేశముగా విధింపఁబడియే యున్నది.

iv. "తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు.
—బాల-సంధి-14.

అని సూరిగారు గసడదవాదేశమును నిషేధించి యున్నారు.

1. "వీ। రల్గోపించిన నంతకుండుఁ జెడు మీరా యోర్చువారు?"
—ఉ.హరి-4-53.

2. "ఇ। ట్లు దపంబు సేయుచుండుదు ...." —నిర్వచనోత్తర-5-8.

3. "వే వణములు.... ...." —విజ్ఞానేశ్వరీయ-ప్రా.కాం-49.

ఈ మూఁడు ప్రయోగములలో పయి బాలవ్యాకరణ సూత్రమునకు విరుద్ధముగా గ, ద, వాదేశము కానవచ్చుచున్నది.

ప్రయోగించినకవులు సామాన్యు లనుకొందుమా: అపచారము.

మొదటివారు: సోమనాథులు. అలికంబున యక్షిని దాఁచినట్టి సర్వజ్ఞులుగా* నీతిచంద్రికలో సూరిచే స్తుతింపఁబడిన మహనీయులు.

రెండవవారు: సోమయాజులు. ఆ నీతిచంద్రికయందె సోమనాథుల కన్నముందుగనే* సూరి పొగడ్తలలో అగ్రతాంబూల మందుకొన్న ఆహితాగ్నులు.

---

* ఘను నన్నయభట్టును ది
క్కన నేఱ్ఱాప్రెగడఁ బొగడి యలికంబునయ
క్షిని దాఁచినట్టి సర్వ
జ్ఞుని నాతన సోమనాథు స్తుతియొనరింతున్.
—నీతి చంద్రిక-పీఠిక-4.

మూఁడవవారు : కేతనామాత్యులు. ఉభయకవిమిత్రులయిన ఆ సోమ యాజుల వారిని మెప్పించు కవిత చెప్పిన† కళాప్రపూర్ణులు.

ఇట్టి యీ మువ్వురును బ్రయోగించిన యీ గ ద వాదేశమున్న చోటులు సాధారణము లనుకొందుమా పొరాఁడేని మార్పఁజాలని ప్రాసస్థలములు.

ప్రౌఢవ్యాకరణ కారులు (సంధి-5) "కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక క త ప లకు గ ద వ లు గానంబడియెడి.

'కొన్ని యెడల ననగాఁ బ్రాసంబు లందని యర్థము" అని సూత్రించి పయి మూఁడు ప్రయోగములను ప్రదర్శించియున్నారు.

సుప్రసిద్ధమహాకవుల యీ ప్రాసములను సూరి పరిశీలింపఁడయ్యెనే! ప్రామాణికప్రయోగములను బరిగ్రహింపకుండెనే!

అని యీ ప్రయోగములు చూచినవారెల్లరును పెదవి విఱువవచ్చును. కాని, వాస్తవము వేఱుగా నున్నది.

ఈ ప్రయోగములను సూరి పరిశీలింపక పోలేదు. పరిగ్రహింపక పోనులేదు. పరిగ్రహించి, కన్నుల కద్దుకొని, వీని సాధుత్వము తేటపడునట్లు, సూత్రాంధ్ర వ్యాకరణమున :

"నాచ్ఛికా దప్రాసే సాంస్కృతికానామ్"

అని సూత్రము రచించియున్నాఁడు. —సూత్రాంధ్ర-పుట 3.

ఈ సూత్రమున అప్రాసే అను పర్యుదాసముచే ఈ గ స డ ద వాదేశ నిషేధము ప్రాసస్థలములందు వర్తింపదుసుమా యని నొక్కి వక్కాణించి యున్నాఁడు.

దీనింబట్టి యాతఁడీ ప్రయోగములను గుర్తించి పరిగ్రహించి ప్రత్యేక ముగ వీనికొఱకే పర్యుదాసము కల్పించి వీని విశిష్టతను ఎంతగా సంరక్షించి నాఁడో స్పష్టముగాఁ దెలియుచున్నది. మఱొక్కమాట.

---

† కవితఁ జెప్పి యుభయ కవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరఁగ దశకుమార చరితంబుఁ జెప్పిన
ప్రోడ నన్ను వేఱె పొగడనేల!

—ఆంధ్ర భాషా భూషణము-పీఠిక-4.

సూరికి అంతేవాసులుగదా ప్రౌ. వ్యా. కారులు! అతని సూత్రమునందలి 'అప్రాప్తే' అను పదమును చూచి తమసూత్రము రచించి యుందురా? చూడక సూత్రించి యుందురా? అని ప్రశ్నింతురేమో! అది మన కక్కఱ గల ప్రశ్నమే కాదు. చూడకుందురనుటకు వీలు లేదు. చూచియుందు రనుటకు సూచన లేదు. ఏమని చెప్పఁగలము? ఆ ప్రశ్నమటుంచి ప్రకృతము చూచుకొందము.

పయినిజూపినరీతిని ప్రబంధము లందలి ప్రయోగ విశేషములు పెక్కులు సూరి ప్రాథమిక రచనము లందు సాధింపఁబడి యున్నవి. అసమగ్రము లయిన యీ చిత్తుప్రతులందే యిట్టి విశేషము లనేకములు తానవచ్చుచున్నవి. సూరి పరిష్కరించుకొన్న సంపూర్ణ పరిశుద్ధ మాతృకలే లభించియున్నచో చిన్నయ సూరీయములుగా నెన్నివిశేషములు పాఠకలోకమున కందియుండెడివో! ఆ ప్రతులను, ఆయన నాశ్రయించి దరిదాపుల మెలఁగినవారిలోనే అసహనశీలురో, ఆషాఢభూతులో కపటబుద్ధితో కాఁజేసి యుందురు; అది యటుండనిండు.

ఇంక, ఈ ప్రకరణమును అట్టె పెరుఁగనీక ఒక్క యంశముతో ముగించుకొందము.

తక్కిన విశేషరూపముల మాటకేమిగాని, యెందఱో కవులు ప్రయోగించిన క్త్వార్థకసంధిని వలదు వలదని నిషేధించుట సంకుచితభావమును వెల్లడింపక తప్పదని పెక్కుమంది సూరియెడ నైరస్యము చూపుచుందురు.

నిజమునకు క్త్వార్థకసంధి సూరికి అందఱు ననుకొనుచున్నంతగా నసమ్మతము కాదు.

క్త్వార్థకసంధి భారతమున లేనిమాట పరమ సత్యము.

అయినను ననంతరకవులు పలువురు దీనిని ప్రయోగించియుండుట సూరి గమనించి, యిది విసదృశములగు అ, ఆ, ఉ, ఊ, ఋ పరమగుచోట కటువుగా నున్నను, సదృశములగు ఇ, ఈ, ఎ, ఏ, ఋ పరమగు కొన్ని తావు లందు శ్రుతిహితముగనే యున్నటులు సమాలోచించి, తన సూత్రాంధ్రవ్యాకరణమున తొలుత "నక్త్వః" అని నిషేధించియు, ఆ వెనువెంటనే "క్త్వాపి సవర్ణే దృశ్యతే" అని సవర్ణాచ్చులు పరమగునపుడు రావచ్చునని తన యనుమతిని స్పష్టముగాఁ దెలిపియున్నాఁడు. ఇట్లు సమ్మతించియు బాలురు దీని క్వాచిత్కతను గమనింపఁజాలక సూచీప్రవేశన్యాయమున సార్వత్రికము చేయుదురను సంకోచముతో బాలవ్యాకరణమున బింకము సడలింపఁడయ్యెను.

భారతమున ఒక్కచో నయినఁ గానరాని క్త్వార్థకసంధినే సమ్మతించిన యీతని హృదయము సువిశాలమనఁదగునో, సంకుచితమనఁదగునో యెవరికి వారే యోజించుకొనఁగలరు.

పయిని జూపినరీతిగా బాలవ్యాకరణమునందును, తత్పూర్వ రచనములగు సూత్రాంధ్ర వ్యాకరణాదులందును, సూరి ప్రమాణములుగాఁ జూపిన ప్రబంధ ప్రయోగములనుబట్టియు, మొదటిరచనములందు సాధించి యుంచిన విశేష రూపములను బట్టియు, నీతఁడు ప్రబంధకవులయెడ ప్రామాణికతా గౌరవము కలవాఁడనియు, శబ్దసాధుత్వ నిర్ణయమున సంకుచితముకాక సువిశాలమగు దృష్టి గలవాఁడనియు, ఈ వాస్తవము నెల్లరును గ్రహించి సూరిపయి నాపాదింపఁబడు నపవాదములను దొలఁగింతురు గాక.

ఈ ప్రకరణమున నిరూపించిన దృష్టులతో సాధుశబ్ద సామగ్రిని సిద్ధపఱుచుకొనిన పిమ్మట సూరి నిర్ణయించుకొన్న రచనాప్రణాళిక యెట్టిదో రాఁబోవు ప్రకరణమున విశదము కాఁగలదు.

---

# రచనా ప్రణాళిక

లక్ష్యగ్రంథములు పరిశోధించి లక్షణసముచ్చయమును సేకరించుట ఒక యెత్తు. ఆ లక్షణములు చదువరులకు సుకరముగా బోధపడుటకయి తగిన రచనాప్రకారమును నిర్ణయించుకొనుట వేఱొకయెత్తు. తెలిసికొనఁగలశక్తి వేఱు. తెలియఁజెప్పఁగలశక్తి వేఱు. కావుననే చిన్నయసూరి లక్ష్యములు పరిశీలించుట, రచనాప్రణాళిక నిర్ణయించుకొనుట అను నా రెండింటిని ప్రధానకృత్యములుగాఁ దన పీఠికలో నుట్టంకించి యున్నాఁడు.

జీవభాషల వ్యాకరణములకు నెప్పటికిని సమగ్రత చేకూరుట సంభవింపదు. పరిణామశీలములగు భాషలతోపాటు వాని వ్యాకరణములును, ఏ కాలమునకో మాఱుచుండుట సహజము, సంభావ్యము. కావున నిటమీఁద నూతనాంధ్రవ్యాకరణమును, సుధీజనామోద పాత్రముగా రచింప సంకల్పించు లక్షణకర్తలకు బాలవ్యాకరణ రచనాప్రణాళిక మార్గదర్శకమయి మిక్కిలి యుపకరింపఁగలదు. కావున, ఆ ప్రణాళికారీతు లెట్లున్నవో పరిశీలించి సూచనాప్రాయముగా నిచ్చోట నిర్దేశించుట యావశ్యకము :

i. పరిచ్ఛేదములు; ii. సూత్రములు; iii. వృత్తులు; iv. లక్ష్యములు ; v. సంజ్ఞలు ; vi. ఇతరసంజ్ఞలు ; vii. పరిభాషలు ; viii. వార్తికములు ; ix. గణములు ; x. కార్యవిధానములు

అనువాని స్వరూపము పరికించినచో ఈ ప్రణాళికారీతి గోచరింపఁగలదు.

## i. పరిచ్ఛేదములు

ఏ గ్రంథములయినను విషయభేదమునుబట్టి భాగములుగా నేర్పఱుపఁబడుట చదువరుల సౌకర్యమునకు సాయపడు మార్గము. అట్టి విభాగము విషయక్లేశముగల లక్షణగ్రంథములందు నత్యంతావశ్యకము.

మన లక్షణగ్రంథములందు నట్టి భాగములను అధికరణము, అధికారము, అధ్యాయము, ఆశ్వాసము, ఉద్ద్యోతము, ఉల్లాసము, తరంగము, పరిచ్ఛేదము, ప్రకరణము మున్నగు పేరులతో లాక్షణికులు వ్యవహరింతురు. వీని యన్నిటిలో విభజనము అను నర్థమునకు పరిచ్ఛేదశబ్దము సన్నిహితమయి సముచితముగా నుండునను తలంపుతో సూరి తన వ్యాకరణభాగములకు పరిచ్ఛేదములని పేరువెట్టెను.

బాలవ్యాకరణము విషయభేదమునుబట్టి పది పరిచ్ఛేదములుగా విభజింపఁ బడినది:

(1) సంజ్ఞ; (2) సంధి; (3) తత్సమము; (4) ఆచ్ఛికము; (5) కారకము; (6) సమాసము; (7) తద్ధితము; (8) క్రియ; (9) కృత్తు; (10) ప్రకీర్ణకము.

ఏ పరిచ్ఛేదమున నుండఁదగిన యంశములు ఆ పరిచ్ఛేదముననే యుండవలయుఁగాని, వానికి లేశమును సాంకర్యము గలిగింపరాదను ప్రత్యేక దృష్టి సూరికున్నటులు కాననగును. ఈ విషయమునకు పరిచ్ఛేదములన్నిటిని పరిశోధింపఁ బనిలేదు. పరిచ్ఛేదముల తుదిని 'ప్రకీర్ణకము' (Miscellaneous) అనునొక పరిచ్ఛేదమును వేఱుగా నేర్పఱుచుకొనుటలోనే సాంకర్యమును సమ్మతింపని దృష్టి యాతని కున్నటులు గ్రహింపవచ్చును.

(1) సంజ్ఞా పరిచ్ఛేదము : వ్యాకరణమున వ్యవహరింపఁబడు సంజ్ఞలే గాక, బాలురకు వ్యాకరణ ప్రారంభముననే తెలియవలసినవియు, భాషకంతకును సంబంధించునవియు నగు కొన్ని సాధారణాంశములు గూడ, సంజ్ఞా పరిచ్ఛేదమున నిరూపింపఁబడినవి. సంజ్ఞలలో సాధారణములు, విశేషములు నని రెండువిధములు గలవు. సకల పరిచ్ఛేదములందలి ప్రక్రియకును సంబంధించునవి సాధారణసంజ్ఞలు. అట్టివి మాత్రమే యీ పరిచ్ఛేదమున నిరూపితములు. ఒక్కొక్క పరిచ్ఛేదముతో మాత్రమే సంబంధము గలవి విశేషసంజ్ఞలు. అట్టి సంజ్ఞలు ఆయా పరిచ్ఛేదములందు అవసరము గలిగిన తావులందు నిర్దిష్టము లయినవి.

(2) సంధి పరిచ్ఛేదము : స్వరసంధులు, వ్యంజనసంధులు, అనుకరణ సంధులు అను నవాంతర విభాగములతో సంధిప్రసంగములన్నియు, ఈ పరిచ్ఛేదమున వివరింపఁబడినవి. ఇతర ప్రక్రియతో సంబంధముగల త్రికసంధి వంటి యొండు రెండు సంధులు మాత్రము స్థలాంతరములందుఁ జూపఁబడినవి.

(3) తత్సమ పరిచ్ఛేదము : అజంతములు, హలంతములునగు సంస్కృత ప్రాతిపదికములను తత్సమములుగా తెలుఁగునకుఁ దెచ్చుకొను రీతులును, వాని రూపనిష్పత్తి ప్రకారమును, ఈ పరిచ్ఛేదమున ప్రతిపాదింపఁబడినవి. అజంత హలంత ప్రకరణములు విభజింపఁబడి యున్నవి. అకారాది క్రమమును తలఁపున నుంచుకొని, ముందు సాధారణశబ్దములు, ఆ మీఁద విశేషశబ్దములు అను ననుక్రమణిక యిందుఁ బాటింపఁబడినది.

(4) ఆచ్ఛిక పరిచ్ఛేదము : అచ్చతెనుఁగు శబ్దముల ప్రక్రియ యిందుఁ జూపఁబడినది. ఆచ్ఛికములలో సర్వనామశబ్దరూపములు వివిధము

లయి, వర్గీకరణమునకు వశముగానివగుటచే వానిలో నొక్కొక్క రూపమునకు పెక్కుసూత్రములు రచింపవలసి వచ్చుననియు, బహులక్ష్యసాధకములు కాని సూత్రములు సూత్రములే కావనియు, సంక్షేపమునకయి యారంభింపఁబడిన వ్యాకరణమును మఱింత విస్తృతము కావించుట తగదనియు, నిట్టియూహలతో ఆ ప్రక్రియకుఁ బూనుకొనక సూరి యిట సిద్ధరూపములపట్టికలు మాత్రము చూపఁదలంచెను. మఱియు, తత్సమాచ్ఛికములకు సమానములగు డు, ము, వుల విధానము మున్నగు కొన్ని కార్యములను నిచటఁగూడ నిరూపించినచో పునరుక్తి యగునని యట్టివానిని దిరిగి స్మరింపక విడువఁ దలంచెను.

అసఁగా, తత్సమపరిచ్ఛేద సూత్రములు కొన్ని యాచ్ఛికములందుఁ గూడ వర్తించును. ఆచ్ఛికపరిచ్ఛేద సూత్రము లెవ్వియు తత్సమములందు వర్తింపవు.

(5) కారక పరిచ్ఛేదము : తత్సమాచ్ఛిక శబ్దములకుఁ గలుగు విభక్తులను, వాని యర్థములను, ఆ విభక్తుల మార్పులను, అవికలుగునప్పటి కార్య విశేషములును, కారక పరిచ్ఛేదమున నిరూపింపఁబడినవి.

(6) సమాస పరిచ్ఛేదము : సంస్కృతముననే నిష్పన్నములయి తెలుఁగునకుఁ దెచ్చుకొనఁబడు సిద్ధసమాసములలో ప్రక్రియ చూపవలసిన ప్రసక్తి లేదు. కావున ఆచ్ఛికశబ్దముల సమాసరీతులను సామాసిక కార్యములను మాత్రమే యీ పరిచ్ఛేదమున వివరింపఁబడినవి.

(7) తద్ధిత పరిచ్ఛేదము : ఆచ్ఛిక ప్రాతిపదికముల మీఁద వచ్చు ప్రసిద్ధములగు తద్ధిత ప్రత్యయములును, వానియర్థములును, తద్ధిత నిమిత్తకములగు కార్యములును ఈ పరిచ్ఛేదమున నిరూపింపఁబడినవి.

(8) క్రియా పరిచ్ఛేదము : సంస్కృతాంధ్ర ధాతువులనుండి నిష్పన్నములగు సమాపకక్రియలు, అసమాపకక్రియలు, విశేష్యములు, విశేషణములు మున్నగు ధాతుజన్య రూపములు ఈ పరిచ్ఛేదమున సమగ్రముగా సాధింపఁబడినవి. అందు విశేష్యములు కొన్నిమాత్రమే యిచట బ్రదర్శింపఁబడి, పెక్కు విశేష్యములు కృదంత పరిచ్ఛేదమున నిరూపింపఁబడినవి.

ధాతుజన్య విశేష్యములన్నిటిని నొక్కచోటనే ప్రదర్శింపక యిట్లు రెండుతావుల నుంచుటకు ప్రబలమయిన హేతువు గలదు. ఆ హేతువు ప్రక్రియకు సంబంధించినదగుటచే, క్రియాపరిచ్ఛేదము 35వ సూత్రమున వివరింపఁబడును. తప్పక చూచునది.

ఈ పరిచ్ఛేదమున మొదట సాధారణ ధాతురూపములు, పిమ్మట విశేష ధాతురూపములు అను నీ క్రమము పాటింపఁబడినది.

(9) కృదంత పరిచ్ఛేదము : తెలుఁగు ధాతువులలో వేనివేనికి ఏ యే ప్రత్యయములు కలిగి, ఏ యే కృదంత విశేష్యరూపములు, నిష్పన్నములగునో యీ పరిచ్ఛేదమునఁ బ్రదర్శింపఁబడినది.

ఈ కృత్ప్రత్యయములలో నొక్కొక్క దానికి ననేకార్థములుండును. మఱియు ననేకకృత్తులకు ఒకే యర్థముండును. ఇట్టి చీకాకువలన, అర్థములను సూటిగా సూచింప వలనుపడకుండుటచే లోకవ్యవహారమునే శరణ్యముగాఁ జూపి అర్థనిర్దేశము ఉపేక్షింపఁబడినది. ప్రత్యయములు మాత్రమే ప్రదర్శింపఁబడినవి.

(10) ప్రకీర్ణక పరిచ్ఛేదము : పయిని నిర్దేశించిన పరిచ్ఛేదములలో దేనియందును నుచితమగు తావులేక మిగిలియున్న కొన్ని భాషారూపముల ప్రక్రియను ప్రతిపాదించునది ప్రకీర్ణక పరిచ్ఛేదము.

విషయసాంకర్యము లేకుండుటకయి పరిచ్ఛేదవిభాగమున సూరి నిర్ణయించుకొన్న పథకము ఇది.

## ii. సూత్రములు

సూత్రములన్నవి శక్యమగునంత మేరకు, అల్పాక్షరములయి, అసందిగ్ధములయి, సారవంతములయి, బహురూప సాధకములయి, సార్థకములయి, నిర్దుష్టములయి, సంస్కృత సూత్రకారులు తలంచిన రీతిలో నుండవలయునని సూరిసంకల్పము. అంత మాత్రమగాక, సూత్రములందలి పదములకూర్పు శ్రుతిహితమయి, వినువారి వీనులకు నింపుగొలుపవలయుననికూడ నాతని కుతూహలము. లాలిత్యాభిలాషులకుఁ దప్ప సూత్రరచనమున నిట్టి కుతూహలము, ఎల్లవారికిని గలుగునది కాదు. ఆ దృష్టితోను, దాని కనుకూలమగు నైపుణితోను రచింపఁబడుటవల్లనే బాలవ్యాకరణమున నున్న 465 సూత్రములలో శ్రోత్రపేయము కాని సూత్ర మొక్కటియుఁ గానరాదు. అందుఁ గొన్ని సూత్రములు యాదృచ్ఛికముగా గణబద్ధములయి, వీనులకు మఱింత హాయి గొలుపును. ఏ సూత్రము చూచినను, దాని పూర్వోత్తర భాగముల తూనిక (Balance) వీసమెత్తయిన భేదములేక సరిపడుటయగాని, హెచ్చుతగ్గులు గోచరింపవు. ఆ యా సూత్రముల నడకను సరిగా గుర్తించి చదువుకొనువారు వీనిని గేయములుగా భావింతురుగాని, సూత్రములుగాఁ దలంపరు.

చిన్నయసూరికిఁ బూర్వము తెలుఁగుసూత్రముల రచనము లేకున్నను, ఆతని కాలమునను, తదనంతర కాలమునను, దెలుఁగున వెలువడిన సూత్ర గ్రంథములు కొన్ని గలవు. తరతమభావ పరిశీలన దృష్టితో పరికించినయెడల సూరిసూత్రశైలిలోని ప్రత్యేకత సుస్పష్టము కాఁగలదు.

శ్రావ్యతా విషయముననే గాక, సంక్షేప వైశద్యముల (Brevity and Clarity) విషయమునఁగూడ సూరికి సూక్ష్మదృష్టి కలదు. సూత్రము, ఎంత సంక్షిప్తముగానున్న, అంత సలక్షణ మనిపించుకొనును. ఎంత విశదముగా నున్న అంత ప్రశస్త మనిపించుకొనును.

"ఏకమాత్రా లాఘవేన పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః"

సూత్రమునందు నొక్క హ్రస్వాక్షరమును తగ్గింపఁ గలిగినను, సంస్కృత వైయాకరణులు పుత్రోదయము కలిగినంతగా నానందింతురఁట. కనుకనే

"అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్ ।
అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః"

అను సూత్రలక్షణములలో, అల్పాక్షరత్వమును మొదటి లక్షణముగా నిర్దేశించినారు.

శిష్య బోధన సౌలభ్యమునకయి, ఒకే యంశమును పలు విధములుగా త్రిప్పి, విప్పి, విపులీకరించి, ప్రవచించు నిరంతరాభ్యాసముగల యధ్యాపకులకు సంక్షేప కథనము వంక దృష్టియే ప్రసరింపదు. ప్రసరించినను, వారికది ప్రయత్న సాధ్యముగాని, సుకరము కానేరదు.

సూరి చిరకాల మధ్యాపకుఁ డయినను, విషయ విపులీకరణమునకే యలవడినవాఁడయినను, సూత్ర శైలిలో మాత్రము సంక్షేప రచనమునే సంతరింపవలయునని తలంచినాఁడు. ఆ తలంపు గోచరించు తావులను, అం దాతఁడు కృతార్థుఁడయిన తీరును దిలకింపుఁడు.

"డు, రు, వు, రు, ను, ము" అను వానిని క్రియా ప్రత్యయములుగా నిర్దేశించినాఁడు. వానిలో, ఏవి యేకవచనములో, ఏవి బహువచనములో నిరూపింపవలసి వచ్చినది. దానికయి

"రు, ము లు బహువచనంబులు ; పెఱ లేకవచనంబులు"—క్రియా-10.

అని సూత్రించినాఁడు. ఏకవచనములను ముందు చూపి, తక్కినవి బహువచనములని నిరూపించుట క్రమప్రాప్తము. ఆ వరుస తప్పించి, మొదట బహువచనములను ఏల నిర్దేశించినాఁడో గమనింపుఁడు.

ఏకవచనములనే ముందు పేర్కొన్నచో ఈ సూత్రమును "డు, వు, ను లేకవచనంబులు ; పెఱలు బహువచనంబులు" అని రచింపవలసి యుండును. ఈ రచనలో డు, వు, ను, అని మూఁడింటిని బేర్కొనవలసివచ్చును.

బహువచనములలో "రు" వర్ణకములు రెండుకలవు. కావున రు, ము, అను రెండు వర్ణములు నిర్దేశించినచో మూఁడు ప్రత్యయములను బేర్కొని నట్లగును. అను తలంపుతో సుప్రసిద్ధమయిన వచన క్రమమును సయితము తప్పించి, "రు, ము లు బహువచనంబులు" అని సూత్రించి సంక్షేప మార్గమును సంరక్షించినాఁడు.

మఱియు, ఏ సూత్రము, ఎన్నవదయి యుండవలయును? అను విష యమునఁ గూడ సూత్రకారునికిఁ జూపుగలదు. అనఁగా, సూత్రముల పౌర్వా పర్యముపయి నాధారపడి యున్నవి గూడ ప్రక్రియాంశములు కొన్ని కల వన్న మాట.

సూత్రక్రమము ప్రకరణోచితమగుట మాత్రమేగాక, ప్రక్రియాంశము లను సాధించుటకుఁ దోడ్పడునట్లు గూడ నేర్పఱుచు దృష్టి కానవచ్చును. ఎట్లన

"ఇకార వక్రంబు లుక్తంబు లందలివి పరంబులగుచో యాకు సకారం బగు". —క్రియా-54.

చేసి, చేసిరి, చేసిన, చేసెను, చేసెడిని మున్నగు వానియందు ఇకారము గాని, వక్రము (ఎ) గాని, పర మగుటవలన ధాతు యకారము సకారమయినది.

ఇకార వక్రములు ఈ వ్యాకరణమున సూత్రములచే విధింపఁబడినవే కావలయును. ఆ ఇకార వక్రములను విధించు సూత్రము లయినను ఈ 54 వ సూత్రమునకుఁ బూర్వములే కావలయును. ఇటమీఁద విధింపఁబడు ఇకార వక్రములు పరమయిన చోటులందు ఈ సకారము రాఁగూడదు. అందులకే యీ సూత్రమున "ఉక్తంబులు" (ఈ 54 వ సూత్రమునకు పూర్వము చెప్పఁబడినవి) అను విశేషణము సంఘటింపఁబడినది.

ఇట్లు కానిచో....చేయించు, చేయి, అరయిక, ఇత్యాదులందు, ఇటమీఁద (క్రియా-70, కృదంత-22, కృదంత-12) విధింపఁబడు ఇ కారములు పరమగు నపుడుగూడ, య కారములు స కారములయి, కురూపములు సంభవింపవలసి వచ్చెడిది.

ఇట్లు సూత్రములవల్లనేగాక, సూత్రమునకు నేర్పఱిచిన స్థానమువల్లఁ గూడ, ఇష్ట రూపసాధనమును, అనిష్టరూప వారణమును సులభముగా సంపా దించునట్టి యీ సాంకేతిక మార్గము (Technique) మఱి యే తెలుఁగు వ్యాకరణములందును గానరాదు.

ఇంతియగాక, పెక్కు సూత్రములందు ఆవశ్యకమయిన యేదే నొక శబ్దమును ప్రతి సూత్రమునందును బ్రయోగింపక, ఆ ప్రసంగ ప్రారంభమున

ఒక్క సూత్రముననే యుంచి, యనంతర సూత్రములందు దాని ననువర్తింపఁ జేసికొనుచు సమన్వయించు మార్గము, అనఁగా అనువృత్తి పద్ధతి యచ్చటచ్చట నవలంబింపఁబడినది. ఎట్లన, "ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగును" అను సూత్రమునందలి "అచ్చు, పరంబగునపుడు" అను పదములు, "అత్తునకు సంధి బహుళంబుగానగు" మున్నగు ననంతరసూత్రములందు ననువర్తించును. ఇది ఒకే శబ్దమునకు గ్రంథమున పెక్కుమాఱులు ఆవృత్తి కలుగకుండునట్టి సంక్షేప మార్గము. పాణినీయ కల్పితము.

ఇఁక మఱొక రీతి.

కొన్ని శబ్దములలో నొక్కొకదానికి పెక్కు సూత్రములు రచించినఁగాని దాని రూపనిష్పత్తి నెఱవేఱదు. అట్టి రచనము సంక్షేపమార్గమునకు విరుద్ధమగును. కాన దానిని సంకల్పింపక సూత్ర ప్రక్రియారహితముగ ఆ శబ్దముల స్వరూపమును సూత్రమున నిర్దేశించి వాని సాధుత్వమును నిరూపించుచుండును. అట్టి సూత్రములకు నిపాత సూత్రములని వ్యవహారము.

ఇట్టివి బాల వ్యాకరణమున ఎనిమిది సూత్రములు మాత్రమే కానవచ్చును.

తత్సమ : 51, 62, 63, 78, 82, 83 ; తద్ధిత : 21 ; ప్రకీర్ణక : 5.

ఇట్టి సంగ్రహ దృష్టితోడనే ఆచ్ఛికపరిచ్ఛేదమున అననుగతములయి, అనియతములయిన వివిధరూపములుగల సర్వనామశబ్దముల ప్రక్రియ సంక్షేప రచనమునకు వశముకాదని దానిని అసలే తలపెట్టక సిద్ధరూపములు మాత్రము చూపి యూరకుండెను.

ఈ రీతిగా సంక్షేపమునకయి యాతఁడవలంబించిన మార్గములు పెక్కులు గలవు.

ఇట్లు సూత్ర రచనము సంక్షిప్త మయినను అందెట్టి సందేహములకును తావు కలుగకుండ, విషయము సుస్పష్టమయి యుండవలయునని యాతని వేఱొక దృష్టి. అట్టి స్పష్టతాపరిపాలనమున నతని ప్రయత్న మెట్టిదో పరికింపుఁడు.

"ఇ గ్లౌ రా యుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు."

—తత్సమ-44

ఈ సూత్రమున ఇకా రాంత శబ్దముల ప్రక్రియ ప్రారంభింపఁ బడు చున్నది. వీనిలో ప్రథమైకవచన లోపమును విధింప వలయును. వీనికివలెనే రై, గ్లౌ శబ్దములకును, హలంతములలో రుక్కు, రాట్టు మున్నగు "ఉగాగ

మాంత" శబ్దములకును, ప్రథమైకవచన లోపమును విధింప వలసియున్నది. ఒకే కార్యము వివిధము లగు శబ్దములకు రావలసినయెడ, ఆ కార్యమును ఆ యా తావులందు వేఱువేఱుగా విధించి, సూత్రములు పెంచుట వ్యాకరణ లక్షణముకాదు. అట్టివానినన్నిటిని ఒకేసూత్రమున గుదిగ్రుచ్చుట సంక్షేపమునకు మిక్కిలి సాయపడు మార్గము.

అని యూహించి వానినన్నిటిని ఈ సూత్రముననే మేళవింపఁ దలంచినాఁడు. ఈ కూర్పులో చిన్న చిక్కొకటి యాతనికి భాసిల్లినది.

ఈ అజంత శబ్దముల ప్రక్రియ అ, ఇ, ఉ, ఋ, ఐ, ఔ అను అ కారాది క్రమమున సంకల్పితమయి సాగుచున్నది. ఈ క్రమదృష్టి తోడనే

"రై, గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాషనగు." —తత్సమ-64.
అను సూత్రమున, ముందు రై శబ్దమును, ఆ వెనుక గ్లౌ శబ్దమును, నిర్దిష్టము లయి కానంబడును.

ఇచట ఆ క్రమము ననుసరించి కూర్చినచో సమాసమధ్యమున సంధి చేయక తప్పదు గావున ఈ సూత్రము "ఇ, రై, గ్లౌ వుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు" అని సిద్ధమగును.

తత్సమ శబ్దములలో పెక్కింటికి వుగాగమము విధింపఁబడును. దానిని బట్టి యీ సూత్రమునందలి "వుగంత" శబ్దముచే నట్టి వుగాగమాంతములు స్ఫురించి, యీ ప్రథమైకవచన లోపము వానికి సంబంధించినదయి యుండు నను భ్రాంతి కలుగక తప్పదు. సూత్రములందు భ్రాంతులకు తావీయరాదు. క్రమము తప్పించి యయిన భ్రాంతిని దొలఁగించుట యావశ్యకము.

అని యాలోచించి "ఇ, గ్లౌ, రై + ఉగంత" అని క్రమము మార్చి నాఁడు. ఇపుడు "ఇ, గ్లౌ, రా యుగంత" అని సంధి యేర్పడినది. ఈ వ్యాకరణ ప్రక్రియలో నెచ్చటను, యుగాగమము (యుక్) లేనేలేదు. కావున "యుగంత" అను శబ్దముచే నెట్టి భ్రాంతియుఁ గలుగుటకు తావు లేదు. ఉగంతములే స్ఫురించును. చిక్కు తొలఁగినది. కుదింపు కుదిరినది.

ఇట్లు సూత్రముననేగాక, దీని వివరణమునందును నిట్టిదే మఱొక యంశము గలదు.

> "ఇకా రాంతములకు గ్లౌ రై శబ్దములకు మఱి యుగాగమాంతంబు లకుఁ బ్రథమైకవచన లోపంబగు."

అని వివరించినాఁడు.

ఈ వాక్యమున "మఱి" అను పదము ఎందులకో యోజింపుఁడు. ఊఁత పదము మాత్రము కాదు.

ఈ వివరణ వాక్యమున "మఱి" అను శబ్దము లేకుండ "గ్లౌ, రై శబ్దములకు నుగాగమాంతంబులకు" అన్నచో ఈ వ్యాకరణమున అతి ప్రచురము లయి యున్న నుగాగమములే ముందు స్ఫురించును. ఆ స్ఫురణము కలుగకుండ, "ఉగాగమ" ములని స్పష్టపఱుప వలయును. అందులకయి "మఱి" అను పదమును నడుమను కూర్చినాఁడు. అది, ఉన్నటులే యుగపదకుండ, నుగాగమ భ్రాంతిని తొలఁగించుచున్నది.

మఱొక తీరు పరికింపుఁడు.

ఏ రచనమునం దయినను మొదట ఉద్దేశ్యమును, ఆ పిమ్మట విధేయ మును నిర్దేశించుట సహజ మార్గము. బాలవ్యాకరణ సూత్రములందును ఉద్దేశ్య విధేయముల క్రమము ఈ రీతిగనే గానవచ్చును.

"ఉత్తునకు సంధి యగును" అనుట సాధారణ మార్గము. "సంధి ఉత్తున కగును" అనుట విపరీత మార్గము. ఇట్లుండ

"తేతేరులు తెచ్చున కగు". —క్రియా-93.

"చావు నోవులు చచ్చునొచ్చుల కగు". —క్రియా-94.

మున్నగు కొలఁది సూత్రములందు ఉద్దేశ్యవిధేయముల క్రమము వ్యత్యస్తమయి కాననగును. హేతువు గమనింపుఁడు.

సాధారణక్రమానుసారముగ రచించినచో సంహితను బాటించి సంధులు చేయుట సూత్రములందు న్యాయ్యము గావున, పయిసూత్రములలో

"తెచ్చునకుఁ దేతేరు లగు".

"చచ్చు నొచ్చులకుఁ జావు నోవు లగు"

అని సంధులేర్పడును. కాఁగా నిచటి యాదేశములు దేతేరులు, జావునోవులు అను నవి సరళాదులు కాఁబోలు నను సందేహము ఆపాతతః కలుగవచ్చును. అనుమానములకు ఆవంతయయిన తావీయ రాదు. శక్యమగు నంతలో స్పష్టతకు భంగము కలుగనీయరాదు. అను చూపుతోఁ బయి సూత్రములందు ఉద్దేశ్య విధేయముల క్రమమును వ్యత్యస్తము గావించి, యా సరళాదేశ సంధు లను దప్పించుకొన్నటులు గానంబడును.

ఈ రీతిని నెట్టి సందేహములకును నవకాశ మీయక, విశదముగా సూత్రరచన సాగింపవలె ననియు నాతని ప్రయత్నము.

ఇట్లు శ్రావ్యత, సంక్షేపము, వైశద్యము అనువానియెడఁ జూపు వెట్టి సూత్రములకూర్పు సంతరించినట్లు గ్రహింపవలయును. మఱియు

"సంజ్ఞా చ పరిభాషా చ విధి ర్నియమ ఏవ చ,
అతిదేశో ధికారశ్చ షడ్విధం సూత్రలక్షణమ్."

సంజ్ఞా సూత్రములు, పరిభాషా సూత్రములు, విధి సూత్రములు, నియమ సూత్రములు, అతిదేశ సూత్రములు, అధికార సూత్రములు. అని పాణినీయులు తమ సూత్రములను ఆఱు జాతులుగా విభజించినారు.

చిన్నయసూరి పాణినీయప్రవీణుఁ డగుటయ గాక, యా పాణినీయ తంత్ర పద్ధతులయెడఁ బరమాసక్తుఁ డగుటంబట్టి, ఆ యాఱు జాతుల సూత్రములకును బాలవ్యాకరణమునఁ బ్రవేశము గలుగుట మఱొక చిన్న విశేషము—జాతి కొక్కొక యుదాహరణము తిలకింపుఁడు :

i. సంజ్ఞ : క చ ట త ప లు పరుషంబు లని గ జ డ ద బ లు సరళంబు లని చెప్పంబడు. —బాల-సంజ్ఞా-5.

ii. పరిభాష : ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకంబగు. —బాల-తద్ధిత-2.

iii. విధి : ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి యగును. —బాల-సంధి-1.

iv. నియమము : ఆమ్రేడితంబు పరంబగు నపుడు మధ్యమ ముదుజ్ఞలకు లోపంబు విభాష నగును. —బాల-సంధి-49.

v. అతిదేశము : దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగ నగు. —బాల-తత్సమ-61.

vi. అధికారము : ధాతువునకు. —బాల-క్రియా-1.

క్రమబద్ధములగు శాస్త్రపద్ధతుల ననుగమించుటలో సూరికి ఎట్టి చూపో, ఎంత ముచ్చటో, యోజింపుఁడు.

## iii. వృత్తులు

సిద్ధాంతకౌముదియందువలె నిందును సూత్రములకు వృత్తులు, అనఁగా వివరణములు సంగ్రహముగా నిరూపింపఁబడును.

సూత్రార్థము తేటతెల్లముగానుండి, ఉదాహరణములయినఁ జూపనక్కఱ లేని సూత్రములచివర "స్పష్టము" అని మాత్రమే ఉల్లేఖించు తీరును గానం బడును. అట్టి తావులు గ్రంథముమొత్తమున అయిదు మాత్రమే కలవు.

తత్సమ—20; ఆచ్ఛిక—1; తద్ధిత—2, 21; ప్రకీర్ణక—3.

ఇట్టివేయగు మఱికొన్ని సూత్రములయొద్ద "స్పష్టము" అనుశబ్దము కాన రాదు. ఇట్లు కొన్నిట లిఖించుటయుఁ, గొన్నింట మానుటయు, బుద్ధిపూర్వకమా! యాదృచ్ఛికమా !.... నిదానింపవలసి యున్నది.

అట్లు వ్రాయని స్థలములు :

సంజ్ఞా—5, 11; సంధి—26; తత్సమ—1, 7; సమాస—4; క్రియా—10, 11, 31, 86; ప్రకీర్ణక—5, 23, 24, 25.

వివరణములందు సూత్రార్థములు మాత్రమగాక "రాజు శబ్దంబొక్కండు దంత్యయుక్తంబు గానంబడియెడి" మున్నగు వార్త్తికముల మూలమున సాధారణ లక్షణములకు లొంగని కొన్ని విశేషములు సూచించు పద్ధతియుం గలదు.

ఇంతియగాక, విధించిన కార్యములలో ఏది సార్వత్రికమో, ఏది ప్రాయికమో, ఏది విరళమో, ఏది అతివిరళమో, ఎక్కడి కక్కడ వివేచించి సూచించు రీతిగూడఁ గానవచ్చును. మఱియు

"సర్వత్ర యనుట నగాగమబాధనార్థము." —తత్సమ-23.

"ఉపోత్తమేత్వంబున కనుటంజేసి జిగి, నిసి ఇత్యాదులందుత్వంబు లేదు". —తత్సమ-46.

మున్నగురీతిగా సూత్రములందలిపదముల సార్థక్యమును వెల్లడించు పద్ధతి (కృత్యవిచారణ) యచ్చటచ్చట మచ్చుగాఁ గన్పట్టును.

దీనినిబట్టి పదసార్థక్యమును బరిశీలించుకొనుచు, సూత్రములతాత్పర్యము మును గ్రహింపుఁడను సూచన గోచరించును.

వివరణవాక్యములు సయితము సుదీర్ఘములు గాక, వ్యర్థపదములు లేక, యించుమించు సూత్రములవలెనే సంగ్రహరూపముతో శ్రావ్యమయిన శైలిలోఁ గానవచ్చును.

## iv. లక్ష్యములు

సూత్రములందు నిరూపితమయిన లక్షణములను సమన్వయించుకొనుటకు లక్ష్యములు చూపఁబడుచుండును. ఈ యుదాహరణములు చూపు సందర్భములందు సూత్రకర్త్తకు ననేకవిధముల సూక్ష్మదృష్టులు గలవు :

1. లక్ష్యములు చూప నక్కఱలేనివి ; 2. చూప వలసు పడనివి ; 
3. చూపవలసినవి

అని ఆ యా సూత్రములు పలువిధములుగా నుండును.

1. "పయ్యెద పయ్యద" —ప్రకీర్ణక-5.

ఈ శబ్దమునకు ఎ కారమధ్యముగను, అ కారమధ్యముగను రెండు రూపములుండునని యీ నిపాత సూత్రమునకుఁ దాత్పర్యము. ఆ రెండు రూపములను సూత్రముననే చూపఁబడుటచే వానినే తిరిగి యుదాహరించుట పనిలేని పాటు. ఇట్టి తావులందు లక్ష్యములు చూపఁబడవు. ఇదొక మార్గము.

2. "ఇకారంబు మీఁది కు, ను, వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు" —తత్సమ-26.

ఈ సూత్రమున హరికి, హరిని అని కు, ను లకు మాత్రమే లక్ష్యములు చూపియుండెను. "సుకృతివి" ఇత్యాదులందు రావలసిన "వు" అను నాగమము ఈ సూత్రమునకు ముందు విధింపఁబడి యుండలేదు. కారక పరిచ్ఛేదమున విహిత మగును. ఇటులే

"చెప్పిరి" ఇత్యాదులందు "రు" మున్నగు క్రియావిభక్తులు క్రియా పరిచ్ఛేదమున విధింపఁబడఁగలవు.

ఆ ప్రధానప్రక్రియ శేషించియుండఁగా, ఆ శబ్దములను ఇత్వ మాత్రమునకయి యిచట నుదాహరించుటకు వలనుపడదు. కావున నట్టి లక్ష్యములు చూపకుండెను.

అవశిష్ట ప్రక్రియను పూర్తిగా సాధించు ననంతర సూత్రములందు, ఈ ఇత్వ విధానమును బరామర్శించి చదువరుల జ్ఞప్తి కందించును. ఇదొక పద్ధతి.
చూ. : కారక-33, క్రియా-18.

3. లక్ష్యములు చూపవలసిన చోటులందు, ఏ సూత్రమునకు నెన్నిలక్ష్యములత్యావశ్యకములో చూచి, తూఁచి, అంత మాత్రమే నిర్దేశించుచుండును. ఆ లక్ష్యములు చూపుటలో, సూత్రమున నిరూపితమయిన కార్యవిధానక్రమమో విభక్తిక్రమమో, వచనక్రమమో, వర్ణక్రమమో, యేదోయొక క్రమమును బాటించు దృష్టి యున్నటులు కానవచ్చును. ఉదాహరణములు పరివృత్తిసహములుగాక పట్టుగలవయి యుండును. అనఁగా, ఏ యుదాహరణమునయినను మార్చి, దాని స్థానమున నంతకన్న సముచితమయిన వేఱొక యుదాహరణమును జూపఁగలమా యని యత్నించినచో, అది సులభసాధ్యముకాదు. లక్ష్యములు

అంత సముచితములయి, యనురూపములయి మార్పరానివిగాఁ గన్పట్టు నన్న మాట.

మఱియు, నుదాహరణ ప్రదర్శన రీతిలో నొక్కొక్క చెడ సూత్రకారుని యాంతర్యము బట్టబయలుగాక, యించుక నిగూఢమయి యుండుటయుఁ గలదు. మచ్చునకు నొక్క తావు పరికింపుఁడు :

"'ఈ' ధాతు యుష్మదర్థంబుల కీఁదివాని యుత్వంబున కిత్వంబు రాదు" —తత్సమ-27.

దీనికి "ఈరు, ఈవు, ఈను, ఈము, ఈకు, నీకు, మీకు" అని యుదాహరణములు.

"ఈ" ధాతు రూపములు, యుష్మదర్థ రూపములు అని యీ సూత్రమున రెండు భాగములు గలవు.

"ఈ" అనునది ఇచ్చుధాతువునకు వ్యతిరేకాద్యర్థములందు ఆదేశముగా వచ్చురూపము. ఈఁడు—మొ. —క్రియా-92.

"ఇచ్చిరి, ఇచ్చితివి, ఇచ్చితిని, ఇచ్చితిమి" అను వాని యందు వచ్చినట్లు "ఈరు, ఈవు, ఈను, ఈము" అను రూపములందు ప్రత్య యోకారమునకు ఇత్వము రాదు. ఇటులే, "శ్రీకి, స్త్రీకి" అనువానియందు వచ్చినట్లు "ఈకు, నీకు, మీకు" అనువానిలో ఉత్వమునకు ఇత్వము రాదు.

అని తెలుపుట యీ సూత్రమునకుఁ దాత్పర్యము. దీనికయి వయి సూత్రమునొద్దఁ జూపఁబడిన యుదాహరణములలో గోచరింపవలసిన శంకలు రెండుగలవు.

మొదటిది :

వ్యతిరేకార్థక లకారమునందుఁగల (లజీ) రూపములు ఆఱింటిలో సంక్షిప్తముగాఁ జూపఁదలంచిన పక్షమున ప్రథమపురుషైకవచనమును మాత్రమే చూపియుండవలయును. అట్లుగాక, సాకల్యముగాఁ జూపఁదలంచినచో, పురుషములు మూఁడింటికిని నొక్కొక్క దానికి రెండేసి వచనములుగా, మొత్తము రూపము లాఱింటిని జూపియుండవలయును. అటుగాక యిటును గాక, నాలుగింటిని జూపనేల ? రెండింటిని విడువనేల ? ఇది సంక్షేప సాకల్య మార్గములలో ఏదియుఁ గాకున్నదే ! పోనిండు ; చూపినవానిలో నయినను ప్రథమ పురుషమున బహు వచనము ; మధ్యమమున ఏక వచనము ; ఉత్తమ పురుషమున ఉభయ వచనములు. ఇందును ఒక క్రమము కానరాదే !

అను నీ శంకకు సూరి చూపులో నిగూఢమయియున్న సమాధానము గమనింపుఁడు.

ఇట రూపము లన్నింటిని సాకల్యముగఁ జూపుటయే యాతని దృష్టి. అందు రెండిటిని చూపఁ బనిలేదని తలంచియే విడిచినాఁడు.

ఇ కారమునకు తు, ను, వు క్రియా విభక్తులు అవ్యవహిత పరము లయినపుడే వాని ఉ కారమునకు ఇత్వము ప్రాప్తించును. "ఈఁడు" అను ప్రథమపురుషైకవచనమున ఇ కారమునకును క్రియావిభక్తికిని నడుమఁ బ్రత్యేక వర్ణమగు నర్ధబిందువుతో వ్యవధాన ముండుటంబట్టి యచట ఇత్వము ప్రాప్తింపనే ప్రాప్తింపదు. ప్రాప్తిలేనిదానిని నిషేధించుట అనావశ్యకము, అసంగతము నను నూహతో దాని నిటఁ జూప కుండెను.

ఇఁక, చూపని వానిలో రెండవది "ఈరు" అను మధ్యమ పురుష బహువచన రూపము. అది ప్రథమ పురుష బహువచన రూపముతో తుల్యమే గావున నదే రూపమును మరలఁ జూపుట పునరుక్తి తప్ప ప్రయోజనము లేదని దానిని జూపకుండెను.

ప్రథమపురుషైకవచనమును, మధ్యమ బహువచనమును విడుచుటలో ఇదీ సూరి యాంతర్యము.

వానిని విడువఁగాఁ దక్కిన రూపములు నాలుగిటికిని జక్కని క్రమము కానవచ్చుచునే యున్నది. కావున మొదటిశంక తొలఁగినది.

ఇఁక రెండవది :

"నీకు, మీకు" అను వానికి "ఈకు" అనునది రూపాంతరము. ప్రధాన రూపములను ముందు చూపి, ఆ పిమ్మట రూపాంతరములను జూపుట క్రమ పద్ధతి. ఆచ్చిక పరిచ్ఛేదమున ఈ సర్వనామశబ్ద రూపములపట్టికలో సూరియు ఆ క్రమమునే యవలంబించి యుండెను. ఇట ఆ క్రమమును మార్చి దానికి విరుద్ధముగా "ఈకు, నీకు, మీకు" అని రూపాంతరమునే ముందు చూపుట యెట్లు సమంజస మగును ?

అను నీ శంకకు సమాధానము యోచింపవలసి యున్నది. ఆ యుదాహరణ క్రమపద్ధతిని మార్చుటకు లోఁతయిన హేతువు గలదు.

ఇట నిర్దేశింపఁబడిన "ఈకు" అనునది యుష్మదర్థములగు నీకు, మీకు అనువాని రూపాంతరము మాత్రమే కాదు.

"ఈ" ధాతువునకు వ్యతిరేక ప్రార్థనమున "ఈకు" (= ఈయకు) అని యొక రూపము గలదు. దాని లోని ఉ కారమునకుఁ గూడ ఇత్వము రాదః

చూపవలసి యున్నది. కావున, "ఈకు" అనుదానిని "ఈ" ధాతు రూపములు చివరను, యుష్మదర్థ రూపముల మొదటను, అనఁగా రెండుజాతుల మధ్యమున నిలిపినచో అటు "ఈ" ధాతు రూపముగను, ఇటు యుష్మదర్థ రూపముగను, నుభయవిధముగాఁ బరిగణింపఁ బడునని సూరితాత్పర్యము.

ఆ దృష్టి యెంత సూక్ష్మమో, యెంత నిగూఢమో గమనింపుఁడు.

ఒక్క పనిచే రెండు ప్రయోజనములు సాధించుట సాధారణమతులకు శక్యము గాదు. చిన్నయసూరి మెలఁకువ లసాధారణములు. ఇట్లుండ

ఉదాహరణ ప్రదర్శనమున సంయితము, సూరి చూపులోఁ గల యిట్టి సూక్ష్మ వివేచనమును గుర్తింపక, కొందఱు వ్యాఖ్యాతలు "ఈకు" అనునది ఒక్క యుష్మదర్థకమే యనుకొని "ఈకున్, నీకున్, మీకున్" అని వీనిని ద్రుతాంతములుగా సవరించి యిటీవల ముద్రించి యున్నారు. ఈ సవరణము మూలమునకు మెఱుఁగు దెచ్చునది కాదు సరిగదా మీఁదుమిక్కిలి దీనిని బట్టి ఈకున్ అని నకారాంతపాఠమే వ్యాప్తమయినచో ఈ తావున "ఈకు" అనునది ఇచ్చు ధాతు వ్యతిరేక ప్రార్థన రూపమను స్ఫురణమునకు మార్గము సమూలము విచ్ఛిన్నమయి, సూత్రకారుని హృదయము మిక్కిలి మఱుఁగువడి యెన్నఁటికిని నెవ్వరికిని గోచరింపకుండునట్టి యనర్థముగూడ సంభవింపఁ గలదు.

కావున, భావి ముద్రాపకులు ఈ రూపముల నిచ్చుట నకారాంతములుగా ముద్రింపకుందురు గాక.

మఱియు, నుదాహరణీయమగు శబ్దము నానార్థకమయినచో, ప్రకృతమునకు ఏ యర్థముగలది లక్ష్యమో, ఆ యర్థమును సూత్రమునందో యుదాహరణము నొద్దనో సూచించు తీరుగూడఁ గొన్నిచోటులందుఁ గానంబడును.

"కద్రువ నాగమాత". —తత్సమ-51.

"పృథ్వీవాచి భూ శబ్దంబునకు భువి యగు." —తత్సమ-62.

"కోపు (= ధనురగ్రము)" కొప్పు. —ప్రకీర్ణక-6.

"తేప (= ప్లవము)" తెప్ప. —ప్రకీర్ణక-6.

ఇత్యాదులు పరికింపుఁడు.

ఇవన్నియు నిటులుండ, ఇందలి యుదాహరణములు లక్షణ సమన్వయ మాత్రప్రయోజనము లయి, సాధారణములుగాక మధురములయి, లలితముగా నుండవలయు నని యీతని ప్రత్యేక సంకల్పము.

"అనయము లలితోక్తులతో
నొనరుపడం గూర్చి లక్ష్య యోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్"

అని తన యభిలాషమును, కుతూహలమును, గ్రంథారంభమున తానే వెల్లడించి యున్నాఁడు. కావ్యరచనమునందువలె వ్యాకరణరచనమున నయితము ఇట్టి లాలిత్యకౌతూహల ముండుట అనితరసాధారణ మగుటచే ముచ్చటతో మెచ్చుకోఁదగిన విశేషము.

ఆ లాలిత్య మెట్టిది? ఎచ్చ టెచ్చటఁ గాననగును? అను విషయ మును వివరించి యిచట గ్రంథవిస్తరము గావింపఁబనిలేదు. "ఉక్తి లాలిత్యము" అను ప్రత్యేక ప్రకరణమున ఆ లాలిత్యము నారసి వినోదింపఁ గలము.

## V. సంజ్ఞలు

శాస్త్రగ్రంథములందు రచనాసంగ్రహముకొఱకు సాంకేతిక మార్గము లును, పారిభాషిక పద్ధతులును, నవలంబింపఁబడుట సంప్రదాయము. అది చదువరులకు మిక్కిలి సౌకర్యము నొదవించును.

బాల వ్యాకరణమునఁ గానవచ్చు సంజ్ఞలలో కొన్ని పాణినీయములు, కొన్ని చింతామణీయములు, కొన్ని అథర్వణీయములు, కొన్ని ప్రాకృతీయ ములు, మఱికొన్ని చిన్నయసూరీయములు.

ఆమ్రేడితము, అవసానము, నామము, విభక్తి, ఉపధ, ఉపోత్తమము, కర్త, కర్మము, ఉపయోగము, నిర్ధారణము, ఆఖ్యాతము, ఆగమము, ఆదేశము, సంప్రదానము, అధికరణము, ప్రథమము, మధ్యమము, ఉత్తమము, గుణము, గతి, ఉపసర్గ, కృత్తు, తద్ధితము, మున్నగునవి పాణినీయములు.

వక్రము, వక్రతమము, పరుషము, సరళము, స్థిరము, సవర్ణము, ద్రుతము, ద్రుతప్రకృతికము, కళ, తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము, సంధి, సంశ్లేషము, వర్ణకము, మహత్తు, ఔపవిభక్తికము, మున్నగునవి చింతామణీయములు.

"సంధి" అను సంజ్ఞ చింతామణిలో విధింపఁబడకున్నను అందు ఆ శబ్దము ప్రయుక్తమయి యున్నది. ఆ సంజ్ఞ అథర్వణ గ్రంథమున వివరింపఁ బడినది. కావున "సంధి" సంజ్ఞ చింతామణీయ మన్నను అనవచ్చును. అథర్వ ణీయ మన్నను అసమంజసము కాదు.

ద్రుతమునకుఁ గలుగు ప్రకృతి భావమునకు స్వత్వ మను సంజ్ఞ అథర్వణ కారికలలో వ్యవహరింపఁబడినది. బాలవ్యాకరణమునఁ బరిగ్రహింపఁబడినది.

శబ్ద పల్లవ సంజ్ఞ అథర్వణీయము. ఆ సంజ్ఞను గొంత విస్తృతము గావించి సూరి తనవ్యాకరణమున మరల విధించియుండెను.

వర్గులలోని సరివర్ణములకు యుక్కులు, యుగ్మములు అనియు, బేసి వర్ణములకు అయుక్కులు, అయుగ్మములు అనియు వ్యవహారము సంస్కృత ప్రాకృత వ్యాకరణము లందుఁ గాననగును. దానిని బట్టియే సూరి "వర్గయుక్కు లని" వ్యవహరించి యుండును.

ఇత్సంజ్ఞ, పాణినీయమున నొక తీరుగను, ప్రాకృత వ్యాకరణములందు వేఱొక తీరుగను విహితమయినది. "హలన్త్యమ్", "ఉపదేశేజనునాసిక ఇత్" మున్నగు సూత్రములచే పాణినీయమున విహితమయిన ఇత్సంజ్ఞ తన ప్రణాళికకు ననుకూలింపదని సూరి సమాలోచించి, దానిని గైకొనక ప్రాకృతీయము ను బరిగ్రహించెను. పాణినీయము, ఏల యనుకూలింపదో తత్సమ 19వ సూత్రమున పరికింపఁగలరు.

తిఙ్మధ్యము, సమాసకము మున్నగు కొన్ని చింతామణీయములగు సంజ్ఞలు తనకు నావశ్యకములు గాక సూరి వాని నుపేక్షించెను.

మఱియుఁ దన రచనలో ఆవశ్యకములని తోఁచిన కొన్నిసంజ్ఞలను దాను క్రొత్తగాఁ గల్పించుకొనెను.

ఆ కల్పించుకొన్న సంజ్ఞలు (1) డుమంతము; (2) త్రికము; (3) ముజ్జు; (4) ముత్తు అనునవి. ఇవి కేవలము చిన్నయసూరీయములు.

సర్వనామసంజ్ఞ పాణినీయమున విహితమయినను అందు "సర్వ, విశ్వ", ఇత్యాదులు సర్వనామములు; ఇందు "అన్ని ఇన్ని" మున్నగునవి సర్వనామములు. ఇట్టి భేద ముండుటచే నిందలి సర్వనామసంజ్ఞ స్వతంత్రమే యనఁదగును.

స్త్రీసమ క్లీబసమ శబ్దములు చింతామణ్యాథర్వణములందు వ్యవహరింపఁ బడినవి. కాని, అవి స్త్రీతుల్య, క్లీబతుల్య, శబ్దములకు పర్యాయములుగా యౌగికములుగాఁ గానవచ్చును. బాలవ్యాకరణమునందట్లుగాక, అవి యోగరూఢములు. సంజ్ఞాప్రాయములు. ఇందు స్త్రీసమ క్లీబసమములు ఆచ్ఛికములు, స్త్రీతుల్య క్లీబతుల్యములు తత్సమములు (సంస్కృతసమములు) అను భేదము గలదు. సూరి స్వయముగాఁ గల్పించిన సంజ్ఞలన్నియు సాధారణములుగాక

సార్థకములయి యుండుట ప్రత్యేకముగా గుర్తింపఁదగిన విశేషము. అదెట్టిదో పరికింపుఁడు.

1. డుమంతము :

"డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు".

—తత్సమ-20.

ప్రథమైకవచనమున "డు" ప్రత్యయము కలుగునట్టి రామ, కృష్ణ మున్నగు ప్రాతిపదికములకు డుమంతము అని పేరు.

డుః అస్య అస్తీతి డు మాన్ = "డు" కలది : డుమంతము.

2. త్రికము :

"ఆ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు."—సమాస-4.

ఆ, ఈ, ఏ అను మూఁడింటికిని త్రికమని పేరు. త్రిక మనఁగా మూఁడిటి సముదాయమేగదా!

3. ముజ్జు :

"మధ్యమ ముడుజ్జులు ముజ్జు నాఁబడు." —క్రియా-31.

"ము, డుజ్" అనువానిలోని ముకారమునకు జకారముతో ప్రత్యాహారముచేసినచో ఏర్పడు ముజ్జు అనునదియే సంజ్ఞగా విధింపఁబడినది.

4. ముత్తు :

"ముజ్జీత్తులు ముత్తు నాఁబడు." —క్రియా-86.

ముజ్, జీత్ అనువానిలోని ముకారమునకు తకారముతో ప్రత్యాహారము చేసినచో ఏర్పడు "ముత్" అనుదానినే సంజ్ఞగాఁ గల్పించెను. ఈ సంజ్ఞల తీరు పరికించినచో సంజ్ఞావిధాన సూత్రము గుఱుతునకు రాకున్నను, సంజ్ఞాపదమును విన్నంతనే దానియర్థము మార్గాంతరమున స్ఫురించునట్లుగా ఈ సంజ్ఞలు కల్పించుటలోని దూరదృష్టి సంతసింపఁదగినది.

పయిని నిరూపించినరీతిని ప్రాచీనసంజ్ఞలలో ననావశ్యకముల నుజ్జగించియు, ఆవశ్యకములలోఁ గొన్నిటిని యథాతథముగఁ బరిగ్రహించియుఁ, గొన్నిటికి నించించుక మార్పులు గావించియుఁ, గొన్నిటిని క్రొత్తగాఁ దానే కల్పించియు, సూరి, ఈ సంజ్ఞా ప్రణాళిక సమకూర్చుకొని యుండెను.

## vi. ఇత్సంజ్ఞలు

వ్యాకరణములందు సంక్షేప కథనమునకు మిక్కిలి యుపకరించునది ఇద్వర్ణ (ఇట్) కల్పనము. ఇద్వర్ణము లనఁగా, ఆగమములకును, ఆదేశము లకును, ప్రత్యయములకును. అనుబంధములుగాఁ జేర్పఁబడు వర్ణములు. యట్, టుక్ ఇత్యాదులందలి ట్, క్ మున్నగునవి.

ఎట్టి ప్రయోజనమునకు ఏ ఇద్వర్ణము చేర్పఁబడినదో వ్యాకరణము వివరించుచుండును.

ఇత్సంజ్ఞా కల్పనముపయి నాధారపడియున్న ప్రక్రియా ప్రసంగములు పాణినీయమున అపారములు. ప్రాకృత వ్యాకరణములందును ఈ పద్ధతి గలదు.

ఆ మార్గము ననుసరించియే చింతామణియందు ఇత్సంజ్ఞారీతి కొంత యవలంబింపఁబడినది. ఎట్లన :

(1) టుక్ : కిత్తు (క్ + ఇ౯) కలకుటమ్ము మొ.

(2) నుమ్ : మిత్తు (మ్+ఇత్) రాజునాజ్ఞ మొ.

(3) డా : డిత్తు (డ్ + ఇ౯) ఆత్మ మొ.

(4) డుజ్ : జిత్తు (జ్ + ఇత్) రాముండు మొ.

కి_త్త్వము, మి_త్త్వము, డి_త్త్వము, జి_త్త్వము అను నీ నాలుగు మాత్రమే చింతామణిరచనలోఁ గైకొనఁబడినవి.

వీనిలో జిత్తు బిందుపూర్వక మగుట పాణినీయ పద్ధతి కాదు. అది ప్రాకృతీయానుసారముగా నేర్పఱుచుకొన్నది.

తక్కిన కి_త్త్వ, మి_త్త్వ, డి_త్త్వములు పాణినీయానుసారులు.

చింతామణిలోని పయి నాలుగిటిలో చిన్నయసూరి కి_త్త్వ, జి_త్త్వము లను మాత్రమే పరిగ్రహించెను. మి_త్త్వ, డి_త్త్వములను పరిత్యజించెను. ఈ రెండిటిని సూరి విడుచుటకుఁ గారణము గలదు. ఎట్టి దన :

"కలకుటమ్ము, రాజునాజ్ఞ" అనువానిలో మొదటిదానిలో టుగాగమమును (టుక్), రెండవదానిలో నుమాగమమును (నుమ్) చింతామణి విధించినది.

చివర వచ్చునని తెలుపు చిహ్నము కి_త్త్వము. కావుననే కలకుటమ్ము అనుచో "టు" అను నాగమము "కలకు" అనుదానికి చివర వచ్చినది. ఇటులే రాజునాజ్ఞ అనుచో "ను" అను నాగమము గూడ "రాజు" అనుదానికి చివరనే

రావలసియున్నది. కావున దానికిఁ గూడ కిత్త్వమునే సంఘటించి "నుక్" అని నిర్దేశించి ప్రక్రియను నిర్వహించుట సమంజసము. ఒకే ప్రయోజనమునకు రెండు గుఱుతులు కల్పించుట యెంతమాత్రమును నావశ్యకము కాదు, సముచితమును కానేరదు.

పాణినీయమునఁ గొన్నిటిని "కిత్తులు" గను, గొన్నిటిని "మిత్తులు" గను నిర్దేశించుటకు వేఱు కారణము గలదు. అందు కిత్త్వ మిత్త్వములకు వేఱువేఱు ప్రయోజనములు గలవు.

"ఆద్య న్తౌ టకితౌ"; "మిదచో న్త్యాత్ పరః."

కిత్తు ఆగమికి అంతావయవముగా వచ్చును.

మిత్తు ఆగమియందున్న అచ్చులలో తుదియచ్చునకు అంతావయవముగా వచ్చును.

"యశస్" అను దానికి నుక్కు వచ్చినచో "యశస్+న్" అగును.

నుమ్ము వచ్చినచో "యశన్+స్" అగును.

ఎంతో భేదమున్నది. హలంత శబ్దములలోనే యిట్టి భేదము గలుగును. అజంత శబ్దమునకు నుక్కు వచ్చినను నుమ్ము వచ్చినను వచ్చెడుచోటు ఒక్కటే గావున రూపసిద్ధిలో భేదముండదు. సంస్కృతమున హలంత శబ్దములు వేనవే లుండుటచే నుక్, నుమ్ అను భేద కల్పనము పాణినీయమున ఆవశ్యక మయినది. తెలుఁగున హలంత శబ్దములు లేకుండుటచే ప్రక్రియలో నిట్టి భేదమునకు ప్రసక్తియే లేదు.

హలంత శబ్దములకుఁగా సంస్కృత వైయాకరణులు ఏర్పఱుచుకొన్న మిత్త్వము తెలుఁగువ్యాకరణములకు లేశమాత్రమును సంబంధించునది కాదనియు, చింతామణికారులు పాణినీయమునఁగల యీ మిత్త్వకల్పనమును సామాన్య దృష్టితో పరిగ్రహించి యుందురనియు, ఇది పరిత్యాజ్యమనియు, వివేచించి సూరి మిత్త్వమును విడిచిపెట్టెను.

ఇఁక డిత్తుల విషయము :

పాణినీయమున డిత్త్వమునకును, భ సంజ్ఞకును గాఢమగు సంబంధము గలదు.

భ సంజ్ఞ కలదానికి డిత్తు పరమగుచో టి లోపము కలుగునని సంస్కృతమున విధింపఁబడి యున్నది. "భ సంజ్ఞ" అన నెట్టిదో దాని పేరే తలపెట్టని

తెలుఁగు వ్యాకరణమునందు దానితో సంబంధించిన డిత్త్వమును గల్పించుట ఉచితము కాదు.

అని యాలోచించి యీ డిత్త్వమును గూడ పరిత్యజించి, చింతామణి సాధితములగు "ఆత్మ" మున్నగు శబ్దములను సరళమగు వేఱు విధమున సాధించియుండెను (చూ.: తత్సమ-67, 77).

చింతామణీయములగు మిత్త్వ డిత్త్వములను పరిత్యజించుటయు, చింతామణిలోఁ గానరాని టిత్త్వమును, జీత్త్వమును, షిత్త్వమును క్రొత్తగాఁ గల్పించుకొనుటయు, సూరి ప్రణాళికా నిర్మాణ కౌశలమునకు సూచకములు కాఁగలవు.

మొత్తము బాలవ్యాకరణమున విహితములయిన ఇద్వర్ణ సహితములు టిత్తులు, కిత్తులు, జిత్తులు, జీత్తులు, షిత్తులు అని అయిదు విధములు:

i. టిత్తులు : 3

1. యట్; 2. లట్; 3. ఇయుట్.

ii. కిత్తులు : 23

1. ను‌క్; 2. టుక్; 3. రుక్; 4. అలిక్; 5. వుక్: 6. నిక్; 7. నక్: 8. ఆరక్: 9. ముక్; 10. ఉక్; 11. అవక్: 12. ఇక్; 13. దుక్; 14. ఎదక్; 15. ఎడుక్; 16. ఎడిక్; 17. ఇంచుక్; 18. అయుక్; 19. అవుక్; 20. అరుక్; 21. చుక్; 22. వుక్; 23. గుక్.

iii. జిత్తులు : 5

1. డుజ్; 2. కుజ్; 3. గుజ్; 4. వజ్; 5. తజ్.

iv. జీత్తులు : 11

1. లజీ; 2. కలజీ; 3. పడుజీ; 4. కుజీ; 5. వుజీ; 6. రుజీ; 7. కజీ; 8. మిజీ; 9. నుజీ; 10. నిజీ; 11. నజీ.

v. షిత్తులు : 3

1. డుష్: 2. రుష్; 3. వుష్.

ఈ షిత్త్వమునకు కార్యవిధానములపట్ల ప్రయోజనము లేదు. పయిని జూపిన డుష్, రుష్, వుష్ అనుచోటులందు ప్రత్యాహారములకొఱకు మాత్రమే యిది కల్పింపఁబడినది.

## vii. పరిభాషలు

పాణినీయమున పరిభాషలనునవి చాలవఱకు వ్యవహార ప్రసిద్ధములగు లౌకికన్యాయముల ననుసరించియే కల్పింపఁబడినవి. 'పరితః భాష్యన్తే ఇతి పరిభాషాః' అనఁగా లోకమునఁ దఱుచుగా వ్యవహరింపఁబడునట్టివి గావున వీనికి పరిభాషలని పేరు. లోక న్యాయముల ననుసరించియేగాక యితర మార్గములనుబట్టి కల్పింపఁబడినవిగూడఁ గొన్ని గానంబడును. వానిలో

| | | |
|---|---|---|
| ఆద్యన్తౌ టకితౌ. | —బాల-సంధి-3, | 25. |
| నిరవకాశా హి విధయ స్సావకాశాన్ విధీన్ బాధన్తే. | ,, ,, | 9. |
| అసిద్ధం బహిరఙ్గ మన్తరఙ్గే. | ,, ,, | 12. |
| అలోన్త్యస్య. | ,, ,, | 43. |
| సిద్ధే సత్యారభ్యమాణో విధి ర్నియమాయ భవతి. | ,, ,, | 49. |
| సన్నియోగ శిష్టానాం సహవా ప్రవృత్తి స్సహవా నివృత్తిః. | ,, | తత్సమ-43. |
| ప్రత్యయ గ్రహణే తదన్తస్యాపి గ్రహణమ్. | ,, ,, | 67. |
| యదాగమాః తద్గుణీ భూతాః తద్గ్రహణేన గృహ్యన్తే. | ,, | సమాస-25. |
| సహచరితాసహచరితయోః సహచరితస్యైవ గ్రహణమ్. | ,, | క్రియా-12. |
| పర నిత్యాన్తరఙ్గాపవాదానా ముత్తరోత్తరం బలీయః. | ,, ,, | 50. |
| జ్ఞాపక సిద్ధం న సర్వత్ర. | ,, ,, | 65. |
| యేన నావ్యవధానం తేన వ్యవహితేపి. | ,, ,, | 80. |
| అనేకాల్ శిత్ సర్వస్య. | ,, ,, | 91. |

మున్నగు పరిభాషలు కొన్ని బాలవ్యాకరణ ప్రక్రియలో పరిగ్రహింపఁబడినవి. వీని యావశ్యకత యెట్టిదో వీని నుపయోగించుకొనుటవలన ప్రక్రియా సమన్వయమున నెట్టి సౌకర్యము కలిగినదో ఉత్తర భాగమున నాయా సూత్రములయొద్ద వివరింపఁబడును.

## viii. వార్తికములు

సూత్రములు ప్రధానాంశములను బోధింపఁగా శేషించిన మఱికొన్ని యంశములను పూరించునవి వార్తికములు. విషయ బోధనమునందును, ప్రామాణికతయందును వార్తికములుగూడ సూత్రములతో తుల్యములే. కాని యివి సూత్రములందలి విషయములను సవరించుటకో, వివరించుటకో వాక్య

రూపముగా రచింపఁబడియుండుటవల్లను, సూత్రములకు నుండవలసిన రచనాపటుత్వము వీనిలో లేకుండుటవల్లను, వీనికి సూత్రములను వ్యవహారము లేదు. కావుననే పాణినిసూత్రములకు వార్తికములు రచించిన వరరుచి మహర్షికి వాక్యకారుఁడనియే వ్యవహారము. సూత్రములందు ప్రతిపాదితమయిన విషయములకుఁ గొలఁది మార్పునో, చేర్పునో తెలుపుటకు మాత్రమే రచింపఁబడు ఈ వార్తికములలో బహులక్ష్య సాధకములగు సూత్రములందుఁబలె నంతటి బంధపటుత్వము తెచ్చుట కవకాశము తక్కువ. అది వీనిలో నావశ్యకము గాదు. కావుననే పాణినీయమున వార్తికములన్నవి వాక్యరూపములుగనే వెలసియున్నవి.

'వర్తయన్తి (ప్రవర్తయన్తి) కార్య విశేషాన్ ఇతి వార్తికాని.' అనఁగా సూత్రములందు విధింపఁబడిన కార్య విశేషములను ప్రవర్తింపఁజేయునవి గావున వీనికి వార్తికములను వ్యవహారము కలిగియుండవచ్చును.

పాణినీయసూత్రములకు వరరుచియేగాక పాణిని తానె రచించియుంచిన వార్తికములను కొన్నిగలవు. కాని వానిని వార్తికములనక సూత్రములుగనే పరిగణింతురు. వరరుచిరచితములయిన వార్తికములుగూడ నుండుటచే వానితో వీనికి సాంకర్యము కలిగి యేవి వరరుచీయములో యేవి పాణినీయములో వివేచించుకొనుట కష్టమని ప్రాఁచీనులు పాణినీయవార్తికములను వార్తికములుగా పృథక్కరింపక సూత్రములుగనే పరిగణించినారు. ఆ వార్తికములందలి విశేషములు పాణినికే స్ఫురించినపుడు, ఆ విశేషములనుగూడ నా యా సూత్రములందే సంఘటింపక వేఱుగా వార్తికరూపమున రచింపనేలయని శంకింపరాదు. అట్టి విషయములనుగూడ సూత్రములందె కూర్చినచో సూత్రముల కుండవలసిన బింకము చెడి శైథిల్యము సంభవించును. ఇట్టిదృష్టితోడనే ఆ విషయములను సూత్రములందు ఘటింపక

"అన్యేభ్యోపి దృశ్యతే."

(మఱి కొన్నిటికంటెను ఈ కార్యము గనంబడును.)

"అన్యేషా మపి దృశ్యతే."

(ఈ కార్యము ఇతరములకును గానంబడును.)

"అన్యేష్వపి దృశ్యతే."

(ఇతరములు పరమగునపుడును ఇక్కార్యంబు చూపట్టును.)

మున్నగు రీతిని పాణిని వాక్యరూపముగ రచించి యుండెను. ఇవి వార్తికములె యయినను పయిని జెప్పిన రీతిని వరరుచీయ వార్తికములతో వీనికి సాంకర్యము లేకుండుటకయి పాణినీయసూత్రములందే చేర్పఁబడి సూత్రములుగనే లెక్కింపఁబడుచున్నవి.

ఈ రీతిగనే చిన్నయసూరియు నచ్చటచ్చట నొక్కొక సూత్రము వ్రాయు సందర్భమున నా సూత్రపువిధానమునకు సంబంధించిన విశేష మేదేని తనకు స్ఫురించినయెడ నచ్చటనే యొక వార్తికము రచించి యా విశేషమును సూచించుచు వచ్చెను. ఇట్టివి బాలవ్యాకరణమున, పది పండ్రెండు వార్తికములు రానవచ్చును. విశేషాంశ ప్రతిపాదకములగు మఱికొన్ని వాక్యము లచ్చటచ్చటఁ గలవుగాని, అవి సూత్రములందలి బహుళము, విభాష, తఱుచు, ప్రాయికము మున్నగు శబ్దములకుఁ బ్రయోజనములను వివరించునవి యగుటచే, ఆ విశేషములు సూత్రములచేతనే సంగ్రహింపఁబడినట్లు తలంపవలయునుగాని ప్రత్యేక వార్తికములుగా వానిని దలంచుట సమంజసము కాదు. సూత్రాక్షరము లందు నెట్టి సూచనయు లేని విశేషములను క్రొత్తగా ప్రతిపాదించు వాక్యములు మాత్రమే వార్తికములుగా భావించుట సముచితము. సూత్రములు కాకున్నను ఈ వార్తికములకు ప్రామాణ్యమున నెట్టికొఱంతయు నుండదు. కొఱంత లేకుండుటయ గాదు. సూత్రములకంటె వార్తికములకే యధిక ప్రామాణ్యము నొసంగుటగూడ శబ్దశాస్త్ర సంప్రదాయము.

ఆ వార్తికములు పరికింపుఁడు :

1. రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి. —సంజ్ఞా-10.
2. ఈ కార్యము కళలగు క్రియాపదములమీఁద సహితము కానం బడియెడి. —సంధి-13.
3. ఈ యాగమం బొకానొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానం బడియెడి. —సంధి-25.
4. కెంధూళి, కెంజడలని ప్రయోగంబులు కానంబడియెడి. —సంధి-38.
5. ఈ కార్యము కర్తృవాచి ముపర్ణకమునకుఁ గలుగదు. —సంధి-46.
6. ఈ కార్యము లాఁతిచో సహితము గనంబడియెడి. —సంధి-51.
7. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడు వర్ణ మిత్తు నాఁబడు. —తత్సమ-19.
8. దయాళుశబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి. —తత్సమ-38.
9. కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు. —ఆచ్ఛిక-36.
10. ముచ్చోటులు, ముచ్చటులు, ముచ్చొటులు అను రూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి. —సమాస-15.
11. వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడును. —క్రియా-22.
12. ఈయ యను నాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి.—క్రియా-92.

బాలవ్యాకరణమున సూత్రకారుఁడే వృత్తికారుఁడు; వృత్తికర్తయే ఉదాహర్త; ఉదాహర్తయే వాక్యకర్త. ఇట్లు సూత్రములు, వృత్తులు, ఉదాహరణములు, వార్తికములు అన్నియు నేకకర్తృకములే యగుటచే ప్రామాణ్య విషయమున వానికి భేదముండుట కవకాశము లేదు. కావున సూత్రములతో పాటు వృత్త్యుదాహరణములను, తక్కిన వాక్యములను, తుల్యప్రమాణములు గనే పరిగ్రహింపవలసి యుండును.

## ix. గణములు

వ్యాకరణమున, ఏదేనొక కార్యము పెక్కు శబ్దములందుఁ గలుగునని నిరూపింపవలసినపుడు, వాని నన్నిటిని వేర్వేరుగ కుండ సంక్షేపించుటకయి యట్టి శబ్దములన్నిటిలో అనుగతమగు ధర్మము (common factor) నొకదానిని గుర్తించి, దానిని జేర్కొని, ఒక్క శబ్దముతోనె వానినెల్ల బోధించురీతి యవలంబింపఁబడును. ఎట్లన

శంభువు, విష్ణువు, పశువు, ధేనువు, మధువు, మృదువు మున్నగు పెక్కు శబ్దములకు "వు" ప్రత్యయము కలుగుచున్నది. ఈ శబ్దములన్నియు ఉకారాంతములయి కానవచ్చుచున్నవి. ఉకారాంత శబ్దములన్నిటికిని "వు" ప్రత్యయము తప్పక కానవచ్చుచున్నది అని గుర్తించి "ఉకారాంతములకు వు ప్రత్యయమగు" నని సూత్రించినచో "ఉకారాంత" శబ్దముచే వేనవేల శబ్దములు గృహీతములయి వు ప్రత్యయ విధానమునకు సంక్షేపమార్గ మేర్పడును.

ఈ రీతిని సంగ్రహించి నిర్దేశించుటకు ననుగతమగు ధర్మ మేదియుఁ గుదురుపడని చోటులందు ఆ శబ్దములన్నింటిని నొక రాశిగాఁ జేర్చి, యందొక శబ్దమును ప్రముఖముగా నెంచుకొని, అట్టి శబ్దసముదాయములకు సర్వాదులు, గర్గాదులు మున్నగు పేరులు కల్పించుకొని, గణములను నేర్పఱచుకొందురు. ఇది సంస్కృతవ్యాకరణములందు క్షుణ్ణమయిన మార్గము. ఇట్లే, తెలుఁగు వ్యాకరణములందును గణకల్పనము కానవచ్చును.

చింతామణిలో

కిమాది; అహమాది; నమఆది; టింట్యాది; విధాత్రాది; ఏకాది; సురాది; కుశాది; దారాది; గుణవద్గణ; పయఃప్రభృతి; వృషణ్వాది; భూజ్యాది; రంజివస్యాది

అని సుమారు పదునాలుగు గణములు పేర్కొనఁబడినవి.

అథర్వణాచార్యులును వికృతివివేకమున

సురాది, చరితాది, విధాత్రాది, వనాది, ధర్మాది

అను కొలఁది గణములను మాత్రము పేర్కొనిరి. అందు సురాది, చరితాది, చిత్రాదులు, చింతామణిలో నిర్దిష్టము లయినవే. తక్కినవయినను గణవిశేషములుగా నెన్నఁదగినంతటివి కావు.

చింతామణ్యథర్వణీయములను జోడించి వ్యాఖ్య రచించిన యహోబల పండితుఁడు తత్తద్గణ పాఠ్యములగు శబ్దములను మఱికొన్నిటిని తన కవిశిరోభూషణమున నిర్దేశించియుండెను.

సూరి చింతామణ్యాథర్వణములను, కవిశిరోభూషణమును బరిశీలించి, వానియందలి కిమాది, ఏకాది, కుశాది, దారాది అను గణములను, ఏమ్యాది, మగాది, చరిత్రాది, అల్వాది అను పేరులతో గ్రహించి, తక్కినవి తన ప్రణాళికలో గణములుగా నావశ్యకములు కాకుండుటచే వానిని విడనాడి, క్రొత్తగణములను సుమారు ఎనుబదియయిదింటిని తాను కల్పించి తన ప్రక్రియ సాగించుకొనెను.

బాలవ్యాకరణమున సుమారు తొంబది గణములు చూపట్టును. ఈ గణములలోని శబ్దములక్రమము చదువరులకు శ్రుతిరంజకమయి యుండవలయునని యాతని ప్రధానలక్ష్యము. శ్రావ్యత చెడకుండునంతవఱకు అకారాది క్రమముగూడఁ బాటింపఁబడుచుండును.

ఈ గణములలోఁ గొన్ని సమగ్రములు. అనఁగా, నాతఁడు గణమునఁ బేర్కొన్నవి దప్ప మఱి యితర శబ్దములను వానిలోఁ జేర్పనక్కఱలేదని యాతని నిశ్చయము. అట్టిచోట్ల గణముతుదిని "ఇత్యాదులు" అనక "ఇవి యాల్వాదులు" అని యిట్లు నిర్దేశించి స్పష్టపఱుచుట గలదు. బాలవ్యాకరణము మొత్తమున నట్టి సమగ్ర గణములు ఈ క్రిందివి పది మాత్రమే చూపట్టును :

1. అంద్వాదులు (సంధి-44)
2. అన్వాదులు (క్రియా-55)
3. అన్నిప్రభృతులు (ఆచ్ఛిక-24)
4. అప్పాదులు (క్రియా-79)
5. అజ్జు మొదలగునవి (ఆచ్ఛిక-34)
6. ఆల్వాదులు (ఆచ్ఛిక-11)
7. ఇఁకాదులు (సంధి-9)
8. కలన్వాదులు (ఆచ్ఛిక-18)
9. నామ్యాదులు (సమాస-19)
10. పద్వాదులు (క్రియా-51).

ఇఁకఁ దక్కిన యసంపూర్ణములలోఁ గొన్ని ఆకృతిగణములు; కొన్ని సాధారణగణములును.

గణముల తుదిని "ఆకృతి గణము" అను విశేష నిర్దేశముగాని, "ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది" అను విశేష సూచనముగాని చేయఁబడిన గణములలో క్రొత్త శబ్దములు చేర్చుకొనుటలో నెక్కుడు జాగరూకత యావశ్యకమని యాతని హెచ్చరిక గోచరించును.

తక్కిన సామాన్య గణములలోఁ గార్యసాదృశ్యమునుబట్టి ప్రసిద్ధములును, ప్రామాణికములు నగు శబ్దములను విరివిగాఁ జేర్చుకొనవచ్చునని యాతని తాత్పర్యము.

ఆ తాత్పర్యము ననుసరించియే తత్తద్గణములందుఁ జేర్చుకొనఁదగినవిగా స్థూలదృష్టికి తోఁచిన మఱికొన్ని శబ్దములు చేర్చి ఈ గ్రంథముతుది ననుబంధముగా నొక పట్టిక చూపఁబడును. ఆ గణశబ్ద సూచిక పరికింపునది.

## X. కార్య విధానములు

బాలవ్యాకరణసూత్రములందు ఆగమములు, ఆదేశములు, అతిదేశములు, లోపములు మున్నగు కార్యములు విధింపఁబడురీతులు ఎన్నివిధముల నున్నవి? ఆ సందర్భములందలి విభాషా వైకల్పిక శబ్దముల వ్యవహారమునందు సూరిదృష్టిలోఁ దారతమ్యము గలదా? ఈ సందర్భమున పాణినీయపరిపాటి యెట్లున్నది? అను వివేచనము ఈ ప్రకరణమున ప్రధాన విషయము.

బాలవ్యాకరణమున "సంధియగును" మున్నగు రీతిని "అగును" అను శబ్దముతో మాత్రమే విహితమయిన కార్యములు పెక్కులు గలవు. అవన్నియు నిత్యములనియే తాత్పర్యము. అట్టివేగాక

| | | |
|---|---|---|
| 1. నిత్యములు | 4. సార్వత్రికములు | 7. వైభాషికములు |
| 2. బహుళములు | 5. క్వాచిత్కములు | |
| 3. ప్రాయికములు | 6. వైకల్పికములు | |

అని ఆఱునొక్క విధముల విశేష నిర్దేశములతోఁగూడఁ గొన్ని కార్యములు విధింపఁబడియున్నవి. ఈ ఆఱునొక్క విధములలో—

1. నిత్యములు : 6.

"నిత్యముగా" అను విశేషణము లేకుండ "అగును" అని యింత మాత్రమే యున్నను ఆ కార్యము నిత్యమనియే యర్థము. అయినను నాఱు స్థలములందు మాత్రము వేఱుకారణములచేఁ బ్రత్యేకముగా నిత్యశబ్దమును బేర్కొనవలసివచ్చినది. ఆ కారణములు ఉత్తర భాగమున సమీక్షలో నా యా సూత్రములయొద్ద వివరింపఁబడును.

చూ.: తత్సమ-24, 49, 60; ఆచ్ఛిక-14, 18; క్రియా-59.

2. బహుళములు : 40.

కొన్ని చోటులందు నిత్యముగాఁ బ్రవర్తించుట, కొన్నిచోట్ల అసలే ప్రవర్తింపకుండుట, చాలచోటులందు వికల్పముగాఁ బ్రవర్తించుట, ఒక్కొక

చోట ప్రకృతసూత్రముచే విధింపఁబడిన కార్యమేగాక ఆ లక్ష్యములందు ఇష్ట రూపసిద్ధికి ననుగుణమగు నితరకార్యముగూడ వచ్చుట, అని యీ నాలుగును బహుళశబ్దమున కర్థములు.

ఈ నాలుగర్థములును లక్ష్యములందు సంపూర్ణముగా సూరియే సమన్వయించి చూపిన సూత్రము బాలవ్యాకరణమున నొక్కటి మాత్రమే గలదు (సంధి-36). తక్కిన చోటులందు రెండుగాని, మూఁడుగాని యర్థములు ప్రయోగానుకూలముగాఁ బరిగ్రహింపఁబడును. అన్యకార్యము గలుగుట యనుసంశము మిక్కిలి యరుదు. వికల్పార్థము అన్నిలక్ష్యములందును సమన్వయించును.

మొత్త మీ నలువదింటిలో వికల్పార్థమునుగాక, అర్థాంతరమును బహుళశబ్ద ప్రయోజనముగా సూత్రకారుఁడు సూచించిన తావులు పదునాఱు మాత్రమే గలవు. తక్కిన యిరువది నాలుగిటిలో వికల్పార్థ మొక్కటియ ప్రదర్శింపఁబడును. ఆ సూత్రములందు బహుళశబ్ద విశేషార్థమును దాను నిరూపింప కున్నను బ్రయోగములనుబట్టి యావశ్యకములని తోఁచినచోఁ దక్కిన యర్థములను ననుసంధించుకొని యిష్టరూపములను సాధించుకొనవచ్చునని సూత్రకారుని తాత్పర్యము.

బహూన్ అర్థాన్ లాతి గృహ్ణాతీతి బహులమ్.
(అనేకములగు నర్థములను గ్రహించునది కావున బహుళము.)

"ద్వన్ద్వ మనోజ్ఞాదిభ్యశ్చ" అను పాణినిసూత్రముచే భావార్థమున "వుఞ్" ప్రత్యయము విహితమైనది. మనోజ్ఞాదులలో "బహుల" శబ్దము పఠితమయియున్నది.

బహులస్య భావః బాహులకమ్ = బహులత్వమ్.
(బహుళముయొక్క భావము బాహుళకము = బహుళత్వము.)

మనోజ్ఞముయొక్క భావము మానోజ్ఞక మయినట్లుగనే, బహుళముయొక్క భావము బాహుళక మయినది.

బహుళ శబ్దము విశేషణము.
బాహుళక శబ్దము విశేష్యము, భావార్థకము.
"ఈ విధానము బహుళ మగుటచే" అనవచ్చును.
"ఈ విధానము బాహుళక మగుటచే" అనరాదు.
"ఈ విధానముయొక్క బాహుళకముచే" అనవలయును.

"చతుర్విధం బాహులకం వదన్తి", "బాహులకం తు సమాసపద్భావస్య" మున్నగు సంస్కృత ప్రయోగములందు బాహులకశబ్దము భావప్రత్యయాంతమే.

వెలయాల్యాదుల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది (సంధి-4). "బాహుళకమువలన దర్వ్యాదులకు ములోపంబు నిత్యంబు" (తత్సమ-58) మున్నగు రీతిని బాహుళకశబ్దము బాలవ్యాకరణమున తొమ్మిది చోటులందు ప్రయుక్తమయినది. అంతటను భావార్థకమే.

చూ.: సంధి-4; తత్సమ-58; కారక-22, 24; సమాస-14; క్రియా-73, 74, 76, 117.

ఇది సహజముగా ధర్మవాచకమయినను పైకి ధర్మిగా గోచరించును. దీని రూపము భ్రామకముగా నున్నది. ఇది ధర్మివాచకమని భ్రాంతులయి "ద్విత్వంబు బాహుళకంబు", "చింతామణిసూత్రము బాహుళకము" అని విశేషణముగా దీనిని ప్రయోగించినవారు వ్యాఖ్యాతలే కొందఱు గలరు. అనుభవశాలులనే యిట్లు భ్రమింపఁజేసెనే యింక బాలుర కెంతగా భ్రమ కలిగించునోయని దీని స్వరూపము నింతగా వివరింపవలసి వచ్చినది.

3. ప్రాయికములు: 12.

ఈ కార్యముల ప్రాచుర్యము "తఱుచుగా", "ప్రాయికంబుగా" అను శబ్దములచే నిర్దేశింపఁబడినది. నూటికి, ఎనుబది తొంబది శబ్దములలోఁ బ్రవర్తించు కార్యములు ఈ తీరులో నిరూపింపఁబడినవి. ఈ ప్రాయికాది శబ్దములవలన నుద్దేశింపఁబడిన ప్రయోజనములు కొన్నిసూత్రములయొద్ద సూత్రకారునిచే వివరింపఁబడినవి. తక్కిన తావులందలి ప్రయోజనములు చదువరుల యూహకు విడువఁబడినవి.

వివరణముగల చోటులు: సంధి-10; ఆచ్ఛిక-2; కారక-6, 33; సమాస-3; క్రియా-89.

వివరణములేని చోటులు: ఆచ్ఛిక-29, 31; కారక-11, 25; సమాస-7, 18.

4. సార్వత్రికములు: 2.

ఈ కార్యములు "అంతట", "ఎల్లచో" అను శబ్దములచే నిర్దేశింపఁబడినవి. "సర్వత్ర", "ఎల్లయెడల" అను శబ్దములుగూడ కొన్నిసూత్రములందుఁ గలవుగాని యా విధులు వైభాషికములు. సార్వత్రికములు కావు. ఈ నాలుగు శబ్దముల ప్రయోజనము ఆ యా సూత్రములందు నుత్తరభాగమున వివరింపఁబడును.

"అంతట" : తత్సమ-48; "ఎల్లచో" : ఆచ్ఛిక-15 ; "సర్వత్ర" : తత్సమ-23 ; "ఎల్లయెడల" : సమాస-10.

5. క్వాచిత్కములు : 18.

ఈ కార్యముల వైరళ్యము "కొన్నింటికి, కొండొకవానికి, కొండొకచో, కొన్నియెడల, ఒకానొకచో, ఒకానొకండు" అను శబ్దములచే నిరూపింపఁబడినది.

ఈ విశేష కార్యములు పదునెనిమిదింటిలో అతి విశేషములనెడి దృష్టితోఁ గాఁబోలును మూఁడిటికి మాత్రము సూత్రములందేగాక వివరణమునందును పునఃపరామర్శము గలదు. అట్టి పరామర్శము తత్సమ-43, ఆచ్ఛిక-17, సమాస-6 సూత్రములలోఁ గానంబడును.

6. వైకల్పికములు : 9.

భావాభావ పక్షద్వయముగల యీ కార్యములు "వైకల్పికముగానగు, ఒండెనగు" అని రెండు తీరులుగా విధింపఁబడినవి. కార్యమువచ్చిన రూప మొకటియు, రానిరూప మొకటియు, రెండు పక్షములును లక్ష్యములలోఁ బ్రదర్శింపఁబడుచుండును.

చూ. : సంజ్ఞ-14; సంధి-2, 5, 6; తత్సమ-10, 60; క్రియా-59; ప్రకీర్ణక-4, 6.

7. వైభాషికములు : 72.

ఈ కార్యములన్నియు "విభాషనగు" అని యిట్లు విభాషాపద నిర్దేశముతో విధింపఁబడినవి. ఈ డెబ్బది రెండింటిలో "వ్యవస్థిత విభాషచే నీ ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు" అని విభాషా శబ్దమునకు వికల్పార్థమునేగాక నిషేధ రూపమగు విశేషార్థమునుగూడ స్పష్టముగా వివరించిన చోటొక్కటి మాత్రమే గలదు. అది సంధిపరిచ్ఛేదమున ముప్పది యేడవ సూత్రము. ఇట్లు వ్యవస్థితమయిన యీ విభాష, సంధి పరిచ్ఛేదమున పదునేడవ సూత్రము నందరిది.

ఇంకొక్కచో, [పద్వాది సూత్రము—సంధి-46] "ఈ కార్యము కర్తృవాచి మువర్ణకమునకుఁ గలుగదు" అని యొక సూచన గలదు.

ఈ సూచనా వాక్యమున విభాషాపద నిర్దేశము లేకుండుటచే ఈ యర్థవిశేషము, ఆ సూత్రమందలి విభాషాపదమునుబట్టి లిఖించినదో, లేక స్వతంత్రముగా సూచించినదో నిర్ణయింప వలనుపడదు.

ఏమయినను నొకచోట సుస్పష్టముగను, వేఱొకచోట అస్పష్టముగను విభాషాపదమునకు వికల్పార్థమేగాక, నిషేధ రూపమగు మఱొక యర్థ విశేషము గూడ నిరూపితమయినట్లు గోచరించుచున్నది.

దీనినిబట్టి విభాషాశబ్దమునకు వికల్పమేగాక నిషేధరూపమగు నర్థముగూడఁ గలదనియు, వైకల్పిక శబ్దమునకట్టి నిషేధార్థము లేకుండుటచే విభాషా వైకల్పికములకు మిక్కిలి భేదము గలదనియు, నొక సిద్ధాంతముగాఁ గొందఱు తలంచుట కలదు.

“నవేతి విభాషా” (=నిషేధ వికల్పయోః విభాషా సంజ్ఞా స్యాత్) అను పాణినిసూత్రమున విభాషా శబ్దమునకు నిషేధార్థముగూడ ప్రత్యేకముగా నున్నట్లు కానవచ్చుచుండుటయు. నిట్టి తలంపునకు దోహదమగుచున్నట్లు తోఁచుచున్నది.

విభాషా పదము పాణినీయమునుండి గ్రహింపఁబడినదేగావున, ఆ వ్యాకరణమున దీని వాడుక యెట్లున్నది? అందు “వా, అన్యతరస్యామ్” మున్నగు వికల్పార్థకములగు నితర పదములకును, విభాషాపదమునకును నర్థ భేదము గలదా? ఉన్నచో నెట్టిది? లేనిచో “నవేతి విభాషా” సూత్రమున నిషేధార్థ నిరూపణ మెట్లు కుదురుపడును? అని పరిశీలించినచో ఈ విభాషా స్వరూపము తేటపడఁగలదు.

తఱచి చూచినచో పాణినీయమున విభాషా వికల్పములకు భేదము లేశమును గోచరించకున్నది. అందు వికల్పార్థకములగు “వా, అన్యతరస్యామ్, ఉభయథా, ఏకేషామ్” మున్నగు పదములన్నియు విభాషకు పర్యాయ పదములుగా వ్యవహరింపఁబడినవి. ఈ శబ్దములతో విధింపఁబడిన కార్యములన్నిటిని విభాషా విధులనియే వారు వ్యవహరించియున్నారు. మఱియు “విభాషితం విశేషవచనే” అను సూత్రమున “విభాషితం” అనుదానికి “వా” అని అర్థమును నిర్దేశించియు నున్నారు. విభాషకు వ్యవస్థ కల్పించుట విభాషాపదమున్నచోటులందెగాక, తత్పర్యాయ పదములగు “వా” మున్నగు తక్కిన శబ్దము లున్నచోట్లఁగూడ ధారాళముగాఁ గానవచ్చుచున్నది. మఱియు, వ్యవస్థ యనునది నిషేధ రూపముగనే యుండవలయునను నియమము లేదు. విధిముఖముగాను నుండవచ్చును.

> “క్వచిద్ భవతి త్యంశఏవ ప్రవర్తతే. క్వచిత్తు నభవతీత్యంశఏవ. క్వచిదుభయమ్. ఇత్యేవం లక్ష్యానుసారేణ వ్యవస్థయా ప్రవృత్తా విభాషా వ్యవస్థిత విభాషా”

అని వారు వ్యవస్థిత విభాషా స్వరూపమును వివరించియున్నారు.

ఒకపక్షమున వచ్చుట, ఒకపక్షమున రాకుండుట అను భావాభావ రూపమగు ఉభయాంశములను ప్రవర్తించుచు, ఏదేనొక స్థలమున నిత్యముగా వచ్చునట్లుగాని, అసలే రాకుండునట్లుగాని వ్యవస్థ చేయఁబడునది "వ్యవస్థిత విభాష" అని పయివాక్యముల తాత్పర్యము.

ఇట్టి యీ వ్యవస్థితవిభాష విభాషాపదమున్నచోటనేగాక యితర వికల్ప స్థలములందుఁగూడ పాణినీయమునఁ బ్రదర్శింపఁబడిన తావు పరికింపుఁడు.

"శాచ్ఛో రన్యతరస్యామ్ (ఇత్వం వా స్యాత్). శితః, శాతః, ఛితః, ఛాతః.

వ్యవస్థిత విభాషాత్వాత్ వ్రతవిషయే శ్యతేః నిత్యమ్.
సంశితం వ్రతమ్. సమ్యక్ సంపాదిత మిత్యర్థః." (సిద్ధాంత కౌముది).
(అన్యతరస్యామ్ అనఁగా వైకల్పికముగానని యర్థము.)

"శో, ఛో" అను ధాతువులలో "శా, ఛా" అనువాని ఆకారమునకు ఇత్వము వైకల్పికముగా నగును. శితః, శాతః, ఛితః, ఛాతః అను రూపములు కలుగును. ఇది వ్యవస్థితవిభాష యగుటచే శా అనుదానికి వ్రతవిషయమున ఇత్వము నిత్యముగా నగును. వ్రతము సంశితము అనియే యుండును. సంశాతమని యుండదు. అని పయిదాని కర్థము.

ఈ సూత్రమున విభాషాపదముగాక వికల్పార్థకమగు "అన్యతరస్యామ్" అను పదమున్నను వ్యవస్థ కల్పింపఁబడినది. ఆ వ్యవస్థయయినను నిషేధ పరముకాక విధిముఖముగా ప్రదర్శింపఁబడినది.

దీనింబట్టి విభాషావైకల్పికములకు పాణినీయమున భేదము లేదనియు, "వ్యవస్థ" అనునది నిషేధరూపముగనే యుండఁబనిలేదనియు, స్పష్టముగాఁ దెలియుచున్నది. మచ్చునకయి ఒక్కటియ చూపఁబడినదిగాని యిట్టి చోటులు పెక్కులు గలవు.

భాష్యకారులు "అన్యతరస్యామ్", "వా" మున్నగు పదములతో విధింపఁబడిన వైకల్పికవిధులకును, విభాషాపదముతో విధింపఁబడిన వైకల్పిక విధులకును భేదమే లేదను దృష్టితో "నవేతి"సూత్ర భాష్యమున "ఉష విద జాగృభ్యో న్యతరస్యామ్", "హృక్రో రన్యతరస్యామ్", "అనుపసర్గాద్ వా" అను సూత్రములచే విహితములయినవానిని విభాషావిధులుగనే పేర్కొని యున్నారు.

విభాషావైకల్పికములకు భేదము లేకుండుట మహాభాష్యమువలన మఱింత స్పష్టముగా దృఢపడుచున్నది.

చిన్నయసూరి పాణినీయ పద్ధతిని యథాతథముగా నాకళించుకొన్న వాఁడును, దాని ననుసరించినవాఁడునుగాని, అది తెలియనివాఁడును, తెలిసి దానిని అన్యథాకరించినవాఁడును కాఁడు. కావున బాలవ్యాకరణమున విభాషా వైకల్పిక శబ్దములను నితఁడుగూడ తుల్యార్థములుగనే వ్యవహరింపఁదలంచె ననుకొనుట సముచితము, సమంజసము. ఎటనో యొక్కచోట విభాషకు వ్యవస్థను జూపినంత మాత్రమున అది వైకల్పికములకంటె విలక్షణమని భావింపరాదు. ఆ వ్యవస్థయయినను డెబ్బదిరెండింటిలో ఒక్క తావుననేగదా చూపఁబడినది! రెండవ విభాషాస్థలమున (సంధి-46) వివరణమున వ్యవస్థాశబ్దనిర్దేశము లేనేలేదు. అవసరముకలుగక ఉపేక్షించెఁగాని ఆవశ్యకమయినచో వైకల్పికంబు లందుఁగూడ నెచటనేని వ్యవస్థను నిర్దేశించియే యుండెడివాఁడు.

వీనియన్నిటినింబట్టి విభాషావైకల్పికములకు సూరి దృష్టిలో భేద మున్నట్టుల మనము తలంపరాదని తేలిన సారాంశము.

ఇట్లయినచో, "నవేతి విభాషా" అను సూత్రము విభాషాశబ్దమునకు నిషేధార్థమునుగూడ నిరూపించుచున్నదే: అది సరిపడుటయెట్లు? అను ప్రశ్న యొక్కటి మిగిలియున్నది.

నిజమేగాని, విభాషాశబ్ద మున్నచోటులందు ఆ శబ్దమునకు నిషేధార్థము గూడ ఉండకతప్పదనియు, కావున ఒక్కొక లక్ష్యమునందు ఆ కార్యమునకు నిషేధము చెప్పవలయుననియు, ఈ సూత్రమునకుఁ దాత్పర్యమేకాదు. రూప సాధన ప్రక్రియలో ఏదేనొక రూపమున ఒక కార్యమును నిషేధించుటకుఁగా ఈ సూత్రము పుట్టనేలేదు. మఱియెందులకన, విభాషాపదఘటిత సూత్రములు సరళముగా బోధపడుటకయి యా సూత్రములను సమన్వయింపవలసిన మార్గ మెద్ది యనుసంశయమును సూచించుటకు మాత్రమే యీ సూత్ర మవతరించినది. దీని పుట్టుపూర్వోత్తరములెట్టివో మఱికొంత విశకలితముగా పరిశీలించు కొన్నచో, ఈ సూత్రమునకు బాలవ్యాకరణముతో సంబంధ ముండుటకు లేశమయిన నవకాశములేదను నిర్ణయమునకు రాఁగలము. విచారింపుఁడు.

1. ప్రాప్తవిభాష; 2. అప్రాప్తవిభాష; 3. ఉభయత్రవిభాష అని విభాషలు మూఁడు విధములు :

1. ఏ సూత్రముచేనయిన నిత్యముగా ప్రాప్తించుచున్న కార్యమును వికల్పముగా విధించునది ప్రాప్తవిభాష.

"కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు" (సంధి-28) అను సూత్రముచే నిత్యముగా ప్రాప్తమగుచున్న టుగాగమము

"కర్మధారయంబునందు పేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు" (సంధి-29) అను సూత్రముచే వికల్పిత మగు చున్నది. ఇది ప్రాప్తవిభాష.

బాలవ్యాకరణమున ఇట్టి ప్రాప్తవిభాషలు పది గలవు.

2. ఏ సూత్రముచేతను ప్రాప్తిలేని కార్యమును వికల్పముగా విధించునది అప్రాప్తవిభాష.

"ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు" (సంధి-17). ఈ బిందుసంశ్లేషములు మఱి యే యితర సూత్రము చేతను ప్రాప్తములు కావు. అప్రాప్తమగు కార్యమును ఈ సూత్రము వికల్ప ముగా విధించుచున్నది. కావున నిది అప్రాప్త విభాష.

ఇట్టి యప్రాప్త విభాషలు బాలవ్యాకరణమున అఱువదిరెండు గలవు.

3. ఇఁక ఉభయత్రవిభాషల విషయము.

ఏదేని ఒక కార్యము వికల్పముగా ప్రవర్తింపవలసిన రూపములలో, కొన్ని భాగములందు వేఱొక సూత్రముచే అంతకుముందే నిత్యముగా ప్రాప్తించు చుండుటయు, కొన్ని భాగములందు అసలే ప్రాప్తింపకుండుటయు తటస్థించిన చోటులందు ఆ రెండు భాగముల మొత్తమునకును అనఁగా ప్రాప్తాప్రాప్త భాగములు రెండిటికిని కలిపి, ఆ కార్యమును వికల్పముగా విధించునది ఉభయత్ర విభాష.

ఇట్టి ఉభయత్రవిభాషాస్థలము బాలవ్యాకరణమునఁగల 72 విభాషలలో ఒక్కటియు నున్నటులు గోచరింపదు.

"వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు" (సంధి-48) అను సూత్రమొక్కటి మాత్రము ఉభయత్రవిభాష కాఁదగు నేమోయని స్థూలదృష్టికి స్ఫురించునుగాని, అదియు ఉభయత్రవిభాష కాఁజాలదు. అచటి పూర్వోత్తర సూత్ర విధాన ప్రకారమును, ఉదాహరణ ప్రదర్శన రీతిని, పరికింపఁగా దానిని నూరియు ఉభయత్రవిభాషగా తలంప లేదనియే తోఁచుచున్నది.

కావున ఉభయత్ర విభాషా స్వరూపము తెల్లమగుటకు పాణినీయమును పరికింపవలసియున్నది.

"విభాషా శ్వేః. శ్వయతేః సంప్రసారణం వా స్యాత్ లిటి."

శ్విధాతువునకు లిట్టుపరమగునపుడు సంప్రసారణము వికల్పముగా వచ్చునని దీని యర్థము.

ఇచ్చట సంప్రసారణ మనఁగా ఉకారము. ఈ ఉకారము, "వచిస్వపి యజాదీనాం కితి" అను వేజౌక సూత్రముచే లిట్టునందు ద్వివచన బహువచన ములలో నిత్యముగా ప్రాప్తించుచున్నది. ఏకవచనములందు ఏసూత్రము చేతను ప్రాప్తించుటయేలేదు. ఇట్లు నిత్యప్రాప్తిగల ద్వివచన బహు వచనముల భాగమునకును, ప్రాప్తిశూన్యమగు ఏకవచనముల భాగమునకును, సంప్రసారణము ఈ సూత్రమున కలిపి విధింపఁబడుచున్నది.

ప్రాప్తాప్రాప్త భాగములను కలిపి విధించిన విభాషయగుటచే ఇది ఉభయత్ర విభాష.

ఇట్టి ఉభయత్ర విభాషా సూత్రముల సమన్వయ సందర్భమున "నవేతి విభాషా" సూత్రము ఉపస్థితమగును. అటు లుపస్థితమగుటచే "విభాషాశ్వేః" అను నీ సూత్రము అంతకుముందు ద్వివచన బహువచనములందు నిత్యముగా ప్రాప్తించుచున్న సంప్రసారణ (ఉకార)మును "న" అని మొదట నిషేధిం చును. ఆ నిషేధమువలన ద్వివచన బహువచనములుగూడ సంప్రసారణప్రాప్తి శూన్యములై ఏకవచనములతో సమానములగును. ఇట్లు వచనములన్నిటికిని ముందు ఏకరూపతను (uniformity) కల్పించి, ఆ పిమ్మట "వా" అనుదానిచే అన్ని వచనములకును ఉకారమును వికల్పముగా విధించును.

విభాషాశబ్దమునకు నిషేధ, వికల్పములు రెండును అర్థములయినందులకు ఇదీ ప్రయోజనము. ఈ ప్రయోజనము ఉభయత్రవిభాషలయందుమాత్రమె సంభవించును. కేవల ప్రాప్త విభాషలయొద్దను, కేవలాప్రాప్త విభాషలయొద్దను, "నవేతి"సూత్రమునకు ప్రసక్తిగాని, ప్రయోజనముగాని సంభవింపదు. ఈ యభిప్రాయమును "ప్రాప్తవిభాషాసు నాస్యోపయోగః. అప్రాప్త విభాషాస్వపిన. ఉభయత్ర విభాషార్థ మిదంసూత్రమ్." అని "నవేతి" సూత్రమునొద్ద కాశిక, శబ్దకౌస్తుభము, శబ్దేందుశేఖరము, తత్త్వబోధిని మున్నగు గ్రంథములన్నియు వక్కాణించి యున్నవి. ఆ స్థలములు పరికింపుఁడు.

భాష్యకారులు నవేతి సూత్ర ప్రయోజనములను తటుచితఅచి పరిశీలించి, తుట్టతుదికి ఉభయత్ర విభాషలయందుఁగూడ దీనికంతగా నావశ్యకతలేదని నిర్ణయించి, "అశిష్యో వా విదితత్వాత్" అను వార్తికముచే ఈ సూత్రమును ప్రత్యాఖ్యానించియు నున్నారు.

ఈ సందర్భమునంతను బర్యాలోచించినచో, ఉభయత్రవిభాషా సూత్ర ముల సమన్వయమునందుమాత్రమే ఏకాంతో ప్రయోజనమును, ప్రవేశమును గల "నవేతి" సూత్రమునకును, ఉభయత్రవిభాష ఒక్కటియయినలేని బాల వ్యాకరణమునకును లేశమును సంబంధములేదని విశదమగుచున్నది.

విభాషా వికల్పములకు భేదములేదనియుఁ దేలుచున్నది.

వానికి భేదమున్నటులు కొందఱు తలంచుచుండుటచే, వాని వాస్తవిక స్వరూపమును విశదపఱుచుటకయి పాణినీయ ప్రసంగమును ఇంచుక విపులీకరింపక తప్పినదికాదు.

బాలవ్యాకరణమునఁ గార్యములను విధించు సందర్భములందు, ఏయే రీతులు సూరి ప్రణాళికలో నవలంబింపఁబడినవో, ఆ యేడెనిమిది రీతులను ఈ ప్రకరణమున పరికించియుంటిమి.

ఈ రీతిని పరిచ్ఛేద విభాగము మున్నగు పలువిధముల చూపులతో రచనాప్రణాళిక నిర్ణయించుకొన్నను, సేకరించిన లక్ష్యములకు అనుగతములయిన లక్షణము లూహించి నిర్దుష్టముగ సూత్రించుటకు శాస్త్ర సంప్రదాయ విజ్ఞానమును, విశేషించి వ్యాకరణ శాస్త్ర వైదుష్యమును ఆవశ్యకములు. కావున, సూరికిఁగల పాండితీపటిమ యెట్టిదో యిటమీఁది ప్రకరణమునఁ దెలిసికొనవలయును.

---

# పాండితీ పటిమ

చిన్నయసూరిచే ప్రణీతమయిన సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమున సంజ్ఞాపరిచ్ఛేదాంతమున వ్రాఁతప్రతిలోఁ గానవచ్చిన గద్యమొకటి ముద్రిత గ్రంథ పీఠికలో ఉల్లేఖింపఁబడినది. అందు సూరి "సంస్కృతాది భాషాష్టక లక్ష్యలక్షణ జ్ఞాన మహాపండితుఁడు" అని కలదు. ఏవెనిమిది భాషలలో జ్ఞాన ముండుట యాతనికొక లెక్కగాదు. ఆ భాషల యన్నిటిమాట మన మెఱుంగ మన్నను వానిలో సంస్కృత ప్రాకృతాంధ్ర ద్రవిడ భాషా వాఙ్మయములందు నాతఁడొనర్చిన పరిశ్రమయు, సంపాదని కొదవిన వైదుష్యమును, నసామాన్యము లగుట యెల్లరకును వెల్లడయినయంశము.

సూరి యసాధారణ మేధాసంపన్నుఁడును, ఏకసంథాగ్రహణశాలియు నగుటచే ననేకభాషలందును, పెక్కుశాస్త్రములందును, సామాన్యులకువలెఁ గాక యాతనికి అల్పకాలముననే, అనతిప్రయాసముగనే పాండిత్యము లభించు టలో వింతలేదు.

ఈతఁడు శాస్త్రములలో వ్యాకరణమును దన తండ్రియగు శ్రీ వేంకట రంగరామానుజాచార్యులవారియొద్దను, న్యాయాలంకార శాస్త్రములను శ్రీ కంచి రామానుజాచార్యులవారియొద్దను, వేదవేదార్థములను, వేదాంతశాస్త్రమును దనకు మంత్రగురువగు శ్రీ రామాశాస్త్రులవారియొద్దను నభ్యసించినటులు జీవిత చరితము తెలుపుచున్నది.

పెక్కుమంది రచయితలకంటె నీతనిలో నొక్క విశేషము గలదు. రచనాసక్తియగాక, అధ్యాపన ప్రసక్తియు నీయనకు నత్యధికము. అధ్యాపనాను భవముతోఁ గావించిన రచనములందు నెట్లును గొంత విశేషము గోచరింపక తప్పదు.

పయిని సూచించిన పరిచ్ఛేదాంత గద్యముననే యీతఁడు "సర్వదర్శన సంగ్రహ, కుసుమాంజలి, మహాభాష్య, శ్రీ భాష్య, భగవద్విషయాది పాఠ ప్రవచన పారీణుఁడు" అనియుఁ గలదు. ఇవి ఆ యా శాస్త్రములందు ఉద్గ్రంథ ములు. వీని నధ్యయనముసేయు శిష్యులు శాస్త్ర పరిశ్రమయం దాఱితేఱినవారు గాని సామాన్యులయి యుండరు. అట్టి పండితులకు నిట్టి యుద్గ్రంథముల యధ్యాపనము గావించుటకు నెట్టి పాండిత్య మావశ్యకమో సులభముగా నూహింపవచ్చును.

అసంఖ్యాకులగు విశ్వవిద్యాలయ శిష్యులటుండఁగా, భాషలయందును, శాస్త్రములందును నీయనకు ప్రత్యేక శిష్యులయి ప్రశిష్యులయి పేరుగన్నవారు పెక్కుమంది గలరు. అట్టివారిలో ప్రసిద్ధులగు కొందఱ నామములు ఈతని "జీవిత చరిత్రము" నందు నిర్దిష్టములయి యున్నవి. వారిలో ఆచార్యులు, అయ్యవారులు, శాస్త్రులు, శ్రేష్ఠులు, దొరలు, సూరులు, మొదలియారులు ఈ రీతిగా పలుతెగలకుఁ జెందినవారు కానవత్తురు.

భక్తిప్రపత్తులతో గురుస్వామికి కైంకర్య మొనరించి, గ్రంథకర్తగా వన్నెకెక్కుటకు చాలినంత విషయ సామగ్రి పదిలముగా సంగ్రహించుకొని, శబ్దరత్నాకర సంఘాతలయి, సూత్రాంధ్ర వ్యాకరణ శబ్దశాసనములందు సూరి నిక్షేపించి యుంచిన లక్షణ విషయములను పెక్కింటిని ప్రౌఢ వ్యాకరణ ద్వారమున వెలుఁగునకుఁ దెచ్చి, గురుభక్తి నెఱపిన బహుజనపల్లివారు చిన్నయ సూరి శిష్యులలో ప్రముఖులు.

ఇట్లు భాషా విషయములందు నెందఱకో జ్ఞానభిక్ష యొసంగి, యెందఱ కృతజ్ఞతకో పాత్రుఁడయి, "ఇంతమంది మేధావుల విద్యావ్యాసంగమునకు తోడ్పడఁగలిగితిని. మత్పుణ్యము లసద్రూపము" అని తృప్తిచెందినవాఁడు చిన్నయసూరి.

ఈతనివలె బాలురకును, ప్రౌఢులకును భాషాప్రబోధమును, శాస్త్ర సంస్కారమును గలిగించి, బహుశిష్య సంతతిని గన్నవారు ఆంధ్ర లాక్షణికులలో మన యెఱుక కందినంతవట్టు మఱి కానరారు. ఎఱుఁగనిదియెల్ల లేదనఁ గలమా యను సంకోచముగాని, ఈ విషయమున ఇట్టివారింక లేరన్నను అన వచ్చును. శిష్యసంపదకు మఱియెట్టి సంపదలును సాటిగావు. తృప్తినందఁ గలిగిన తీరుగలవారికి అది యొక మహాభాగ్యము. అది యటుండనిండు.

ఈతఁడు పరిశ్రమించిన శాస్త్రములలోఁ దన లక్షణ రచనకు సాక్షాదుప కారకమయి అతి ప్రధాన మనఁదగినది వ్యాకరణ శాస్త్రము. దానియం దీతఁడు కృతపరిశ్రముఁ డయినటులు జీవితచరిత్రము నివేదించుచున్నది. చరిత్రాంశము లతోఁ బనిలేకుండ నీతని సంస్కృత వ్యాకరణ వైదుష్యమును బాలవ్యాకరణమే పట్టి చూపఁగలదు. స్థూలముగఁ జూపుటయగాక, ఆ శాస్త్రమున నీతఁడు ఏ పద్ధతిలో పరిశ్రమ మొనరించెను? ఆ శాస్త్ర సంస్కారము ఈతనిలో ఎంత లోఁతు నాటుకొన్నది? అది తన వ్యాకరణ రచనమున ఏ తీరున వినియోగింపఁ బడినది? మున్నగు వివరములను సయితము బాలవ్యాకరణమే ప్రత్యక్షముగాఁ దెలుపఁగలదు. ఎట్లన

మనదేశమున సంస్కృత వ్యాకరణ తంత్రములు, చాంద్ర జైనేంద్ర పాణినీయ శాకటాయనాదులు, భిన్నభిన్న ప్రణాళికలతో అనేకములు వెలసి యున్నవి. అందు పాణినీయమగు అష్టాధ్యాయి నిర్మాణశిల్పమున నిరుపమాన మగుటచే నితర వ్యాకరణ తంత్రము లన్నిటికిని మిన్నగా దలయెత్తి, ప్రపంచమునం దెల్ల దేశముల శబ్దశాస్త్రకోవిదుల మెప్పులంది, బహుళ ప్రచారముగాంచి యున్నది. వ్యాకరణములందె గాక సర్వశాస్త్రములందును, సకలదర్శనములందును వెలసిన సూత్రవాఙ్మయము మొత్తమున అష్టాధ్యాయిచే అగ్రస్థానము. దానికిఁగల కట్టుపాటులే వేఱు. ఆ కూర్పునఁగల సంయమ పద్ధతియే వేఱు.

అష్టాధ్యాయి యందలి సూత్రక్రమ విన్యాసము పద్మవ్యూహ రచనము వంటిది. గ్రంథసంక్షేపమునకయి అతినిగూఢములగు సాంకేతికరీతుల కల్పనతో ఆ క్రమము నిర్మితమయినది. ఒక్క సూత్రమునేని స్థానము కదలింపఁ జూచితిమా, ఆ సాంకేతికశిల్పము (Technique) అంతయు తలక్రిందులయి భగ్నమగును. పాణినిమహర్షి యీ సాంకేతికపు బింకమునే సంకల్పింపనిచో, ఆ యెనిమిది యధ్యాయములును సెనుబది యధ్యాయము లయ్యెడివి.

ఈ క్రమము ప్రయోజనాంతర దృష్టితోఁ గల్పింపఁబడినదగుటచే ప్రక్రియాసౌకర్యము దూరమయినది. అయినను ఆ క్రమముననే ప్రణీతములయిన పాతంజలమహాభాష్యము (క్రీ. పూ. 200), వామన జయాదిత్యుల కాశికావృత్తి (క్రీ. శ. 700), తద్వ్యాఖ్య హరదత్తుని పదమంజరి మున్నగు గ్రంథముల సాహాయ్యమునఁ జిరకాలము అష్టాధ్యాయీపఠనపాఠన విధానము సాగినది.

పిమ్మట విమలసరస్వతి రూపమాలయు (క్రీ. శ. 1400), రామచంద్ర సూరి ప్రక్రియా కౌముదియు (క్రీ. శ. 1500) మార్గదర్శకములుకాఁగా, ఆ యష్టాధ్యాయికి విషయ క్రమానురూపమును, ప్రక్రియానుకూలమును, ప్రకరణ విభాగ సంకలితమును నగు నూతన క్రమమును సంతరించుకొని, గ్రంథ విస్తృతికి సమ్మతించి, భట్టోజి దీక్షితులు (క్రీ. శ. 1600) వైయాకరణ సిద్ధాంతకౌముదిని వెలయించినారు. దీనికి వెనువెంటనే అమూల్యములగు వ్యాఖ్యాగ్రంథములును అనేకములు వెలసినవి. వీనితో క్లిష్టమగు మునుపటి పాఠ్య విధానమునకుఁ బరిపూర్ణ పరిణామము కలిగి సౌలభ్యము సమకూరినది.

కౌముది పుట్టినది మొదలు, మన దక్షిణ దేశమున సిద్ధాంతకౌముదీ పరి భాషేందుశేఖరములు సమగ్రములుగాను, మనోరమా శబ్దరత్న లఘుశబ్దేందు శేఖరములు కారక పర్యంతములుగను, మహాభాష్యము నవాహ్నిక మాత్రము గను, పాణినీయాధ్యాపన విధానము ప్రచారమునకు వచ్చినది.

ఈ నవీన పాఠ్య ప్రణాళికలో మిక్కిలి సౌకర్యము గలదు. ఈ సంప్రదాయమునకుఁ జెందిన నవ్య వైయాకరణులు పరామర్శము (reference) నకయి పనిగలిగిన పట్టులందు మాత్రమేగాని కాశికావృత్త్యాది పురాతన గ్రంథములను దఱుచుగా నాలోకించు నావశ్యకత తగ్గిపోయినది.

చిన్నయసూరి నవ్యసంప్రదాయానురోధమున శబ్దశాస్త్రము నధిగమించినవాఁడయ్యుఁ, దాను నొక వ్యాకరణ సౌధనిర్మాణమును సంకల్పించినవాఁడు గావునఁ, బురాతన పాణినీయ మూలప్రణాళికారీతులను పునాదులదాఁక నాకళించుకొనవలసిన అక్కఱయు నాసక్తియుఁ గలవాఁడగుటచే అష్టాధ్యాయీ పరిశీలనావసరమున కాశికా వృత్త్యాదులగు ప్రాచీన ప్రక్రియా గ్రంథములతోను, వ్యుత్పత్తివాదము, లఘుమంజూష మున్నగు వార్థిక గ్రంథములతోను, త్రివిక్రమాదుల ప్రాకృత వ్యాకరణములతోను గాఢమగు పరిచితిని గడించినట్లు నిరూపించుటకు బాలవ్యాకరణముననే కొన్ని యాధారములు కాననగును. ఒక్కటొకటే స్తిమితముగా పరికింపుఁడు.

"నిర్ధారణ షష్ఠికి లోపలపట్టకంబగు" —బాల-కారక-16.

అను సూత్రమునకు సూరి చూపెన యుదాహరణములకును, ఇదే సందర్భమున "యతశ్చ నిర్ధారణమ్" అను పాణినిసూత్రమునకు కాశికావృత్తి సిద్ధాంత కౌముదులయందుఁ జూపఁబడిన యుదాహరణములకును సారూప్య వైరూప్యములు పరిశీలింపుఁడు.

| | కాశికావృత్తి | బాలవ్యాకరణము | సిద్ధాంతకౌముది |
|---|---|---|---|
| 1. | మనుష్యాణాం | మనుష్యులలోపల | నృణాం.... |
| | క్షత్రియ శ్శూరతమః. | క్షత్రియుండు శూరుండు. | ద్విజ శ్శ్రేష్ఠః. |
| 2. | అధ్వగానాం | అధ్వగుల లోపలన్ | గచ్ఛతాం.... |
| | ధావన్తః శీఘ్రతమాః. | బాఱువాఁడు శీఘ్రగామి. | ధావన్ శీఘ్రః. |

పయి యుదాహరణములందుఁగలపోలికలు పరిశీలించినచో సూరివాక్యములకు కాశికావాక్యములే మూలములగుట చూచిచూడఁగనే సుస్పష్టముగా గోచరించుచున్నది. ఈ యుదాహరణ ప్రదర్శన సమయమున సూరికి కాశికా వాక్యములు స్ఫురింపక కౌముదీవాక్యములే స్ఫురించినయెడ, ఈ తెలుఁగు వాక్యముల విన్యాస మిట్లుండుట మిక్కిలి యసంభవము. ఇంకొక చోటు :

| కాశికావృత్తి | బాలవ్యాకరణము | సిద్ధాంతకౌముది |
| --- | --- | --- |
| ధాతోః | ధాతువునకు | ధాతోః |
| అధికారోయం | ఇయ్యది అధికార సూత్రంబు | ఇత్యధికృత్య |
| ఇత ఊర్ధ్వం, యత్ | ఇంక, ఎయ్యది | |
| అనుక్రమిష్యామః | ఉపక్రమింపంబడు(నో) | |
| తత్ | అయ్యది | |
| ధాతోరితి | ధాతువున కగునని | |
| వేదితవ్యమ్ | ఎఱుంగునది | |

ఇట సూరివాక్యమునకును కౌముదీవాక్యమునకును పోలికయే లేదు. ఇంక, కాశికా బాలవ్యాకరణముల వాక్యముల పోలిక కనులుమూసి చూచినను కానవచ్చునట్లున్నది. సూరి కాశికావృత్తివాక్యమును తు చ తప్పకుండ ఏపదమున కాపదము తెనిఁగించుట సుస్పష్టము.

ఈ ఒక్కచోటనేగాక యధికార సూత్రము లన్నిటియొద్దను కాశికలో నిట్టి వాక్యమే కానఁబడును. అది యా గ్రంథశైలిలోని తీరు.

కౌముదిలో ఈ సూత్రమునొద్దఁగాని, మఱి యే యధికార సూత్రము నొద్దఁగాని యిట్టి వాక్యవిన్యాసశైలియే కానరాదు.

ఇట సూరిచూపిన యుదాహరణముల యానుపూర్వి, వ్యుత్పత్తివాద లఘుమంజూషలయందును గాననగును.

మఱియొక చోటు :

1. అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః.
2. తపరస్తత్కాలస్య.
3. ఆదిరన్త్యేన సహేతా.

అను పాణిని సూత్రములకు వరుసగా

| కాశికలో | కౌముదిలో |
| --- | --- |
| 1. ....ఉదిచ్చ సవర్ణానాం గ్రాహకో భవతి | ఉదిచ్చ సవర్ణస్య సంజ్ఞా స్యాత్. |
| 2. తపరోవర్ణః....సవర్ణస్య గ్రాహకో భవతి | (తపరః) సమకాలస్యైవ సంజ్ఞా స్యాత్. |
| 3. ఆదిః....మధ్యపతితానాం వర్ణానాం గ్రాహకో భవతి | ఆదిః....మధ్యగానాం స్వస్యచ సంజ్ఞా స్యాత్. |

అని వివరణ వాక్యములు గలవు. పయి కాశికా వాక్యములు మూఁడింటను మూఁడు మాఱులు ఆవృత్తమయిన గ్రాహక శబ్దమును గుర్తుపట్టుఁడు.

వర్ణములలో సవర్ణములను (సజాతీయములను) నిర్దేశించునట్టి ఇదే సందర్భమున సూరి "దంత్యతాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు"—సంజ్ఞ-7 అని సూత్రించి "తాలవ్య చకారంబు దంత్య చకారంబునకును తాలవ్య జకారంబు దంత్యజకారంబునకును గ్రాహకములని తాత్పర్యము" అని వివరించినాఁడు.

ఇచట కాశికావృత్తిలోని 'గ్రాహకోభవతి' అను వివరణపద్ధతి బుద్ధిస్థమయి, స్ఫురించి సరిగా ఆ గ్రాహకశబ్దమునే యుపయోగించుట గమనింపఁదగినది.

కౌముదిలోని "సంజ్ఞాస్యాత్" అను రీతికిని దీనికిని పోలికయే లేదు.

ఇట్టి యాధారములంబట్టి, సూరి, పాణినీయమున ప్రాచీన మూలగ్రంథము లందుఁగూడ ననుభవము గడించినట్లు విశదమగుచున్నది. ఏదేని అవసరము కలిగినపుడు ఒండు రెండు మాఱులు మాత్రమే పరికించియున్నచో నంత మాత్రమున ఆ గ్రంథములందలి పద, వాక్య, విన్యాసరీతులు బుద్ధిస్థములయి యుపస్థితములగుట అసంభవము. కావున, ప్రాథమికములగు ఆ పురాతన గ్రంథములందుఁగూడ సంపూర్ణానుభవము సంపాదించినట్లు ఊహింపవచ్చును.

ఇట, ప్రసంగ వశమున ప్రకృతమయినది మఱొక్కమాట.

పాణినీయమున

"తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్"

"అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః"

అను సూత్రములచేఁ గొన్నివర్ణములకు సవర్ణసంజ్ఞయు, వ్యాకరణకార్యసందర్భమున ఆ వర్ణములు ఒకదానినొకటి గ్రహించుటయు విధింపఁబడినవి. దీనిచే నొకవర్ణమునకు విధించిన కార్యము దాని సవర్ణములకుఁగూడఁ జెల్లుచుండును.

చింతామణి కర్త, తాను చజలకు విధించిన పరుషసరళ సంజ్ఞలు చ̄జ̄లకుఁగూడ సంక్రమింపఁ జేయవలసి యుండుటచే పయి పాణినిసూత్రమున నిట్టి సందర్భమునందే గ్రహింపఁబడిన ఆ సవర్ణపదమునే యెత్తుకొని—

"అర్ధస్త్యః, తాలవ్యశ్చః వక్రస్స్యాత్ మిథ స్సవర్ణశ్చ"

అని సూత్రించి యుండెను. ఇందు "సవర్ణ"సంజ్ఞామాత్రమేగాని సవర్ణములు ఒకదానినొకటి గ్రహించుట అను సవర్ణగ్రాహకత్వము సుస్పష్టముకాక నిగూఢమగుటవల

"సూత్రద్వయే సవర్ణత్వాత్ గృహ్యేతే దన్తజా చజా
సా సంజ్ఞైవ తయోస్తేన నాన్యా సంజ్ఞా ప్రవర్తతే"

అని యథర్వణాచార్యులు వివరించియున్నారు. "సూత్రద్వయే" అనఁగా "పరుషసరళ సంజ్ఞలను విధించు సూత్రములు రెండింటను" అని యర్థము.

చింతామణి సూత్రమునందలి నిగూఢాశయమును గ్రహింపకయు, ఈ యథర్వణకారిక "అద్యన్త్యాః" అను చింతామణిసూత్రమునకు వివరణవార్త్తిక మని గుర్తింపకయు, బాలసరస్వతి చింతామణివిధించిన సావర్ణ్యము యతిమైత్రి కొఱకని భ్రమపడి దంత్యతాలవ్య చజలకు యతి చెల్లవచ్చునని యీ చింతామణి సూత్రమును వ్యాఖ్యానించియుండెను.

అప్పకవికి సహజముగా ఛందోదృష్టి ప్రధానమగుటవల్లను, బాలసరస్వతి ఛందోమార్గమును సూచించియుండుటవల్లను, ఈ సావర్ణ్యము యతిమైత్రికి సంబంధించినదే యనుదృష్టి యాతనికిఁ గూడఁ గలిగినది.

పయి యిరువురును ఈ సవర్ణతను యతిమైత్రికి ముడిపెట్టియుండుటచే అహోబలపండితుఁడును గతానుగతికముగా పరధ్యానముతో అదేమార్గమున సమన్వయము చూపినాఁడు.

చిన్నయసూరి యిదంతయు సమీక్షించి, వ్యాకరణసంజ్ఞల నడుమ నీ యతిప్రాసలప్రసంగము బొత్తిగా సంగతముకాదని యూహించి, వ్యాకరణ కార్యములకయి చజలకు సవర్ణ (చ̃జ̃) గ్రాహకత్వము అత్యావశ్యకమను నన్నయాథర్వణుల యాంతర్యము గుర్తించి, "వారి తాత్పర్యము అదికాదు స్వామీ ఇది" యని ఘోషించినట్లు

"తాలవ్య చకారంబు దంత్య చకారంబునకును, తాలవ్య జకారంబు దంత్య జకారంబునకును గ్రాహకములని తాత్పర్యము" —సంజ్ఞ-7

అని ఇంతపొడవు వాక్యము నుల్లేఖించియున్నాఁడు. దీనివలన

చకారముతోపాటు చ̃కారము పరుషమయినది.

జకారముతోపాటు జ̃కారము సరళమయినది.

ఈ చ̃జ̃లు రెండింటికిని స్థిరసంజ్ఞ తప్పినది. అదే తప్పకున్నచో "తోఁచెను జొక్కఁలు" మున్నగుచోట్ల ద్రుతలోప నివారణకు త్రోవలేదు. సరళాదేశమునకు దారిలేదు.

పాణినీయములగు, ఏయే సంజ్ఞలు, ఏయే పరిభాషలు బాలవ్యాకరణమున నెచ్చటెచ్చట గ్రహింపఁబడినవో, యా వివరములు ఇంతకన్న విపులముగా పూర్వప్రకరణమున పరికించియుందురు.

గ్రంథకారులు తమకునొదవిన శాస్త్రసంస్కారము తమరచనములందు ప్రతిబింబించునటులు శ్రద్ధాసక్తులు వహింపవలయును. ఇతర రచనములమాట యెటులున్నను, లక్షణరచనమునమాత్రము శాస్త్రసంప్రదాయములకు శైథిల్యము కలిగింపరాదు. శాస్త్రవిహితములగు సంజ్ఞాదుల నియమమును జాఱనీయరాదు. పారిభాషికరీతులపట్టు సడలింపరాదు. అట్టి లాక్షణికులే నిజమయిన సంస్కర్తలు కాఁగలుగుదురు. అపుడే వారి శాస్త్రపరిశ్రమ సార్థకమగును. అట్టివారి గ్రంథములవల్లనే బాలురు సంస్కారులగుదురు. ఈ విషయములందు చిన్నయ సూరికి నెట్టిజాగరూకతగలదో బాలవ్యాకరణమున పరికింపుఁడు :

పాణినీయమున "అదర్శనంలోపః" (ప్రసక్తస్య అదర్శనం లోప సంజ్ఞం స్యాత్) అని లోపసంజ్ఞ సకలలోపసాధారణముగా విహితమయినది.

ప్రత్యయలోపమునకు "లుక్" అని ఒకవిశేషసంజ్ఞ పేఱుగా విధింపఁబడినది.

"ప్రత్యయస్య లుక్ శ్లు లుపః" (లుక్, శ్లు, లుప్, శబ్దైః కృతం ప్రత్యయాదర్శనమ్ క్రమాత్ తత్తత్సంజ్ఞంస్యాత్)

అనునది లుక్సంజ్ఞను విధించిన సూత్రము.

ప్రత్యయములుగాక, తక్కినవర్ణములలోపమునకు లోపశబ్దమేగాని, లుక్కను పేరు చెల్లదు; చెల్లరాదు. చెల్లినచో సంభవించు చిక్కులనేకములు గలవు. కావుననే పాణినీయమునందంతటను లుక్శబ్దము ప్రత్యయలోపమునకు మాత్రమే వ్యవహరింపఁబడినది. ప్రత్యయ భిన్నములగువాని లోపమునకు లోపశబ్దముమాత్రమే వ్యవహరింపఁబడినది.

లుక్కు లుక్కే — లోపము లోపమే.

రెండిటికిని సాంకర్యము పాణినీయమున ఒక్కచోటనయినఁ గానరాదు.

ఇటులుండ, ప్రాచీనాంధ్రవ్యాకరణములలో చింతామణి వికృతివివేకము లందును, అప్పకవీయమునందును లోపశబ్దముతోపాటు లుక్ శబ్దము ప్రత్యయ ప్రత్యయేతర సాధారణముగా నియమరహితముగా వాడఁబడుట కానవచ్చును. ప్రత్యయేతరస్థలములలో (ఒక్కచోటఁగాదు) పెక్కుతావులందు అనఁగా చింతామణిలో "చారేరుపధాత్మనశ్చ లుగ్వాస్యాత్" మున్నగు పదివండ్రెండు

చోటులందును, అథర్వణకారికలలో "దలహాముదితాం లుక్ స్యాత్" మొదలగు మూఁడునాలుగు తావులందును, అప్పకవీయమున "కడరేఫము గుడుసు లుక్కు-గాంచును దనకున్" మున్నగుచోట్లను ఎన్నియో లుక్కులు గోచరించును. పాటింపకతప్పని యీ "లుక్, లోప" శబ్దముల తారతమ్యమును వీరెల్లరును ఏల గమనింపరయిరో యెఱుకపడకున్నది. పాణినీయపరిపాటి తెలియని వారందుమా? అపచారము. ఆ మాట మనము అనను సరికదా ఎవ్వరన్నను సమ్మతింపము. కాని, పారిభాషికపద వ్యవహారమున జాగరూకతలేనివారని మాత్ర మనుకొనకతప్పదు.

చింతామణ్యాది లక్షణగ్రంథములతోడి నిరంతరపరిచితినిబట్టి చిన్నయసూరి తనమొదటి చిత్తురచనములందు ప్రత్యయేతరస్థలములందుఁగూడ కొలఁది చోట్ల "లుక్"శబ్దమును బ్రయోగించియుండియు. పిమ్మట బాలవ్యాకరణము నుపక్రమించుతఱిని బర్యాలోచించి, పాణినీయమున కొన్నిరీతుల కార్యవిశేషములకొఱకుఁ గల్పింపఁబడిన యీ "లుక్"శబ్దము అట్టి కార్యవిశేష మొక్కటియు లేని తెలుఁగువ్యాకరణములందు గ్రహింపఁబడుట మిక్కిలి యనావశ్యకమనియు, అదిగాక, ప్రత్యయేతర స్థలములందు "లుక్"శబ్దమును వాడుట శాస్త్రదృష్టికి విరుద్ధమనియు, వివేచించి బాలవ్యాకరణమునందు ఒట్టిడినయట్లు — ఒక్కచోటనయిన — ఈ "లుక్"శబ్దమును బ్రయోగింపలేదు. అవసరము కలుగలేదేమో అనుకొందుమా! తన యీ వ్యాకరణమున తొంబదిరెండు తావులందు లోపవిధానము ప్రసక్తమయినది. ఆ చోటులందన్నింటను లోపశబ్దమునే ప్రయోగించినాఁడు.

దీనినిబట్టి శాస్త్రీయ పారిభాషిక మార్గపరిపాలనమున నీతని మెలఁకువ యెట్టిదో యూహింపుఁడు.

మునుపటివారు చింతామణికారాదులు ఆంధ్రవ్యాకరణరచనమును అంత ప్రధానముగా నెంచుకొనక, సునిశితమగు సూక్ష్మదృష్టిఁబఱుపక, స్థూలదృష్టితో ఈ "లుక్"శబ్దమును తాఱుమాఱుగాఁ బ్రయోగించియుందురని యెట్టెటో సరిపెట్టుకొనవచ్చును. కాని సూరి యీ లుక్శబ్దమును పూనికతోఁ దొలఁగించుట ప్రత్యక్షముగా నగపడుచుండ, ఈ బాలవ్యాకరణమును ఎదుటఁ బెట్టుకొని యనువాదముగా రచింపఁబడిన హరికారికలలో ప్రయుక్తములయిన లుక్కులకు లెక్కలేదు. ఏమందుము! ఏమనుకొందుము!! ఇఁక నీవిషయము విడిచి వేఱొకటి పరికింతము.

"ఇద మద మేతత్ యత్తచ్ఛబ్దాః శబ్దాన్తరాన్వయే బహులమ్
హ్రస్వం ప్రపద్య దీర్ఘాః ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి."

ఇది త్రికసంధిని విధించు చింతామణికారిక.

ఇప్పలుకు, ఎప్పలుకు, అప్పలుకు మున్నగునవి దీనికి లక్ష్యములు.

ఇందు "ఏ" అను శబ్దము యచ్ఛబ్దార్థకముగా చింతామణి సూత్రమున నిర్దిష్టమయినది.

ఏ అనుదానికిఁగల అర్థములు రెండు.

"ఏ పలుకువింటివో అది సత్యము" అనుచోనుండునర్థము వేఱు. "ఏపలుకు వింటివి ?" అనుచోటనుండునర్థము వేఱు.

మొదటిది యచ్ఛబ్దార్థకము. రెండవది కింశబ్దార్థకము.

ఈ యర్థములు రెంటింటికిని సంస్కృతమున యత్, కిమ్ అని వేఱువేఱు శబ్దములు గలవు. తెలుఁగున ఉన్నది "ఏ" అనునది ఒక్కటే శబ్దము.

పయిసంధిలో రెండువిధములగు శబ్దములకును ప్రవేశమావశ్యకము. యత్ అని ఒక్కదానినే పేర్కొన్నచో—

"ఎప్పలుకు వింటివో అది సత్యము" అను తావునమాత్రమే యీ సంధి సాధితమగునుగాని, "ఎప్పలుకు వింటివి ?" మున్నగుచోటులందలి సంధులు సాధింపఁబడవు. అనివార్యమయిన అవ్యాప్తి. గోరంత అజాగరూకతవలన కొండంతలాభము తప్పిపోయినది.

ఇది వ్యాకరణము. వొల్లంత ఏమఱుపాటు చూపితిమా పొలిమేరలు దాఁటిపోవును. నలుసంతదానికింతయేల అనుకొనరాదు. ఆనలుసే వ్యాకరణమున కంటిలోని నలుసగును.

చిన్నయసూరి "ఏ"అనుశబ్దమును పేర్కొనవలసిన చోటులందెల్ల "యత్కిమర్థకము" అని "కిం" శబ్దమునుగూడ మేళవించునేగాని, అరగొఱగా "యదర్థకము" అని యూరకుండఁడు. ఇటులే "ఎన్ని" అను శబ్దమును "కియద్యావదర్థకము" అనునేగాని, కేవలముగా "యావదర్థకము" అని యూరకుండఁడు. బాలవ్యాకరణ సర్వనామప్రకరణము పరిశీలింపుఁడు. పూర్వుల రచనములందున్న లోపమును సన్నసన్నగా సవరించి యెంతమెలకువ చూపినాఁడో గమనింపుఁడు. శాస్త్రసంస్కారపటుత్వమునకు మెఱుఁగుదెచ్చునది జాగరూకత. అది యున్నచో కొదవలు సంభవింపవు.

ఇంక ఒకేయొక్క యంశము పరికింపుఁడు.

పాణినీయపథమునఁ బరిభ్రాంతుండయినవాఁడు సాంకర్యదోషమును సమ్మతింపడు. విషయముల వివేచనమును, విభాగమును విశేషముగా నభిలషించును.

“ఆచ్ఛికశబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం గ్లీబసమంబులునయి యుండు.” —ఆచ్ఛిక-2.

అని సూరి యచ్చతెనుఁగుశబ్దములను రెండుశాఖలుగా విభజించినాఁడు.

స్త్రీసమము, క్లీబసమము అను నీశబ్దములు లౌకికశబ్దములవలెఁ గానవచ్చుచున్నను, సూరిదృష్టిలో నవి లాక్షణికములు, సాంకేతికములు. అనఁగా ఈ రెండు శబ్దములను ఆచ్ఛికములకే యుపయోగింపవలయునుగాని తత్సమముల విషయమున వాడరాదు.

“మాత” అను తత్సమశబ్దము స్త్రీతుల్యము కావచ్చునుగాని, స్త్రీసమము కానేరదు.

అటులే “కంఠము” అను తత్సమము క్లీబతుల్యము కాఁదగునుగాని క్లీబసమము కాఁజాలదు.

ఆచ్ఛికములకు సమశబ్దమును, తత్సమములకు తుల్యశబ్దమును ప్రత్యేకనియతములుగా వాడుటకు సూరి తలంచుకొన్నాఁడు.

గ్రంథమందంతటను అటులే వ్యవహరించినాఁడు. స్త్రీసమ క్లీబసమ శబ్దములు చాలతావులఁ గానవచ్చును. స్త్రీతుల్య క్లీబతుల్య శబ్దములును పెక్కుచోట్లఁ గానంబడును. ఎచ్చటను సాంకర్యముండదు.

ఇట్టి పృథక్కరణము చేయకుండ వానిని గలిపివైచినచో, స్త్రీసమశబ్దములకు విధింపఁబడిన కార్యములు స్త్రీతుల్యములయిన తత్సమశబ్దములందుఁ గూడఁ బ్రవర్తిల్లి యపశబ్దములు సంభవించును. ఎట్లందురా ?

“స్త్రీసమంబులగు విశేషణంబులయు ముపర్ణకాంత విశేషణంబులయు
బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు.” —కారక-20.

అను సూత్రముచే “మాటలు పెక్కులు” మున్నగుచోటులందలి స్త్రీసమములతో పాటు “బాలకులు మోఘలగుదురు” మొదలగు వాక్యములందు స్త్రీతుల్యములగు మోఘాదితత్సమములకుఁగూడ ఏకవచనము గలిగి “బాలకులు మోఘయగుదురు” అనుమాదిరిగా కురూపములు సిద్ధమగును.

సూరి యీ పృథక్కరణమునకు నింతప్రయోజనము తనదృష్టిలో నున్నటులుమాత్రము ఎచ్చటను స్పష్టముగాఁ గనఁబడనీయఁడు. అదే పరవస్తు వారికున్న తెరచాటుపద్ధతి.

ఇట్టి సూక్ష్మములు వ్యాఖ్యాతలు తామయి గుర్తింపవలయునని యాతని ముచ్చట.

అట్లు గుర్తింతురో గుర్తింపలేరోయని యించుక సందియముగూడ నుండుటవల్లఁగాబోలును — "చూడు నన్ను - చూడుము నన్ను - ఇటుచూడు - ఇటుచూడుము" (సంధి-47) అని అచ్చుటచ్చుట వ్యాఖ్యాతలను హెచ్చరించుచున్నటులును గానంబడును.

ఇట్టి యాతని హృదయము కనిపెట్టి, యెచ్చటను ఏమఱక, మనమే యాతని యాంతర్యము నిదానించుకొనుచూపుతో నుండవలయును.

ఏయంశము ఏదృక్కోణముతో నిదానించిన గోచరించునో, మన యనుభవమునుబట్టి మనమే నిర్ణయించుకోవలయును. కోణములు మార్చుకొనుచు చూచుటలో గోచరించు విశేషము లాతని ప్రతిభలో పెక్కులుగలవు. ఆతఁడెంతగా హెచ్చరించినను, నాతనివంక నట్టిచూపుపెట్టనేరక బాలవ్యాకరణ వ్యాఖ్యాతలు, ఆఖ్యాతలు, అనువాదకులు పెక్కుమంది యీ స్త్రీసమ క్లీబసమ శబ్దముల వాడుకను సంకీర్ణముచేయుటచే సూత్రకారునిహృదయము వ్యాఖ్యల వలన ఆవిష్కృతమగుటకుమాఱు మఱింత మాటుపడినది. కానిండు. అంత మాత్రానఁ గొఱంతరాదు. ఉన్నవిలువను కాలము వెలువరింపకపోదు.

"కాలోహ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ."

మఱియు, చారిత్రికముంగు జనశ్రుతులును, తెలుఁగుంచనమగు బాల వ్యాకరణమునుగాక, నిజమునకు చిన్నయసూరి సంస్కృతపాండితీప్రకర్షమును పరిపూర్ణముగా పట్టిచూపఁగలిగినది యాతని సంస్కృతరచనమగు సూత్రాంధ్ర వ్యాకరణము. అది సమగ్రముగనే లభించి ప్రకటితమయియున్నచో నాతని పాండిత్యగభీరిమ యెంతటిదో యెట్టిదో తనంతదానే లోకమునకు గోచరించి యుండెడిది. ఆ గ్రంథము భద్రపఱచుకొనఁజాలక చేతులార జాఱవిడిచితిమి. అది మనకు లభించునవకాశము మఱికానరాదు.

ఎవరో వ్రాసికొన్న యొకచిత్తుకాగితములప్రతిని ఎటులో సంపాదించి, పుణ్యాత్ములు ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించినారు. చిన్నయసూరి పాండితినిగూర్చిగాని, బాలవ్యాకరణమునఁ జేర్పక విడిచిపెట్టితినని సూరి నిర్దేశించిన విలువగల లక్షణ విశేషములనుగూర్చిగాని కొంతయేని దెలిసికొనుటకు ఈ చిత్తుప్రతిపయినే మనమాధారపడవలసియున్నది. ఇదియే, వెన్నపాఱవైచి వ్రేళ్ళు చప్పరించుట.

సూరిపాండితీపాటవమును, ప్రణాళికా నిర్మాణ కౌశలమును, అష్టాధ్యాయిని ఆదర్శముగాఁగొని సంస్కృత సూత్రగ్రంథము పటుబంధముతో రచింపవలయుననెడి ఆతని ఆదిమసంకల్పములోనే అంతర్లీనమైయున్నవి. శాస్త్రానుభవము, రచనాధైర్యము, ఆత్మవిశ్వాసము లేని సామాన్యులకు ఇట్టి యుత్సాహమే యంకురింపదు.

అతని సంస్కృత సూత్రములతీరు గమనింపుఁడు :

మోర్నిక్ ; పూర్వవత్కర్మధారయే ; ఓలోప్తుక్ ; త్రికాదేకహలో నూష్మరః; రేయా నదేః కిక్ ; బంధు శబ్దస్రువాచినో ప్మకః ; మహతో భగవదాదే రానజ్వా ; ఈవష్వైః; ఎఁడు పరిమితా వేకర్వే ; ఎఁడౌ లేర్లోపః. —సూత్రాంధ్రవ్యాకరణము

ఈ రీతిని సూత్రరచన సాగినది. వరాకుగాఁ జూచితిమా పాణినీయముతే యనుకొందుము.

ఈ సూత్రములలో నడుమనడుమఁ గొన్ని వివరణవాక్యములు రాన నగును. ఆ వాక్యములశైలి సంస్కృతవ్యాకరణ వ్యాఖ్యాతల శాస్త్రశైలిని దలఁపించుచుండును. కొన్నివాక్యములు పరికింపుఁడు :

"కాలుజారి పడినాఁడు : తద్భావే తత్సమవేతస్య భావః. తత్క్రియాయాం తత్సమవేతస్య క్రియా విశేషణం భవతి; కాలుజారి పడినవాఁడు; అత్ర తత్క్రియా పతనం ; తత్సమవేతః పాదః ; తత్క్రియా తు స్ఖలనం ; స్ఖలనస్య పతనంప్రతి విశేషణత్వ మనేనాతిదిశ్యతే ; ఏతేన ద్వయోః క్రియయోః సమానకర్తృకత్వ మాయాతమ్ ; పతనంప్రతి స్ఖలనస్య హేతుత్వేన పూర్వకాలికత్వం సమాన కర్తృకతాచేతి ; తర్హి ఉక్తార్థానా మప్రయోగ ఇతి బోధ్యమ్ ; తదీయస్య క్రియాయాం తస్య తథావృత్తిః యస్య క్రియాయాం వర్తమానోచిః తస్య ప్రాధాన్యే కర్తురివ విశేషణం భవతి."

"అసౌ తత్తథా ; తత్సంబన్ధినః క్రియాయా మసౌ తత్కర్తృభవతి; 'హరి కరుణానిలయుండు ; వాఁడు ధనము లేఁడు' అత్ర కర్తృగతో భావో ధాతునా సముదీర్యతే. యోసౌ కర్మగతోభావః పఠ్యస్తే నాభిధీయతే."

"సమాస ఇతి వక్తవ్యమ్ ; అన్యథా కడునలుకేత్యత్రాపి స్యాత్ ; నచ నుకా వ్యవధానాన్నభవతీతి వాచ్యమ్ : స్వాఙ్గస్య, స్వవ్యవధాయకత్వాభావాత్."

వివరణవాక్యపద్ధతి యీ రీతిని గానవచ్చును.

పయి సంస్కృతవాక్యములందు పారంపరికముగాఁ బ్రవేశించిన లేఖన స్ఖాలిత్యములు కొన్నిగలవు. వానిమాటయటుంచి యీ రచనా రీతివిలబట్టి

సంస్కృతమున నీతనికలవడిన శాస్త్రశైలి యెట్టిదో యూహించుటమాత్రమే మనకు ప్రకృతము. శాస్త్రనిష్ణాతులకుఁగాని యీ శైలి యలవడనేరదు.

ఈ ప్రకరణమున నిరూపించిన యంశములనుబట్టి చిన్నయసూరికిఁగల పాండితీపటిమయు, దానివలనఁగలిగిన సంస్కారపటుత్వమును, తన్మూలక మగు రచనాజాగరూకతయు, సంస్కృతరచనమున నాతనికిఁ బట్టువడిన శాస్త్ర శైలియుఁ దేటతెల్లములు కాఁగలవు. ఒక్కకణము చాలును, అన్నమంతయు పట్టిచూడఁ బనిలేదు.

పాఠకులకు విసువుజనింపకముందే ప్రసంగము ముగించుట మెలఁకువ మార్గము. ఇంక, విషయాంతరమువంక దృష్టి మరలింపుఁడు.

పాండిత్యమునకు వన్నెదెచ్చునది సౌశీల్యము. కావున చిన్నయసూరి శీలస్వరూప మెట్టిదయియుండునో మీఁదిప్రకరణమున పరికింతము.

---

# శీల సౌమ్యత

సూరి శాస్త్రవైదుష్యమును గూర్చియు, తత్సంస్కారపటుత్వమును గూర్చియు, పైప్రకరణమునఁ జదివియుంటిరి. అట్టి సర్వతోముఖమగు పాండిత్యముగల యాతని శీలస్వభావము లెట్టివయియుండెనో, అవి వాని వ్యాకరణమున నెట్లు ప్రతిఫలించినవో యించుక పరికింతము.

శ్రీమంతులలోను, విద్వాంసులలోను, గుణవంతులనే లోక మెక్కుడుగా గౌరవించును. గుణసంపద యలవడినప్పుడే పరిశ్రమించి యార్జించిన పాండిత్యము సార్థకమగును. ప్రశాంతదృష్టిని, వినయవైభవమును, గాంభీర్యభావమును, తృప్తిసంపదను, సహనశీలమును, హృదయమార్దవమును, నియమప్రవర్తనమును చేకూర్చినవిద్యయే విద్య.

విద్యలలో వ్యాకరణవిద్యకు నొక విలక్షణత గలదు. ఇది వాఙ్మయము నందలి సకలశాఖలకును నుపకారకము. మఱియు, పాణినీయవ్యాకరణము నభ్యసించి వశపఱచుకొనుటమాత్రమేగాక, యా శాస్త్రనిర్మాణశిల్పమునందలి లోలోపలిమూలతత్త్వమును దర్శింపఁగలిగినయెడ, నట్టివారి నిత్యజీవితమునఁ గూడఁ గొంతకుఁగొంత దాని నిబంధనప్రభావము సోఁకి, వారి వారి జీవయాత్రా ప్రవృత్తులు నయితము నియమబద్ధములై, సక్రమశీలవిలసితములయి వెలయఁ గలవనుట పాణినీయ తత్త్వరహస్యము.

చిన్నయసూరి తనపాండిత్యమునకు వన్నెపెట్టు సౌశీల్య సంపదగల సహృదయుఁడు.

సూరిస్వరూపస్వభావాదులు తద్బంధు మిత్ర పండిత పరంపరాయాతము లయి యవశ్యవిశ్వసనీయము లనఁదగిన జనశ్రుతులంబట్టి సేకరించి, కొందఱు పరిశీలకులు వెలయించిన రచనలంబట్టి కొంతవఱకుఁ దెలియవచ్చుచున్నవి.

ఈతఁడు హయగ్రీవ మంత్రోపాసకుఁడు. ప్రపత్తివైభవముగలవాఁడు. ఆధ్యాత్మిక ప్రవృత్తియందు నత్యంతాసక్తిగలవాఁడు. నిత్య దేవతార్చనము (తిరువారాధనము) మున్నగు సాంప్రదాయిక కార్యకలాపమును శ్రద్ధాభక్తులతో సాగించుచు, నైష్ఠికజీవితము నడపుకొన్నవాఁడు. స్ఫురద్రూపియై, యెల్లపుడును పరిశుభ్రములై యింపుగొలుపు ధవళవస్త్రములు ధరించుచుండువాఁడు. ధోవతి, ఉత్తరీయమెగాక, సన్నని పొడవయిన అంగరకాను (చొక్కాయి) వేసి కొనుచుండువాఁడు. సులోచనము లుపయోగించువాఁడు. ఎవ్వరితోడనేని

నగుమోముతో మృదుమార్గమున భాషించుచుండువాఁడు. అని యిట్టి విశేషములు కొన్ని జీవితచరితమునుబట్టి తెలియుచున్నవి.

ఈ వేషభాషల వివరములు మనకేలయని తలంపరాదు. బాహిరములగు వేషభాషలుకూడఁ బురుషుల మానసికప్రవృత్తులను పట్టిచూపఁగలవు.

జీవితచరితద్వారమునఁ దెలియుటయేగాక ఆతని

1. పరలఘూకరణవైముఖ్యము 3. మాన్యజనగౌరవము
2. ప్రసంగమార్దవము 4. సర్వమత సామరస్యము

మున్నగు సౌశీల్య సరసతారీతులు బాలవ్యాకరణముననే ప్రతిఫలించునవిగూడఁ గొన్ని గలవు. పరికింపుఁడు.

వ్యాకరణకార్యములకై యచ్చటచ్చట నాతఁడిచ్చిన యుదాహరణముల తీరు గమనింపుఁడు.

"వానలుగురిసినం బంటలు పండును." —క్రియా-41.
"వారు సుఖమున్నారు." —కారక-21.
"జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె." —క్రియా-42.
"చూచుచుం బోవుచున్నాఁడు." —క్రియా-43.
"పద్మలత మనోహారిణి." —తత్సమ-86.
"హిమగిరివలననుండి గంగ వొడమె." —కారక-10.
"నాకంబువలననుండి నారదుండు వచ్చె." —కారక-10.
"గాలి చల్లగా వీచెను." —కారక-37.

అని ప్రజాసంక్షేమమును, పావనములు మనోహరములునగు దృశ్యములను గోచరింపఁజేయుచు, వినువారికి నుల్లాసముగలిగించు సురుచిరభావములే యాతనికి స్ఫురించునుగాని, అమంగళములు, జుగుప్సితములు, రసవిహీనములు నగు భావములు ఆ హృదయమునకు స్ఫురింపవేమో యనిపించును. వీనినిబట్టి యాతని హృదయమార్దవ మెట్టిదో, ప్రసంగసారస్య మెట్టిదో, సులభముగా గ్రహింపవచ్చును. ఇంతియగాక—

"కృష్ణుండు .... దాఁగె ; .... నారదుండు వచ్చె." —కారక-9.

మున్నగువాక్యములలో సామాన్యక్రియలకు శ్రీకృష్ణ నారదాది సుప్రసిద్ధకర్తలను గూర్చుచు, లాఘవాపాదకములు గాని, అగౌరవసూచకములు గాని, అమంగళ స్ఫోరకములు గాని, అగు క్రియలుగల వాక్యములలో కర్తలను గూర్పవలసి వచ్చినపుడు

"దేవదత్తుఁడు వంటకమును వండెను." —కారక-2.
"మైత్రుండు చైత్రునిచేత ఋణంబుఁ గొనియె." —కారక-4.
"మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె." —కారక-9.
"చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి పడిసె." —క్రియా-38.

మున్నగురీతిని, ఎవ్వరికిని నొప్పియొదవకుండ, ఏ కర్తలనో క్రొత్తగా సృజించి, కర్తృపదములు కల్పించి, వాక్యములు చూపునేగాని, వంటకము వండుట, ఋణంబు గొనుట, రాజ్యభ్రంశము నొందుట, పడిపోవుట మున్నగు క్రియలకు రాముఁడు, కృష్ణుఁడు మున్నగు కర్తృపదములు చూపుటకు నిచ్చగింపఁడు.

ఇంతయేల ! విభక్తులప్రసంగమున నీచస్త్రీ సంబోధనమునకును, నీచ పురుష సంబోధనమునకును, నుదాహరణములు చూపవలసివచ్చినది.

స్త్రీపురుషులనెవ్వరినిగాని నీచముగా సంబోధించుటకు నాతనితత్త్వము సమ్మతింపదయ్యెను. అపుడు, ఏ వ్యక్తులపేరులను నిర్దేశింప నిచ్చగింపక, దౌష్ట్యముగల వ్యక్తులను నీచముగాఁ బిలుచుట యంతగా ననుచితముగాదని యాలోచించి

"ఓసి దుష్టురాల ! ఓరి దుష్టుఁడ !" —తత్సమ-15.

అని సంబోధ్యవాచకముగా దుష్టశబ్దమును గూర్చుటలోని యౌచితిని సుదూరము నిదానింపుఁడు.

మఱియు, నిందార్థమున ఆమ్రేడితమున గిగీలను జూపవలసినతావున నింతకుముందటి సూత్రములందుఁ బలుమా ఋదాహృతములయిన శబ్దములనే విష్ణువు, గిష్ణువు ; రాముఁడు, గీముఁడు అని స్థూలదృష్టితో నుదాహరించినచో మాననీయులయెడ నిందాస్ఫురణమును, నిరాకరణదృష్టినిఁ, గలిగించి నట్లగునని తోఁచి దానికి మనసొప్పక క్రూరకర్ములగు రావణకుంభకర్ణుల నన్వేషించి

"కుంభకర్ణుఁడు, గింభకర్ణుఁడు"; "రావణుఁడు, గీవణుఁడు"-ప్రకీర్ణక-22.

అని యుదాహరించుటలో నాతని శీలసౌకుమార్య మెట్లు గోచరించునో యూహింపుఁడు.

ఇంతియగాక, శాపార్థమునందు మధ్యమపురుషమున "ము, డు" ప్రత్యయములకు లక్ష్యములు ప్రదర్శింపవలసివచ్చినది.

శాపమనఁగా తిట్టు. దీనికి నుదాహరింపవలసిన వాక్యమునందలి తిట్టు ఎంతగట్టిదైన నంతమంచిది. గట్టిదైనపక్షముననే ఆ లక్ష్యము సూటిగా సరిపడును. ఎంతోగట్టిగా తిట్టవలసిన యీ సందర్భమున

"రాక్షసుఁడవగుము, రాక్షసులరగుఁడు" —క్రియా-29.
అని యుదాహరించినాఁడు.

అంతకంటె నమంగళములగు తిట్టుమాట లాతనినోటికి రావేమో యనిపించును.

మఱియుఁ గొన్నియెడల లక్షణనిరూపణసందర్భమున నితరలాక్షణికుల మతము తన కభిమతముకాకున్న తావులందు

1. సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. —సంధి-4.
2. నలుఁగడాదుల నీయాగమంబు లేదండ్రు. —సంధి-25.
3. ఎందుశబ్దమున కలిగాగమము కొందఱు లేదండ్రు. —సంధి-44.
4. అనుకృతిని నిడుదకుం గుఱుచయగునని యొకండు వలికె నది నిరాకరంబు. —సంధి-54.
5. ఏండ్లు కాండ్లిత్యాదులందు డాకు కాదేశంబు కొందఱు వక్కాణించిరి. తెనుఁగున బిందుపూర్వక స్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు. —ఆచ్ఛిక-15.
6. ఇయశబ్దమునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు. —ఆచ్ఛిక-23.
7. ద్వితీయైకవచనంబు పరంబగునపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబు. —ఆచ్ఛిక-29.
8. వనమునుంచి, ధనమునుంచి, యని యుంచిశబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరుగాని యది సాధుకవిప్రయోగారూఢంబు గాదని యెఱుంగునది. —కారక-11.
9. కుచధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబుగాదు. —క్రియా-68.
10. పూనుబోదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచార మూలకంబు. —ప్రకీర్ణక-10.

అని యీ తీరున సౌమ్యతతో మృదువుగను, విషయప్రధానముగను నిర్దేశించి విడుచుటయేగాని, వ్యక్తుల పేరులెత్తి వారిని జులుకనసేయుట యాతనికి రుచింపదు.

ఏమన్నారో తెలుపవలెనుగాని, ఎవరన్నారో తెలుపుట ముఖ్యముకాదని యాతనిదృష్టి.

పయిని నిర్దేశించిన ఖండనవాక్యముల విన్యాసమున నెట్టివాఁడియున్నదో ఎత్తిచూప వశముకాదుగాని, ఆ సౌమ్యతతోపాటు భాషాలక్షణపీఠమున కుందఁ దగిన పొంకముగల తీవియు గోచరించుచుండును.

ఈ వాక్యములు పఠించునప్పుడు కురుపాండవ సంగ్రామ సంరంభమున నడుమనడుమ చేతికిఁజిక్కిన పాండవులను మాటిమాటికి జాలివిడిచిన మహారథుఁడు కర్ణుఁడు జ్ఞప్తికిఁ దోఁచుచుండును.

ఒకప్పుడు నామనిర్దేశము చేయవలసివచ్చినను ఉపేక్షింపక, సగౌరవముగఁ బరామర్శించుట యాతని మార్గము. కావుననే పైవాక్యములందు మొదటి దానిలో "అథర్వణుఁడు చెప్పె" ననక "అథర్వణాచార్యులు చెప్పిరి" అనుచున్నాఁడు. అథర్వణుని సిద్ధాంతమును సమ్మతింపని సందర్భమునం దయినను, పూజార్థసూచకముగ బహువచనాంతములతో నెంతటిమన్ననఁ జూపుచు, పరామర్శించినాఁడో గమనింపుఁడు.

"వాగనుశాసనుల యదా తదా యని గ్రహించుట ప్రమాదము" (సంధి-13) అనుచో వాగనుశాసనులు అను పూజార్థక బహువచనమును గుర్తింపుఁడు. నన్నయభట్టారకులను వారువీరువలె వాగనుశాసనుఁడు అని ఏకవచనాంతముతో నిర్దేశించుటకు నాతనిమనసు సమ్మతింపదు.

ఆతఁడేమాట పలికినను నయ్యది వినయవివేకసంభరితమై యుండక మానదు.

విమర్శకులలో ఒకరిమాట నొకరు కాదనుటకు రవంతసందు దొరకిన తావులందు "అది నీచము, ఇది తుచ్ఛము" మున్నగురీతిని పరుషభాషణములతో, దూషణములతో, ఆవేశములతో, ఆర్భాటములతో కోలాహలము గావించు కుతూహలముగలవారు కొందఱుందురు. సూరిమాత్ర మాకోవకుఁ జెందిన వాఁడుకాఁడు.

అత్యధికమగు మతభేదమున్నను, విమర్శనమువట్ల నవలంబింపవలసిన మార్దవ గాంభీర్యములు పయినుదాహరించిన ఖండనవాక్యములు పదింటను గర్భితములయి, బాలకులకుఁ గాలక్రమమున విమర్శావసరములందును, వాద ప్రతివాద ప్రసంగములందును, నెట్టి యాదర్శములు కాఁగలవో యోజింపుఁడు.

మఱియు, సంజ్ఞాపరిచ్ఛేదమున తత్సమ తద్భవ దేశ్య గ్రామ్య పదముల స్వరూపమును సలక్షణముగాఁ బ్రదర్శించి, లక్షణవిరుద్ధములగు గ్రామ్యపదములు ప్రయోగార్హములు కావని నిరూపించుచు, లక్షణవిరుద్ధములయినను పెద్దలు వ్యవహరించినవిమాత్రము పరిగ్రాహ్యములని యుపదేశించుచు "కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ" మున్నగువానిని జూపి

"ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు."
"పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యంబయిన గ్రహింపందగునని తాత్పర్యము" —సంజ్ఞా-23

అని తనయాంతర్యము తెలిపినాఁడు.

ఈ సందర్భమున భాషాస్వరూపబోధనముమాట యటుంచి, సహజముగా పెద్దలయెడ నాతనికిఁగల గురుభావ మెట్లువ్యక్తమగుచున్నదో, అట్టిసద్భావమును ఈ వ్యాజమున బాలురకుఁగూడ నుపదేశించుకౌశల మెట్లువిశదమగుచున్నదో గమనింపుఁడు.

మఱియు, కవులలో పోతరాజువలెను, గాయకులలో త్యాగరాజువలెను, లాక్షణికులలో చిన్నయసూరి భక్తాగ్రణిగాఁ గానంబడును. ఈతఁడు వైష్ణవులకు నుండఁదగిన ప్రపత్తి శీలము గలవాఁడు. కావుననే సాధారణ సూత్రోదాహరణములు ప్రదర్శించు పట్టులందుఁగూడ

"నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు." —కారక-18.
"దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు." ,, ,,
"శుభవిధాయుల రామకృష్ణుల భజింతు." ,, ,,
"భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు." ,, ,,
"అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు." ,, 29.
"ఆద్యుఁ డప్రమేయుఁడునగు హరిని గొలుతు." ,, 30.
"ఆద్యుఁడు నమేయగుణుఁడునౌ హరిని గొలుతు." ,, ,,
"ఆద్యుఁ డప్రమేయుండగు హరిని గొలుతు." ,, ,,
"ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై
యెసంగెడు దేవుని నభినుతింతు." ,, 31.

అని యిట్లు తీయని తేటగీతు లాలపించుచు, పరపశుఁడయి నిలుచున్న పవిత్ర మూర్తిగాఁ జదువరులకుఁ బొడగట్టును.

పలుమాఱు కంటఁబడు నిట్టియుదాహృతులవలన నప్రయత్నముగా బాలకులహృదయములందు భక్తిబీజములు నాటుకొనకమానవు. అవి యేనాఁటి కయిన సఫలములు కాకనుమానవు.

మఱియు, సూరి హరిభక్తితత్పరుఁడయ్యును, సువిశాలహృదయుఁ డగుటచే నన్యమతములయెడఁగాని, యితర దైవతములయెడఁగాని యాతనికి నిరసనభావము లేశమును లేనటులు గోచరించును.

ఉకారాంతశబ్దముల సంబోధనమున ప్లుతమును బ్రదర్శించునెడ (తత్సమ-35) "ఓవిష్ణూ ౩" అను నుదాహరణము చూపుచుఁ దనయిష్ట

దైవతమును విష్ణుదేవుని నోరార సంబోధించుకొని, ఆవెనుక "ఓశంభో" అనిగూడ నుదాహరించియున్నాఁడు.

రెండవ యుదాహరణమునకు తత్సమమగు వేరొక ఉదాహరణశబ్దము స్ఫురింపకరాదు. ఆతని హృదయమున దేవతాంతర నిరసనము లేకుండుట వల్లనే, శంభుశబ్దము, వెనువెంటనే స్ఫురించుటయు, దానిని ప్రదర్శించుటయు, సంఘటిల్లినట్లూహించుట యుక్తము. ఇష్టదైవము విష్ణువేయైనను, శంభువుకూడ తత్సముఁడేయని యాతని తలంపు.

ఈ యొక్కఁ డావ్యననేగాక, లక్ష్యపరిచ్ఛేదమున మరికొన్నిచోటు లందుఁగూడ ముందు విష్ణువు, ఆ వెనుక శంభువు తుల్యరూపులయి కానవగు చుందురు. సూరిమతాంతర సామరస్యము పరికింపుఁడు.

శివాయ విష్ణురూపాయ
శివరూపాయ విష్ణవే.

ఇంతదనుక అనేకములగు సందర్భములంబట్టి చిన్నయసూరి శీలస్వరూపమును కొంతకుఁగొంత గుర్తించితిమి.

ఇట్టి శీలసౌమ్యతగల సరసుల పలుకులును లలితములయి యుండుట సహజము. కావున సుకుమారశీలుఁడగు సూరిపలుకులందలి లాలిత్యమెట్టిదో, రాఁబోవు ప్రకరణమున ముచ్చటగా నాలోకింతము.

# ఉక్తి లాలిత్యము

చిన్నయసూరినాఁటికి వచనగ్రంథములు మిక్కిలి యరుదు. తెనుఁగు దేశమందలి బాలబాలికలసందఱను చక్కనివచనము రచింప సమర్థులనుగా దిద్దితీర్పవలయునని యాతనికి గొప్పకోరిక. అట్లగుటచే దేశమునందలి బాలబాలికలందఱను దనయంతేవాసులుగా నాతఁడు భావించినాఁడు. తానొక ప్రధానకళాశాలలో నధ్యాపకుఁడుగూడ నగుటచే, శిష్యబృందము నడుమఁ జిఱునవ్వు మోముతోఁ గూరుచుండి, భాషాసంప్రదాయములను బోధించు చున్నంతటి తృప్తి యీ రచనా సమయమునఁగూడ ఆ మహనీయునకుఁ గలదేమో యనిపించును.

"వినుఁడు బాలకులు! వినుఁడు బాలకులార!"

అని తనయెదుటఁ గూరుచున్నబాలురను గలయఁజూచుచు, సాముదాయికముగ ముందు సంబోధించి, వేఱొకవంకఁ గూరుచున్న బాలికల నుద్దేశించి

"వచ్చితిరి కాంతలు! వచ్చితిరి కాంతలార!"

అని ముద్దుగాఁ బలుకరించి, మరల అటు బాలురదిక్కు మొగంబై

"అన్నలార! మిమ్ముననడిగెద నొకమాట." —తత్సమ-37.

అని బాలురనుమాత్రము ప్రశ్నించుచున్న సన్నివేశమును ఎంతసముచితముగా సంఘటించెనో తిలకింపుఁడు. ప్రశ్నలకు సమాధానములు చెప్పుటలో బాలికలు బిడియపడుదురనికాఁబోలు బాలురనే ప్రశ్నించుట! ఆ ప్రశ్నించుటలో శిష్యుల యెడ నాతనికిఁగల వాత్సల్యమును, అందు బాలికలయెడఁ జూపఁదగిన యాదరాతిశయమును, వారివారి చదువులను ప్రశ్నోత్తర రూపమున చక్కదిద్దు చున్న తీరును, ఒకదానివెంట నొకటి స్ఫురించును.

ఈ దేశమందలి బాలబాలికల కందఱకును నొకతరగతి యేర్పఱిచి తానధ్యాపకుఁడై బోధించుచున్నతీరు, ఈ గ్రంథమునందు పెక్కుతావుల గోచరించుచు, నాతని యధ్యాపనోత్సాహమును వెలువరించుచుండును.

తాను బోధింపఁదలఁచినదా, ప్రాచీనభాషా లక్షణము. ఎదుటనున్నవారా, బాలకులు; పిన్నవయసువారు. కావున, చెప్పెడి మాటలు శుష్కములై, ఉదాహరణ సమన్వయమాత్రప్రయోజనములై, చప్పనివయి యుండరాదు. మఱి, మృదుమధురములై, సరసములై, నీతిబోధకములై, గంభీరభావ గర్భితములై, పురాణ పవిత్రకథా స్ఫోరకములై, హృదయంగమములై యుండ

వలయుననియుఁ దలంచెను. అంతియగాదు. తిక్తములగు నౌషధములను తియ్యని యనుపానములతో రంగరించినట్లు క్లిష్టములగు వ్యాకరణప్రక్రియాభంగులను లలితములగు సూక్తులతో మేళవించి, బాలుర విషయగ్రహణక్లేశమును మఱచి ఉల్లాసముతో గ్రహించునట్లు బోధించుటయు, బాలవ్యాకరణరచనలో నాతని ప్రధానదృక్పథము. కావుననే గ్రంథారంభమున

"అనయము లలితోక్తులతో
నొనరుపదంగూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణమొనర్తు నాంధ్రంబునకున్"

అని తన హృదయము నావిష్కరించియుండెను. తాను, ఏ విషయము వివరించినను, ఏ లక్ష్యము చూపినను, అందు కుదిరినంతవట్టు అంతర్వాహినిగా లాలిత్యరీతి గోచరించి, బాలురకు నుత్సాహజనకమై, యాకర్షకము కావలయునని యాతని సంకల్పము.

మనోహరములగు కథాఘట్టములను గైకొని, సరసములగు కావ్యములను రచించునెడ, లలితముగను హృదయంగమముగను రచన సాగింపవచ్చును. అట్లు సాగింతుమని కవులు ప్రతిజ్ఞలును జేయవచ్చును. ఆ ప్రతిజ్ఞలు నిర్వహించుకొనుటయు నసంభవము కాకపోవచ్చును. కాని, కష్టములు కఠినములునగు వ్యాకరణాంశములను వివరించునప్పుడుగూడ "లలితోక్తుల" తోడనే రచన సాగింపసంకల్పించుటయు, ఆ విధానమును తుదముట్ట నిర్వహించుటయు లాక్షణికులలో నొక్క చిన్నయసూరికే చెల్లినది. క్లిష్టకర్కశమైన వ్యాకరణాంశముగూడ నాతనిపలుకుబడితీరులో మనోహరమగు కావ్యత్వసిద్ధిని పొందినది. ఇదిమాత్రము ఏ వ్యాకరణములందును లేనివింత.

ఇంతయేల! సూరి తాను బాలురకు బోధింపఁదలఁచిన ప్రధానవిషయములు రెండును రెండుశాస్త్రములు. ఒకటి నీతిశాస్త్రము. ఒకటి వ్యాకరణశాస్త్రము. ఆ రెండిటిలో నీతిశాస్త్రమును కథలతోను, వ్యాకరణమును లలితోక్తులతోను బోధింపవలయునను సంకల్పములోనే యాతని సౌకుమార్యమంతయు గర్భితమై యున్నది.

దీనినిబట్టి సూరిహృదయ మెంతమృదువైనదో, ఆయనభావ మెంత విశాలమో, బాలురయెడ నాయనకెట్టి యభిమానమో, సులభముగా గ్రహింపనగును.

"అతఁడు శ్రీమంతుఁడు, ఇతఁడు గుణవంతుఁడు. వానివంశము శ్రీమంతము, వీనివంశము గుణవంతము. ఆమె శ్రీమంతురాలు. ఈమె విద్వాంసురాలు." —తత్సమ-71.

పైవాక్యములను జదువుటతోడనే, ఆతఁడు బాలురను తనయెదుటఁ గూర్చుండఁబెట్టుకొని, వారిలో నొక్కొక్కరిని వ్రేలితోఁ జూపుచు, విషయములను బోధించుచున్న సన్నివేశము మనకన్నులకుఁ గట్టును.

"మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యం బిందు నామంబగు." —తత్సమ-70.

"దానియంతిమమకారంబునకు లోపంబగు." —తత్సమ-71.

అను సూత్రములకు

"శ్రీమంతము, గుణవంతము, విద్వాంసము, అనడ్వాహము, శ్వానము, అప్సరస"

అని యుదాహరించిన పదముల వరుసను ఈ సందర్భమున సంధానించుకొని, వానియంతరార్థమును నిదానముగా పరికింపుఁడు.

శ్రీమంతులగువారు గుణవంతులై, విద్యాబుద్ధులు గడింపవలెనుగాని, అనడ్వాహములై (పశుప్రాయులై) శునకాదులతో వినోదించుచు, ఆటవెలందుల ముచ్చటలకు లోనగుట తగదని నిగూఢముగా నుపదేశించుతీరు పొడగట్టును. అట్లే

"ధనముచేత సౌఖ్యంబుగలుగు." —కారక-4.

"విద్యచేత యశంబు గలుగు." ,, ,,

"విద్యాశాలియగుపురుషుని సకలజనులు సన్మానింతురు." ,, 28.

"అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్." —సంధి-20.

ఇచట ధనము, విద్య అను నీ రెండిటివలనఁగలుగు ప్రయోజనముల తారతమ్యము చూపుచు, సౌఖ్యము తాత్కాలికము, యశము శాశ్వతము గావున ధనమార్జించుటకన్న విద్యసంపాదించుట శ్రేయోదాయకమనియు, విద్వాంసులయినచో లోకమున సమ్మానింపఁబడుదురనియు, పండితులను సేవించినచో విద్యాబుద్ధులకు వికాసము గలుగుననియు బోధించుట ఆతని యాంతర్యము. ఈ వాక్యములందు సూక్ష్మములో మోక్షమనురీతిగా సందమయిన బింబ ప్రతిబింబభావముగూడ నిమిడియున్నది.

అంతియగాదు, ఆ బాలకులలో నొకనిని బిలిచి

"భవద్గుణంబులు త్వదాశ్రయములు." —తత్సమ-87.

నాయనా! నీవు సుగుణవంతుఁడవు గావలెను. అట్లగుట నీప్రవర్తనా భ్యాసమువలనఁ గలుగును. అది నీలోనేయున్నదిగాని, యొకరుతెచ్చిపెట్ట వలసినది గాదుసుమా!

అని బోధించుచు, తనచుట్టునున్న బాలురఁ గలయఁజూచి

"మత్పుణ్యము లస్రావము." —తత్సమ-87.

నా పుణ్యము చాలమంచిది. మీవంటి శ్రద్ధాళువులగు బాలురకు నుపదే శించుటచే నా వ్యాకరణ పరిశ్రమ సార్థకమగుచున్నది. కాని

"భవిష్యత్కాలము పూర్వాహ్నము." —తత్సమ-87.

రాఁబోవుకాలమెట్టిదో! భాషావిషయకముగా నెట్టియలజడులు పుట్టి యున్నవో! కంటికేగాని కర్ణమునకు గోచరింపని యీయరసున్నలతోఁ జిక్కులు పడలేమయా యని ఘోషవెట్టు సుకుమారులు కొందఱిప్పటికే యుద్భ వించినారు. ఇట్టి ప్రబుద్ధులవలన నెప్పటికోగాదు

హ్రస్వముమీఁద (=అల్పకాలముననే) ఖండించుటకుఁ బూర్ణ బిందువు = ం (=శూన్యత) వైకల్పికముగానగు (సంజ్ఞ-11) నేమోయని భీతిపొడముచున్నది. నేను మీకొఱకు బహుపరిశ్రమచేసి సంతరించిన యీ వ్యాకరణ నియమములను ఎంతభద్రముగా సంరక్షింతురో! భారము మీదిసుఁడీ!

అని హెచ్చరించుచున్నతీరు స్ఫురింపకమానదు.

ప్రసంగము వచ్చినప్పుడెల్ల నుదాహరణవ్యాజమున బాలురహృదయము లలో నాటుకొనునట్లు నీతులను ధర్మములను బోధించుట యాతని సహజ రమణీయ సరణులలో నొకటి.

"పురుషార్థంబునకు యత్నింపవలయు." —కారక-8.

"సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు." —సంధి-55.

"లోభంబుకంటె నితరంబు దోషంబు లేదు." —కారక-12.

"మానహానికంటె మరణము మేలు." —కారక-13.

"మోక్షమున నిచ్ఛగలదు." —కారక-18.

"జ్ఞానమువలన ముక్తుండగు." —కారక-14.

"సర్వంబునందీశ్వరుఁడుండును — సర్వంబీశ్వరునియందుండును." —క్రియా-22.

"భూతదయాళురగు మహాత్ములకు శ్రేయంబు గలుగును." —కారక-28.

ఈ వాక్యపద్ధతిని పరికింపుఁడు.

ఎల్లరును బురుషార్థములు సాధింపవలయుననియు, అసత్యము పలుకరాదనియు, లోభము దుర్గుణమనియు, మానము రక్షణీయమనియు, భగవంతుఁడు సర్వవ్యాపియనియు, భూతదయాపరులయి మెలంగుట లోకకల్యాణకరమనియు, అట్టివారే మహాత్ములనఁబడుదురనియు, వాలురకు బోధించుతీరు ప్రతివాక్య విన్యాసమునను గానవచ్చును.

సాధారణముగా నీయవలసిన యుదాహరణములలోనే యింత మారవుఁ జూపగలసూరి, విశేషించి చూపవలసిన యుదాహరణములలో నెంత జాగరూకత వహించునో, తన్మూలమునఁ జదువరులగు బాలుర కెన్నిరీతుల యుపదేశములు చేయునో, యించుక పరికింతము :

> "అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దాననగు దానికి వలన వర్ణకంబగు."
>
> —కారక-9.

అనుసూత్రమున కాతఁడిచ్చిన యుదాహరణములు పరికించినచోఁ బై యంశము విశదమగును.

> "పాపంబువలన నేవగించె" : ఏవగింపవలసినది పాపము. పాపకృత్య మెట్టి పరిస్థితులలోను జేయరాదు.
>
> "అధ్యయనమువలన డస్సె" : ఊరక పెదవులపైఁ జదువుట గాదు. అలసిపోవునట్లు చదువవలయును.
>
> "పాడివలనం బరాకుపడియె" : పరాకు పడరానిది ధర్మము. దేని విషయమునను పరాకుపడరాదు — విశేషించి ధర్మము విషయమున.
>
> "చోరునివలనం గాచె" : అందఱిలో చోరులు భయజనకులు. హాని కరులు. కాన నెట్టివారినేని చోరబాధనుండి రక్షింపవలయును.
>
> "భోగంబులవలన విరమించె" : అనుభవించుచున్నకొలఁది భోగములు ఎంతవారికేని అధఃపతనము గలిగించును. కావున, వానినుండి మనస్సును మరలించుకొనవలయును.
>
> "శోకంబువలన వారించె" : ఇతరుల దుఃఖమును మాన్పుటకు యత్నింపవలయును.

ఈ విధమున నిదానముగాఁ జూచినచో, సూరి యుదాహరించిన వాక్యము లొకవంక లక్ష్యానుభవమును లక్షణజ్ఞానమును గలిగించుచు, వేఱొక వంక ధర్మసూక్ష్మములను గూడ బాలుర కుపదేశింపఁజాలియుండును.

ధర్మములు, నీతులు, నియమములు బోధించుటయేగాక, యవకాశము గలిగినపుడెల్లఁ జిన్నచిన్న వాక్యములలోఁ బురాణప్రసిద్ధ పవిత్ర కథాంశములు

గూడ బాలురహృదయములకు హత్తుకొనునట్లుదాహరించుట యాతనిరచనలో గమనింపవలసిన యింకొక విశేషము.

"రామునికంటె నస్యుండు ధానుష్కుండు లేఁడు." —కారక-12.
"విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించె." —క్రియా-124.
"రాముఁడు మిథిలం గనియె." —క్రియా-124.
"రాముఁడు విల్లందినం త్రిలోకంబు లాకులంబులగు." —కారక-32.
"జనకుఁడు రామునకుం గన్య నిచ్చెను." —కారక-8.
"రాముఁడుపట్టినప్రతిన వారింపందరంబుగాదు." —కారక-32.
"రాజునాజ్ఞ. విధాతృనానతి." —సంధి-34.
"రాముఁడు వసించిన పర్ణగృహము." —సమాస-26.
"రాముఁడు రక్షించిన భృత్యుఁడు." —సమాస-26.
"రాముఁడు వాలి నొక్కకోలం గూలనేసె." —కారక-22.
"ఓయి రాముఁడ! ఓ రాముఁడ! ఓ హరీ! ఓ తండ్రీ!"
—తత్సమ-15, 33.
"ఓరోరి యింకెందుఁబోవవచ్చు." —తత్సమ-16.
"మదిసెడు దడములు. కావలుఁడు రావణుఁడు." —సమాస-5.
"లంకం గలకలంబుపుట్టె." —కారక-22.
"రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె." —కారక-1.
"రాముఁడు రావణుం బరిమార్చి సీతయుందాను సౌమిత్రిసహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబునకేతెంచె." —క్రియా-120.
"సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద." —కారక-27.
"మేన నిప్పుడుం బులకలు వొడమెడును." —క్రియా-22.

ఇట విశ్వామిత్ర యాగరక్షణ సందర్భమున రాముఁడు రాక్షసులఁ బరిమార్చుట, విశ్వామిత్రుఁడు రాముని మిథిలానగరమునకుఁ దనవెంటఁ గొంపోవుట, రాముఁడు లోకత్రయవీరులెల్లరు నాకులతఁజెందునట్లు వారి సమక్షమున శివధనుర్భంగము గావించుట, జానకిని బరిణయమాడుట, లోకైక ధానుష్కుఁడై పరశురాముని జయించుట, భరతాదు లెంతగా వేఁడుకొన్నను మనోనిశ్చయము సడలింపక 'రాజునాజ్ఞను విధాతృనానతి'గఁ బాటించి యరణ్య వాసమునకై పట్టిన ప్రతిన వీడకుండుట, అరణ్యమున పర్ణశాలయందు నివసించుట, తనధానుష్కతామహిమ వెలయించి మహావీరులగు రక్కసులఁ బెక్కుర నుక్కడఁగించుట, వాలిబాధనుండి రక్షింతునని సుగ్రీవునితో సఖ్యము సేయుట, వాలి నొక్కబాణంబునఁ గూలనేయుట, రావణునంతటివానిని జంక నిఱికించుకొని సప్తసముద్రములందు మునిచియెత్తిన బలశాలియగు వాలిని ఒక్కకోలతోఁ గూలనేసెనను వార్త ప్రాఁకుటతోడనే "ఓయి రాముఁడా! ఇంక

మా గతి యేమగునో! ఓ హరీ! ఓ తండ్రీ! ఎందుఁబోదుము? ఇఁక మా సేన లెల్ల మడసిపోవును. పాపాత్ముఁడు రావణుఁడు ఎల్లరకు హానిదెచ్చినాఁడు" అని లంకావాసులలోఁ గలకలము పుట్టుట, ఆ పిమ్మట రాముఁడు రావణుని సంహరించి సీతయుం దాను సౌమిత్రిసహితంబుగఁ బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచుట—మున్నగు రామాయణమునందలి ప్రధాన కథా భాగములు పెక్కులు పయివాక్యములందు సూచితములయినట్లు స్ఫురించును. అంతియగాక "సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద"నని పలుకుటలో శ్రీరాముని సాక్షాత్కరింపఁజేసికొని, పులకితాంగుఁడయి కేలుమోడ్చి పారవశ్యముతో నాతఁడు నిలుచున్న దృశ్యముగూడ కన్నులకుఁ గట్టినట్లు కానవచ్చును.

ఈ యుదాహరణములలో లక్షణసమన్వయము గావించుకొన్నపిమ్మట, దూరదర్శులగు నుపాధ్యాయులును, సుకుమారమతులగు బాలకులును రామాయణకథాఘట్టములను గుఱుతునకుఁ దెచ్చుకొని వినోదింపవలయును. అని యాతని కుతూహలము. మఱియు

"కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను." —క్రియా-124.
"అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె."
—కారక-22.
"అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమయిన కేశవార్జునకృతి."
—కారక-28.

ఈ చిన్నవాక్యములవలన భగవద్గీతాప్రసక్తియు, బంధుజనసంహారమునకు వెనుదీయుచున్న యర్జునునికి శ్రీకృష్ణుఁడు తనవిశ్వరూపముఁ జూపి, తత్త్వోపదేశముచేసి, యాతనిని సమరోన్ముఖుని గావించుటయు, పిమ్మట నర్జునుఁడు మనసు దిట్టపఱుచుకొని కౌరవసేనలఁ బరిమార్చుటయు, రణరంగమున కృష్ణార్జునుల అమానుషశక్తులకు మహాయోధులెల్లరును నద్భుతమందుటయు, నాదిగాఁగల భారతయుద్ధఘట్టమునందలి ప్రధానాంశములను స్ఫురింపఁజేయుట ప్రస్ఫుటముగా గోచరించును. ఇటులే

"కృష్ణుండు తల్లివలన దాఁగె." —కారక-9.
"రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి." —కారక-7.

అను వాక్యములలో వ్రేపల్లెలోని శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, బలరామ కృష్ణుల విద్యాభ్యాసము, దానినిబట్టి స్ఫురింపకతప్పని కుచేలవృత్తాంతము మున్నగు భాగవతకథాంశములు నిర్దిష్టములయి యున్నవి.

"జరాసంధుఁడు రాజులచేతఁ గప్పంబుగొనియె." —కారక-4.

రాజులనెల్ల జయించి వారిచే జరాసంధుఁడు కప్పములుగొనుట హరివంశ కథకు ప్రస్తావము.

వ్యాకరణప్రక్రియలనడుమ నిట్లు రామాయణ, భారత, భాగవతాదులందలి కమనీయ కథాఘట్టములు స్ఫురింపఁజేయుటకు నాతని సూక్ష్మదృష్టి యెట్టిదయి యుండవలయునో సుధీవరులు పరికింపఁదగు.

ఇట్టిపట్ల "రామునికంటె సన్మార్గుఁడు ధానుష్కుండును లేఁడు" అనుటకు మాఱు "నాకరుతంబుకంటె నన్యంబు కర్ణకఠోరంబు లేదు; ఘనంబుకంటె నితరంబు భారవాహకంబు లేదు" మున్నగుదాని నుదాహరించినను లక్షణ సమన్వయమున కెట్టికొఱంతయుఁ గలుగదు. అట్టి సాధారణదృష్టితోడనే

"హరికంటె హరుఁడధికుఁడు."

"రామునికంటె శివుఁడన్యుఁడు."

"వనముకంటెఁ జేరువ."

అని పూర్వలాక్షణికులు ఈ సందర్భమునం దుదాహరణములు చూపియుండిరి. అట్లు నీరసములు నిరుపయోగములునగు వాక్యములు నిర్దేశింపక, ఆనంద కరములు, ఆకర్షకములు, అతిప్రసిద్ధములునగు నర్థములను స్ఫురింపఁజేయు వాక్యములు నిర్దేశించుటలోని లాలిత్యము మెప్పులందకతప్పదు.

ఈ సందర్భమున మఱికొన్ని యుదాహరణములతీరుగూడ పరికింపుఁడు:

తిర్యక్కులు కర్తలగునపుడు భూతతద్ధర్మాద్యర్థకముల ప్రథమపురుష బహువచనమునకు నేకవచనంబగుననుటకు (క్రియా-25). "చిలుకలు పలికెను, చిలుకలు పలుకును" అని సూరిచూపిన యుదాహరణములు. "కాకులు కూసెను, కాకులు కూయును" అని చూపరాదా? చూపవచ్చును. చూపఁడు. వ్యాకరణము నందయినను, బాలకుల చెవులకు సోఁకఁదగినవి చిలుకపలుకులుగాని, కాకి యఱపులు కావని యాతనిదృష్టి.

ఇదేసందర్భమునఁ బూర్వలాక్షణికులు "సింహములు చరించెను, సింహములు పరాక్రమించెను, పులులు కఱచెను, పశువులు వచ్చెను, పక్షులు ప్రాలెను" ఇత్యాదిగా భీకరములు, నీరసములునగు సన్నివేశములు చూపినవారే కానంబడుదురు. అది వారివారి దృష్టులలోని తారతమ్యము.

ఈ రీతిగా, వ్యాకరణద్వారమున, నొకవంక ధర్మములను నీతులను బోధించుచు, వేఱొకవంక పురాతన పవిత్రగాథలను స్ఫురింపఁజేయుచు, నడుమ నడుమ భక్తిని నెలకొల్పఁజాలు నలఁతియలఁతి వాక్యములను ఛందోబద్ధములై కంఠస్థములగుట కనువయిన చిన్నచిన్న పద్యభాగములను గల్పించి యుదాహరించుటయు నాతని రచనలోని మఱియొక్క విశేషము.

"హరి ననుఁ గృపఁ గాంచెడును." —క్రియా-26.
"హరి ననుఁ గృపఁ గాంచుతను." —క్రియా-26.
"ఆర్తిహరుఁడగు నినుఁగొల్తు నంబుజాక్ష." —కారక-34.

ఇట్టి భగవద్భక్తిగర్భితములగు వాక్యములు బాలకుల హృదయములందు ముద్రితములై, యొకప్పుడుగాకున్న నొకప్పుడేని స్మృతిపథమునకు రాక మానవనియు, రావలయుననియు నాతని తలంపు.

సూరి వైష్ణవప్రవత్తిసంకలితుఁడగుటచే హరిభక్తిని బ్రోత్సహించుచు నాతఁడిచ్చు నుదాహరణములు రామకృష్ణపరములై రామాయణ భాగవత ప్రసక్తములై యుండుననుటలో వింత యేమియు లేదు. అట్లుండుటకు ఆతని యతిగాఢమగు విష్ణుభక్తియే కారణము.

"వారిద్దఱు రుక్మిణీసత్యభామలు. వీరు మువ్వురు శ్రీ భూ నీళలు."
—ఆచ్ఛిక-26.

ఆయా దేవతామూర్తులను గన్నులయెదుటఁ జూపి బాలురహృదయమునకు ఆ దివ్యమూర్తులు హత్తునట్లు చెప్పుతీరు పైయుదాహరణములలోఁ గన్పట్టును. ఇందలి వ్యాకరణవిషయము : సర్వనామ క్రియాపదముల బహువచనము మహద్వాచకమున కెట్లుండునో మహతీవాచకమునకుఁగూడ నట్లే యుండునని నిరూపించుట. ఆ నిరూపించుటలో — ఏ స్త్రీవాచకరూపముల నిచ్చినను బ్రకృతమునకు లక్ష్యములు గాకపోవు. అట్లు చూపుట ఆయన స్వభావము గాదు. వీలగునంతవఱకుఁ బురాణమూర్తులను, అందును దేవతామూర్తులను బాలురకుఁ జూపి చెప్పవలయును. ఆ దృష్టితోడనే వారిద్దఱు రుక్మిణీసత్యభామలు. వీరు మువ్వురు శ్రీ భూ నీళలు. అని విష్ణుని పట్టపు రాణులను బ్రసంగవశమున బాలురయెదుట సాక్షాత్కరింపఁజేసి వ్రేలితోఁ జూపుచున్నట్లుదాహరించియుండెను.

చిన్నయసూరి మంచివివేచనముతోపాటు నిదానమగు చూపును, లౌకికానుభవ పరిణతియునుగలవ్యక్తి. శాస్త్రీయవిషయములు క్లిష్టములయి దురవగాహములయి యారంభదశలో నున్నవారికెంత విసువు జనింపఁజేయునో గుర్తించిన తత్త్వజ్ఞుఁడు. కనుకనే లోకవృత్తములను, మనోహర సన్నివేశములను, దన యుదాహరణములలో నతినిపుణతతోఁ బొదిగి చక్కని కావ్యలాలిత్యము గోచరించునట్లు వ్యాకరణము రచించెను.

కారకపరిచ్ఛేదమున "జడంబుద్వితీయకుఁ బ్రథమ బహుళంబుగానగు" అను సూత్రమునకు

"వాఁడు పువ్వులు దెచ్చె" (వాఁడు పువ్వులను దెచ్చె)
"ఆకె సొమ్ములు దాల్చె" (ఆకె సొమ్ములను దాల్చె)
"వాఁడిల్లు వెడలె" (వాఁడింటిని వెడలె)

అను వాక్యములు ఉదాహరణములు.

ఈ యుదాహరణములను సామాన్యదృష్టితోఁ జూచినచో 'పువ్వులను' అను ద్వితీయకు 'పువ్వులు' అని ప్రథమ వచ్చుటమాత్రమే గోచరించును. కాని, యీ సూత్రమందలి పదములసారస్యము, ఉదాహరణవాక్యరీతిని, గలిపి నిదానముగా పరికించినచో, ఇది యొక చిన్న వినోదఘట్టముగా స్ఫురించును.

మనదేశమున సాధారణముగా సంసారభారమువహించుటలో భర్త మొదటివాఁడుగను, భార్య రెండవదిగను నుండుట పరిపాటి. దీనినిబట్టియే భార్యకు 'ద్వితీయ' అనుపేరుగూడ నేర్పడియుండును. కాని, జడసంబంధి ద్వితీయ (భార్య) ప్రథమగా మాఱును. అనఁగా సంసారనిర్వహణమున ప్రధానురాలు కావలసియుండును. భర్త జడుఁడు. సంసారమును జక్కదిద్దుకొననేరఁడు. ఆ భారముసహితము తానే వహింపవలసివచ్చుటచే, ఆమెకుఁ గొంత విసుగును, భర్తపైని అలక్ష్యభావమును నేర్పడుట సహజము. అట్టి భార్యకు నేదేనొకమార్గమున వాఁడు ప్రీతిని గలిగింప యత్నించుటయు సహజము. అందులకే గాఁబోలును, పాపము ఆమెయిచ్ఛకమునకై వాఁడు పూవులు దెచ్చెనఁట. ఆమె, ఆతఁడు తెచ్చినపూలు ముడుచుకొన నిచ్చగింపక, తనకున్న మఱేవోసొమ్ములు దాల్చెనఁట. ఆతఁడెంత జడుఁడైనను, తాను దెచ్చిన పూవులు నిరాకరించుటవలనఁ జిన్నవోక తప్పదుగదా ! చిన్నవోయి, ఏమియుఁ జేయలేక, ఏమాటయుఁ బలుకలేక వాఁడిల్లు వెడలెనఁట.

అడుగడుగునను, ఇట్టి చిరాకులు తటస్థింపకుండఁ దనకు లోకువయగు భార్యనే తొలుతఁ బరిగ్రహింపరాదా యనుటకును వలనుపడదు. అది వానికే గాదు ఎవ్వరికిని శక్యముగానిపని. ద్వితీయప్రాప్తించు విధిసూత్రము మారముగా వేఱొకటిగలదు.

"కర్మంబున ద్వితీయయగు." —కారక-2.

ఎచ్చటనైనను కర్మనుబట్టియే ద్వితీయ ప్రాప్తించును.

చేఁతగాని మగఁడు! చుఱుకయిన భార్య!! సంసారమున ఆ దంపతుల పోకడలు—వీనిని ఈ చిన్నిఘట్టమున ఎంతవినోదముగా స్ఫురింపఁజేసెనో పరికింపుఁడు.

ఈ సూత్రమునకు—రథమెక్కి దిగెను, చెట్టెక్కి దిగెను, కొండదిగెను, అంగదము బూడ్చెను—ఇత్యాదులు పూర్వలాక్షణికుల యుదాహరణములు. వీనిలో లక్షణసమన్వయదృష్టిమాత్రమేకాని యితరము కానరాదు.

సంధిపరిచ్ఛేదమున నడుగుపెట్టినతోడనే
"మేనల్లుఁడు, పుట్టినిల్లు, చూడకుండెను" —సంధి-4.
అను నుదాహరణములు కంటఁబడును. నిర్లక్ష్యముగఁగాక నిదానముగా ఆ యుదాహరణములు మూడింటిని గలిపి చదువుఁడు:
"మేనల్లుఁడు పుట్టినిల్లు చూడకుండెను."

మేనల్లుఁడు పుట్టినిల్లుచూడకయుండునది ఎచ్చట? మేనమామయింట. అచట నాతఁడు నిలువఁద్రొక్కుకొనియుండుటకు ఆకర్షకమగు మనోహరాకృతి ఏదియో యుండవలయును. కనుకనే యాతఁడు పుట్టినింటికిఁ బోవకుండుట. వ్యాకరణోదాహరణవ్యాజమున నెట్టి సరససన్నివేశమును ధ్వనింపఁజేసెనో పరికింపుఁడు. మఱియు

ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములు విధించి —సంధి-17.
"పూచెను గలువలు; తోఁచెను జుక్కలు; చేసెను దక్కులు; నెగడెను దమములు; మొగిడెను బద్మము."
అని యుదాహరించెను.

స్థూలదృష్టికిఁ బై యుదాహరణములలో క్రమముగాఁ బరుషములకు సరళము లాదేశము లగుటయే చూపట్టును. కాని యీ యుదాహరణములతీరును, క్రమమును సూక్ష్మముగాఁ బరిశీలించి చూచినచో ఈ వాక్యములయందు సాయంసంధ్యావర్ణన మిమిడియున్నటులు గోచరించును. సాయంకాలమగుట తోడనే కమలబాంధవుఁ డస్తమించుటయు, కలువలతేఁ డుదయించుటయుఁ బరిపాటిగదా! చంద్రోదయమగుటతోడనే కలువలు పూచినవి. చుక్కలును బొడసూపినవి. క్రమముగాఁ జీఁకటులలముకొనినవి. కావుననే జారచోరులు టక్కులు (మోసములు) సేయ మొదలిడినారు. జలజబాంధవుఁడస్తమించెను గానఁ బద్మములు ముకుళించినవి. ఈ తీరున కువలయ వికాసము, నక్షత్రోదయము, తమఃప్రసారము, జారచోర విజృంభణము, పద్మముకుళనము అను సాయంకాలధర్మముల నిరూపించుటచే సంధ్యాసమయస్ఫూర్తియు, తత్కాల ప్రవర్తమాన ప్రకృతిసిద్ధ కార్యస్ఫూర్తియుఁ గలిగించెను.

సూరి, బుద్ధిపూర్వకముగా నిట్టిసన్నివేశములఁ గల్పించెనా, లేక యానుషంగికముగా నయ్యవి కుదురుపడినవా యనుచర్చతో మనకుఁ బ్రసక్తివలదు. శుష్కములగు వ్యాకరణాంశములను నిరూపించుపట్లఁగూడ, సూరిదృష్టి

మనోహరమై లలితమగు రచనారీతి ననుసరించునని గుర్తించుటమాత్రమే సరసమార్గము.

"పువ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాషనగు." —సంధి-46.

అను సూత్రమునకు

"భయపడె; సూత్రముపట్టె; గజముపడియె; అశ్వముపడియె."

అను నుదాహరణములు గలవు. సూక్ష్మముగా నాలోచించినచో నిందు వ్యాకరణాభ్యాసావశ్యకతనుగూర్చిన సూరిహెచ్చరిక ధ్వనించును. ఎట్లందురా?

వ్యాకరణము నభ్యసింపనివాడు భాషారంగమున నెల్లప్పుడును, అడుగడుగునను భయపడుచుండుట తప్పదు. అట్టియెడ సూత్రముపట్టినచో, అనఁగా, వ్యాకరణసూత్రములను వశపఱుచుకొన్నచో, అట్టివారిని ఏనుఁగుల వంటి బలశాలులైనను, అశ్వములవంటి జవశాలులయినను ఎదిరింపఁజాలరు. అను నభిప్రాయ మంతర్నిగూఢమయి పయియుదాహరణములలోఁ బరిస్ఫురించుచున్నది.

నిజమునకు బాలవ్యాకరణసూత్రములు బాలురభాషకు జీవసూత్రములు. వీనిని కంఠస్థముచేసికొన్నచో ఇవి బాలికలకు మంగళసూత్రములు.

ఇట్లే సంధిపరిచ్ఛేదాంతమున అనుకరణసంధిసూత్రోదాహరణములుగా
"వర్ధతాం శ్రీ యనియె."
"తుభ్యం నమోయనె."
"ఈ కార్యము లాఁతిచోసహితము గానంబడియెడి; గతానుగతికో లోకో యటంచున్."
"కింతత్తనియె. కస్త్వమ్మనియె."
"దాసోహమ్మనె."
"తత్కర్తవ్యమ్మనె."

అను వాక్యములు గలవు.

సాధారణముగాఁ జూచినచో సంస్కృతవాక్యములు తెలుఁగులో ననుకరించునపుడుండవలసిన విధానముమాత్రమే పైవాక్యములలో గోచరించును. కాని సూక్ష్మముగాఁ బరిశీలించితిమేని, యిందొక వినోదప్రసంగముగూడ నిమిడియున్నట్లు బోధపడును.

వైష్ణవసంప్రదాయముగల యాచార్యుఁడు తనశిష్యుని 'వర్ధతాంశ్రీః' అని మంగళాశాసన పూర్వకముగాఁ బలుకరించినాఁడఁట.

వైష్ణవసంఘమున పెద్దలు తారసిల్లినపుడు ఉత్తరీయము మొలకుఁజుట్టి దాసోహమని పలుకుచు, దండము సమర్పించుట సంప్రదాయము. పొరపాటున అదిమఱచి యా శిష్యుఁడు నమస్కారమండీ అను సామాన్యపు వాడుకరీతిని 'తుభ్యంనమః' అని పలికినాఁడఁట.

అంతట ఆచార్యులు కన్నుఱ్ఱఁజేసి, అదేనా నమస్కారపద్ధతి! ఈతీరు నీలోనేగాదు. లాఁతిచో సహితము గనంబడియెడి. గతానుగతికో లోకః—ఒకరినిజూచి యొకరు—ఈకాలపు బాలురు ప్రాచీనమర్యాదలు పాటింపకున్నారు. 'కింతత్ ? కస్త్వమ్ ?'—అదేమోయి ! నీవెవ్వరవు ?—వైష్ణవసంప్రదాయము లోనివాఁడవుకావా ? అని హెచ్చరించినారఁట.

అప్పుడాశిష్యుఁడు జ్ఞప్తికిఁదెచ్చుకొని, నాలుకకఱచుకొని, తప్పుదిద్దు కొనుచు : స్వామీ ! 'దాసోహ'మ్మనియెనఁట.

అటుపయి నాచార్యులు 'తత్కర్తవ్యమ్'—అదీ ఆచారపద్ధతి.—అని పలికినారఁట.

ఈ వైష్ణవ గురుశిష్యుల ప్రసంగమునందలి ముచ్చటను గమనింపుఁడు.

ఇష్టే నుజ్యంతంబగు అగుధాతువు (=కాన్) అనుప్రయుక్తమగునను విషయమునకు నుదాహరింపఁబడిన (క్రియా-116) "లెస్సగా, న్యాయ్యముగా, చూడఁగా, ఇట స్వత్వము లేదు" అను పదముల సన్నివేశమును పరికింపుఁడు.

బాగుగను, నిదానముగను, న్యాయ్యముగను, బరిశీలించి చూచితిమేని, ఈ భౌతికప్రపంచములో మనకు దేనియెడను స్వత్వములేదు. అనఁగా నాది అనుకొనఁదగిన వస్తువేదియు లేదన్నమాట. కావున, దేనియెడను మమకారము చూపరాదు. అను తత్త్వోపదేశము నిగూఢముగా గోచరించుచున్నది.

మఱియు, సూరి ప్రాచీను లుపేక్షించిన ఆచ్ఛికపదప్రక్రియను వివరించుటయేగాక, గ్రంథముమొత్తమున తెనుఁగుపదములను, తెనుఁగువాక్యములను, తెనుఁగు పలుకుబడులను హెచ్చుగా నుదాహరించియుండెను. ఆచ్ఛిక తద్ధిత క్రియా కృదంత ప్రకీర్ణక పరిచ్ఛేదములలో నాతఁడు చూపినదంతయుఁ గేవలమాచ్ఛికపదప్రక్రియయే. అందును తెనుఁగు క్రియలస్వరూపస్వభావములను గూర్చియు, వాని వివిధరూపములప్రక్రియను గూర్చియు, మిక్కిలి విపులముగను విశదముగను వివరించియుండెను. దీనివలన, ఆచ్ఛికపదప్రక్రియానిరూపణమున లాక్షణికులలో ప్రముఖుఁడన్న విశిష్టత యాతనికి దక్కినది. ఆ తృప్తి యాయనమాటలలోఁగూడ నిగూఢముగా నిమిడియున్నదేమో యనిపించును.

క్రియలలో నిష్పన్నములగురూపముల ప్రక్రియను జక్కని యాను పూర్వితో సమగ్రముగాఁ బ్రదర్శించి, ఆ పరిచ్ఛేదము తుట్టతుదని 124వ సూత్రమున, వృత్తియందు "కన్యాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగా నగు"నని వివరించుచు, 'కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపె'నని యుదాహరించెను. కృష్ణుఁ డర్జునునకు విశ్వరూపము చూపినరీతిగనే, ఇంతదనుకఁ బూర్వులు చూపని వివేచన ఆఖ్యాతక్రియాపదవిశ్వరూపమును తా నీ ప్రకరణమున బాలురకుఁ జూపఁగలిగితిననియు, కావుననే మేన నిష్పందుం బులకలు పొడమెడుననియు, తనలోఁదానముకొనుచు తృప్తిఁజెందెనా యని పించును. రచయితకు సట్టితృప్తి యొదవుట నైసర్గికము.

నిజమునకు క్రియాపరిచ్ఛేదము అతివిపులముగను, అత్యంత విశదము గను నున్నది. క్రియాపదప్రక్రియలో నింతటి వైపుల్యమును, వైశద్యమును నేవ్యాకరణమునందును గానరాదు.

సాధారణముగా గద్యముకంటెఁ బద్యము శ్రావ్యమయి, పఠనానుకూల మయి, ధారణయోగ్యమై యుండును. చింతామణి వికృతివివేకములు సంస్కృత తమునను, భూషణచూడామణ్యాదు లాంధ్రమునను, పద్యమయములై యుండుట సర్వవిదితము. ఇట్లు ప్రాచీనాంధ్ర లాక్షణికులు బాలకుల ధారణాను కూలతకే తమరచనలను ఛందోబద్ధములు గావించియుందురు.

చిన్నయసూరియు, ఈ యభిప్రాయముతోడనే తొలుదొల్తఁ దన వ్యాకరణమును పద్యాంధ్రవ్యాకరణమనుపేర ఛందోరూపముననే యుపక్రమించి యుండెను. పిమ్మట, లక్షణరచనమున ఛందోనిర్బంధమున్నచో అవ్యాప్త్యతి వ్యాప్తులును, వ్యర్థపదములును, దుర్నివారము లగునని యూహించి తాదృశ దోషరహితముగను, సంక్షిప్తముగను లక్షణము బోధింప నిశ్చయించి, వచన రూపముగా, అందును సూత్రరూపముగా, తుదికి బాలవ్యాకరణము నంత రించెను. అయినను నాతని సూత్రగమనమునందును, సూత్రార్థ వివరణ సరణి యందును, నుదాహరణమార్గమునందును, గణబద్ధమైన పద్యభాగముల నడక లిమిడియే యుండును.

వేయేల! అతఁడు బాలవ్యాకరణరచనకయి శ్రీకారము చుట్టుటకుముందు ఇష్టదేవతా నమస్కారవచనముగా లిఖించిన "శ్రీ హయగ్రీవాయనమః" అనునదినయితము అనుష్టుప్పద్యపాదముగా అమరియుండుట యాతని వచన శైలీనిసర్గమును నివేదించును.

ఇటులే వచనరూపమయిన నీతిచంద్రికగూడ తాళలయాన్వితమయి పెక్కుతావులందు పద్యపాదములుగాఁ గుదురుపడియుండుట ఎల్లవారు నెఱింగిన యంశము.

చెప్పఁదలఁచినదేమన, ఆతనివాక్కులు సహజముగా ఛందోగర్భితము లన్నమాట.

మచ్చునకయి యిటఁ గొన్ని ప్రదర్శింపఁబడును.

సూత్రములలో :

1. ఇటితివ । ర్ణంబులు । వక్ష్యమా । ణంబులౌ । పవిభక్తి । కంబులు —అచ్చిక-28.
2. పట్టి । వర్ణ । కంబు । హేతు । వులగు । గుణ । క్రియల । కగు —కారక-14.
3. ఈయోగ । మంబులుప । రంబులగు । నపుడు —కారక-34.
4. ద్వంద్వంబు । సందుఋ । కారంబు । నకురవ । ర్ణంబువి । భాషను —సమాస-24.
5. అందు । వరుసను । రెండేసి । ప్రథమ । మధ్య । మోత్త । మంబుల । నంబడు. క్రియా-9.

వివరణములలో :

1. మీరలు । పెద్దలి । త్యాదులు । ప్రాయిక । గ్రహణంబు । చేరక్షి । తంబు । లయ్యె —కారక-34.
2. ఏనిప్ర । భృతిశబ్ద । ములుగొన్ని । నియమసా । పేక్షంబు । లయి యుండు —కారక-37.
3. ఊష్మరే । ఫంబులకు । ద్విత్వంబు । గలుగదు —సమాస-14.
4. ప్రకృతి । జన్య । బోధంబు । నందుఁబ్ర । కారంబు । భావంబు. —తద్ధిత-1.
5. చైత్రుని । చేతమై । త్రుండుకొ । ట్టంబడి । మడిసెని । త్యాదిసి । ద్ధంబ । యయ్యె —క్రియా-38.

ఉదాహరణములలో :

1. రాముని । కంటెన । న్యుండుధా । నుష్కుండు । లేఁడు —కారక-12.
2. గోవుల । లోపలఁ । గపిలబ । హుక్షీర —కారక-16.
3. మూఁడుజ । గములును । జ్జగములు । మూఁడులో । కములును । ల్లోకముల్ —సమాస-17.
4. ముక్కంటి । కడలిరా । చూలి । నలువ —సమాస-22.
5. వానలు । కురిసినం । బంటలు । పండును ; వాఁడుర । మ్మనినఁబో । యితిని —క్రియా-21.

ఇట్లు ఛందోగర్భితములయిన వాక్యము లనేకములు గలవు. ఆ చూపుతో పరికింపుఁడు. మఱియు

సూరి బాలవ్యాకరణమును
"శ్రీలతకుం బ్రాఁకయి, వృష
శైలంబున వెలసి, తనదు చాయ కెలయు ధ
న్యాళి వగ మాన్చి, కోర్కులు
చాలంగా నొసఁగు కల్పసాలముఁ గొలుతున్."

అని యిష్టదేవతానమస్కారరూపమగు మంగళముతో నుపక్రమించి

"పఙ్కజాక్షాయ నాథాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్" అని శుభాంతముగా ముగించెను.

ఈ పద్ధతి సర్వగ్రంథకర్తృసాధారణమే. ఈయన మాత్రము, అంతటితో తృప్తిఁజెందక, బాలుర శ్రేయమును మఱింతగా నభిలషించినవాఁ డగుటం జేసి గ్రంథము తుట్టతుదిని

"రేఫంబులు లఘ్వలఘువులుం దక్కుంగల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు." —ప్రకీర్ణక-25.

అని మంగళకరమగు శ్రేయఃపదమును సూత్రాంతర్భాగముగను, తనరచనలో చిట్టచివరి సూత్రమున తుట్టతుది పదముగను ఘటించి గ్రంథము ముగించుటలో గోచరించు నాగరకతయు మాంగళ్యదృష్టియు గమనింపఁదగినవి.

అంతియగాదు. ఆతఁడు లక్షణరచనములోఁ దన్మయతనంది యసామాన్యమగు నుల్లాసముతోఁ బైని సూచించినరీతిని లక్షణములతోపాటు ధర్మము, నీతి, భక్తి మున్నగువానినిగూడ వినోదములతో, లలితోక్తులతో, బాలురకు బోధించి, వారిని లక్షణజ్ఞులుగమాత్రమేగాక గుణసంపన్నులుగ సహితము తీర్చిదిద్దుటయే పరమలక్ష్యముగానెంచి, యందులకై తనజీవితమును ధారవోసిన ధన్యమూర్తి. బాలవ్యాకరణమున ఆ మహనీయుని తాత్పర్యము నడుగడుగునను ఓరపుఁజూపుతో నాకళించుకొని, యాతని భావములకు సన్నిహితులయి, మృదువయిన యాతని ప్రకృతిని గ్రహించి, యాయన నాదర్శముగ నెంచుకొనఁగల్గిన బాలకులు సూరియభిలాషము ననుసరించి లక్షణవేత్తలేగాక గుణసంపన్నులు సహితము గాకమానరు. ద్రుతప్రకృతులకు సన్నిహితములగు పరుషములు సరళములు గాకుండుటెట్లు ?

తుది నొక్కమాట. వినుఁడు బాలకులు ! వినుఁడు బాలకులార ! మీకు మేలు గలిగెడును. మీకు మేలు గలుగుతను. దీర్ఘాయులరగుఁడు. శుభంబగుమ

అని మిమ్ము బుజ్జగించుచు, ఎల్లయెడల మీ శ్రేయమునే కాంక్షించుచు, మీ భాషాభిజ్ఞతకయి జీవితము ధారవోసిన చిన్నయసూరివచోలాలిత్యమును నా మాటలతో రేఖారూపముగనయిన మీకుఁ జూపఁగలిగితినా నేను ధన్యుఁడను. అది గ్రహించి యానందింపఁగలిగితిరా మీరు ధన్యులరు.

ఇంతదనుక పయిప్రకరణములందు నిరూపించినరీతిని కోమలమగు లాలిత్యముతో నిశితమగు పాండిత్యముతో విశాలమగు ప్రణాళికతో మేలయిన మెలఁకువతో వెలసిన బాలవ్యాకరణమునకు వన్నెగూర్పవలసినవి వ్యాఖ్యాన గ్రంథములు. అవి యిప్పటికి నెన్ని వెలువడినవో, యెట్టిదృక్పథములతో రచిత మయినవో రాఁబోవు ప్రకరణమున క్లుప్తముగాఁ దెలిసికొందము.

---

# వ్యాఖ్యాన గ్రంథములు

సారస్వత ప్రక్రియలలో ఏ శాఖయందయినను ప్రౌఢుఁడు రచియించిన ఉద్గ్రంథములందు నిగూఢముగా నిక్షిప్తములయి పాఠకులకు నవశ్యము విశదము కాఁదగిన వివిధములగు విశేషాంశములను, వివరించి చెప్పునవి వ్యాఖ్యలు.

మూలకారుని యాంతర్యము పాఠకుల హృదయమునకు సులభముగా నందునట్లు సమన్వయమార్గము చూపుచు, సవిమర్శముగా సూక్ష్మపరిశీలనముతో గ్రంథమునందలి గుణవిశేషములు వెల్లడించుచు, మూలమునకు విన్నె చెప్పునవి ఉత్తమవ్యాఖ్యలు.

తప్పక తెలుపవలసిన లోపములు మూలమునయున్నచో వానిని మఱుఁగు పఱుచుట మేలుమార్గము కాదుగాని, దోషైకదృష్టిమాత్రము వ్యాఖ్యాతల కుండరాదు. ఆ చూపు నిరర్థకముమాత్రమేగాక అనర్థకరముగూడనగును.

కావ్య వాఙ్మయముకంటె శాస్త్ర వాఙ్మయమునకు వ్యాఖ్యానాపేక్ష యధికము. శాస్త్ర గ్రంథములందు విషయగురుత్వముతోపాటు సాంకేతిక మార్గములును నధికమగుట తప్పదుగాన, నయ్యవి వ్యాఖ్యాసాహాయ్యములేనిచో సుబోధములు కానేరవు.

శాస్త్రములందును, వ్యాకరణశాస్త్రము సంగ్రహదృష్టితో సంక్షిప్త మార్గమున రచింపఁబడుతీరుగలదగుటచే, వ్యాకరణ గ్రంథములకు వ్యాఖ్యానములు అత్యంతాపేక్షితములగును. కావుననే సంస్కృతమున పాణినీయమునకు ననంఖ్యాకములగు వ్యాఖ్యలు వెలసి ఆ లక్షణశాస్త్రము సముద్రమంత విరివిగాఁ బెరిఁగినది.

వ్యాఖ్యానముల సంఖ్యాబాహుళ్యముగూడ మూలగ్రంథముల విలువను జాలవఱకు వెల్లడింపఁగలదు.

మన యాంధ్రవ్యాకరణములలో వ్యాఖ్యానాపేక్షగల ఉద్గ్రంథములు మిక్కిలితక్కువ. ఆంధ్రలాక్షణికులలో శాస్త్రపరిశ్రమ గావించినపెద్దలు కొందఱు కలరుగాని, వారు కవితారచనమున బద్ధాదరులయి, మహాకావ్యరచనము సాగించుచు, నడుమనడుమ వినోదముగా, కొండగుఱుతులతో, శిథిలబంధములతో, అల్పాల్పములగు లక్షణములు రచించినవారేగాని, వ్యాకరణరచనమునే ప్రధానలక్ష్యముగా నెంచుకొన్నవారు కారు. రచనాపటుత్వముగాని, విషయ

వైపుల్యముగాని, ప్రతిపాదనగంభీరతగాని లేని సాధారణగ్రంథములకు వ్యాఖ్యలు వెలయుట అసంభవము.

కావుననే, చింతామణి, వికృతివివేకము, భాషాభూషణము తప్ప ఇతరములగు తెలుఁగు వ్యాకరణములకు పెక్కింటికి వ్యాఖ్యలే యుదయింప వయ్యెను. ఇందు, చింతామణి వికృతివివేకములు సంస్కృతర రచనములగుట ముఖ్యకారణముగా చిరకాలముక్రిందటనే బాలసరస్వతీయము, అహోబల పండితీయము మున్నగు వ్యాఖ్యలు రచింపఁబడినవి. ఆంధ్రభాషాభూషణమునకు ఇంచుమించు 7 శతాబ్దులదాఁక వ్యాఖ్యయే లేదు. ఈనడుమ దానికి సవిమర్శమయి దివ్యప్రభయను విపులమయిన వ్యాఖ్య వెలువడి దాని ప్రశస్తిని వెల్లడించినది.

మనకున్న తెలుఁగు వ్యాకరణములలో బాలవ్యాకరణము ఉద్గ్రంథము. ఇది పలువురాడుమాట. సమర్థులగు గురువులు బుద్ధిశాలురగు బాలురకు సుశిక్షితముగా బోధింపవలసినదిగాని, ఇది యెవరికివారే స్వయముగాఁ జదువుకొనఁ దగినది కాదు. కావుననే యిది ప్రకటితమయిన వెనువెంటనే దీనికి వ్యాఖ్యాన మపేక్షితమయినది. తద్రచనమునకయి యానాఁటి పండితులు కొందఱు తలపెట్టి రఁటగాని, యా సంకల్పములు సిద్ధింపవయ్యెను. కావున నిది సుమారు ఏఁబది యేండ్లదాఁక వ్యాఖ్యారహితముగ మూలమాత్రమే ప్రచారముగాంచినది. పిమ్మట ఇటీవలి యీ యేఁబదియేండ్ల యల్పకాలములోనే దీనికి నాలుగు టీకలు వెలువడి తమతమకుఁ దగినప్రచారము నందుచున్నవి. వీనిలో రచనాకాలమును బట్టి

మొదటిది: 'గుప్తార్థప్రకాశిక'. కల్లూరివారిది. క్రీ. శ. 1915.

ఇది విపులమయిన వ్యాఖ్య. ఇందు రూపసాధన ప్రక్రియాక్రమమును, లక్ష్యలక్షణసమన్వయమును జూపఁబడినవి. నడుమనడుమ కవిప్రయోగములు ప్రదర్శింపఁబడినవి. ప్రసక్తికలిగినపుడెల్ల సంస్కృతవ్యాకరణాంశములు వలసిన కంటె నధికముగా విశదీకరింపఁబడినవి. ప్రసక్తానుప్రసక్తముగ విపులీకరింపఁ బడి, పండితులుమాత్రమే గ్రహింపఁదగిన, సుదీర్ఘములైన పాణినీయవ్యాకరణ చర్చలు పెక్కులావులఁ గలవు. వ్యాఖ్యానభాషాశైలి జటిలము. మొత్తముమీఁద వ్యాఖ్యలో సమన్వయదృష్టికంటె చర్చాదృష్టి యధికముగా గోచరించును.

ఈ వ్యాఖ్యలోని కొన్ని సూత్రముల సమన్వయమునెడను, సిద్ధాంతముల పట్లను, సమకాలికపండితులలో మతభేదములు గలుగుటచే దీనిపయిని వాద ప్రతివాద ప్రసంగములు గొంతకాలము పత్త్రికలలో తీవ్రముగా సాగినవి. ఆ వాదగ్రంథమంతయు, గుప్తార్థప్రకాశికకు ననుబంధముగాఁ జేర్పఁబడినది.

రెండవది : 'సర్వస్వపేటిక'. మానివారిది. క్రీ. శ. 1936.

ఇందు సూత్రార్థవివరణము, లక్షణసమన్వయము, ప్రక్రియాక్రమ నిరూపణము మున్నగు వ్యాఖ్యానరీతులు అవలంబింపఁబడినవి. ఆ యా సూత్రము లకు మూలప్రాయములయిన చింతామణిసూత్రములు నిర్దేశింపఁబడినవి. భాషా శైలి అతిజటిలము. ఆవశ్యకములనఁదగినవేగాని, హద్దుదాఁటిన చర్చలు, అంతగా లేవనియే చెప్పవచ్చును. మొత్తముమీఁద మూలకారుని విలువను వెలువఱుచుదృష్టితో వ్యాఖ్యానము ఋజుమార్గమున సాగినది.

వాదోపవాదమార్గము లున్నను ఈ వ్యాఖ్యకు సమన్వయదృష్టి ప్రధాన ముగాఁ గానఁబడును.

మూఁడవది : 'లఘుటీక'. జులూరువారిది. క్రీ. శ. 1947.

ఇందు భాష మిక్కిలి సులభము. చర్చలు, శాస్త్రార్థములు కానరావు. సంక్షిప్తముగా పొడిమాటలతోడి వివరణము గలదయి పేరికిఁ దగినరీతిలో నున్నది. లక్షణసమన్వయమునను, ప్రక్రియానిర్వాహణమునను బాలకులకుఁ జాలవఱకు సాయపడఁగలదు.

నాలుగవది : 'ఉద్ద్యోతము'. ఆంధ్రవ్యాకరణాధ్యాపనమున అస్మదాదు లకు పెక్కుమందికి ఒజ్జలయిన వజ్ఝలవారిది. క్రీ. శ. 1959.

ఇందు కవిప్రయోగములు పెక్కులు చూపఁబడినవి.

తత్సమభాషాస్వరూపమును విశదముగాఁ దెలుపుటకయి సంస్కృత వ్యాకరణమునందలి సంధి, కృత్-తద్ధిత, సమాసాది ప్రకరణములందుఁ దెలుఁగు నకు సంబంధించు విధానములు పెక్కులు తెలుఁగుసూత్రములుగా ననువదింపఁ బడి ఆ యా బాలవ్యాకరణపరిచ్ఛేదములందుఁ గూర్పఁబడినవి. విసుగుఁజెందక చదువుకొనఁగలిగిన బాలకులకు నియ్యది మిక్కిలి యుపకరింపఁగలదు.

ఇతర వ్యాఖ్యాతలతోఁగల మతభేదములు పెక్కు తావులందు నతి విపులముగా వివరింపఁబడినవి. మూలకారునితో నైకమత్యములేని చోటులందుఁ దమయభిప్రాయభేదము లుగ్గడింపఁబడినవి. మఱియు, బాలవ్యాకరణసూత్రము లందలి ఆనుపూర్వి యనేకస్థలములందు నధికముగా మార్పఁబడి స్వమతాను సారముగా రచనమార్చి సూత్రములు క్రొత్తరూపమునఁ బ్రవర్తింపఁబడినవి. కొన్ని సూత్రములు గ్రంథమునుండి అసలే తొలఁగింపఁబడినవి.

ఈ వ్యాఖ్యామార్గమున సమన్వయదృష్టికన్న ఖండనదృష్టి యధికము.

ఈరీతిగాఁ బయిని నిర్దేశించిన బాలవ్యాకరణవ్యాఖ్యలు నాలుగును భిన్న భిన్న మార్గముల వెలువడినవి. ప్రస్తుతము ఆ టీకల స్వరూపమును స్థూలముగ సూచించుటయగాని వానిలోని ప్రక్రియాసమన్వయరీతులను వివరించుటగాని, విమర్శించుటగాని యీ సమీక్షలో సంకల్పితము కాదు.

పయినిపేర్కొన్న టీకలలో మొదటిదగు గుప్తార్థప్రకాశికలో వ్యాఖ్యాన రీతుల మాటకేమిగాని, బాలవ్యాకరణమును చిన్నయసూరి స్వతంత్రముగ రచింపనేలేదనియు, ఇది శిష్టువారి సంస్కృత హరికారికావళికి ననువాదమాత్రమే యనియు, సత్యదూరమగు నొకవాదమును కల్లూరివా రావిష్కరించియున్నారు. ఆ వాదగ్రంథమంతయు గుప్తార్థప్రకాశికాంతమున ముద్రితమయియున్నది. అందలి యుక్తులెంతవఱకు సమంజసములో మీఁది ప్రకరణమునఁ బరిశీలించు కొందము.

---

# అనువాద వివేచనము

బాలవ్యాకరణ హరికారికలలో ఏది మూలము ? ఏది యనువాదము ? అను విషయము తేల్చుటకుముందు గుప్తార్థప్రకాశికాంతమునఁగల కల్లూరివారి వాదమునందలి యుక్తులసామంజస్యమును విమర్శించుటయు, అటుఁపై బాలవ్యాకరణ హరికారికల రచనమున గోచరించు అంతరంగిక సాక్ష్యమునుబట్టి తత్త్వమును వెల్లడించుటయు ఈ ప్రకరణమున మనకుఁ గర్తవ్యము.

కల్లూరివారి వాదస్వరూపమును మొదటఁ బరిశీలింతము.

గుప్తార్థప్రకాశికాకారులు కల్లూరి వేంకటరామశాస్త్రిగారు తమ వ్యాఖ్యానము పూర్వభాగమున సూరిగారియెడ నత్యధిక గౌరవాదరములు చూపియు, నుత్తరభాగమున ఆయనకు న్యూనతగలిగించు ప్రసంగములు కొన్నిటిని వ్యాఖ్యలోఁ గూర్చినారు. అంతియగాక గ్రంథముచివర బాలవ్యాకరణము సూరిగారు స్వయముగా ఆత్మప్రతిభచే రచించినది కాదనియు, ఘట్టు కృష్ణమూర్తి కవిగారి హరికారికావళికి ననువాదమాత్రమేయనియు, సూరిగారి మూలకర్తృత్వమునకే మోసము తెచ్చినారు.

వీరు తొలుత సూరిగారియెడ నత్యంతగౌరవముతో నత్యుత్సాహముతో చాలదూరము వ్యాఖ్యరచించియు కొట్టకొనను ఈ వెలితిప్రసంగమును చేయఁ దీయుటకు వేఱొకకారణ మొండు గలదు. ముందు దానిని విశదీకరించి, ఆ పిమ్మట ఈ వాదమునకు వారు చూపిన యుక్తులను పరామర్శించి, తుదికి గ్రంథస్థములగు ప్రమాణములంబట్టి వాస్తవమును వ్యక్తపఱచుట ప్రస్తుత కర్తవ్యము.

సుంకర రంగయ్యయను నొక ద్విజేతరశిష్యుఁడు కల్లూరివారియొద్ద నత్యంతభక్తితో వినీతుఁడయి విద్యాభ్యాసము చేయుచుండెడివాఁడఁట. శాస్త్రిగారు బాలవ్యాకరణమునకు వ్యాఖ్యను కారకాంతభాగము పూర్తిచేసి, యా గ్రంథమును పరిశుద్ధముగ ప్రతి లిఖించుటకయి బుద్ధిశాలియని, ప్రియశిష్యుఁడని రంగయ్యచేతికిచ్చినారఁట. ఆ ప్రబుద్ధుఁడు, శాస్త్రిగారియెడ నసూయాపరులగు వారు వీరు చెప్పినమాటలకు చెవియొగ్గియు, గ్రంథకర్తృత్వమునెడఁ బేరాసగొనియు ఆ కారకాంతభాగమును రహస్యముగా ముద్రింపించి తనపేరఁ బ్రకటించుకొనెనఁట. అదివిని శాస్త్రిగారు కటకటపడి యంగలార్చుచు పెద్దల కడకేగి జరిగిన విషయమును, ఆ యాషాఢభూతిచేసిన మోసమును వారికి నివేదించి న్యాయమొనగూర్పఁ గోరినారఁట. ఆ తగవరులు శాస్త్రిగారిని,

ఆయన పాండిత్యమును నెఱింగినవారయ్యు, ఎట్లును గ్రంథము రంగయ్యపేర ముద్రితమయినదిగనుక సంతవఱకుఁగల భాగమునకు నాతనికిఁగూడ కర్తృతా స్వామ్యమొసంగునట్లు తీర్పు చెప్పినారఁట. శాస్త్రిగారును నందుల కెటులో యంగీకరించిరఁట. ఆ పిమ్మటఁ దక్కిన వ్యాఖ్యానశేషము పూర్తిగావించి, 'గుప్తార్థ ప్రకాశిక'యనుపేరితో గ్రంథమునంతను ముద్రింపించి, తమపేరఁ బ్రకటించుట జరిగినది.

శాస్త్రిగారు బాలవ్యాకరణమున నుత్తరభాగమునకు వ్యాఖ్యరచించుచున్న సమయమున శిష్టువారి సంస్కృత హరికారికావళి వృత్త్యుదాహరణసహితమగు సంపూర్ణ తాళపత్త్రగ్రంథము వారిపౌత్రునివలన వీరికి లభించినదఁట.

ఈ విషయములన్నియు ఉపోద్ఘాతమునందును ప్రారంభపీఠికయందును గుప్తార్థప్రకాశికయందే వివరింపఁబడియున్నవి.

శాస్త్రిగారు ఆ తాళపత్త్రగ్రంథమును స్థూలదృష్టిని పరికించుటలో ఆ గ్రంథమంతయు బాలవ్యాకరణమునకు మూలగ్రంథమయియుండునా యను సందేహము వెంటనే పొడమియుండును. నిజమున కారెండిటికిని నట్టిపోలిక గలదు. అంతకు కొలఁదిదినములక్రిందటనే, తాము రచించిన వ్యాఖ్యా గ్రంథమును రంగయ్య కనుగప్పి తనపేరఁ బ్రకటించుకొని మోసగించెనన్న క్రోధముతో, వైకల్యముతో, కడుంగడు కలఁతఁజెందుచున్న శాస్త్రిగారికి అదేసమయమున సంస్కృతభాషలోఁ బ్రాచీన తాళపత్త్రములపై లిఖింపఁబడిన యీ హరికారికాగ్రంథము కంటఁబడినతోడనే రంగయ్యవలెనే ద్విజేతరు లెల్లరును కృతఘ్నులయియుందురనియు, అట్టివారిని పనిఁబూని పైకిఁదెచ్చుట తగనికృత్యమనియు, నొక సంకుచితభావము కలిగి, ద్విజేతరులగు సూరిగారికి వ్యాకరణరచనమువలన నేర్పడిన యశోగౌరవమును మూలమట్టముగా మాపుటకు ఈ కారికాగ్రంథమును సాధనముగా నుపయోగింపవలయునను సంకల్ప మంకురించియుండును. ఆ కాలమునకు సూరిగారి జీవితచరిత విశేషములుగాని, వారి సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణాది పూర్వరచనలుగాని, బయలుపడియుండ లేదు. అవి వెలువడియున్నచో ఈ విషయమున వీరి యీ సంకల్పమును, సాహసమును చాలవఱకు నడ్డగించియుండెడివి. వాని స్వరూపము తెలియని కారణముచే వీరికిఁ దాత్కాలికముగఁ గలిగిన విపరీతాభిప్రాయమే బలపడి పెడ దారిని ద్రొక్కించినది. ఆ మీఁద వీరు బాలవ్యాకరణము స్వతంత్రగ్రంథము కాదనియు, అది హరికారికలకు ననువాదమాత్రమేయనియు, పక్షపాతబుద్ధితో నొకవాదము లేవనెత్తి, దానిని స్థాపించుటకుఁ గొన్నియుక్తులు కల్పించి చూపుచు, వానితోపాటు హరికారికలనుగూడ గ్రంథాంతమునఁ బ్రకటించి యుండిరి.

అదిపరికించి, యప్పటివారిలో, కొందఱు అదే సత్యముకాఁబోలునని తలంచుచుండిరి. కొందఱు ఏది యథార్థమోయని సంశయింపఁదొడఁగిరి. మఱి కొందఱు అప్పటికి సుమారు ఏఁబదియేండ్లనుండి పండితపరంపరాయాతము లగు జనశ్రుతులంబట్టి సూరిగారి ఏకసంథాగ్రహణకౌశలమును, పాండిత్య ప్రకర్షమును, ప్రతిభావిశేషమును, వ్యాకరణరచనాపరిశ్రమమును దలఁచు చున్న విజ్ఞులుమాత్రము వీరివాదమును విశ్వసింపఁజాలకుండిరి.

అట్టి సందిగ్ధదశ సుమారు పదేండ్లు సాగినది.

ఆ పిమ్మట 1926 సం॥ ప్రాంతమున ఇందలి వాస్తవికతను వ్యక్తముగా నారసి సప్రమాణముగ వెల్లడింపవలయునను నాసక్తితో సంపూర్ణహరికారికా తాళపత్త్రగ్రంథమును సంపాదించి, బాలవ్యాకరణ హరికారికలను రెండిటిని అక్షరమక్షరము పెక్కుమాఱులు సావధానముగఁ బరిశీలించి, గ్రంథస్థములయి లభించిన ప్రమాణములను సేకరించి, బాలవ్యాకరణమే మూలగ్రంథమనియు, కారికావళియే దాని యనువాదమనియు నిస్సంశయముగా నిర్ణయించుకొని, యీ సమీక్షాకర్త రచించిన వ్యాసమొకటి ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక 15వ సంపుటమున 5, 6 సంచికలలో—(డిసెంబరు 1927 – మార్చి 1928) కల్లూరివారు సజీవులయియుండిన కాలముననే—ప్రకటితమయినది.

అప్పటినుండి యీ సిద్ధాంతము పండితులకును, బరిశోధకులకును సర్వథా సమ్మతమై నేఁటిదాఁక వ్యాకరణపాఠకులలో నాటుకొనియున్నది. అయినను ఈ సమీక్షలో మూలానువాద వివేచనముకూడ ప్రసక్తమేయగుటం బట్టి యీ విషయములను సంగ్రహముగా ఈ ప్రకరణమున ప్రదర్శించుట యావశ్యకమయినది.

సూరిగారు బాలవ్యాకరణము రచించుటకుఁబూర్వము పద్యాంధ్రవ్యాకరణాదులగు లక్షణగ్రంథములను నాలుగింటిని సంతరించిరనియు, అందు సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణ మొకటియనియు, వానిసారమే చివరకు బాల వ్యాకరణముగా రూపొందినదనియు, ఆ వివరములన్నిటిని "గ్రంథావతరణము" అను ప్రకరణమున నీవఱకే పరికించియుందురు.

ఈయన తొలుతఁ దాను విపులమగు వ్యాకరణమును సంస్కృతసూత్ర రూపమున రచించితిననియు, అయ్యది బాలురకు సులభసాధ్యము కాకుండుటం బట్టి అందలి ముఖ్యసూత్రములను గొన్నిటిని తెనిఁగించి బాలురకు సుబోధమగు రీతిని బాలవ్యాకరణమనుపేర వెలయించితిననియు, ఇది దిక్ప్రదర్శనమాత్ర మనియు, విశేషవిషయము లెఱుంగఁగోరువారు మున్ను తానొనర్చిన ఆ సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము పరికింపవలయుననియు, బాలవ్యాకరణ

ప్రారంభపరిసమాప్తులందు స్పష్టముగా వక్కాణించియున్నారు. వాస్తవిక పరిస్థితి యిటులుండ బాలవ్యాకరణాంతముననున్న "మునుమదుపజ్ఞంబగుచున్" అనుపద్యమునకు వ్యాఖ్యరచించుచు, కల్లూరివారు సూరిగారి పాండిత్య ప్రవీణతను, విమర్శనాత్మకము బహుముఖమునైన విజ్ఞానమును, దేశవ్యాప్తములై బహుజనాదరమునందిన యాయన రచనముల ప్రశస్తిని, నెఱింగియు, వానినెల్ల త్రోసిపుచ్చి, కేవల నిరసనభావము వహించి, యెటులయిన ఆయన యశమును మట్టుపెట్టవలయునను పట్టుదలతో సూరిగారి సూత్రాంధ్రవ్యాకరణము అప్పటికి ప్రకటితము కాకుండుటచే తద్రచనమును వినియుండియు విననియట్లు పయి పద్యమున సూచింపఁబడిన సూత్రములు హరికారికలేయని వక్రమార్గమున పద్య భావము వెల్లడించుచు, బాలవ్యాకరణము సూరిస్వతంత్రరచనము కాదనియు, అది శిష్టువారి హరికారికల కాంధ్రీకరణముమాత్రమే యనియు, శాస్త్రీయ నిబంధనలతోఁ గూడిన బాలవ్యాకరణమువంటి యుదాత్తగ్రంథము రచించుటకుఁ దగిన వ్యాకరణపాండిత్యము 'ఈసొతాని పండితు'ని కుండనేరదనియు, ఏవేవియో వ్యక్తిగతదూషణములతో, వికటపుమాటలతో, హెచ్చుతగ్గు ప్రసంగములతో ఈ వాదమునకు నుపక్రమించి, దానికి సాధకములుగాఁ గొన్ని(14) యుక్తులుకల్పించి ప్రదర్శించినారు.

నిజమునకు రంగయ్యచేసినది ఘోరమయిన గురుద్రోహమే. సందియము లేదు. మఱియు నట్టివానియెడ, కల్లూరివారికి క్రోధము కలుగుటయు సహజమే. కాదనరాదు. కాని దోషియగు ఆ రంగయ్య నేమియుం జేయ వశముగాక, వ్యక్తిగతమగు ఆ క్రోధమును జాతిపరముగా పెంచుకొని తత్సజాతీయులని ఆ రోషము సూరిగారియెడఁ జూపఁబూనుటమాత్రము అభిజ్ఞులాదరింపఁదగిన మార్గము కాదు.

మఱియు, శిష్టువారు గొప్పపండితులే కావచ్చును. తమకు వారియెడఁ దగినంత గౌరవమును నుండవచ్చును. కాని, యాయనయొనర్చిన కూటకరణము నాధారముగాఁగొని, విఖ్యాతపండితులయి వన్నెకెక్కిన సూరిగారిని నీచముగా నిరసించుటమాత్రము తగినపనికాదు.

దానికిది మూలమా? దీనికది మూలమా? అనుచర్చ ప్రసక్తమయినపుడు తత్త్వమరయుదృష్టితో, పక్షపాతములు వీడి, సమరసబుద్ధి వహించి, సావధానముగ ఆ రెండుగ్రంథములు పరిశీలించి, యందు లభించు ప్రబలములగు ప్రమాణములంబట్టి వాస్తవము తేల్చవలయునేగాని, గ్రంథములకు సంబంధింపక బాహిరములయి క్షోదక్షమములుకాని యుక్తులతో గ్రంథపౌర్వాపర్యమును నిర్ణయింపఁబూనుట సమంజసముకాదు.

కావున, వ్యక్తిగత దూషణభూషణముల పొంతఁ బోక, విషయప్రధానముగ, వస్తుతత్త్వాన్వేషణదృష్టితో, తొలుత వరుసగా వారి పదునాలుగు యుక్తులు పరిశీలించి ఆ పిమ్మట ఆ రెండుగ్రంథములందలి యాంతరంగిక సాక్ష్యమును (internal evidence) బట్టి దేనిదేది మూలమో నిర్ణయించుకొందము.

## కల్లూరివారి యుక్తులు

1. బాలవ్యాకరణ ప్రారంభమున సూరిగారు గురువందనము చేసియుండమిచే వీరు ఏ గురువునొద్దను సంస్కృతవ్యాకరణము నభ్యసించియుండనట్లు తెలియుచున్నదనియు, ఆయన స్వదేశీయులగుటచే వ్యాకరణశాస్త్రపాటవము లభించుట దుర్ఘటమనియు, శిష్టువారు గొప్పపండితులగుటవల్లనే షడ్దర్శనీస్వాతంత్ర్యుఁడనని నిర్భయముగాఁ జెప్పుకొనఁగలిగిరనియు, సూరిగారికి వ్యాకరణజ్ఞానము లేకుండుటవల్లనే "పఞ్చసంకలితోరస్కాయ" అని సమాసాంత "కప్" ప్రత్యయముండవలసినతావున 'శ్రీస్తనాశ్చిత కస్తూరీ పఞ్చసంకలితోరసే' అని కప్ప్రత్యయరహితముగాఁ బ్రయోగించియుండిరనియు కావున శాస్త్రజ్ఞానశూన్యులగు సూరిగారు స్వతంత్రముగా బాలవ్యాకరణము రచింపసమర్థులుగారని కల్లూరివారి మొదటియుక్తిలోని సారాంశము.

గ్రంథాదిని గురువందనము చేయనంతమాత్రమున ఆయనకు గురువే లేఁడని నిర్ణయించుట సంగతము గాదు. సూరిగారు వ్యాకరణాదులగు పెక్కుశాస్త్రములను వేఱువేఱు గురువులయొద్ద నభ్యసించినట్లు ఆయనజీవితచరితము నిరూపించుచున్నది. ఆయనకుఁ దన గురువులందఱయెడను సమానముగు గౌరవప్రపత్తులుండియుండును. కావున నొకరిని బేర్కొని యొకరి నుజ్జగించుటకు మనసొప్పక, యందఱకును మానసికముగనే వందనమాచరించి, సకలలోకగురువగు శ్రీ వేంకటేశునకు ప్రణామములర్పించుచు ఇష్టదేవ నమస్క్రియా పురస్సరముగా గ్రంథారంభము గావించినారు. కావున సూరిగారికి గురువే లేఁడనిగాని, తన్మూలకముగు పాండిత్యము లేదనిగాని తలంచుట సమంజసముగాదు.

ఇఁక గ్రంథకర్తకుఁగల శాస్త్రాదిపరిజ్ఞాన మాతనిగ్రంథమువల్లనే వ్యక్తమగును. దానిని గ్రంథకర్త తానై యుగ్గడింపవలయుననెడి నిర్బంధమేమి గలదు ? శిష్టువారైనను నాంధ్రవ్యాకరణరచనకు వలసిన సంస్కృత వ్యాకరణ పాటవము తమకుఁగలదని చెప్పుకొనియుండలేదే ! షడ్దర్శనీ స్వతంత్రులమని మాత్రము చెప్పుకొనియుండిరి. ఆ షడ్దర్శనములలో వ్యాకరణము చేరదు. అది లేని షడ్దర్శనీస్వతంత్రత యాంధ్రవ్యాకరణరచనమునకు నెట్లుపకరించును ?

మఱియు, దానిని జెప్పికొనకుండుటంబట్టి సూరిగారితోపాటు శిష్టువారికిని సంస్కృతవ్యాకరణపాండిత్యము లేదనవలసివచ్చును. లేదన్నచో, శిష్టువారు గూడ ఈ వ్యాకరణమును స్వతంత్రముగా రచింపలేదనవలసియుండును. మఱి, దీని నెవరురచించినట్లు ? ఈ వాదరీతి మూలచ్ఛేదిగాఁ గానవచ్చుచున్నది. కావున నిది మార్గముకాదు.

కొందఱు తమకింతజ్ఞానముకలదని కంఠోక్తిగాఁ జెప్పుకొనుటకు నిచ్ఛగింతురు. కొందఱట్లుగాక, గ్రంథముననే యా శాస్త్రపరిశ్రమ ప్రతిఫలించునని గంభీరులయి యుదాసీనముగా నుందురు. సూరిగారీవిషయమున ఆ ఉదాసీన పక్షమువారు.

ద్విజేతరులగుటచే సూరిగారికి శాస్త్రపాటవమబ్బుట దుర్ఘటమని కల్లూరివారనుట యుక్తముగాదు. ద్విజేతరులయినను, బుద్ధికౌశలము గలిగి తగిన పరిశ్రమ యొనరించినవారు వ్యాకరణపండితులు కావచ్చును. ద్విజులయినను ప్రతిభాశూన్యులై పరిశ్రమింపఁజాలనివారు పండితులు కాకపోవచ్చును. సూరిగారు ప్రతిభాశాలులై విద్యాపరిశ్రమగావించి శాస్త్రవైదుష్యము గడించినవారని దేశమునందెల్లయెడలను ప్రతీతి గలదు. ఆ పాండిత్యమువల్లనే ఆయన మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలయందు ప్రధానపండితపదవి నధిరోహించియుండిరి. అవన్నియు నటులుండ ఆయనకుఁగల శాస్త్రవైదుష్యము బాలవ్యాకరణరచనముననే గోచరించును. ఈ విషయము ఇంతకుముందు 'పాండితీపటిమ' అను ప్రకరణమున విపులముగా నిరూపింపఁబడియున్నది.

అదియుఁగాక, ఆంధ్రవ్యాకరణరచనకు నుపయుక్తమగు 'సామగ్రి సంస్కృతవ్యాకరణ పరిజ్ఞానముమాత్రమే గాదు. ప్రాచీనాంధ్రమహాకవిప్రయోగముల సేకరణము దానికి ముఖ్యసామగ్రి. ఆ సామగ్రి సూరిగారికి సంపూర్ణముగా సిద్ధమయినటులు బాలవ్యాకరణ పీఠికలో పెక్కులక్ష్యములు పలుమాఱు సావధానముగాఁ బరిశీలించితినని ఆయన వక్కాణించియే యున్నారు.

ఇఁక, కప్పురీత్యయ ప్రయోగసందర్భమున నొక్కవిషయము చెప్పవలసియున్నది.

సూరిగారు విశిష్టాద్వైతులు. వైష్ణవులెల్లరును నిత్యము దేవతార్చనా (తిరువారాధన) సమయమున మంగళాశాసనసందర్భమున

"అస్తు శ్రీస్తన కస్తూరీ వాసనా వాసితోరసే
శ్రీహస్తిగిరి నాథాయ దేవరాజాయ మఙ్గళమ్"
"అమన్దానన్ద మన్దారాయేన్దిరా రక్షితోరసే
నన్దాత్మజాయ కృష్ణాయ నాథాయాస్తు నమోనమః"

మున్నగు శ్లోకములను అనుసంధించునట్టి యాచారము గలదు.

సూరిగారు, చిరపరిచితములైన యీ శ్లోకములందు ఠక్-ప్రత్యయము లేకపోవుటను దప్పక గుర్తించియుందురు. అయినను, సమాసాంతవిధి యనిత్యమని ప్రాచీనవైయాకరణులు సమ్మతించుటంబట్టి పూర్వాచార్యులిట్లు ప్రయోగించియుందురని తలంచి, దానిని దిద్దుటకు మనసొప్పక దాసును 'కప్పుప్రత్యయము' నుపేక్షించి, 'శ్రీస్తనాశ్చిత కస్తూరీ పఙ్కసంకలితోరసే' అని రచించియుందురు. ఇంతియగాక

"జేతారం దశకణ్ఠస్య......విజయశ్రీపూర్ణమాణోరసమ్"

—అనర్ఘరాఘవ-1-33.

అని మురారియంతవాఁడు ఉరశ్శబ్దాంతబహువ్రీహిని కప్పుప్రత్యయరహితముగనే ప్రయోగించియుండెను. అన్వేషించినచో నిట్టిప్రయోగము లనేకములు లభింపఁగలవు. ఈ సాధారణవిషయము నూఁటగొని సూరిగారికి సంస్కృతవ్యాకరణ పైదుష్యములేదని నిరూపింపఁబూనుట యుక్తిసహము కానేరదు.

2. సూరిగారికంటె శిష్టువారు ఎంతో గొప్పపండితులనియు, కనుక సమానస్కంధులు కాకుండుటచే వారియిరువురకును వివాదము జరిగియుండుటయే సంభావ్యము కాదనియు, కావున సామాన్యపండితులగు సూరిగారియెడ శిష్టు వారికి నసూయ కలుగుటకు హేతువే కానరాదనియు, అసూయలేనపుడు బాల వ్యాకరణము సంస్కృతీకరింపవలసిన ప్రసక్తి శిష్టువారికి లేదనియు కల్లూరి వారి యుక్త్యంతరము.

శిష్టువారు గొప్పపండితులే. సందియములేదు. కాని, కల్లూరివారు భావించినరీతిగా సూరిగారు శిష్టువారికంటెఁ దక్కువవారుమాత్రము కారు. ఏకసంధాగ్రాహులయి, వ్యాకరణాలంకారాది శాస్త్రములందును, దర్శనములందును పటిష్ఠమగు పాండిత్యము సంపాదించుటయేగాక, సూరిగారు తెనుఁగువాఙ్మయమునఁగూడ నసాధారణమగు పరిశ్రమ గావించినవారు. శిష్టువారికి సంస్కృత పాండిత్యమును, కవితాపాటవమును నుండవచ్చునుగాని, తెనుఁగులో నంత పరిశ్రమమున్నట్లు కానరాదు. 'సంస్కృతపండితుని దృష్టి తెనుంగునంపంత ఘనంబుగాఁ బోవనేరద'ని కల్లూరివారును వ్రాసియేయున్నారు.

వారిరువురకును వివాదముకలిగినట్లు పండితలోకమున కింవదంతి కలదు. ఇట్టికింవదంతులు నిర్మూలముగ జనింపవు. ఇరువురకును వివాదము జరిగినట్లు కవులచరిత్రగూడ నిరూపించుచున్నది (చూ. కవులచరిత్ర, మొదటి ముద్రణము, పుట 588). ఆంధ్రవ్యాకరణమును సంబంధించిగాని, లేదా వీరేశలింగము పంతులుగారు నిర్దేశించినట్లు సంస్కృతవ్యాకరణ విషయములందుఁగాని ఆ యిరువురకును వివాదము జరిగియుండవచ్చును. పండితులు విద్యావిషయము లందు మత్సరగ్రస్తులగుట అప్రసిద్ధముగాదుగావున, ఆ సందర్భమున శిష్టువారికి

సూరిగారియెడ నసూయ జనించియు నుండవచ్చును. దానివలన సూరిగారికీర్తికి భంగము గలిగింపనెంచి, వారికీర్తికి దర్పణప్రాయమగు బాలవ్యాకరణమును సంస్కృతీకరించుటకు శిష్టువారు పూనుకొనియు నుండవచ్చును. ఇందు నసంభావ్యత లేశమును గోచరింపదు.

ఈ సందర్భమునఁ గేవలమూహలేగాక మిక్కిలిప్రబలమయిన సాక్ష్యము గూడఁ గలదు. వేదము వేంకటరాయశాస్త్రిగారి పితృపాదులు వేంకటరమణ శాస్త్రులవారు గొప్పపండితులు, ఋషితుల్యులు. వీరు శిష్టువారికిని సూరిగారికిని సమకాలికులు. ఇరుప్రక్కను పరమాప్తులు. సూరిగారికిని శిష్టువారికిని, కొన్ని శాస్త్రవిషయములందు ఘర్షణలు జరిగినట్లును, శిష్టువారసూయపడి సూరిగారి వ్యాకరణమును రహస్యముగా సంస్కృతకారికలుగా ననువదించినట్లును, అది తగినపనికాదని వేంకటరమణశాస్త్రులవారు శిష్టువారిని మందలించినట్లును—తండ్రిగారివలన విని వేంకటరాయశాస్త్రిగారు—అతిప్రధానాంశముగా తమ దినచర్య (Diary) లో వ్రాసికొనియున్నారు. ఆ వాక్యములు ఇవి :

"నాయనగారు శిష్టు కృష్ణమూర్తిగారికి గుంటూరు, కాకినాడలలో పరిచయము. కృష్ణమూర్తిగారికి చిన్నయసూరిగారితో కాళహస్తి, వేంకటగిరి సంస్థానములలో ఘర్షణ. కృష్ణమూర్తిగారు బాలవ్యాకరణమును హరికారికలను పేర సంస్కృతమున అనువదించుట వారి అసత్యవాదము. అట్లుచేయఁగూడదని మా నాయనగారు కృష్ణమూర్తిగారిని హెచ్చరించుట." (వేదము వేంకటరాయ శాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము. ప్రకరణము 1 - పుట 9.)

ఇది శిష్టువారి కపటరచనమునకు ఎవ్వరును కాదనరాని పరమప్రమాణము.

3. కారికలు ప్రవాహరూపమున ధారాళముగా నుండుటచే నయ్యవి స్వయంభువులేగాని, యొకగ్రంథమునుజూచి భాషాంతరీకరింపఁబడినవి కావని కల్లూరివారి ప్రతిపాదనము.

కవితాశక్తియు, ధారాశుద్ధియు నున్నయెడల నెంతధారాళముగనైనను శ్లోకములు రచింపవచ్చును. అది గ్రంథకర్త కవితాచాతుర్యమునకు నిదర్శనము కావచ్చునేగాని, గ్రంథపౌర్వాపర్య నిర్ణయమున కెట్లుపకరించును? కారికలు ధారాళముగానున్నట్లు తోఁచినచో, శిష్టువారి సంస్కృతకవితాకౌశలమును మెచ్చుకొనవలయునేగాని, అవి పరివర్తితములు కావనుటకు మాత్రము ఈ యుక్తి దొత్తిగా సమర్థకముగాదు.

4. బహుగ్రంథకర్తలగు శిష్టువారు సూరిగ్రంథమును దొంగిలించి, సంస్కృతీకరించి, అద్దాని నొక సంస్థానాధీశునకు కృతియిచ్చెననుట

యసందర్భముగ నున్నదని యెంతో పరిహసించుచు, నొకయుపాయమును కల్లూరి వారు నిరూపించియున్నారు.

అసందర్భమేలకాదు ? పక్షపాతదృష్టితోనున్నను కల్లూరివారినోటనుండి ఆంధ్రసరస్వతి భంగ్యంతరముగా నిజమునుపలికించినది.

సూరిగారి గ్రంథమును దొంగిలించుటయు, దానిని వికృతముగా సంస్కృతీకరించుటయు, అంతమాత్రమేగాక, ఆ దొంగసొత్తు నొక సంస్థానాధీశునకు తగుదునని కృతియొసంగుటయు అసంభవములుగావె మహేశునకు ?

అప్పటికి సూరిగారి బాలవ్యాకరణము అంతగా వ్యాప్తికి వచ్చియుండదు గనుక సరిపోయినదిగాని, వ్యాప్తికేవచ్చి, యీ మోసము ఆ సంస్థానాధిపతి చెవికెక్కియేయున్నచో, శిష్టువారికి నెట్టి బహుమానము లభించియుండెడిదో ;

మఱియు, కల్లూరివారు ఈ సందర్భమున : "సూరికృతమైన సంస్కృత గ్రంథంబునకు మరల కృష్ణమూర్తిశాస్త్రులవారు వేఱుమాటలతో సంస్కృతము చేసిగాని—లేక దొంగిలించి, సూరికృత గ్రంథము ప్రారంభమునఁ దాను రచించి నట్లు సూచించునట్టి అయిదాఱు శ్లోకములు చేర్చిగాని, సూరిగారి జీవితకాలములో సంస్థానాధిపతికిఁ గృతియిచ్చిరి. అని చెప్పవలసియుండును." అని ఆపత్తి రూపముగా నొక వికల్పమును చూపియున్నారు.

సూరిగారి సంస్కృత గ్రంథముమొదట అయిదాఱు శ్లోకములుచేర్చి, శిష్టువారు తమదిగాఁ బ్రకటించుకొనిరని యెవ్వరును దలంపలేదు. అట్లు తలంచుట కవకాశమును లేదు. ఏలయన, సూరిగారి సంస్కృతగ్రంథము సూత్రరూపముగాని కారికారూపము గాదు. ఆ సూత్రగ్రంథము కల్లూరివారి కంటఁబడకుండుటచే నీవికట్టి వికల్పము జనియించినది. ఆ గ్రంథమప్పటికిఁ బ్రకటితమై యుండినచో కల్లూరివారివాదము ఇంతదూరము పెరిఁగియుండెడిదే కాదు.

మఱియు, స్థూలదృష్టికి బాలవ్యాకరణమును హరికారికలును మిక్కిలి సరిపోలి యగపడుచున్నను, సూక్ష్మముగాఁ బరిశీలించినయెడ వానిలో నచ్చటచ్చటఁ గొన్ని భేదములు గానవచ్చును. వానినిబట్టి యీ రెండుగ్రంథములు రచించినవారు ఒకరుకారనుటయు స్పష్టమగును. అదిగాక, బాలవ్యాకరణకర్త స్వీయప్రణాళికతోఁ దనగ్రంథమును రచించుకొనినట్లును, కారికాకర్త ప్రణాళిక అన్యదీయమగుటచే అవగాహనములేకుండ అనువదించినట్లునుగూడ ఆ భేదములు నిరూపింపఁజాలియున్నవి. అవి యీ ప్రకరణముననే ప్రదర్శింపఁ బడును.

ఇఁక నీ విషయమున వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రమున తమ యభిప్రాయమున కనుకూలముగా వ్రాసినట్లు భ్రమపెట్టుటకయి వారిని ప్రమాణముగాఁగొని, కల్లూరివారు కొన్నియంశములు వ్రాసియున్నారు. నిజమునకవి కల్లూరివారి కనుకూలించునవి కావు. మీఁదుమిక్కిలి ప్రతికూలములు. పరికింపుఁడు.

వీరేశలింగము పంతులుగారి వాక్యములు ఇవి :

"ఈ కృష్ణమూర్తికవి కాళహస్తిలోనున్నపుడు చేయఁబడిన ప్రధానగ్రంథమింకొకటిగలదు. ఆ కాలములో నీయనకును, చెన్నపురి శాస్త్రపాఠశాలలో నాంధ్రపండితుఁడయిన పరవస్తుచిన్నయసూరిగారికిని, సిద్ధాంతకౌముదిలోని సూత్రవిచారము కొంతనడచెను. మనపండితులు సాధారణముగా మత్సరగ్రస్తులగుట సుప్రసిద్ధమేగదా ! అట్టివా రీర్ష్యచేతఁ దమకు లాభములేకపోయినను, పరులకు నష్టము గలుగుటయే తమ యభీష్టసిద్ధిగా భావించి కొన్నిసమయములయందుఁ బరులకీర్తికి భంగము గలిగింపఁజూతురు. అంతకుఁబూర్వము కొంతకాలముక్రిందటఁ జిన్నయసూరి బాలవ్యాకరణమును రచియించెను. దానితో సరిపోల్పఁదగిన యాంధ్రవ్యాకరణ మావఱకు వేఱొకటి లేదు. ఇట్లుండఁగాఁ, గృష్ణమూర్తిగారిచేఁ జేయఁబడిన వ్యాఖ్యానముతోఁగూడిన హరికారికలనఁబడెడి యాంధ్రవ్యాకరణ సూత్రగ్రంథమొకటి యటుతరువాత నల్పకాలమునకు వెలువడెను. అదియే హరిభట్టకృతమై యథర్వణాదులచేఁ బేర్కొనఁబడిన కారికావళియైనపక్షమునఁ, జిన్నయసూరి తన వ్యాకరణములోని సూత్రములన్నిటిని హరికృతగ్రంథమునుండి దొంగిలించి తనపేరిట ప్రకటించినట్లు స్పష్టమగును. అయినను, మూలగ్రంథములోఁ జూపఁబడిన లక్ష్యములు కొన్ని యథర్వణాచార్యుల కీవలి యాధునిక గ్రంథములలోనివగుటచేత వ్యాఖ్యానమును మాత్రమే గాక, మూలగ్రంథమును సహితము కృష్ణమూర్తిగారే రచియించిరేమోయని పలువురు సందేహపడుచున్నారు. అట్టిగ్రంథమును రచియింపఁగల సామర్థ్య మా విద్వత్కవికిఁ గలదనుటకు సందేహము లేదు. ఈయన యిటువంటి గ్రంథకల్పనము చేయ సంశయపడువారుకారని చూపుటకై చరమదశయందు మాడుగల్లులో నున్నపుడొక్కరాత్రిలోఁ జేసినట్టీయన కారోపింపఁబడిన యశ్వశాస్త్రకథ కొంత తోడ్పడుచున్నది."

—కవులచరిత్ర, మొదటి ముద్రణము, పుట 588.

అని వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు.

ఇట్లుండ పయివంక్తులలోఁ దమకు విరుద్ధముగానున్న విషయమునంతను జాఱవిడిచి, కల్లూరివారు

"అదియే హరిభట్టకృతమై యథర్వణాదులచేఁ జేర్పఁబడిన కారికావళి యైనపక్షమునఁ జిన్నయసూరి తనవ్యాకరణములో సూత్రములన్నిటిని హరిభట్ట కృతగ్రంథమునుండి దొంగిలించి, తనపేరిటఁ బ్రకటించినట్లు స్పష్టమగును. అయినను, మూలగ్రంథములోఁ జూపఁబడిన లక్ష్యములు కొన్ని యథర్వణా చార్యుల కీవలి ఆధునిక గ్రంథములలోనివగుటచేత వ్యాఖ్యానము మాత్రమేగాక, మూలగ్రంథము సహితము కృష్ణమూర్తిశాస్త్రులవారే రచియించిరేమోయని, పలువురు సందేహించుచున్నారు. అట్టిగ్రంథమును రచియింపఁగల సామర్థ్య మావిద్వత్కవికిఁ గలదనుటకు సందేహము లేదు."
అను వాక్యములను మాత్ర ముదాహరించి, వీరేశలింగముపంతులవారుగూడఁ దమమతము నంగీకరించియున్నట్లు వ్రాసియున్నారు.

వీరేశలింగముపంతులుగారిని బ్రామాణికులుగాఁ గైకొనుసందర్భమునఁ దేటతెల్లముగానున్న పంతులవారి యభిప్రాయమును సాకల్యముగా వెల్లడింప వలయునేగాని, యిట్లు మాటుపఱుచుట యుచితముగాదు.

పోనిండు. వీరుచూపినవాక్యములుమాత్రము వీరివాదమునకు ఏమి యనుకూలించుచున్నవి ?

శిష్టువారు గ్రంథరచనా సమర్థులనియు, హరికారికలు శిష్టువారు రచించినవే గాని అథర్వణాదులచేఁ జేర్పఁబడిన హరిభట్టు రచించినవి కావనియు, ఈ వాక్యములు చెప్పఁగలవుగాని, హరికారిలనుబట్టి బాలవ్యాకరణము పుట్టిన దనుటలో ఇవి సాధకములు కాఁజాలవుగదా! కానపుడు వాని నిటఁ బ్రదర్శించుట యెందులకు ? ఈ కారికలు హరిభట్టకృతములు కావనుటలోను, శిష్టువారు రచించినవే యనుటలోను నెవ్వరికిని విప్రతిపత్తిలేదు. అది యటుండనిండు.

పయిని జూపఁబడిన కవుల చరిత్రయందలి వాక్యములవలన శిష్టువారు బాలవ్యాకరణమును జూచియే కారికలు రచించిరను నభిప్రాయమే పంతులుగారి కున్నట్లు స్పష్టమగుచున్నదిగదా !

అదియుఁగాక, పంతులుగారు కల్లూరివారి కోరికనుబట్టి గుప్తార్థప్రకాశికను గూర్చి తమ యభిప్రాయపత్త్రము పంపియుండిరి. దానిని కల్లూరివారు గుప్తార్థ ప్రకాశికారంభమునఁ బ్రకటించుకొని యున్నారు. అందు

> "ప్రకీర్ణపరిచ్ఛేదావసానమునందు గ్రంథకర్తల విషయమున మీ రిచ్చిన యభిప్రాయముతో నేనేకీభవింపఁజాలనందులకుఁ జింతిల్లుచున్నాఁడను."
>
> 16—10—1915.

అని వీరేశలింగముపంతులుగారు నిష్పక్షపాతముగా, నిస్సందేహముగా, నిస్సంకోచముగాఁ దమ యభిప్రాయమును వక్కాణించి యున్నారు.

—గుప్తార్థప్రకాశిక పుట 6.

పంతులుగారు, ఇంత విరుద్ధాభిప్రాయముతో నుండఁగా, వారు తమ వాదమును సమ్మతించినట్లు కల్లూరివారు లోకమును భ్రాంతిగొలుప యత్నించుట సాహసమనక తప్పదు. మఱొక్క యంశము :

ఒక్క వీరేశలింగముపంతులుగారిదే గాక, అప్పటి పెద్దలు మఱి యాఱుగుర యభిప్రాయములుగూడ కల్లూరివారు గ్రంథాదిని ప్రకటించుకొని యున్నారు. వారిని సప్తర్షులుగా నిర్దేశించియున్నారు. ఆ సప్తర్షులలో వీరి వాదమునకు అయిదుగురు ప్రతికూలురు, ఇద్దఱు తటస్థులు. గట్టిగా వీరని యనుకూలించినవా రొక్కరును గానరారు. గుప్తార్థప్రకాశికారంభముననున్న ఆ యభిప్రాయములు తిలకింపుఁడు.

5. "సంధిపరిచ్ఛేదములోని 18 వ సూత్రమునొద్ద — ఇప్పటి ప్రాపంచిక జ్ఞానమునఁ దక్కువ యనుభవముగల శిష్టువారు — 'చందోయి' అని యుదాహరింపఁగా, పాతకాలలోని బాలురు నవ్వుదురని లౌకికజ్ఞానపరిపూర్ణులగు సూరిగారద్దానిని దొలఁగించి, బహిరంగముగాఁ జదువఁదగినరీతిని 'కందోయి' అని దిద్దినట్లు స్పష్టమగుచున్నది." అని శాస్త్రులవారి యూహ. ఇదెట్లున్నదో పరిశీలింపుఁడు.

బాలవ్యాకరణోదాహరణములను, హరికారికోదాహరణములను మొత్తముగా నెదుట నుంచుకొని పరిశీలించినచో, బాలవ్యాకరణమునందలి యుదాహరణములే నూటికి తొంబది యథాతథముగా కారికావళిలోఁ బ్రదర్శింపఁబడినట్లు కానఁబడును. కొలఁది సూత్రములందుమాత్రము మార్పు గోచరించును.

లక్షణమునకు సరిపడునట్లు ఏ లక్ష్యము నిచ్చినను నీయవచ్చుఁగదా యను సామాన్యదృష్టితోడనో, లేక సూత్రము లెట్లును పరకీయములే గావున ఉదాహరణములనయినఁ గొన్నిటిని స్వయముగా నూహించి చూపుదమన్న తలంపుతోడనో, కాక మఱియేదృష్టితోడనో నిశ్చయింపఁజాలము గాని, కొలఁది తావులందు మాత్రము శిష్టువారు బాలవ్యాకరణోదాహరణములను మార్చి కారికావళిలోఁ గ్రొత్తవానిని బ్రదర్శించుట యచ్చటచ్చటఁ గలదు.

ప్రకృత సంధిసూత్రమున 'చందోయి' అనునది ఒక్కటే గాదు తక్కిన యుదాహరణములును మార్పఁబడినవి.

ఈ 'చందోయి' శబ్దము అంతగా లజ్జాకరమై గ్రంథములందు, అందును శబ్దస్వరూప ప్రదర్శకములగు వ్యాకరణములందుఁ బ్రయోగింపఁదగనంతటి యశ్లీలము కాదు. సూత్రాంధ్రవ్యాకరణమున "చన్గవ, చన్గొండలు" అను నుదాహరణములు చూపిన సూరిగారిదృష్టిలో నిట్టివి యశ్లీలములనుట పొసఁగనే

పొసఁగదు. అదియుఁగాక, శిష్టవాదు ప్రాచీనానుభవము లేనివారనియు, సూరిగారు అది కలవారనియు, కల్లూరివారే వ్రాయుచున్నారు. కంచోయి, చంచోయి శబ్దములు మాఱినమాట వాస్తవికము. చంచోయిని కంచోయిగా లోకానుభవశాలులైన సూరిగారే మార్చిరో, ఈ సూత్రమునందలి లెక్కలేని మార్పులతోపాటు కంచోయిని చంచోయిగా లోకానుభవశూన్యులగు శిష్టవారే మార్చిరో ఎవరు, ఎట్లు నిర్ణయింపఁగలరు? ఈ మార్పు గ్రంథపౌర్వాపర్య నిర్ణయమునకు సాధకముగాని బాధకముగాని కానేరదు.

పౌర్వాపర్య నిర్ణయమునకు మిక్కిలి సాధకములగు సుదాహరణ వ్యాఖ్యానములు వేఱే మఱికొన్ని తావులందుఁ గలవు. ఆ తావులన్నియు బాల వ్యాకరణమే మొదటిదని పట్టి చూపుచున్నవి. అవి యీ ప్రకరణముననే పిదప ప్రదర్శింపఁబడును.

> 6. "అఁట యిఁక చుఁడు శబ్దములందున్న నువు తొలి హ్రస్వంబు
> మీఁద ఖండబిందువగు ద్రుతంబునకు లోపంబును లేదు."
>
> —బాల-సంధి-22.

అను సూత్రమునకు

> "శబ్దాద్యహ్రస్వతో నాఖండబిన్దు ర్లోపో ద్రుతస్య చ వినేఁటాఁటా...."
>
> —సంధి-శ్లో-20.

అను హరికారిక యుగపడుచున్నవనియు, సూరిగారి సూత్రమునే చూచి యున్నచో కారికాకర్త చుఁడు శబ్దమును విడుచుటకు హేతువు లేదనియు, కావున సూరిగారే యీ కారికను జూచి యాలోచించి చుఁడు శబ్దమునుగూడఁ జేర్చియుందురనియు కల్లూరివారి యుక్తి.

ఇది సరిపడదు. ఎందులకన

ఇచ్చట శబ్దము మొదటిహ్రస్వమునకుఁ బరముగా ఖండబిందువుండ రాదనెడి యీ నిషేధసూత్రమున, అట్టి బిందువులుగల కొలఁది శబ్దములను పర్యుదాసముచూపుట ఆవశ్యకమయినది. కాఁగా, సూరిగారు అఁట, ఇఁక. చుఁడు శబ్దములకు పర్యుదాసము నిర్దేశించినారు. ఆ మూఁడింటిలో అఁట, ఇఁకలకేగాని చుఁడు శబ్దమునకు పర్యుదాస మక్కఱలేదని శిష్టువారు తలంచి యుండవచ్చును. ఏలయన

అఁట, ఇఁకలకును 'చుఁడు' శబ్దమునకును గొంత భేదము గలదు.

అఁట, ఇఁక అనువాని పూర్వరూపములు మారములయి స్వరూపము నుండి తొలఁగుటచే నిష్పత్తిమార్గము నిరూపింప వలనుపడక యివి ప్రతిపదోక్తములగు నవ్యయములుగా పరిగణింపఁబడుచున్నవి.

'చుఁడు' శబ్ద మట్టిదికాదు. ఇది 'చూడుఁడు' అను క్రియాపదమునకు సంగ్రహరూపము, లుప్తశేషము. కావుననే "చూడుఁడి-చూడుఁడీ" అనువాని యందువలె దీనికిని చుఁడి, చుఁడీ అని ఇ, ఈ, ల యను ప్రయోగము గూడ ప్రసిద్ధమయియున్నది. 'చూడుఁడు' అనుదానిలోని యర్ధబిందువు 'చుఁడు' అనుదానిలో ననువర్తించి కానంబడుచున్నది.

'అఁట, ఇఁక'లలోని సిద్ధఖండమువలె 'చుఁడు'లోనిది మూలము తెలియని యనుస్వారము కాదు. కావున దీనికి పర్యుదాసము అంతగా నావశ్యకముకాదేమో అనియు, ఇదిగాక, 'ఏనాఁడు' అనుదానికి సంగ్రహరూప మయిన 'ఎన్నఁడు' అనుదానిలోని 'నఁడు' అనుదానికి ఇట పర్యుదాసము చూపుటలేదుగదా ! ఇంచుమించు 'చుఁడు' కూడ అట్టిదేగదా ! అనియు నూహలతో శిష్టువారు "చుఁడు" శబ్దమును విడిచియుండవచ్చును.

ఇంతియగాక "చుఁడు" శబ్దమును విడుచుటకు మఱొక్కటిగూడ హేతువయియుండును.

శిష్టువారు సంస్కృతపండితులు గావున, అహోబలపండితీయము చూచి యుండవచ్చును.

అందు ఈ సందర్భమున నవధానముతో పరికింపవలసిన సూక్ష్మాంశ మొక్కటి గలదు.

"హ్రస్వాత్ పూర్ణోపి భవేత్ — దీర్ఘాచ్చేత్ ఖణ్డఏవ న జ్ఞేయః".

హ్రస్వముమీఁద రెండు బిందువులు నుండవచ్చుననియు, దీర్ఘముమీఁద ఖండబిందువుమాత్రమే యుండుననియు, ఈ చింతామణికారికకుఁ దాత్పర్యము. దీనింబట్టి చెందొవ, కెందమ్మి, రండు, పొండు — ఇత్యాదులందు ఖండము గూడ నుండఁదగునని తేలుచున్నది. అది యెవ్వరికిని సమ్మతముకాదు. కావున, "నఖణ్డః ప్రథమాత్ హ్రస్వాత్" (శబ్దము మొదటి హ్రస్వముమీఁద ఖండబిందువుండదు) అని నిషేధించి, యథర్వణాచార్యులు పయి చింతామణి కారికను సవరించినారు. దీనిచే "చెందొవ" మున్నగు స్థలములందును, రండు, పొండు ఇత్యాదులగు వ్యస్తపదములందును, నర్ధబిందువు నివారితమయినది.

కాని, దీనినిబట్టి "ఇఁక" మొదలగు చోటులందుఁగూడ నర్ధబిందు వుండరాదే యను చిక్కొకటి అహోబలపండితునికి స్ఫురించినది. ఆ చిక్కు తొలఁగించుటకు ఆయన

"నఖణ్డః ప్రథమాత్ హ్రస్వాత్: అత్ర హ్రస్వశబ్దేన
హ్రస్వాజన్తో హల్ వివక్షిత ఇతి ఇఁక ఇంకేత్యాదౌ
నదోష ఇతి జ్ఞేయమ్."

అనఁగా, ఈ యథర్వణకారికలోని హ్రస్వశబ్దమునకు హ్రస్వాచ్చు పరమందుఁ గల హల్లని యర్థము గ్రహింపవలయుననియు, దానివలన ఇఁక మున్నగువానిలో అర్ధబిందువు సిద్ధించుననియు వ్యాఖ్యానించియున్నారు. కాఁగా, అజాదిశబ్దము లందు మొదటిహ్రస్వముమీఁద ఖండబిందు వుండవచ్చుననియు, హలాది శబ్దము లందు తొలి హ్రస్వముమీఁద ఖండబిందు వుండరాదనియు, అహోబలపండి తీయమునఁ దేలిన ఫలితార్థము.

ఇది చూచి శిష్టువారు "చుఁడు" అనునది హలాదిశబ్ద మగుటచే అహోబలపండితీయమునుబట్టి దీనిలో అర్ధబిందు వుండరాదుగదా దీనిని అఁట, ఇఁకలతో ఎట్లు చేర్చుట? అను శంక కలిగి అహోబలపండితునిమొదఁ దమకుఁగల ప్రామాణికతనుబట్టి వారు చుఁడుశబ్దమును విడిచియుండవచ్చును.

మొదటివారికంటె రెండవవారు ఒకశబ్దమును హెచ్చింపనువచ్చును. తగిన హేతువున్నచో తగ్గింపనువచ్చును. వీనిలో నేదియు ననంభవము కానేరదు. కావున ఈయుక్తి కల్లూరివారి వాదమునకు లేశమును నుపకరింపదు.

ప్రకృతముకాదుగాని ప్రాసంగికముగా మఱొకచిన్నమాట. 'ఇఁక' అనుచో అథర్వణకారిక సంగ్రహింపని అర్ధబిందువును అహోబలపండిత వ్యాఖ్యానము ఎట్టెట్టో సంపాదించుట సంతసమెగాని, యీ వ్యాఖ్యవలన 'ఇఁక' తోపాటు ఇచ్చుధాతురూపమగు 'ఇందు' అనుతావున ఉండరాని ఖండబిందువు సంప్రాప్తమగుచున్నది. అహోబలగ్రంథమునుబట్టి దానిని వారించుట శక్యము కాదు. అది యటుండనిండు.

"అఁట ఇఁక చుఁడు" సూత్రమునఁగల చుఁడుశబ్దమును శిష్టువారు విడుచుటకు హేతువును నిరూపించుటమాత్రమే యిచ్చట మనకు ప్రకృతము.

7. "కర్మధారయంబు త్రికస్త్రీసమ మగంత ధాతుజవిశేషణ పూర్వ పదంబయియుండు" —బాల-సమాస-5.

అను సూరిగారి సూత్రములోని త్రికపదము

"ముగన్త సర్వనామాయే స్త్రీసదృగ్ధాతు భేదకైః
సపూర్వపదకః కర్మధారయో హ్యత్ర దృశ్యతే" —సమాస-శ్లో.2, 3.

అను హరికారికలో నగపడక, దానికిమాఱుగ 'సర్వనామ + అ + ఈ + ఏ = సర్వనామాయే' అను క్లిష్టసంధులతోడి పద మగపడుచున్నదనియు, సూరిగారి సూత్రమునే శిష్టువారు చూచియున్నచో, త్రికసంజ్ఞను విధించుకొని త్రికశబ్దమునే వాడియుందురనియు, కావున సూరిగారిగ్రంథమే అర్వాచీనమనియు కల్లూరివారి తలంపు.

అది యటుండనిండు. వీరి మఱొక్కయూహ పరికింపుఁడు.

సూరిగారు తమకుముందు వ్యాకరణమే లేనట్లును, తమకే వ్యాకరణము క్రొత్తగా స్ఫురింపసట్లును "మను మదుపజ్ఞంబగుచున్ । దనరినవ్యాకృతిని...." అను గ్రంథాంతపద్యమున సూచించిరనియు, ఆ స్థితిలో పూర్వుల నామములు నిర్దేశించినచోఁ దమకీర్తికి లోపముగలుగునన్న కారణముచే హరికారికలు చూచియు నందున్న పూర్వులనామంబులు నిర్దేశింపక విడిచిరనియుఁ దోఁచు చున్నదఁట.

ఇది మిక్కిలి అపోహము.

గుప్తార్థప్రకాశికా రచనాకాలమునకు సూరిగారి సంస్కృతసూత్రాంధ్ర వ్యాకరణము వెలువడియుండలేదు. కావున, కల్లూరివారు దానిని జూడకుండుట వల్లను, సూరిగారియెడఁ బ్రతికూలభావ మేర్పడియుండుటవల్లను 'మదుపజ్ఞం బగుచున్ దనరినవ్యాకృతి' అను సూరిగారిమాట యసత్యకల్పనమను నపోహము వీరికిఁ గలిగినది. ఆ గ్రంథము లభింపకున్నను, నింతటి యపో హము కలుగరాదు. సూరిగారికిముందు వ్యాకరణములు పెక్కులు ప్రసిద్ధము లయి బహుళప్రచారము నందియుండ. తమవ్యాకరణమే మొదటిదని యీ పద్యమున వారు సూచించినట్లు సమన్వయించుట యెంతమాత్రమును సమంజసముగాదు. సూరిగారేకాదు. ఎంత అమాయికుఁడయినను తనదే మొదటివ్యాకరణమని పంధొమ్మిదవశతాబ్దిలోనివాఁడు చెప్పుకొనునా?

సూరిగారికిముందు తెలుఁగువ్యాకరణములు సంస్కృతశ్లోకములుగను, తెలుఁగుపద్యములుగను వెలసియున్నవి. ఆ స్థితిలో ఆంధ్రవ్యాకరణమును సంస్కృతభాషలో సూత్రరూపమునఁ దాను క్రొత్తగా రచించినటులు ఆ పద్య మున సూచించుట సూరిగారి యభిప్రాయముగాని, తమకుముందు వ్యాకరణములే లేవని స్ఫురింపఁజేయుట సూరిగారికి నభిప్రేతమగునా? ఎంతమాత్రమును గాదు. అట్టి యభిప్రాయమే యున్నచో

'సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరి'

—సంధి-4.

'వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థము'

—సంధి-13.

'అనుకృతిని విడుదకుం గుణుచయగునని యొకండు వలికె'

—సంధి-54.

'కుచధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించె'

—క్రియా-68.

అని యిట్లు పెక్కుచోట్ల ప్రాచీనుల నామములను ప్రాచీన గ్రంథములను ఏల పరామర్శింతురు ? ఇట్లు పెక్కుమందిని గ్రంథమునఁ బరామర్శించుటయే గాక "ఆంధ్రభాషకు లక్షణగ్రంథములు ప్రాచీనులచేసినవి పెక్కులు గానఁబడు చున్నవి" అని బాలవ్యాకరణ పీఠికారంభమున స్పష్టముగా నుల్లేఖించియున్న సూరిగారు, ఎన్నఁడును నెవ్వఁడును నెఱుంగని పూర్వపూ శృంగారభాషయల నామనిర్దేశము చేసినచోఁ దమప్రాథమికతాకీర్తికి భంగముగలుగునని భయపడి రనుట యెంతయుక్తిసహమో యోజింపుఁడు.

9. "లోట్ స్యా ల్లజ్ వ్యతిరేకే స్యాత్...." —క్రియా-శ్లో-2.

"అనుబంధో ల్యటి కలజ్ అత్ర జిత్వ్యుతో భవేత్"

—క్రియా-శ్లో-7.

ఇత్యాది హారికారికలయందు లజ్, కలజ్, నుజ్, ఛుజ్, కజ్ ఇత్యాదులు హల్మాత్రమయిన జకారమే(జ్) ఇద్వర్ణము కలవిగా జిత్తులు (జ్ + ఇత్)గా విధింపఁబడినవనియు, బాలవ్యాకరణమున నట్లుగాక యవియన్నియు లజి, కలజి మున్నగురీతిని జీత్తులు (జి + ఇత్)గా నగపడుచున్నవనియు, జకార మాత్రమునే (జ్) అనుబంధముగాఁ జేర్చిన శిష్టువారి మార్గమున ఆ జకారము నకు 'హలన్త్యమ్' అను పాణినిసూత్రముచే ఇత్సంజ్ఞ మిక్కిలి సులభమనియు, జి అనుదానిని అనుబంధముగాఁ జేర్చినసూరిగారిమార్గమున ఆ 'జి' అను అజ్విశిష్టమునకు ఇత్సంజ్ఞను విధించుసూత్రము పాణినీయమునఁగాని మఱి యెచ్చటనుగాని గగనకుసుమంబై కానరాదనియు, ఇట్లు జీత్తులుగా విధించుట సూరిగారి పాండితీశూన్యతను వెల్లడించుచున్నదనియు, జిత్తులుగా విధించుట శిష్టువారి పాండిత్యప్రకర్షమును జాటుచున్నదనియు, కావున శిష్టువారిదే ప్రథమ గ్రంథమనియు కల్లూరివారియుక్త్యంతరము.

ఈ యుక్తి తాఱుమాఱయి వ్యత్యస్తముగా నున్నది.

ఈ స్థలమున సూరిగారి 'జీ' త్త్వకల్పనమే నిర్దుష్టము, సుశబ్దసాధకము. శిష్టువారి 'జి' త్త్వకల్పనము అపశబ్దసంపాదకము, అనర్థదాయకము.

ఎట్లందురా ! పరికింపుఁడు.

సూరిగారి జీత్త్వకల్పనములో వీరుద్ఘాటించిన దోషమునకు సమాధానము చూపుట ప్రథమకర్తవ్యము.

'జి' అను అజ్విశిష్టవర్ణమునకు ఇత్సంజ్ఞను సంపాదించుమార్గము పాణి నీయమునఁగాని మఱియెచ్చటనుగాని గగనకుసుమంబై కానరాదనికదా వీరి యాక్షేపము ! కరతలామలకంబయి కానవచ్చుచున్నదని దానికి మన సమా ధానము.

అవి పాణినీయమున లేనిమాట సత్యమే: పరికించినచో బాల వ్యాకరణముననే కానంబడును.

ఈ ఇత్సంజ్ఞాప్రసక్తి కలిగినతావున "జిత్తు బిందుపూర్వంబగు" (బాల-తత్సమ-19) అనుసూత్రమున సూరిగారు తమప్రణాళికలోని అజ్వ్యోష్ఠవ్యంజనములకు ఇత్సంజ్ఞ పాణినీయముచే లభించుమార్గము లేదనియు, కేవల హల్లుల కయినను పాణినీయమునుబట్టి లభించుట కష్టసాధ్యమనియుఁ బర్యాలోచించి ఇత్సంజ్ఞావిషయమున ప్రాకృతవ్యాకరణవిధానము సకలవర్ణసాధారణమయి సువిశాలమయి యుండుట గుర్తించి, యామార్గము నవలంబించి, యీ సంజ్ఞా విషయమున మనకు నితరవ్యాకరణాపేక్ష లేకుండఁ జేయఁదలంచి

"కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగింపనపుడు
కానంబడు వర్ణ మిత్తనాఁబడు" —తత్సమ-19-వృత్తి.

అని స్పష్టముగా ప్రత్యేకముగా ఇత్సంజ్ఞను విధించియున్నారు.

త్రివిక్రమప్రాకృతశబ్దానుశాసనమున
"యః కార్యార్థం సూత్రే అనుబధ్యతే
నచ ప్రయోగే దృశ్యతే స ఇత్" —1-1-14.

అని ఇత్సంజ్ఞావిధానము గలదు. దీనినిగాంచి సూరిగారు ఇందలి 'సూత్రే' అను పదమునకు బదులుగా 'ప్రత్యయాదులందు' అనుమార్పుతో మెఱుఁగుపెట్టి యవాక్యమును యథాతథముగాఁ దమమాటలతో నుల్లేఖించినట్లు స్పష్టమగును.

దీనివలన నుక్, టుక్, డుజ్ మున్నగుచోట్ల కేవలవ్యంజనములకును, లజీ, కజీ మున్నగుచోట్ల 'జీ' అను అజ్వ్యోష్ఠవ్యంజనములకును ఇత్సంజ్ఞ ధారాళముగా బాలవ్యాకరణమువల్లనే సిద్ధించుచున్నది.

సూరిగారు ఇంతపూనికతో సమాలోచించిన యీ ఇత్సంజ్ఞావిధిని బాల వ్యాకరణమున సూత్రరూపమునఁగాక వేఱుగా వార్తికరూపమున నిక్షేపించి యుండుటవల్ల నించుక చాటుగా నుండుటంబట్టి దీనియునికిని శిష్టవారేగాక కల్లూరివారును గుర్తింపరయిరి.

ఆ కారణమువల్లనే శిష్టవారు బాలవ్యాకరణమునందలి జీత్తులనెల్ల జిత్తులుగా మార్చుటయు, ఆ మార్పే మిక్కిలి సమంజసమని కల్లూరివారు సమర్థింపఁబూనుటయు సంభవించినది.

సూరిగారు ఇత్సంజ్ఞను విధించినది సూత్రముకాదే యని యెవ్వరయిన సంశయింతురేమో! సూత్రకర్తయే స్వయముగా నుల్లేఖించిన వాక్యము సంయితము వార్తికరూపమయి సూత్రముతోఁ దుల్యముగఁ బ్రమాణముగాక తప్పదు.

ఇట్లిప్పటనేగాక పెక్కుస్థలములలో సూరిగారు వృత్తులలోఁ బ్రత్యేక వాక్యములచే నిరూపించినవియు ననేకములు గలవు. వానినెల్ల సూత్రములతో పాటు ప్రమాణములుగా నెల్లరును గ్రహించుచునేయున్నారు. గ్రహింపకను దప్పదు.

'ఉపధయనఁగాఁ దుదివర్ణమునకు మునువర్ణము.' —సంజ్ఞ-10.

'నామంబనఁగాఁ బ్రాతిపదికంబు.' —తత్సమ-21.

'ఇందు జస్త్వనిశబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది.'

—సంధి-30.

'ఈ కార్యము కర్తృవాచకపదక్షరమునకుఁ గలుగును.'

—సంధి-15.

ఇట్టివిషయము పెక్కులు కన్పట్టును.

పయియంశములనుబట్టి సూరిగారి జిత్త్వకల్పనము నిర్దుష్టమని తేటతెల్ల మగును.

ఇఁక శిష్టవారి జిత్త్వకల్పనమునందు సంభవించు ననర్థములు పరి కింపుఁడు.

పాణినీయమున ఙిత్తులు, ఞిత్తులు ఉన్నట్లు బాలవ్యాకరణమున కొన్ని జిత్తులు, మఱికొన్ని జీత్తులు గలవు.

డుజ్ మున్నగునవి జిత్తులు. కజీ మున్నగునవి జీత్తులు.

| జిత్తు | జీత్తు |
|---|---|
| జిత్తునకుముందు బిందువువచ్చును. | జీత్తునకు ముందున్న ఉత్వమునకు అత్వమువచ్చును. |
| బిందువు క్రియలయందును ఇత రములందును సర్వత్ర రావలయును. | ఉత్వమునకు అత్వము క్రియలయందు మాత్రమే రావలయును. |
| కొట్టుఁడు, కొట్టుండు. | కొట్టక, తిట్టక. |
| రాముఁడు, రాముండు. | |

పయిని జూపినది సూరిగారి జిత్త్వ, జీత్త్వప్రక్రియాప్రణాళిక.

హరికారికలలో జీత్తులు లేవు. అవిగూడ జిత్తులే.

జిత్తు పరమగునపుడు బిందువును, ఉత్వమున కత్వమును రెండును విధింపఁబడినవి.

ఈ కలగలపు విధానములో పయిరూపములలో కొట్టక, తిట్టక ఇత్యాదు లందు రాఁగూడని బిందువులు సంభవించి, కొట్టంక, తిట్టంక మున్నగు కురూపములు సిద్ధమగుచున్నవి.

మఱియు, కొట్టుఁడు, కొట్టుండు మున్నగుచోట్ల ఉండవలసిన ఉకారము పోయి, అకారములు సిద్ధమయి, మధ్యమపురుషక్రియలన్నియు వ్యతిరేక రూపములవలె కొట్టఁడు, కొట్టండు అని తేలుచున్నవి. వీరిమార్గమున 'కొట్టుండు'మాదిరి రూపములే సిద్ధింపవు.

ఈ రీతిగా, కావలసినవి కాకుండుట, రాఁగూడనివి సంప్రాప్తమగుట హరికారికాప్రణాళికలో తేలిన ఫలితార్థము.

పయివానిలో 'కొట్టక' ఇత్యాదులందు బిందువును వారింపయత్నించి, కల్లూరివారు 'అత్ర జిత్యదుతో భవేత్' అను అత్వవిధాయక సూత్రమందలి 'అత్ర' శబ్దమువలన ధాత్వధికారము లేనిచోటనే జిత్తు బిందుపూర్వంబగునని ఒక వింతస్వారస్యము నూహించినారు. దీనివలన 'కొట్టక' ఇత్యాదులందలి బిందువులు నివారితములగునుగాని, వానితోపాటు 'కొట్టుండు' మున్నగుచోట్ల ఉండవలసిన బిందువులుగూడఁ దొలఁగిపోయి మఱికొన్ని కురూపములు సంభవించుచున్నవి.

ఇట్టిచిక్కు రాకుండుటకే సూరిగారు ఆదినే సుదూర మాలోచించి సర్వత్ర బిందుసంపాదకముగా జిత్తులను, ధాతువులందుమాత్రము అత్వసంపాదకములుగా జీత్తులను వేఱువేఱుగా నేర్పఱిచియుండ, ఆ ప్రణాళికను గ్రహింపక, శిష్టువారు జీత్తులను విడిచి యన్నిటిని జిత్తులుగా ఏకరాశిచేసి, యవశబ్దసిద్ధికి దారిచేసియుండ, కల్లూరివారు ఈ రెండుప్రణాళికలయందలి గుణాగుణములను వివేచింపక మీఁదుమిక్కిలి యిట శిష్టువారిమార్గమే సమంజసమనియు, కావున హరికారికలే మొదటివనియు సమర్థింపఁబూనుట మిక్కిలి వ్యత్యస్తముగా నున్నది.

10. "తద్ధర్మాదిషు లేడాశీశ్చాప సంప్రార్థనే విధా" —క్రియా-శ్లో-1.
"లోట్ స్యాల్లిజ్ వ్యతిరేకే స్యాత్...." —క్రియా-శ్లో-2.

అని హరికారికలలో లేట్, లోట్ అని లకారములు సంస్కృతవ్యాకరణప్రసిద్ధములయినవే స్వీకరింపఁబడినవనియు, సూరిగారు 'లాట్టు, లూట్టు' అని క్రొత్త లకారములు తెచ్చిపెట్టుటకు వ్యాకరణపాండిత్యము లేకుండుట కారణమనియు కల్లూరివారు కల్పించిన వేఱొకయుక్తి.

వీరియభిప్రాయముచొప్పున సూరిగారికి సంస్కృతవ్యాకరణానుభవము లేకున్న మానెఁగావి, ఆయన యీ కారికను జూచియుండిరిగదా ! చూచినవారు ఆ లేట్టులోట్టులను విడుచుటకు హేతువేదియో వీరు నిరూపింపవలసియుండును.

విజయమునకు లకారములపేరు లెఱుంగుటకు గొప్ప వ్యాకరణపాండిత్యముతోఁ బనిలేదు. ధాతురూపావళిమాత్రమే చూచిన బాలునికయినను నీ లకారములపేరులు పరిచితములయియుండును.

సూరిగారు లట్టు, లిట్టు, లృట్టులను పాణినీయములోనివానినే గ్రహించుటకును, లజీ, లాట్టు, లూట్టులను క్రొత్తవానిని గల్పించుకొనుటకును వేఱె కారణము గలదు.

వర్తమాన భూత భవిష్యదర్థములు బోధించుటకై అపేయర్థములుగల లట్, లిట్, లృట్ అను సంస్కృత లకారములనే గ్రహించిరి. ఇఁక క్రొత్తవియగు తద్ధర్మ తచ్ఛీలాదులను, ఆశీశ్శాపాదులను, వ్యతిరేకమును బోధించుటకు సరిగా నీ యర్థములుగల లకారములు సంస్కృతమున లేవు. ఈ యర్థములకు, తక్కిన పాణినీయ లకారములలో వేనినో మూఁటిని అర్థాంతరములుగలవానిని గ్రహించినచో, వానికి సంస్కృతమునందలి యర్థములు స్ఫురించి భ్రాంతి కలుగుచుండునని యూహించి, యట్టి యర్థసాంకర్యము కలుగకుండుటకయి మూఁడిటిని క్రొత్త లకారములను కల్పించియుండిరి.

శిష్టువారు ఈ లాట్టు లూట్టులను జూచియు, ఈ ప్రయోజనమును గుర్తింపక, యీ క్రొత్త లకారములు మనకేలయని వీనిని మార్చి సంస్కృతమున నున్న లేట్టు లోట్టులను గ్రహించియున్నారు.

ఈ మార్పువలన శిష్టువారి సూక్ష్మదృష్టికి లోటు వెల్లడియగునేగాని, సూరిగారి పాండిత్యమునకు లోటు గోచరింపదు. అదియటుండ ఈ ప్రసంగము పౌర్వాపర్య నిర్ణయమునకు నుపకరించునదియుఁ గాదు.

11. "నిడు నడు కడు చిఱు కుఱు గత
దఱయోః ప్రాణే పరేతు టౌ ద్వౌ స్తః
గ స ద ద వాః పరుషాణాం
పరతః ప్రథమాస్తతస్తు బహుళం స్యుః" —సంధి-శ్లో-24.

అను హరికారికలోఁ బూర్వార్ధమున నిట్టూరుపు మున్నగు సమాసములందలి సంధిరూపములును, ఉత్తరార్ధమున వాఁడు గొట్టె మున్నగు వ్యస్తపదము లందలి సంధిరూపములును సాధింపఁబడినవనియు, ఇందు మొదటివగు సమాససంధిరూపములను సంధిపరిచ్ఛేదమున 27, 28, 29, 30 సంఖ్య గల సమాససంధి సూత్రములయొద్దఁ జూపవలసియున్నదనియు, అయినను ఛందో నిర్బంధముచే ప్రకరణ విరోధమునకుఁ దలయొగ్గి, ఆర్యావృత్తములో ఇముడ్చుటకు వీలున్న గసడదవాదేశసూత్రముతోఁ గలిపి శిష్టువారు కక్కుఱితి పడిరనియు, ఈ ప్రకరణ విరోధమును గమనింపఁజాలక సూరిగారుగూడ ఈసూత్రక్రమమును ఇట్లే యుంచిరనియు, అట్లుగాక స్వతంత్రముగ సూరిగారు బాలవ్యాకరణమును రచించినచో నిట్టి ప్రకరణ విరోధము తటస్థించుట కవకాశము లేదనియు, కల్లూరివారి వేఱొకయుక్తి.

అందును "లాఁతి" శబ్ద ప్రయోగమన్న ఆయనకు ప్రీతి మిక్కుటము.

"లాఁతిచో సహితము కాదేశాదులు గానంబడియెడి"

—బాల-క్రియా-102.

"లాఁతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి."

—బాల-క్రియా-123 వృత్తి.

"లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి."

—బాల-ప్రకీర్ణ-18.

"లాఁతులకు ను వులు నిత్యంబు." —శబ్దలక్షణసంగ్రహ-5-100.

"లాఁతు లుభయంబులు." —శబ్దలక్షణసంగ్రహ-3-1.

"లాఁతులు స్థిరంబులు." —శబ్దలక్షణసంగ్రహ-1-16.

అని పెక్కుతావులందు ఈ శబ్దము గానవచ్చును.

ఈరీతి నాతని వ్యాకరణములందెగాక, నీతిచంద్రికయందును

లాఁతి చోటికిఁ బోఁగూడదు.

లాఁతి విధము సులభము.

లాఁతి పెరవు లావుగామించేసి.

లాఁతి యుపాయంబుచేత రాఁబట్టరాదు.

అని యిట్లు ఈ "లాఁతి" శబ్దము ఆయన రచనలోఁ బలుమాఱు ప్రయుక్తమగుచుండుట కనిపట్టి, గ్రంథకర్త యభిరుచిని, అభ్యాసమును గమనించి దానింబట్టియే యీ సూత్రమునఁగూడ "లాఁతి" శబ్దము సహజస్ఫురితమయి చేరినట్లు ఊహించుట రుచిరముగాని హరికారికలోని "పరస్మాత్" అను పదమును జూడఁబట్టి దానికి ప్రతిబింబముగా స్ఫురించినట్లు భావించుట యొత్తిగా సముచితము కాదు.

ఒక గ్రంథమునకు వ్యాఖ్య రచించువారు ఆ గ్రంథమునందలి శైలీ విలక్షణతను, గ్రంథకర్త యభిరుచివిశేషములను నవగాహనము చేసికొనకుండుట గ్రంథమునకు ఏకొంతో యన్యాయమొనరించుట.

ఏవిర్ణయమునకును ఉపకరింపక యింపులేని యీ ప్రసంగమును వింతటితో విడిచి యిఁక నన్నిటికంటెను ప్రత్యేకదృష్టితో పరిశీలింపఁదగిన కల్యాణివారి పదమూఁడవ యుక్తిని పరికింతము.

13. "పుంలిఙ్గాత్ మహతో డుజ్ స్యాత్." —తత్సమ-శ్లో-43.

"మానార్థాత్ ఎఁడు రేకత్వే." —తద్ధిత-శ్లో-9.

"నల్లాదిభ్యో గుణేభ్యో నః." —తద్ధిత-శ్లో-2.

"పేర్వాదిభ్య ఇమిర్భవేత్." —తద్ధిత-శ్లో-2.

ఇత్యాదిరూపముగా హరికారికలలో, శిష్టువారు ప్రత్యయవిధాయక సూత్రము లలో "జ్యాప్ప్రాతిపదికాత్" మున్నగు పాణినీయ సూత్రములలోని పంచ మ్యంతములవలె "పుంలిఙ్గాత్" మున్నగు రీతిని పంచమ్యంతములనే ప్రయో గించిరనియు, ఇట్లే తెలుఁగు సూత్రములందుఁగూడ "పుంలింగముకంటె డుజ్జగును" మొదలగు రీతిని "కంటె" వర్ణకమునే ప్రయోగింపవలసి యున్నదనియు, పంచమ్యంతమున్నచో సందర్భవశమున "పరమై" అను నర్థము స్ఫురించి పుంలింగముకంటె పరమయి డుజ్ప్రత్యయము వచ్చునను నన్వయ మేర్పడుననియు, సంస్కృతవ్యాకరణ సంప్రదాయ మెఱుంగక సూరిగారు "పుంలింగంబగు మహద్వాచకమునకు డుజ్జగు" నను రీతిని ప్రత్యయవిధాన స్థలములలో షష్ఠ్యంతములు ప్రయోగించిరనియు, ఈ షష్ఠ్యంత ప్రయోగముచే స్థాన్యాదేశభావము స్ఫురించి మహద్వాచకస్థానమున అనఁగా దానిని గొట్టివైచి డుజ్జు వచ్చునను నర్థము సంభవించి, ప్రక్రియ తాఱుమాఱగు ననియు, ఈపాటి సంస్కృతవ్యాకరణ మర్యాద నెఱుంగని సూరిగారు స్వయముగా బాలవ్యాకరణమును రచింపఁజాలియుండరనియు, కల్లూరివారు విశేష ప్రయత్నముతో పన్నిన వేతొకయుక్తి.

తిక్కనకంటె నన్నయ పూర్వుఁడు. తిక్కనకు నన్నయ పూర్వుఁడు.

చైత్రముకంటె వైశాఖము పరము. చైత్రమునకు వైశాఖము పరము.

అని యీ రీతిని "పూర్వము", "పరము" మున్నగు కొన్నిశబ్దములతో సంబంధముండునపుడు తెలుఁగుభాషలో పంచమిగాని, షష్ఠిగాని యుండ వచ్చును. ఈ యంశమును బాలవ్యాకరణము స్పష్టముగా విధించియున్నది. (చూ. కారక-12). ఇట్టిచోట్ల ఈరెండు విభక్తులలో పంచమికంటె షష్ఠియే రుచిరమయి వ్యవహారమున ప్రచురముగా నగపడుచుండును. ఈ దృష్టితోఁ బయివాక్యములు మఱొక్కమాఱు పఠింపుఁడు. షష్ఠియే రుచిరమని గోచరింపక తప్పదు.

దీనినిబట్టి సూరిగారు తెలుఁగు సూత్రములందు పుంలింగమునకు పరమయి డుజ్జు వచ్చుననురీతిని అన్వయము కుదురుపడునట్లు "పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు" అను విధముగా ప్రత్యయవిధాయక సూత్రములం

దన్నిటను షష్ఠినే ప్రయోగించియున్నారు. అటు వ్యాకరణమునకు సమ్మతమయి, ఇటు వ్యవహారమునకు సన్నిహితమయిన యీ షష్ఠ్యంతములకూర్పు సర్వథా సముచితమయియున్నది.

ఇట్టి స్థలమునందు సంస్కృతపద్ధతి వేఱు. ఆ భాషలో
యస్మాత్ పూర్వః — యస్మాత్ పరః
అని పంచమియే యుండవలయును.

తస్య పూర్వః — తస్య పరః
అని షష్ఠి యుండరాదు.

ఆ పద్ధతినిబట్టి శిష్టువారి సంస్కృతకారికలలో "పుంలిఙ్గాల్ మహతో డుట్ స్యాత్" — "మానార్థాత్ ఎడుః రేకత్వే" మున్నగురీతిని పంచమ్యంతములు ప్రయుక్తములయినవి.

ఇచట "పుంలిఙ్గస్య డుట్", "మానార్థస్య ఎడుః" అని షష్ఠ్యంతములు ప్రయోగించినచో నది సంస్కృతసంప్రదాయ విరుద్ధమగును. అనఁగా, ఇట్టి యెడ తెలుఁగు సూత్రములలో షష్ఠులే సముచితములు, సంస్కృతకారికలలో పంచములే ప్రయోగార్హములు అన్నమాట.

ఈ విభక్తిప్రయోగపరిపాటిని గమనించియే సూరిగారు తమ సూత్రాంధ్రవ్యాకరణము సంస్కృతభాషారచితము గావున, అందు ప్రత్యయ విధులలో ఆ భాషాసంప్రదాయము ననుసరించి పంచమ్యంతములనే ప్రయోగించి యున్నారు. పరికింపుఁడు.

| సూత్రాంధ్రవ్యాకరణము | బాలవ్యాకరణము |
|---|---|
| అమహత్క్లీబాభ్యాం సోర్ముః | అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు. —తత్సమ-39. |
| టికశ్చిన్నాదిభ్యో బహులమ్ | చిన్నాదులకు టిక వర్ణకంబగు. —తద్ధిత-3. |
| అతో గుణాత్ నః | నవర్ణకంబు .... నల్లాదులకగు. —తద్ధిత-6. |
| అగ్గలాదిభ్య ఇకః | ఇకవర్ణకం బగ్గలాదులకగు.—తద్ధిత-7. |
| అరమరాదిభ్య స్స్వార్థే | అరమరాదులకు స్వార్థంబునం దికవర్ణకంబగు. —తద్ధిత-9. |
| చిఱుతాదిభ్య ఉకః | ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునందగు. —తద్ధిత-10. |

పయివానినిబట్టి సూరిగారు ప్రత్యయవిధులలో షష్ఠీపంచమ్యుల ప్రయోగ పద్ధతి, ఏ భాషలో నెట్లుండవలయునను విషయమున నెట్టిజాగరూకతవహించిరో తేటతెల్లముగాఁ గానవచ్చుచున్నది.

కాఁగా, ఈ సందర్భమున బాలవ్యాకరణ హరికారికలలోని షష్ఠీ పంచమీ ప్రయోగ వ్యత్యాసము సంస్కృతాంధ్ర భాషలలోఁగల విభక్తి నియమభేదమును బట్టి వచ్చినదిగాని, శిష్టువారి పాండిత్య విశేషమునుబట్టియు, సూరిగారి పాండిత్య లోపమునుబట్టియు నేర్పడినదికాదు.

వ్యాఖ్యాతకు మూలకారునితో సామరస్యములేనిచో మూలమునందలి ఒప్పులుతప్పులు తప్పులొప్పులుగా కానిపించును. అది యటుండనిండు.

ఇట షష్ఠ్యంత ప్రయోగముచే స్థాన్యాదేశభావము స్ఫురించి, ఈ ప్రత్యయములు ప్రకృతులకు ఆదేశములగునేమో యను భ్రాంతి కలిగి ప్రక్రియ చెడిపోవునేయని వేరొక ఆపత్తి చూపినారు.

స్థాన్యాదేశభావస్ఫురణ కలుగుపాటి ప్రక్రియాపరిచయముగల బాల వ్యాకరణాధ్యేతలు ప్రత్యయములు ప్రకృతులకు పరముగానే వచ్చునని యీపాటి సామాన్యవిషయము నెఱుంగనివారయి యుండరు. ఎవరే నట్టివారున్నను, సూత్రకర్తయే స్వయముగా వివరించినవృత్తియు, చూపినయుదాహరణములును ఉత్తరక్షణముననే యట్టి భ్రాంతిని తొలఁగింపఁగలవు.

కావున నిది యొక యాపత్తికాదు.

ఇది మతాంతర విశేషము.

ప్రత్యయవిధాన సందర్భమున "మహద్వాచకమునకు డుజ్ఞగు" మున్నగు రీతిని షష్ఠ్యంతప్రయోగములు చేయుట అశాస్త్రీయమనియు, కావున షష్ఠిని ప్రయోగించుటచే సూరిగారికి సంస్కృతవ్యాకరణజ్ఞానము శూన్యమని తెలియు చున్నదనియు, ఆ జ్ఞానము లేనివారు బాలవ్యాకరణమును స్వతంత్రముగా వ్రాయఁ గలుగుట అసంభవమనియు, కల్లూరివారి యీ యుక్తిలోని ముఖ్యసారాంశము గదా!

శిష్టువారు స్వహస్తముతో లిఖించిన తాళపత్త్రగ్రంథము తమకు లభించి నట్లు వీరు తెలిపియున్నారు. దానినిబట్టియే వీరు గుప్తార్థప్రకాశికాంతమున ఆ హరికారికలను స్వయముగా ముద్రింపించినారు.

ముద్రితములయిన ఈ హరికారికలలో

"తిరశ్చామపి కామతః" —తద్ధిత-శ్లో-4.
("కా" తద్ధితప్రత్యయము. ఉ: ఇబ్బందిగాఁడు.)
"స్వార్థే కేషాంచి దేషః" —తద్ధిత-శ్లో-5.
("కా" తద్ధితప్రత్యయము. ఉ: చెలికాఁడు.)
"గవోకారాన్త శబ్దానాం సర్వత్రాపి వువర్ణకః" —తత్సమ-శ్లో-54.
("వు"ప్రత్యయము. ఉ: గోవు, విష్ణువు.)
"అదన్తానా మమహతాం క్లీబానాంచ మువర్ణకః"—తత్సమ-శ్లో-56.
("ము"ప్రత్యయము. ఉ: వనము, ధనము.)

ఈ నాలుగును ప్రత్యయవిధాయక సూత్రములు.

వీనిలో శిష్టువారు షష్ఠ్యంతములు ప్రయోగించియున్నారు.

ప్రత్యయవిధిలో షష్ఠ్యంతప్రయోగముచేసినవారు, ఈ వ్యాకరణమును స్వయముగా రచించుటకు అర్హులుకారనిగదా కల్లూరివారి ప్రతిపాదనము! దానిని బట్టి యిన్నిచోట్ల షష్ఠులు ప్రయోగించిన శిష్టువారు హరికారికలను స్వతంత్రముగా రచించుటకు అర్హులుకారనియేగదా చెప్పవలయును! కాఁగా, కల్లూరివారి ప్రతిపాదనమునుబట్టి బాలవ్యాకరణము రచించుటకు సూరిగారు అర్హులుకారు. హరికారికలు రచించుటకు శిష్టువారును అర్హులుకారు—అనిగదా తేలిన పర్యవసానము! అయినచో ఈ రెండు గ్రంథములను వీరిద్దఱునుగాక మఱియెవ్వరు రచించినట్లు?

కొనకీవాదము త్రాడుతెగిన గాలిపడగ యైనది.

అసలు జరిగినదేమన, సూరిగారికి నసమర్థత నాపాదించు మార్గములను అన్వేషించుటలో సూరిగారిషష్ఠులును శిష్టువారి కొన్ని పంచములును కల్లూరివారికి గోచరించినవి. గోచరింపఁగనే ప్రత్యయవిధానములలో పాణినీయమున సర్వత్ర పంచమ్యంతప్రయోగమే యుండుటంబట్టి తదనుసారముగనున్న హరికారికా మార్గము సాధువని స్ఫురించియుండును. ఆ స్థలములలో బాలవ్యాకరణమున షష్ఠులుండుట అసాధువని భ్రాంతికలిగియుండును. ఆ భ్రాంతివలన సూరిగారిది తెలుఁగురచనమగుటచే రెండువిభక్తులలో నేదియయినను సాధువేగదా యను స్ఫురణమే కల్లూరివారికిఁ గలుగదయ్యెను. ప్రతికూలభావముతోనున్నపుడు అనుకూలసమన్వయములు స్ఫురింపవు. కూరిమి విరసమయినచో నేరములే గోచరించును. ఎటులయిన సూరిగారు అసమర్థులని వెల్లడించుటయే ఆయన దృష్టిలో ప్రధానముగావున, ఆ భ్రాంతియే బలపడి సూరిగారి యీ ప్రయోగ పద్ధతి తప్పని నిరూపించుపట్టుదల ఏర్పడినది. ఆ పట్టుదలవల్లనే కల్లూరివారు కొన్ని అనుచితకార్యములందు ప్రవేశింపవలసివచ్చినది. పరికింపుఁడు:

వీరు ఈ యుక్తిప్రారంభమునఁ జూపిన
"నల్లాదిభ్యో గుణేభ్యో నః"
"పేర్వాదిభ్య ఇమి ర్భవేత్."

అను కారికలలో శిష్టువారు పంచమ్యంతములను ప్రయోగింపనే లేదు. అది కేవలము అసత్యము, అభూతకల్పనము. ఆకారికలలో
"నల్లాదీనాం గుణానాం నః"
"పేర్వాదీనాం ఇమి ర్భవేత్."

అని షష్ఠ్యంతములే యున్నవి. తాళపత్త్ర గ్రంథములు* పరిశీలింపుఁడు. ఆ గ్రంథములు కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తునం దొకటియు, ఆ సమీపమున కరపగ్రామమున నొకటియు లభింపఁగలవు.

ఆ తాళపత్త్రగ్రంథములలో "నల్లాదీనాం, పేర్వాదీనామ్" అని షష్ఠులే కానవచ్చును. ఈ స్థలములందేగాక, ప్రత్యయవిధాయకములగు మఱికొన్ని సూత్రములందుఁగూడ తాళపత్త్ర గ్రంథములయందు పెక్కుతావులందు షష్ఠులు గలవు. మనకు లభ్యములగు ఈ రెండుప్రతులును శిష్టువారి ప్రతినిబట్టి పుట్టినవే కాకతప్పదుగాన, కల్లూరివారియొద్దనున్న ప్రతిలోఁగూడ షష్ఠులే యుండి తీరవలయును. సందేహము లేశమును లేదు.

సూరిగారిపయిని అస్త్రప్రయోగమునకు ననుకూలముగా ఈ షష్ఠు లన్నిటిని కల్లూరివారు దిద్దివేసి పంచములుగా ముద్రింపించినారు. అనరాదుగాని, యిది గుండెదడకలిగించు ఘోరకృత్యము. అట్లు దిద్దివేయు సందర్భమున ప్రత్యయవిధులు కృత్తద్ధితప్రకరణములందెగదా యుండునని యూహించి, ఆ రెండుప్రకరణములందును నన్వేషించి, యందున్నషష్ఠులన్నిటిని పంచము లుగా మార్చివేసినారు. ఆ కలఁతలో, ఆ తొందరలోఁ బయినిజూపిన నాలుగు షష్ఠులను కల్లూరివారి కంటఁబడక చాటున నక్కియున్నవి. ఇవి వేఁటకాని

* హరికారికా తాళపత్త్రగ్రంథములు మనదేశమున నా యెఱుకకందినవి మూఁడు మాత్రమేగలవు. మొదటిది శిష్టువారు స్వయముగా వ్రాసినది. అదే కల్లూరివారివద్దకుఁ జేరి యున్నది. రెండవది శిష్టువారి శిష్యులు, పిఠాపురం గ్రామవాసులు, కప్పగంతుల ... శాస్త్రులుగారు గురువుగారి మాతృకనుబట్టి వ్రాసికొన్నప్రతి. ఇది ప్రస్తుతము ఆంధ్ర సాహిత్య పరిషత్తు నందు భద్రపఱుపఁబడియున్నది. ఇఁక మూఁడవది శిష్టువారి మేనల్లుఁడు, అల్లుఁడు, శిష్యుఁడు అయి, కాకినాడ సమీపమున 'కరప'గ్రామవాస్తవ్యులై యుండిన కొత్ర లక్ష్మీ నారాయణశాస్త్రిగారు వ్రాసికొన్న ప్రతి.

ఈ తుదిరెండుప్రతులను నేను పరికించితిని. రెండిటికిని భేదము లేశముంగావరాదు. ఇందు పరిషత్తునందలి ప్రతినిబట్టి నేను వేఱొక ప్రతిని వ్రాయించి నాయొద్ద వేఁటికిని భద్రపఱిచి యుంచితిని.

కనుగప్పి మఱుఁగునదాఁగిన మృగశాబకములు. ఈ నాలుగును దాఁగియే యుండనిచో ఈ సందర్భమున ఈ మోసము ఇంతసుస్పష్టముగా బయలుపడి యుండెడిదికాదు. కల్లూరివారు పండితులు, సమకాలికులలో మాన్యతగడించిన వారునుగాన ఇట్టి అల్లరి చిల్లర మోసమునకు అలవాటుపడినవారుకారు. కావుననే, ఒరులకుఁ బట్టువడకుండ దాచుకొను కౌశలము లేకపోయినది. నిజము నిలుకడ మీఁద బయలుపడకమానదు.

ఈ ప్రసంగమున మనకు మఱొకప్రశ్న మిగిలియున్నది. సూరిగారిది తెలుఁగురచనగాన వారి షష్ఠులెల్లను ఒప్పులే, తప్పులుకావని, ఇంతకుముందే తెల్పుకొంటిమి. ఆ షష్ఠీప్రయోగము లక్షణసమ్మతము, నిర్బాధము, నిర్వివాదము.

మఱి శిష్టువారి సంస్కృతరచనమున ఉండరాని ఆ షష్ఠులగతియేమి? అని మనము చూడవలసియున్నది.

అదికూడ నంతగా తప్పులనఁ బనిలేదు. ఈ సంస్కృతరచయితలు తెలుఁగువారు గావున, తెలుఁగు కూర్పులోని పద్ధతులుకొన్ని చిరపరిచితములు కాకతప్పదు. వాని ప్రభావము కొంత యా సంస్కృతముపయిని ప్రసరింపకను దప్పదు. కావుననే తెలుఁగువారి సంస్కృత రచనలలో సంస్కృత జాతీయము నకు భిన్నముగా తెలుఁగు జాతీయములు కొన్ని ప్రవేశించుట కాననగును. అన్యభాషలయందు మాతృభాషాసంప్రదాయ ప్రభావము సోఁకుట యనివార్యము

మాతృభాషలోని ఈ షష్ఠుల పరిచయ ప్రాబల్యముచే శిష్టువారు షష్ఠులు ప్రయోగించియుందురు. హరికారికలయందెగాక, చింతామణికారికలందును, అథర్వణకారికలందును ప్రత్యయవిధానస్థలములందు కొన్నిషష్ఠులు కానవచ్చును.

"సర్వత్రోదోత్తోః పుర్భవతి ముపట్
డుజ్ మహత్పదానాం వా
ప్రతిషేధవాచినాం నిః
చరితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్."

అని చింతామణికారికలయందును

"భవేద్ధర్మాదిశబ్దానాం ముశ్చ వుశ్చాత్ర కుత్రచిత్"
మనువట్వాది శబ్దానాం నడు జ్నిశ్చ ప్రయుజ్యతే."

అని యథర్వణకారికలయందును నగపడుచున్న యీ షష్ఠ్యంతము లన్నియు కల్లూరివారి ప్రతిపాదనమునుబట్టి తప్పులే యనవలసివచ్చును. అట్లనుటకంటె ఇవన్నియు తెలుఁగువారి సంస్కృతరచనములుగావున నిందు తెలుఁగువిభక్తుల తీరు సంక్రమించినవనుట భావించి సమర్థించుకొనుట కొంతకుఁగొంత సమంజసము.

ఈ సందర్భమున సూరిగారి విభక్తిప్రయోగ మసాధువని నిరూపించుటకై కల్లూరివారు లేవనెత్తిన యీ పక్షీపంచకములవల్ల సూరిగారికి జ్ఞానలోపము నాపాదింపఁజాలకుండుటయగాక, మీఁదుమిక్కిలి మొసలిపరిగి హరికారికలందును, అమీఁద చింతామణ్యాథర్వణకారికలందునుగల యట్టి పక్షులన్నియుఁ దప్పులేమోయను సంశయములకు దారితీసి లేనిపోనిచిక్కులు తెచ్చిపెట్టినవి.

నిజమునకు పరిణామముగల బాలవ్యాకరణమునకు తగిన వ్యాఖ్య రచించుటకు శాస్త్రనిష్ణాతులగు కల్లూరివారు కడుంగడు సమర్థులు. సంశయము లేదు. కాని, ఆదిని సూరిగారిమీఁద సమధికభావముతో మూఁడునంకుల వ్యాఖ్యానమూలమును మెచ్చుకొనుచు సోత్సాహముతో రచించినవారు తుదిభాగమునఁ బొల్లిటిరెల్ల మార్చుకొని, మూలమునెడ హేయభావమును గల్పించు దృష్టితో వ్యాఖ్య సాగించుట తగినపని కాదు.

పక్షైరదిని చేఁదనవచ్చునే! అనవచ్చునేమో! శ్రీనాథుఁడన్నట్లు, "పైత్యదోషోదయంబునఁ బరుసనయిన జిహ్వకుఁ బంచదారయుఁ జేఁదుగాదె!"

నిజమునకు ఈ వ్యాఖ్యాతలు తెలుఁగున లక్షణవేత్తలుగా పేరుగాంచినది చిన్నయసూరి వ్యాకరణమువలన.

ఆయనవలన పొందవలసిన యుపకృతిని సాంతముపొంది తుది కా యుపకారకుని తృణముకన్న తేలికగా తూలనాడఁబూనుకొనుట యిదెట్టి స్వభావము? తమనిలుకడకాధారమగు శాఖను దామే ఛేదింపనుద్యమించుట యిదేటి వెఱ్ఱిదనము? ఏఱుదాఁటి తెప్పకు నిప్పుపెట్టుట యెట్టి సౌశీల్యము?

ఇట్టివైఖరిగల గురువులయొద్దఁ జిరకాలశిక్షణమునొందిన శిష్యులు రంగయవంటివారు గురువుల లఘూకరించుటకును, మోసగించుటకును, వెఱచి వెనుదీయుట యెట్లు సంభవించును?

తమకేగాక ఆంధ్రోపాధ్యాయవర్గమునకెల్ల నత్యంతోపకారకుఁడయి, భాషాలక్షణమునకు దారిచూపిన ఒక మహనీయుని మాన్యతాగౌరవమును మాపుటకయి బూటకములకుఁగూడఁ బూనుకొనుట పెద్దలకుఁ దగిన పని మాత్రము కాదు. తమచే నుపకృతుఁడయిన రంగయ్య తమకుఁజేసిన మోసమునకు ఒకవంక క్షోభపడుచు, అది కృతఘ్నతయని దూషించుచు, అట్టి మోసమును ఉపకారులగు సూరిగారికిఁ దామే చేయ నెట్లు తలపెట్టిరో వింతగా నున్నది. సామాన్య మానవప్రకృతిని మనసున నుంచుకొని స్థిమితముగా విదారించినచో దీనికంతగా వింతపడవలసినపనియుఁ గానరాదు. ఏమన

రంగయ్యచేసినది గురువునకు మాఱుజన్మమునఁగూడ మఱపునకు రాని మహాపచారము. దానివల్ల కల్లూరివారికి క్రోధమేర్పడినది. అది

కనుగప్పి మఱుఁగునడాఁగిన మృగశాబకములు. ఈ నాలుగును దాఁగియే యుండనిచో ఈ సందర్భమున ఈ మోసము ఇంతసుస్పష్టముగా బయలుపడి యుండెడిదికాదు. కల్లూరివారు పండితులు, సమకాలికులలో మాన్యతగడించిన వారునుగాని ఇట్టి అల్లరి చిల్లర మోసములకు అలవాటుపడినవారుకారు. కావుననే, ఒరులకుఁ బట్టువడకుండ దాచుకొను కౌశలము లేకపోయినది. నిజము నిలుకడ మీఁద బయలుపడకమానదు.

ఈ ప్రసంగమున మనకు మఱొకప్రశ్న మిగిలియున్నది. సూరిగారిది తెలుఁగురచనగాన వారి షష్ఠులెల్లను ఒప్పులే, తప్పులుకావని. ఇంతకుముందే తేల్చుకొంటిమి. ఆ షష్ఠీప్రయోగము లక్షణసమ్మతము, నిర్బాధము, నిర్వివాదము.

మఱి శిష్టువారి సంస్కృతరచనమున ఉండరాని ఆ షష్ఠులగతియేమి? అని మనము చూడవలసియున్నది.

అవికూడ నంతగా తప్పులనఁ బనిలేదు. ఈ సంస్కృతరచయితలు తెలుఁగువారు గావున, తెలుఁగు కూర్పులోని పద్ధతులుకొన్ని చిరపరిచితములు కాకతప్పదు. వాని ప్రభావము కొంత యా సంస్కృతముపయిని ప్రసరింపకను దప్పదు. కావుననే తెలుఁగువారి సంస్కృత రచనలలో సంస్కృత జాతీయము నకు భిన్నముగా తెలుఁగు జాతీయములు కొన్ని ప్రవేశించుట కాననగును. అన్యభాషలయందు మాతృభాషాసంప్రదాయ ప్రభావము సోఁకుట యనివార్యము.

మాతృభాషలోని ఈ షష్ఠుల పరిచయ ప్రాబల్యముచే శిష్టువారు షష్ఠులు ప్రయోగించియుందురు. హరికారికలయందెగాక, చింతామణికారికలందును, అథర్వణకారికలందును ప్రత్యయవిధానస్థలములందు కొన్నిషష్ఠులు కానవచ్చును.

"సర్వత్రోదోతోః పుర్బహతి ముపర్
డుజ్ మహత్పదానాం వా
ప్రతిషేధవాచినాం నిః
చరితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్."

అని చింతామణికారికలయందును

"భవేద్ధర్మాదిశబ్దానాం ముశ్చ పుశ్చాత్ర కుత్రచిత్"
మనువట్వాది శబ్దానాం నడు జ్నిశ్చ ప్రయుజ్యతే."

అని యథర్వణకారికలయందును నగపడుచున్న యీ షష్ఠ్యంతము లన్నియు కల్లూరివారి ప్రతిపాదనమునుబట్టి తప్పులే యనవలసివచ్చును. అట్లనుటకంటె ఇవన్నియు తెలుఁగువారి సంస్కృతరచనములుగావున నిందు తెలుఁగువిభక్తుల తీరు సంక్రమించినట్టులు భావించి సమర్థించుకొనుట కొంతకుఁగొంత సమంజసము.

ఈ సందర్భమున సూరిగారి విభక్తిప్రయోగ మసాధువని నిరూపించుటకై కల్లూరివారు లేవనెత్తిన యీ షష్ఠీపంచములచర్చ సూరిగారికి జ్ఞానలోపము నాపాదింపఁజాలకుండుటయగాక, మీఁదుమిక్కిలి యెదురుదిరిగి హరికారికలందును, ఆమీఁద చింతామణ్యాథర్వణకారికలందునుగల యిట్టి షష్ఠులన్నియుఁ దప్పులేమోయను సందియములకు దారితీసి లేనిపోనిచిక్కులు తెచ్చిపెట్టినది.

నిజమునకు పటుబంధముగల బాలవ్యాకరణమునకు తగిన వ్యాఖ్య రచించుటకు శాస్త్రనిష్ణాతులగు కల్లూరివారు కడుంగడుసమర్థులు. సందియము లేదు. కాని, ఆదిని సూరిగారియెడ సమరసభావముతో మూఁడుపంతుల వ్యాఖ్యను మూలమును మెచ్చుకొనుచు నుత్సాహముతో రచించినవారు తుదిభాగమునఁ బొల్లిటితీరెల్ల మార్చుకొని, మూలమునెడ హేయభావమును గల్పించు దృష్టితో వ్యాఖ్య సాగించుట తగినపని కాదు.

చక్కెరదిని చేఁదనవచ్చునే! అనవచ్చునేమొ! శ్రీనాథుఁడన్నట్లు, "పైత్యదోషోదయంబునఁ బరుసనయిన జిహ్వకకుఁ బంచదారయుఁ జేఁదుగాదె !"

నిజమునకు ఈ వ్యాఖ్యాతలు తెలుఁగున లక్షణవేత్తలుగా పేరు గాంచినది చిన్నయసూరి వ్యాకరణమువలన.

ఆయనవలన పొందవలసిన యుపకృతిని పొంతముపొంది తుది తా యుపకారకుని తృణముకన్న తేలికగా తూలనాడఁబూనుకొనుట యిదెట్టి స్వభావము ? తమనిలుకడకాధారమగు శాఖను దామే ఛేదింపనుద్యమించుట యిదేటి వెఱ్ఱిదనము ? ఏఱుదాఁటి తెప్పకు నిప్పువెట్టుట యెట్టి సౌశీల్యము ?

ఇట్టివైఖరిగల గురువులయొద్దఁ జిరకాలశిక్షణమునొందిన శిష్యులు రంగయవంటివారు గురువుల లఘూకరించుటకును, మోసగించుటకును, వెఱచి వెనుదీయుట యెట్లు సంభవించును ?

తమకేగాక ఆంధ్రోపాధ్యాయవర్గమునకెల్ల నత్యంతోపకారకుఁడయి, భాషాలక్షణమునకు దారిచూపిన ఒక మహనీయుని మాన్యతాగౌరవమును మాపుటకయి బూటకములకుఁగూడఁ బూనుకొనుట పెద్దలకుఁ దగిన పని మాత్రము కాదు. తమచే నుపకృతుఁడయిన రంగయ్య తమకుఁజేసిన మోసమునకు ఒకవంక క్షోభపడుచు, అది కృతఘ్నతయని దూషించుచు, అట్టి మోసమును ఉపకారులగు సూరిగారికిఁ దామే చేయ నెట్లు తలపెట్టిరో వింతగా నున్నది. సామాన్య మానవప్రకృతిని మనసున నుంచుకొని స్తిమితముగా నిదానించినచో దీనికంతగా వింతపడవలసినపనియుఁ గానరాదు. ఏమన

రంగయ్యచేసినది గురువునకు మాఱుజన్మమునఁగూడ మఱపునకు రాని మహాపచారము. దానివల్ల కల్లూరివారికి క్రోధమేర్పడినది. అది

సంగయ్యతో నిలువక తత్సజాతీయులగు సూరిగారిదాఁక నెగఁబ్రాఁకి పెచ్చు పెరిఁగినది. ఆ క్రోధమువల్ల చిత్తవైకల్యము కలిగినది. ఆ వైకల్యమువల్ల కర్తవ్యాకర్తవ్యవిచారము తొలఁగినది. అది తొలఁగుటవల్ల కపటకృత్యమునకు మనసు మ్రొగ్గినది. అది ఆడరాని యసత్యము లాడించినది, చేయఁదగని పనులు చేయించినది.

ప్రామాణికులయి పొందవలసిన ఘనతకు భంగపాటు వాటిల్లినది. ఓహోయనిపించుకొనఁదగిన పెద్దలు ఇహీయనిపించుకోవలసివచ్చినది. ఇదీ పర్యవసానము.

క్రోధాసూయాదులు హానికరములని ఆ శ్రీకృష్ణభగవానులుపదేశించినది అర్జునునికిఁగాదు. లోకమునకు.

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే
సంగా త్సంజాయతే కామః కామాత్ క్రోధోభిజాయతే
క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥
ఇతి శ్రీమద్భగవద్గీతాసు, ఉపనిషత్సు, బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జున సంవాదే, అర్జునవిషాదయోగోనామ ద్వితీయోధ్యాయః".

14. "ఉత్తరస్య కొనోర్థాతోః కం బుధాః కేచి దూచిరే"
—ప్రకీర్ణక-శ్లో-11.

అనువాదిక హరికారికల చిట్టచివరఁ గలదు.

"ఎత్తుకొని" యిత్యాదులకు "ఎత్తుక" మున్నగు రూపాంతరములను ఈ కారిక సాధించును. దీనికి సరియగుసూత్రము బాలవ్యాకరణమున లేదు. దీనినిబట్టి సూరిగారు పయికారికను జూచియు "ఎత్తుక" మున్నగు రూపములు బహులాక్షణికులకు సమ్మతములు కాకుండుటచే ఈ రూపములను సాధించు సూత్రమును రచింపక విడిచిరనియు, ఇదిగూడ హరికారికల ప్రాథమికత్వమునే నిరూపించుననియు, కల్లూరివారి కడపటియుక్తి.

ప్రబలమగు హేతువున్నచో మూలమునమున్నదానిని అనువాదకులు విడువనువచ్చును. లేనిదానిని అనుబంధముగాఁ జేర్పనువచ్చును.

కారికలోనున్నను బహులాక్షణికసమ్మతి లేకుండుటచే సూరిగారే విడిచిరో; లేక బాలవ్యాకరణమున లేకున్నను ఇట్టివి కొన్ని ప్రయోగము లుండుటచేఁ దమకు సమ్మతమయి శిష్టువారే చేర్చిరో నిర్ణయించుట కేమి యాధారము గలదు? ఇట్టి నిరాధారమగు సంశయములు పౌర్వాపర్యనిర్ణయమునకు సాధకములు కాఁజాలవు.

కల్లూరివారియుక్తులు ఈ పదునాలుగిటిలో హరికారికలే మొదటివని స్థాపింపఁగలిగినది ఒక్కటియు గోచరింపదు. ఇఁక ఆ యుక్తులప్రసంగము విడిచి, అంతరంగికసాక్ష్యము ఏది మూలగ్రంథమని స్థాపించునో పరిశీలించు కొందము.

## గ్రంథస్థ నిదర్శనములు

బాలవ్యాకరణమునకును, హరికారికలకును రచనాసరణిలో అనేకవిధము లగు భేదములు అనేకస్థలములందుఁ గానవచ్చును. కాని, వానిలోఁ గొన్ని ప్రకృత పౌర్వాపర్య నిర్ణయమునకు సాధకములుగాని, బాధకములుగాని కాకుండుటచే నట్టివానినెల్ల నిటఁ బ్రదర్శించుట యనావశ్యకము. కావునఁ బౌర్వాపర్యనిర్ణాయకములగువానిలో ముఖ్యములనుమాత్ర మిటఁ బరామర్శించు కొందము. ఈ రెండిటను గానవచ్చు రచనాభేదములను నాలుగు విధములుగా విభజింపవచ్చును :

1. సూత్రక్రమ వ్యత్యాసములు ; 2. గణ నామభేదములు ; 3. ప్రక్రియా సమన్వయ విరోధములు ; 4. లక్ష్య లక్షణ క్రమవిపర్యాసములు.

ఏ గ్రంథమునయినను సావధానముగఁ బరిశీలింపక, హేలగా నవలోకించి నంతమాత్రమున, దాని ప్రణాళికారీతులు అవగతములు కావు. శిష్టువారు బాల వ్యాకరణమును స్తిమితముగా పరికించినవారుకారు. సంస్కృతములోనికి మార్చుటయగదా యిదెంతపనియని యనాలోచితమగు నాత్మవిశ్వాసముతో ఆదరబాదరగా ననువాదము సాగించినవారు. అయినను, సూత్రములను సూత్రములుగా ననువదించినచో ఛందోనిర్బంధమువలని తాఱుమాఱులేమియుఁ దటస్థింపకుండ, బాలవ్యాకరణమునకు ప్రతిబింబమువలె సంస్కృతగ్రంథము సిద్ధమయ్యెడిది. అపుడు ఈ కూటకరణము అభేద్యమయి పౌర్వాపర్యనిర్ణ యమునకు మార్గమే లేకపోయెడిది. అట్లుగాక, కవితాభ్యాసముగలవారుగావున సూత్రములను శ్లోకములుగా ననువదింతమనుసంకల్పము వీరికంకురించినది. గ్రంథము కారికారూపమయినచో, చింతామణ్యథర్వణకారికలను బోలి, ప్రాచీనతాముద్ర భాసిల్లి, యిదే మూలగ్రంథమని కాలక్రమమున లోకులను సులభముగా భ్రమింపఁజేయఁజాలుననుదృష్టికూడ వొడమియుండును. కారికా రూపమున రచింతమన్నసంకల్పమే కాలుజాఱుటకు కారణమయినది. ఈ కారికాసంకల్పము శిష్టువారిది గాదు. ఇది ధర్మదేవతాసంకల్పము. ఈ బాల వ్యాకరణమునకయి సుమారు ఇరువదేండ్లజీవితమును ధారవోసిన ఒక పండి తోత్తముని యమూల్యమగు భాషాపరిశ్రమ భస్మాహుతియగుటకు ధర్మదేవత సమ్మతింపదు. ఇఁక శిష్టువారి కారికారచనారంభప్రస్తావము పెరుఁగనీక ప్రకృతమనుసరింతము.

శిష్టువారు, ముందు, బాలవ్యాకరణసూత్రములకు కారికలను వేఱుగా రచించినారు. ఆ పిమ్మట బాలవ్యాకరణమునందున్న వృత్తులను, ఉదాహరణములను ఎక్కడికక్కడ ఆ కారికలకు అదికించినారు. ఇది సుస్పష్టము.

సూత్రములను కారికలలో నిముడ్చుటకయి సూత్రములవరుసను ఇటునటు కొంత మార్చవలసివచ్చినది. అంతియగాక, సూత్రములందలి పదముల వరుసయు నించుక ముందువెనుకలకు మార్చుకొనక తప్పినదికాదు. ఛందోనుకూలతకయి యిట్టిమార్పులు అనివార్యములయినవి. ఆ మార్పులవలన నుదాహరణాదులందు కారికలయందలి రచనకు విరుద్ధమగు నపక్రమము లేర్పడినవి. ఇవియెల్ల, బాలవ్యాకరణమే మొదటిదని పట్టిచూపుచున్నవి. ఆ వివరములు పరికింపుఁడు.

## 1. సూత్రక్రమ వ్యత్యాసములు

| బాలవ్యాకరణము | హరికారిక |
|---|---|
| పేర్వాదుల కిమి వర్ణకంబగు —తద్ధిత-5. | నల్లాదీనాం గుణానాం సః —తద్ధిత-శ్లో-2. |
| నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు. —తద్ధిత-6. | పేర్వాదీనా మిమి ర్భవేత్ —తద్ధిత-శ్లో-2. |

ప్రథమ ద్వితీయములుగానున్న పయి బాలవ్యాకరణసూత్రములు హరికారికలో ద్వితీయ ప్రథమములుగా తాఱుమాఱగుట గుర్తింపుఁడు. ఇటులే

| బాలవ్యాకరణము | హరికారిక |
|---|---|
| అరమరాదులకు స్వార్థంబునం దికవర్ణకంబగు —తద్ధిత-9. | చిఱుతాదే రుక స్స్వార్థే |
| ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబు నందగు —తద్ధిత-10. | అరమరాదే రిక స్తథా —తద్ధిత-శ్లో-3. |

ఈ బాలవ్యాకరణసూత్రములపౌర్వాపర్యము కారికలో విపర్యస్తమగుట గమనింపుఁడు.

పయిరెండుతావులను ఛందస్సు సులభముగాఁ గుదురుటకయి సూరిగారి సూత్రక్రమమును శిష్టువారు మార్చుకొనియుండుట సహేతుకమయి తేటతెల్లముగాఁ గానవచ్చుచున్నది. సూరిగారు పయికారికలనుజూచి, సూత్రములు రచించినచో కారికలలోని సూత్రక్రమమును వీరు మార్చుటకు నావంతయు హేతువు నిరూపింపఁజాలము.

సూత్రక్రమమునందగపడుచున్న యిట్టిమార్పులనుబట్టి బాలవ్యాకరణమే మూలగ్రంథమనుటకు నెవ్వరేని సంశయింతురా?

ఇట్టిసూత్రక్రమవ్యత్యాసము పట్టయిన పదిపండ్రెండుచోటులందుఁ గలదు. పరిశీలనలాలసులు ఆ తావులు పరికింతురుగాక.

ఆయా సూత్రసంఖ్యలు ఈ క్రింద నిర్దేశింపఁబడును.

| | బాలవ్యాకరణ సూత్రములు | హరికారికా సూత్రములు |
|---|---|---|
| ఆచ్ఛిక : | 10, 11. | 11, 10. |
| కృదంత : | 4, 5, 6. | 5, 4, 6. |
| | 14, 15, 16, 17, 18. | 14, 18, 17, 16, 15. |
| ప్రకీర్ణక : | 14, 15. | 15, 14. |
| | 19, 20, 21. | 19, 21, 20. |

ఇన్నితావులందలి యీ వ్యత్యాసమొక్కటియే సూరిగారిదే మూలగ్రంథ మని స్థాపింపఁజాలియున్నది. అయినను రెండవప్రకారమునుగూడ పరికింపుఁడు. వివాదసందర్భములందు ఒక్కసాక్ష్యముతోడనే తృప్తిఁజెందక పలువిధములగు సాక్ష్యములఁ బరిశీలించుట తత్త్వనిర్ణయమునకుఁ దగిన మార్గము.

## 2. గణనామ భేదములు

| బాలవ్యాకరణము | హరికారిక |
|---|---|
| "చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు" —తత్సమ-58. | "లోపో బహుళం మో ర్వధాదిషు" —తత్సమ-శ్లో-58. |

ఇట "చరిత్రాది"శబ్దముల మువర్ణకము లోపించునని సూరిగారు చెప్పియుండ, "చరిత్రాది"పదము శ్లోకములో నిముడక "బహుళం మోర్వధాదిషు" అని శిష్టువారు మార్చుకొనినారు.

సూరిగారు ఈ కారికను జూచియే తమసూత్రమును రచించినచో తాము "వధాదు"లనక చరిత్రాదులని మార్చవలసిన ప్రసక్తి వారికేమి గలదు ? ఇటులే

| బాలవ్యాకరణము | హరికారిక |
|---|---|
| "కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు" —బాల-తత్సమ-66. కంధరా, నాసికా, భిక్షా, దంష్ట్రా, గ్రీవా, పాదుకోల్కాప్రభృతులు కంధరాదులు. | "భిక్షాదయో భజన్త్యత్ర బహుళం క్లీబతుల్యతామ్" —తత్సమ-శ్లో-61. |

ఏయి కారికలో "కంధరా" అను మూఁడక్షరముల శబ్దము ఇముడక సూరిగారు చూపిన గణములోని రెండక్షరముల శబ్దములలో మొదటిదగు

"భిక్ష" శబ్దమును గైకొని, శిష్టువారు "భిక్షాదయో"యని శ్లోకము సరిపుచ్చు కొనుట అతిస్పష్టముగాఁ గానవచ్చుచున్నది. ఇట్టివి మఱికొన్నియుఁ గలవు. పెచ్చులు చూపఁబనిలేదు. మచ్చునకివి చాలును.

## 3. ప్రక్రియాసమన్వయవిరోధములు

వ్యాకరణమునందలి ప్రక్రియాప్రణాళిక శిష్టువారు సమాలోచించి స్వయముగాఁ గల్పించుకొన్నది కాకుండుటచే దాని స్వరూపము ఆయనకు నపరిచితమయి యాకళింతకు రాదయ్యెను.

అనువాదమునకయి అప్పటికప్పుడు తెఱచిన గ్రంథములోని ప్రణాళికా రీతులు, అంత శీఘ్రముగా నవగతమగుటయు నసంభవము. అట్టి యవగాహనము లేకుండుటవల్ల కారికలలో సంభవించిన తబ్బిబ్బులు కొన్ని పరికింపుఁడు :

(i) "ఉకారాంత గోశబ్దంబుల కంతట వుపర్ణకంబగు."—బాల-తత్సమ-48.
"వువర్ణకేతర విభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు." —బాల-తత్సమ-49.
"ఉకారాంతంబగు మహత్తునకు వువర్ణకము బహుళముగా నగు."
—బాల-తత్సమ-50.
"కద్రువ నాగమాత." —బాల-తత్సమ-51.

ఇవి సూరిగారి సూత్రములు.

ఇట ఉకారాంతములకు వువర్ణకమును వుగాగమమును వచ్చు స్థలము లన్నింటిని జూపెనారు. ఈ సందర్భమున కద్రూ శబ్దమునకుఁగూడ మొదటి సూత్రముచే వువర్ణకమును, రెండవదానిచే వుగాగమమును ప్రసక్తములయి కద్రువు, కద్రువును అను నపరూపములు కావలసివచ్చినది. అపుడు దీనికి ప్రక్రియతో సంబంధము లేకుండ "కద్రువ నాగమాత" అని ప్రత్యేకముగ నిపతించి యున్నారు. ఈ సూత్రములకు

"గవోకారాన్త శబ్దానాం సర్వత్రాపి వువర్ణకః" —తత్సమ-శ్లో-54.
"విభక్తౌ వుగ్వ్విభిన్నాయాం గోర్నిత్యం బహుళంతు వామ్"
—తత్సమ-శ్లో-55.
"ఉకారాన్తాత్తు బహుళం మహతస్స్యా ద్వువర్ణకః" —తత్సమ-శ్లో-55.
"అహిప్రసూం వినా కద్రూమ్, అస్య వస్స్యాత్ ప్రయోగతః"
—తత్సమ-శ్లో-56.

అనుకారికలు గలవు.

ఇట "అహిప్రసూం వినా కద్రూమ్" అనునది ఏ వాక్యముతో నన్వయించును? సన్నిహితమగు "ఉకారాన్తాత్తు బహుళం మహతస్స్యాద్వువర్ణకః" అను వాక్యముతోఁగదా అన్వయింపవలయును? ఆ వాక్యము మహచ్ఛబ్దవిషయక మగుటచే ఆవిధి స్త్రీవాచకమగు కద్రూశబ్దమునకు నెంత మాత్రమును సంబంధింపదు. కావున "కద్రూశబ్దము దప్ప ఉకారాంతమగు మహత్తునకు వువర్ణకము బహుళముగా నగును" అను నీ వాక్యమున "కద్రూశబ్దము తప్ప" అను నీ పర్యుదాసము అన్వయరహితమై మిక్కిలి యసంబద్ధమగుచున్నది.

ఉకారాంతములలో "కద్రూ" శబ్దము విలక్షణమనియు, దానిని వేఱు మార్గమున సాధింపవలయుననియు దృష్టి శిష్టువారికి స్వయంపరిశీలనముతో బుద్ధిస్థమేయయియున్నచో ఈ పర్యుదాసమును మొదటిసూత్రముననే తలపెట్టియుండెడివారు. అది కొంత అన్వితమయి యుండెడిది.

మూలరచనముకాక, అనువాదమగుటవల్లనే ఏ సూత్రమున కాసూత్రము అదేవరుసలో సంస్కృతీకరించుకొనుచుఁ బోవుటలో ఈ చిక్కు తటస్థించినది. ఆవరుసలోనే సంస్కృతీకరించినను, సూరిగారి నిపాతసూత్రమును నిపాతముగానే యనువదించినచో ఎట్టి చిక్కును లేకుండెడిది. "కద్రువ నాగమాత" అను నీ పొడిమాటలు రెండును శ్లోకమునకుఁ జాలక అనావశ్యకపు మాటలు పెంచి పొడిగించుటలో ఈ తబ్బిబ్బు తటస్థమయినది.

సూరిగారి సూత్రములు చూడకుండ శిష్టువారు స్వతంత్రముగనే రచించియున్నచో, ఇంత అనన్వితపద్ధతిని రచించియుండుట అసంభవము.

ఇచ్చటి యీ కారికారచనము బాలవ్యాకరణమే మూలగ్రంథమని దృఢముగా స్థాపింపఁజాలియున్నది.

మఱొక స్థలము పరిశీలింపుఁడు.

(ii) సూరిగారు తత్సమ పరిచ్ఛేదారంభమున విభక్తిప్రత్యయముల స్వరూపమును నిర్దేశించు తావున "కొఱకు, కయి, చతుర్థి" అని సూత్రించియుండిరి. అయి అనుదానికి ఐకారాదేశము విధింపఁబడినది గాన (బాల-క్రియా-103) "కయి" కి "కై" యనియు రూపాంతరము ఏర్పడును.

చతుర్థీసంజ్ఞను విధించు పయిసూత్రమును శిష్టువారు

"చేత తోడా కొఱకు కై । చతుర్థీ త్వథపంచమీ" —తత్సమ-శ్లో-36.

అనుకారికలో "కొఱకు కై చతుర్థీ" అని యనువదించిరి.

సూరిగారివలె "కొఱకు, కయి" అన్నచో పాదమున ఒక యక్షర మధికమగునుగాన "కొఱకు కై" అని కుదించి సరిపెట్టినారు.

అంత సూక్ష్మములో ఛందస్సు సరిపుచ్చుట సుద్దుగా నున్నది. కాని మొదటిరూపము "కై" అని నిర్దేశించినచో దానినుండి "కయి" అను రూపాంతరము కలుగుటకు బాలవ్యాకరణ హరికారికలలో మార్గములేదు.

మొదట "అయి" అను రూపమున్నచో అది "ఐ"కారముగ మాఱుట మాత్రమే యీ రెండు వ్యాకరణములందును సర్వత్ర చూపఁబడిన ప్రక్రియా మార్గము. కాఁగా, హరికారికారీతినిబట్టి "కయి" అను చతుర్థీప్రత్యయ రూపముసిద్ధింపనే సిద్ధింపదు. పోనీ, వీరి కా రూపము సమ్మతము కాదేమో యనుకొందమన్న "పట్టి యొక్క- కయీన్వినా" అని వేఱొకచోఁ దాముసు వ్యవహరించియే యున్నారు.

ఈ ప్రణాళికలో "అయి" "ఐ"గా మాఱునో, "ఐ" "అయి"గా మాఱునో, వారికి నాకళింతలో నున్నయెడ నీ తాఱుమాఱు సంభవించి యుండదు. ప్రణాళిక తమదే యయినచో నవి తలలో మెదలకసు పోదు. ఇట్టి తబ్బిబ్బులు రానును రావు. కావున నీ యంశముగూడ బాలవ్యాకరణ ప్రాథమికత్వమునే బలపఱుచుచున్నది.

మఱొక్కటి తిలకింపుఁడు.

(iii) "అగు వచ్చు చొచ్చు" సూత్రమును (క్రియా-91) వికల్పించుచున్న "అగున కనుకనులకు 'ముఙ్జీత్తులు' పరంబులగునపుడు కా నా కానలు విభాషసగు" (బాల-క్రియా-96) అను సూత్రమునకు

" 'ముత్యగో' రనుకన్యోశ్చ కా నా కానా భవన్తి వా"—క్రియా-శ్లో-39. అను కారిక గలదు.

అగుధాతువునకు "ముఙ్" పరమగునపుడు "కా" అనియు
అనుధాతువునకు "జీత్తులు" పరమగునపుడు "నా" అనియు
కనుధాతువునకు "జీత్తులు" పరమగునపుడు "కాన" అనియు
ఆదేశములు రావలసియున్నవి.

సూరిగారి సూత్రములోని ఉద్దేశ్య, నిమిత్త, విధేయములకు యథాక్రమముగ నన్వయము చేసికొన్నచో, ఈ యర్థము సరసముగా లభించుచున్నది. ముఙ్జీత్తులకు "ముత్తు" అను సంజ్ఞను సూరిగారు ప్రత్యేకముగా కల్పించి, ముఙ్జీత్తులను పేర్కొ-నవలసిన తావులందెల్ల "ముత్తు" అను పదమునే వ్యవహరించియుండిరి. అయినను నీ తావున, క్రమాన్వయ స్పష్టతకొఱకే ముఙ్, జీత్తులను విడఁదీసి నిర్దేశించియుండిరి.

శిష్టువారు ఈ సూక్ష్మమును గ్రహింపక ముఙ్జీత్తులన్నను ముత్తన్నను భేదములేదను స్థూలభావముతో "ముతి" అను విశిష్ట సంజ్ఞావాచకపదమును

ప్రయోగించియుండిరి. దీనినిబట్టి "అగు, అను, కను" అను నీ మూఁడింటికిని ముత్తు పరమయినపుడెల్ల ఈ "కా, నా, కాన"లు రావచ్చునని తేలుచున్నది.

ఈ కారికనుబట్టి

అగుధాతువున కాఁడు, కామి, కాక, కాని అనువానికి మాఱుగా అగఁడు, అగమి, అగక, అగని అనియు

అనుధాతువున అనుము, అనుఁడు అనువానికి మాఱుగా నమ్ము, నండు అనియు

కనుధాతువున కనుము, కనుఁడు అనువానికి మాఱుగా (నీవు) కానము, (మీరు) కానఁడు అనియు

కురూపపరంపర లేర్పడుచున్నవి.

శిష్టువారు తాము సాధింపవలసిన రూపములెవ్వియో నిర్ణయించుకొని, తదనుకూలముగ స్వబుద్ధితో స్వతంత్రముగా కారిక రచించినవారే యయినచో నిట్టి ప్రమాద మెన్నఁడును సంభవింపదు. దేనికిని పరబుద్ధి పనికిరాదు.

ఈ కురూపపరంపర యటుండఁగా దీనినిబట్టి శిష్టువారిగ్రంథమునఁ బూర్వాపర విరోధము వేఱొకటి సంభవించుచున్నది.

ఈ కారికవల్ల (క్రియా-శ్లో-39) అగుధాతువునకు ముత్తు పరమగునపుడు కాదేశము విభాషగా విధింపఁబడుచున్నది.

వేఱొకచో "వచ్చే ఖ్చ్చో రగో ళ్ళ్చచ్చే రా ఖ్చ్బదుః కాళ్ళ్చెరు ర్మతి" (క్రియా-శ్లో-38) అని ఆ "అగు"ధాతువునకే ముత్తు పరమగునపుడు కాదేశము నిత్యముగా ఇంతకుముందు విధింపఁబడియున్నది.

ఈ రెండు సూత్రములకును విరోధము అపరిహార్యము.

ఈ సందర్భమునఁ బ్రఙాశిక పరకీయమగుటచే శిష్టువారిట్టి ప్రమాదములకు లోనయిరిగాని, స్వయముగా రచించినవారెయైనచో, నిన్ని కురూపములకు సాధకముగా, నిట్టి పూర్వాపరవిరోధముతో కారికను రచించియుండరు.

ఇంకొక్కటి పరికింపుఁడు. అది మఱింతగా వింతగొలుపు వ్యత్యాసము.

(iv) "కృత్తులకర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు. ధాతువునకు విహితంబగు డుఞ్భిన్నప్రత్యయంబు కృత్తునాఁబడు. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావ కర్తృ కర్మాద్యర్థంబులు మహాజన వ్యవహారానుసారిగా నెఱుంగునది." —బాల-కృదంత-1.

అను సూరిగారి గ్రంథమునకు—

"యథావ్యవహృతి జ్ఞేయాః కృతామర్థా మనీషిభిః
డుఙ్భ్యన్న ప్రత్యయోధాతోః విహితః కృది తీష్యతే. —కృదంత-శ్లో-1.
వక్ష్యమాణాః భావ కర్తృ కర్మాద్యర్థాః కృతామిహ
మహాజనస్య విజ్ఞేయా వ్యవహారానుసారతః." —కృదంత-శ్లో-2.
అను కారికలు గానంబడుచున్నవి.

బాలవ్యాకరణమున కృదంతపరిచ్ఛేదమున
"కవర్ణకం బలుగ్వాదులకగు" —బాల-కృదంత-3.
"ఇమివర్ణకంబు కలుగ్వాదులకగు" —బాల-కృదంత-4.
మున్నగురీతిని, అర్థనిర్దేశములేకుండ, ప్రత్యయములుమాత్రమే విధింపఁబడి యున్నవి. ఈ పరిచ్ఛేదమున విహితమయిన 24 ప్రత్యయములలో ఒక్క ప్రత్యయమునకయినను నర్థము నిర్దేశింపఁబడలేదు. కావుననే యీ కృత్ప్రత్యయముల కర్థములు లోకవ్యవహారమునననుసరించి తెలిసికొండని సూరిగారు పక్కాణించియుండిరి.

హరికారికలలోఁగూడ కృదంతపరిచ్ఛేదమునందంతటను నర్థనిర్దేశము లేకుండ కేవలప్రత్యయములే విహితములయియున్నవి. పరిచ్ఛేదముమొత్తమున ఒక్కప్రత్యయమునకైన, ఒక్కయర్థమయిన, నిర్దేశింపకుండ శిష్టువారు పరిచ్ఛేదారంభమున

"వక్ష్యమాణాః భావ కర్తృ కర్మాద్యర్థాః కృతామిహ"
(=కృత్తులకు ఇటమీఁది సూత్రములలోఁ జెప్పఁబడు భావాద్యర్థములు)
అని వ్రాయుట ఎట్లు సంగతమగును ?

ఏ ప్రత్యయములకయినను నెవ్వరయినను నర్థనిర్దేశముచేయుటయే సహజమగుపద్ధతిగావున, ఈ కృత్తులకును బాలవ్యాకరణమున నాయా సూత్రములలో నర్థనిర్దేశము చేయఁబడియేయుండునని యొకతలంపు వీరిలో నాటుకొనియుండును.

ఆ దృష్టితోనున్న వీరికి "కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృ కర్మాద్యర్థంబులు" అను సూరిగారి వాక్యములోని "వక్ష్యమాణంబులకు" అనునది "వక్ష్యమాణంబులగు" అని తమదృష్టికి ననుకూలముగా నర్థమయి యుండును. ఆ భ్రాంతిలో "వక్ష్యమాణ" అనుపదము "భావకర్తృకర్మాద్యర్థం బులు" అనుదానికి విశేషణముగా సమన్వయించియుండును. దానినిబట్టి "వక్ష్య మాణాః భావకర్తృ కర్మాద్యర్థాః" అని వ్రాసియుండుట తేటపడుచున్నది. నిజమునకు వక్ష్యమాణములు కృత్తులుగాని వానియర్థములు కావు. ఇట నొక చిన్న రహస్యము గలదు.

నన్నయభట్టారకుని వాక్యరచనలో

"అక్కొడుకును భృగుకులవర్ధను నెత్తుకొని" —భారత-ఆది-1-132.

"హైహయున్ సమరదర్పితుఁ జంపి" —భారత-ఆది-4-225.

"అస్మత్కులభూపతులకు నాద్యులకుఁ బుణ్యభాగులకు"

—భారత-ఆది-7-90.

"తనయుని నభినవయౌవను ననుపము నభిషిక్తుఁజేసి"

—భారత-సభా-1-158.

అని యిట్లు ముందు విశేష్యమును, పిమ్మట విశేషణమును బ్రయోగించుతీరు గలదు. బహువార భారతపఠనముచే ఆ శైలి సుపరిచితమగుటవల్లను, దానిపయి నభిరుచివల్లను సూరిగారుగూడ

అమహన్నపుంసకముల కదంతములకు. —తత్సమ-39.

అకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబునకు. —సమాస-21.

ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు. —క్రియా-88.

ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి. —క్రియా-90.

ఇ, టి, తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు.

—అచ్చిక-28.

అని యిట్లు విశేష్యానంతరము విశేషణమును బ్రయోగించుటకు ముచ్చటపడుట అచ్చటచ్చటఁ గాననగును. ఆ చూపుతోడనే సూరిగారీవాక్యమున "కృత్తులకు వక్ష్యమాణంబులకు" అని విశేష్యమును ముందుప్రయోగించి ఆ పిమ్మట విశేషణమును బ్రయోగించియుండిరి.

ఆ విన్యాసరీతిని గ్రహింపకుండుటంబట్టియు, ఇప్పటి మన తెలుఁగు వాక్యములందు ముందు విశేషణము, ఆ వెనుక విశేష్యము నుండునట్టి పరిపాటినిబట్టియు, "కు", "గు" అను రెండిటికిని నుచ్చారణమునఁగల సన్నిహిత సంబంధమునుబట్టియు, వీరికిట్టిభ్రాంతి కలిగియుండుట మిక్కిలి సంభావ్యము.

ఇట్లుగాక, శిష్టువారు స్వయముగానే రచనాప్రణాళిక నిర్ణయించుకొనిరన్నచో, తాము కృత్తులకర్థములు నిర్దేశింపఁదలంచిరో లేదో తమకే తెలియదనవలసివచ్చును. అట్లు తమప్రణాళికను తామే గుర్తింపఁజాలకపోయిరనుటకంటె, ప్రణాళిక పరకీయమగుటచే నది, అప్పటికప్పుడు, ఆకళింతకు రాక, పయిరీతిని భ్రమపడిరనుట సమంజసము, సంభావ్యము.

శిష్టువారు హరికారికలు స్వీయప్రణాళికతో రచింపలేదనుటకును, బాలవ్యాకరణమును జూచియే యనువదించిరనుటకును, అనువాదమయినను బూర్వాపరపరిశీలనముతో స్తిమితముగ సంతరించినది కాదనుటకును ఈ స్థలమొక్కటియె చాలును. ఇఁక నాలుగవ ప్రకారము గమనింపుఁడు.

## 4. లక్ష్యలక్షణక్రమ విపర్యాసములు

బాలవ్యాకరణమునందలి సూత్రములక్రమము ఛందోనుకూలతకయి కారికలలో వ్యత్యస్తమగుట యీ వఱకు పరికించియుంటిమి.

వ్యాకరణకార్యములు విధించునపుడు సూత్రములోఁ గొన్నిశబ్దములు నిర్దిష్టములయినచోటులందు ఆ శబ్దములక్రమమునననుసరించియే దిగువ నుదాహరణములు చూపఁబడుట సహజపద్ధతి. అట్లుగాక సూత్రస్థములగు పదముల వరుసకు విరుద్ధముగా నుదాహరణములను వ్యత్యస్తముగా నెవ్వరును జూపరు.

హరికారికలలో పెక్కుతావులందు సూత్రస్థములగు పదములక్రమమునకు లక్ష్యములక్రమము సరిపడదు. దీనికి హేతువు పరికింపవలయును.

శిష్టువారు బాలవ్యాకరణ సూత్రములనుమాత్రమే కారికా రూపమున వేఱుగా ముందు అనువదించియుందురు. అనువాదములో ఛందస్సుననుసరించి సూత్రస్థములగు పదములను ఇటునటు మార్చుకొనినారు. కారికారచనమంతయు సమాప్తమయినవెనుక బాలవ్యాకరణోదాహరణములను, ఉన్నవున్నటులు అదే వరుసను ఆయాకారికలకు అదికించియుందురు. దానివలన కారికలలోని పదములక్రమమునకును ఆ యుదాహరణములక్రమమునకును వ్యత్యాసము సంభవించినది. ఆ స్థలములు కొన్నిటిని ప్రత్యక్షముగా పరికింపుఁడు.

| బాలవ్యాకరణము | హరికారిక |
|---|---|
| (i) "తాను, నేను పదంబుల | "అస్మదాత్మ |
| ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు. | ద్రుతస్సంశ్లేష భాక్ప్రన. |
| తాఁ జదివె, తాను జదివె. | తాఁ జదివె, తాను జదివె. |
| తా వినె, తాను వినె." | తా వినె, తాను వినె." |
| —సంధి-23. | —సంధి-శ్లో-20. |

తాను = ఆత్మార్థకము. నేను = అస్మదర్థకము.

ఈ సూత్రమున సూరిగారివరుసననుసరించి "ఆత్మాస్మత్" అన్నచో ఛందస్సు కుదురదు. దానివలన శిష్టువారు ఆ వరుస త్రిప్పి "అస్మదాత్మ" అని కారిక రచించినారు. కాని, ఉదాహరణములనుమాత్రము సూరిగారి వరుసలోనే చూపియున్నారు.

సూరిగారి యుదాహరణములనుబట్టిగాక, స్వయముగనే యుదాహరణములు లిఖించియున్నచో, తమకారికలో మొదటిదగుటచే "నేను" అనుదాని యుదాహరణములు చూపవలసియుండ, దానిని విడిచి రెండవదగు "తాను" పదమును సూరిగారిధానికి సరిపడునట్లు చూపుట యెటు పొసంగును?

ఇంకొకటి తిలకింపుఁడు :

| బాలవ్యాకరణము | హరికారిక |
|---|---|
| (ii) కయి[1], పట్టి[2], యొక్క[3]లకు నుగాగమంబు లేదు. — తత్సమ-9. | నుక్, టాదేః పట్టి[1], యొక్క[2], కయా[3], న్వినా. — తత్సమ-శ్లో-37. |
| రామునికయి[1], జ్ఞానముఁబట్టి[2], రామునియొక్క[3]. | రామునికయి[3], జ్ఞానముఁబట్టి[1], రామునియొక్క[2]. |

శిష్టువారు తమకారికలోని క్రమమునుబట్టియేగదా లక్ష్యములు చూప వలసియుండును ; ఇట్లు వరుసతప్పుటకు కారణమేమి ?

వీరు సూరిగారిలక్ష్యములు చూడకయేయున్నచో తమ లక్షణసూత్రము నందలి క్రమమునకు విరుద్ధముగా సూరిగారి లక్ష్యక్రమమునకు తుల్యముగా నీ క్రమము ఎట్టులేర్పడినది ?

| బాలవ్యాకరణము | హరికారిక |
|---|---|
| (iii) చేత[1], తోడ[2], లోపల[3] వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు. —తత్సమ-10. | చేత[1], లోపల[2], తోడా[3]నాం శేష ఆద్యక్షరస్య వా. — తత్సమ-శ్లో-37. |
| రామునిచే[1], రామునితో[2], వనములలో[3]. | శివునిచే[1], శివునితో[3], వనములలో[2]. |

ఇటఁగూడ కారికలోని క్రమమునుబట్టి చే, లో, తో అనువరుసలో నుదాహరణము లగపడవలసియుండ, అట్లుగాక సూరిగారి క్రమమునననుసరించి లక్ష్యములు కానవచ్చుచున్నవి. దీనింబట్టి శిష్టువారు సూరిగారి గ్రంథమును జూచియే రచించిరనుట సుస్పష్టము. ఇఁక నొక్కటి పరిశీలింపుఁడు.

| బాలవ్యాకరణము | హరికారిక |
|---|---|
| (iv) ఆగమ ము[1], వు[2] వర్ణంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాషనగు. — తత్సమ-30. | వు[1], మ్వో[2], రాగమయో రందౌ నుగ్భవేత్తు విభాషయా. — తత్సమ-శ్లో-46. |
| వనము[1]నందును, వనమందును. ధేనువు[2]నందును, ధేనువందును. | వనము[2]నందును, వనమందును. ధేనువు[1]నందును, ధేనువందును. |

ఇచ్చట—"షు, వు వర్ణంబులకు" అనుదానిని "మువ్వోః" అని సంస్కృతీకరించినచో "వు"వర్ణము స్పష్టముగానుండదనితలంచి "వుమ్వోః" అని కారికలో మార్చుకొనిరి.

స్పష్టతకయి యీ రీతిమార్పు శిష్టువారిదృష్టిలో నున్నటులు మఱికొన్ని చోటులందును గానసగును.

"విను, చెప్పు, చదువు మొదలయినవి" అనుచోట

"విను, చదువు, చెప్వ్వాదయః" —క్రియా-శ్లో-123-వృత్తి.

అని మార్చినారు. అటులే "మువ్వోః" అనవలసివచ్చినపుడు దానిని తిరుగవైచి "వుమ్వోః" అని మార్చుకొనుట స్పష్టతకు అనుకూలమే.

కాని యీ మార్పులోని వరుసనే యనుసరించి యుదాహరణములు చూపవలసియుండ, నట్టిజాగరూకత వీడి, సూరిగారిక్రమమునే యనుసరించి, లక్ష్యములు చూపియున్నారు. శిష్టువారు బాలవ్యాకరణోదాహరణములను జూచుకున్నచోఁ దమకారికలోని క్రమమునకు విరుద్ధముగను, సూరిగారి క్రమమునకు సరిపడునట్లును, లక్ష్యములు చూపుట ఎట్లు సంభవించును ?

ఇట్టివింకను నెన్నియో గలవు. కలవనుటయ కాదు. మఱికొన్ని ముఖ్యమగు సూత్రసంఖ్యలు ఈ దిగువ నిర్దేశింపఁబడును. ఆ యా తావులు పరిశీలింపుఁడు.

బాల—తత్సమ-18; బాల—ఆచ్ఛిక-24.
బాల—సమాస-19; బాల—క్రియా-123.

ఉన్నవానినన్నిటిని జూపి చదువరుల విసిగింప మనసొప్పక యింతటితో విడుచుటగాని యిట్టినిదర్శనములు కుప్పలుతిప్పలు.

ఇవన్నియు నిటులుండ, శిష్టువారి జీవితచరితమునుబట్టి చూచినను వీరిట్టి కపటరచనములకు నలవాటుపడినవారని స్పష్టముగాఁ దెలియుచున్నది. వీరు మాడుగులలో నున్నసమయమున కృష్ణభూపతి కుమారుఁడగు జగన్నాథుఁడు తానొక యశ్వమును కొనవలెనని కుతూహలపడెనఁట. దాని లక్షణములు మంచివికావని అశ్వలక్షణ పరీక్షకు లాక్షేపించిరఁట. ఏమయినను కొనక తప్పదను ముచ్చటతో నాతఁడు శిష్టువారియొద్దకేఁగి, యా లక్షణములే మంచివని నిరూపించినచో బహుమతి యొసంగెద ననియు, దాని కనుకూలమగు శాస్త్రము చూపుఁడనియు గోరినాఁడఁట. దానికి వీరు సమ్మతించి యా రాత్రి, నారద మహర్షి ఒకరాజునకుఁ జెప్పినట్లు అశ్వశాస్త్రమను పేర సంస్కృతమున మూఁడునాలుగువందల శ్లోకములు రచించి, ప్రాఁతతాటాకులపయి లిఖించి,

తెల్లవాఱునప్పటికి, సిద్ధపఱిచి కృష్ణభూపతికిఁ జూపి, ఒప్పించి, ఆ యశ్వమును కొనిపించి, జగన్నాథునివలన చాటున బహుమతి నందినారఁట.

(చూ.: గురజాడ రామమూర్తిగారి "కవిజీవితములు"-పుట 455.)

దీనింబట్టి యిట్టికూటరచనములందు శిష్టువారికి హస్తలాఘవమున్నట్లు చారిత్రికముగఁ గూడ విశదమగుచున్నది. సమకాలికతా సులభమగు నసూయఁ జెంది ఆటు శిష్టువారును, సుంకర రంగయ్య తమకొసంగిన 'గురుదక్షిణ' వలన పారంపరికముగా ద్వేషభావము కల్పించుకొని ఇటు కల్లూరివారును, సాధు చరితుఁడయి, సౌహార్దశీలుండయి, పండితోత్తముఁడయి, ప్రతిభాసంపన్నుం డయి, వివేచనదక్షుఁడయి, విమర్శకలాలితుండయి, భాషారాధకుఁడని ప్రాజ్ఞుల గౌరవాదరములందిన సూరిగారి యశోవైభవము సంపరింపఁజేయ నెంచుకట్టుట యెంతమాత్రమును సహింపరానిది.

తెలిసితెలియనివారి తేలికమాట లంతగా గణనీయములు కావుగాని, బాలవ్యాకరణమును అవధానముతో ఆద్యంతము నాలోకించి దానిని వ్యాఖ్యానించిన పండితులు, సూత్రకర్తకుఁగల ప్రతిభావైభవమును, రచనారమ్యతను అడుగడుగునను ఆకళించుకొని అబ్బురపాటు చెందవలసిన అభిజ్ఞులు, తమ వ్యాఖ్యారచనమునకు తెలుఁగువ్యాకరణములలో అమూల్యమయిన మూల గ్రంథము లభించుట అదృష్టముగా భావించుకొనవలసిన ప్రాజ్ఞులు, ఉత్తమ గ్రంథమును వ్యాఖ్యానించుటచేఁ దమకొదవినతృప్తిని వేనోళ్ళ వెలువరింప వేడుకపడవలసిన విచక్షణులు, ఈ వ్యాఖ్యాతలు అసత్యప్రతిపాదనములకును, అసహనప్రసంగములకును బూనుకొనుట ఆత్మగౌరవమునకు హానికల్పించు కొనుట ; పాఠకలోకమునకు బాధయొదవించుట.

ప్రాజ్ఞులగువ్యాఖ్యాతలే యిటులున్నయెడ లాఁతివారిం జెప్పనేల ! కంచెయే చేనుమేసినచో కాచువారెవ్వరు ?

కానిండు. కడచినదానికి వగపనేల! భాషయున్నంతకాలము బాల వ్యాకరణ ముండకనుతప్పదు: కోవిదులయాదరము నందకనుమానదు. భావి కాలపు లక్షణప్రియులు పూర్వవ్యాఖ్యాతల ఆంతరంగికమగు నసూయా తత్త్వమును పదేపదే పరిశీలించుకొనుచు, అందలిపరుషములనెల్ల సరళములుగ సవరించుకొని, సూత్రకారుని హృదయమును సూటిగాఁ జూపఁగలిగిన వ్యాఖ్యలను సౌహార్దసంభావనములతో సంతరింతురుగాక అని కోరుకొందము.

ఈ ప్రకరణమునఁ బయిని జూపినరీతిని కల్లూరివారి పదునాలుగు యుక్తులలో నొక్కటియు పరిగ్రాహ్యముకాకుండుటంబట్టియు, గ్రంథస్థ నిద ర్శనములు బాలవ్యాకరణమే మూలగ్రంథమని స్థాపించుచుండుటంబట్టియు,

హరికారికావళి బాలవ్యాకరణమునకు అనువాదమాత్రమేయను తత్త్వమును పరిశీలకులు గ్రహింతురుగాక !

మనవిద్యాపరిశ్రమము తేజస్వంతమయి రాజిల్లుఁగాక ! విద్యారంగమున ఒకరినొకరు ద్వేషింపకుందుముగాక !!

తేజస్వి నా వధీత మస్తు ! మా విద్విషావహై !!
ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః !!!

ఈ ప్రకరణము అనివార్యముగా నించుక పెద్దదయినను ఓపికవహించి ముగించుకొంటిమి. తగవులుతీర్చుకొని తత్త్వముతేల్చుకొని స్తిమితపడితిమి. ఇటమీఁద....

బాలవ్యాకరణపరిచ్ఛేదములు పదింటను సూత్రములలో, వృత్తులలో ఉదాహరణములలో సూరిహృదయమును వెలువరించు సమన్వయసారస్యాది విశేషములు నూతనము లెవ్వియయిన లభించునేమొ యచ్చటచ్చట నన్వేషింతము.

తొలుత ఈ వ్యాకరణమున నాశ్రయింపఁబడు సాధారణ సంజ్ఞల స్వరూపము నాకళించుకొందము.

# సంజ్ఞా పరిచ్ఛేదము

1. సంస్కృతమునకు వర్ణములేఁబది. ౫౦.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః.
క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న
ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ.
ఇందకారాదు లచ్చులు, కకారాదులు హల్లులు.
అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది.

2. ప్రాకృతమునకు వర్ణములు నలువది. ౪౦.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః.
క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న
ప ఫ బ భ మ య ర ల వ స హ ళ.
కొందఱిమతంబున హ్రస్వవక్రంబులును ప్రాకృతంబునందుఁ
గలవు. కొందఱిమతంబున వక్రతమంబులుంగలవు.
ఎ ఏ ఒ ఓలు వక్రములని, ఐ ఔలు వక్రతమములని ప్రాచీనులు
వ్యవహరింతురు.

3. తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు. ౩౬.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అఁ.
క గ చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ
య ర ల వ స హ ళ.

సంస్కృత ప్రాకృతభాషలనుండి తత్సమ తద్భవరూపమున తెలుఁగున వ్యవహరింపఁబడు పదజాల మధికముగ నుండుటంబట్టి తెలుఁగువ్యాకరణమున సంస్కృత ప్రాకృత వర్ణసమామ్నాయములనుగూడ నిర్దేశించుట మిక్కిలి ప్రసక్తము.

ఎ ఏ, ఒ ఓ లకు వక్రములనియు, ఐ ఔ లకు వక్రతమములనియు, ఈ సంజ్ఞలు, తెలుఁగులిపిలో ఈ వర్ణములకుఁ గల వక్రతనుబట్టి యిందు సార్థకములుగాఁ గన్పట్టును.

బిందువులకు అనుస్వారములని పేరు. ఇవి స్వతంత్ర వర్ణములు కావు. అనఁగా, అచ్చు ననుసరించియే యుండునవి. కావుననే వీనికి ననుస్వారము లను సంజ్ఞ యన్వర్థము. బిందువులకు నచ్చులతో నిట్టిసంబంధ ముండుటం బట్టియే యర్ధబిందు పూర్ణబిందువులు అచ్చులలోనే పరిగణింపఁబడినవి.

సంస్కృతమున ననుస్వారములకు, వ్యాకరణ కార్యముల యావశ్య కతనుబట్టి, అ_త్త్వ హ_ల్త్వములు రెండును సంగీకరింపఁబడినవి.

తెలుఁగున బిందువులకు అ_త్త్వమునుబట్టి రాపలసిన వ్యాకరణ కార్య ములుగాని, హ_ల్త్వమునుబట్టి రాఁగూడని కార్యములుగాని యేవియుం గాన రావు. అనఁగా, వీనిని 'అచ్చు'లనుటవలనఁ గలిగిన లాభముగాని, 'హల్లు' లన్నచో సంభవించు చిక్కుగాని, యేదియు గోచరింపదన్నమాట. కొనకు వీనిని అచ్చులన్నను, హల్లులన్నను బాధలేదని తేలుచున్నది. బాధ లేనపుడు అచ్చులునుగావు, హల్లులునుగావు; వర్ణమాత్రము లనరాదా యనియు నొక చూపు గలుగుటకును నవకాశము గలదు.

అచ్చులనిగాని, హల్లులనిగాని పేరుపెట్టుటలోనే కొన్ని చిల్లర చిక్కులు గూడ సిద్ధమగును. ఎచ్చటనో మాఱుమూలఁగాదు. "రాముఁడు, రాముండు" అను శబ్దములందే పరికింపుఁడు. అందలి బిందువులు అచ్చులయినచో, ఉత్తున కచ్చు పరమయినదిగాన సంధి యేలరాదు? ఆ ఉత్వసంధి రెండు విడిపదముల సంధికి సంబంధించునదిగావున ఈ ఏకపదమందు ప్రవర్తింపదన్నచో అపదాది స్వరసూత్రముచే పదమధ్యసంధి యేలరాదు? ఏ మార్గముననో దానినిగూడ వారించినను, సంధిలేనిచోట యడాగమము రాకుండుటయెట్లు? సంధిగాని, యడాగమముగాని లేకుండ రెండచ్చులు వరుసగా నుండుట మనభాషలో సంప్రదాయము కాదే!

ఇఁక బిందువులు హల్లులయినచో వానికిఁ బరమందున్న హల్లుతోఁ గలిసి యవి సంయోగము లనఁబడునుగదా! వరుసగానున్న హల్లులకు సంయోగమని సంజ్ఞగదా! అట్టి సంయోగము పరమయినదిగాన "రాముఁడు" అనుదానిలో "మ"కారముమీఁది "ఉ"కారము గురువు కావలసివచ్చునుగదా! అది గురువుకాఁదగదుగదా! కాకుండఁజేయుటెట్లు?

బిందువులకు 'అచ్చు'లనిగాని, 'హల్లు'లనిగాని పేరు పెట్టకున్నచో నీ శంక లెవ్వియుం గలుగకపోవునే!

అచ్చు, హల్లు అను సంజ్ఞలు ఆయా వర్ణముల స్వరూపమునందలి ప్రత్యేకవిశేషమును దెలుపు సహజసంజ్ఞలా కావు. అన్వర్థములును గావు.

పాణినీయులు సంక్షేపరీతికయి మాహేశ్వరసూత్రములందు నేర్పఱుచుకొన్న ప్రత్యాహారములనుబట్టి కల్పితములయినవి. అటనుండి మన వ్యాకరణమునకు ఎరవుతెచ్చికొన్నవి. ఇతరములగు అకారాదులకును, కకారాదులకును లాక్షణిక కార్యవిధానములలోని యావశ్యకతనుబట్టి యా పేరులుండుఁగాక. అట్టికార్య మేదియు లేనిబిందువులకుఁగూడ అచ్చులనిగాని, హల్లులనిగాని యీ నామకరణ మెందులకు ?

అని వివేచనశీలురు, చర్చావినోదులు శంకింపవచ్చును. నిజమే. ప్రశ్న పయికి పరిహాసపాత్రముగా నగపడునుగాని యంతస్సారము లేనిదిగాదు.

పయిశంకలు తొలఁగుమార్గములు మెల్లన పరికింపవలయును. రాముఁడు, రాముండు అనుచో సంధిచేసినను, యడాగమముచేసినను బిందువులు హల్లులకుఁ బరములగుట సంభవించును. హల్లులకుఁబరముగా అనుస్వారములుండుట విరుద్ధము, అసంభవము. కావున నట్టియసంభవమగు సంధిగాని, యడాగమము గాని రానేరవని తలంపవలయును.

అహోబలపండితుఁడు "ప్రాయస్తు స్యాత్క్రమాదికస్యైతః" అను సూత్రమున నొక ప్రసంగమున

"అనుస్వారే పరేత్వత్ర నసన్ధిః. ఏకపదే సన్ధ్యభావాత్.
పరరూపలక్షణసన్ధే రసమ్భవాచ్చేతి జ్ఞేయమ్"

అని బిందువులసంధిని ఈ మార్గముననే వారించియుండెను.

ఇంక బిందువులు హల్లులనుకొను పక్షమునఁ దత్పూర్వమునకు గురుత్వాపత్తినిగూర్చి పరిశీలింతము.

ఇట హల్లులకు బిందుసాన్నిధ్యమువలన నేర్పడిన సంయోగము, పూర్వమునకు గురుత్వాపాదకముకాదని లాక్షణికుల సిద్ధాంతము. కావుననే

"సానుస్వారో విసర్గాన్తో దీర్ఘో యుక్తపరశ్చ యః
ఏతం గురుం విజానీయాత్...."

అని గురుత్వనిరూపణ సందర్భమున "యుక్తపరః" అనుదానిచే సంయోగ పూర్వమును జెప్పియు, "సానుస్వారః" అని వేఱుగాఁ జెప్పియుండిరి.

అనఁగా, "హంస" శబ్దమున బిందు సకార సంయోగము "హ" (అ)కారమునకు గురుత్వమును గలిగింపదు గావుననే, "అనుస్వారసహితము గురువగు"నని వేఱుగాఁ జెప్పియున్నారు. "సానుస్వారః" అని ప్రత్యేకముగఁ జెప్పుటవల్లనే బిందుసంయోగమునుబట్టి తత్పూర్వమునకు గురుత్వము రానేరదను నభిప్రాయము తెల్లమగుచున్నది.

"రాముండు"అనుచో ము(ఉ)వర్ణమునకు గురుత్వము అపేక్షితమే. సర్వసమ్మతమే. ఆ గురుత్వము "ఉ"కారము బిందుసహితమగుటచే వచ్చినది గాని, బిందుదకార సంయోగము పరమగుటవల్ల వచ్చినదిమాత్రము కాదు.

"రాము(డు"అనుచో బిందుదకారసంయోగము "ము"(ఉ)వర్ణమునకు గురుత్వమును గలిగింపనేరదను లాక్షణికాశయము సప్రమాణముగ నింతకు ముంచే నిరూపింప(బడినది.

పోనీ, అర్ధానుస్వారముగూడ అనుస్వారమేగావున, "రాము(డు" అనుచో "ము"(ఉ)వర్ణము సానుస్వారమే యగుటచే, అది గురువేలకాదు? అను శంకమాత్రము మిగిలియున్నది.

ఈ శంకవల్లనే యర్ధానుస్వారస్థలములను దొల(గించుటకే తెలు(గు లాక్షణికులు సంస్కృతమున నర్ధబిందువు లేదుగాన ఆఛందస్సున వారట్లు "సానుస్వారః"అని సాధారణముగ( జెప్పినను వీరట్లుగాక

"బొట్టుల పిఱుందకడ 'నూ(దిన'యక్కరములు." —భీమకవి.

"'బలుసున్నకు' నెడమనూ(ది పల్కెడువర్ణంబులు." —అప్పకవి.

"నిడుద, యుక్తపరము, 'నెఱసున్న'గలది, వి
సర్జనీయయుతము, స్వరములేని
హల్లుకంటె( బూర్వమందున్నయదియును
గురువు, లా(తిలఘువు, పరమపురుష."

—చిన్నయసూరి—(పద్యాంధ్రవ్యాకరణము).

అని పూర్ణబిందువులకుమాత్రమే సంబంధించునటులు లక్షణము నిరూపించి యున్నారు.

ఊ(దుట=ఊనిక: నొక్కిపలుకుట. అది పూర్ణబిందువునకును, దానినిబట్టి తత్పూర్వాక్షరమునకును సంభవించునేగాని, యుచ్చారణమేలేని యరసున్నల చోటులందు నొక్కిపలుకుట మిక్కిలి యసంభవము. ఈ విషయమున నెట్టి సంశయములు, శంకలు కలుగకుండ అప్పకవి చిన్నయసూరులు 'బలుసున్న', 'నెఱసున్న' అని సుస్పష్టమగు లక్షణము వచించియున్నారు. దీనింబట్టి "రాము(డు" అనుచో "ము"(ఉ)వర్ణమునకు గురుత్వశంక నివారితమయినది.

ఈరీతిని పృచ్ఛకుల చిక్కులెల్ల( దొల(గినవిగాన నిక బిందువులను అచ్చులన్నను, హల్లులన్నను బాధగలుగదు. కాని, యివి యచ్చులనే యాశ్రయించి యుండునవిగాన వీనిని అచ్చులనుటయే యుచితమని మన లాక్షణికులు తలంచినట్లును, ఆ చూపుతోనే సూరి వీనిని స్వరములలో( బరిగణించినటులును గ్రహింప(దగును. ఈ ప్రసంగమున నొక్క సూక్ష్మాంశము :

గురులఘువుల స్వరూపమున లాక్షణికులు చెప్పకలేప్పని యున్న విశేష మొకటి తెలుఁగునఁ గలదు. పొల్లుహల్లు పరమగుచోఁ దత్పూర్వవర్ణము గురువగుచుండును. ఈ గురుత్వము వికల్పములేనిది. ఎల్లకవులును సమ్మతించినది. ఇటీవల నూతనముగా నేర్పడినదిగాదు. నన్నయభట్టు భారతకవిత కుపక్రమించిన తొలినాఁటికే పాదుకొన్నది. భట్టారకుని తొలిపద్యమునే పరికింపుఁడు :

"రాజకులైకభూషణుఁడు ............... రాజమహేంద్రుఁడున్నతిన్."

ఇందు "ఉన్నతిన్" అనుచోట నకారపుఁబొల్లు పరమగుటచే పూర్వాక్షరము గురువగును. ఛందోలాక్షణికులెవ్వరును ముఖ్యమగు నీగురుత్వమును పరామర్శించినట్లు గానరాదు. మఱచిరో, ఉపేక్షించిరో సందేహము. పయి లక్షణపద్యమున "స్వరములేని హల్లుకంటెఁ బూర్వమందున్నయదియును గురువు" అని సూరి యొక్కఁడే దీనిని నిరూపించుటలోని సూక్ష్మత గమనింపఁదగినది. మఱొక్కమాట :

రామ అనుచో "రా" గురువు, "మ" లఘువు అనుచుందురు. నిజమునకు "రా" గురువుకాదు. "మ" లఘువుకాదు.

ఆ వాడుక అశాస్త్రీయము. హల్లులను విడిచి "ఆ" గురువు, "అ" లఘువు అనఁదగును. మనది ఔపచారిక వ్యవహారము.

హ్రస్వదీర్ఘములు అచ్చులు. వానికే లఘు గురువులను సంజ్ఞ. లఘుత్వ గురుత్వములతో హల్లులకు సంబంధమే లేదు.

**4. ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృత సమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపంబడు. ౘ.**

ఋతువు; పితౄణము; క్లృప్తము; ఌకారము; దుఃఖము; ఖడ్గము; ఘటము; ఛత్రము; ఝరము; కంఠము; ఢక్క; రథము; ధరణి; ఫణము; భయము; పఙ్క్తి; ఆజ్ఞ; శరము; షండము.

పయి వర్ణమాక్షరములలో సూత్రమున నిర్దిష్టమగు క్రమమొకరీతిగను, నుదాహరణములందలి క్రమము వేఱొకరీతిగను నున్నటులు పయికి గోచరించును.

కాని, క్రమము తాఱుమాఱయినటులుమాత్రము తలంపరాదు. సూత్రమునందును, లక్ష్యములందును వర్గద్వితీయములు, వర్గచతుర్థములు అనుక్రమము ఉభయత్ర కయికొనఁబడినది. మొత్తము వర్గపంచకమునందలి ద్వితీయ చతుర్థములు సూత్రమున క్రమనిర్దిష్టములయినవి. ఒక్కొక్కవర్గునందలి ద్వితీయ

చతుర్థము ఉదాహరణములందు వరుసగా నిర్దేశింపఁబడినవి. క్రమములు రెండును ఉపపన్నములే. కాని సూత్రమునందును లక్ష్యములందును ఒకే క్రమమునుగాక రెండు విధముల క్రమములను గయికొనుటలో సూత్రకారుని యుద్దేశమేదయియుండునో సమాలోచనీయము.

సంస్కృతమునఁ బదమధ్యమున, పరసవర్ణాదేశము నిత్యము. "శాన్తిః" అని పంచమాక్షరలేఖనమేకాని "శాంతిః" అని బిందులేఖనము సాధువుకాదు.

ఇట్టి శబ్దములు తెలుఁగునఁ దత్సమములగునపుడు బిందుయుతముగా లిఖింపఁదగునా తగదా యని కొందఱకు నొకసందేహము. ఈ సందేహమును నిర్ణయించుట మిక్కిలి యావశ్యకమయినను, లాక్షణికులలో నొక్కరును ఇదమిత్థమని వక్కాణింపకుండిరి.

మనము తత్సమప్రాతిపదికములను గయికొని, తుదిని దెలుఁగు విభక్తులు చేర్చుకొనుటతప్ప, ప్రాతిపదికమధ్యమున వర్ణములమార్పులు గావించు పరిపాటి లేదు. ఆ పని మనదికాదు.

అయినను "అంతట" "అందఱు" మున్నగు తెలుఁగు శబ్దములలోని బిందులేఖనాభ్యాసమునుబట్టి, సంస్కృత సమశబ్దములందుఁగూడఁ బంచమాక్షరములకు బదులు బిందులేఖనమే రూఢమయినది.

నిజమునకు నుచ్చారణసామ్యమునుబట్టి తెలుఁగున బిందుపంచమములలో ఏది లిఖించినను బ్రత్యవాయము సంభవింపదుగాని, జరిగినమార్పును నిర్దేశింప వలసిన భారము లాక్షణికులకు లేకపోలేదు. అయినను ఏమిహేతువుననో యెల్లరును మిన్నకుండిరి. వారికి సమ్మతముకాదేమో యనుకొందమన్న నంతరంగమున అందఱును సమ్మతించినవారే. ఆ సమ్మతి యెటులు తేలునో పరోక్షముగా పరికింతము.

కవిజనాశ్రయమున భీమకవి బిందుయతికి నుదాహరణములు చూపుచు కంకణము, పింఛము, మండపము, గంధము, శంబరుఁడు అను తత్సమ పదములను బిందుసహితములుగా నిర్దేశించియున్నాఁడు. బిందుయతికి లక్ష్యములు గావున నాతనిదృష్టిలో నియ్యవి బిందుయుక్తములే యనుట సునిశ్చితము. కావన్నచో నివి బిందుయతికి నుదాహరణములే కానేరవు.

అనంతుఁడును బిందుయతిలక్ష్యములలో పాండవ, కందర్ప, సంపద అను తత్సమ శబ్దములనే బిందుయుతములుగాఁ జూపియున్నాఁడు.

బిందుయతికి లక్ష్యములుకాఁదగిన పంకర, ఇంచుక, ఇంటను, అంతట, తుంవర మున్నగు తెలుఁగుశబ్దములు వేనవేలుండఁగా వానినెల్ల

విడిచి, పయి యిరువురును, కోరి తత్సమశబ్దములనే బిందుయుతములుగాఁ జూపుట, వానిలో బిందులేఖన సమ్మతిని వెల్లడించుటకేయని విశదమగుచున్నది.

ఈ బిందుయతి సందర్భముననే అప్పకవి

"జ్ఞానవేద్యాయ త ప్తకాంచనవిభూష
ణాయ మేచకవర్ణకంఠప్రియాయ
నగధరాయ నమోస్తు సౌందర్యవిజిత
మనసిజాతాయ గోపడింభాయ యనఁగ"

అను నుదాహరణములు ప్రదర్శించియున్నాఁడు.

ఇందు అప్పకవి తత్సమశబ్దములందేగాక తెనుఁగున అనుకరణము చేసినచో సంస్కృత వాక్యములందు నయితము పంచమాక్షరములు మాని బిందువులే లిఖింపవచ్చునని తనయనుమతి సూచించుచు, పయి యిరువురకం టెను నొక్కఁడుగు ముందునకు వైచినాఁడు. ఇవి బిందుయతికి నుదాహరణము లగుటచే అప్పకవి లిఖించినవి బిందువులేయనకతప్పదు.

ఈ రీతిని వీరెల్లరును తెనుఁగునఁ బంచమాక్షరము లక్కఱలేదనియు, బిందువులు లిఖింపవచ్చుననియు, నింతమాత్రమే యనుమతించుచుండ, వీరి కన్నను, పయియెత్తున అహోబలపండితుఁడు తత్సమములందుఁ బంచమాక్షర ములు వ్రాయనేరాదనియు, బిందువులనే లిఖించుట సాంప్రదాయికమనియుఁ దన యాశయమును బరోక్షముగా నొక ప్రసంగమున వెలువరించుచున్నాఁడు. ఆ ప్రసంగమెద్దియన

"బిన్దుం ప్రవద న్తి తం క్వచిత్ కేచిత్"

అను సూత్రమును వ్యాఖ్యానించుచు

"క్వచిద్గ్రహణేన అస్య ప్రచురప్రయోగాభావ మాహాచార్యః ; అక్కన్దశి తేత్యత్ర 'అనుస్వారస్య యయి పరసవర్ణః' ఇతి సాధుత్వ మూహ్యమ్"

అని యాతఁడు ప్రతిపాదించెను.

"అక్కన్దశితాపత్యానుర క్తిన్" అనునది రాఘవపాండవీయపద్యభాగము. ద్వ్యర్థికావ్యములలో రెండర్థములందును వర్ణస్వరూపమున మార్పు కలుగరాదు.

అక్కన్ + దశిత : అని భారతార్థమున పద విభాగము.

ఆ + కన్దశిత : అని రామాయణార్థమున పద విభాగము.

సరళము పరమగునపుడు ద్రుతమునకు బిందువు వచ్చుట మిక్కిలి యరుదుగావున ఇచట బిందువురాదనియు, కావున "అక్కందశిత" అను బిందురూపము లేదనియు, సంశ్లేషమేకలిగి "అక్కన్దశిత" అను రూపమేర్పడు

ననియు, దీనినిబట్టి రెండవయర్థమున( గూడ ఈ రూపమునే సరిపుచ్చుకొన వలయుననియు, ఆ రెండవపక్షమున తత్సమమగు "కందళిత" శబ్దము బిందు సహితముగనే యుండవలసియున్నను రెండవపక్షముతో సాదృశ్యముకొఱకు ఈ యొక్క చోటను, పరసవర్ణాదేశము నంగీకరించి పంచమాక్షరము లిఖించి, అర్థద్వయమున వర్ణానుపూర్విని సరిపెట్టుకొనవలయుననియు అహోబలపండితుని వాక్యములకు( దాత్పర్యము.

అట్లు(గా, ఏదో నిర్బంధముచే( దప్పనియెడ( బంచమాక్షరమును సమ్మతించుటగాని, సాధారణముగా( దత్సమమున లిఖింపవలసినది బిందువేయను నభిప్రాయ మాతనికున్నటు లీప్రసంగమున గోచరించుచున్నది.

ఇంక నీ విషయమున సూరియభిప్రాయమెట్టిదో పరికించుట మనకు( గర్తవ్యము.

ఈ సూత్రమున జకారమున కుదాహరణము చూపవలసిన యావశ్యకత యుండుటచే "పఙ్క్తి" అని పంచమాక్షరఘటితముగ( బ్రదర్శించినాడు. అట్టి యావశ్యకతలేని "కంఠము", "షండము" అనుశబ్దములను బిందుఘటితములుగనే నిర్దేశించినాడు. బాలవ్యాకరణ ప్రథమముద్రణమునందును (1858) పయి రెండు శబ్దములలో బిందువులే కలవు.

ఒకేసూత్రమున రెండురీతులను జూపియుండుటచే సాధారణముగా బిందులేఖనమే సమంజసమనియు, అవసరము కలిగినచో మాత్రము పంచమాక్షరము లిఖింపవచ్చుననియు నీతనియాశయము తేలుచున్నది.

ఏతావతా, సంస్కృతవ్యాకరణసమ్మతి లేకున్నను ఆంధ్రుల యభ్యాసమునుబట్టియు, ఉచ్చారణసాదృశ్యమునుబట్టియు, లాక్షణికుల యనుమతిని బట్టియు, తత్సమములందు పదమధ్యమునందయినను బంచమాక్షరములకు బదులు బిందువులు లిఖింపవచ్చునని తేలుచున్నది.

తత్సమశబ్దములందు ప్రాతిపదికమున( గూడ నల్పాల్పములగు మార్పులు గావించుకొనుటకు కొంతకుఁగొంత స్వతంత్రత మనము కల్పించుకొనవచ్చును గాని, కేవల సంస్కృత పదములలో సంస్కృత వ్యాకరణ విరుద్ధములగు మార్పులు గావించుటకు మనము స్వతంత్రింప(దగదు. ఆ భాషకు సంబంధులము ఆంధ్రులమొక్కరమేకాము. కేవల సంస్కృతపదములందు

"నగధరాయ నమోస్తు సౌందర్యవిజిత
మనసిజాతాయ గోపడింభాయ యన(గ"

[illegible]నాటు పదమధ్యమున పరసవర్ణాదేశమును విడిచి బిందువులనే లిఖించు

నధికారము అప్పకవికి ఎవరిచ్చినదో యెఱుంగము. అది యాతనికి జోలిమాలిన పని. ఇది సంస్కృత వాక్యమయినను, ప్రయుక్తమయినది తెలుఁగుగ్రంథము ననేగదాయని యీ బిందువులను కొందఱు సరిపెట్టఁజూతురేమో! తెలుఁగు గ్రంథమున ప్రయోగింపఁబడినంత మాత్రమున, అది సంస్కృత వాక్యము కాకపోదు.

ఇచట చిన్నయసూరి "కంఠము", "షండము" అను తత్సమ శబ్దము లలో బిందువులుంచినను తత్సమ తద్భవపట్టికలుచూపు 19-20 సూత్రములలో కేవల సంస్కృతపదములను నిర్దేశింపవలసిన తావులందు పఙ్క్తి, శృఙ్గారః, చన్ద్రః, తమఙ్గః, అఙ్గారః, పఞ్చాశత్, స్తమ్భః అని సంస్కృతశబ్దములలో బిందువులకు పరసవర్ణాదేశమును పాటించి పంచమాక్షరములనే లిఖించి యున్నాఁడు.

ఈ విషయమున చిన్నయసూరిది హితవాదము. అప్పకవిది అతివాదము.

**5.** క చ ట త ప లు పరుషంబులని, గ జ డ ద బ లు సరళంబులని చెప్పంబడు. ౫.

**6.** ఇతరములగు హల్లులు స్థిరములు. ౬.

ఖ ఘ జ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ

య ర ల వ శ ష స హ ళ.

దీనింబట్టి ౘ ౙ లు స్థిరములు కావలసివచ్చుచున్నది. అట్లు కారాదు. చకారముతోపాటు ౘ కారము పరుషము కావలయును. జకారముతోపాటు ౙ కారము సరళము కావలయును, ఇది తెలుపుటకే యనంతర సూత్రమున చౘ లకు, జౙలకు సావర్ణ్యమును విధించుచున్నాఁడు.

**7.** దంత్య తాలవ్యంబులయిన చ జ లు సవర్ణంబులు. ౭.

తాలవ్యచకారంబు దంత్యచకారంబునకును, దాలవ్యజకారంబు దంత్యజకారంబునకును గ్రాహకములని తాత్పర్యము.

ఏ కార్యమునకయిన 'చజ'లను పేర్కొన్నచో నయ్యవి తమకు సవర్ణము లగు 'ౘౙ'లనుగూడ గ్రహించును. చజలకు విధించుకార్యము ౘౙలకుఁగూడఁ జెల్లునని తాత్పర్యము. కాఁగా

చకారముతోపాటు ౘకారము పరుషమయినది. జకారముతోపాటు ౙకారము సరళమయినది.

ౘౙలు స్థిరములుగాక పరుషసరళములగుటవలని ప్రయోజనమును నుదాహరణములందుఁ జూపుటకీసంజ్ఞాసూత్రములయొద్ద వలనుపడదయ్యెను. ఈ యంశము జ్ఞప్తియందుంచుకొని సూరి పరుషసరళకార్యములను (గసడదవాదేశ, సరళాదేశ, బిందు సంశ్లేషాదులను) విధించు సంధి సూత్రములందు

అపుడు + ౘనియె = అపుడుసనియె అనియు

తోఁచెను + ౘక్కులు = తోఁచెంౙక్కులు అనియు

చజలనుగాక ౘౙలనే చూపియుండుట గమనింపఁదగినది.

మొట్టమొదట, చింతామణికర్త ౘౙలకు పరుషసరళసంజ్ఞలను సంపాదించు నాశయముతో

"అర్ధ_స్త్యః, తాలవ్యః చుర్వ్యక్రస్స్యాత్, మిథ 'స్సవర్ణ'శ్చ....."

అని దంత్యతాలవ్యచజలకు సవర్ణతను విధించియుండెను.

ఒకవర్ణము తనకు సజాతీయమగు నితరవర్ణమును గూడ గ్రహింపవలసిన యిట్టిసందర్భమున, పాణిని

"తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్": "అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః"

అను సూత్రములందుఁ బ్రయోగించిన ఆ సవర్ణపదమునే పయిసూత్రమునఁ జింతామణికర్త ప్రయోగించుటలోనే సజాతీయ వర్ణగ్రాహకతా సంపాదన రూపమగు నాతని యాశయము నిగూఢముగా నిమిడియున్నది.

ఈ నిగూఢాశయమును బయలుపఱుపఁదలఁచి అథర్వణాచార్యులు

"సూత్రద్వయే సవర్ణత్వాత్ గృహ్యేతే దన్తజౌ చజౌ

సా సంజ్ఞైవ తయో స్తేన నాన్యా సంజ్ఞా ప్రవర్తతే"

అని వివరించియున్నారు.

" 'చౘ'లు, జౙ'లు సవర్ణములని చింతామణి చెప్పుటచే

1. 'కచటతపాః పరుషాఖ్యాః'

2. 'గజడదబాస్తు సరళాః'

అను రెండు సూత్రములందలి చజలు ౘౙలను గ్రహించును. కావున, చకారముతోపాటు ౘకారము పరుషము; జకారముతోపాటు ౙకారము సరళము.

దీనింబట్టి చజలకు స్థిరసంజ్ఞ తప్పినది." అని పయికారిక భావము.

చింతామణి వ్యాఖ్యాతలగు బాలసరస్వత్యహోబల పండితులును, అనువాదకుఁడగు నప్పకవియు, అర్వాచీనులగు బాలవ్యాకరణటీకాకర్తలును ఈ సందర్భమున పయిసూత్రకర్తల యాశయము గుర్తింపక గతానుగతికులయి [illegible] గూతులలోఁ జెలుబడి ప్రయోజన

మని, అప్రసక్తమును, అనావశ్యకమునునగు ప్రయోజనమును సూచించుట ప్రక్షదారి త్రొక్కుట. ఆ మార్గము గ్రాహ్యముకాదు. వ్యాకరణకార్యముల నడుమ యతులప్రసంగములు సందర్భోచితములు కానేరవు. ఎక్కడి పరుషాదిసంజ్ఞలు! ఎక్కడి యతిప్రాసములు! అదిగాక, చకారమునకు ఛ, జ, ఝ, శ, ష, స అని యిన్ని వర్ణములతో యతిచెల్లుచుండ, ౘ కారముతోఁ జెల్లుటలో ఏమి విశేషముగలదు?

అతిసామాన్యమగు నీ యంశమును, ఈ వ్యాఖ్యాతలు పెద్దగాభావించి, సూత్రకారు లభిలషించిన ౘౙల స్థిరసంజ్ఞా నిరాసమును గుర్తింపరయిరి. బాల సరస్వత్యాదుల భ్రాంతివలనఁ జిరకాలము తిరోహితమయియున్న యీ సావర్ణ్య ప్రయోజనమును తిరిగి సూరి నిలఁబెట్టినను, అర్వాచీనులగు వ్యాఖ్యాతలును, వ్యాకర్తలును మరల దానిని పెడదారినే పట్టించినారు.

ఈ సవర్ణతావిధానము వ్యాకరణప్రక్రియా సంబంధియై ౘౙ లకు పరుష సరళ సంజ్ఞలను సంపాదించుననియు, స్థిరసంజ్ఞను దొలఁగించుననియు, చింతామణ్యథర్వణ కారికల యీ హృదయమును నింతమంది లక్షణజ్ఞులలో చిన్నయ సూరి యొక్కఁడే గుర్తించుట యెన్నఁదగిన యంశము. ఆతనిది నిదానముగల చూపు.

పరుషసరళసంజ్ఞల సందర్భమున చ ౘ లను, జ ౙ లను జోడింప వలయునన్న యీ చూపు సూరికి పద్యాంధ్రవ్యాకరణరచనాకాలమునకే గలదు.

చూ.: "కచటతపాక్షరంబు। 'లాఱు'పరుషముల్ గజడదబాక్షరంబు।
'లాఱు' సరళంబు లంజనాహార్యగేహ." —పద్యాంధ్ర-32.

**8.** ఇ ఈ ఎ ఏలంగూడిన చ జలు తాలవ్యంబులు. లా.

చిలుక; చీమ; చెలి; చేమ. జిల; జీడి; జెట్టి; జేజె.

**9.** అ ఆ ఉ ఊ ఒ ఓ ఔలంగూడిన చజలు దంత్యంబులు. లా.

ౘలి; ౘప; ౘక్కఁ; ౘూపు; ౘొక్కు; ౘోటు; ౘౌక.
ౙముఁడు; ౙతర; ౙున్ను; ౙూలు; ౙొన్న; ౙోలి; ౙౌకు.
ఐదంతములయిన చజలు సమేతరశబ్దములందు లేవు.

చైత్రము, జైనులు మున్నగు తత్సమములందెగాని, దేశ్యతద్భవము లందు ఐకారాంతములయిన చజలు లేనేలేవు. కావునఁ దెలుఁగున, ఐదంతము లయిన చజలు తాలవ్యములా దంత్యములా యను ప్రసక్తియే లేదని తాత్పర్యము.

'చెయువులు, చెయ్యువలు,' అనువాని ఉచ్చారణసామ్యముచే నేర్పడిన 'చైవులు' అను రూపము లాక్షణికముకాదు.

తెలుఁగున క్రొత్తగావచ్చిన యీ ౘౙలు దంత్యములని తెలుపుటకు లిపిలో వీనిపయిని '౨' అనుగుఱుతు లిఖించుసంప్రదాయము గలదు. అధునాతన వ్యాకర్తలుకొందఱు "ఇది 'రెండు' అను తెలుఁగు సంఖ్య (౨) యొక్క గుఱుత"ని నిరూపించిరి. కాని, ఇది రెండంకెగుఱుతై యుండదు.

ఒకయక్షరముయొక్క యుచ్చారణవిశేషమును సూచించుటకు నొక యంకెను గుఱుతుగా నేర్పఱుచుకొనుట సంగతమును, సంభావనీయమునుగాదు.

'౨' ఇది తావత్తుగుఱుతు. అనఁగా తకారపుగుర్తు.

తలకట్టులేని తకారము 'త' అని యిట్లు పట్టుపగా నుండునట్టిది, యించుక సాగి నడిమివంక తీరి క్రమేణ '౨' అను నీ రూపమునకు తేలినది. అత్త, సొత్తు, రక్తి, భక్తి మొ.

త, థ, ద, ధ, న, ల, స—ఇవి హల్లులలో దంత్యవర్ణములు. "ౢ తు ల సానాం దన్తాః." ఈ హల్లులలో మొదటిదగు తకారపు (తావత్తు) గుర్తునే చజల పయిని పూర్వులు లిఖించియుందురు.

ఈ ౘౙ లను తకారమువలె దంత్యములుగా పలుకుఁడీ యని హెచ్చరించు గుఱుతు ముఖ్యముగాని రెండవది సుఁడీయని తెలుపుగుర్తు ముఖ్యము కాదని తోఁచును. యోచింపుఁడు.

**10.** సంస్కృతసమంబులం దికారాంతము లయినశబ్దముల యుపధా చ జ లు బహువచనంబు పరంబగునపుడు దంత్యము లగును. ౧౦.

ఇవిదప్ప సంస్కృత సమంబులందు దంత్యచజలు లేవని తాత్పర్యము. ఉపధయనఁగాఁ దుదివర్ణమునకు ముందువర్ణము.
అర్చి : అర్ౘులు ; రోచి : రోౘులు ; వీచి : వీౘులు.
రాజి : రాౙులు ; వాజి : వాౙులు.
మఱియు రాౙుశబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి.
ఇతరములయిన చజల కుదాహరణములు :
చంద్రుఁడు ; చామరము ; చుక్రిక ; చూర్ణము ; చోరుఁడు ; చౌర్యము. జయము; జాతి; జుగుప్స; జూటము. ఇత్యాదులు.

ఇట దంత్యచకారమునకు లక్ష్యములు మూఁడిటిని జూపుచు, జకారము నకు రెండిటినే చూపుట వానివాని ప్రయోగప్రాచుర్యమునందలి తారతమ్యము సూచించుటకుఁ గావచ్చును.

రాజు శబ్దమునుగూర్చిన పరిశీలనము తత్సమ 78 వ సూత్రమునఁ జూడఁదగును.

రాజు శబ్దమువలెనే 'ప్రజలు' అను తత్సమశబ్దముగూడ దంత్యయుక్తము గనే నేఁడు వినంబడును. "యథా రాజా తథా ప్రజాః."

జో. జౌ అనువర్ణము లాదియందుఁగల సంస్కృతశబ్దములు ప్రసిద్ధములు లేకుండుటచే వానిని జూపఁడయ్యెను.

**11.** నకారంబు ద్రుతంబు. ౧౧.

**12.** ద్రుతాంతములయినపదములు ద్రుతప్రకృతికములు. ౧౨.

| | |
|---|---|
| ప్రథమా, కయి, పట్టి, యొక్క- తరములయిన విభక్తులు | నన్నున్, నాచేతన్, నాతోడన్, నాకొఱకున్, నావలనన్, నా కంటెన్, నాకున్, మాలోపలన్, మాయందున్ |
| ఉత్తమ పురుషైకవచనంబులు | వత్తున్, వచ్చెదన్ |
| భూత తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనంబులు | వచ్చెన్; వచ్చున్, వచ్చెడున్ |
| ఆశీరాద్యర్థంబు లయిన యెడు, త వర్ణకంబులు | ప్రసన్నులయ్యెడున్, కావుతన్ |
| శతృ తుమానంతర్య చేదాద్యర్థకంబులు | కొట్టుచున్; కొట్టన్, కొట్టఁగన్; కొట్టుడున్; కొట్టినన్ |
| నేను తాను పదంబులును వలెప్రభృతులును ద్రుతప్రకృతికంబులు. | వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్ ఇత్యాదులూహ్యంబులు. |

**13.** ద్రుతప్రకృతులుగాని శబ్దంబులు కళలనంబడు. ౧౩.

రాముఁడు, రాములు, హయము, విష్ణువు, గోడ, మేడ, అయ్య, అమ్మ, రామునికయి, జ్ఞానముఁబట్టి, నాయొక్క ; వచ్చిరి, వచ్చితివి, వచ్చితిరి, వచ్చితిమి, రాఁడు, రారు, రాదు, రావు, రాము ; కొట్టక, తిట్టక, ఎత్తిలి, ఒత్తిలి, ఊరక, మిన్నక, బళి, అక్కట, ఏల. ఇత్యాదు లూహించునది.

సూరి తొలుత "విభక్త్యాగమచార్థో నుః ద్రుతః" ప్రత్యయాగమాప్య యాత్మకమయిన 'ను'వర్ణము ద్రుతమని సూత్రాంధ్రవ్యాకరణమున ద్రుతస్వరూపమును నిర్దేశించెను. పిమ్మట, ద్రుతము 'ను'వర్ణరూపమన్నను వ్యంజనమాత్ర మన్నను బాలవ్యాకరణ ప్రక్రియలో భేదము లేదని తలంచికాఁబోలయును 'నకారంబు ద్రుతంబ'ని యిందు నిరూపించెను.

చింతామణికర్త ముందు కళలను బేర్కొని తక్కినవి ద్రుతప్రకృతులని నిరూపించెను. సూరి ఆ పౌర్వాపర్యమును మార్చి, ముందు ద్రుతప్రకృతికము లను విశదముగాఁ బేర్కొని, తక్కినవి కళలని నిరూపించెను. ఈ ముందు వెనుకల మార్పునకు నొక్కకారణము గలదు.

మన వ్యాకరణములందు ద్రుతప్రకృతికత్వమునుబట్టి విధింపఁబడు కార్యములు పెక్కులు గలవు. కళాత్వమునుబట్టి విధింపఁబడు కార్యమొక్క టియుఁ గనంబడదు. కావుననే, బాలురకు, ఇది ద్రుతప్రకృతిక మగునా కాదా యను సందియము కలుగునేగాని, కళయగునా కాదా యను సందియము సాధారణముగాఁ గలుగదు. కనుక ముఖ్యముగా ముందు తెలుపవలసినవి ద్రుతప్రకృతికములు. అదిగాక, ప్రత్యయములుగాను, ఆగమములుగాను విధింపఁ బడిన ద్రుతములు పెక్కులుగలవు. ఆ ద్రుతములంతమందుఁగలవి ద్రుతప్రకృతి కములని యొక గుఱుతును నిర్దేశించి చెప్పుటకును, సులభముగ గ్రహించుటకును నవకాశము గలదు. కళలవిషయమున నిర్దేశింపఁగలిగిన గుఱుతు గనంబడదు.

కావున, ముందు ద్రుతప్రకృతికములను, ఆ వెనుక కళలను నిరూపించుట జిజ్ఞాసువులకు సౌకర్యసంపాదకము.

ఈ పండ్రెండవ సూత్రమున ద్రుతప్రకృతికములను వర్గీకరించి వివిధ శాఖలుగా స్థూలదృష్టితో నొక పట్టిక చూపఁబడినది.

ధన్యుఁడను మున్నగు నస్మద్విశేషణపదంబులును; చిగురుంగయిదువు, తేఁగొమ్మ, క్రొంబసిఁడి మున్నగు సమాసములలో నుగాగమాంతపదములును;

చేయఁదగదు ఇత్యాదులందలి ముజ్యంతపదములును ; వండఁగలఁడు, వండఁ బడును మున్నగుపదములలో ముగాగమాంతభాగములును పట్టికలోఁ జెప్పఁ దగినవి.

'వండఁగలఁడు' (భవిష్యదర్థకము) 'వండఁబడును' (కర్మార్థకము) అను క్రియాపదములలో నొకభాగమగు 'వండన్' అను ద్రుతాంతము పదము కాదు. పదముకాకున్న ద్రుతప్రకృతికమగుట యెట్లు? కాకున్నచో సరళాదేశ బిందువులు కలుగుటయెట్లు? కలుగకున్నచో వండఁగలఁడు, వండఁబడును అనురూపములు సిద్ధించుట యెట్లు? ద్రుతప్రకృతిక సంజ్ఞాసూత్రమున ద్రుతాంతములయిన 'పదము'లనక ద్రుతాంతములయిన 'శబ్దము'లన్నచో ఈ ప్రశ్నలు కలుగకుండెడివిగదా: 'వండఁగలఁడు' ఇత్యాదుల ద్రుతకార్యమును విస్మరించి 'పదము'లని నిర్దేశించినాఁడు. అని కొందఱందురు.

అట్లనరాదు. ఈ 'వండఁగలఁడు', 'వండఁబడును' అనుచోటులందలి ముగాగమాంతములుతప్ప ద్రుతప్రకృతికములు అను సంజ్ఞగల తక్కినద్రుతాంతములు యావత్తును పదములే యగుటంబట్టి ప్రాయోవాదముగా 'పదము'లని సూత్రమున సూరి పేర్కొనియుండెను. అట్లు పేర్కొనియు ఈ రెండు తావులందలివి పదములు కాకుండుట నాతఁడు గమనించియే యీ తావులందుఁగూడ ద్రుతకార్యము రావలయునను తనయభిప్రాయమును, ఈ కలజీ పడుజాలను విధించిన సూత్రమున (క్రియా-21) "ద్రుతకార్యంబు" అని ప్రత్యేకముగఁ జెప్పియుండెను. చెప్పినచొప్పు తుదముట్టఁజూడక ఇదమిత్థమ్మని నిర్ణయింపరాదు.

నామ విభక్తులలో ద్రుతప్రకృతికముల కుదాహరణములు

నన్నున్, నాచేతన్, నాతోడన్, నాకొఱకున్, నావలనన్, నాకంటెన్, నాకున్, మాలోపలన్, మాయందున్

అని చూపఁబడినవి. ఇట నన్నిటిని, ఏకవచనములఁ జూపుచు, తుదిరెంటిని బహువచనములఁ జూపనేల? అను శంక కలుగును.

'లోపలన్' అను ప్రత్యయము నిర్ధారణార్థమునందుమాత్రమే వచ్చును (కారక-16). అది వ్యక్తిబోధక నామవాచకములకు, బహువచనముగనే వచ్చును. ఏకవచనముగా వచ్చుట అసంభవము. "మాలోపల = మాలో, రాముఁడు బుద్ధిమంతుఁడు" అందుమేగాని "నాలోపల = నాలో, రాముఁడు బుద్ధిమంతుఁడు" అనుట పొసంగదుగదా! కావున 'లోపల' వర్ణకమును బహువచనముగనే చూపవలయును.

'అందు' వర్ణకము నెట్లుచూపినను జూపవచ్చును. అయినను, అది నిర్ధారణార్థమునఁగూడ వచ్చునదగుటచే 'లోపల' వర్ణకముతోపాటు బహువచనముగనే నిర్దేశింపఁబడినటు లూహింపవలయును.

ఇఁక క్రియాపదోదాహరణములలో "వచ్చున్, వచ్చెడున్, ప్రసన్నులయ్యెడున్, కావుతన్" అనురూపములు చూపఁబడినవి.

ఇచట పూర్వోత్తరలక్ష్యములలో 'వచ్చెడున్, కావుతన్' అని కేవల క్రియాపదములనే చూపుచు నడుమ, 'అయ్యెడున్' అనుచోట 'ప్రసన్నులు' అనుపదమును గలుపుట యెందులకోయని ప్రశ్నించుకొనవచ్చును. ఇట 'వచ్చెడున్' అనునది తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనమునకు నుదాహరణము. 'వచ్చున్' అనుదానికి రూపాంతరము. 'అయ్యెడున్' అనునది ఆశీరాద్యర్థకమయిన 'ఎడు' వర్ణకమునకు నుదాహరణము.

ఆ భేదము స్ఫురించుటకయి ప్రార్థనార్థసూచనముకొఱకు 'ప్రసన్నులు' అనుపదమును జేర్చినటులు గ్రహింపవలయును. మఱియు

"ఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్." —భారత-ఆది-1-106. ఇది ఉదంకునిచరితమున నాగస్తుతిసందర్భమునందలి యొకపద్యభాగము.

ఆ స్తోత్రప్రకరణముననున్నవి నాలుగు పద్యములు. వానిలో చంపకములు రెండు. ఉత్పలములు రెండు. స్తుతికి ననురూపములయిన సుకుమారవృత్తములు. శార్దూలమత్తేభములవలె భీకరములు కావు. స్తుతికూడ ఇతరులది కాదు. నాగరాజులది. పూవులతావికి నాగులు వశమగుటయు నైసర్గికము. విషయానుకూలముగను, సందర్భోచితముగను వృత్తములయెన్నిక భట్టారకుల దృష్టిలో వలుతావులఁ గనంబడును. అది యటుండనిచ్చి, ప్రకృతము చిన్నయసూరి యెన్నికను గమనింపుఁడు.

ఆ నాలుగు పద్యములలో

i. "అనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్."
ii. "వాసుకి మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్."
iii. "ఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్."
iv. "తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్."

అనువాక్యములు వరుసగాఁ గలవు.

ఈ నాలుగిటిలో మొదటిరెండిటిని, తుదిదానిని నుపేక్షించి నడుమనున్న బహువచనరూపము నొక్కదానినే యెన్నుకొని, యుదాహరించుటలో నుద్దేశము గలదు. ఎట్టిదన

"అతఁడు వచ్చెడున్" "వారు వచ్చెదరు" అని తద్ధర్మార్థకమునకు వచనభేదమునుబట్టి రూపభేదముండును. "అతఁడు ప్రసన్నుఁడయ్యెడున్" "వారు ప్రసన్నులయ్యెడున్" అని ఆశీరాద్యర్థమున వచనభేదమున్నను రూపమునకు మార్పురాదు. అన్ని పురుషములందును, అన్ని వచనములందును, 'అయ్యెడున్' అని ఒక్కరూపమే యుండును.

కాఁగా 'ప్రసన్నులు' అను బహువచనమునుబట్టి యీ 'అమ్యెడున్' అనునది ఆశీరాద్యర్థకమేగాని తద్ధర్మార్థకము కాదని గుర్తింపఁజేయను సూచన కయి యీ బహువచనఘటితవాక్యము నెంచుకొని యుదాహరించినటు లూహింపవలయును. సూరిచూపుఁగాని సారస్యరేఖ సాధారణము కాదు.

**14.** హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును. ఉదా.

అడఁకువ, అడంకువ; అరఁటి, అరంటి; ఎఱుఁగుట, ఎఱుంగుట; బలఁగము, బలంగము; మగఁటిమి, మగంటిమి.

లక్ష్యములు అకారాదిక్రమానుసారులు.

ఎచ్చటను ఖండబిందువులు శ్రుతిగోచరములుకావాయెను. సిద్ధఖండము లెచ్చటెచ్చట నుండునో తెలుపు విధానములు లేవాయెను. ఖండబిందువున్నట్లు తెలిసినపుడుగదా దానికి పూర్ణబిందువు చేసికొనుట? అజ్ఞాతమగుస్థానికి ఆదేశముచేయుట యెట్లు? పూర్ణబిందువు శ్రుతిగోచరమగునుగాన ఈ సూత్ర మును "హ్రస్వముమీఁది పూర్ణబిందువునకు ఖండబిందువు వైకల్పికముగానగు" నని రచించినచో ప్రక్రియ సుబోధమయియుండెడిదే? అని కొందఱు తలంప వచ్చును.

కాని, అటులే సూత్రించినచో మూఁడింటికి, నాలుగింటికి, బెట్టిదంపు మాట, బెడిదంపుటడిదము మున్నగు తావులందు హ్రస్వముమీఁది నిండుసున్న లకు అరసున్నలు రావలసియుండును. అట్లు రాఁగూడదు. అట్టి యతివ్యాప్తి సంభవింపకుండుటకయి యీ సూత్రము నిట్లు త్రిప్పి రచించినట్లు భావింపఁ దగును. మూఁడింటికి మొదలగు కొలఁది శబ్దములు తప్ప ఏ శబ్దము బిందు యుక్తముగా వినఁబడుచు బిందుశ్రుతిలేనిరెండవరూపమును గలిగియుండునో, ఆ రెండవ రూపమందు ఖండబిందువుండునని స్థూలముగా ఈ సూత్రపుఁ దాత్పర్యమును గ్రహింపవలయును.

**15.** దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు. ఉదా.

వాఁడు, వీఁడు; రాఁడు, లేఁడు; కాఁబోలు, కాఁబట్టి; గోఁగులు, రేఁగులు.

**16.** సంస్కృతసమేతరములయిన తెలుఁగు శబ్దములయందుఁ బరుషసరళంబులకుముందే బిందువు కానంబడుచున్నది. ఉదా.

వంకర, కలఁకువ, మంచు, త్రాఁచు, దంట, దాఁటు, కొంత, కోఁత. ఇత్యాదు లూహ్యంబులు.

లక్ష్యములు పరుషములకుమాత్రమే చూపఁదలంచినట్లున్నది. కావచ్చును. అందు నాలుగిటిని జూపి ఒక్కపకారమునుమాత్రము విడుచుటకు హేతు వేదయియుండునో ! కనుపెట్టవలసియున్నది.

వినఁబడు నిండుసున్నలనుగూర్చి సంశయమే కలుగదు. అర్ధబిందువులే బాలురకు నడుగడుగున సంశయజనకములు. అట్టి యర్ధబిందువులు తెలుఁగు హల్లులు ఇరువది రెండిటిలో, స్థిరములు పదింటికిఁ బూర్వము, ఎన్నఁడును నుండవను నిశ్చయము బాలురకుఁ గలిగించి సంగోరుక్లేశమును తగ్గించుట యీ సూత్రమునకు ముఖ్యప్రయోజనము.

**17.** యకారంబును వువూవొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు. ౧౭.

ఎవఁడు, ఎక్కడ; ఏమి, ఏల; ఉండ, ఊరు; ఒకఁడు, ఓడ. హరియతఁడు, నిద్రవోయె నిట్టిచోట్ల సంధివశంబునవచ్చిన యకారవకారంబులుగాని పూర్వసిద్ధంబులు గావు.

వోఢృ, వోఢవ్య శబ్దములుదప్ప సంస్కృత సమంబులందు సహితము వు, వూ, వో వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది.

ఉదకము; ఊర్మిక; ఓదనము.

ఇ ఈ ఎ ఏ లు — యి యీ యె యే లుగను, ఉ ఊ ఒ ఓ లు — వు వూ వొ వో లుగను వినఁబడుచుండుటంబట్టి భ్రాంతిపడి కొందఱు యిప్పుడు, యెప్పుడు, వున్నది, వూరు మున్నగురీతిని తెలుఁగుశబ్దములమొదట హల్లులు లిఖించుతీరును వారించుటకయి యీ సూత్రము రచింపఁబడినది.

"హరియతఁడు, నిద్రవోయె" అను నుదాహరణములు పాలకడలిని బవ్వళించి యోగనిద్రాముద్రితుఁడయిన శ్రీ మహావిష్ణువును స్మృతికిఁదెచ్చును. పావనములగు లక్ష్యములు.

సంస్కృతసమశబ్దాదిని యకారము పెక్కుచోట్లఁ గలదు. వు, వూ వర్ణములు లేనేలేవు. వో వర్ణము వోఢృ, వోఢవ్య శబ్దములు రెండిటమాత్రమే కలదు. సంస్కృతమున 'ఒ'కారమే లేదుగాన 'వొ'వర్ణముండదని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. కావుననే వృత్తిలో 'వు, వూ, వో' అను మూఁడువర్ణములనే సూరి నిర్దేశించి యుదాహరణములుగూడ సంస్కృతసమశబ్దములను మూఁడింటినే చూపియుండెను.

అదియెఱుంగక ముద్రాపకులు కొందఱు సూత్రమున 'ఋ ౠ ఌ ౡ'లు చూచి వృత్తియందుఁగూడ, ఆ నాలుగును నుండవలెనాయనుకొని 'ౡ'వర్ణమును గూడఁ జేర్చుచున్నారు. అది యనాలోచితము.

భావి ముద్రాపకులు వృత్తిలో 'ౡ'వర్ణము చేర్పకుందురుగాక !

**18.** యరలవలు లఘువులని యలఘువులని ద్వివిధంబు లగు. ఎట్లు.

హరియతఁడు: ఇత్యాదులం దాగమయకారము లఘువు. తక్కిన యకార మలఘువు.

విఱుగు, మెఱుఁగిత్యాదులందు రేఫంబు లఘువు. ఇదే శకటరేఫ మని చెప్పఁబడును. శకటరేఫము తత్సమతద్భవములందు లేదు. పెరుఁగు, కరుగిత్యాదులందు రేఫంబు లఘువు.

ఏళులు, పాళలు, వ్రాళులని బహుత్వమందు డలకాదేశ మయిన ళకారమలఘువు. తల, నెల యిత్యాదులందలి లకారము లఘువు.

అతఁడువలికె నిత్యాదులందున్న పాదేశవకారము లఘువు. తక్కినవకార మలఘువు.

వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని యలఘు ళకారముగాదని యెఱుంగునది.

ఉచ్చారణమున యవలకు లఘుత్వాలఘుత్వ భేదము సంస్కృతమున నొకకాలమున నుండవచ్చును. తెలుఁగునఁ బాటింపఁబడినటులు గోచరింపదు.

ఏళులలో ళకారము అలఘులకారమనియు, తాళములో ళకారము భిన్న వర్ణమనియు ననుటలో విశేషమేమిగలదు ? రెండును నొక్కటే యనుకొన రాదా ? విఱుగు, మెఱుఁగులలోని ఱకారము రేఫమునకు నలఘురూపమనుట కంటె అప్పకవి చెప్పినటులు ళకారమువలె నదిగూడఁ బ్రత్యేకవర్ణ మనుకొను టలో బాధ యేమిగలదు ? సంస్కృతవ్యాకరణమున నున్నదిగదాయని యీ లఘ్వలఘు ప్రసంగమును, చింతామణికర్త నిరూపించుటయు, ఆతఁడు చెప్పి నది విడువనేలయని యనంతరలాక్షణికులు అనువదించుటయుఁగాని దీని వలనఁ బ్రయోజనము గనంబడదు. అని కొందఱ యభిప్రాయము.

శకటరేఫము తద్భవములందు లేదని సూరి వ్యాఖ్యానించెను. ఈతఁ డొక్కఁడేగాక

"క్రియాపదముల తుదలను, సంస్కృతపదములందును, దద్భవముల యందును, ఖకారములులేవు" —అప్పకవీయము-2-196.
అని యప్పకవి చెప్పినాఁడు.

"......తద్భవంబుల । రేఫగాని శకటరేఫగాదు"
అని దిట్టకవి వేంకటార్యుఁడు ప్రతిపాదించినాఁడు.

కూచిమంచి తిమ్మకవియు సమ్మతించినటులున్నాఁడు.

—చూ. : సర్వలక్షణ-3ఆ-శకటరేఫప్రకరణము-10, 11 పద్యములు.

"తద్భవపదములఁ దవిలిన యారేఫ రేఫగాని శకటరేఫగాదు"
—కవిసంశయ విచ్ఛేదము-3-1.
అని సూరకవి నిరూపించినాఁడు. ఇది పదుగురాడినమాట.

వీరలందఱు లేదనుచుండ, తద్భవములందును గలదనుచు ప్రౌ. వ్యా. కర్త పదిపదములను నిర్దేశించినాఁడు. —చూ. : ప్రౌ. వ్యా. సంధి-9.

ఆ పదములలో శకటరేఫఘటితములుకాకతప్పనివి దేశ్యపదములేగాని తద్భవములు కావనియు. తద్భవములుకాకతప్పనివి రేఫఘటితములేగాని ఱకార ఘటితములు కావనియుఁ బూర్వులయాశయము కావలయును. కాకున్న నంత మంది యంతగా నొక్కి వక్కాణింపరు. ఒక్కమాట :

ఈ శబ్దము తద్భవము కాకతప్పదనిగాని ఇందలిది శకటరేఫ కాకతప్ప దనిగాని నిష్కర్షతో నిరూపించులక్షణ మింతదనుక లేకుండుట యిట్టి మత భేదములకుఁ గారణము.

మేనమామ పోలికలతో తద్భవములును, సీసమాలికల కొండగుఱుతు లతో శకటరేఫములును నిష్కృష్టముగా నిర్ణేయములు కాఁజాలవు. ఇది యొక పట్టునఁ దేలునది కాదు.

**19.** సంస్కృత ప్రాకృత తుల్యంబగుభాష తత్సమంబు. ఎ‌గా.

| సంస్కృతము | సంస్కృతసమము | సంస్కృతము | సంస్కృతసమము |
|---|---|---|---|
| రామః | రాముఁడు | గౌః | గోవు |
| విద్యా | విద్య | నౌః | నావ |
| హరిః | హరి | ద్యౌః | దివి |
| ధేనుః | ధేనువు | హృద్ | హృది |
| భూః | భువి | జగత్ | జగత్తు, జగము |
| పితా | పిత | | |

ఇత్యాదు లూహ్యంబులు.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| ఆటీః | ఆడీ | ఆడి |
| ఆలిః<br>పఙ్క్తిః | ఓలీ | ఓలి |
| కటుః | కారో | కారము |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | జెడ |
| మిరా | మేరా | మేర |
| యమః | జమో | జెముఁడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాది లెఱుంగునది.

**20.** సంస్కృత ప్రాకృతభవంబగుభాష తద్భవంబు. ౨౦.

| సంస్కృతము | సంస్కృతభవము | సంస్కృతము | సంస్కృతభవము |
|---|---|---|---|
| ఆకాశః | ఆకసము | మృగః | మెకము, మెగము |
| కుడ్యమ్ | గోడ | | |
| చన్ద్రః | చెందురుఁడు | వక్రః | వంకర |
| తమఙ్గః | తమగము | వేసరః | వేసడము |
| తామరసమ్ | తామర | సముద్రః | సంద్రము |
| నారాచః | నారసము | సూచీ | సూది |
| నిభః | నెపము, నెవము | స్మరః | మరుఁడు |
| | | హరణమ్ | అరణము |
| ముఖమ్ | మొకము, మొగము | హరితాళమ్ | హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| అఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చెర |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ | పణ్ణాసా | పనస |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము<br>పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చెరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వేజ్జో | వెజ్జు |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరం | తోరము |

ఇత్యాదులు తెలియునది.

**21.** త్రిలింగదేశ వ్యవహారసిద్ధంబగుభాష దేశ్యంబు. ౨౧.

ఊరు, పేరు; ఇల్లు, ముల్లు; కోట, పేట; దూడ, మేడ; కోఁత, లేఁత; తావి, మోవి. ఇత్యాదు లరయునది.

ఈ 19, 20, 21 సూత్రములలో

ఇత్యాదులూహ్యంబులు; ఇత్యాదులెఱుంగునది; ఇత్యాదులు గ్రహించునది; ఇత్యాదులు తెలియునది; ఇత్యాదు లరయునది

అను వాక్యములలో క్రియాపదముల మార్పు పరికింపుఁడు. అర్థమొకటే యయినను శబ్దముల మార్పు సమీచీనమని బాలురకు హెచ్చరిక కాఁబోలును. ఈ సూత్రమునందలి లక్ష్యములు ప్రాసాలంకృతములు, శ్రావ్యములు.

**22.** లక్షణవిరుద్ధంబగుభాష గ్రామ్యంబు. ౨౨.

వస్తాఁడు, తెస్తాఁడు; వచ్చేని, తెచ్చేని; వచ్చేవాఁడు, తెచ్చేవాఁడు; వచ్చేటివాఁడు, తెచ్చేటివాఁడు.

ఈ భాష ప్రయోగంబున కనర్హంబు.

పయి యుదాహరణ శబ్దములలో నర్ధబిందువులు ప్రథమ ముద్రణము (1858) మొదలు నేఁటిదాఁక అన్నిప్రతుల యందును గానవచ్చుచున్నవి. ప్రయోగార్హములు కావనుచున్న శబ్దములలో ఖండబిందువు లెందులకో; ఇవి సూత్రకారనిక్షిప్తములో ముద్రాపకప్రక్షిప్తములో! సందేహము.

తొలఁగింతమా యని కొందఱందురు. మూలకారునిచేయయినచో పొల్లక్కారమునయినఁ దొలఁగింపఁదలంచుట సాహసకృత్యము. అట్టిపని మనకేల! ఒకండు సేయంబోయిన మఱియొక్కండగును. సందియము తీఱునందాక వేచియుందము.

**23.** ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు. ౨౩.

పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యంబయిన గ్రహింపందగునని తాత్పర్యము.

కఱకంఠుఁడు; ప్రాణగొడ్డము; జీవగఱ్ఱ; కపిలకన్నులు; కపిలగడ్డము; కపిలజడలు.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.

ఈ యుదాహరణముల రీతినిబట్టి సూరి వీనియందు సామాసికమగు లక్షణవిరోధమున్నటులు తలంచెననుట స్పష్టము. ఎట్టిలక్షణ విరోధమున్నను పెద్దలు వ్యవహరించినచో నట్టిపదములు గ్రాహ్యములేయని సూత్రతాత్పర్యము.

లక్షణైకచక్షుష్కులుగాక లాక్షణికులు ఈరీతిని పెద్దలవ్యవహారమునెడ నిట్టి గౌరవముచూపుట మిక్కిలి సముచితము, ప్రశంసాపాత్రము.

ఈ పరిచ్ఛేదమున నిర్దేశింపఁబడినవి అన్ని ప్రకరణముల ప్రక్రియకును నుపకరించు సాధారణసంజ్ఞలు. మఱికొన్ని విశేషసంజ్ఞలు అనంతర పరిచ్ఛేదములలో అక్కఱగలిగిన తావులందు నిరూపింపఁబడును. ఇటమీఁద, ప్రక్రియా ప్రారంభమున శబ్దముల కలయికలో నేర్పడు సంధుల స్వరూపము తొలుత ప్రదర్శింపఁబడును.

# సంధి పరిచ్ఛేదము

1. ఉత్తునకచ్చుపరంబగునపుడు సంధియగు. ౧.

పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడు.

| | | | |
|---|---|---|---|
| రాముఁడు | .... | అతఁడు | : రాముఁడతఁడు. |
| సోముఁడు | .... | ఇతఁడు | : సోముఁడితఁడు. |
| మనము | .... | ఉంటిమి | : మనముంటిమి. |
| అతఁడు | .... | ఎక్కడ | : అతఁడెక్కడ. |
| ఇతఁడు | .... | ఒకఁడు | : ఇతఁడొకఁడు. |

ఈ ప్రకరణమున తొలుతటి పదునొకొండు సూత్రములు కేవలస్వరసంధి విషయకములు. అందు అ, ఇ, ఉ అను వరుసనుబట్టి యీ సంధులను అత్వ సంధితో నారంభించుట క్రమప్రాప్తము. అయినను ఉకారసంధితోఁ బరిచ్ఛేద మారంభమగుచున్నది. వరుస తప్పించుటలో హేతువుండవలయును.

తెలుఁగున అత్వసంధి బహుళము ; ఇత్వసంధి వైకల్పికము ; ఉత్వ సంధి నిత్యము ; తక్కిన యచ్చులకు నించుమించు సంధియే జరుగదు.

సమష్టిదృష్టితోఁ బరిశీలించినయెడఁ దెలుఁగున నచ్చులకు సంధి కలుగు చోటులకంటె సంధిలేనితావులే యధికముగ గోచరించును.

ఈ యంశమును సూచించుటకుఁగాఁబోలును చింతామణికారులు
"సన్ధిర్నాచో వ్యనుతః"
(= ఉకారభిన్నమగు అచ్చునకు అచ్చుపరమగుచో సంధిరాదు)
అని నిషేధముతో సంధిప్రకరణము నారంభించియుండిరి.

కాని ప్రాప్తిలేనికార్యమును నిషేధించుట ఆవశ్యకము కాదనియు, ప్రకరణమును నిషేధసూత్రముతో నారంభించుట అంతగా సమంజసము కాదనియు నూహించి, సూరి ప్రక్రియారంభమున ఈ సంధి పరిచ్ఛేదమును మంగళాదిగా రచింపఁదలంచి విధిసూత్రముతో నుపక్రమించియుండును. ఆ విధులలోఁగూడ బహుళముగా విధింపవలసిన అకారసంధితో నారంభింప నేలయని యక్షరక్రమము నించుక మార్చుకొని, నిత్యమగు నుకారసంధి విధానముతోఁ బరిచ్ఛేద మారంభించియుండునని తోఁచుచున్నది.

సంస్కృతమున గుణము, వృద్ధి, సవర్ణదీర్ఘము, పూర్వరూపము, పరరూపము మున్నగు ననేకరీతుల స్వరసంధులు గలవు.

తెలుఁగున పరరూపాదేశమొక్కటే స్వరసంధి.

కావునసే, సంస్కృతభాషలోఁ బలువిధములగు వ్యాకరణసంధులనేగాక, మఱికొన్ని యితరార్థములనుగూడ బోధించు 'సంధి' అనుశబ్దము తెలుఁగు వ్యాకరణమున, పరస్వరాదేశమునకుమాత్రమే సంజ్ఞగా నిరూపింపఁబడినది.

అనఁగా, తెలుఁగు వ్యాకరణమునందు 'సంధి' యనునది పారిభాషిక మన్నమాట. సూత్రములలో 'సంధి' యనుశబ్దమెచ్చటనున్నను పరరూపాదేశమనియే దానికర్థము. 'సంధి' శబ్దము పేర్కొనఁబడిన యా యా సూత్రముల యుదాహరణములలోఁ బూర్వపరాచ్చులు రెండిటిస్థానమున పరాచ్చు ఆదేశముగా వచ్చునని తాత్పర్యము.

ఈ సందర్భమునఁ గొందఱు : ఈ పరిచ్ఛేదమున గసడదవాదేశసంధి, సరళాదేశసంధి, ద్విరుక్తటకారసంధి, ప్రాఁతాదిసంధి, పుంప్వాదేశసంధి, అనుకరణసంధి మున్నగునవన్నియుఁ బ్రసిద్ధములయిన సంధులేగదా; వీనిలోఁ బరస్వరాదేశమనుమాటయే లేదాయెనే; ఈ స్థితిలో "పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బాదేశంబగుట సంధియనంబడు" నను లక్షణము ఈ సంధులన్నిటను నెట్లు సరిపడును ? అని నిరుత్తర పూర్వపక్షమన్నంతటి నిబ్బరముతోఁ బ్రశ్నింతురు.

విన్నతోడనే పట్టయినపూర్వపక్షముగనే భాసిల్లునుగాని యించుక నిదానించినచో, ఈ ప్రశ్నముదయించుటకే తావులేదు. ఏమందురా !

'సంధి' శబ్దమునకు సూత్రకర్త తాను గల్పించుకొన్న పారిభాషికార్థము, తన సూత్రములందుఁ దాను బ్రయోగించు సంధి శబ్దమునకా ? లేక లోకమున మనము వాడుకొను సంధిశబ్దములకా ? వ్యవహారరూఢినిబట్టి యనేకార్థములందు మనము సంధిశబ్దమును వాడుకొనవచ్చును. మనవాడుకలోని సంధిశబ్దమునకుఁ గాని, సూత్రములందుఁగాక యితరస్థలములందు నాతఁడే ప్రయోగించిన సంధి శబ్దమునకుఁగాని, యీ పారిభాషికార్థము సరిపడవలసిన పనిలేదు. రెండు పదముల కలయికలో నేర్పడిన వ్యాకరణకార్యములుగదాయని గసడదవాదేశాదులను సంధులని మనము వ్యవహరింతుము. దానికి నొకరి యడ్డంకిలేదు. అది లోకవ్యవహారము.

ఇంతయేల ! చిన్నయసూరియయినను, సూత్రములందుఁగాక ఇతరత్ర యీ సంధి శబ్దమును ప్రయోగింపవలసినపుడు అందఱవలె సాధారణార్థముననే

వ్యవహరించును. కావుననే రెండు శబ్దములకూడిక (సంహిత)యందుఁ గలుగు చున్న గసడదవాదేశము, సరళాదేశము మున్నగు పలువిధములగు వ్యాకరణ కార్యములున్న యీ పరిచ్ఛేదమునకు సంధిపరిచ్ఛేదమనియే పేరువెట్టెను. ఇంతియగాక "హరి యతఁడు, నిద్రవోయె నిట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకారవకారంబులుగాని పూర్వసిద్ధంబులుగావు" (సంజ్ఞా-17) అను వాక్యమున సంధిశబ్దమును సాధారణార్థమునఁ దాసును వ్యవహరించియుండెను. రెండు శబ్దములకలయికను సంధియనుట కెట్టియభ్యంతరమును లేదు. కనుకనే సంస్కృత వ్యాకరణమున అచ్సంధి, హల్సంధి, విసర్గసంధి, స్వాదిసంధి అని ధారాళముగా వ్యవహరింతురు. ఆ వ్యవహారమున కాక్షేపమును లేదు. 'కురు పాండవులకు సంధి కుదురదయ్యెను' అనవచ్చును. ఇట్టిచోటులందెల్ల సంధి శబ్దమునకు కలయిక కూడిక అని యర్థము.

బాలవ్యాకరణమున సూత్రములందున్న సంధిశబ్దమునకు మాత్రమే 'పూర్వపరస్వరములకు పరస్వరాదేశ'మను నర్థము సాంకేతికముగాఁ సూరిచేఁ గయికొనఁబడినది.

'గసడదవాదేశసంధియగును' అనిగాని, 'సరళాదేశసంధియగును' అనిగాని, యెచ్చటనయిన సూత్రములందు సూరి సంధిశబ్దమును నిర్దేశించినచో 'ఇచ్చట నీ సాంకేతికార్థము ఎట్లు సరిపడునయా'యని నిలువరించి యాతనిని బ్రశ్నింపవచ్చును.

సూత్రములలో 'గసడదవలగు', 'సరళములగు' అని వచించెనేగాని, యట్టిచోట్ల సంధిశబ్దము నాతఁడు పరాకుననయినఁ బ్రయోగింపలేదు. సంధిపరి చ్ఛేదమునందలి సూత్రములన్నిటిని పరికింపుఁడు :

'సంధియగును' అని సంధిశబ్దము నుచ్చరించి రచించిన సూత్రములు పరిచ్ఛేదముమొత్తమునఁ బదునొకొండుమాత్రమే గలవు. అవియు ఒకటి మొదలు పదునొకొండుదాఁక నొక్కవరుసలోనే యున్నవి. ఈ పదునొకొండును స్వరసంధులే, సాంకేతికసంధులే, పరరూపసంధులే.

పరరూపాదేశము కానిదానిని 'సంధి' అని సూత్రములలో నాతఁడు వ్యవహరించుటగాని, సూత్రములందున్న సంధిశబ్దమునకు పరరూపాదేశముతప్ప వేఱొకయర్థముండుటగాని యొక్కచోటనయిన గోచరించినచో నాక్షేపము తప్పదు. కాని, పండ్రెండవ సూత్రము మొదలు పరిచ్ఛేదముతుదివఱకు మఱి యే సూత్రమునందును శపథముగావించినట్లు సంధిశబ్దము లేనేలేదు. ఇంత మెలఁకువతో విధానప్రణాళికను సాగించిన సూత్రకర్తను ఏమనిప్రశ్నించుట ! ఏటులాక్షేపించుట !!

**2.** ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులందున్న యుకారము నకు సంధి వైకల్పికముగానగును. ఉ.

నన్నున్ .... అడిగె : నన్నడిగె, నన్నునడిగె.
నాకొఱకున్ .... ఇచ్చె : నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె.
నాకున్ .... ఆదరువు : నాకాదరువు, నాకునాదరువు.
నాయందున్ .... ఆశ : నాయందాశ, నాయందునాశ.
ఇందున్ .... ఉన్నాఁడు: ఇందున్నాఁడు, ఇందునున్నాఁడు.
ఎందున్ .... ఉంటివి : ఎందుంటివి, ఎందునుంటివి.
వచ్చుచున్ .... ఉండెను : వచ్చుచుండెను, వచ్చుచునుండెను.
చూచుచున్ .... ఏగెను : చూచుచేగెను. చూచుచునేగెను.

అచ్చులు సంధింపవలసినపుడు వానినడుమనున్నద్రుతము లోపించుట పరిపాటి. ఈ యంశమును 'అచాంసన్ధౌ ద్రుతోఽదృశ్యః' అని యథర్వణా చార్యులు వచించినారు. ఆ పరిపాటినే యనంతరలాక్షణికులు తమప్రక్రియలలో ననువర్తింపఁజేసియున్నారు.

ఉకారము విభక్తికి అవయవమగునపుడే యీ సంధి ప్రవర్తించును.

'గురువున్ + అడిగె = గురువునడిగె'

'రామున్ + అడిగె = రామునడిగె'.

ఇట్టిచోటులందు ఉకారము విభక్తిస్థముకాదుగాన సంధిరానేరదు.

'నన్నున్ + అడిగె' అనుచో 'న్ను'అనునది ద్వితీయావిభక్తి ప్రత్యయముగావున నందలియుకారము విభక్తిస్థమగుటచే సంధి ప్రాప్తించినది. స్వర సంధిలో ద్రుతములోపించినది. 'నన్నడిగె' అను సంధిరూపము నిష్పన్న మయినది.

'నన్నడిగె, మమ్మడిగె' అను నిట్టిసంధిరూపములు భారతప్రయుక్తములు.

" 'నన్నేల' యుపేక్షించితి ; రిన్నరుల కధర్మపరుల కిచ్చితిరే"

—ఆదిపర్వము-7-105.

"ఏను 'మిమ్మందఱ' వేఁడెద నన్నలార." —ఆదిపర్వము-2-34.

చింతామణిలో "న్ను మ్ము హ్రస్వశ్చాదే రమి శసిచ" అనుసూత్రముచే నా, నీ శబ్దముల ద్వితీయైకవచన బహువచనములగు అమ్ శస్సులకు 'న్ను మ్ము'లు ఆదేశములుగ విధింపఁబడియున్నవి. విభక్తిప్రత్యయముల స్థానమున వచ్చినవిగాన ఈ 'న్ను మ్ము'లుగూడ విభక్తిప్రత్యయములు. కావున వీనిలోని యుకారములు విభక్తిస్థములగును. అగుటవల్లనే

'అనాదిషు విభక్తిషూతోవా' (ప్రథమేతరవిభక్తి....)
అను సూత్రముచే 'న్ము మ్ము'లలోని ఉకారములకు (విభక్తిస్థములకు) స్వర సంధి కలుగుటకు నవకాశమేర్పడినది. ఈ సంధిని ప్రవర్తింపఁజేసియే పయి పద్యములందు భట్టారకులు 'నన్నేల', 'మిమ్మందఱ' అని ప్రయోగించి యుండిరి.

పాణినీయమునఁ గొన్నిసూత్రములందలిపదములకు విభక్తివిపరిణామము కల్పించుకొని లక్ష్యానురోధముగ సూత్రవిధులను సమన్వయించుకొనుట యొక సంప్రదాయము.

'సది'ధాతువుయొక్క సకారమునకు షత్వము కలిగి 'నిషీదతి' మున్నగు రూపములు సిద్ధించును. 'సది రప్రతేః' అను సూత్రమిచట షత్వవిధాయకము. ఇందలి 'సదిః' అను ప్రథమాంతమును 'సదేః' అని షష్ఠ్యంతముగ మార్చు కొని పాణినీయులు సమన్వయించుకొనిరి. మఱియు, 'డస్సిధుట్' అను సూత్రమున 'సి' అను సప్తమ్యంతమును షష్ఠ్యంతముగ మార్చుకొని సకారము నకు ధుడాగమ మగునని సమన్వయించియుండిరి.

ఇట్టి విభక్తివిపరిణామములు పెక్కు సూత్రములందుఁ గానసగును. చింతామణిసూత్రములలోఁగూడ నిట్టిపద్ధతి గలదు.

"న్వన్తాన్నామ్నః కుజో్న్ర్ బహువచనే"
అను సూత్రమున 'న్వన్తాత్' అను పంచమ్యంతమును 'న్వన్తస్య' అని షష్ఠ్యంత ముగ మార్చి, యహోబలపండితుఁడు సమన్వయము చూపుచు

"న్వన్తాదిత్యత్ర 'సదిరప్రతేః' ఇత్యాదావివ విభక్తేః వ్యత్యయః"
అని వివరించి యున్నాఁడు.

ఆరీతిగనే యీ'న్ము మ్మూ హ్రస్వశ్చాదే రమి శసిచ' అను సూత్రమునఁ గూడ అమః, శసః అని షష్ఠ్యంతవిపరిణామముతో సమన్వయించుట సూత్ర కర్తతాత్పర్యము. అటులన్వయింపక అమ్శస్సులు పరమగునపుడు 'న్ము మ్ము'లగునని యర్థముచెప్పినచో నయ్యవి, ఆగమములగునేకాని విభక్తులు కానేరవు. కానిచో నందలి ఉకారము విభక్తిస్థము కానేరదు. కాకున్నచో ప్రకృత సూత్రముచే సంధి రానేరదు. రాకున్నచో 'నన్నేల', 'మిమ్మందఱ' అను భారతప్రయోగములే సాధ్యములు కానేరవు.

చింతామణి సూత్రమును, భారతప్రయోగములకు ననుకూలముగ సమన్వ యించుట కర్తవ్యముగాని, ఆ రెండిటికిని కోరి విరోధము కల్పించుట ఉచితము గాదు. కాఁగా, నన్ను, మమ్ము అనువానిలోని 'న్ము మ్ము'లు విభక్త్యాదేశములే గాని, ఆగమములుకావని గ్రహింపవలయును.

ఇట నొక మతభేదము గలదు.

నన్నున్ అనుదానికి 'ననున్', 'నన్' అను రూపాంతరములున్నవిగాన నన్ + ఏల అనుచో ద్రుతద్విత్వముచేసి 'నన్నేల' అను ప్రయోగమును సరిపెట్టవచ్చుననియు, ఈ సంధిరూపము కుదురుటకయి 'న్ను' అనునది విభక్తి యనుకొనఁబనిలేదనియు, కావున చింతామణిసూత్రమున 'అము, శసి' అను వానికి విభక్తి విపరిణామము చేయకుండ ఉన్నవున్నట్టులు సప్తమ్యంతములు గనే సమన్వయింపవచ్చుననియు, అవి పరమగుచో వచ్చు 'న్ను మ్ము'లు ఆగమములేగాని యాదేశములు కావనియు ఆ మతమునందలి సారాంశము.

ఈ మతము నామోదింపవలనుపడకున్నది. ఏమందురేని, నన్నయ కవితలో ద్రుతద్విత్వము ప్రచురముకాదు. అతివిరళము. అయినను నిర్మోడ సమ్మతించి 'నన్నేల' అనురూపమును విభక్తిగతోకారసంధ్యపేక్ష లేకుండ ఎట్టెటో సాధించినను 'మిమ్ముందఱ' అను భారతప్రయోగమును, ఉత్వసంధి నిరపేక్షముగ సాధించుట సాధ్యమేకాదు.

'నన్' అను రూపాంతరమును, ద్రుతద్విత్వమును, గుదురుపడినట్టులు 'మిమ్' అను రూపమును, మకారద్విత్వమును లభింపనేరవుగదా! కావున 'మిమ్మున్' అనుదానిలోని 'మ్ము' అనుదానిని విభక్తికి (శస్సునకు) ఆదేశముగా విధింపక తప్పదని యెల్లవారును నంగీకరించి తీరవలసినదే. దానికి మార్గాంతరము లేనేలేదు.

అది యాదేశమనక తప్పనపుడు దానితోఁగలిపి విధింపఁబడిన 'న్ను' నయితము ఆదేశముకాక ఆగమమెట్లగును? ఒకేసూత్రమున, ఒకే సమాసమున, గ్రథితములయి జంటగా విధింపఁబడిన యేకవచన బహువచనములలో ఒకటి యాదేశము, ఒకటి యాగమము ననుటకు నెవ్వరును హర్షింపరు. ఆ రీతిరచనము సూత్రములలో ఉండనేయుండదు. ఉండను దగదు.

మఱియు, చింతామణి వ్యాఖ్యాతలలో ముఖ్యులగు బాలసరస్వత్యహోబల పండితులు ప్రకృతసూత్రమున 'న్ను మ్ము'లను ఆదేశములుగనే తలంచి ప్రక్రియామార్గము చూపియుండిరి. ఆ మార్గమును వివరించి చూపుట కిది తావుగాదు. ఆ టీకలు పరికింపుఁడు.

చిన్నయసూరి సర్వనామ రూపసాధన ప్రక్రియను బాలవ్యాకరణమునఁ జూపక విడిచినను, నంతకుముందు తన శబ్దశాసనమున 'న్నుమ్ము లమ్, శస్సులకగు' అనియు, శబ్దలక్షణ సంగ్రహమున 'అమ్‌శస్సులకు న్నుమ్ములగు' అనియు స్పష్టముగా వీనిని విభక్త్యాదేశములుగా విధించియున్నాఁడు.

ప్రకృత ప్రథమేతర సూత్రమున ద్వితీయావిభక్తిగతోకారసంధికి లక్ష్యముగా 'నన్నడిగె' అని యుదాహరించియున్నాఁడు.

ఈ యుదాహరణమువల్లనే 'న్ను మ్ము'లు ఆదేశములా ఆగమములా అను విషయము ఇచట ప్రసక్తమయినది. ఇట్లు ఈ 'న్నుమ్ము'లు ఆదేశము లగుటయే బహులాక్షణికసమ్మతము, సకలరూపసాధకము నగుటచే ఆదేశ పక్షమే మనకు పరిగ్రాహ్యము. అది యటుండనిండు. ఇంకొక శంక.

'నసున్' అనునది 'నన్నున్' అనుదాని రూపాంతరమేగదా! అందలి 'ఉ'కారముగూడ విభక్తిస్థమేగదా! అయినపుడు 'నన్నడిగె' అనురీతిగా 'ననడిగె' అని యీ సూత్రముచే సంధి యేలకాదు? అనియొకశంక యిచటఁ గలుగును. కలుగవలసినదే. ఆ శంక యంకురించుటకు ఇదేచోటు. కాని, సమాధానమునకు మాత్రమిది తావుగాదు.

ఎందులకుఁగాదో! ఆ సంధి యేలరాదో! ప్రకీర్ణక పరిచ్ఛేదమున విశదముగా వివేచింపఁబడును.

నిజమునకు ఆ సంధిని నిషేధింపవలసిన తావు ఇదియేయయినను పెక్కు కారణములచే సూత్రకర్త ఈ విషయమును ప్రకీర్ణకపరిచ్ఛేదమున నిరూపింప వలసివచ్చినది. ఈ సూత్రమున దాని ప్రసంగమే లేకపోవుటవలన సూరికీ శంక స్ఫురించియే యుండదని కొందఱు తలంతురు. తలంతురుకాదు. తలంచిరి. ఎవరోకారు. ప్రౌఢవ్యాకరణకారులు. సూరిగారికి శిష్యులయి, నిరంతర సన్నిహితులయి గురువుగంభీరతను, ఆంతర్యమును సాకల్యముతో నాకళించుకొను నవకాశముగల సీతారామాచార్యులే సూత్రకారహృదయము నందుకొనఁజాలక భ్రాంతిఁజెందినపుడు భిన్నకాలికులయి మూలకారుని ముక్కుమొగమెఱుంగని యితరులు భ్రాంతులగుట అంతగా వింతగాదు. గంభీర హృదయములు దురవగాహములు.

'ననడిగె'అను దుస్సంధిని సూరి యీ సూత్రమున ఏల నిషేధింపలేదో, ఈ సంధిప్రసంగము నిచ్చటఁగాక ప్రకీర్ణకమున ఏల నిరూపింపవలసెనో, దీనిని వారించిన తీరెట్టిదో, సూరి వారించినటులు ప్రౌ. వ్యా. కర్త గుర్తింపఁజాలమికి హేతువెట్టిదో, గుర్తింపనటులు మనకేల తెలియవలసెనో ఆ వివరములకు ప్రకీర్ణకమున 9 వ సూత్రము తప్పక పరికింపుఁడు. మఱొక్కవిషయము:

ఈ ప్రథమేతర సూత్రముననేకాదు. 'ఉత్తునకచ్చు' అను తొలిసూత్రమున వింతకుముందే కలుగవలసినది యిట్టిదే యింకొకశంకయుఁ గలదు.

'అతఁడు + ఋషి' అనుచోట ఉత్తునకచ్చు పరమయినదిగదా! సంధి యేల ప్రాప్తింపదు? రాఁగూడనిదయినచో నిషేధము కానరాదే! సంధి రాని

నుంచుట పాణినీయసంకేతము. "ఆద్యన్తౌ టకితౌ" = టిత్తు ఆద్యవయవముగను, కిత్తు అంతావయవముగను వచ్చునని దీనితాత్పర్యము.

పయినిజూపిన యుదాహరణములలోఁ బూర్వపదములను నేకవచనాంతములుగా 'నాయమ్మ, నీయిల్లు, నాయూరు' అని చూపినను యథాగమోదాహరణములు సరిపడకపోవు. అటులేకవచనములనే చూపక మూఁడింటిని పనిఁబూని బహువచనములనే యెందులకుఁ జూపియుండునో యించుక పర్యాలోచింపుఁడు.

ఆడినమాటలో నల్పమయినను నశ్లీలము స్ఫురింపరాదు. ఇది యెల్ల భాషలందును, నెల్లవారును నెల్లకాలములందును గమనింపవలసిన మూలసూత్రము. "నాశ్లీలం కీర్తయేత్" అని వేదము సయిత మాదేశించుచున్నది.

పసుపు కుంకుమలు మనయిండ్లలో మాంగళ్యవస్తువులు. అవి యింట లేని సమయమున 'లేప'ని పయికిఁదెలుపవలసినపుడు 'పసుపు నిండుకొన్నది', 'కుంకుమ నిండుకొన్నది' యందురేగాని 'పసుపులేదు, కుంకుమలేదు' అని పలుకరు. 'పసుపులేదు' అని నోరారనుచ్చరించుట యమంగళకరమని మనవారి సంకోచము. ఇంట దీపమారిపోయినచో 'దీపము కొండెక్కినది, దీపము పెద్దదయినది, దీపము ఘనమయినది' అని యేమేమో యందురుగాని 'దీపమారిపోయినది' యనరు. దీపమారిపోవుటయనఁగా దేహములోపలి జ్యోతి చల్లారిపోవుట. అనఁగా, మరణించుట అను నమంగళము స్ఫురించును. ఇంత యేల! ఒకటి, రెండు, మూఁడు అని యంకెలను వరుసగా లెక్కించుటలో ఆఱు, ఆఱునొకటి యనుట పెక్కుచోటులందు వినఁబడును. 'ఏడు' అన్నచో 'రోదనముచేయు'మను నమంగళార్థము స్ఫురించునేమోయని మనవారి సంకోచము. ఇటులే లజ్జాకరములు, జుగుప్సావహములు నగు శబ్దముల నుచ్చరింపక వేఱుశబ్దములతో నట్టియర్థమును స్ఫురింపఁజేయు నభ్యాసము మనభాషలో నాటుకొన్నది. ఆ దృష్టిని నాలోచించినచో నట్టి వాడుకలు పెక్కులు గోచరించును. ఆ చూపుతోఁ బ్రకృతము 'మాయమ్మ' ఇత్యాదులందలి బహువచనమువంక పరికింపుఁడు.

'నాయమ్మ, నీయిల్లు, నాయూరు' అను నేకవచనములలోని యశ్లీలము ఇంతఅంత కాదు. ఒకతల్లికి బిడ్డలు పెక్కుమంది యుండునటులు కోరవలయును. ఒకయింటికి సంబంధించువారు పలువురుండునటులు కోరుకొనవలయును. ఆ కోరికలో నభ్యుదయము గలదు. అట్లుగాక, నలుగురు బిడ్డల తల్లిని 'నాయమ్మ' అన్నచో తానొక్కఁడేయుండి తక్కినబిడ్డలు మువ్వురును నంతరింపవలయునన్నంతటియశ్లీలము అందుఁగలదు. అది యెంతమాత్రమును స్ఫురింపరానిది. కావున నొకఁడే బిడ్డఁడయినతావునఁగూడ 'మాయమ్మ, మాతల్లి' అనువ్యవహారమే మనభాషలో పాదుకొన్నది.

మాతృవాచకశబ్దమునొద్దనేగాక 'మాతండ్రి, మాయన్న, మాతమ్ముఁడు, మాయక్క, మాచెల్లెలు, మామామ, మాయత్త' మున్నగు సంబంధివాచక శబ్దములన్నింటను ఈ బహువచనప్రయోగమే నాటుకొనుటలోని యంతరార్థము గుర్తింపుఁడు.

ఈ సందర్భమున 'నాభార్య' అని యొక్కచోటమాత్రము బహువచనము గాక యేకవచనమే యెల్లవారును ప్రయోగించుటలోని హేతువునుగూడ గమనింపుఁడు.

పయియన్నిచోటులందునుగల బహువచనమునకును, ఈ తుదిదానిలోఁ గల యేకవచనమునకును విధానము వ్యాకరణములలో నుండదు. దీనికి లోకమే వ్యాకరణము.

ఇటులే 'నాయిల్లు' అనుటలో గుడిలోనిలింగమువలె, తానొక్కఁడే యా గృహమునకు సంబంధించినట్లును, మఱి వెనుకముందుల నెవ్వరును లేనట్లును నమంగళస్ఫూర్తి గలుగును. అది కలుగకుండుటకయి యిట్టియెడ బహువచన ప్రయోగ మేర్పడినది.

ఈ బహువచనములకు నిట్టి సరసమయిన ప్రయోజనము గోచరించుచుండ ప్రౌ. వ్యా. కారులు 'మీయిల్లు, మాయిల్లు, మాయత్త' అను శబ్దములు మూఁడింటిని జూపుచు నచట సంబంధార్థమున బహువచనము కలిగినట్లు సూత్రించియుండిరి (ప్రౌ. వ్యా. శబ్దపరిచ్ఛేదము-46). కొందఱు బాలవ్యాకరణ టీకాకారులును ఈ సంబంధార్థమునే నిర్దేశించియున్నారు. ఇది అవుననఁదగిన యర్థనిరూపణము కాదు.

తత్పురుషములందలి షష్ఠి, ఏకవచనమయినను, బహువచనమయినను దానికి సంబంధార్థము సంస్కృతాంధ్రములందు సర్వత్ర ఉండనేయున్నది. క్రొత్తదికాదు. అందఱును జెప్పినదే. పోనీ, నా 'యిల్లు' అను నేకవచనము నకు సంబంధార్థము లేదందుమా? అనఁజాలము. ఈ స్థితిలో సంబంధార్థమును బహువచనమునకు నొక విశేషార్థముగా నిట నిరూపించుట యేటులో యెందు లకో యెఱుకపడదు. అర్థవిశేషము గోచరింపనియెడ లాక్షణికులు మిన్నకుంట మేలుగాని, యేదోయొక చప్పని సాధారణార్థమును నిర్దేశించుట వ్యాకరణపు విలువను తగ్గించుకొనుట.

4. అత్తునకు సంధి బహుళముగా నగు. ఉ.

మేన .... అల్లుఁడు : మేనల్లుఁడు, మేనయల్లుఁడు.
పుట్టిన .... ఇల్లు : పుట్టినిల్లు, పుట్టినయిల్లు.
చూడక .... ఉండెను : చూడకుండెను, చూడకయుండెను.

బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధిలేదు.

అమ్మ .... ఇచ్చెను : అమ్మయిచ్చెను.
దూత .... ఇతఁడు : దూతయితఁడు.
చెలువుఁడ .... ఇందము : చెలువుఁడయిందము.

సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునిక కృతులం దొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధి గానంబడియెడు.

గంగనుకానె, నెలఁతిచ్చెను.

వెలయాల్వాటుల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది.

మొదటి యుదాహరణములు మూఁడింటిని, ఒక్క వాక్యముగా యోజించి చూడుఁడు. మేనల్లుఁడు పుట్టినిల్లుచూడక మేనమామయింటనే అంటిపట్టియుండెనఁట! ఎందులకో! హేతువు నూహింపుఁడు.

'క్వచిత్ సంస్కృతీయోపి ప్రాణోప్యత్ర చ్యుతో భవేత్'
అని యథర్వణాచార్యులు తత్సమాకారసంధిని క్వాచిత్కముగా సమ్మతించినారు. వారు ఏయేని కవిప్రయోగములను జూచిగదా యీ సంధిని సమ్మతింపవలయును! ఆయనకు ననంతరకాలికములగు నాముక్తమాల్యదాదులలో నిట్టి సంధులు కలవుగాని, అథర్వణులకుఁ బూర్వపుగ్రంథములలో నిట్టి ప్రయోగములు కానరాకున్నవే! దేని నాధారముచేసికొని యీ సంధిని వారు సమ్మతించియుందురో! ఇంకను నన్వేషింపవలయును. అని సూరిగారి మాటలకుఁ దాత్పర్యము.

ఆధునిక కృతులనఁగా నథర్వణులకు ననంతరకాలమున వెలసిన గ్రంథములని యర్థము.

ఈ యర్థము గ్రహింపక కొందఱు చిన్నయసూరికి ఆముక్తమాల్యద గూడ నాధునిక గ్రంథమేనా? భారతమొక్కటే ప్రాచీనము, ప్రమాణము కాఁబోలును. అని యాక్షేపింతురు. ఏమందుము? అన్నమాటకర్థము చూచుకోని విమర్శనములు.

"........చెడనికడంక దంచనప్పుఁజేపల
'గంగనుకాసె' చూడఁగా........" —ఆముక్తమాల్యద-2-9.

'వండుచున్న + వాఁడు' అనునెడ తచ్ఛబ్దవకారమునకు లోపము (క్రియా-117) కలుగఁగా 'వండుచున్న + ఆఁడు' అనుచో అత్వసంధి నిత్యముగా రావలయును. అదిగూడ నిందలి బహుళపదమునకుఁ బ్రయోజనమని సూత్రకర్తయే యచట సూచించియుండెను (చూ : క్రియా-117).

5. ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగానగు. ఆ.

ఏమి, మఱి, కి(షష్ఠి), అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి. ఇది యాకృతిగణంబు.

ఏమి .... అంటివి : ఏమంటివి, ఏమియంటివి.
మఱి .... ఏమి : మఱేమి, మఱియేమి.
హరికిన్ .... ఇచ్చె : హరికిచ్చె, హరికినిచ్చె.

6. క్రియాపదంబులందిత్తునకు సంధి వైకల్పికముగా నగు. ఉ.

వచ్చిరి .... అప్పుడు : వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు.
వచ్చితిమి .... ఇప్పుడు : వచ్చితిమిప్పుడు, వచ్చితిమియిప్పుడు.

7. మధ్యమపురుషక్రియలయందిత్తునకు సంధియగును. ఇ.

ఏలితివి .... అపుడు : ఏలితివపుడు.
ఏలితి .... ఇపుడు : ఏలితిపుడు.
ఏలితిరి .... ఇపుడు : ఏలితిరిపుడు.

8. క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు. ఎ.

వచ్చి .... ఇచ్చెను : వచ్చియిచ్చెను.

భారతమున క్త్వార్థకసంధిలేదు. లేనేలేదా అన్నచో ముమ్మాటికిని లేదు. కొందఱు 'చాపము నాకందిమ్ము' అను విరాటపర్వప్రయోగమునుబట్టి భారతమునకుఁగూడ క్త్వార్థకసంధి సమ్మతమని వాదింతురు. ఇది ముందువెనుకలు పరికింపని ప్రసంగము. తొండమును గాంచి తోఁక యనుకొనుట. ఈ వాదము మిక్కిలి బలహీనము. ఎట్లన :

అందు (= అందునట్లు) + ఇచ్చు = అందిచ్చు (అందిమ్ము)
అని దీనిని శబ్దపల్లవముగా సోమయాజులు ప్రయోగించినటులు తలంప వలయునేకాని

అంది (= అందుకొని) + ఇమ్ము = అందిమ్ము
అని క్త్వార్థకసంధిగాఁ బ్రయోగించిరేమో యనుకొన వలనుపడదు.

ఏమందురా? అందిచ్చుటవేఱు; అందుకొని యిచ్చుటవేఱు.

అందునట్లుగా ఇచ్చుట మొదటిది; అందుకొని యిచ్చుట రెండవది.

భారతమున 'అందిమ్ము' అనుప్రకృతస్థలము 'అంది + ఇమ్ము' అని పదవిభాగముచేయఁదగినదా? లేక 'అందిచ్చు' అను శబ్దపల్లవమునకు లోట్టు మధ్యమపురుషైకవచనము కలుగఁగా నేర్పడిన యేకపదముగా భావింపఁ దగినదా అను సంశయము పద్యమునకుఁ బూర్వోత్తరసందర్భ తాత్పర్యములు గమనించినచోఁ దేటతెల్లమగును.

ఉత్తరుని రథమును శమీవృక్షముక్రింద నిలిపి, చెట్టుమీఁదనున్న యాయుధములకట్ట చూపుచు, అది యాయుధముల మోపుకాదని యుత్తరుఁడు సంకోచించుచుండ

"నమ్ముము. కైదువు మోపగు.
జిమ్మివెసంబ్రాఁకి, విడిచి, చాపము నాకం। దిమ్ము...."
అని యర్జునుఁడు పలుకుచున్నాఁడు.

'ఆ మోపు విప్పి యందలి చాపము నాకు అందునట్లుగా ఇమ్ము' అను సమన్వయమే యిచటఁ గుదురుపడునుగాని—'చాపము అంది (= అందుకొని) + ఇమ్ము' అను సమన్వయము బొత్తిగాఁ గుదురుపడదు.

కావున నిచటి 'అందిమ్ము' శబ్దపల్లవరూపమై యేకపదమే యగునుగాని అంది + ఇమ్ము అను రెండుపదముల సంధిరూపము కానేరదు. మఱియు నీ క్రింది వాక్యము గమనింపుఁడు.

'నీవు గట్టిగఁ బట్టుకొని నా కందిమ్ము' అనియు నొక్కొ_కసందర్భమునఁ బ్రయోగింతుము. ఇట్టియెడ 'అందిమ్ము' అనునది పదద్వయ సంధియయినచో 'పట్టుకొని' అను క్త్వార్థకముపిమ్మట మరల 'అంది' అను పదముండుట పునరుక్తమయి అనన్వితమగును. కొమ్మమీఁదనుండువానితోఁ గ్రిందివాఁడు పలుకునపుడు తనకందునట్లుగా ఇమ్మని పలుకునేగాని 'నీవందుకొని యిమ్ము' అనఁడు. అట్లనఁబనిలేదు. తాను చేతఁబట్టుకొనకుండ క్రిందివానికిచ్చుట సంభవింపనే సంభవింపదు.

అదిగాక 'అందిమ్ము'లో క్త్వార్థకమే యున్నచో 'చాపము, అంది' అను పదముల నడుమ 'నాకు' అనుపదము వ్యవధాయకముగా నుండుట రచనా స్వభావమునకు మిక్కిలిదూరము. 'నీవు పుచ్చుకొని నాకిమ్ము' అందురుగాని 'నీవు నాకు పుచ్చుకొనియిమ్ము' అనుట సహజముకాదు.

మఱియు, సముద్రమంత భారతమున సందేహాస్పదమగు నొకేయొక్క ప్రయోగము కానవచ్చినంతమాత్రాన భారతకవులకు క్త్వార్థకసంధి సమ్మత మనుట సమంచితమగు నిర్ణయము రాదు. ఇది కవిత్రయమునకు నెంతమాత్ర మును సమ్మతము కాదనియే నిశ్చయింపవలయును.

కాని, అనంతరకవులలో ప్రసిద్ధులు, ప్రామాణికులు పెక్కు రీసంధిని బ్రయోగించినవారు కలరు. సమ్మతించిన లాక్షణికులును గలరు.

ఇంతయేల! చిన్నయసూరియుఁ దనసూత్రాంధ్రవ్యాకరణమున "న క్త్వః" (క్త్వార్థమునకు సంధిలేదు) అని ముందు నిషేధించినను కవిప్రయోగసరణి వివేచించి, శ్రావ్యతను గమనించి

"క్వాపి సవర్ణే దృశ్యతే"

అని సవర్ణములగు తాలవ్యాచ్చులు పరమగునపుడు క్త్వార్థకసంధి క్వాచిత్క ముగ సాధువేయని సూత్రించియున్నాఁడు. అట్లు సూత్రించియు, బాలురు దీని క్వాచిత్కతను బాటింపఁజాలక సార్వత్రికము గావింతురను సంకోచముతో, ఈబాలవ్యాకరణసూత్రమున దీనిని దృఢముగా నిషేధించియున్నాఁడు. ఇంతటితో నూరకుండక తిరిగి సంధి 10 వ సూత్రమునఁ బ్రసంగము కల్పించుకొని 'ఏగి యేగి యనుచో క్త్వార్థంబగుట సంధిలేదు' అని వక్కాణించియునున్నాఁడు. దీనినిబట్టి యాతనికి, క్త్వార్థకసంధి సర్వథా సర్వత్ర యసమ్మతమనిమాత్రము తలంపరాదు.

ఈతని సూత్రాంధ్రవ్యాకరణము నాలోకింపక, బాలవ్యాకరణమాత్ర పరామర్శకులు 'సూరి క్త్వార్థకసంధిని నిషేధించుట ప్రయోగవిరుద్ధము, పరమ సాహసము' అని యాక్షేపించినవారు కొందఱుగలరు. అంతర్యమెఱుంగని యాక్షేపములు ఆమోదకరములు కానేరవు. కరంబు పరికింపక యేకార్యంబున కేనిం దమకింప లగ్గుగాదు.

**9. ఇఁకాదులకుఁదప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు. బా.**

ప్రథమేతరవిభక్తి విధి నిరవకాశంబుగావున దీనిని బాధించెడిని.

వచ్చెన్ .... ఇపుడు : వచ్చెనిపుడు.
చూడన్ .... అయితి : చూడనయితి.
ఉండెడిన్ .... అతఁడు : ఉండెడినతఁడు.

ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని: ఈయవి యిఁకాదులని యెఱుంగునది. వీనికి సంధి వైకల్పికము.

"నిరవకాశాహి విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే"
అని పాణినీయ పరిభాష.

ప్రథమేతరవిభక్తి సూత్రోదాహరణములన్నియు, ద్రుతప్రకృతికములే యగుచుండును. ఆ ద్రుతప్రకృతికములందు ఈ నిషేధము ప్రవర్తించినచో— ఆ సూత్రమునకు మఱి స్థానమేలేదు. అనఁగా ఈ నిషేధము ప్రవర్తింపని యుదాహరణము దానికొక్కటియు లభింపదు. ఆ సూత్రము నిష్ప్రయోజన మగును. కావున నీ రెండిటిలోఁ బ్రథమేతరవిభక్తి విధి నిరవకాశము.
ఈ నిషేధసూత్రమున్ననో యట్లుకాదు. ఇది ప్రథమేతరవిభక్తులందేగాక వచ్చున్ + ఇపుడు మున్నగు పెక్కుచోటులందుఁ బ్రవర్తింపఁగలదు. కాఁబట్టి యీ రెండిటిలో ఇది సావకాశము. అనఁగా దీనిపరిధి యధికము. దానిపరిధి స్వల్పము.

ఇతరత్ర అవకాశముగల యీనిషేధసూత్రమును త్రోసిపుచ్చి, ప్రథమేతర విభక్తులందు, ఆ సంధిసూత్రమే ప్రవర్తిల్లునన్నమాట. ఇటులే ఏమ్యాదులందలి 'కిషష్ఠి' గూడ నిరవకాశముగావున ఈ నిషేధమును బాధించునని యూహింప వలయును. కాఁగా, ఇఁకాదులును, ప్రథమేతరవిభక్తులును, కిషష్ఠియును దప్పఁ దక్కిన యెల్లద్రుతప్రకృతికములకును సంధి రాదని ఫలితార్థము.

'ఇఁక' శబ్దపర్యాయముగా 'ఇఁగ' శబ్దము కొన్ని మండలములందు వ్యవహారమునఁ గలదు. "ఇఁగ మెడదునిమెద విది యేమిపుట్టె। జగములలో రిత్త సడి వచ్చె నీకు" (బసవ. పు-5-90). ఇత్యాదులు కవిప్రయోగములును గలవు.

గురువును + ఆశ్రయించె = గురువునాశ్రయించె.
ఇచట ఈ 'ఇఁకాది' సూత్రనిషేధ మేలప్రవర్తింపదు? అని యొకశంక కలుగవచ్చును. కాని ద్రుతవ్యవధానముగల యచ్చులకు రెండిటికి వచ్చుసంధినే యీ సూత్రము నిషేధించును.

పయి లక్ష్యమున సంధింపవలసిన రెండచ్చులకును నడుమ ద్రుతము లేకుండుటచే నీ నిషేధము ప్రవర్తింపదని తలంపవలయును.

**10.** అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు. ౧౦.

ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనంబడు.

తఱుచుగననుటచేత నొకానొకచోట వైకల్పికసంధియుం గల దని తాత్పర్యము.

ఔర .... ఔర : ఔరౌర.
ఆహా .... ఆహా : ఆహాహా.
ఎట్టూ .... ఎట్టూ : ఎట్టెట్టూ.
ఓహో .... ఓహో : ఓహోహో.
ఏమి .... ఏమి : ఏమేమి, ఏమియేమి.

'ఏగియేగి'యనుచో క్త్వార్థంబగుట సంధిలేదు.

'ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తమ్' అని అమరసింహుని వచనము. 'రామ రామ' అనిగాని, 'రామరామరామ' అనిగాని రెండుమాఱులో మూఁడుమాఱులో యుచ్చరింపఁబడిన శబ్దములమొత్తమునకు ఆమ్రేడితమని లోకవ్యవహారము. రెండుమాఱులుచ్చరింపఁబడిన శబ్దములలో రెండవది యామ్రేడితమని వ్యాకరణ వ్యవహారము. 'తస్య పర మామ్రేడితమ్' అని పాణినిసూత్రము. దీనికి 'ద్విరుక్తస్య పరం రూప మామ్రేడితసంజ్ఞం స్యాత్' అని దీక్షితులవృత్తి. ఈ వ్యాకరణసంజ్ఞనే యథాతథముగా నాంధ్రలాక్షణికులు గ్రహించినారు.

ఈ శాబ్దికులు లోకప్రసిద్ధమగు నొక్కొక శబ్దమును, అర్థముమార్చి వేఱొకయర్థము కల్పించి తమవ్యాకరణసంజ్ఞగా నేర్పఱుచుకొందురు. అభ్యాసకు లగు బాలురకు నది కొంతకుఁగొంత సందేహజనకము, భ్రాంతికారణమునయి క్లేశకరము కాకమానదు. శాస్త్రమున సౌకర్యమునకయి యిచ్చవచ్చినసంజ్ఞలు కల్పించుకొనుటకు శాస్త్రకారులకు నడ్డంకిలేదు. అట్టియెడ వ్యవహారక్షుణ్ణములు కాని క్రొత్తశబ్దములనే సంజ్ఞలుగాఁ గల్పించినచో నెట్టిసందేహములకును దావుండదు. అటులేలచేయరయిరో!

పయిని జూపఁబడిన యుదాహరణములరీతిగా నామ్రేడితస్థలములందుఁ దప్పఁ దక్కినచోటులందుఁ దెలుఁగున దీర్ఘములకు సంధిరాదు.

ఈ దీర్ఘసంధినొందిన పయియుదాహరణములు తమరూపములు చూచు కొని తామే యాశ్చర్యపడుచున్నటులు గానవచ్చుచున్నవి. 'ఆహాహా, ఎట్టెట్టూ, ఓహోహో' అనువానివంక మఱొక్కమాఱు పరికింపుఁడు. వాని యబ్బురపాటు స్పష్టముగా గోచరించును. అనఁగా తెనుఁగున దీర్ఘసంధి మిక్కిలి యరుదన్న మాట.

ఈ సూత్రమున 'ఏమేమి, ఏమియేమి' అని వికల్పసంధికి ఒకయుదా హరణము చూపఁబడినది.

ఏమ్యాదులకు ఇకారసంధి వైకల్పికముగా (5 ప సూ.) నింతకుముందే విధింపఁబడియున్నదే! అచట 'ఏమంటివి, ఏమియంటివి' అను నుదాహరణము గూడఁ జూపఁబడియున్నదే! ఆ సూత్రమువల్లనే యీ వికల్పసంధిగూడ సిద్ధింపవచ్చునే! దీని నిచ్చట మరలఁ బ్రత్యేకముగఁ జూపనేల! కావుటచే సిద్ధించియున్న యీయొక్కదానికయి సూత్రమున 'తఱచుగా' అని ప్రయోగించి "తఱచుగా ననుటచేత నొకానొకచోట వైకల్పికసంధియుం గలదని తాత్పర్యము" అని యింత వివరణము వ్రాయవలసినపని యేమికలిగినది? అని యిచ్చట శంక కలుగవచ్చును. కలిగితీరవలయును.

కాని, ఆమ్రేడితములందుమాత్రమే ప్రత్యేకముగా విధింపఁబడుటచే, ఏమ్యాదిసంధిసూత్రముకంటె, ఈ యామ్రేడితసంధిసూత్రము విశేషవిధి కాక తప్పదు. కావున, 'ఏమి + ఏమి' అనుచోట ఏమ్యాదిసూత్రమును బాధించి యీ యామ్రేడితసూత్రమే ప్రవర్తింపవలసియుండును. ఆ స్థితిలో ఈ సూత్రమున 'తఱచుగా' అను పదమే లేనిచో 'ఏమేమి' అనిమాత్రమే యగునుగాని 'ఏమి యేమి' యను రూపము సిద్ధింపదు. రూపద్వయసిద్ధికయి యీ సూత్రమున 'తఱచు' శబ్దము ప్రయోగించి దీనిని వేఱుగా సాధింపవలసివచ్చినది. మఱొక కారణముగూడఁ గలదు.

సంస్కృతవ్యాకరణమున ద్విరుక్తములగు పదములకు సమాసవద్భావము నిరూపితమయి యున్నది. సాధారణముగా నేభాషయందయినను ద్విరుక్తములు విడివిడిపదములుగాక సమాసమువలె నేకపదముగా భావింపఁబడుచుండును. ఆమ్రేడితము పరమగునపుడు 'ఇంటింటన్' ఇత్యాదులలోఁగలుగు విభక్తిలోపము(సంధి-41)గూడ వీనికి సమాససాదృశ్యమునే వెల్లడించును.

'ఏకైకమ్, ఏకైకస్మై' మున్నగుచోటులందు 'ఏక, ఏకమ్' అనియు, 'ఏక, ఏకస్మై' అనియు పద విభాగము వలనుపడదు. అవి ఏకపదములు.

అటులే 'ఇంటింటన్, ఇంటనింటన్' మున్నగు ద్విరుక్తములందు 'ఇంటి, ఇంటన్' అనియు, 'ఇంటన్, ఇంటన్' అనియు పద విభాగము చేయరాదు.

వ్యాకరణముమాటయటుండ, ఇట్టిచోట్ల ఏయర్థవిశేషము స్ఫురించుటకుఁ బదమును ద్విరుక్తముచేసితిమో, ఆ యర్థము ద్విరుక్తమయిన మొత్తమువల్లనే స్ఫురించునుగాని, విడివిడిపదములవలన స్ఫురింపనేస్ఫురింపదు. కావున, ద్విరుక్తము సమాసమువలె ఒకేపదమనుపద్ధతి మిక్కిలి యుచితము. అర్థస్ఫురణానుకూలము.

ప్రకృతమున ఆదరార్థమో, అత్యంతార్థమో, త్వరితార్థమో స్ఫురించుట కయి ద్విరుక్తముగాఁజేయఁబడిన యీ 'ఏమిఏమి' అనుమొత్తము ఒక్కపదమే గాని విడిపదములు కావు.

ఇఁక 'ఉత్తునకచ్చు....', 'అత్తునకు సంధి....', 'ఏమ్యాదులయిత్తునకు....' అను నీ సూత్రముల యుదాహరణరీతి గమనించినచో అవి రెండు విడివిడిపదముల సంధులను విధించునవిగాని, యేకపదమున అనఁగా, పద మధ్యమున సంధిని విధించునవికావని తెల్లమగును. కాఁగా, 'ఏమి + ఏమి' అనుచోట 'ఏమ్యాది' సూత్రము నిస్సంకోచముగా ప్రవర్తింప సిద్ధపడదు. కావున, నెటుచూచినను 'ఏమేమి, ఏమియేమి' యనువానిని ఈ సూత్రముచేత సాధించుటయే సమంజసము. ఇఁక విషయాంతరము.

షష్ఠీవిభక్తిప్రత్యయములలోని 'యొక్క'కు భాషలోఁ బ్రయోగము మిక్కిలి తక్కువ. అదిసమాసములందు సంబంధార్థమును బోధించి లోపించుటయగాని, యెక్కడను వినఁబడదు. బాలవ్యాకరణమున 'ద్విరుక్తముయొక్క పరరూపము' అను నీ వివరణస్థలమునందు నొక్కచోటమాత్రమే సూరి దీనినిఁ బ్రయోగించియుండెను.

"ఏగియేగి యనుచోఁ గ్త్వార్థంబగుట సంధిలేదు" అని యిట్లు ఇంచుమించు బాలవ్యాకరణ ముద్రణములన్నింటను ద్రుతకార్యములతో 'అనుచోఁ గ్త్వార్థంబు'అను పాఠము గానవచ్చుచున్నది. ఇది సాధుపాఠముకాదు. 1858లోని తొలిముద్రణమున నిట్లు కానరాదు. అందు 'అనుచో క్త్వార్థంబు' అనియే యున్నది. ఈ తావున సరళాదేశము మిక్కిలి కర్ణకఠోరము. ఏ ముద్రణమున నెవరిమూలమునఁ బ్రవేశించినదో యెఱుకపడదు. దృఢముగా నాటుకొన్నది. ఎంతమాత్రమును శ్రుతిహితము కాదు. సూరికిని సమ్మతము కాదు. ఆతఁడు తనసూత్రాంధ్రవ్యాకరణమున నిట్టియెడల

"నచయ శ్చరి వికృతిః"

అను సూత్రముచే సరళాదేశమును నిషేధించియున్నాఁడు. పరుషములుగాని, శషసలుగాని (చర్) పరముగానున్న పరుషములకు సరళాదేశము కలుగదని యీ సూత్రమునకు భావము. ఈ భావముతోడనే సూరి 'మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు' అని సరళాదేశరహితముగాఁ బ్రయోగించియుండెను (కారక-16).

త్వరలో + క్షేమము తొలఁగుఁగాక !

ప్రజలకు + క్షోభలు తఱుఁగుఁగాక !

దేశమునకు + క్షేమము కలుగుఁగాక !

మున్నగు చోటులందెల్ల క్షకారమునందలి కకారమునకు సరళాదేశము రాకుండుటకు నీ సూత్రమే యాధారము.

ఈ యంశమును సూరితప్ప నితరలాక్షణికులు గుఱుతించినట్లును, నిషేధించినట్లును గానరాదు. ఈ సందర్భమున సరళాదేశనిషేధమునేగాక క్షకార పరత్వమున ద్రుతలోపమునుగూడ సూరి సూత్రాంధ్రవ్యాకరణమునఁ దప్పక విధించియుండును. ఇప్పటికి లభించిన చిత్తుప్రతియందు, ఆ సూత్రము లభ్యము కాకున్నది.

పయి యంశములనుబట్టి 'అనుచోఁ గ్త్వార్థంబు' అనునది యవిమర్శ కల్పితమనియు, వాస్తవికపాఠము కాదనియు గ్రహింతురుగాక.

భావిముద్రాపకులు ఇట సరళాదేశము తొలఁగించి 'అనుచో క్త్వార్థంబు' అనియే ముద్రింతురుగాక.

**11.** అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగు నపుడచ్చునకు సంధియగు. ౧౧.

మూర .... ఎఁడు : మూరెఁడు.
వీసె .... ఎఁడు : వీసెఁడు.
అర్థ .... ఇంచు : అర్థించు.
నిర్జి ... ఇంచు : నిర్జించు.

అంద్వవగాగమంబులు పరంబులగునపుడు యథాసంభవముగా గ్రహించునది. రాములందు, రాములయందు; హరియందు; ఎనిమిదవది, ఎనిమిదియవది.

ఈ సూత్రముతో కేవల స్వరసంధులు సమాప్తములు.

**12.** కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దముల ఱడల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు. ౧౨.

కుఱు .... ఉసురు : కుట్టుసురు.
చిఱు ... ఎలుక : చిట్టెలుక.
కడు .... ఎదురు : కట్టెదురు.
నడు .... ఇల్లు : నట్టిల్లు.
నిడు .... ఊరుపు : నిట్టూరుపు.

ఈ లక్ష్యములందు టకారాదేశమును, ఉత్వసంధియుఁ బ్రవర్తింపక తీరదుగాన విది స్వరవ్యంజనసంధి యనందగును.

'కుఱు + ఉసురు' అనుచో 'కర్మధారయంబులం దుత్తునకచ్చు పరం బగునపుడు టుగాగమంబగు' అను టుగాగమముకంటె, ఈ ద్విరుక్తటకారము అయిదు శబ్దములందుమాత్రమే యుద్దిష్టమయి విశేషవిహితమగుటచే ప్రథమోప స్థితమయి ముందు ప్రవర్తించును. కుట్టు + ఉసురు అని యేర్పడును. ఈస్థితిలో టుగాగమ మేలరాదు అన్నచో, అధికనిమిత్తకమయి బహిరంగమగు టుగాగ మముకంటె అల్పనిమిత్తకమయి అంతరంగమగు ఉత్వసంధి ప్రబలము గావున, ఈ విశేషోదాహరణములందు టుగాగమమును త్రోసిపుచ్చి ఉకారసంధి ప్రవర్తించును. 'కుట్టుసురు' అగును. సంధిజరిగినపిమ్మట టుగాగమమునకుఁ బ్రాప్తియే లేదు.

ఇట్లు ఉత్వసంధి ప్రబలమయినచో 'కఱకు + అమ్ము' అనుచోటఁగూడ ఉత్వసంధి టుగాగమమును వారించి తాను బ్రవర్తింపవలయుఁగదా ! అపుడు 'కఱకమ్ము' అనియేగదా సిద్ధించును. 'కఱకుటమ్ము' కుదురుట యెట్లు ? అని శంకింపవచ్చును.

కాని, 'కఱకు + అమ్ము' అను సాధారణోదాహరణములందుఁగూడ ప్రబలముగదాయని, ఉత్వసంధియే ప్రవర్తించినచో టుగాగమము ప్రవర్తించు లక్ష్యమొక్కటియు నుండదు. ఆ విధానము వ్యర్థమగును. కాఁగా, టుగాగమ విధాన సామర్థ్యమువల్లనే ఆ చోటులందు ఉత్వసంధి బాధకముకాక టుగాగమము నకు తావిచ్చును. 'కఱకుటమ్ము' ఇత్యాదులు సిద్ధించును అని తోఁచెడిని.

**13.** ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు. ౧౩.

వాఁడు .... కొట్టె : వాఁడుగొట్టె, వాఁడుకొట్టె.
అపుడు .... చనియె : అపుడుసనియె, అపుడుచనియె.
నీవు .... టక్కరివి : నీవుడక్కరివి, నీవుటక్కరివి.
మీరు .... తలఁడు : మీరుదలఁడు, మీరుతలఁడు.
వారు .... పోరు : వారువోరు, వారుపోరు.

అప్పుడిప్పుడెప్పుడనుశబ్దములు నిత్యైకవచనాంతములు. వాగను శాసనులు యదాతదాయని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుఁగునది. ఈ కార్యము కళలగు క్రియాపదములమీఁద సహితము కానంబడియెడి.

రారు .... కదా : రారుగదా, రారుకదా.
వత్తురు .... పోదురు : వత్తురువోదురు, వత్తురుపోదురు.

ఇది మొదలు వ్యంజనసంధులు పలువిధములు నిరూపింపఁబడును.

తిజ్మధ్య శేషషష్ఠీ 'సుస్'కర్మప్రవచనీయజ విభక్తిః
కిఞ్చిత్ ప్రశంసనాద్భుత సన్తాప యదాతదా కిమేవాంశ్చ.

అను కారికలో 'సుస్' అనుదానివల్లనే ప్రథమాంతములగు 'అప్పుడు' మున్నగు నవి గ్రహింపఁబడుచున్నను, వాగనుశాసనులు 'యదాతదా' యని మరల నిర్దేశించుట స్పష్టతకొఱకని భావింపవలయును. తిరిగి వేఱుగా పేర్కొనుట వలన అవి ప్రథమాంతములు కావేమోయని తలంపరాదు. అని పయివాక్యము నకుఁ దాత్పర్యము.

ఈ యాదేశము 'లెస్సగాన్' మున్నగు క్రియావిశేషణములలో నిత్య మని సూరి క్రియా-116 సూత్రమున 'ఇట సరళంబు నిత్యంబు' అని సూచించుట గుర్తించునది.

**14.** తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గ స డ ద వలు రావు. ఉ॥.

వాఁడు .... కంసారి : వాఁడు కంసారి.
వీఁడు .... చక్రపాణి : వీఁడు చక్రపాణి.
ఆయది .... టంకృతి : ఆయది టంకృతి.
అది .... తథ్యము : అది తథ్యము.
ఇది .... పథ్యము : ఇది పథ్యము.

ఈ నిషేధమునకు విరుద్ధముగాఁ గొన్ని ప్రయోగములు గలవనియు, నయ్యవి సామాన్యములుగాక ప్రాసనిబద్ధములయి కదల్పరానివనియు, ఈ నిషేధమును సవరించుచు ప్రౌ. వ్యా. కర్త "కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక కతపలకు గదవలు గానంబడియెడి" అనునొక సూత్రమును రచించి; 'కొన్నియెడలననఁగాఁ బ్రాసంబులందని యర్థము' అని వివరించి

"వీ । ర గ్లోపించిన సంతకుండుఁజెడు మీరా యోర్చువారు"
—ఉత్తర హరి-4-53.
"ఇ । ట్లు దపంబు సేయుచుండుదు........" —నిర్వచనోత్తర-5-8.
"వేవణములు......." —విజ్ఞానే-ప్రా-కాం-49.

అను ప్రయోగములఁ జూపియుండెను. (చూ : ప్రౌ. వ్యా. సంధి-5.)

గుర్తింపకనో స్ఫురింపకనో చూపఁడాయెఁగాని
"ఎం । తగుమతులైన మార్తురె । పదంపడి...."
—భార-ఉద్యోగ-1-286.

అను యిట్టిప్రయోగము భారతమునందును గలదు. ఇట్టివి మఱికొన్నియు నుండ నచ్చును. ఈ ప్రయోగములు సూరికి గోచరింపలేదనిమాత్రము తలంపరాదు.

ఇట్టి ప్రాసస్థలములను గుర్తించియుండుటవల్లనే యాతఁడు తొలుత తన సూత్రాంధ్రవ్యాకరణమున

"నాచ్ఛికా దప్రాసే సాంస్కృతికానామ్"

అని యీ గసడదవాదేశమును, ప్రాసభిన్నస్థలములందుమాత్రమే నిషేధించి యుండెను.

ప్రాసస్థలములందలి యీ సంధివిశేషము పద్యరచనామాత్ర సంబంధి యగుటవల్లను, ఛందోనిర్బంధసంజాతమగుటవల్లను, అదియయిన మిక్కిలి యరుదగుటవల్లను, వచనరచనమున బొత్తిగా సంబంధములేనిదగుటవల్లను, సూరి దీనిని బాలవ్యాకరణమునఁ దలపెట్టక విడిచియుండెను.

ఇట్లు తాను కోరివిడిచిన విశేషాంశముల విషయమున జిజ్ఞాసగలవారు 'మూలంబయిన కృతిని బోలఁ గనఁదగున్' అని హెచ్చరించియు నుండెను. మూలకృతి యనఁగా, బాలవ్యాకరణమునకుఁ బూర్వరూపముగాఁ దాను రచించిన సంస్కృతసూత్రగ్రంథమని యర్థము. ఆ గ్రంథము సమగ్రముగా నిర్దుష్టముగా మనకు లభింపకున్నను, సూరికి సమకాలికులయి, సన్నిహిత శిష్యులయిన సీతారామాచార్యులకు లభింపకుండునా ? అందలి 'నాచ్ఛికాదప్రాసే సాంస్కృతికానామ్' అను సూత్రమునందలి 'అప్రాసే' అను పదమును వీరు చూడకుందురా ? చూడకపోవచ్చుననుట సంభావ్యమా ? చూచియు, సూరి గుర్తించియుంచిన యీ యంశమును దామే కనుఁగొన్నటులు నిర్దేశింతురా ? గురుద్రవ్యముగాని పరద్రవ్యము కాదుగదాయని భావించియుందురా ? నిర్ణయింప వలనుపడకున్నది. ఈగురుశిష్యుల రచనములనడుమ గోచరించు విచిత్ర రహస్య ఘట్టములు పెక్కులు గలవు. వాని నన్నిటిని ప్రౌఢ వ్యాకరణ సమీక్షలోఁ బరిశీలించుకొందము. వానికి ఈ సమీక్షలో తగినంత తావులేదు. అది యటుండ నిండు. మఱొక యంశము.

సాంస్కృతిక పరుషములకు గసడదవలు రాకుండుట తెనుఁగులమీఁదఁ గదా ! సంస్కృతసమములమీఁద రావచ్చునుగదా ! అయినచో

ముఖము + చంద్రతుల్యము

దాసుఁడు + చామరగ్రాహి

మున్నగుచోటులందు చకారమునకు సకారము కలుగునా ? కలుగునట్లు కాన రాదు. ఇట్టివానిని 13 వ సూత్రమునందలి 'బహుళ'శబ్దమే వారింపఁగలదని భావింపఁదగునేమో !

**15.** ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గ స డ ద వ లగు. ఉదా.

కూర .... కాయ : కూరగాయలు.

'కను + న్ + దోయి' అగుననియు, పిమ్మట 'నిక్కులాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' అను (బాల-సమాస-20) సూత్రముచేఁగాని, 'ఆచ్ఛిక సమాసంబులం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికము లుగాఁ బెక్కులు గానంబడియెడి' (ప్రౌఢ-సమాస-36) అను ప్రౌఢ వ్యాకరణ సూత్రముచేఁగాని కనుశబ్దగత 'ను' వర్ణము లోపించి 'క + న్ + దోయి' అని యేర్పడుననియు, ఈ శేషించిన నకారము ఆగమముగావచ్చినదిగావున ద్రుత మగుననియు, ప్రకృతసూత్రముచే దీనికి బిందువుకలిగి 'కందోయి' కావచ్చు ననియు కొందఱు నిరూపించిరి.

పయి నుగాగమ సూత్రము కర్మధారయంబులందెగాని షష్ఠీసమాసంబు లందు రానేరాదని కొందఱభిప్రాయపడిరి.

'ను' వర్ణలోపము బాలవ్యాకరణ విహితముకాదనియు, దానికయి అగతిక శరణమగు 'నిక్కులాది' సూత్రమునే యాశ్రయించునెడ సర్వకార్యములను నదియ సాధించునుగాన 'కందోయి'లో బిందుమాత్రమునకయి మరల నీ ప్రకృతసూత్రము నాశ్రయింపఁ బనియేలేదనియు మఱికొందఱు తలంచిరి.

బాలవ్యాకరణముచే రూపము సాధించుటకు ఈ ప్రణాళికలోని సూత్రము లనే ప్రవర్తింపఁజేయవలయుఁగాని ప్రౌఢవ్యాకరణ సూత్రములఁ బరామర్శించుట యుచితముకాదని కొందఱాక్షేపించిరి.

ఇఁకఁ గొందఱు ఈ బాలప్రౌఢలను వీడి చింతామణినందుకొని, 'కను (లయొక్క) + దోయి' అనుచో

'షష్ఠీ భవేత్ ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్'

అను సూత్రముచే షష్ఠికి ద్వితీయకలిగి 'కను(లన్) + దోయి' అగుననియు, 'లన్' అను సమాసవిభక్తి లోపించి, 'కను + దోయి' అనిమాత్రమే మిగిలినను, 'కను' అనునది ద్వితీయాంతమనిపించుకొనకమానదనియు, ద్వితీయాంతములు చింతామణియందలి కళలపట్టికలో లేవుగావున ద్రుతప్రకృతికములు కాకతప్ప దనియు, ద్రుతప్రకృతికముతుదినున్న నకారము ద్రుతముకాక మఱేమగుననియు, దీనికిఁ బ్రకృతసూత్రముచే బిందువు కలుగుటకు నడ్డులేదనియు వేఱొకదారి ద్రొక్కియుండిరి.

చింతామణి మార్గములోఁ దత్పురుషసమాసమున షష్ఠికి ద్వితీయాతుల్యత విధించుటవలన ప్రక్రియలో నెట్టిప్రయోజనమును గోచరింపక సూరి యా మార్గమును విడిచియుండెను. మఱియు, నాతఁడు చింతామణికారునివలె కళలు కానివెల్ల ద్రుతప్రకృతికములని నిరూపించియుండలేదు. ద్రుతప్రకృతులను విద్దేశించి యవికానివెల్ల కళలని చెప్పియుండెను.

ఇట్లీ రెండువిషయములందును భిన్నప్రణాళిక కల్పించుకొన్న సూరిచేఁ జూపఁబడిన ఈ యుదాహరణమును శక్యమయినచో నాతని ప్రక్రియామార్గము ననే సాధింపవలయునుగాని యితరులప్రణాళికనుబట్టి సాధింపఁబూనుట తగిన తీరుకాదని కొందఱు తలంచియుండిరి.

మఱికొందఱు అట్లుగాక ఒక్క బాలవ్యాకరణ సూత్రములనుబట్టియే 'కంచోయి'ని సాధింతమని తలంచి, 'కను + దోయి' అనుచో

"అన్యంబులకు సహిత మిక్కుర్వంబులు కొండొకచోఁ గానంబడి యెడి" —సంధి-39.

అను సూత్రముచే శబ్దసిద్ధ 'ను'వర్ణమునకు లోపమును, ఆ పిమ్మట నుగాగమ మును ప్రవర్తింపఁజేసినచో నుగాగమ నకారము ద్రుతమేగావున దానికిఁ బ్రకృతసూత్రముచే బిందువుకలుగుట నిర్వాహమని నిరూపించియుండిరి.

పయిని నిర్దేశించిన సూత్రము సూరిదగుట సత్యమేగాని, దాని వివరణము నందు 'తొంటియట్లు లోపనుగాగమంబులు' కలుగునని సూరి స్పష్టపఱిచి యుండెననియు, 'తొంటియట్లు' అనఁగా పరుషములు పరమగునపుడని యర్థ మనియు, 'కను + దోయి' అనుచో సరళము పరమయినదిగావున నిట నాసూత్రమునకుఁ బ్రవృత్తియే లేదనియు కొందఱు ఖండించియుండిరి.

ఈరీతిగా నొక్కొక రొక్కొక్క మార్గమున ముడిపెట్టి సమర్థింప యత్నించిరి. కాని ముడిమాత్రము పడినట్లు కానరాదు.

బాలవ్యాకరణ ప్రక్రియారీతినిబట్టి కనుశబ్దములోని నకారమునకు ద్రుత త్వమా కుదురుపడదాయెను; ఈ సంధిప్రసంగములలో ద్రుతమునకేగాని వట్టి నకారమునకు బిందువా రాదాయెను; అటు బట్టతల; ఇటు మోఁకాలు!! ఎట్లు ముడివెట్టుట?

మన వివరణకర్తలమాట యటుంచి, మొదటసూత్రకర్తకే యీ విషయ మున నిశ్చలమయిన నిర్ణయము కుదురుపడినట్లు గోచరింపదు. ఒక్కయంశము తిలకింపుఁడు—

సూత్రాంధ్రవ్యాకరణమున నొకతావున
"కృతోల్లోప స్తనాదిభ్యః కపానాంతు గబా మతాః
చన్గవ — కన్గవ — చన్గొండలు
అస్య ద్రుతత్వాభావాత్ నానుస్వారః"

అను పంక్తులు కానవగును.

చన్ను, కన్నులకు రూపాంతరములగు 'చను, కను' అనువానిలో ఉకారము లోపింపఁగా శేషించిన 'చన్, కన్' అనువానికిఁ బరమయిన

కచటతపలు గజడదబలుగా మాఱుననియు, నిందలి నకారము ద్రుతముకాకుం డుటచే దీనికి ననుస్వారము రాదనియు స్పష్టముగా వక్కాణించియుండెను. వేఱొక తావున

"కన్వాదిభ్యో_న్తలోపిభ్యః పరుషాణాం గబా మతాః
'కన్జెదరె' ఇతివా 'కన్సెదరె' ఇతివేతి సన్దేహః"

అను పంక్తులు కానవచ్చును.

ఇట సూరి 'కన్' శబ్దగత నకారమును ద్రుతముగా భావించి, పయి చకారమునకు జకారాదేశముచేయుటయా, లేక ద్రుతముకాదనుకొని సకారా దేశముచేయుటయా యని తనసందిగ్ధావస్థను వెలిపియుండెను.

దీనింబట్టిచూడ, ఈ విషయమున సూరి హృదయము సూత్రాంధ్ర వ్యాకరణ రచనాసమయమునకు సందిగ్ధదశలోనున్నటులు తెలియుచున్నది.

బాలవ్యాకరణమున, ఈ ప్రకృత సూత్రమున ద్రుతమునకు పూర్ణబిందా్వ దేశమును జూపుచు 'కందోయి'శబ్దము నుదాహరించుటవలన నిందలి నకార మును తుదికాతఁడు ద్రుతముగా నిర్ణయించుకొన్నట్లు తేలుచున్నది.

చూడంజూడ, 'కన్దోయి' అను సంశ్లేషరూపము సిద్ధించుటకు నిందలి నకారము ద్రుతమనుకొనవలసినపనియే లేదు. నకారదకార సంయోగముదప్ప నిందు ద్రుతకార్య విశేషమేదియుఁ గన్పట్టదు. ఉన్నచర్చయంతయు 'కందోయి' అను బిందురూపమునొద్దనే గలదు.

భాషలో నెచ్చటనయినను నకారము బిందువుగా మార్పునొందుట వర్ణ పరిణామ పద్ధతులకుఁగాని వ్యాకరణప్రక్రియలకుఁగాని విరుద్ధముకాదు. నిజము నకు, నకారము బిందువుగా మాఱుటకు నుచ్చారణసాదృశ్యము కారణముగాని ద్రుతసంజ్ఞ కారణమేకాదు. 'కనుదురు' అనురూపమునందలి నకారమునకు ద్రుతత్వము లేకున్నను బిందువాదేశమయి 'కందురు' అను రూపమేర్పడి యున్నది. ఇచట నువర్ణస్థానమున బిందువు విధింపఁబడియున్నది (చూ.: బాల-క్రియా-58).

అటులే ఈ 'కను, చను' మున్నగుశబ్దముల నకారమునకు పలసిన చోటులందుఁ బూర్ణబిందువును బ్రత్యేకించి విధించినచో 'కందోయి' రూప సాధనమునకు కలఁతయే లేకుండెడిది. అటులాతఁడు తలంపలేదు. దీనిని ద్రుతముగనే భావించినాఁడు. భావించినపుడు కన్వాది శబ్దగత నకారము వ్యాచిత్యముగా ద్రుతసంజ్ఞకంబగునని సూచించియున్నను గజిబిజిలేకుండెడిది. అట్టి సూచనయుఁ గావరాదు.

అతఁడు సూచింపకుండెనో! మనము గుర్తింపకుంటిమో! అట్టి సూచనరేఖామాత్రమయిన లభించునాయని సూక్ష్మదర్శనము చూపవెట్టుఁడు.

ఈ సూత్రమున వర్గయుక్పరుషమునకు నొకటియు, సరళమునకు నొకటియు లక్ష్యములు చూపి తిరిగి సరళమునకు 'కందోయి' అను నీ యుదాహరణమును అదనముగాఁ జూపుట ఇందలి నకారమునకు ద్రుతత్వాంగీకార సూచనమునకే యనుకొన్నను ననుకొనవచ్చును.

ప్రకృతసూత్రమున ద్రుతమునకు బిందువగునని వక్కాణింప, దానికి నుదాహరణముగా తాళఫలమంతటి పూర్ణబిందువుతో 'కందోయి' శబ్దమును చూపుచుండ ఇంకను వేఱుసూచనలేలయందురా: ఓమితి బ్రూమః.

**20.** అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు. ౨౦.

వాఁడువచ్చెన్, వాఁడువచ్చె, వాఁడువచ్చెను.

ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయియుండు: గుర్వవసాయియగు పద్యంబుతుదను స్వత్వంబులేదు.

"అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్."

ఈ పద్యపాదము భారతమందలిది.

"శ్రుతమువలన శ్రోత్రియుఁడగు
నతులతపోయుక్తిఁ గడుమహత్త్వము వడయున్
ధృతిచే సహాయయుతుఁడగు
నతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్."

—భార-అరణ్య-7-428.

ఈ యుదాహరణము యథాలాభముగ నిచ్చినదిగాక బాలురకు గురుజన సేవాసక్తినిపెంపొందించుటకయి ఎంచి యిచ్చినట్లున్నది. చక్కనిలక్ష్యము.

**21.** కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. ౨౧.

అదియునుగ్గాక— దివంబునుంబోలె.

**22.** అఁట, యిఁక, చుఁడు శబ్దములందువ్వు నుడితొలిహ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. ౨౨.

ముంగొంగు, క్రొంబసిఁడి, కన్దోయి.

'ఇఁక' అనునది తన రూపాంతరమేయగు 'ఇఁగ' అనుదానికిఁగూడ నుపలక్షకమని యూహించునది. 'ఇఁగేమి? ఇంగేమి?' అనువాడుక కొన్ని మండలములలోఁ బ్రచురముగాఁ గలదు.

ఎఁడు (పరిమాణార్థకము : వీసెఁడు), ఇఁడి (అభావద్యోతకము : ముక్కిఁడి)

అనునవి తద్ధితప్రత్యయములుగాని ప్రాతిపదికములు కావు. కాఁబట్టి వానిలోఁ దొలియచ్చుమీఁది యర్ధబిందువు నీసూత్రమడ్డగింపదు. సూత్రమున 'నుడి' అనుశబ్దమును ప్రయోగించుట యిందులకే. నుడి = పదము.

(కన్దోయిశబ్దమునందలి ద్రుతప్రసంగమునకు చూ. 19 సూ.)

ఈ ఖండబిందుసందర్భము పూర్వులప్రక్రియలో నెటులున్నదో యించుక పరికింపవలయును.

"హ్రస్వాత్ పూర్ణోపి భవేత్"

అని చింతామణి సూత్రము. హ్రస్వమునకుఁబరముగా ఖండపూర్ణబిందువులు రెండును నుండవచ్చునని యీ సూత్రమునకుఁ దాత్పర్యము.

దీనివలన 'చెంఁదొవ, కెందమ్మి, రండు, పొండు' మున్నగువానియందు ఖండబిందువుగూడ నుండవచ్చునని తేలుచున్నది. అది యెవ్వరికిని సమ్మతము కాదు. కావున

"నఖణ్డః ప్రథమాత్ హ్రస్వాత్"

అనఁగా, శబ్దమునకు మొదటిదయిన హ్రస్వమునకుఁ బరముగా ఖండబిందువు రాదు. అని యథర్వణులు నిషేధించి చింతామణిసూత్రమును సవరించి యున్నారు.

ఈ నిషేధమువల్ల 'చెందొవ' యిత్యాదులందు ఖండబిందువు నివారిత మయినది. కాని, దానితోపాటు 'ఇఁక' (ఇంక) మున్నగుచోటులందుఁగూడ నర్ధబిందువు లేకపోవలసివచ్చినది. అది గమనించి యహోబలపండితుఁడు

"అత్ర హ్రస్వశబ్దేన హ్రస్వాజన్తో హల్వివక్షితఇతి
ఇఁక ఇంకేత్యాదౌ నదోష ఇతి జ్ఞేయమ్"

అని యథర్వణకారికకు వ్యాఖ్యానము గావించియుండెను. అనఁగా, ఈయథర్వణ కారికలోని హ్రస్వశబ్దమునకు 'హ్రస్వాచ్చుపరమందుఁగల హల్లు'ని యర్థము గ్రహింపవలయుననియు, దానివలన 'ఇఁక' అనుచోట శబ్దాదిని హ్రస్వాచ్చు మాత్రమే కలదుగాని, హ్రస్వాచ్చుపరమయిన హల్లు లేదనియు, కావున నిట్టి అజాదిశబ్దములందుఁ బయినిషేధము ప్రవర్తింపదుగాన 'ఇఁక' అనుచో ఖండ బిందువు సిద్ధించుననియు నాతని తాత్పర్యము.

దీనినిబట్టి హలాదిశబ్దములందుఁ దొలిహ్రస్వముమీఁద ఖండబిందు వుండరాదుగాని, అజాదిశబ్దములందుఁ దొలిహ్రస్వముమీఁద ఖండబిందు వుండ వచ్చునని తేలుచున్నది. 'ఇఁక'లోని ఖండబిందువునకు అథర్వణుని నిషేధము ప్రవర్తింపకుండఁ దప్పించుటకయి యహోబలుఁడుచేసినవ్యాఖ్యానకల్పనవలన 'ఇఁక'లో నర్ధబిందువు సిద్ధించి యాలోపము తీరినదిగాని, దీనివలన వేఱొక చిక్కు తలయెత్తినది. ఏదియన :

అజాదులలో నుండవచ్చునను వ్యాఖ్యవల్ల 'ఇచ్చు'ధాతువునుండి నిష్పన్న మగు 'ఇండు' అనుచోట, ఉండరానిఖండబిందువు సంభవించుచున్నది. మఱియు, హలాదులలో నుండరాదను వ్యాఖ్యవల్ల 'చుఁడు'లో ఆవశ్యకమగు నర్ధబిందువు సిద్ధింపకున్నది. 'ఇండు'లో వారించుటకును, 'చుఁడు'లో సంపాదించుటకును అహోబలమార్గమున నవకాశమే చూపట్టదు.

అని యిట్లు పర్యాలోచించి సూరి అజాదిహలాది విభాగము నుజ్జగించి, అర్ధబిందువుండకతప్పని 'అఁట, ఇఁక, చుఁడు' శబ్దములను మూఁడిటిని స్పష్టముగాఁ బేర్కొని, యిందుఁదప్ప మఱి యేశబ్దమునందును నుడితొలి హ్రస్వముమీఁద ఖండబిందువుండదని నిషేధించినాఁడు. దీనితో ఇష్టసాధనమును, అనిష్టవారణమును సమకూరినవి.

ఈ చిక్కు లవగతము చేసికొనక, శిష్టువారు, స్థూలదృష్టిరచితమయిన అహోబలకల్పనముపయి నాధారపడి 'చుఁడు'శబ్దమున నర్ధబిందువుండదేమో యను సంశయముతో

"శబ్దాద్యహ్రస్వతో నార్ధబిన్దు ర్లోపో ద్రుతస్యచ । వినేఁటాఁటా...."

అని యనువదించినారు. సూరి సూత్రము ననుసరించి 'చుఁడు' శబ్దమును చేకొనుటయా ? అహోబలవ్యాఖ్యననుసరించి దానిని విడుచుటయా ? అని సంశయించి, అహోబలపండితాశ్రయణమే కర్తవ్యమని తలంచి, ఉండఁదగిన 'చుఁడు'శబ్దమును విడుచుకొన్నారు.

**23.** తాను, నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు. ౨౩.

తాను .... చదివె : తాఁజదివె, తానుజదివె.

తాను .... వినె : తావినె, తానువినె.

దీర్ఘంబుమీఁదిదిగాన దీనికి నెఱసున్న లేదు.

**24.** సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు. ౨౪.

ఎల్లయర్థములు, ఎల్లకలుషములు.

సర్వపర్యాయంబయిన యెల్లశబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీనికసమాసంబున విశేష్యంబునకుముందు ప్రయోగంబు లేదు.

ఇదిమొదలు కొన్ని సామాసికసంధులు విధింపఁబడును.

అందువర్ణకము పరమగునపుడు నగాగమమును సూరి విధింపకున్నను, ఈ సూత్రమునందలి 'సమాసంబునయందు' అను ప్రయోగమునుబట్టి నగాగమ మాతనికి సమ్మతమేయని గ్రహింపవలయును.

అసమాసంబున విశేష్యమునకు ముందు ఎల్లశబ్దమునకు ఒకేయొక్క ప్రయోగము లభించినది.

అది కాశికానగరమున నొకప్పుడు ఆఁకటిపెల్లున అటమటించుచు క్రోధావేశమున కలఁతఁజెంది స్వస్థతతప్పియున్నసమయమున వ్యాసులవారి పలుకుగా శ్రీనాథుఁడు చేసినప్రయోగము :

"పెల్లాకొన్నతనాన నేనొకఁడనే భిక్షానకున్ వత్తునో
యెల్లన్ శిష్యులఁ గొంచువత్తునొ నిజంబేర్పాటుగాఁ జెప్పుమా"
—భీమేశ్వరపురాణము-2-120.

దీనిని ప్రౌ. వ్యా. కర్త చూపియుండెను (ప్రౌ. వ్యా. సంధి-7). ఇంతయరుదయిన ప్రయోగములను బాలురకందించుట సూరిదృక్పథము కాదు.

కొలఁది ప్రతులలో 'సమాసంబునందు' అని కానవచ్చుచున్నను ప్రథమ ముద్రణమున (1858) 'సమాసంబునయందు' అని నగాగమ పాఠమే స్పష్టముగఁ గానవచ్చుటచే నదియే సూత్రకారుని పాఠముగ భావిముద్రాపకులు గుర్తింతురుగాక.

**25.** సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. అవి.

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులచే మూఁడు రూపంబులు. సరళంబులు పరంబులగునపుడు లోప సంశ్లేష పూర్ణబిందువులచేత మూఁడురూపములు.

విధానసామర్థ్యమువలన దీనికి లోపము లేదు.

వక్ష్యమాణవిధిచే స్వత్వము లేదు.

చిగురు .... కయిదువు : { చిగురుంగయిదువు, చిగురుఁగయిదువు, చిగురున్గయిదువు.

తళుకు .... గజ్జెలు : { తళుకుగజ్జెలు, తళుకుగ్గజ్జెలు, తళుకుంగజ్జెలు.

సింగపు .... కొదమ : { సింగపుంగొదమ, సింగపుఁగొదమ, సింగపుగ్గొదమ.

ఉన్నతంపు .... గొడుగు : { ఉన్నతంపు గొడుగు, ఉన్నతంపు గ్గొడుగు, ఉన్నతంపుం గొడుగు.

నలుఁగడాదుల నీయాగమంబు లేదండ్రు.

ఈ యాగమంబొకానొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానం బడియెడి : గఱువపు న్మరువు.

నలుఁగడాదులలో నుగామము లేదన్నవారు అహోబలపండితులు. ఆయన 'నుమ్మోతః' అను సూత్రమున వ్యాఖ్యలో

"పరుషే సరళేచైవ సమాసే నుముతో భవేత్
అద్రుతా త్సరసా దందు, పట్టి, కూర్పి విభక్తిషు"

అను నాథర్వణకారికను వివరించుచు

"సరసాదిత్యనేన 'నలుగడలు' ఇత్యాదివ్యావృత్తిః"

అని వ్రాసియున్నారు.

కాని, 'నలుఁగడ'లో నుగాగమము కలదనియే సూరి యభిప్రాయము. కావున ఈ శబ్దమున నర్ధబిందువుండుట సూరికి సమ్మతము. అది సూరికి సమ్మతముకాదనుభ్రాంతితోఁ గొందఱు ముద్రాపకు లర్ధబిందువును దొలఁగించి యున్నారు. ప్రథమముద్రణమున (1858) అర్ధబిందు సహితముగనే పాఠము గలదు. భావిముద్రాపకులు పరిశీలింతురుగాక.

సమాసములందేగాక స్వత్వములేని మఱిరెండు తావులుగూడ ఇతరత్ర సూరిచే ఉల్లేఖింపఁబడినవి :

1. గురువుతో సమాప్తమగు పద్యము తుదిని. —సంధి-20.
2. 'చూడఁగాన్, చూడఁగన్' మున్నగు క్రియావిశేషణములందు 'కాన్, కన్' అనునవి పరమగునపుడును. —క్రియా-116.

**26.** సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు. ౨౬.

**27.** తలంబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు. ౨౭.

తలఁబ్రాలు ; ఒడిఁబ్రాలు; సేసఁబ్రాలు ;
ఊరఁబంది ; ఊరఁబిచ్చిక ;
తోడఁబుట్టువు ; తోఁబుట్టువు ; ఒల్లఁబాటు ; ఒడఁబాటు.
ఇత్యాదులు.

సూత్రమున 'తలంబ్రాలు' అనుశబ్దము కంటఁబడఁగనే వివాహవేదికపయి వధూవరులు—ఒకరినిమీఱి యొకరు వేగము (ద్రుతము)నకు లోపము లేకుండ—తలంబ్రాలు పోసికొనుదృశ్యము కన్నులకుఁగట్టును. మనోజ్ఞమగు మంగళదృశ్యము.

వధూవరులు అంతకుముందు బిడియపడుచు, అంతచుఱుకుగా నగపడకున్నను తలంబ్రాల సమయమునమాత్రము సంకోచముపీడి మిక్కిలి చుఱుకుఁదనముతోఁ గానంబడుట సహజము, సార్వత్రికము.

సూత్రముననేగాక ఉదాహరణములందు 'తలంబ్రాల' వెనువెంటనే గానవచ్చు సేసఁబ్రాలు, ఒడిఁబ్రాలు అనుపదములు పెద్దలుచల్లు శుభాక్షతలను ఒడికట్టుబియ్యమును గుఱుతునకుఁదెచ్చి వివాహాంగములయిన శుభసన్నివేశములను స్ఫురింపఁజేయును. మఱియు తోడఁబుట్టువు, తోఁబుట్టువు, ఒల్లఁబాటు, ఒడఁబాటు అను నుదాహరణములు: వివాహములలో ఏదోయొక నెపమున ఆఁడుఁబడుచులు అలుకఁజెందుట, బతిమాలికలచే ప్రసన్నలగుట మున్నగు పెండ్లిముచ్చటలను స్మరణకుఁదెచ్చును. తిలకింపుఁడు.

**28.** కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు. ౨౮.

| | | | |
|---|---|---|---|
| కఱకు | .... | అమ్ము | : కఱకుటమ్ము. |
| నిగ్గు | .... | అద్దము | : నిగ్గుటద్దము. |
| సరసపు | .... | అలుక | : సరసపుటలుక. |

ఇదిమొదలు వరుసగా నయిదుసూత్రములు కర్మధారయశబ్దము నుచ్చరించి సంధికార్యములను విధించునట్టివి. అయిదిటిలో దీనియందును, తుదిదానియందునుమాత్రము 'కర్మధారయంబులందు' అనిబహువచనాంతము గ్రహింపఁబడినది. నడిమి మూఁడింటిలో 'కర్మధారయంబునందు' అని యేకవచనాంతములే గలవు. ఈ భేదమెందులకో గుర్తింపవలయును.

కర్మధారయమునందెగాక దానితోఁ గొంత సాదృశ్యముగల షష్ఠీతత్పురుషమునందుఁగూడ, ఈ టుగాగమమును, ఆ (32) పుంప్వాదేశమును బ్రవర్తించునని సూచనకయి యీ రెండు సూత్రములందును బహువచనాంతములు ప్రయోగించినట్లు భావింపఁదగును.

వేల్పుటింతులు = వేల్పులయొక్క స్త్రీలు
వేల్పుటావు = వేల్పులయొక్క ఆవు (కామధేనువు)

**29.** కర్మధారయంబునందుఁ బేరాదిశబ్దంబులకచ్చు పరంబగునప్పుడు టుగాగమంబు విభాషనగు. ఉదా.

పేరు .... ఉరము : పేరుటురము, పేరురము.
చిగురు .... ఆకు : చిగురుటాకు, చిగురాకు.
పొదరు .... ఇల్లు : పొదరుటిల్లు, పొదరిల్లు.

**30.** పేదాదిశబ్దంబులకాలుశబ్దము పరంబగునప్పుడు కర్మధారయంబునందు రుగాగమంబగు. ఉదా.

పేద .... ఆలు : పేదరాలు.
బీద .... ఆలు : బీదరాలు.
పేద, బీద, ముద్ద, బాలెంత, కొమ, జవ, అయిదువ, మనుమ, గొడ్డు. ఇట్టివి పేదాదులు.
ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది. 'ఏకాంతమునందునున్న జవరాండ్ర' సని ప్రయోగము.

"ఏ । కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులాఁ ।
గింతియగాక నీవెఱుఁగవే మునువచ్చినత్రోవచొప్పు ?"
—మను-2-41.

**31.** కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగు నపుడత్వంబున కుత్వంబును రుగాగమంబునగు. ఉదా.

ధీర .... ఆలు : ధీరురాలు.
గుణవంత .... ఆలు : గుణవంతురాలు.
ఇచట వృత్తియందాలుశబ్దము స్త్రీమాత్రపరము.

వృత్తి = సమాసము. కృద్వృత్తి; తద్ధితవృత్తి; సమాసవృత్తి; ఏకశేషవృత్తి; సనాద్యంతధాతువృత్తి అని 5 వృత్తులు పాణినీయమున ప్రసిద్ధములు.

**32.** కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు. ౩౨.

సరసము .... మాట : సరసపుమాట, సరసంపుమాట.
విరసము .... వచనము : విరసపువచనము, విరసంపువచనము.

'సింగపుఁగొదమ' మున్నగు షష్ఠీతత్పురుషంబులందుఁగూడ ఈ పుంపులు ప్రవర్తింపవచ్చునను సూచనకై 'కర్మధారయంబులందు' అను బహువచనము.

సమాసమునఁ బూర్వపదమునందలి మువర్ణకమునకే యీ పుంప్వాదేశము. ఉత్తరపదస్థమునకు రాదు. సరసపువచనము.

దీని యుదాహరణములందు సమాస విభక్తిలోపము ప్రవర్తింపదని తలంపవలెను. అది ప్రవర్తించినచో నీ సూత్రము వ్యర్థమగును.

కర్మధారయము ముగంతపూర్వమగునని నిరూపించి (సమాస-5) 'బెడిదపుటడిదము' అని యుదాహరణము చూపుటగూడ విభక్తిలోపమురాదని సూచింపఁగలదు.

**33.** ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చుపరమగునప్పుడు నుగాగమంబగు. ౩౩.

చేయు .... అతఁడు : చేయునతఁడు.
చేసెడు .... అతఁడు : చేసెడునతఁడు.

**34.** షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమంబగు. ౩౪.

రాజుయొక్క .... ఆజ్ఞ : రాజునాజ్ఞ.
విధాతృయొక్క .... ఆనతి : విధాతృనానతి.

ఏవియోయవసరములకు నేర్పడిన ఒండురెండుప్రయోగములందుఁదప్ప భారతాదులందు నెల్లయెడల ఈ నుగాగమము నియమముతోఁ బాటింపఁబడినది. కావున నిది రాజునాజ్ఞవలె, విధాతృనానతివలె గారవింపక తప్పునిదని ఉదాహరణములే యుద్ఘోషించుచున్నవి.

**35.** ఉదంత స్త్రీసమంబులకును పుంపులకు సమంతగుణవాచకంబులకును తనంబు పరంబగునపుడు నుగాగమంబగు. ఉదా.

సొగసు .... తనము : సొగసుందనము, సొగసుఁదనము, సొగసుద్దనము.

సరసపు .... తనము : సరసపుందనము, సరసపుఁదనము, సరసపుద్దనము.

తెల్ల ... తనము : తెల్లందనము, తెల్లఁదనము, తెల్లద్దనము.

కర్మధారయమున సమాసవృత్తిలో విధింపఁబడిన పుంపులు (32) వృత్తిత్వసామ్యమునుబట్టి తద్ధితవృత్తియందును బ్రవర్తింపవచ్చుననుదృష్టితో 'సరసపుందనము' మున్నగు నుదాహరణములు చూపఁబడినట్లు తలంపవలయును.

**36.** సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగానగు. ఉదా.

బ్రాఁత .... ఇల్లు : బ్రాయిల్లు, బ్రాఁతయిల్లు.
లేఁత .... దూడ : లేదూడ, లేఁతదూడ.
పూవు .... రెమ్మ : పూరెమ్మ, పూవురెమ్మ.

లేఁతశబ్దము అర్ధబిందుఘటితము. అర్ధబిందువుగూడ నొకప్రత్యేక వర్ణముగా సమామ్నాయమున నిర్దేశింపఁబడినది. కావున, లేఁతశబ్దమునందలి తొలియచ్చుమీఁది తక్కినవర్ణములతోపాటు అరసున్నయు లోపించుచు. కనుకనే, 'లేదూడ' అనుశబ్దము అర్ధబిందురహితముగా నుదాహరింపఁబడినది.

**37.** లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు. ఉదా.

బ్రాఁత .... కెంపు : బ్రాఁగెంపు.
లేఁత .... కొమ్మ : లేఁగొమ్మ.

పూవు ... తోఁట : పూఁదోఁట.
మీఁదు .... కడ : మీఁగడ.
కెంపు .... తామర : కెందామర.
చెన్ను .... తోవ : చెందోవ.

చెన్నుశబ్దము వృత్తిని శోణార్థకంబు.

బహుళగ్రహణముచే మీఁదుప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు. వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

సంశ్లేషమును విధించు 'ఆదేశసరళ' సూత్రము (17) నందలి విభాషకు వ్యవస్థకల్పించుటచే ఈ సూత్రముచే విహితమగు ద్రుతమునకు సంశ్లేషము రాదని తాత్పర్యము.

చెన్ను = శోణము = ఎఱ్ఱనిది (సమాసముకానిచోట చెన్ను = అందము, విధము).

38. క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు. ఇలా.

క్రొత్త .... చాయ : క్రొంజాయ.
క్రొత్త ... చెమట : క్రొంజెమట.
క్రొత్త .... పసిఁడి : క్రొంబసిఁడి.
క్రొత్త .... కారు : క్రొక్కారు.
క్రొత్త ... తావి : క్రొత్తావి.

పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వంబగు.

క్రొత్త .... గండి : క్రొగ్గండి.
క్రొత్త .... నన : క్రొన్నన.
క్రొత్త .... మావి : క్రొమ్మావి.

కెందూళి, కెంజడలని ప్రయోగంబులు గానంబడియెడి. బహుళగ్రహణముచేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు.

క్రిందుగడుపు, క్రిందుగాలు, క్రిందుదొడ ఇత్యాదులం గ్రిందుశబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణముచేతనని యెఱుంగునది.

నిత్యప్రవృత్తి, అప్రవృత్తి, వైకల్పికప్రవృత్తి, అన్యకార్యప్రవృత్తి అని బహుళశబ్దమునకున్న నాలుగర్థములును సంపూర్ణముగా వినియుక్తమయిన స్థలము బాలవ్యాకరణము మొత్తమున ఇదొక్కటే. తక్కిన బహుళపదములకు ఈయర్థములు యథాసంభవముగా వర్తిల్లుచుండును.

మీంగడ : నిత్యము ; క్రొత్తకుండలు : అప్రవృత్తి ; ప్రాయిల్లు, ప్రాంతయిల్లు : వికల్పము ; క్రిందుగాలు : అన్యకార్యము ( = దీర్ఘము).

(కారు = కాలము) క్రొక్కారు = క్రొత్తకాలము ; ముక్కారు = మూండుకాలములు : వర్షకాలము, శీతకాలము, గ్రీష్మకాలము.

ప్రతిసంవత్సరమునను ఈ మూండుకాలములు తిరుగుచుండును. వీని పరిగణనక్రమమున ఏది మొదటిది ?

'క్రొక్కారు' అనుపదమునందలి క్రొత్తశబ్దమును, తొలుకారు, తొలకరి, తొలకరించు అనువానిలోని 'తొలుత'శబ్దమును పరికించినచో వర్షకాలమే మూండిటిలో మొదటిదిగా మునుపెపుడో పరిగణింపంబడినటులు స్ఫురించును. మాసములలో చైత్రము మొదటిదిగా భావింపంబడుచున్న యిప్పటి పరిగణనమునకు విరుద్ధముగా, మన యీ దక్షిణదేశమున వర్షకాలమే మొదటిదను దృష్టితో ఆషాఢమో, శ్రావణమో మాసములలో మొదటిదిగా నే కాలమునందయినం బరిగణింపంబడుచు నుండెడిదేమో ! ఆగణనప్రకార మేకారణమువల్లనయినం గాలక్రమమున మాఱియుండునేమో ! అట్లుగాకున్నచో నీ తొలుకారుమున్నగు తెలుంగుశబ్దముల స్వరూపమిట్లుండుటకు నుపపత్తి కానరాదు. మఱియు, మన దేశమున ఆషాఢశుద్ధైకాదశికి 'తొలియేకాదశి'అనువాడుకగూడ మాసములలో ఆషాఢము మొదటిదయియుండునను నూహను గొంతబలపఱుచుచున్నది.

దేశక్షేమమునకు నత్యావశ్యకమయిన యాహారోత్పత్తికయి కృషి నుపక్రమింపవలసిన సమయము వర్షారంభమేగావున, తొల్లిటి యాంధ్రులు ఆ వర్షాకాలమునే ప్రధానముగాం దలంచి దానినే మొదటికాలముగా లెక్కించుకొని యుండిరేమో ! ఈ లెక్కకు ననుగుణమయిన చరిత్రాధారము లెవ్వియయిన లభించునేమో ! అట్టి యాధారములే లభించినచో ఈ క్రొక్కారు, తొలుకారు శబ్దములు ఒకనాంటిప్రాచీనాంధ్రసంప్రదాయమునకు సూచకములు కాంగల వేమో ! పరిశీలింపుండు.

**39.** అన్యంబులపునసహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి. ఽజా.

ఒకానొకశబ్దంబున కొకానొకశబ్దము పరంబగునపుడు తొంటి యట్లు లోపనుగాగమంబులును, గొండొకశబ్దమున కొకానొకశబ్దము పరంబగునపుడు లోపద్విత్వంబులును బ్రయోగంబులందుఁ జూపట్టెడు నని తాత్పర్యము.

పది .... తొమ్మిది : పందొమ్మిది.
తొమ్మిది .... పది : తొంబది.
వంక .... చెఱఁగు : వంజెఱఁగు.
సగము .... కోరు : సంగోరు.
నిండు .... వెఱ : నివ్వెఱ.
నిండు .... వెఱఁగు : నివ్వెఱఁగు.
నెఱ .... తఱి : నెత్తఱి.
నెఱ .... నడుము : నెన్నడుము.
నెఱ .... మది : నెమ్మది.
నెఱ .... వడి : నెవ్వడి.

ఇత్యాదులు ప్రయోగంబులవలనం దెలియునది.

ఏశబ్దమునకు ఏశబ్దము పరమయినను- ఈ లోపనుగాగమ లోపద్విత్వములు ఇచ్చవచ్చినరీతిని రావచ్చునన్నట్లు ఈ సూత్రమును, దీని వివరణమును, అన్నిసూత్రములకంటె నతిశిథిలముగా స్థూలదృష్టికి స్ఫురించును. కాని, నిదానించినచో నిది యన్నిసూత్రములకన్న బింకముగలది. ఎట్లన :

ఏశబ్దముపరమయినను ప్రాఁతాదిశబ్దములందు లోపము రావచ్చును. పిమ్మట లుప్తశేషమునకు పరుషాదియగు నేశబ్దము పరమయినను నుగాగమము రావచ్చును. ఈ సూత్రమున నట్లుకాదు. పదిశబ్దమునకు తొమ్మిదిశబ్దము పరమయినపుడే లోపనుగాగమములుకాని, మఱియేయితరశబ్దము పరమయినను నవి కలుగవు. ఇటులే మొదటియుదాహరణములు నాలుగింటను నీ బింకము గలదు. ఇదొక జాతి. ఇది సూత్రతాత్పర్యమున మొదటిభాగము.

ఇఁక, రెండవభాగము : ఒక్కొకశబ్దమునకు ఒక్కశబ్దమేగాక మఱి కొన్ని శబ్దములు పరమయినపుడుగూడ లోపద్విత్వములు రావచ్చును. ఈ యంశమును నిండు. నెఱశబ్దముల యుదాహరణములు తెలుపుచున్నవి.

ఏశబ్దమునకు ఏశబ్దము పరమగునపు డీ కార్యములు కలుగునో నిష్కర్షగాఁ జెప్పుట సాధ్యముకాదు. కావుననే, యుదాహరణముల తుదిని

"ఇత్యాదులు ప్రయోగంబులవలనం దెలియునది"

అని ప్రత్యేకముగా నుద్బోధించియున్నాఁడు. ఓంకముగలకార్యవిధానముల సందర్భముననే యిట్టివాక్యము నుల్లేఖించుట సూరియభ్యాసము.

కెమ్మోవి, పుప్పొడి మున్నగురూపములకు ఈ సూత్రమే సాధకముగాఁ గన్పట్టును. ఇటమీఁది మూఁడును ఆమ్రేడితసంధులు.

**40.** ఆమ్రేడితంబు పరంబగునప్పుడు కడాదులం దొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల నపంతంబగు ద్విరుక్తటకారంబగు. ఉం.

ఈ సూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది.

కడ .... కడ : కట్టకడ.

ఎదురు .... ఎదురు : ఎట్టయెదురు.

కడ, ఎదురు, కొన, చివర, తుద, తెన్ను, తెరువు, నడుము, పగలు, పిడుగు, బయలు, మొదలు ఇత్యాదులు కడాదులు.

భృశమ్ = అత్యంతము.

ఆమ్రేడితము పరమయినను నిట సంధిరాదని తెల్పుటకయి 'ఎట్టయెదురు' అని యడాగమముతో నుదాహరణము చూపఁబడినది.

**41.** ఆమ్రేడితంబు పరంబగునప్పుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు. ఉం.

అప్పటికిన్ .... అప్పటికిన్ : అప్పటప్పటికిన్, అప్పటికప్పటికిన్.

అక్కడన్ .... అక్కడన్ : అక్కడక్కడన్, అక్కడనక్కడన్.

ఇంటన్ .... ఇంటన్ : ఇంటింటన్, ఇంటనింటన్.

ఊరన్ .... ఊరన్ : ఊరూరన్, ఊరనూరన్.

ఇంచుక నాఁడిత్యాదులందు బహుళగ్రహణముచేత సంతిమాక్షర లోపంబునగు.

ఇంచుక .... ఇంచుక : ఇంచించుక, ఇంచుకించుక.

నాఁడు ... నాఁడు : నానాఁడు, నాఁడునాఁడు.

ఇట్టిద్విరుక్తములు సమాసమువలె ఏకపదములగును. వ్యస్తపదములు కావు. అనఁగా 'ఇంటింటన్' మున్నగు చోటులందు 'ఇంటి, ఇంటన్' అని రెండుగాఁ బదవిభాగము చేయరాదన్నమాట. ఈ విభక్తిలోపమే సమాస సాదృశ్యమును సూచింపఁగలదు.

ఇట విభక్తిలోపపక్షమున 'అప్పటి + అప్పటికిన్' అనుచో ఆమ్రేడిత సంధి (10 సూ.) నిత్యముగా ప్రవర్తించును. 'అప్పటప్పటికిన్' అగును. 'అప్పటియప్పటికిన్' అనియుండదు.

లోపమురానిపక్షమున 'అప్పటికిన్ + అప్పటికిన్' అనుచో ఆమ్రేడిత సంధిని ఇఁకాదిసూత్రము నిషేధించునుగావున, కిషష్ఠిసంధిని బ్రవర్తింపఁ జేయుట యుచితము.

**42.** అంపముప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యం బులు. ౪౨.

అందదుకు, ఇఱ్ఱింకులు, ఇల్లిగ్గులు, చెల్లచెదరు, చెల్లాచెదరు, తుత్తుమురు, తుత్తునియలు, మిఱుమిట్లు ఇత్యాదులెఱుంగునది.

**43.** చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులందగు. ౪౩.

నీచేతన్ .... ప్రోపు : నీచేతిప్రోపు.
నాతోడన్ .... చెలిమి : నాతోడిచెలిమి.
నీవలనన్ .... భయము : నీవలనిభయము.

ఇవి అలుక్సమాసములు. ఇత్వమును విధించుటవల్లనే వీనిలో విభక్తి లోపము (సమాస-25) కలుగదని తెలియవలయును. ద్రుతములోపించును (సంధి-24).

ఇకారము ఏకవర్ణము (ఏకాల్) గావున 'అలోన్త్యస్య' అను పరిభాషను బట్టి 'చేత, తోడ, వలన'ల తుది అకారమునకు వచ్చునని గ్రహింపవలయును.

**44.** అందాద్యాదుల కలిగాగమంబు సమాసంబునందగు. ౪౪.

నాయందున్ .... కరుణ : నాయందలికరుణ.
ఇందున్ .... జనులు : ఇందలిజనులు.
ఎందున్ .... వారు : ఎందలివారు.

ఏంయశబ్దమున కలిగాగమము కొందఱు లేదం్రడు.

లేదనుకొన్నవారు : చింతామణికారులు, వికృతివివేకకారులు.

చింతామణిలో 'అందు' 'ఇందు' అనునవి సప్తమీవిభక్తి ప్రత్యయము లుగా నిర్దేశింపఁబడినవి. అలిగాగమము సప్తమికి విధింపఁబడినది. దానినిబట్టి 'అందు, ఇందు' అనురెంటికి మాత్రమే అలిగాగమమని తెలుచున్నది.

ఈ యంశమును "అల్యాగమస్స్యా దంద్విందో:"అని యథర్వణా చార్యులు స్పష్టపఱిచినారు.

కాఁగా, పయి యురుపురిదృష్టిలో 'ఏందు' అనుదానికి అలిగాగమము రాదని విశదమయినది.

ఈ యుద్దఱనే సూరి పరామర్శించియుండవచ్చును.

**45.** అదియవిశబ్దంబుల యత్తునకు వృత్తినిలోపంబు బహుళంబుగ నగు. ౪౫.

నా .... అది : నాది, నాయది.

నా .... అవి : నావి, నాయవి.

ఉదంతములగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లేదనియు నిదంతంబులగు తద్ధర్మవిశేషణంబులమీఁద నిత్యం బనియు బహుళగ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది, వచ్చునవి; వచ్చెడిది, వచ్చెడివి.

**46.** పడ్వాదులు పరంబులగునపుడు ముువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాషనగు. ౪౬.

భయము .... పడె : { భయపడె, భయంపడె, భయముపడె.

సూత్రము .... పట్టె : { సూత్రపట్టె, సూత్రంపట్టె, సూత్రముపట్టె.

ఈ కార్యము కర్తృవాచి ముువర్ణకమునకుఁ గలుగదు.

గజముపడియె. అశ్వముపడియె.

**౪౭.** మధ్యమపురుషమువర్ణకంబునకు హాలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాషనగు. ౪౭.

చూడుము .... నన్ను : చూడునన్ను, చూడుమునన్ను.

ఇటుచూడుము : ఇటుచూడు, ఇటుచూడుము.

చూడుమనియె ; వినుమనియె. ఇచ్చట నచ్చుపరంబయినది కాఁబట్టి లోపములేదు.

ఇది మొదలు మూఁడు సూత్రములు క్రియాపదసంధివిషయకములు.

ఏదోయవసరముకలిగి, యచ్చుపరమయినపుడుగూడ, నీలోపమును బ్రవర్తింపఁజేసిన కవిప్రయోగము లొకటిరెండున్నను వానిని బాలురు తమ రచనమునఁ జొప్పింపరాదని సూరి ప్రత్యేకముగ హెచ్చరించుట గమనింపఁ దగినది.

**౪౮.** వ్యతిరేక మధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు. ౪౮.

నమ్మకుము .... ఇట : నమ్మకిట, నమ్మకుమిట.

సూత్రమున 'ఎల్లయెడల' అనియున్నను, అచ్చుపరమయినపుడు లోపము వచ్చుటయే క్రొత్తవిశేషముగావున దానినిమాత్రమే చూపియుండెను. హాలవసానోదాహరణములు పూర్వసూత్రముననే నిర్దిష్టములగుటచేఁ బునరుక్తిమేలయని వానిని మరలఁ జూపకుండెను. చెప్పినది చెప్పరాదు. చెప్పనిది మానరాదు. ఇదే లక్షణరచనమునందుండఁదగిన సంయమనపద్ధతి.

"నమ్మకిటమీఁద నేను బ్రాణానఁ గలిమి." —ఉత్తర హరి-౫-౯౨.

**౪౯.** ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుఙ్ఞులకు లోపంబు విభాషనగు. ౪౯.

ఉండుము .... ఉండుము : ఉండుండుము, ఉండుముండుము.

కొట్టుఁడు .... కొట్టుఁడు : కొట్టుకొట్టుఁడు, కొట్టుఁడుకొట్టుఁడు.

'విభక్తిశ్చ : సుప్తిఙౌ విభక్తిసంజ్ఞౌ స్తః'

అని సు, ఔ, జస్ మున్నగు సుప్పులకును, తిప్, తస్, ఝి మున్నగు తిఙ్ఙులకును విభక్తులనియే సంస్కృత వ్యాకరణమున వ్యవహారము.

దానినిబట్టి తెలుఁగునఁగూడ నామములకువచ్చు 'డు, ము, వు, లు' మొదలగువానికిని, ధాతువులకువచ్చు 'డు, రు, వు, రు, ను, ము' అనువానికిని విభక్తులనియే వ్యవహారము.

'ప్రథమేతరవిభక్తి' యనియు, 'కునువు, క్రియావిభక్తుల' యనియు సూరి వ్యవహరించియుండెను.

కాఁగా, ఈ మధ్యమ ముడుజ్జులుగూడ విభక్తులేగావున వీనికి 'ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు' (41) అను సూత్రమువల్లనే లోపము రావచ్చునే! తిరిగి యీ సూత్రమేల? ఇంతకుముందు సిద్ధించియున్న విషయమే మరల నీ సూత్రమున నారంభింపఁబడినదే? అని కొందఱు ప్రశ్నింతురు. నిజమే, ఈ సూత్రము తొలిచూపునకు వ్యర్థముగనే కానవచ్చుచున్నది.

పయికిటుల కానవచ్చునుగాని, సూత్రమన్నది యెన్నఁడును నిష్ప్రయోజనము కారాదు. కానునుగాదు.

"సిద్ధేసతి ఆరభ్యమాణో విధిః నియమాయ భవతి"
వేఱొక సూత్రముచే సిద్ధించిన విషయము మరల నారంభింపఁబడినచో నది యేదేనొక నియమమును దెలుపుటకు నారంభింపఁబడుచుండును. ఈసూత్రముచేఁ దెలుపఁబడు నియమమెట్టిదన: 'ఆమ్రేడితము పరమగుచోఁ గ్రియావిభక్తులకు లోపమువచ్చునెడ మధ్యమముడుజ్జులకుమాత్రమే వచ్చును' అనునది.

ఈ మధ్యమముడుజ్జులుగాక తక్కిన 'వచ్చిరి + వచ్చిరి', 'రాఁగలఁడు + రాఁగలఁడు' ఇత్యాదులలోని క్రియావిభక్తులకు లోపము ప్రవర్తింపరాదు. 'రాఁగలరాఁగలఁడు' మున్నగు కురూపములు కారాదు. అట్లుకాకుండుటయే యీ నియమమువలన సిద్ధించిన ప్రయోజనము.

ఈ సూత్రమేలేక, ఈ నియమమే సిద్ధింపనిచో, ఆమ్రేడితస్థలములందు క్రియావిభక్తులన్నిటికిని లోపమురావలసినచిక్కు సంభవించెడిది.

ఈ సూత్రము ముడుజ్జులకు లోపము సంపాదించుటకుఁగాదు. మఱి, తదితరములగు క్రియావిభక్తుల లోపమును వారించుటకు.

'మధ్యమముడుజ్జులు ముజ్జునాఁబడు' (క్రియా-31) అని యొకసంజ్ఞ బాలవ్యాకరణమునఁ గలదు. అది కేవలము క్రియాపదముల ప్రక్రియకు సంబంధించునదగుటచే, క్రియాపరిచ్ఛేదమున విహితమయినది. ఆ పరిచ్ఛేదమున ముజ్జుశబ్దమే వ్యవహరింపఁబడినది. మధ్యమపురుషము, ముడుజ్జులు అనువాని

స్వరూపము తెలుపుటకు వీలుకలుగని యీ స్థలమున, ఆ సంజ్ఞను విధించుటకు నవకాశములేదు. ఎచటనో విధింపఁబోవు ఆ సంజ్ఞాపదమును నిచ్చట వ్యవహరించుటయు నుచితముకాదు.

కాపున 'ముజ్జు' అను ప్రత్యేకసంజ్ఞయున్నను నీ సూత్రమున 'మధ్యమ ముడుజ్జులు' అనియే నిర్దేశింపవలసి వచ్చినది.

ఇటమీఁద ఁనుకరణసంధులు ప్రదర్శింపఁబడును.

**50.** విసర్గంబున కనుకరణంబున లోపంబగు. ౫౦.

వర్ధతాంశ్రీః .... అనియె : వర్ధతాంశ్రీయనియె.

సంస్కృతపదములనుగాని, సంస్కృతవాక్యములనుగాని, తెనుఁగున ననుకరించునపుడు కలుగుసంధులనుమాత్రమే యీ ప్రకరణము నిర్దేశించును. తెనుఁగుపదముల యనుకరణమున నీ సూత్రములు ప్రవర్తింపవు.

'విసర్గంబునకు' అని ప్రకరణము నారంభించుటలోనే ఆ యభిప్రాయము సూచితమయినది. విసర్గము సంస్కృతపదములందెగాని, తెనుఁగుశబ్దములలో నుండదుగాన ఈయనుకరణసంధి ప్రసంగము సంస్కృతమునకుమాత్రమే సంబంధించినదని యావిసర్గిపదమునందే సూత్రకారుని సూచనగలదు. అంతియగాక, యీ ప్రకరణమునందంతటను సంస్కృత పదముల యనుకరణమే యుదాహరింపఁబడి యుండుటచే నీ ప్రసంగము సంస్కృతానుకరణసంబంధియే యని స్పష్టముగాఁ దెలుచున్నది.

**51.** అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాష నగు. ౫౧.

తుభ్యంనమః .... అనె : తుభ్యంనమోయనె, తుభ్యంనమయనె.
ఈకార్యము లాఁతిచోనహితము గనంబడియెడి.
"గతానుగతికో లోకోయటంచున్."

ఈ పద్యభాగము కళాపూర్ణోదయమునందలిది.

"లోకుల్ రాముఁడు రాముఁడంచుఁ గొలఁదుల్ రూపింప నాయుత్తమ శ్లోకుం బోలిచినన్ 'గతానుగతికో లోకో' యటంచుండుటల్ గాకబ్లీతఁడు...."
—కళాపూర్ణో-7-110.

ఇట నమశ్శబ్దమున మొదటి అత్తునకు ఉత్వము రాదని స్పష్టముగాఁ దెలియుటకయి 'పది' అను విశేషణము. 'నమ యనె': బహుళమగుటచే నిట అత్వసంధిరాదు.

**52.** అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు. ౫౨.

కింతత్ .... అనియె : కింతత్తనియె.

కస్త్వమ్ .... అనియె : కస్త్వమ్మనియె.

'వచ్చితిన్—అనియె' ఇట్టిచోట్ల సంస్కృతానుకరణము కాకుండుటచే ద్విత్వము రాదు.

**53.** అనుకరణంబునం దహమాద్యంతమకారంబునకు ద్విరుక్తి విభాషనగు. ౫౩.

దాసోహమ్ .... అనె : దాసోహమ్మనె, దాసోహమనె.

తత్కర్తవ్యమ్ .... అనె : తత్కర్తవ్యమ్మనె, తత్కర్తవ్యమనె.

పయి నాలుగు సూత్రములందలి యుదాహరణములనుగలిపి వరుసగా పరికించినచో నిది యొక గురుశిష్య ప్రసంగముగా గోచరించును.

**54.** ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు. ౫౪.

ఇయంధేనుః .... అనె : ఇయంధేనువనె.

అనుకృతిని నిడుదకుం గుఱుచయగునని యొకండువలికె నది నిరాకరంబు.

'దుర్బలస్య బలం రాజా యన వినవే.'

అస్తు + అనియె = అస్తనియె ; భవతు + అనియె = భవతనియె.

ఇచట 'అస్తు, భవతు' అనునవి క్రియాపదములు. ప్రాతిపదికములు కాకుండుటచే ఈ వుగాగమము రాదు. ఇట్టిచోట్ల రాకుండుటకే సూత్రమున 'నామంబునకు' అని నిర్దేశింపఁబడినది.

ప్రాతిపదికమయినను సంస్కృతమయినపుడే వుగాగమము ప్రాప్తించును గాని తెలుఁగుప్రాతిపదికములకు రాదు.

చిగురు + అనియె = చిగురనియె.

నిడుదకుం గుఱుచయగునని పలికినవాఁడు అప్పకవి :

"అనుకరించెడుచోట నవ్యయాదులకొనఁ
గలదొట్టుగవకు దీర్ఘంబులకును
వచ్చులోపము, కేశవాయ తుభ్యంసమ
యనఁగ రామోఘసంహర్తయనఁగ." —అప్పకవీయము-5-98.

ఈ పద్యమున దీర్ఘమునకు హ్రస్వమును విదింపఁదలంచినను విసర్గ లోపముతోఁగలిపి చెప్పులోభముచే దీర్ఘమునకుఁగూడ లోపముకలుగునని చెప్పినాఁడు. అయినను దన యుదాహరణమున హ్రస్వమునే స్పష్టముగాఁ జూపియున్నాఁడు. ఆధారరహితముగా హ్రస్వమునుజూపిన అప్పకవినిగాంచి 'స్వామీ! ప్రయోగములు పెక్కులు పరికించినవాఁడవఁటగదా! నాయెడ హ్రస్వదృష్టిపెట్టితివే! చాలచోటులందుంటినే! నన్నెప్పుడును విననయిన లేదా?'యని "దుర్బలస్య బలం రాజా యనవినవే"అను ప్రయోగమే స్వయముగా అప్పకవిని నిలువరించి యడుగుచున్నట్లున్నది. మెచ్చుకోఁదగిన ప్రయోగము. ఎన్నిచోట్లనున్నదో పరికింపుఁడు:

"ఏయెడ ననదల మొఱ వా
లాయము విననలయు 'దుర్బలస్య బలం రా
జా'యన వినవే ధరణీ
నాయకులకు నార్తరక్షణంబులె క్రతువుల్." —మనుచరిత్ర-4-74.

"నీయెడ మముబోంట్లకు నే
లా యేసంశయము 'దుర్బలస్య బలం రా
జా'యని పలుకు విశిష్ట
న్యాయము గలుగుట మదార్తి హరియింపఁదగున్."
—జైమినిభారతము-7-214.

"ధారుణిలోన ననాథుల
కేరీతినయిన శ్రీపరమేశ్వరుఁడే యా
ధారమగు 'దుర్బలస్య బ
లం రాజా' యనెడు మాటలను నిలవినవే."
—కుచేలోపాఖ్యానము-1-76.

"నాయనదతనము మాన్పి కు
లాయము విడిపించి 'దుర్బలస్య బలం రా
జా'యనువాక్యము నిక్కము
పేయఁగదే యనిన గూబ క్షితిపతికనియెన్."
—ఉత్తరరామాయణము-7-227.

ఇట్టివింకను లభింపఁగలవు. అది యటుండనిండు.

"ఇయంధేనువనె' అనురీతిగల పుగాగమమునకుఁ గవిప్రయోగములు లేవ"నియు, " 'ఇయంధేననె' అనియే యుండు"ననియు, కాఁగా "ఇయ్యది కేవలము ప్రామాదికముగాన నిది విడువఁబడె"ననియు పర్యాలోచించుచు, టీకాకారులొకరు బాలవ్యాకరణమునుండి యీ సూత్రమును దొలఁగించినారు. అట్లు తొలఁగించుట ధర్మ్యము కాదు.

ఏ వ్యాకరణ సూత్రమయినను, ఏకారణములచేనయినను నిరర్థకమని మనకుఁదోఁచినచో, హేతువులు వివరించి, దానివ్యర్థతను వ్యాఖ్యానమున మనకుఁదోఁచినరీతిని వెల్లడింపఁదగునేగాని, గ్రంథమునుండి సూత్రమునే తొలఁగించుట న్యాయ్యముకాదు. ఆ విషయమున మనకు నెంతమాత్రమును స్వతంత్రత లేదు. ఆసూత్రమునకు నేకాలమున నెవరిదృష్టిలో నెట్టిప్రయోజనము స్ఫురించునో యను దృక్పథము వ్యాఖ్యాతలకుండుట అతిముఖ్యము.

పాణినీయమున, "వృద్ధిరాదైచ్" సూత్రమున మహాభాష్యమున

'ఈ సూత్రమువలనఁ గలుగుప్రయోజనము మార్గాంతరమున సిద్ధించుచుండుటచే నిది వ్యర్థముగా గోచరించుచున్నదిగాన దీనిని బరిత్యజింపరాదా' యని శంకించుకొని

"ప్రమాణభూత ఆచార్యః దర్భపవిత్రపాణిః శుచా వవకాశే ప్రాఙ్ముఖ ఉపవిశ్య మహతా ప్రయత్నేన సూత్రాణి ప్రణయతిస్మ. తత్రాశక్యం వర్ణేనాప్య నర్థకేన భవితుమ్. కింపున రియతా సూత్రేణ ?"

అన్నారు భాష్యకారులు పతంజలిభగవానులు.

'పరమప్రామాణికులయిన పాణిన్యాచార్యులవారు దర్భపవిత్రపాణులయి, పరిశుద్ధమగు ప్రదేశమున ప్రాఙ్ముఖముగా నుపవిష్టులయి, ఏకాగ్రచిత్తులయి, ఎంతోప్రయత్నముతో, ఈ సూత్రములు రచించినారు. అంతపూనికతో రచింపఁబడిన యీ సూత్రములలో ఒక్కయక్షరమయినను వ్యర్థమగుటకు వలనుకాదే ; ఆస్థితిలో సూత్రముసూత్రమంతయు వ్యర్థమని ఒక్కపెట్టున నిరాకరింపఁదగునా ?' అని భాష్యకారుల తాత్పర్యము.

ఇదీ వ్యాఖ్యాతలకుండవలసిన దృక్పథము.

ఇంతకును ఈ పుగాగమమునకుఁ గవిప్రయోగము లేనేలేదాయని పరికింపఁగా నొకటిగాదు రెండుగాదు పెక్కులు గానవచ్చుచున్నవి. మఱి యీ సూత్రము వ్యర్థమనుకొనుటయెట్లు ?

ఆ ప్రయోగములు తిలకింపుఁడు :

"నీరజారాతి ! నిను దననెలవు గూల
నేలసృజియించె విధి ? సృజియించుఁగాక

యేల జైవాతృకునిఁ జేసె ? నేల తప్పుఁ
బడమిఁ 'బాపీ చిరాయుష'న్పేరఁ గనుడుగు." ---వసుచరిత్ర-4-35.

"జనవరుఁడు పురాణములం
దనఘా 'యభ్యాగత స్స్వయం విష్ణు'నా
వినఁబడు నినుఁజూచిన నా
జనార్దనునిఁ జూచినట్లు సంతసమయ్యెన్."

—జైమినిభారతము-7-208.

'విష్ణుపునాన్' అనుచో 'విష్ణువనన్' అని పాఠాంతరము వినంబడుచున్నది. 'అనన్, నాన్' అనునవిరెండును 'లను' ధాతురూపములేగావున ఏపాఠము నందును అనుకరణపద్ధతికి భంగములేదు.

"మున్నె 'యర్థాతురాణాం నగురు ర్నబన్ధుమ'నెడి వాక్యంబు తోడు గాఁగ" —కుచేలోపాఖ్యానము-3-43.

"సన్నాహంబున 'నిత్యం
సన్నిహితో మృత్యు'వనెడి చదువులు విని వి
ద్వన్నుత ! సేయఁగదలయును
మున్నుగ ధర్మంబు శీఘ్రముగ మర్త్యులకున్."

—కుచేలోపాఖ్యానము-3-82.

"వాఙ్మనః కాయ కర్మప్రవర్తనముల
సంభవించినపాపంబు సంహరించి
యతిథి గృహమేధికిచ్చు శాశ్వతసుఖములు
వినవె 'యభ్యాగత స్స్వయంవిష్ణు'వనఁగ."

—పాండురంగమాహాత్మ్యము-4-156.

అదేపనిగా నన్వేషించినచో నింకను నెన్నిలభించునో !

ఇన్నిప్రయోగములుండ, లేనేలేవనుటయు, సూత్రమునే యెత్తివేయుటయు న్యాయ్యముకాదు.

**55.** వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదని యాచార్యులంద్రు. ఆఆ.

సత్యము సర్వశ్రేయము; అదిలేనిచో సర్వధర్మములువ్యర్థములు. ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంతమంద చూపట్టెడు. ఇది సంధిపరిచ్ఛేదము.

ఈ సూత్రమునందలి రచనావైఖరి విలక్షణముగాఁ గానవచ్చుచున్నది. 'ఆర్యులంద్రు' అనుటలోఁ వనకీఁద భారము తగ్గించుకొనుతీరు గోచరించు చున్నది. సంధిలేమినిగూర్చి స్వాభిప్రాయమును స్పష్టముగా వెల్లడించుటకు సంకోచపడుచున్నట్లున్నది. బాలవ్యాకరణము మొత్తముని 465 సూత్రములలో ఏ వ్యాకరణకార్యము నిరూపించినను

'అగును, రాదు, వచ్చును, రాదు, చూపట్టెడి. చూపట్టదు'

అని తననిర్ణయమును ఖండితముగ వక్కాణించుటయగాని, వరుసనయి భారముంచిన యీతీరు ఇచ్చటఁదప్ప మఱియేసూత్రమందును గానరాదు. ఇదొక్కటే యిట్టిసూత్రము. దీనిలో సంధిప్రకరణము సమాప్తమగుచున్నది. వివిధములయిన సంధిరీతులెల్ల నిరూపింపఁబడినవి. ఈ సంధులు రెండుపదములు వరుసగా వచ్చినతావులందెల్ల విధిగాఁ జేయవలయునా? కొన్నిచోటులఁ మాన వచ్చునా? ఎచ్చటఁజేయుట? ఎచ్చటమానుట? అనునీవిషయము నిరూపింపక యుపేక్షింపఁదగినదా కాదాయెను! ఇదమిత్థమని వక్కాణించుటకా, ఒక నిర్ణయము తేలదాయెను! చెప్పుదునా మానుదునా అను సంప్రశ్నముతో గడబిడి పడిపడి రచించినదిగా నీ సూత్రమగపడుచున్నది.

సూత్రాక్షరములయినను తనవిగాక

"నస్యా ద్వాక్యవిరామేతు సన్ధ్యభావోపి దోషకృత్"

అను నాథర్వణసూత్రమును యథాతథముగాఁ దెనుఁగున ననకందించుచు, 'సత్యము సర్వశ్రేయము. నిజముచెప్పవలయుఁగదా: ఈ నిర్ణయము నాదికాదు. ఆర్యులంద్రు' అని నివేదించి తప్పుకొనుచున్నట్లున్నాఁడు. ఆ పెద్దలయినను వాక్యాంతమున సంధిలేకుండుట తప్పుకాదనుచున్నారుగాని, ఒప్పనుటలేదు. మంచిదనుటకును, చెడ్డది కాదనుటకును భావస్ఫురణమున భేదము తప్పదు. సూత్రపుతీరు ఇట్లున్నది.

ఇఁక సంధులపరిపాటి సంస్కృతమున నెట్లున్నదన:

"సంహితైకపదే నిత్యా । నిత్యా ధాతూపసర్గయోః ।
నిత్యా సమాసే । వాక్యేతు సా వివక్షా మపేక్షతే ।"

అని సంస్కృతశాబ్దికులు వక్కాణించిరి.

1. సంధి ఏకపదమున నిత్యము: రామ + ఇ = రామే.
2. ధాతూపసర్గలకు నిత్యము: ప్ర + ఆప్నోతి = ప్రాప్నోతి.
3. సమాసమున నిత్యము: సూర్య + ఉదయ = సూర్యోదయ.
4. వాక్యమధ్యమున సంధి, వక్తయొక్క ఇచ్ఛనుబట్టియుండును: 'బాలాయేదందీయతామ్' అని సంధికలుపవచ్చును. 'బాలాయ, ఇదం, దీయతామ్' అని సంధిమాననువచ్చును.

వాక్యమధ్యమున రెండుపదములను గలిపి సన్నిహితముగా నుచ్చరించుట గాని, నిలిపి, ఎడముగా నుచ్చరించుటగాని, పాఠకుల యిష్టము ననుసరించి యుండును. పదముల యుచ్చారణము సన్నిహితమయినచో సంధి తప్పదు, దూరమయినచో సంధిరాదు. సంస్కృతపద్ధతి ఇది.

అర్థాదులకు ననుకూలముగ నిలిపిచదుపుట ఒకపఠనగుణముగా
'అర్థవశేన చ విరతిః, సర్వస్వ మిదం హి పాఠస్య'
అని రాజశేఖరులు కావ్యమీమాంసయందుఁ బ్రసంగించియుండిరి.

ఇఁక సూరిరచనలో సంధులస్వరూప మెటులున్నదో పరికింపవలయును. దానినిబట్టి విసంధివిషయమున సూరియాంతర్యము కొంతయయినఁ బొడగట్టక పోదు. దానిని బరిశీలింపఁగా కొన్ని సూత్రములందును, గొన్ని వివరణ వాక్యములందును నొక వాక్యమునకు వేఱొకవాక్యముతో సంధులుగానంబడును.

అమహదర్థంబునందు ఢుఙ్ఞులకు ఢువులగు నున్నానుబంధంబుమీఁద దివియగు. —క్రియా-12.
టవర్ణకం బాద్వాదులకగు నగుచో నంతలోపంబగు. —కృదంత-7.
ఢువర్ణకం బాఙ్వాదులకగు నగునపుడు వకారంబు చయలకగు.
—కృదంత-20.
నిడుదకుం గుఱుచయగునని యొకండు పలికె నది నిరాకరంబు.
—సంధి-54.
ప్రయోగవైచిత్ర్యంబు గలదది ప్రయోగంబుల నెఱుంగునది.
—కారక-31-వృత్తి.
గుణంబులేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబుగాదు.
—క్రియా-68.

అని బాలవ్యాకరణమున వాక్యద్వయసంధులు కొన్ని కాననగును. నీతిచంద్రిక యందును 'సొమ్ము దక్కినదనుకోకు మిదిగోఁ గ్రక్కించెదఁజూడుము' అని యిట్టి వాక్యాంతసంధులుకొన్ని గానంబడును. ఈవాక్యములు సంధించుటకు నిట్టిచోట్ల నొక యుపపత్తి యున్నటులును స్ఫురించును.

వాక్యములు భిన్నములయినను, ఆ రెండిటిలోని భావము సంమిశ్రితమై యేకాకారముగా గ్రహింపఁబడవలసినదయినచో, నట్టియెడ వాక్యద్వయమునకు సంధిచేయుటయే యుచితమను నభిప్రాయము గోచరించును.

ఇట్టి వాక్యములను దూరదూరముగా విడివిడిగా నుచ్చరింపక సంహిత కలుగునట్లు సన్నిహితముగాఁ బలుకుట యావశ్యకమగుటచే నిట్టియెడ సంధులు సహేతుకములు, ఆవశ్యకములు నని భావించుట సముచితము. ఇట్లు అర్థమున

సన్నిహితత్వములేని వాక్యములను దగ్గఱగా నుచ్చరింపఁబనిలేదు. కావున, సంధి రానును రాదు.

ఈతని రచనలో వాక్యాంతముల విషయమిటులుండ, వాక్యమధ్యమున విడిపదములకు సయితము సంధులు గావింపక విడిచిన తావులును గొన్ని కాననగును :

'రాము ను అని ప్రాప్తింపఁగా....' —తత్సమ-25.
'ఇ టి తి అను వర్ణంబులు....' —ఆచ్ఛిక-28.
'లట్టుపరంబగునపుడు ఉన్న అను శబ్దం బనుప్రయుక్తంబగు'
—క్రియా-13.
'లిడాదేశంబగు దుజ్జునకు ఎను అనునవియు' —క్రియా-16.
'లాడాదేశంబగు దుజ్జునకు ను అనునవియు నాదేశంబులగు.'
—క్రియా-16.

ఈరీతిని సంధులుచేయనిచోటులు పెక్కులుగలవు. వీనిని పరికించినచో నిట్టి చోట్ల సంధిచేసినయెడ స్పష్టతాప్రతిపత్తి చెడిపోవుననియు, నది యన్నిటికంటె ముఖ్యమనియుఁ దలంపుతో సంధులు మానినట్లు కానంబడును.

ఇదంతయుఁ బర్యాలోచింప, సూరి, యీ సూత్రమున స్వాభిప్రాయము నిష్కర్షగాఁ దేల్చకున్నను, దనరచనాద్వారమున సంధిసంధ్యభావములరీతిని వెల్లడించినట్లూహింపఁదగును. పర్యవసానమేమన

పద్యకవితలో గణములకూర్పునుబట్టి ఏర్పడునడకలో, రెండుపదముల మధ్యమునఁగాని, రెండువాక్యముల మధ్యమునఁగాని, యుచ్చారణమునకు నిలుపుదల సహజముకాదు. అన్నిపదములును సన్నిహితములుగ నుచ్చరింపఁ బడుటయే సంభవించును. కావునఁ బద్యములందు నేరెండుపదములకయినను నేరెండు వాక్యములకయినను సంధిచేసియే తీరవలయును. ఎచటనయిన వాక్యము పాదాంతమున సమాప్తమయినచో నచ్చటమాత్రము ఆరెండు వాక్యములకు సంధిమానవచ్చును.

ఇఁక వచనరచనలో రెండువాక్యములందలి భావము భిన్నముగఁగాక ఒకేసంఘాతముగా సంబద్ధమై ఏకాకారముగఁ దెలియకతప్పనిదయినచో నా రెండువాక్యములకు మాత్రము సంధి కలిపినఁగలుపవచ్చును. తక్కినచోట్ల వాక్యద్వయసంధి వర్జనీయము.

ఇఁక పదములలో ఏరెండుపదములకయిన సంధిచేసినపక్షమున స్పష్టత లేకుండుటగాని, విరుద్ధార్థమేర్పడుటగాని, అశ్లీలార్థము స్ఫురించుటగాని, అన్వయసందేహము గలుగుటగాని, చెప్పఁదలఁచిన విషయమున అవసరమైనచోట ఊనిక చెడిపోవుటగాని సంభవించునని తోఁచినచోటులందు సంధిమానవచ్చును.

విసంధిశబ్దమునకు సంధిలేమియనునర్థము ఉపపన్నమేయైనను కావ్యాలంకారసంగ్రహాదులందు ఈ శబ్దము లక్షణవిరుద్ధసంధియను మఱియొక యర్థమున వ్యవహరింపఁబడియున్నది. కావున, అర్థసాంకర్యముకలుగకుండ సంధ్యభావమును విసంధియనుటకంటె అసంధియనుట లెస్స. విరుద్ధసంధి విసంధి; సంధిలేమి అసంధి: అను విభాగము సముచీనముగఁ దోఁచును.

ఈపాటిసూచీప్రవేశమున్నదిగదాయని యెట్టి ప్రయోజనమును లేకుండ, ప్రాలుమాలికతో అశ్రద్ధవహించి యిచ్చవచ్చిన తావులందెల్ల సంధులు కోరి విడువరాదు. సాధారణముగ సంధినాదరించుటయె సాధుమార్గము.

ఈ దృక్పథము అటు లక్షణమునకును ఇటు వ్యవహారమునకును సామరస్యము చేకూర్చుటకు సముచితమగు సంధిమార్గముగా గోచరించును.

శబ్దముల సంధులుకూర్చుటలో పలువిధములగు మార్గములు ఈపరిచ్ఛేదమున ప్రదర్శింపఁబడినవి. ఇఁక తత్సమాచ్ఛికశబ్దములలో తత్సమములు అజంతహలంతక్రమమున అనంతర పరిచ్ఛేదమున నిష్పాదింపఁబడును.

---

# తత్సమ పరిచ్ఛేదము

1. డు, ము, వు, లు : ప్రథమ. ౧.
2. నువర్ణంబు : ద్వితీయ. ౨.
3. చేత, తోడ : తృతీయ. ౩. —
4. కొఱకు, కయి : చతుర్థి. ౪.
5. వలన, కంటె, పట్టి : పంచమి. ౫.
6. కు, యొక్క, లోపల : షష్ఠి. ౬.
7. అందు, న : సప్తమి. ౭.

ఈ సూత్రములేడింటిని సంజ్ఞాసూత్రములగనేగాక విధిసూత్రములుగఁ గూడ గ్రహింపవలయును. 25 వ సూత్రమున 'నువర్ణంబు ద్వితీయ యను సూత్రముచేత రాము + ను అని ప్రాప్తింపఁగా' అను వాక్యముచే సూత్రకర్త వీనిని ప్రత్యయవిధాయకసూత్రములుగ సూచించియున్నాఁడు. కాఁగా డు, ము, వు, లు అనువానికి ప్రథమయనిసంజ్ఞ, అని ఒకయర్థము. ప్రథమావిభక్తికి డు, ము, వు, లు అను ప్రత్యయములు వచ్చును అని ఒకయర్థము. ఈరీతిగా ఈ 7 సూత్రములకు రెండువిధములను నర్థము గ్రహింపవలయును. ఇవి విభక్తులకు సాధారణవిధానసూత్రములు.

ఎట్టిప్రాతిపదికములకు నేయేప్రత్యయములు వచ్చును? ఏయర్థమున నే విభక్తి వచ్చును? మున్నగు విశేషములు, ఇటమీఁదఁ దత్సమ కారక పరిచ్ఛేదములందు వేఱువేఱుగా విధింపఁబడినవి.

ప్రాచీనులు నిర్దేశించిన విభక్తిప్రత్యయములలో 'కూర్చి, ల, ని, తో, చే, కి, ఇందు' అనువానిని సూరి యుపేక్షించెను. ఏలయన:

'కూర్చి' అనునది ప్రత్యయముగాక యనుప్రయుక్తమగు శబ్దమను కొనుట యుచితముగదా!

'ల' తృతీయాదులన్నిటను బహుత్వమున నిరూపింపకతప్పని లడా గమము ద్వితీయకును విధించుకొన్నచో 'లను' అనునది సిద్ధించునుగదా!

'ని, తో, చే, కి' అనువానిని 'ను, తోడ, చేత, కు' అనువానినుండి ప్రక్రియాసరణిలో సంగ్రహించుట సులభసాధ్యముగదా!

'ఇందు' అనుదానికి విభక్తిగాఁ బ్రయోగమే కానరాదుగదా!

అను తలంపులతో నీయేడును పయిసూత్రములలో ప్రత్యయములుగా పృథక్కుగాఁ బరిగణింపఁబడవయ్యెను.

చింతామణిలో 'జేరలిచ' అను సూత్రముచే అలిగాగమము సప్తమి కగునని నిరూపింపఁబడినది. 'అందలి' అనుదానితోపాటు 'ఇందలి' అనుదానిం గూడ సాధింపవలసియుండుటచే 'ఇందు' అనుదానిని సప్తమీప్రత్యయముగా 'అంద్వింందునాస్తుసప్తమీ'అని చింతామణిలో నిర్దేశింపక తప్పినదికాదు.

ఈ అల్యాగమము సప్తమికి విధించుటచే సప్తమీప్రత్యయములలోని 'స'వర్ణకమునకుఁగూడఁ బ్రసక్తమగుచున్నది. దానికి వచ్చుట చింతామణికిని సమ్మతముకాదు. ఇట్టి యతివ్యాప్తికలుగునటులు అల్యాగమము సప్తమికగునని విధింపనేల ? ప్రత్యయముగాదని యెఱిఁగియెఱింగి 'అలి'కొఱకయి 'ఇందు' అనుదానిని నసంగతముగా సప్తమీప్రత్యయములలోఁ జేర్పనేల ? అలిగాగమము కావలసినతావులందు వేఱుమార్గమున విధింపరాదా ? అనుతలంపులతో సూరి 'ఇందు'అనుదానిని విభక్తులలోఁ జేర్పక అందు, ఇందు, ఎందు లకు అలిగా గమమును వేఱుగా విధించెను. (చూ. సంధి-44.)

**8. తృతీయాదులకు నుగాగమంబగు. ౮.**

రామునిచేతను; రామునితోడను; రామునికొఱకును; రాముని వలనను; రామునికంటెను; రామునకును; రామునియందును.

సాధారణములగు ప్రత్యయములకుమాత్రమే లక్ష్యములు చూపుదమను దృష్టితో ఉత్తరత్ర కారకపరిచ్ఛేదమున (16, 18) అర్థవిశేషమున విధింపఁబడు లోపలవర్ణకమును, శబ్దవిశేషములకు విధింపఁబడు నవర్ణకమును, ఈసూత్రమున నుదాహరింపఁడయ్యెను.

**9. కయి, పట్టి, యొక్కలకు నుగాగమంబు లేదు. ౯.**

రామునికయి; జ్ఞానముఁబట్టి; రామునియొక్క.

**10. చేత, తోడ, లోపల వర్ణకంబులప్రథమాక్షరంబులు వైకల్పి కంబుగా శేషించు. ౧౦.**

ప్రత్యయంబు వర్ణకంబని ప్రాచీనులు వ్యవహరింతురు.
రామునిచే; రామునితో; వనములలో.

**11. డుముపున లేకవచనంబులు. ౧౧.**

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు.
రాముఁడు, సోముఁడు; వనము, ధనము; ధేనువు, భానువు.

సప్తమిలో 'అందు' ప్రత్యయమువలె సవర్ణకము సార్వత్రికముగాక ఉదంతజడములకుమాత్రమే వచ్చునదగుటచే, ఆ విశేషవిధానము చూపకుండ నిట నుదాహరించుట కిచ్చగింపక కాఁబోలును, సవర్ణకమునకు నుదాహరణము చూపఁడయ్యెను.

**12.** ఉవర్ణంబు బహువచనంబు. ౧౨.

బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు.

రాములు, సోములు; వనములు, ధనములు; ధేనువులు, భానువులు.

లోపల వర్ణకము సయితము కేవలబహువచనంబేయని కొందఱు వ్యాఖ్యానింతురు.

అది నిర్ధారణార్థమున విహితము. ఆ యర్థము సుస్పష్టముగ స్ఫురించుటకయి యది పెక్కుతావుల బహువచనముగనే ప్రయోగింపఁబడుచుండును. అంతమాత్రమున 'లు' వర్ణకమువోలె నదియుఁ గేవలబహువచనమేయని తలంపరాదు.

"మనుష్యులలో క్షత్త్రియుండు శూరుండు" అనుటకుమాఱు "మనుష్యసముదాయములో క్షత్త్రియుండు శూరుండు" అనుటలో బాధయేమి? కావున నది యుభయవచనమనుట లెస్స. అనుచూపుతో సూరి 'లు' వర్ణమునుమాత్రమే కేవలబహువచనముగ నిట నిర్దేశించి యుండును.

ఈ యంశము కారకము 16 వ సూత్రమున విపులముగఁ జూడఁగలరు.

**13.** తక్కినవి యుభయంబులు. ౧౩.

మిగిలిన ప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములని యర్థము.

వనమును, వనములను; వనముచేతను, వనములచేతను; వనముతోడను, వనములతోడను.

**14.** ఓ యామంత్రణంబునందగు. ౧౪.

'ఓ'యనుశబ్దము సంబోధనంబునందగునని యర్థము. ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపంబడును. 'ఓ'శబ్దంబు తొలఁగియు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును:

ఓరాముఁడ, ఓరాములార; రాముఁడ, రాములార.

**15.** ఓశబ్దంబునకుం బురుష, నీచస్త్రీపురుషామంత్రణంబులందు యి, సి, రి వర్ణంబులు విభాష నంతాగమంబులగు. ౧౫.

ఓయిరాముఁడ, ఓరాముఁడ; ఓసిదుష్టురాల, ఓదుష్టురాల; ఓరి దుష్టుఁడ, ఓదుష్టుఁడ.

సూత్రములందు సంక్షేపమునకయి, అంతాగమములకు, కిత్త్వమును సంఘటించి యీ పద్ధతినే సర్వత్ర ప్రక్రియ సాగించినను, నిట నుచ్చారణము క్లిష్టమయి సూత్రశైలి పరుషమగునని యెంచి కిత్త్వకల్పనాపద్ధతి నుపేక్షించి నటులూహింపనగును.

'యిక్స్రగిగ్వర్ణంబు' లనుటలోఁ బారుష్యమేర్పడును. పరుషోక్తులు పలుకుటగాని పలికించుటగాని సూరికి రుచింపదు. పారుష్యమన్నది మొదట మనభాషకే స్వభావముకాదు. కావుననే పరుషములు తఱచు సరళములుగా మాఱుచుండుట.

ఈ రీతిగా, కిత్త్వమార్గము నుజ్జగించి 'అంతాగమ'శబ్దముతో వ్యవహరించినతావులు బాలవ్యాకరణమున మఱి మూఁడుమాత్రమే కలవు: ఆచ్ఛిక-31, 34 ; కారక-33.

అచట, కిత్త్వకల్పనలేకుండుటకు హేతువులు వేఱెగలవు. ఆయా తావులందు వివరింపఁబడును.

"నీచతాయాంరిసీ స్యాతామ్" (ఓరి, ఓసి)అని యథర్వణులు వచించిన రీతిని ముందు పురుషవాచకమును, ఆవెనుక స్త్రీవాచకమును నిర్దేశించుక్రమము లోకవ్యవహారమున క్షుణ్ణమయియున్నది. అయినను "నీచస్త్రీపురుషామంత్రణము"అను సమాసమున ద్వంద్వమునఁ బాటింపకతప్పని పూర్వనిపాత నియమమునుబట్టి స్త్రీవాచకమును మొదటిదానినిగా నిర్దేశింపవలసివచ్చినది. ఆ క్రమముననే లక్ష్యములుచూపుట సముచితముగావున నటులేచూపఁబడినవి.

**16.** ఓరి యోసి మైత్రియందుం గలవు. ౧౬.

ఓరిచిన్నికృష్ణ; ఓసిముద్దుబాల.
'ఓయి'మొదలయినవానికి స్వతంత్రప్రయోగముం గలదు.
సంగతియేయోయి; ఓసిపోవే; ఓరోరి యింకెందుఁబోవవచ్చు.
వీనికి దీర్ఘంబుంగలదు.
ఓయీ విప్రకులావతంస; ఓరీ దుష్టనిశాటులార; ఓసీ ననుఁ జెనకరాకు.

చిన్ని, ముద్దు విశేషణములు ప్రేమార్థసూచనకు.

సూత్రమునందలి 'ఓరి, ఓసి' అనుక్రమము లోకవ్యవహారానుసారియయి యున్నది.

ఓయి మొదలయిన మూఁడును పూర్వసూత్రమున సాధితములయి పేరొక క్రమమునఁ బ్రదర్శింపఁబడియుండుటచే ఆ క్రమముననే (ఓయి, ఓసి, ఓరి) వానికి స్వతంత్రప్రయోగములు చూపఁబడినవి. అది సముచితమే.

వీనికి దీర్ఘమునుగూడఁ జూపవలసిన సందర్భమున 'ఓరీ' అనుదానిని మూఁడవదానినిగా నిర్దేశింపవలసియున్నను, ఇది పురుషవాచక బహువచన ప్రయోగమగుటచే 'ఓయీ'అను నేకవచనమునకు వెనువెంటనే ప్రదర్శించుట సమంజసమను చూపుతో 'ఓయీ, ఓరీ, ఓసీ'అని క్రమమును మార్చినటు లూహింపఁదగును.

ఓయి మొదలయిన స్వతంత్ర ప్రయోగములకుఁ బయిని జూపఁబడిన వాక్యములు కల్పితములుకావు.

కవిప్రయుక్తములు — పద్యభాగములు :

తే॥గీ॥ "సంగతియెయోయి యిసుమంత టింగణావు
తత్త్వనిర్ణయవాదంబు దరమె చేయ." —ఆముక్త-4-60.

సీ॥ "ఓసి పోవేయన్న నోసి పోవేయంచు
.... .... ....
నీవెంతయనిన నీవెంతయనుచు." —కళాపూ-3-196.

ఆ॥వె॥ "........ఓరోరి యిం
కెందుఁబోవవచ్చుఁ బంద నిలువు." —భార-అరణ్య-6-245.

ఇట 'బోవవచ్చు' అనుచో నొకవకారము ముద్రణస్ఖాలిత్యముచేఁ బ్రథమ ముద్రణముననే (1858) తొలఁగినది. 'బోవచ్చు' అని ముద్రితమయినది. తరువాత, ఇది పద్యభాగమను చూపులేక మెల్లప్రతులయందును నేఁటిదాఁక గతానుగతికమయి 'బోవచ్చు'అనుముద్రణమే జరుగుచున్నది. ఇందు గణ భంగము గలదు. దీనిని గుర్తించి యిటమీఁది ముద్రాపకులు 'బోవవచ్చు' అని ముద్రించుట మిక్కిలి యావశ్యకము.

"ఓయీ విప్రకులావతంస"
"ఓరీ దుష్టనిశాటులార"
"ఓసీ నమఁ జెనకరాకు".

ఈ మూఁడునుగూడఁ గల్పితములుగాఁ గన్పట్టవు. శార్దూల, కంద, పాదభాగములు. ఎచ్చటివో ; అన్వేషణీయములు. ఎపుడో తారసిల్లకపోవు.

**17.** స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వానివిశేషణంబులును మహత్తులనంబడు. ౧౭.

తిర్యక్కు లనఁగాఁ బశుపక్ష్యాదులు. జడములనఁగా నచేతనములు.

చింతామణిలో మహత్సంజ్ఞను విధించు సూత్రము
"స్త్రీ పశు జడాన్ వినా అన్యే మహదాఖ్యాః తద్విశేషణాశ్చాపి"
అని కలదు. ఇందలి పశుశబ్దముచే గోమహిషాదులేగాని పక్షులుమున్నగునవి గ్రహింపఁబడవు. కాఁగా దీనినిబట్టి శుకపికాదులేగాక మత్కుణమశకాదులు గూడ మహత్తులు కావలసివచ్చును. అటులయినచో చిక్కులు సంభవించును. ఆ యంశము గుర్తించి, సూరి స్త్రీశబ్దముపక్కను పశుశబ్దమునుంచిన పూర్వుల రచనము నిచ్చగింపక, ఆ పశుశబ్దమును మెలఁకువగాఁ దొలఁగించి దానికి మాఱు పశు, పక్షి, క్రిమి, కీటకాది వాచకమగు తిర్యక్ఛబ్దమునుగూర్చుట యిట గమనింపఁదగిన సూక్ష్మాంశము.

పెద్దలలోపములను దప్పనియెడ సన్నగా సవరించుటయగాని వానిని ప్రస్ఫుటముగా నుద్ఘాటించి బయటఁబెట్టుట యీతనికిఁ రుచింపదు. కావుననే వలసినమార్పు కావించి 'తిర్యక్కు లనఁగాఁ బశుపక్ష్యాదులు' అని యర్థమును మాత్ర ముల్లేఖించి మిన్నకుండెను.

తాను జేసినమార్పునకు హేతువును నిగూఢముగా సూచించుటకే యిట్లర్థము వ్రాయుట. ఈ సూచనగూడ సంతగా బహిరంగముకారాదనియు నీతని తలంపు. కనుకనే 'జడములనఁగా నచేతనములు' అని తిర్యక్పదముతో పాటు జడపదమునకుఁగూడ నర్థము వివరించినాఁడు. ఈ యర్థవివరణము నందలి యాంతర్యమిదియగాని తిర్యగ్జడశబ్దములు కఠినపదములని కాదు. ఇంతకన్నను క్లిష్టతరములగు శబ్దములకెన్నిటికో యీతఁడర్థములు వివరింపనే లేదు. కఠినపదములకెల్ల నర్థములు నిర్దేశించుట యీతని పద్ధతియేగాదు.

అచేతనములు = (1) తెలివిలేనివి = వృక్షములు, లతలు — మొ.
(2) ప్రాణములేనివి = శిలలు, దారువులు — మొ.

**18.** క్లీబంబులు మిత్త్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులగు. ౧౮.

మిత్త్ర శరణ ప్రధాన పాత్రాదులు మిత్త్రాదులు.

ఇందు "మహద్వాచకంబులు" అను విశేషణము లేకున్నచో అమహత్తులకుఁగూడఁ బుంలింగతుల్యత గలిగి 'సింగంబుమిత్త్రుఁడగు జంబుకంబు'

మున్నగుననిష్టరూపములు సిద్ధమగునని కొందఱు టీకాకర్తలు వక్కాణించిరి. అది సరికాదు. మహత్త్వము లేనివానికి పుంలింగతుల్యత కలిగినంతమాత్రాన ఉత్వముగాని డుజ్జుగాని ప్రాప్తించు నవకాశమే కానరాదు.

అసంభావనీయములగు ప్రత్యుదాహరణములు కల్పించుకొనుటకంటె 'ఈ విశేషణము స్పష్టార్థ' మనుకొనుట సమంజసము. స్పష్టార్థమనఁగా, ఇంచుమించు ప్రయోజనరహితమనియే యర్థము.

సూత్రములలో ఏదేనొక పదమునకు సార్థక్యము సరిపడనియెడ నిష్ఫల మని దానిని నిరసింపక స్పష్టార్థమని సరిపుచ్చుకొనుట వైయాకరణుల మర్యాద.

పాణిని సూత్రములందు నయితము
'నసంఖ్యాదే స్సమాహారే' సంఖ్యాదేరితి స్పష్టార్థమ్
'భస్త్రైషా జా జ్ఞా ద్వా స్వా నఞ్ పూర్వాణామపి' నఞ్ పూర్వాణామ పీతి స్పష్టార్థమ్"

మున్నగురీతిని, నొక్కొకయెడ వ్యాఖ్యాతలు మృదువుగా సరిపుచ్చుట కలదు. అది సూత్రకారుల విలువను సమ్మానించు సరసమార్గము.

## 19. జిత్తు బిందుపూర్వంబగు. ఎ౹కా.

జకారమిత్తుగాఁగలదానికి ముందు బిందువువచ్చునని యర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడు వర్ణమిత్తునాఁబడు.
ఉదాహరణము మీఁద స్పష్టంబగు.

బాలవ్యాకరణమున సూత్రకర్తయే వృత్తికారుఁడగుటచే సూత్రమును, వివరణవాక్యమును, రెండును ప్రామాణ్యవిషయమునఁ దుల్యములేయగుట మఱవరాని ముఖ్యాంశము.

ఇచటి వృత్తియందు నిక్షిప్తమయిన ఇత్సంజ్ఞా విధానము మిక్కిలి ప్రాముఖ్యము గలది.

బాలవ్యాకరణ ప్రక్రియా ప్రణాళికలో ట్, క్, జ్, జి, ఞ్ అనువానికి ఇత్సంజ్ఞ యావశ్యకము. ఇందు;

టిత్తులు (యట్, ఇయుట్ మొదలగునవి.)
కిత్తులు (టుక్, నుక్ మొ.)
జిత్తులు (డుజ్, తజ్ మొ.)
జీత్తులు (కజి, మిజి మొ.)

పెక్కులుగలవు. వాని ప్రయోజనములును వివిధములు.

ఞిత్త్వము ప్రత్యాహారమాత్రప్రయోజనము. (చూ.క్రియా-8.)

ఆంధ్రలాక్షణికులు వలసినచోటులందు నెట్టిపారిభాషిక రీతులనయినను పాణినీయమునుండి యెరవు తెచ్చుకొనుటకు నిరోధములేదు. కాని, ఇత్సంజ్ఞా విషయమున మాత్రము పాణినీయము తెలుఁగు వ్యాకరణములకు రవంతయు నుపకరింపదు. అచట

'హలన్త్యమ్' = 'ఉపదేశే అన్త్యం హల్ ఇత్స్యాత్-ఉపదేశ ఆద్యోచ్చారణమ్"

అని యాయాసూత్రములలో పాణిని యుచ్చరించిన శబ్దములలోని వర్ణములకే, ఆయిత్సంజ్ఞలు విధింపఁబడినవి. హాఁగాఁ దెలుఁగుసూత్రములలోని టుక్ మున్నగు శబ్దములందలి కకారాదులకు ఇత్సంజ్ఞ పాణినిసూత్రములచే సిద్ధించుట దుర్ఘటము.

అయినను నెట్లైటో పాణినీయమును బట్టియే సరిపుచ్చుకొందమన్నను క్, ట్ మున్నగు పొల్లుహల్లులకే ప్రాప్తించునుగాని 'జి' అను అజ్విశిష్టమగు మొత్తమునకు ఇత్సంజ్ఞను సంపాదించు సూత్రము పాణినీయమున లేనేలేదు.

ఈ యంశము సుమారము పరికించియే సూరి క్, ట్, జ్. జి, ఞ్ అను వర్ణములకు నన్నిటికిని ఇత్సంజ్ఞ నిరాక్షేపముగా సిద్ధించునట్టి యిత్సంజ్ఞా విధానరీతి ప్రాకృతవ్యాకరణమున

"యః కార్యార్థం సూత్రే అనుబధ్యతే
సతు ప్రయోగే దృశ్యతే స ఇత్"

—త్రివిక్రమ ప్రాకృత శబ్దానుశాసనము 1-1-14.

అని యుండుట గుర్తించి యావాక్యమునే యథాతథముగా ననువదించి, తన ప్రణాళికలో స్వతంత్రముగా, అనన్యాపేక్షముగా, ఇత్సంజ్ఞలు సిద్ధించునట్లును, ప్రయోగదశలో, ఇద్వర్ణములు లోపించునట్లును ఇత్సంజ్ఞను, ఇద్వర్ణలోపమును జోడించి పయి వివరణ వాక్యమున నిక్షేపించి యుండెను.

ఇది సాధారణ వివరణ వాక్యమను నుపేక్షాభావముతో దీని నారయక, యీ యిత్సంజ్ఞా విధానమును, లోపవిధియు, నీవాక్యమున నిక్షిప్తములయి యుండుట గ్రహింపక గుప్తార్థప్రకాశికాకారులు 'డుజ్' ఇత్యాదులందలి జకారమునకు హల్మాత్రమునకు 'హలన్త్యమ్' అను సూత్రముచే నిత్సంజ్ఞ సిద్ధించునని భ్రమతోఁ దృప్తిపడుచు, కజి యిత్యాదులందలి జి అను అజ్విశిష్టమునకు ఇత్సంజ్ఞ సిద్ధించుటయెట్లు? దీనికి పాణిని సూత్రము లేదేయని యాక్షేపించుచు, ఇట్టి భ్రమతోడనే బాలవ్యాకరణమందలి జిత్తులనెల్ల జిత్తులుగా మార్చి యనువదించిన హరికారికామార్గమే సమంజసమనియు, పాణినీయ పాండితీద్యోతకమనియు, ఆ కారికలను ప్రశంసించుచు, జిత్త్వకల్పకుఁడగు

సూరిని లఘూకరించుచు, జీత్తులను, జిత్తులుగ మార్చుటవలన హరికారికలచే సిద్ధమగు నపరూప పరంపర నయిన గుటుతింపక, ప్రమాదపడి పెంచిన తప్పులు కొన్నిగలవు. అపోహప్రవృత్తములయిన యా తప్పలు అనువాదవివేచన ప్రకరణమున విపులముగా విమర్శింపఁబడినవి.

**20.** డుజ్వర్ణకంబునకుం బ్రకృతియయినది డుమంతంబనం బడు. ౩౦.

స్పష్టము.

సూత్రమునకు నర్థవివరణముగాని యుదాహరణ ప్రదర్శనముగాని యక్కఱ పడని కొన్ని తావులందు 'స్పష్టమ్' అని నిర్దేశించుచుండుట సంస్కృత వ్యాకరణమున వృత్తికారుల పరిపాటి. ఆ పద్ధతి తఱచుగాఁ దలలో మెలఁగుటచేఁ గావలయును సూరియు నతివిశదములని తనకుఁదోఁచిన కొన్నిసూత్రముల యొద్ద 'స్పష్టము' అనుచుండును.

ఇటులన్న సూత్రములు బాలవ్యాకరణమున నిదిగాక మఱి నాలుగు మాత్రమే గలవు. అచ్చిక1; తద్ధిత 2, 21; ప్రకీర్ణక-3.

సూరి తనవ్యాకరణమునఁ దానయి క్రొత్తగాఁగల్పించుకొన్న సంజ్ఞలలో నిది మొదటిది. కుదురునంతవఱకు సంజ్ఞలు అన్వర్థములయి బాలకులజ్ఞప్తికి సహాయపడునట్లుగా నుండవలయునని యాతని దృష్టి. సంజ్ఞలెట్టివయినఁ గావచ్చునుగాని యర్థవంతము లగుటలో నందముగలదు. డుఃఅస్యాస్తీతి = డుమత్—'డు' కలదిగాన డుమంతము. అని యిటులీసంజ్ఞ యర్థవంతము.

**21.** పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబుతుది యత్వంబున కుత్వంబగు. ౩౦.

నామంబనఁగాఁ బ్రాతిపదికము.

డిద్ధ, రామ, భార్గవ, రాజపురుష : ఇట్టివి ప్రాతిపదికములు.

డిద్ధు, రాము, భార్గవు, రాజపురుషు.

ప్రాతిపదికశబ్దము వలెనే 'నామ' శబ్దముగూడ, పాణినీయప్రసిద్ధమే. క్రొత్తదిగాదు.

పాణినీయమున

'అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్. —1-2-45

'కృత్తద్ధిత సమాసాశ్చ' —1-2-46

అను సూత్రములు రెండును ప్రాతిపదిక సంజ్ఞా విధాయకములు. ఆ రెండిటిని మనసుననుంచుకొని మొదటి సూత్రమునకు 'డిద్ధ' అనియు, రెండవ

సూత్రమందలి కృత్, తద్ధిత, సమాసములకు అదేవరుసలో 'రామ, భార్గవ, రాజపురుష' అనియు నుదాహరణములు చూపుట యీ సూత్రమున గమనింపఁ దగిన సూక్ష్మాంశము.

**22. పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు.** ౨౨.

ఇచ్చట డుజ్జను దానియందు జకార మిత్తుగావున జిత్తు బిందు పూర్వంబగునను సూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును బిమ్మట జకారము లోపించును.

ఉ. దిద్ధుఁడు, దిద్ధుండు; రాముఁడు, రాముండు;
భార్గవుఁడు, భార్గవుండు.

ఉత్వమును డుజ్జును దఱచుగాఁ గలిసివచ్చుచుండుటంబట్టి 'ఉత్వ డుజ్జులు' అని జంటవాడుక యేర్పడినదేగాని యీ రెండును, అవినాభూతములు కావు. అనఁగా వీనిలో నొకటియున్న రెండవదియు నుండవలయునను నియమములేదు. కావుననే వీని నొకే సూత్రమునఁ గలిపివిధింప ననువుపడక వేఱువేఱుగా సూత్రింపవలసివచ్చినది.

డుజ్జు ప్రథమైక వచన మాత్ర విషయకము: రాముఁడు.
ఉత్వము సర్వవిభక్తి సకలవచన సాధారణము: రాముఁడు, రాములు, రాముని, రాములను, రామునిచే, రాములచే మొ.
మఱియుఁ బ్రథమైక వచనంబున డుజ్జు పోయినను, ఉత్వము నిలువ వచ్చును : వృద్ధు, గృహస్థు మొ.

ఉత్వము లేకున్నను డుజ్జు రావచ్చును : గండఁడు, విలుకాఁడు మొ.
వయిరెండు విధులలో 'పుంలింగంబ'ను విశేషణము సార్థకము.

ఉత్వవిధిలో పుంలింగ విశేషణము లేనియెడ మహద్వాచకములగు మిత్త్రాదులకు క్లీబత్వపక్షమునఁగూడ నుత్వము, అనివార్యమయి 'మిత్త్రము' మున్నగు నపరూపముల పరంపర సంభవించును.

మఱియు స్త్రీత్వాతిదేశముగల భ్రాత, దూత, అసుర, విశ్వకర్మ, బ్రహ్మ మున్నగు శబ్దములకు ఉత్వము తప్పనిదయి 'భ్రాతు, దూతు' మున్నగు ననిష్టరూపముల పరంపరలును సిద్ధమగును.
వానినెల్ల వారించుటకే, ఉత్వవిధానమున, పుంలింగ విశేషణము.

దశరథాపత్యము; బ్రహ్మము (పరమాత్మ) ఇత్యాదులందు మహత్తులయి క్లీబములగు అపత్య, బ్రహ్మాదిశబ్దములకు డువర్ణకము రాకుండుటకయి డుజ్వి ధానమున, పుంలింగ విశేషణము.

ఈ సూత్రమున లక్ష్యములలో డిత్థుఁడు అనువానియందు 'ఉదాహరణ' మనుటకు సూచకముగా 'ఉ' అనువర్ణము నిర్దేశింపఁబడియున్నది. ఇట్టి సూచనము 39వ సూత్రము నందలి వృత్తియందు "మిత్త్రుఁడు, మిత్త్రము" అను నుదాహరణముల ప్రారంభమునఁగూడఁగలదు. ఇటులీరెండు చోటులందుఁదప్ప గ్రంథము మొత్తమున మఱియే సూత్రము నొద్దను కన్నుపొడుచుకొన్నఁ గానరాదు. 'ఉ' అను సూచనము ఈ రెండుతావులందు మాత్రమే యుండుటకు హేతువేదయియుండునో యూహింపవలయును. కృతహస్తుల రచనములందు అక్షరము నొక్కదానినయిన అనాదరముతో నుపేక్షింపరాదు. దీనిమఱుఁగున నెట్టిభావము దాఁగియుండునో !

18వ సూత్రమున నపుంసకములగు మిత్త్రాది శబ్దములకు పుంలింగతుల్యత వికల్పముగా విధింపఁబడినది. దీనికి మిత్త్రుఁడు, మిత్త్రము అను నుదాహరణములను జూపవలసియున్నది. కాని డుజ్వర్ణకమును, మువర్ణకమును అంతదనుక విధింపఁబడకుండుటచే తద్విధానానంతరము గాని ఆ రూపములుదాహరించుటకు పలను పడదయ్యెను.

ఇటులే 19వ సూత్రమున జిత్తునకు బిందుపూర్వకత్వము విహితమయినది. డుజ్జును విధింపకముందు దాని బిందుపూర్వకత్వమును జూపుటకును వీలు కలుగదయ్యెను.

కాఁగా ఈ రెండు సూత్రములకును నుదాహరణములు అనంతరము చూపఁబడునను నభిప్రాయము వెల్లడించుచు 19వ సూత్రము తుదిని "ఉదాహరణము మీఁదస్పష్టంబగు" అను నొక వాక్యమును సూరి ఉల్లేఖించి యుండెను. 'మీఁద' ననఁగా డుజ్ మువర్ణక విధాన సూత్రములందని యాతని యుద్దేశము. ఆ యుద్దేశముతోనే డుజ్జును విధించు ప్రకృతసూత్రమునొద్దను, మువర్ణకమునువిధించు 39వ సూత్రము నొద్దను పూర్వము స్థలాంతరమున (19వ సూత్రమున) తానుల్లేఖించిన వాక్యమును జ్ఞప్తికిఁ దెచ్చుటకయి దానికి పరామర్శకముగా 'ఉ' అను వర్ణమును ప్రత్యేక దృష్టితో నిర్దేశించి యున్నటులు గ్రహింపవలయును. ఒక్క యక్కరమునేని ఊరక లిఖింపఁడు. చూపు కలిపితిమా సూక్ష్మములు తేటపడును.

**23.** డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు. ౨౩.

రామునిని, రాముని; రామునిచేతను, రాముచేతను; రామునికిని, రామునకును.

సర్వత్రయనుట నగాగమ బాధనార్థము.

ఈనిగాగమము సర్వత్ర (అన్ని విభక్తులందును) వచ్చుననుటవల్ల కువర్ణకనిమిత్తకమగు నగాగమము విశేషవిధియయిననుదానిని బాధించి యీ నిగాగమము ప్రవర్తించి 'రామునికిని' అను రూపమగును. ఇది వైభాషికముగావున ఈ నిగాగమము రానిపక్షమున ఆ నగాగమముచే (28) 'రామునకును' అని సిద్ధించును. రూపద్వయ మేర్పడును.

ఇటులే సప్తమిని 'రామునియందు', 'రామునందు'అను రూపద్వయము సిద్ధించుటకయి యీ సర్వత్రశబ్దము నుగాగమమును (29) గూడ బాధింపవలయును. కావున నిచటి నగాగమశబ్దము తనవలెనే విశేషవిధియగు నుగాగమమునకుఁగూడ నుపలక్షకమని సరిపుచ్చుకొనవలయును. లేనిచో సప్తమియందు రూపద్వయము కష్టలభ్యము.

సప్తమియందుఁగూడ ఆగమ 'ను, వు' వర్ణములకు వైకల్పికముగను దక్కినవానికి నిత్యముగను నగాగమమునే సూరి విధించియున్నచో, నిచటి యీ జంట రూపములెల్ల నప్రయాసముగ సిద్ధించియుండును. అంతియగాక సంధి 24 లోఁ దాను బ్రయోగించిన 'సమాసంబునయందు'వంటి సకలసమ్మతములగు ప్రయోగములెల్ల సాధితములును నయ్యెడివి. 'కు'వర్ణకముతోపాటు 'అందు' వర్ణకము పరమగునపుడుగూడ నగాగమమునే విధించుచో, ఆ రెండు సూత్రములను (28, 29) ఏకముచేయు నవకాశముగూడఁ గలిగెడిది. ఇన్ని యుపయోగములున్నను సూరి యటులేల తలంపలేదో; దీనికేమయిన నిమిత్తము లేకమానదు. పదిలముగ పర్యాలోచింపవలయును.

"రామునియొక్క" ఇత్యాదులందు 'ని'అనునది ప్రకృతిప్రత్యయములకు నడుమ రావలసినవర్ణముగావునఁ బ్రకృతికి నంతావయవముగ విధింపఁబడినది. ప్రత్యయమునకు నాద్యవయవముగ విహితమైనను నామమునకును, విభక్తికిని నడుమనే దాని యునికి సంభవించును. కాని యటులు విధింపవలనుపడదు. ఏలయన, విభక్తికి నవయవముగ విహితమయినయెడ యదాగమపరిభాష చొప్పున, ఆగమసహితమే (=నియొక్క)విభక్తియగునుగాని దానిని విడిచి కేవలవిభక్తి(యొక్క) విభక్తి యనిపించుకొనదు. కాఁగా "రామునియొక్క + బాణములు" అను సమాసమున విభక్తిలోపించునపుడు (సమాస-25) 'నియొక్క' అనుమొత్తము లోపింపవలసియుండును. అటులయినచో నివర్ణయుక్తముగఁ గూడ నుండవలసిన "రామునిగుణములు" మున్నగు రూపములు సిద్ధింపనేరవు.

మఱియు మగనికార్యములు, మనుమనిపలుకులు, తేనియానతి మున్నగు సమాసములకు మగకార్యములు, మనుమపలుకులు, తేయానతి మున్నగురీతిని పెక్కుచోట్ల రూపవికారము సంభవించును. కావుననే యిది ప్రాతిపదికమునకు నవయవముగా విహితమైనది. ఈ యంశము తత్సమ-31, సమాస-25 సూత్రములందుఁ బరామర్శింపఁబడును.

**24.** అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగానగును. ౨౪.

మగనిని; మగనిచేతను; మగనికిని.

అనుదంతంబనుపర్యుదాసముచేత తమ్మునిని, తమ్మని; తమ్మని చేతను, తమ్ముచేతను; అల్లునిని, అల్లుని; అల్లునిచేతను, అల్లు చేతను; బల్లిదునిని, బల్లిదుని; బల్లిదునిచేతను, బల్లిదుచేతను ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికంబని యెఱుఁగునది.

ఇట 'తెనుఁగు' అనుమాటలేకున్నచో విధాత్రాదు లయిదింటికి దీనిచే నిగాగమము నిత్యమయి విధాత్రుచే మున్నగుపాక్షికరూపములు సిద్ధింపనేరవు.

పూర్వసూత్రమునుబట్టి యిదియు పైకల్పితమేయగు సామాన్యప్రవృత్తి కలుగకుండుటకయి యీ సూత్రమున 'నిత్య'పదము.

తమ్మ, అల్లి, బల్లిద అని యీ నామములు అదంతములు; ఉదంతములు కావు. ఈ యంశము కృతోత్కసూత్రమున (34) విశదమగును.

**25.** డుమంతంబుమీఁది నువర్ణకంబు నుత్వంబున కిత్వం బగు. ౨౫.

నువర్ణంబు ద్వితీయ యను సూత్రముచేత 'రాము ను' అని ప్రాప్తింపఁగా నీసూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె.

రామునిని, భార్గవుని.

ఇట బహుత్వమున రాము+లను అనుచో ఈ నువర్ణకముగూడ డుమంతమునకు వచ్చినదేగాన నిటఁగూడ ఇత్వమేలరాదు? లడాగమము నువర్ణకమునకు వచ్చినదేగదా! అది దానికే యవయవముగదా!

"యదాగమాః తద్గుణీభూతాః తద్గ్రహణేన గృహ్యన్తే"

(దేనికి ఏది ఆగమమగునో అది దానికి అవయవమై దానితోపాటుగాఁ గలిసియే గ్రహింపఁబడును)

అను యదాగమపరిభాషాన్యాయముచే 'లను'అను విశిష్టమునకే నువర్ణకత్వ ముండునుగదా! ఇత్వప్రవృత్తికి విరోధమేమిగలదు? 'రాములని'అను రూప మెట్లువారించును? అనుశంక పొడమవచ్చును. కాని

"బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమంబగు"నని లకారము విభక్తికి నాగమముగా విధింపఁబడినదిగాని, నువర్ణకమునకు నాగమముగా విధింపఁబడియుండలేదు. కావున యదాగమన్యాయముచే 'లను' అనుదానికి

విభక్తిత్వము రాఁగలదుగాని నువర్ణకత్వము రానేరదు. హాఁగా 'లను' అనునది ద్వితీయావిభక్తి యనిపించుకొనవచ్చుఁగాని నువర్ణకమనిపించుకొనదు. కావున 'లను'లోని ఉకారమునకు ఇత్వప్రసక్తి కలుగదు.

ఒకవేళ 'లను' అనుదానికి యదాగమపరిభాషచే విభక్తిత్వమాత్రమేగాక నువర్ణకత్వమునుగూడ నెట్లెటో సంపాదించినను సూత్రమున నిర్దిష్టమయినది నువర్ణకముగాని 'లను' కాదుగావున

"నిర్దిశ్యమానస్యాదేశాభవన్తి"

(సూత్రనిర్దిష్టమునకే ఆదేశములు కలుగును)

అను పరిభాషచేనయిన 'రాములను' అనుచో ఇత్వమును వారింపవచ్చును.

మఱియు డుమంతమునకును నువర్ణకమునకును నడుమ నెట్టివ్యవధానమును నుండరాదని సూత్రకారుని యాశయము.

"డుమంతంబు నువర్ణకంబు నుత్వంబునకు"

అన్నను సరిపడుచుండ, అట్లనక

"డుమంతంబు 'మీఁది' నువర్ణకంబు"

అని మీఁదుశబ్దమునుగూడఁ బ్రయోగించుటలో డుమంతమునకును 'ను'వర్ణకమునకును నడుమ వ్యవధానము ఉండరాదనునదే యాంతర్యము. కాఁగా నిచట 'ల'కారముతో వ్యవధానముండుటచే ఇత్వము రాదనియయినను దలంపవచ్చును.

**26.** ఇకారంబుమీఁది కునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు. ౨౬.

హరిని, హరికిని; శ్రీని, శ్రీకిని; వారిని, వారికిని.

అకారాంత శబ్దప్రక్రియామధ్యమున "హరిని, హరికిని" ఇత్యాదుల సాధనము నిజమునకు క్రమప్రాప్తముకాదు. అయినను సజాతీయమగు ఇత్వ విధానప్రసంగమంతయు నొక్కచోటనే యుండుటలోని సౌకర్యమును బ్రకరణౌచితిని నభిలషించి యీ సూత్రము నిచట నుపక్రమించుటయే సమీచీనముగ గోచరించును.

ఇందలి 'మీఁది' పదమునకు పూర్వసూత్రమునందువలెనే అవ్యవహిత పరమని యర్థము. కావుననే 'గిరులకు, స్త్రీలకు' ఇత్యాదులందు ఉత్వమున కిత్వము కలుగదు.

తత్సమకార్యములకును, ఆచ్ఛికకార్యములకును సాంకర్యము కలుగకుండుటకయి తత్సమాచ్ఛిక పరిచ్ఛేదములు రెండుగా విభజింపఁబడినవి.

"తత్సమంబులం గోటిపిప్పలి శబ్దంబులకీకార్యంబు చూపఁబడు"నని ప్రత్యేకించి నిర్దేశింపఁబడిన యుత్వలోపముతప్ప (ఆచ్ఛిక-12) ఆచ్ఛికపరిచ్ఛేదమునందలి మఱియేయితరకార్యమును దత్సమశబ్దమునఁ బ్రవర్తింపదు. అటులే తత్సమము లకుమాత్రమే యీ పరిచ్ఛేద ముద్దిష్టమైనది. అయినను గొన్ని కార్యములు తత్సమాచ్ఛిక సాధారణములుండుటంబట్టి యట్టివానిని బునరుక్తిగా ఆచ్ఛిక పరిచ్ఛేదమున మరల విధింపనేలయని సంగ్రహముస (లాఘవమున)కయి తత్సమకార్యములతోఁ గలిపి యిటనే విధించియుండెను. కాఁగా ఈ పరిచ్ఛేద మందలి కొలఁది కార్యములు ఆచ్ఛికములకుఁగూడఁ జెల్లుననుట పర్యవసన్నము.

ప్రకృతమున ఈ యిత్వవిధి యాచ్ఛికములందును బ్రవర్తించును. అట్టి ప్రాప్తియుండుటవలననే కొన్నియాచ్ఛికములకు నుత్తరసూత్రమున ఇత్వము నిషేధింపఁబడినది. లేకున్నచో ఆ నిషేధమనావశ్యకమగును.

ఇట, ఇకారము హ్రస్వదీర్ఘములలో ఏదియయినఁ గాఁదగును.

కు, ను, వు లలో 'కు, ను' లు ప్రత్యయములు. 'ను, వు' లు ఆగ మములు. ఇందు విభక్తిక్రమమునుబట్టి నువర్ణమే మొదట నుండఁదగిన దయినను, అది ప్రత్యయముగనేగాక యాగమరూపముగఁగూడఁ గలదను సూచనకయి ప్రత్యయాగమములు రెండిటికి నడుమఁ జేర్చఁబడినది.

ఈ యాగమ ను, వు లకు కారకప్రకరణమునఁగాని ప్రసక్తిరాదు. క్రియా విభక్తులకుఁ గ్రియాపరిచ్ఛేదమునఁగాని ప్రసంగముకలుగదు. కావుననే వానికిట నుదాహరణములు చూపుట కనువుపడక విడిచియుండెను. రచనాసంక్షేపమున కయి ప్రకరణాంతరప్రక్రియలను ఈ సూత్రమున గుదిగ్రుచ్చి మీఁదిప్రకరణము లందు వీనియవసరము కలిగినపుడు స్ఫురణకుఁ దెచ్చియుండెను (చూ. కారక-33; క్రియా-18).

చికురము — చినుకు — చివురు — ఇత్యాదులందలి కు, ను, వు, లు ప్రత్యయాగమాన్యతరములు కావుగాన ఈ యిత్వమునకుఁ బ్రవృత్తి కలుగదు.

ఈ సూత్రమున ఇ, ఈ లకును, పుం, స్త్రీ, నపుంసకలింగములకును నొకవరుసలో నుదాహరణములు చూపనుద్దేశించినటులు గోచరించును.

వీనిలో "వారిని, వారికిని"అనునవి తచ్ఛబ్దార్థములయిన యాచ్ఛిక శబ్ద రూపములా ? జలార్థకములగు వారిశబ్ద తత్సమరూపములా ? అని సంశయించు టకుఁ గొంతయవకాశము గలదు. కాని సర్వనామశబ్దప్రక్రియను జూపుతలంపు లేని సూరి యీ యిత్వమాత్రమునకయి సర్వనామ శబ్దములఁ జూపెననుకొనుట కన్న నపుంసకోదాహరణములుగఁ దత్సమవారిశబ్దరూపములను జూపెనను కొనుటయే సముచితము.

**27.** ఈధాతు యుష్మదర్థంబుల మీఁదివాని యుత్వంబున కిత్వంబురాదు. ౨౨.

ఈరు, ఈవు, ఈను, ఈము; ఈకు; నీకు, మీకు.

ఈ ధాతువనఁగా "ఇచ్చునకు సర్వంబున కీయగు"నని సుత్తుపరమయి నపుడు, ఇచ్చునకు నాదేశమయిన 'ఈ' అనుధాతువు (క్రియా-92).

ఇట 'ఇచ్చు' అనునదే మూలధాతువైనను, చూపినలక్ష్యములు ఇచ్చు ధాతురూపములేయయినను, సూత్రమున 'ఈధాతు' అనుట మాని 'ఇచ్చుధాతు' అన్నచో 'ఇచ్చిరి, ఇచ్చితివి, ఇచ్చితిరి, ఇచ్చితిని, ఇచ్చితిమి' అనుచోటులందుఁ గూడ ఇత్వనిషేధము ప్రసక్తమయి క్రియాప్రత్యయములకు ఇత్వంబుగలుగక యీ రూపములు సిద్ధింపకపోవును. 'ఈధాతు'అనుటవల్ల ఆ నిషేధము తప్పి పోయినది. ఇష్టరూపములు సిద్ధించినవి.

ఇచటి యుదాహరణములరీతి యించుక నిదానింపఁదగినది.

- 'ఈ'ధాతువునుండి వ్యతిరేకార్థమున నిష్పన్నములగు సమాపక క్రియా రూపము లాఱింటిలో నాలుగుమాత్రమే చూపఁబడినట్లు స్థూలదృష్టికి గోచ రించును. అయినను 'ఈరు' అనుదానివల్లనే ప్రథమ మధ్యమ బహువచస రూపములు రెండును సంగృహీతము లగునుగాన నయిదురూపములు ప్రదర్శి తములయినటులే యూహింపవచ్చును.

ఇఁకఁ బ్రథమైకవచనమొక్కటే కానరానిది. అది కానరామికిఁ గారణము గలదు.

'ఈఁడు' అనునదిగదా ప్రథమపురుషైకవచనరూపము. పయి ఇత్వ విధానములోని తీరునుబట్టి ఇకారము'మీఁదనే' క్రియావిభక్తి యుండవలయును. అనఁగా ఆ రెండింటికి వర్ణాంతరవ్యవధానమున్నచో ఇత్వము ప్రాప్తింపదు. 'ఈఁడు'అనుచో నర్థబిందువుతో వ్యవధానముండుటంబట్టి ఇత్వమునకుఁ బ్రాప్తియేలేదు. అప్రాప్తమునకు నిషేధమేల? అను సూక్ష్మదృష్టితో నిట ఆరూపమును జూపకుండెను. చూపకుండుటలోనె సొగసుగలదు.

ఇఁక, ఈ లక్ష్యములలో 'ఈకు'అని యొకశబ్దముగలదు. ఇది 'ఈధాతు' రూపములచివరను యుష్మదర్థరూపముల మొదటను నిర్దిష్టమయినది. 'నీకు' అనుదానిరూపాంతరముగ 'ఈకు'అనునది సుప్రసిద్ధము.

"ఎంతచెప్పిన వినరేమి 'యీకు' మాకు;
హరునియాజ్ఞయ బలవంతమల్ప మెట్టు?" (శివరాత్రి మాహాత్మ్య-4-63)

మున్నగుప్రయోగములు పెక్కు గలవు. బాలవ్యాకరణవ్యాఖ్యాతలెల్లరును దీనిని యుష్మదర్థముగనే భావించి సమన్వయించి యుండిరి. యుష్మదర్థముగ నుదాహృతమనుటలో విప్రతిపత్తి లేదుగాని యిట నొకచిన్నవిశేషము గలదు.

'ఈ'ధాతు నిష్పన్నములలో బాహ్మ్యధ్యమ వ్యతిరేకరూపము 'ఈకు' (ఈకుము)అని యొకటి గలదుగదా! అందలి కువర్ణకమున ఇత్వనిషేధమును జూపుట యుష్మదర్థకరూపాంతరమునఁ జూపుటకన్నను మిక్కిలియావశ్యకము గదా! అను నిగూఢమగునూహతో ఇటు క్రియారూపమనుకొన్నను, అటు యుష్మదర్థక రూపమనుకొన్నను ఉభయానుగుణముగాఁ గుదురుపడునట్లు 'ఈకు'అని రెండింటినడుమను దేహళీదత్తదీపన్యాయమున నిక్షేపించినటులు గోచరించుచున్నది. పరికింపుఁడు. ఇట్లుగ్రహింపనిచో 'ఈకుము, ఈకుఁడు' అనువానిలో ఇత్వము దుర్నివారమయి ఈకిమి. ఈకిఁడి అని బాలకులు జదివి కొనునంతటి వికృతరూపము లుద్భవించుననియు గమనింపుఁడు.

ఇప్పట్టున 'నీకు' అనుదానిరూపాంతరమగు 'ఈకు'ను జూపుట యనావశ్యకముకాదుగాని 'ఈకు'అనుక్రియారూపమును జూపుట యంతకంటెను గడుంగడు నావశ్యకము. అదియుంగాక కేవల యుష్మదర్థకమే సూరితలంపులో నున్నచో, ప్రధానమగు 'నీకు' అను మొదటిరూపమును ముందు నిర్దేశించి యుండును. అంతియగాని యప్రధానమనఁదగిన రూపాంతరమును మొదటి దానిఁగను, ప్రధానమగు మూలరూపమును రెండవదానిఁగను తాఱుమాఱుగా నెన్నండును నిర్దేశించియుండఁడు. ఇంతయేల! ఆచ్చికమున నిరువదినాల్గవ సూత్రమున సూరిచూపిన యుష్మదర్థకరూపములపట్టికను పరికించినచో అందు 'నీవు, ఈవు — మీరు, ఈరు' అనియే యాతని క్రమపద్ధతి కానవచ్చును.

ఇట వ్యాఖ్యాతలు సూరిచూపుడు గమనింపకుండుటయగాక వారిలో నొకరు 'ఈకున్, నీకున్, మీకున్'అని యీ రూపములను ద్రుతాంతములుగ సవరించి ముద్రింపించియున్నారు. భావిముద్రణములందు క్రమేణ 'ఈకున్' అని యీ నకారము నాటుకొన్నచో 'ఈకుము' అనుదానిరూపాంతరమగు 'ఈకు'అనునది యీ లక్ష్యములలో నెన్నఁటికిని, ఎవ్వరికిని స్ఫురింపకుండు నట్టి యనర్థము తప్పక సంభవించును. కావున భావి ముద్రాపకులెవ్వరును, ఈ మూఁడురూపములందును నకారములు చేర్పవలదని విన్నపము. సూరి స్వయముగా 1858లో ముద్రింపించినప్రతిలో నకారములు లేవు: 'ఈకు' అనునది 'ఈకుము' అనుదాని రూపాంతరముగఁగూడ స్ఫురించుటకే బుద్ధి పూర్వకముగా సూత్రకర్త 'ఈకు'లో నకారము లిఖింపకుండుటయు, ఏక రూపతకయి 'నీకున్, మీకున్'అనువానిలోఁగూడ నకారమును విడిచియుండు టయు గమనింపఁదగిన సూక్ష్మాంశములు. కావున నిట పొల్లునకారము సర్వథా

వర్జనీయము. ఇది యల్పంబు, దీనికింత యుద్యమంబేలయని యొప్పరికింప రాదు. నేఁడు గోరంతకువచ్చినది తేపు కొండంతకు వచ్చును.

'నీకు'అనుదానిలోవలె 'నీవు'అనుచోఁగూడ ఇత్వము రాదుగాన, ఆ నిషేధమును జూపుటకు 'నీవు'అనుదానింగూడ నిట నుదాహరింపవలదా యని కొందఱు ప్రశ్నింపవచ్చును.

కాని కు ను వులలోని 'వు' ఆగమము. నీవు లోని 'వు' ప్రత్యయము.

కావున నిట ఇత్వమునకుఁ బ్రాప్తియే లేకుండుటచే దాని నిషేధమును ప్రదర్శింపఁబనిలేదని 'నీవు' అనురూపమును సూరి స్మరింపనట్లు తలంప వలయును.

**28.** కువర్ణకంబు పరంబగునపు డుకారఋకారంబులకు నగాగమంబగు. ఉదా.

రామునకును; విష్ణునకును; సవితృనకును; విధాతృనకును.

**29.** ఉకారఋకారంబుల కందువర్ణకముపరంబగునపుడు నుగాగమంబగు. ఉదా.

రామునందును; విష్ణునందును; విధాతృనందును.

ఈ నుగాగమము నిత్యముగా విధింపఁబడుచున్నదే! 'రామునందు' అనియేగాక 'రామునియందు'అనురూపాంతరముగూడఁ బ్రసిద్ధముగదా! 8వ సూత్రమునఁ బ్రసంగాంతరమున నిది ఉదాహరింపఁబడియున్నదే! 'సర్వత్ర యనుట నగాగమ బాధనార్థము' అనుమాటవలన నిగాగమవిధి (23) నగాగమమునేగాని యీ నుగాగమమును బాధింపనేరదే! బాధింపనపుడు ఈ నుగాగమమే నిత్యముగాఁ బ్రవర్తించి 'రామునందు' అని ఒక్కటేరూపము సిద్ధించునే! మఱి 'రామునియందు'అనునిగాగమరూపము సిద్ధించుటయెట్లు? అను శంక యిటఁ బొడమవచ్చును. కాని, నిగాగమము ఉపలక్షణమార్గమున నగాగమమునువలెనే యీ నుగాగమమునుగూడ బాధించి పాక్షికముగాఁ బ్రవర్తించును. 'రామునియందు' అని సిద్ధించును. అది రానిపక్షమున ఈ నుగాగమము ప్రవర్తించి 'రామునందును' అని సిద్ధించును. (చూ. 23 సూ.)

**30.** ఆగమ ము, వు వర్ణంబులకందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాషనగు. ఉం.

వనమునందును, వనమందును; ధేనువునందును, ధేనువందును.

**31.** బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమంబగు. ఉ॥

రాములను, రాములచేతను; విధాత్రులను, విధాత్రులచేతను.

ఏకవచనమున 'ని' అనునది విభక్తికిఁగాక ప్రకృతికి సంతాగమముగా విధింపఁబడినది (తత్సమ-23).

ఇట బహువచనమున 'ల' అనునది విభక్తికి నాద్యవయవముగా విధింపఁబడుచున్నది. కాఁగా 'గుణములయొక్కప్రోక' అనుచో సమాసమున యడాగమన్యాయమున (చూ. తత్సమ-25) విభక్తితోపాటు దానియవయవమగు 'ల' సయితము లోపింపవలసివచ్చినది. అట్లు లోపించినచో 'గుణములప్రోక' అని సిద్ధింపక 'గుణముప్రోక' అనురూపము సంభవించును. దీనికయి సమాసవిభక్తిలోపవిధానమున (సమాస-25) 'లట్టునకుఁగాదు' అని ప్రత్యేకముగ లకారలోపము వారించుకొనఁబడినది.

తొలుత 'ల' కారమును విభక్తికి అవయవముగఁ జేయనేల? విభక్తితో పాటు లోపింపకుండ నిషేధించుకొననేల? 'ని' గాగమమువలె దీనినిగూడ 'ల' గాగమమని ప్రకృతికే సంబంధింపఁజేసికొనరాదా? అట్లుచేసినచో సమాస విభక్తిలోపము దీనికి ప్రసక్తమేకాదే! అని కొందఱిచటఁ బ్రశ్నింపవచ్చును. వివేచనగల ప్రశ్న.

కాని దీనిని ప్రాతిపదికమునకుఁగాక విభక్తికి నవయవముగా విధించుటకు ప్రబలమయిన హేతువు గలదు.

బాలురు-ఇత్యాదులందు విభక్తిలకారమునకు రేఫాదేశము విధింపఁబడినది (తత్సమ-38). ఈ రేఫము "బాలురను, బాలురచేతను" మున్నగు ద్వితీయాది బహువచనములందునంతటను రావలసియున్నది. కావున 'లు' వర్ణకమునందలి లకారమువలె ద్వితీయాదులందలిదిగూడ విభక్తికి నవయవమయినచో రేఫాదేశము అప్రయాసముగ సిద్ధించును. అందులకై లకారమును విభక్తికి సంబంధింపఁజేసి దానికే యాగమముగా విధించుట యావశ్యకమైనది. ఇట్టి యావశ్యకత యీ యొక్కతావుననేగాదు.

పగతురు, పగతురను (ఆచ్ఛిక-5); గండండ్రు, గండండ్రను (ఆచ్ఛిక-6); విలుకాండ్రు, విలుకాండ్రను (ఆచ్ఛిక-7); చెయువులు, చెయువులను (ఆచ్ఛిక-10); ఆండ్రు, ఆండ్రను (ఆచ్ఛిక-11)

మున్నగు పెక్కుచోటులందుఁగలదు. లువర్ణకమందలి లకారమువలె ఈ ద్వితీయాదులందలి లకారముగూడ విభక్తికి సంబంధించిన లకారమేయయినచో దానితోపాటు దీనికిని రేఫాదేశము సులభమగునని ప్రక్రియాసౌకర్యమును బర్యాలోచించి యీ లకారమును నిగాగమమువలె, ప్రకృతికిఁ జేర్పక విభక్తికిఁ జేర్చుటయే సప్రయోజనము, సమంజసమునయియున్నది.

**32.** సంబోధనంబునందేకార్థంబయిన పదంబుతుదియుకారంబున కకారంబగు. ౩౨.

ఓరాముఁడ; ఓవృక్షమ; ఓశంభువ; ఓకొడుక.

డు, ము, వు, లలోని ఉకారంబునకును శబ్దసిద్ధోకారమునకును వరుసగా నుదాహరణములు.

ఇట సంబోధనప్రకరణారంభ సూత్రమున 'ఓకొడుక'యని చూపుట తత్సమేతరములందుఁగూడ నీ సంబోధనకార్యములు ప్రవర్తించునని సూచించుటకు. ఈ దృష్టితోడనే యుత్తరసూత్రమున 'ఓచెలియా, ఓతండ్రీ' అని యాచ్ఛికోదాహరణములుగూడఁ జూపఁబడినవి.

'ఓవృక్షమ' ఇత్యాదులందు వృక్షాదులకు చేతనత్వవివక్షచేసికొన్నచో సంబోధనము విరుద్ధముకాదని టీకాకారు లొక రీసంబోధనమునకు నుపపత్తిని జూపినారు. నిజమేగాని చిన్నచిక్కుగలదు. చేతనత్వము వివక్షితమగుచో వృక్షాదులు మహాత్ములుగాక తీరదు. అగునెడ, ఉత్వడుజ్ఞాలు సంప్రాప్తమయి 'ఓవృక్షుఁడ'యనవలసివచ్చునేగాని 'వృక్షమ'అనుటకే వీలుచిక్కదు. మువర్ణకము దూరాపాస్తమగును. కావున సంబోధనోపపత్తికిమార్గము అదికాదు.

సాధారణముగాఁ జిత్తవైకల్యమువలనఁగాని, భావనావేశమువలనఁగాని, మనసుకుదురుతప్పి మాటలాడు సంబోధకునకు నెదుటివ్యక్తి చేతనమా? అచేతనమా? యను వివేచనమేయుండదు. అట్టి మతిదప్పినదశలోనే 'ఓచెట్టులారా', 'ఓపుట్టలారా'యని యిట్టిసంబోధనము లేర్పడును. కావున నిట్టియెడ సంబోధన సంభవమునకు సంబోధకుని చిత్తప్రవృత్తియందలి మార్పుకారణమని గ్రహింపఁదగునుగాని, యచేతనమగు సంబోధ్యమునకుఁ జేతనత్వము వివక్షించి రూపసాధనమున లేనిచిక్కులు తెచ్చుకొనరాదు.

**33.** సంబోధనంబునందుఁ బదంబుతుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు. ౩౩.

ఓరాముఁడా, ఓరాముఁడ; ఓచెలియా, ఓచెలియ;
ఓహరీ, ఓహరి; ఓతండ్రీ, ఓతండ్రి.

ఈ దీర్ఘ మాచ్ఛికములందుఁగూడఁ బ్రవర్తించునని సూచించుటకు 'ఓచెలియా, ఓతండ్రీ' అను నుదాహరణములు.

**34.** కృతోత్కంబగు సంస్కృతనామంబు సంబుద్ధిడుజ్ఞునకు లోపంబు విభాషనగు. ౩౪.

ఓరామ, ఓకృష్ణ.
పూర్వసూత్రముచేత దీర్ఘంబు: ఓరామా, ఓకృష్ణా.
సంస్కృతనామంబనుటఁజేసి 'ఓ తమ్ముఁడ, ఓ బల్లిదుఁడ', ఇత్యాదులందు లోపంబులేదు.

సహజోదంతములగు శంభుమున్నగు శబ్దములకు 'ఓశంభ' ఇత్యాదులగు నపరూపములు కాకుండుటకయి 'కృతోత్వం'బనుట.

సంస్కృతనామంబనఁగా నెట్టిమార్పునులేని యచ్చపు సంస్కృత ప్రాతిపదికము. అజంతమగు 'రామ' ఇత్యాదికము. ఇట్లనుటలో సాధారణాచ్ఛిక ప్రాతిపదికములేగాక సంస్కృత తౌల్యాతిదేశముగల (ఆచ్ఛిక-౩) బల్లిదాదు లయిన యాచ్ఛికప్రాతిపదికములుగూడ ఈ సూత్రమునకు లక్ష్యములు కానేరవని సూత్రకర్త తాత్పర్యము. 'ఓతమ్ముఁడ' అనియొక ప్రత్యుదాహరణమును జూపియు, మరల సంస్కృత తుల్యతగల బల్లిదశబ్దమునుగూడఁ జూపుట పయి తాత్పర్యమును సూచించుటకేయని గ్రహింపఁదగును.

ఇంతియగాక, హలంతములగు తత్సమశబ్దములందలి ప్రాతిపదికములు శ్రీమంత, ఋత్విజ, భగవంత మున్నగునవి సంస్కృత సమనామములుగాని, సంస్కృతనామములు కాకుండుటచే నట్టిచోనయితము ఈ సూత్రము ప్రవర్తిల్లదు. డుట్టు లోపింపదు. శ్రీమంతా, ఋత్విజా, భగవంతా అను నిట్టిరూపములు కావు; కారాదు. శ్రీమంతుఁడా మున్నగురీతిరూపములే నిష్పన్నములగును. అని యూహింపవలయును.

ఇట్టి హలంతతత్సమడుమంతమునుగూడ నొక్కదానిని బ్రత్యుదాహరణములందుఁ జూపిన బాగుండెడిది. కాని, ఒక్కొకతావున చెప్పఁదలఁచిన యంశమును నాతిగూఢముగను నాతిస్పష్టముగను సూచించి చదువరుల యూహకుఁ గొంతవిడుచుచుండుట సూరిరచనలో నొకచిరమార్గము.

**35.** ఉదంతసంస్కృతనామంబుమీఁది సంబుద్ధి డుజ్ఞసకు సూకారంబు ప్లుతంబాదేశంబు విభాషనగు. ఉదా.

ఓవిష్ణూ౩, ఓశంభూ౩.
పక్షంబునందు 'విష్ణుఁడ, శంభుఁడ' ఇత్యాది.

చింతామణికర్తయు, చిన్నయసూరియుఁ దమవర్ణసమామ్నాయములలో హ్రస్వదీర్ఘములనుమాత్రమె నిర్దేశించి 'ప్లుత'ము నుపేక్షించినారు.

తెనుఁగున ప్లుతోచ్చారణము పాటింపఁబడకుండుటంబట్టియు, పాణినీయమునందువలెఁ బ్రక్రియలోఁ దెలుఁగు వ్యాకరణమున ప్లుతకార్యములెవ్వియు

లేకుండుటంబట్టియు, వారు ప్లుతము సమామ్నాయములందు స్మరింపకుండుట సహేతుకముగనే గన్పట్టును.

కాని, విడిచినవారువిడువక యిరువురును సంబోధనరూపములు సాదించు పట్టున ఉదంతములందు (ఓవిష్ణూ౩) ప్లుతాదేశమును విధించియుండిరి. ఓరామా ఓహరీ యిత్యాదులందువలె ఉదంతములందు సయితము దీర్ఘమునే విధించుటలో బాధయేదియుం గానరాదు. దూరాహ్వానమునందు ప్లుతోచ్చారణము సహజము కాకపోదుగాని, యిట్టి ప్లుతత్వము నన్నియచ్చులకును నిరూపింపక ఒక్కయుకారాంతములందే నిరూపించుటలోని విశిష్టత గోచరింపదు. కావునఁ దక్కిన యచ్చులతోపాటుగ ఉకారమునకుఁగూడ దీర్ఘమునే విధించిన బాగుండునని తోఁచెడిని.

ఇట సూరి ప్లుతమును విధించుట సరికాదనియు

"ప్లుతస్స్యాత్సంబుద్ధా విత్యుతాం విదుః కేచిత్"

అను చింతామణిసూత్రమునందలి ప్లుతశబ్దమునకు దీర్ఘమే యర్థముగానఁ జింతామణి విధానము సరియేయనియు టీకాకారులొకరు వక్కాణించిరి.

ప్లుతశబ్దమునకు దీర్ఘార్థకత్వము దుర్ఘటము. అదిగాక, చింతామణిలోని ప్లుతశబ్దమునకు దీర్ఘార్థమును గ్రహించువారు చిన్నయసూరి ప్రయోగించిన ప్లుతశబ్దమునకుఁగూడ ఆ యర్థమునే యేలగ్రహింపరాదు ?

"పురాణమిత్యేవ న సాధు సర్వమ్"

సమ్మతమగుచో రెంటిని సమర్థించుట సమంజసము. కాకున్నయెడ ఉభయమును కాదనుట కర్తవ్యము. అంతియగాని, రవంతయు భేదములేక సరితూగుచున్న రెండు విధానములలో నొకరిదానిని గౌరవించి, వేఱొకరిదానిని లఘూకరించుట న్యాయమునకు దూరము. పరిశోధన ప్రసంగములందుఁ బక్షపాతమునకుఁ దావిచ్చినచో తథ్యము తాఱుమాఱగును. ఇఁక వేఱొక యంశము.

'పరుషములకు సరళములగును' 'లకారమునకు రేఫంబగును' మున్నగు వాక్యములలో విధేయములన్నియు ఆదేశముగ వచ్చుటయే పరిపాటి. 'ఆదేశము' లగునని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. బాలవ్యాకరణమున ఆదేశస్థలములందన్నింటను ఆదేశశబ్దము ప్రత్యేకముగ లేకుండఁగనే ప్రక్రియయంతయు సాగియున్నది.

ఈ స్థితిలో నీ సూత్రమున 'ఊకారప్లుతంబగు' ననక 'ఊకారప్లుతంబాదేశంబగు' నని ఆదేశశబ్దమునుగూడఁ బేర్కొనుచున్నాఁడు. ఆదేశస్థలములలో, పెక్కు చోటులందుఁ బ్రయోగింపని దానిని, అక్కఱలేనిదానిని, ఈ సూత్రమునఁ బేర్కొననేల ? ఇట్లు పేర్కొనినతావు లీ వ్యాకరణమున మఱేవేని

గలవా? ఎన్ని? ఎచ్చటెచ్చట? ఆ తావులందు ఆదేశశబ్దమును నధికముగాఁ బ్రయోగించుటలో నుద్దేశమేమయినఁ గలదా? ఏట్టిది? అని పరిశీలింపవలయును.

బాలవ్యాకరణము మొత్తమున ఆదేశకార్యములు చాలఁగలవు. వాని యన్నిటిలో 'ఆదేశ' శబ్దమును బ్రత్యేకించి నిర్దేశించిన తావులు 6 మాత్రమే గానవచ్చును :

తత్సమ-35, 74; ఆచ్ఛిక-38; కారక-35; క్రియా-57, 105. అన్ని తావులందును నాదేశశబ్దము ఉద్దేశపూర్వకముగనే ప్రయుక్తమయి యుండవలయును. ఆ యుద్దేశము నాయాతావులఁ బరిశీలింపుఁడు.

ఈ సూత్రమున డుజ్ఞనకు, ఊకారప్లుత మగునని యింతమాత్రమే చెప్పినచో ఊకారము ఏకవర్ణము గావున సాధారణపద్ధతిని 'అలోఽన్త్యస్య' అను పరిభాష చొప్పున 'డు' వర్ణకమునకుఁ జివరనున్న ఉకారస్థానమున వచ్చును. ఓ విష్ణుఁడూ౩ అను రూపమగును. అది మనకు నభిలషితము కాదు. 'డు' అను మొత్తమునంతను దొలఁగించి దానికి నాదేశముగా ఊకారప్లుతము రావలయును. ఓ విష్ణూ౩ అని కావలయును. కావున డుజ్ఞనకు సర్వాదేశముగా వచ్చునని సూచించుటకే 'ఆదేశ' పదమును ప్రత్యేకించి నిర్దేశించినట్లు కానవచ్చుచున్నది.

**36.** సంబోధనంబునందు బహువచనంబున లారగాగమంబగు. ఉదా.

ఓరాములార; ఓకృష్ణులార.
దీనికిం బాక్షికంబుగ దీర్ఘంబగు :
ఓరాములారా; ఓకృష్ణులారా.

**37.** మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు. ఉదా.

వినుఁడు బాలకులు! వినుఁడు బాలకులార!
వచ్చితిరి కాంతలు! వచ్చితిరి కాంతలార!
'అన్నలార మిమ్ము నడిగెద నొకమాట':
ఇచ్చట మధ్యమపురుషయోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు.

'అన్నలారమిమ్ము....' అను నుదాహరణము ఆటవెలఁది పాదమగుట సుస్పష్టము. ఏ గ్రంథమునందలిదో! స్వీయమయినను గావచ్చును.

'కద్రువ కొడుకుల కడకేగి యేను మిమ్మందఱ వేఁడెద నన్నలార'
(ఆది-2-34)

అను నన్నయార్యుని పద్యభాగమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

నేను, నీవు, వాఁడు అను నర్థములు గల సర్వనామములు (I, you, he; నాన్, నీ, అవన్) ప్రథమ ద్వితీయ తృతీయ పురుషములని ఆంగ్ల రమిళాది వ్యాకరణములు కొన్నిటి వ్యవహారము. ఆ వినికిడిగలవారు కొందఱు పయి వాక్యమున 'మిమ్ము' అని యుండుటంబట్టి మధ్యమపురుష యోగమున్నటులు భ్రమించుట గలదు. ఈ వ్యాకరణమున 'మిమ్ము' అనునది ఏ పురుషమును గాదు.

సంస్కృతాంధ్ర వ్యాకరణములలో 'పురుషములు' అను పేరు క్రియా ప్రత్యయములకుఁగాని సర్వనామములకు లేదు.

పయి వాక్యమున 'అడిగెదను' అను క్రియాపదము, ఉత్తమపురుష మున నుండుటచే సంబోధ్య వాచకమునకు ఉత్తమపురుషయోగమున్నదేగాని మధ్యమపురుషయోగంబులేదు. కావున నిచ్చట 'అన్నలార' అని ఆరగాగమము నిత్యముగనే వచ్చును. ఈ విభాషా సూత్రము ప్రవర్తింపదు. 'ఓ అన్నలు మిమ్ము నడిగెదను' అని యుండదని తాత్పర్యము.

'బాల' శబ్దమునకు సంబోధనమున బహువచనమున 'బాలురార' అను రూపమే లక్షణసాధ్యము. ఈ రూపమున వరుసగా రేఫద్వయము నుచ్చరించు టలోఁ గ్లేశ ముండుటచే నిది యసాధువనియు, ఉచ్చారణ సౌలభ్యముండు టచే 'బాలులార' యనునది సాధువనియు నవీన వ్యాకరణములందుఁ గొన్ని ప్రసంగములు గాననగును. అది వ్యాకరణసరణికాదు. వేఱుమార్గము. ఆద రింపఁదగినదిగాఁ గానరాదు. అదే మార్గమగుచో "సుఖోచ్చారణంబుగలది సుశబ్దంబు" అని ఒక్క సూత్రము రచించినచో వ్యాకరణమునకంతకును ఆ యొక్కటియ సరిపడవచ్చును. అది యటుండనిండు.

బహువచన లకారమునకు రేఫాదేశము కలుగు బాల, నృపాలాదిశబ్ద ములు భాషలో నల్పసంఖ్యాకములు. ఇట్టివాని సంబోధనబహువచనమున లకా రమునో రేఫమునో నిర్ణయించుకవిప్రయోగములు కష్టలభ్యములు.

ఆరగాగమయోగమునఁ బ్రథమాబహువచనరూపము రవంతయయిన మాఱుట, ఏ శబ్దము నందును గానరాదు. సిద్ధమయిన ప్రథమాబహువచనాంత రూపమునకు సంబోధనమున 'ఆర' చేరుట మాత్రమే భాషాలక్షణముగ నెల్ల యెడల గోచరించును.

'బాలురార' 'సుశీలురార' అని యుచ్చరించుటలో నంతటిమహాక్లేశమును గానరాదు. అదియు నుచ్చరింపఁజాలని నాగరక సుకుమారుల నూహించియే కాఁబోలును సూరి శ్రమలేనియొకమార్గమును బరోక్షముగ సూచించియుండెను. ఎట్లన, ఈ సూత్రమున ఆరగాగమ వైభాషికత్వము నుదాహరించుచు 'బాల కులు—బాలకులార' అను శబ్దములు చూపుటలో ఆ సూచన గలదు. "ఉచ్చారణ

శ్లేషమును గణింతురేని 'క' ప్రత్యయమును జేర్చి 'బాలులారా' అని యయిన నసందగునుగాని 'బాలులారా' అని రేఫాదేశము విడువకుండీ" యను హెచ్చరిక యీ 'క' ప్రత్యయమున గర్భితమయి కాననగును.

అట్టి యుద్దేశమే లేనిచో పక్క సూత్రముననే 'బాలురు, బాలురను' అని బాలశబ్దబహువచన రూపములను జూపుచు, అరగాగమ ప్రసక్తి కలిగినచోట బాలశబ్దమున 'క' ప్రత్యయము చేయుదమను సంకల్పము సూరికిం గలుగుటకు కారణాంతరము గానరాదు. యోచింపుఁడు.

**38.** అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తుమీఁది విభక్తిలకారంబునకు రేఫంబగు. ఉదా.

బాలురు, బాలురను, బాలురచేతను; నృపాలురు, నృపాలురను, నృపాలురచేతను.

దయాళుశబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి :

దయాళురు, దయాళురను, దయాళురచేతను.

1. బుద్ధిశాలు'లు' (బుద్ధిశాలి) మున్నగుచోటుల రేఫమురాకుండుటకై సూత్రమున 'అదంత'మనుట.

2. నలు'లు' (నల) ఇత్యాదుల రేఫంబు రాకుండుటకు 'దీర్ఘపూర్వ' మనుట.

3. రాము'లు' (రామ) ఇత్యాదుల రేఫంబు వారించుటకు 'లోపధం' బనుట.

4. బాల'లు' ఇత్యాదుల రేఫవారణమునకు 'మహత్త'నుట.

'దయాళురు' అనురూపమునకు 'కవిప్రయోగము లేదు' అని యొక టీకాకారులు వక్కాణించిరి.

లాక్షణికులు ప్రత్యేకముగఁ బనిఁబూని నిర్దేశించిన ఒక విశేష రూపము, అనంతరకాలికులగు విమర్శకులకుఁ గవిప్రయోగములందు గోచరింపనిచో 'అట్టిరూపముకానరాద'నుట తగినమాటగాని 'లేనేలేద'నుట విదానపుమాట కాదు.

సూరియేగాక కేతనకవియు
"లులమీఁద లులకు రుఙ్గగు
నిలఁబెక్కుట బాలురన మహీపాలురనన్
లలితదయాళురనంగా
వలవడవ ర్తిల్లుఁగాన నభిసవదండీ" —ఆంధ్రభాషాభూషణము-ప. 71.
'దయాళురు'అను శబ్దమును బ్రదర్శించియున్నాఁడు.

ఏలాక్షణికుఁడయినను, కవిప్రయోగసమష్టి నాకళింపఁజాలక, ఉన్నదానిని లేదనుకొనుట సంభవించునుగాని, లేనిప్రయోగమును దాను గన్నటులు నిరూపించుట సాధారణముగా సంభవింపదు.

సూరి తన సూత్రమునకు విరుద్ధమయిన ప్రయోగమును దానుజూడని దానిని జూచినటులు నిరూపించెననుకొనుట సంభావ్యమేకాదు. ఈతఁడు తన పరిశోధనమునఁ బ్రాచీనప్రయోగములలో తత్సమాకారమునకు సంధిలేదను నిర్ణయము తనకుఁగలిగినను "సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు"అని వచించెనేగాని, అట్టి ప్రయోగము లేదనఁడయ్యె. మృగ్యమనఁగా ఇంకను నన్వేషింపవలయునని యర్థము. తమకుఁదేలిన వాస్తవమును మాటుపఱుపరాదు. ప్రాచీనుల ప్రామాణికతా గౌరవమును లఘూకరింపను రాదు. అది విమర్శకుల విలువకు సంరక్షకమగు సరసమార్గము; సకలామోదకరము.

**39.** అమహన్నపుంసకముల కదంతంబులకు మువర్ణకం బగు. టీకా.

వృక్షము, ఋక్షము ; దైవము, కళత్రము, అపత్యము.

క్లీబంబులు మిత్త్రాదులను సూత్రంబునఁ బాక్షికంబుగం బుంలింగత్వం బతిదేశించుటంజేసి మిత్త్రాదిశబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది : ఉ. మిత్త్రుఁడు, మిత్త్రము ; శరణుఁడు, శరణము.

అదంతములగు నమహత్తులకును అదంతములగు నపుంసకములకును మువర్ణకము వచ్చునని యర్థము.

వృక్షము, ఋక్షము ; దైవము, కళత్రము, అపత్యము.

ఈ సూత్రమందలి 'అమహన్నపుంసకములకు' అనుపదమును కర్మధారయముగ భ్రమించి 'అమహత్తులయిన నపుంసకములకు మువర్ణకమగు'నని గుప్తార్థప్రకాశికాకారులు వ్యాఖ్యానించిరి.

అమహత్తులకును నపుంసకములకును వేఱువేఱుగా మువర్ణకము రావలయుంగావున సూరితలంపులో సూత్రమందలిది ద్వంద్వసమాసముగాని కర్మధారయముకాదని క్రీ॥శ॥ 1915 సం॥ ప్రాంతమున మా గురువులు వజ్ఝలవారు పత్త్రికలలోఁ బ్రతిపాదించిరి.

దానిపయిని వాదోపవాదముల మచ్చరము పెచ్చుపెరిఁగి యావేశములతో నప్రస్తుతములతో విరామములేకుండ రెండువత్సరములకాలము మధ్యవర్తులగు మహామహోపాధ్యాయులు తాతా సుబ్బరాయశాస్త్రులవారి మందలింపులతోఁ

బత్త్రికలలో దీర్ఘమగు చర్చలు తీవ్రముగా సాగినవి. ఆ వాదగ్రంథము పెక్కు పుటలు వారి గుప్తార్థప్రకాశికాంతమునను, వీరి వ్యాకరణసంహితా సర్వస్వమునను ముద్రితమయి యిప్పటికిని గాననగును.

ఆ వాదముల పర్యవసానమున ప్రకాశికాకారులు పట్టుపీడకున్నను, సూరిదృష్టిలో నది ద్వంద్వసమాసమేయని పండితమండలి పరిష్కరించినది. ఆ పరిష్కారము సమంజసము. సర్వలక్ష్యసంగ్రాహకము.

ఆ కాలమునకు సూరి రచించిన సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణము ప్రకటింపఁబడియుండలేదు. అది వెలువడియేయున్నచో, ఆ వాదములెల్లను నొక్కమాటతో అట్టె నిలిచిపోయెడివి.

ఆ వ్యాకరణమున " అమహత్ క్లీబాభ్యాం సో ర్ముః " అని సూరి సూత్రించియుండెను. ఇందలి ద్వివచనమునుబట్టి 'అమహన్నపుంసకములకు' అనునది ద్వంద్వమేయను సూరి యుద్దేశము తేటతెల్లమగుచున్నది. ఈసూత్రము ఆనాఁడే బయటఁబడి, 'యీశ్వరుపేరు' వంటి యిందలి ద్వివచనమే కంటఁబడినచో ఆ వాదప్రతివాద సంరంభస్ఫుటాటోపములు క్షణములో సద్దుమణఁగి యుండెడివి. చిన్నయసూరీయమగు ఈ సంస్కృతసూత్రము మఱుఁగువడి యుండుటచేఁ దత్త్వనిర్ణయమునకుఁ బెద్దలు పలువురు పెక్కురీతులఁ బ్రయాస పడక తప్పినదికాదు. గోరంబోవుపని గొడ్డంటం దీర్పవలసివచ్చినది.

ఈ సూత్రమున 'అదంతములకు' అనువిశేషణములేకున్నచో, ఈ మువర్ణకము వువర్ణకముకంటె (48 సూ.) విశేషవిహితమగునుగావున 'తరు' మున్నగు నమహత్తులకును 'మధు' మున్నగు నపుంసకములకును మువర్ణకమే రావలసి వచ్చును. అట్టిచోట్ల ఈ మువర్ణకము రాకుండుటకే యీ సూత్రమున అదంత విశేషణము.

సహజాదంతములకేగాక కృత్రిమాదంతములకును ఈ మువర్ణకము రావచ్చును. కావుననే 'జగత్' అనుశబ్దమునకు, తకారము లోపించిన పిమ్మట 'జగ' అను అకారాంతత్వమునుబట్టి మువర్ణకముకలిగి 'జగము' అనిసిద్ధించినది (చూ. తత్సమ-79).

ఇటులే 'శ్రీమంతమ్' ఇత్యాదులందు మకారము లోపించినపిమ్మట 'శ్రీమంతము' మున్నగునవి నిష్పన్నములయినవి (చూ. తత్సమ-71).

ఇట్లయినచో కృతహ్రస్వములగు విద్య, లత మున్నగు స్త్రీలింగములు, అదంతామహత్తులగుటంబట్టి మువర్ణకము ప్రాప్తింపదా యందురేమో ! ప్రాప్తింపకపోదు. ప్రాప్తించినను స్త్రీలింగప్రథమైకవచనమునకు లోపవిధాన ముండుటచే ఆ మువర్ణకము లోపింపవచ్చును. విద్య, లత మున్నగురూపములు నిర్బాధముగా సిద్ధింపవచ్చును.

అకారాంతత్వము మొదటలేక, ఆ పిమ్మట ప్రక్రియవలన నేర్పడినను, నట్టిశబ్దములకు ముపర్ణకము రావచ్చునని పయి లక్ష్యములు తెలుపుచున్నవి.

అంతియగాక, సంస్కృతప్రాతిపదికమును మొట్టమొదట అకారాంతత్వముండి, పిమ్మట వికృతిలో నది మాఱినను, అట్టిశబ్దములకుఁగూడ ముపర్ణకము రావచ్చునని మఱికొన్ని రూపములు తెలుపుచున్నవి. అన్నెము, పున్నెము, గాము, గీము — ఇవి ప్రకృతిదశలో అన్య, పుణ్య, గ్రహ, గృహ అని అకారాంతములేగావున వికృతిదశలో అన్నె, పున్నె, గా, గీ అని మాఱినను, ప్రకృతిగతమగు అకారాంతత్వమునుబట్టి వీనికి ముపర్ణకము గలుగుచున్నది.

పయినిజూపెనరూపముల పర్యాలోచనముచే ముపర్ణకముఁరాఁదగినశబ్దము ఎపుడేనొకపుడు అదంతమయినఁజాలునని తేలుచున్నది.

అన్నెము మున్నగు తద్భవములలో ముపర్ణకసిద్ధికి నింకొకమార్గము గూడ గోచరించును.

తద్భవములు కేవల సంస్కృతప్రాతిపదికములనుండిగాని, తత్సమప్రాతిపదికములనుండిగాని యుద్భవించుట సహజముగాదు. సంస్కృతప్రాతిపదికములనుండి ముందు తత్సమపదము లేర్పడును. తత్సమ పదములనుండి తద్భవములు పుట్టును. అనఁగా, తత్సమపదములు పెక్కుమందినోటఁ జిరకాలము నలఁగినలఁగి క్రమేణ స్వాభావికములగు వర్ణవికారముల నందుచు వేఱురూపుదాల్చుట స్వాభావికము. అవియే తద్భవములు.

ప్రత్యయాంతములగు పదములనే లోకులు వాడుదురు. ప్రాతిపదికము లను వాడరు. 'అన్యము' అను ప్రత్యయాంతపదమునకు లోకమున వ్యవహారముండునుగాని 'అన్య' అను ప్రాతిపదికమునకు వ్యవహారముండదు. కావున 'అన్యము' అను పదమునుండి 'అన్నెము' అను పదము పుట్టునుగాని 'అన్య' అను ప్రాతిపదికమునుండి 'అన్నె' అను ప్రాతిపదికము పుట్టదు. అది పుట్టినపుడుగదా దానికి ముపర్ణక మెట్లుకలుగునని ప్రశ్న ! 'అన్యము' అనుదానినుండి ముపర్ణకసహితముగనే తద్భవముపుట్టుట స్వాభావికమయినపుడు దీని ముపర్ణకమునుగూర్చినచింత మనకక్కఱయేలేదు.

"అన్నెము, పున్నెము" మున్నగు అదంత భిన్నములకు ముపర్ణకము సిద్ధించుటకుఁ బయినిజూపిన మార్గములలో నేదియయినను సమర్థకము కాఁగలదు.

ఇటులుండ ఈ సూత్రమున 'అదంతములకు' అనువిశేషణము అన్నెము మున్నగు రూపములసిద్ధికి ప్రతిబంధకమగుచున్నదని యొక టీకాకారు లభిప్రాయపడిరి. కాని పయిని వివరించిన మార్గమున ఏరూపములు సిద్ధించుటకును విది ప్రతిబంధకము కాదని గ్రహించునది.

**40.** వానికి మువర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు. ౪౦.

వృక్షములు - వృక్షమును; ఋక్షములు - ఋక్షమును.

వానికనఁగా బ్రథమైకవచనమున మువర్ణకము 'వినఁబడు' వానికని యర్థము.

విద్య మున్నగు శబ్దములకుఁ బ్రథమైకవచనమున మువర్ణకము వినఁబడదుగాన నట్టివానికి ముగాగమము ప్రవర్తింపదు. పయిరీతి నర్థము గ్రహింపక 'వానికి' అనుశబ్దముచేఁ బూర్వసూత్రోపాత్తములగు నదంతామహత్తులను, అదంతనపుంసకములను సాధారణరీతిని గ్రహించినచో విద్యాలు, లతలు మున్నగునవి అదంతామహత్తులగుటచే వానికిఁగూడ ముగాగమము రావలసి వచ్చును.

కావున, ఏ శబ్దములకుఁ బ్రథమైకవచనమున 'ము' వర్ణకము ప్రాప్తించుటమాత్రమేగాక యది స్థిరమై వినఁబడునో యట్టిశబ్దములకే ముగాగమము కలుగునని సూత్రకారుని యాంతర్యము నూహింపవలయును.

**41.** మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు. ౪౧.

మువర్ణకంబునకు విధించు లోపాదేశాది కార్యములు ముగాగమమునకు సహితము వచ్చునని యర్థము.

i. చరిత్రాది మువర్ణక'లోపము': చరిత్రవలెనే చరిత్రలు (తత్స.-58).
ii. మకారద్విత్వ బిందుపూర్వక బువ'ర్ణాదేశ'ములు: వృక్షము, వృక్షంబువలెనే వృక్షమ్ములు, వృక్షంబులు (తత్సమ-42).
iii. పుంప్వాదేశము: సరసపువచనము, సరసంపువచనమువలెనే సరసపువచనములు, సరసంపువచనములు (సంధి-32).

**42.** మువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వక బువర్ణంబేని విభాషనగు. ౪౨.

వృక్షమ్ము - వృక్షంబు; ఋక్షమ్ము - ఋక్షంబు.

పూర్వసూత్రముచేత ముగాగమమున కీకార్యంబగు:

వృక్షమ్ములు - వృక్షంబులు; ఋక్షమ్ములు - ఋక్షంబులు.

**43.** లులనలు పరంబులగునపుడొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు. ౪౩.

వజ్రాలు, వజ్రాలను, వజ్రాన ;
పగడాలు, పగడాలను, పగడాన.
ఒకానొకచో(ట)ననుటచే నీకార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు
సూచింపంబడియె.

ఇచటి 'టు' ప్రత్యయము. 'ల' ఆగమము. 'న' 'ఉభయము'. కావుననే కయ్యానన్, భిక్షానన్ అనువానివలె, కయ్యానకున్, భిక్షానకున్ ఇత్యాదులు సయితము సిద్ధములగును.

"అర్జునునకుఁ గూర్తురు 'కయ్యాన' కోర్తురు" —(ఉద్యోగ-4-266).
"ఒకఁడనే 'భిక్షానకున్' వత్తునో" —(భీమేశ్వర-2-120).

ఈ సూత్రమున లోపదీర్ఘములు సన్నియోగశిష్టములు. రెండును గలిసియే ప్రవర్తించును.

"సన్నియోగశిష్టానాం సహవా ప్రవృత్తిః సహవా నివృత్తిః"
అని పాణినీయ పరిభాష.

జంటగా విధింపఁబడిన కార్యములు వచ్చినచోఁ గలిసియే వచ్చును. మానినచోఁ గలిసియేమానును. విడిపోవు. అని యీ పరిభాషకుఁ దాత్పర్యము. ఈ జంటలో నొకటివచ్చి యొకటి రాకున్నచో వజ్రలు, వజ్రాములు మున్నగు కురూపములు సంభవించును.

ఈ సూత్రము తత్సమాచ్ఛిక సాధారణము. ఆ సూచనకే 'పగడాలు' అనికూడ నుదాహరించుట.

చింతామణికారులును, ఈ కార్యము సార్వత్రికముకాదని తలంచి :
"వికృతౌ 'క్వచిచ్ఛ' లోపో మోః దీర్ఘశ్చాత ఆదిమస్య భవేత్"
అని క్వాచిత్కముగనే దీనిని విధించిరి. సూరియు దీనికిఁ బ్రయోగవైరళ్యమునే వక్కాణించెను. ప్రయోగసరణి పరికించినను నిది విరళముగనే గోచరించును.

ఇటులుండ ఈ రూపములు ధారాళముగాఁ గలవనియు, విరళములని సూరియనుట యుక్తముకాదనియు నాక్షేపించిన టీకాకారులు ఒకరు గలరు. సూరినే పేరెత్తియన్నను బయిని జూపినకారికలోఁగూడ ఇది క్వాచిత్కముగనే విధింపఁబడియుండుటచే నీయాక్షేపము చింతామణికారులకును జెందవలసియే యున్నది. ఇట్టిప్రయోగములు 'ఇన్ని'అని సూత్రకారులు వ్రేళ్లమడచి లెక్కించియుండరు. స్థూలదృష్టితోఁ బ్రతిపాదింపఁబడిన యిట్టియంశములపయి నాక్షేపములు నిరాధారప్రసంగములు. ఆ ప్రయోగములు విరళములుగాక బహుళములేయని యాక్షేపించువారికిఁగూడ నట్టిస్థూలదృష్టియేతప్ప నిష్కృష్టమగు నాధారాంతరము లేదాయెను. ఇంతమాత్రమునకు సూత్రకారులమాట 'అయుక్త' మనవలసినంతటిపని కానరాదు.

ఈ సూత్రమున 'ఒకానొకచో' అని కలదు. వృత్తియందు "ఒకానొక చో'ట' ననుటచే" అని టకారమధికముగనున్నది. తొలిముద్రణమునుండి 'ట'కార మన్నిప్రతులందును నగపడుచున్నది. అర్థభేదము లేదుగాని అనుకరణసందర్భమున (Quotation) సూత్రమునలేని టకారమును వృత్తి యందు సూరి లిఖించియుండునాయని సంశయింపవలసినయంశము. ఈ 'ట'కారము ముద్రాపకప్రక్షిప్తమయి యుండనోపును.

ఇటులే యనుకొననేల? సూత్రమునసుండిన 'ట'కారము ముద్రణమున తొలఁగియుండనోపునని యూహింపరాదాయని కొందఱడుగుదురేమో! ఆ యూహ సరిపడునదికాదు.

'ఒకానొకచో' అనుశబ్దము ఇచటనేగాక బాలవ్యాకరణమున సరిగా మఱి పదిసూత్రములయందుఁ గలదు. అందెచ్చటను 'ట'కారములేదు. దానింబట్టి దీనిని టకారరహితముగఁ బ్రయోగించుటయే సూత్రకారుని యభ్యాసముగా నిర్ణయింపవచ్చును.

కాఁగా ఈ 'ట'కారము వృత్తియందు ప్రక్షిప్తమయినదేగాని సూత్రము నుండి విక్షిప్తమయినదికాదు. కావున ఈ వృత్తియందు 'ఒకానొకచోననుటచే' అని 'ట'కారరహితముగా నుండుటయే సముచితమని తోఁచెడిని.

**44. ఇ గ్లౌ రా యు గం తం బు ల ప్రథమైకవచనంబునకు లోపంబగు. ౪౪.**

> ఇకారాంతములకు గ్లౌ రై శబ్దములకు మఱి యుగాగమాంతంబు లకుం బ్రథమైకవచనలోపంబగు.
>
> హరి; గిరి; శ్రీ; ధీ.

i. ఐ, ఔ, ల క్రమమునుబట్టి యీసూత్రమున 'రైగ్లౌ' అనుట ఉచిత ముగాఁ గన్పట్టును. అకారాంతములు, ఇకారాంతములు అనుక్రమములో శబ్దములప్రక్రియను జూపుచు 64వ సూత్రమున "రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాషనగు" అని యా క్రమమునే సూరి పాటించియుండెను. ఉచితమగు నా క్రమమును ఈసూత్రమున మార్పనేల?

ii. మఱియు, నిచటి వివరణవాక్యమున, ఊఁతపదమువోలె 'మఱి' అనుశబ్దమెందులకు? అని ప్రశ్నించుకొని యోచింపుఁడు.

i. క్రమపరిపాలనమునకయి సూత్రమున 'రైగ్లౌ' అన్నచో నచ్చటి సంస్కృతసంధిచే 'రైగ్లావుగంతంబుల' అని సిద్ధమగును. బాలవ్యాకరణప్రక్రి యలో 'వుగాగమము' ప్రసిద్ధమైనది యొకటికలదు (తరువులు, ధేనువులు, మొ.). ఆ'వుగాగమ'మేమోయనుభ్రమ బాలురకుఁ గలుగరాదు. 'గ్లౌరై'అని

తిరుగవైచి సంధిచేసినచో 'యుగంతంబుల' అయినది. 'యుగంత'మనునది యీప్రక్రియలో నెచ్చటను లేనిదగుటచే నిపుడెట్టిభ్రాంతికిని దావులేదు.

ii. ఇటులే వివరణవాక్యమున 'మఱి' అనుశబ్దము లేనిచో 'నుగాగమాంతంబులకు' అని యేర్పడును. నుగాగమములు పెక్కులు బాలురకుం బరిచితములగుటచే, నట్టిస్ఫురణకలిగి నుగాగమభ్రాంతి సంభవించును. నడుమ 'మఱి' అనియున్నచో నట్టిభ్రాంతి లేశమును సంభవింపదు.

వైశద్యమునకయి పదములకూర్పునందుసయితము సూరి మెలంకువ యెట్టిదో గమనింపుఁడు.

ఈ సూత్రముచేఁ బ్రథమైకవచనలోపముఎలెనే 56వ సూత్రముచే వృద్ధాదులకు డుఙ్లోపమును, 58వ సూత్రముచే, చరిత్రాదులకు మువర్ణక లోపమును విధింపఁబడినవి. ఇట్టిప్రథమైకవచనలోపమే రాఁదగిన మఱికొన్నిటికి, అనఁగా దూతాదులకును (61), విశ్వకర్మాదులకును (75), బ్రహ్మశబ్దమునకును (76), ఆత్మేమనిజంతములకును (77 మహిమ) స్త్రీత్వాతిదేశము కావింపఁబడినది.

వీని యన్నిటను బ్రథమైకవచనలోపమే యపేక్షితముగాన, ఏకరూపముగ, ప్రథమైకవచనలోపమునో, స్త్రీత్వమునో విధింపక కొన్నింట నదియుఁ గొన్నింట నిదియు రెండువిధముల విధానములేల ? అని యొక స్థూలశంక యిటఁ బొడమవచ్చును. కాని, ఏకరూపవిధానములోఁ జిక్కులు గలవు.

ఇకారాంతములకు, గ్లౌ, రై శబ్దములకు, వృద్ధాదులకు, చరిత్రాదులకు, ప్రథమైకవచనలోపమును విధింపక స్త్రీత్వమునతిదేశించినచో, ఈ యతిదేశ సూత్రమేగాక స్త్రీలింగ ప్రథమైకవచన లోపవిధానసూత్రము (57) గూడఁ బ్రవర్తించినంగాని, హరి, గిరి, గ్లౌ, రై, వృద్ధు, మూర్ఖు, చరిత్ర, చరిత మున్నగురూపములు సిద్ధింపవు. ఒక్కసూత్రముచేతనే రూపసిద్ధియగు లఘుమార్గము విడుచుకొని, రెండుసూత్రములచే సాధించు ప్రక్రియాగౌరవమేల ? అను నూహతో నీతావులందు స్త్రీత్వము నతిదేశింపక ప్రథమైకవచనలోపమునే విధించియుండెను. మఱియు, వృద్ధాదులలో ప్రక్రియాగౌరవము మాత్రమేకాదు. అచ్చటస్త్రీత్వమున్నచో ఉత్వముప్రాప్తింపక వృద్ధు మున్నగురూపములే సిద్ధింపవు.

ఉగంతములవిషయమున నింతకన్నను నెక్కువచిక్కు సంభవించును. వానిలో రుక్కు, వీరుత్తు మున్నగు స్త్రీలింగములును గొన్నిగలవు. స్త్రీలింగములకు స్త్రీత్వాతిదేశము అనావశ్యకమై యనుపపన్నమగును. అది యెటులోసరిపుచ్చుకొన్నను, స్త్రీత్వమునుబట్టి వీని ప్రథమైకవచనము లోపించుటయే దుర్ఘటము.

ఏలయన, ఇవియెల్ల ఉకారాంతములుగాన "ఉకారాంతగోశబ్ది...." సూత్రము
నందు 'అంతట'ననుటచే స్త్రీలింగప్రథమైకవచనలోపము బాధితమయి 'వు'
వర్ణకమే నిలిచియుండును. రుక్షువు, రాట్టువు లోనగు సపశబ్దములే యేర్పడును.
కావున వీనియందెల్లఁ బ్రథమైకవచనలోపమే విధించుట కర్తవ్యము.

ఇఁక మాతాదులు మున్నగువానికి స్త్రీత్వమునకు మాఱుగాఁ బ్రథమైక
వచనలోపమునే విధించినచో ఋజ్జులోపించినను, ఉత్వము (21) దుర్నివారమయి
మాతు, విశ్వకర్మ, బ్రహ్మ, ఆత్మ మున్నగురూపములు ప్రథమైకవచనమున
సంభవించును. స్త్రీత్వము విహితమైనచో ఉత్వము ప్రాప్తింపదు. కాఁగా,
మాత మున్నగు సురూపములు సుసాధములగును. అనునీయూహతోఁ బ్రథ
మైకవచనలోపము గొన్నింటను, స్త్రీత్వము గొన్నింటను విహితమయినటులు
వివేచింపఁదగును. అదియటుండనిండు.

ఇ, గ్లౌ, రా యుగంటములలో శ్రీ, ధీ, రుక్షు మున్నగు కొన్ని స్త్రీలింగ
ములు గలవు. వానిలోఁ బ్రథమైకవచనలోపము "స్త్రీలింగంబుల ప్రథమైక
వచనంబునకు లోపంబగు" (57) అను సూత్రముచేఁ జేయుటయుచితమా?
ప్రకృత సూత్రముచేఁ జేయుటయుచితమా? రెండు సూత్రములలో నేది
విశేషవిధాయకము? అను జిజ్ఞాస యిటఁ గలుగవలయును.

అకారాంతమా, ఇకారాంతమా, ఉకారాంతమా అను ప్రశ్నలేకుండ,
స్త్రీలింగము లన్నిటియందును బ్రవర్తించు 'స్త్రీలింగ .... ప్రథమైకవచన ....'
సూత్రము సాధారణమనియు, ఇకారాంతములందును, ఉదంతములలో ఉగాగ
మాంతములందుమాత్రమే ప్రవర్తించు ఈ 'ఇగ్లౌ'సూత్రము విశేషవిధాయక
మనియు సూరి తలంచియుండెను. ఆ తలంపే సమంజసమని వ్యాఖ్యాతలును
సమ్మతించియుండిరి. కావుననే సూరియు, వ్యాఖ్యాతలును 'రుక్షు' మున్నగు
ఉగాగమాంత స్త్రీలింగములలో (68) 'ఇగ్లౌ' సూత్రమునే ప్రవర్తింపఁజేసి
ప్రక్రియను బ్రదర్శించియుండిరి. వీరు స్థూలదృష్టితో స్త్రీలింగ సూత్రమునే
విశేషవిధిగా భావించి, దానిచేతనే లోపము చేయఁదలంచిరేని 'రుక్షు'మున్నగు
రూపములు సాధించుట శక్యమేకాకపోయెడిది. ఏలయందురా?

"ఉకారాంతగోశబ్ది"సూత్రమున 'అంతట'నను పదముచే స్త్రీలింగ
ప్రథమైకవచనలోపము బాధితమయి 'వు'వర్ణకము స్థిరమయి 'రుక్షువు' అగును
గాని 'రుక్షు'కానేరదు.

కావున సూరి యీ యంశములనెల్ల నాలోచించి 'ఇగ్లౌ'సూత్రమును
విశేషవిధిగా భావించుటయు 'రుక్షు'మున్నగు రూపములకు సులభమగుసాధనము
కల్పించుటయు 'శ్రీ, ధీ' శబ్దములను స్త్రీలింగసూత్రమునఁగాక 'ఇగ్లౌ'సూత్రము

వనే యుదాహరించుటయు మిక్కిలి సమంజసము. ఆతనితలంపు గుఱుతించి వ్యాఖ్యాతలామార్గమునే యనుసరించుటయు సముచితము.

కాని, యీవ్యాఖ్యాతలలోఁ గొందఱు ఒకివంకి ఉగాగమాంతములగు 'రుక్షు' మున్నగుతావులందు స్త్రీలింగసూత్రముకంటె 'ఇగ్లో' సూత్రమే విశేష విధియని సమ్మతించి 'రుక్షు' అనుచో 'ఇగ్లో'సూత్రముచేతనే ప్రథమైకవచన లోపము చూపుచు, స్త్రీలింగములగు శ్రీ, ధీ శబ్దములను సూరి స్త్రీలింగసూత్రమున నుదాహరింపవలయునుకాని, 'ఇగ్లో'సూత్రమున నుదాహరింపరాదని దోష మెంచుట తాము నిరూపించిన పూర్వాపరప్రక్రియకే విరుద్ధము.

ఇట గిరి, శ్రీ, ధీ శబ్దములకు డు, ము, వు, ల లో నేదియుఁ బ్రాప్తింప కున్నను, పదత్వసిద్ధికయి సంస్కృత 'సు' ప్రత్యయము చేసికొని, దానిని లోపింపఁజేయవలయునని సూరియుద్దేశము. తక్కినచోటులందెల్లఁ బ్రయోజన విశేషము లేకుండుటచే సు, ఔ, జస్ మున్నగు సంస్కృతవిభక్తిప్రత్యయము లను స్థానులుగా నిరూపింపక క్లేశము తగ్గించుటకయి ప్రాతిపదికలకు సాక్షాత్తుగాఁ దెలుఁగు విభక్తులనే విధించి సూరి ప్రక్రియ సాగించియుండెను.

ఈతఁడు తన సూత్రాంధ్ర వ్యాకరణమున 'డు, ము, వు, ల వస్సుసః, — అసోనః' ఇత్యాదిగాఁ జింతామణియందువలెఁ దొలుత సంస్కృత విభక్తులనే చేర్చి, వానిస్థానమున డుజాదులను విధించు ప్రణాళికనే యుపక్ర మించియు, నందలి నిరర్థక క్లేశమును బర్యాలోచించి, బాలవ్యాకరణమున ఆ మార్గము నుజ్జగించి తెలుఁగువిభక్తిప్రత్యయములకు సాక్షాద్విధానమునే యవలంబించినటులూహింపవలయును.

**45.** ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు. ఆఽ.

హరులు; గిరులు; కవులు; రవులు; యామినులు; భామినులు.
తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబులేదు :
శ్రీలు; స్త్రీలు; లకోరీలు.

దీర్ఘమునకుత్వమురాదని చూపుటకు 'శ్రీలు, స్త్రీలు' అనునవిమాత్రమే చాలియున్నను 'లకోరీలు'అనుదానింగూడఁ జూపుట యీ సూత్రము తత్సమే తరంబులందుఁగూడ ప్రవర్తించునని సూచించుటకు.

అచ్ఛికములందుఁగూడ నీ యుత్వము ప్రవర్తించును కావుననే జిగులు, నిసులు, విరులు, సరులు మున్నగునవియెల్ల నీ సూత్రమువల్లనే సిద్ధించును.

తత్సమసూత్ర మేదయిన నాచ్ఛికములందుఁగూడఁ బ్రవర్తింపవలసి నపుడు ఆ యంశము నేదోయొకరీతిని సూచించుట సూరిపరిపాటి. తక్కిన చోటులు గమనింపుఁడు.

తపరకరణమునఁగా తకారము పరముగా నుండుట.

"తపరః తత్కాలస్య"

'దేనికొనను తకారము గుఱుతుగా జెప్పఁబడునో, అది దానిమాత్రమే బోధించును'

అని యీ సంజ్ఞాసూత్రమునకుఁ దాత్పర్యము.

సాధారణముగా 'అకార'మన్నచో 'అ, ఆ' అను హ్రస్వదీర్ఘములు రెండును 'ఇకార'మన్నచో ఇ, ఈ అను హ్రస్వదీర్ఘములు రెండును గ్రహితములు కావచ్చును. 'అత్, ఇత్' అన్నచో అ, ఇ అను హ్రస్వములుమాత్రమే గ్రహింపఁబడును.

**46.** వికృతియం దికారాంతముల యుపోత్తమేత్త్వంబునకు బహువచనము పరంబగునప్పు డుత్త్వంబగు. ౪౬.

ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు.

కలికి....కలుకులు; ములికి....ములుకులు; చెలిమి....చెలుములు; బలిమి....బలుములు.

ఉపోత్తమేత్త్వంబునకనుటం జేసి 'జిగి, నిసి' ఇత్యాదులందుత్త్వంబు లేదు : జిగులు, నిసులు.

ఇది యాచ్ఛికశబ్దములందుమాత్రమే ప్రవర్తించు సూత్రముగాన అచ్ఛికపరిచ్ఛేదముననే యుండఁదగినది. అయినను ఇత్త్వమునకు ఉత్త్వమువిధించు సూత్రములన్నియు నొక్కచో నుండుటలోని జ్ఞప్తిసౌకర్యము నాలోచించి యీ ప్రకరణమునఁ జేర్చినటులూహింపఁదగును.

"త్ర్యాదీనా మన్త్య ముత్తమమ్"

మూఁడుగాని యంతకుమించిగాని వర్ణములుగల శబ్దములందు తుది వర్ణము ఉత్తమము. దానిసమీపము ఉపోత్తమము.

'జిగి, నిసి' అనునవి ద్వ్యక్షరములయిమాత్రమేయగుటచే వానిలో ఈ సూత్రము ప్రవర్తింపదు.

**47.** రలడోపధ నవార్థాదుల యుపోత్తమేత్త్వంబున కుత్త్వంబు గలుగదు. ౪౭.

పందిరి .... పందిరులు; పిడికిలి .... పిడికిళులు; రాపిడి .... రాపిడులు; తొమ్మిది .... తొమ్మిదులు.

"మేలైన రెండు 'తొమ్మిదులు' విద్యలలోన" —కాశీఖండము-3-181.

48. ఉకారాంత గోశబ్దంబుల కంతట పువర్ణకంబగు. ఉదా.

తరువు; ధేనువు; మధువు; గోవు.

అంతటననుట స్త్రీలింగప్రథమైకవచనలోపబాధనార్థము.

ఈవిధి మూఁడులింగములందును వచ్చునని నిరూపించుటకయి ఉకా రాంతములకు నుదాహరణములు మూఁడు చూపఁబడినవి.

పుంలింగములలో, అకారాంతములకు రామశబ్దమును, ఇకారాంతములకు హరిశబ్దమును, ఉకారాంతములకు విష్ణుశబ్దమును, స్త్రీలింగములలో, ఆకా రాంతములకు రమాశబ్దమును, ఈకారాంతములకు శ్రీ, లక్ష్మీ శబ్దములను, ఈ రీతినిసాధారణముగా దేవతావాచకములనే ప్రథమోదాహరణములుగాఁ జూపు దృష్టిగల సూరి యీసూత్రమునఁ బుంలింగోదాహరణముగ విష్ణుశబ్దమును జూపక 'తరు'శబ్దమును జూపుటకు హేతువుగలదు.

"ఉకారాంతంబగు మహత్తునకు పువర్ణకము బహుళముగానగు" (50) అని మహద్వాచకములకు పువర్ణకము పాక్షికముగ మీఁద విధింపఁబడఁగలదు. 'విష్ణు' మున్నగునవి దానికి లక్ష్యములగునుగాని, ప్రకృతనిత్యసూత్రమునకు లక్ష్యములు కానేరవు. కావున నిట నమహత్తగు 'తరు' శబ్దమును జూపవలసి వచ్చినది.

'ధేనువు' మున్నగు స్త్రీలింగశబ్దములలో

"స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు"

నను సూత్రము ప్రవర్తింపకుండ వారించుటకును, నచటఁగూడ 'పు' వర్ణకము శ్రూయమాణమగునని తెలుపుటకును సూత్రమున 'అంతట' యనుపదము ప్రయుక్తమయినది.

'చిగురు' మున్నగుశబ్దములు స్త్రీసమములుగాని స్త్రీలింగములు కావు. పయి 'స్త్రీలింగప్రథమైకవచనలోప బాధనార్థము' అనుచోట స్త్రీలింగములగు తత్సమశబ్దములకేగాని, స్త్రీసమములగు ఆచ్ఛికశబ్దములకుఁ బరామర్శము లేదు. కావుననే 'చిగురు' ఇత్యాదులందుఁ బ్రథమైకవచనము లోపించుటకుఁ బ్రతిబంధకము లేదు. ఈభావము పయివాక్యమున 'స్త్రీలింగ'శబ్దమున నిగూఢ ~ యియున్నది.

మఱియు, హలంతములలో ఉగాగమాంతములలో 'రుక్కు' మున్నగు శబ్దములు స్త్రీలింగములే యయినను, నచటి ప్రథమైకవచనలోపమునుగూడ, ఈ 'అంతట'శబ్దము వారింపదు. ఏలయన

'రుక్కు' మున్నగువానిలోఁ బ్రవర్తించునది ఉగంతప్రథమైకవచన లోపముగాని, స్త్రీలింగప్రథమైకవచనలోపము కానేకాదు. 'అంతట'ననుటచే వారింపఁబడునది 57చే విధింపఁబడు స్త్రీలింగప్రథమైకవచనలోపము మాత్రమే.

కాఁగా, స్త్రీసమశబ్దములు గాక స్త్రీలింగశబ్దములకు బహ్వర్థము మాత్రమే 'అంతటి' శబ్దముచే బాధింపఁబడును. స్త్రీలింగములందంతటను "స్త్రీలింగంబుల...." (౫౭) అను సూత్రముచే విధింపఁబడిన లోపము మాత్రమే బాధింపఁబడును. సూత్రాంతరప్రాప్తములు బాధింపఁబడవు. కాఁబట్టియే 'చిగురు, బొట్టు' ఇత్యాదులు నిరపాయముగ సిద్ధించును సూత్రకర్తృ యాంతర్యము.

**49.** డువర్ణకేతరవిభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు. ౪౯.

తరువులు, తరులు; ధేనువులు, ధేనులు; గోవులు.

**50.** ఉకారాంతంబగు మహత్తునకు డువర్ణకము బహుళముగా నగు. ౫౦.

విష్ణువు, విష్ణుఁడు; శంభువు, శంభుఁడు; వసువు, వసుఁడు.

**51.** కద్రువ నాగమాత. ౫౧.

కద్రువ, కద్రువలు; కద్రువను, కద్రువలను.

**52.** ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబునగు. ౫౨.

భ్రాత; జామాత; కర్త; భర్త; హర్త; గంత; హంత.

హంతకుఁడు, అనురూపము సాధువుకాదు.

**53.** విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు. ౫౩.

విధాత, విధాతృఁడు; ధాత, ధాతృఁడు; దాత, దాతృఁడు; సవిత, సవితృఁడు; నేత, నేతృఁడు.

స్త్రీవద్భావమునుబట్టి స్త్రీలింగప్రథమైకవచనలోపము కలుగును. (౫౭)

**54.** నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు. ౫౪.

రమా....రమ; వనితా....వనిత; విద్యా....విద్య;
లక్ష్మీ....లక్ష్మి; సేనానీ....సేనాని.
ఇట్లు కృతహ్రస్వములకు హ్రస్వాంతములకుఁబోలెఁ గార్యంబగు:
లక్ష్ములు; సేనానులు; సిరులు.

ఈ కార్యము తత్సమమాత్రవిషయకము.

తత్సమాచ్ఛికపరిచ్ఛేదవిభజనప్రకారమునుబట్టి తత్సమేతరములందు ఈ హ్రస్వమునకుఁ బ్రాప్తికలుగదు. కావున 'సవలా', 'లకోరీ' ఇత్యాదులందు హ్రస్వమునకుఁ బ్రసక్తియేలేదు.

చింతామణిలో అజంతహలంతవిభజనమేగాని తత్సమాచ్ఛికవిభజనము లేకుండుటచే దేశ్యములందుసయితము హ్రస్వము ప్రాప్తించుటవలన దానిని వారించుటకు 'నచదేశ్యపదే' అని ప్రత్యేకముగ నిషేధమును విధించుకొనవలసి వచ్చినది. ఆ నిషేధప్రయోజనము బాలవ్యాకరణమునఁ బ్రకరణవిభజనము వల్లనే సిద్ధించుటచే, ఆ నిషేదసూత్రమిట ఆవశ్యకముకాకుండుటచే నుపేక్షింపఁ బడెను.

మఱొక చిన్నయంశము :

శ్రీః....సిరీ ...సిరి. —బాల-సంజ్ఞా-19.

ప్రాకృతసమములుగూడఁ దత్సమములేగాన 'సిరీ' అనుచోఁ దత్సమ కార్యమగు నీ హ్రస్వము ప్రవర్తించునని తెలుపుటకు 'సిరులు' అనుపదము చూపఁబడినది.

సిరి, రాణి, అగ్గి, ఓలి, జడ, మేర మున్నగునవి ప్రాకృతతుల్యములు గావునఁ దత్సమములు ; సంస్కృతసమేతరములుగాని ఆచ్ఛికములు. వీనిలో తత్సమకార్యములు, ఆచ్ఛికకార్యములుగూడ వర్తిల్లును. కావుననే వీనికిఁ దత్సమకార్యమగు హ్రస్వము కలుగును. ఆచ్ఛికములగుటచేఁ బ్రాప్తించు స్త్రీసమత్వాతిదేశముచేఁ బ్రథమైకవచనలోపమును వర్తిల్లును.

జడ, మేర ఇత్యాదులు సిద్ధించును. (చూ-ఆచ్ఛిక-1).

**55.** ఏకాక్షరంబులకు హ్రస్వంబులేదు. ౫౫.

క్ష్మా; మా; భా; శ్రీ; స్త్రీ; హ్రీ; ధీ; భీ; భ్రూవు.

**56.** వృద్ధాదులడుజ్ఞునకు లోపము విభాషనగు. ౫౬.

వృద్ధు, వృద్ధుఁడు; మూర్ఖు, మూర్ఖుఁడు; నీచు, నీచుఁడు; గృహస్థు, గృహస్థుఁడు; చార్వాకు, చార్వాకుఁడు.

**57.** స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు. ౫౭.

రమ; క్షమ; వనిత; ఘనత; విద్య; దేవత; మీననేత్ర.

ఇకారాంత స్త్రీలింగములలో 'ఇగ్లౌరా' సూత్రమువల్లనే లోపము. మతి, నుతి, శ్రీ, స్త్రీ.

ఉకారాంతములలో లోపముకలుగదు. ధేనువు, వధువు (చూ-48).

**58.** చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు. ఉదా.

చరిత్ర, చరిత్రము; చరిత, చరితము.

అలక, అభిలాష, అక్షత, ఘోష, తరంగ, భ్రమ, విజృంభణ, వధ, వేగ, స్ఫురణ, హంస — ఇత్యాదులు చరిత్రాదులు.

బాహుళకమువలన దర్భాదులకు ములోపంబు నిత్యంబు : దర్భ, పనస ఇత్యాదులు.

**59.** స్వర్గివాచి దేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు. ఉదా.

దేవుండు; సకలసురులు.

స్వర్గివాచియనుటచే భూదేవులు, భూసురుండను ప్రయోగంబు లబాధితంబులయ్యె.

**60.** సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు. సంస్కృతసమాసంబునం గావు. ఉదా.

సురలు; అసుర, అసురుండు.

నిఖిలసురులు; రావణాసురుండు.

ఎల్లసురలు; ఎల్లయసురలు, ఎల్లయసురులు.

భాషలో సమ, తుల్య శబ్దములు పర్యాయపదము (సమానార్థకము) లయినను వానిని వాడుటలో బాలవ్యాకరణమున నొక నిబంధనము గలదు. అది గ్రంథమునందంతటను జాగరూకతతోఁ బాటింపఁబడినది.

స్త్రీతుల్యములు, క్లీబతుల్యములు : తత్సమములు.

స్త్రీసమములు, క్లీబసమములు : ఆచ్ఛికములు.

స్త్రీసమ క్లీబసమ శబ్దములు ఆచ్ఛికములకు సంజ్ఞాప్రాయములు.

స్త్రీతుల్యములగు తత్సమములను స్త్రీసమములని వ్యవహరించినచో, ఈ ప్రక్రియాప్రణాళికలోఁ జిక్కులుగలుగును.

చింతామణిలో స్త్రీసమశబ్దము ఆచ్ఛికములవిషయముననే నియతముగా వ్యవహరింపఁబడినది.

"వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యే స్యుః"

అనుటయు

"అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః"
అను సులోపవిధాయకసూత్రమునఁ దత్సమములకింపై చేయుగ స్త్రీసమములను
చేర్చొనుటయుఁ జింతామణికారుని నియమదృష్టిని వెల్లడించును. ఆ దృష్టిని
గమనింపక యథర్వణాచార్యులు:

"యోధాసురాదిశబ్దానాం స్త్రీసమత్వ మిహోచ్యతే"

అని తత్సమవిషయమునఁగూడ స్త్రీసమశబ్దమును వ్యవహరించియుండిరి. అది
చూచి యహోబలపండితుఁడును

"స్త్రీత్వబహుంతే సురాదే రసమాసే"

అనుసూత్రమును వ్యాఖ్యానించుచు

"అసురేతి 'స్త్రీసమ' ప్రయోగస్తు"

"తేన యోధ ఖంతేత్యాద్యాః 'స్త్రీసమా' స్సిద్ధాః"

అనియు, స్త్రీసమశబ్దమును దత్సమములవిషయమున నియమరహితముగ
వ్యవహరించుట కానిదగును. కానీ, చింతామణ్యాథర్వణముల ప్రక్రియా
ప్రణాళికలో స్త్రీసమములకుఁ బ్రథమైకవచనలోపముతప్ప నితరకార్యములు
లేకుండుటచేఁ దత్సమములనుగూడ స్త్రీసమములనుటలో వ్యవహారసాంకర్య
మున్నను బ్రక్రియలోమాత్రము చిక్కులు సంభవింపవు.

బాలవ్యాకరణము నందన్ననో యటులుగాదు. ఇందు స్త్రీసమతాప్రయు
క్తములగుకార్యములు పెక్కులు విధింపఁబడియున్నవి. చూ: సంధి 25, 35;
కారక 20; సమాస 5, 6, 7.

స్త్రీతుల్యములగు తత్సమములుగూడ స్త్రీసమములేయన్నచో నీకార్యము
లెల్లఁ దత్సమములందుఁగూడఁ బ్రసక్తములు కావలసివచ్చును. ఒందురెండు
ఉదాహరణములు పరికింపుఁడు.

స్త్రీసమవిశేషణముల బహువచనమునకు నేకవచనము విహితమయినది.
(కారక-20) మాటలుపెక్కులు: యోధదూతాదితత్సమశబ్దములు స్త్రీసమము
లన్నచో 'బాలకులు యోధలయిరి, శ్రీకృష్ణసంజయులు దూతలయిరి' అనుచో
విశేషణబహువచనమునకు నేకవచనము కలిగి 'బాలకులు యోధయయిరి'
'శ్రీకృష్ణ సంజయులు దూతయయిరి' అనియు సాధువులు కావలసివచ్చును.
ఇంకను నిట్టి యనర్థములు పయిని సంఖ్యలతో నిర్దేశించిన సూత్రములన్నిటను
సంభవించును.

ఇట్టిచిక్కులు తటస్థింపకుండ సూరి యాచ్ఛికములను మాత్రమే స్త్రీసమ
ములుగ సర్వత్ర వ్యవహరించి తత్సమాచ్ఛికములవిభజనముచే, ఔచిత్య
మాత్రమునేగాక వైశద్యమునుసయితము గల్పించి తనప్రక్రియాప్రణాళిక
సాగించియుండెను.

ఈసూక్ష్మము నెఱుఁగకయు గుర్తింపనేరక హరికారికాకర్త యీప్రకృత సూత్రమును

"మహతోనిత్యం హామహత్ స్త్రీస్త్రీసమత్వం సంస్కృతవన్నతు"

అని యనువదించెను.

సూరి ప్రణాళికలోని సూక్ష్మములు స్ఫురింపమిచే అనర్థదాయకములయి వెలసినతప్పిదములు హరికారికలలోఁ జాలఁగలవు. అందుఁ గొన్ని యాయా సూత్రములకడఁ జూపఁబడును. అదరిపాటుగా ననువదించుటలో బాలవ్యాకరణ ప్రణాళికాసూక్ష్మములు హరికాకర్తకు గోచరింపకుండుట వింతకాదు. కాని బాలవ్యాకరణ టీకాకర్తయునయినను కొందఱీనియమమును గుర్తింపక స్త్రీసమ స్త్రీతుల్యశబ్దములను వ్యత్యస్తముగా వ్యవహరించినవారు కలరు.

సూత్రకారహృదయమును సూటిగా నందుకొను నాసక్తియు నిదానించు నభిలాషయును లేనియెడ సూక్ష్మములు గోచరింపవు.

పయివారిమాటకేమిగాని చిన్నయసూరికిఁ జిరకాలసన్నిహితాంతేవాసు లయిన సీతారామాచార్యులవారుగూడ శబ్దరత్నాకరమున 'పులకలు' అనుశబ్దమునుగూర్చి వివరములువ్రాయు సందర్భమున, అది సంస్కృతసమమని తామే వక్కాణించుచు, దానిని స్త్రీసమముగా అలావునసే వ్యవహరించుట యెంత మాత్రమును సమీచీనముకాదు.

**61.** దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగనగు. ఉ.దా.

> దూత, దూతుఁడు; యోధ, యోధుఁడు; శుంఠ, శుంఠుఁడు.
> బహుళగ్రహణముచే సమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు : సింగంబుదూతయగు జంబుకంబు.

అమహత్తులకు స్త్రీత్వము నిత్యముగాక పాక్షికమయినచో "సింగంబు దూతుఁడగు జంబుకంబు" అను ననిష్టరూపమేర్పడునని పేటికాటీకలో ప్రత్యుదాహరణము చూపఁబడినది. అది కుదురుపడునట్లు కానరాదు.

ఇట దూతశబ్దము అమహత్తుగదా ! ఉత్వడుజ్ఞులు వచ్చుటెట్లు ? స్త్రీత్వమురానిపక్షమున మువర్ణకముకలిగి 'దూతమగు జంబుకంబు' అని యగునేగాని, దూతుఁడని యగుటెట్టులు ? ప్రత్యుదాహరణములయినను ననంభవములను జూపరాదుగదా ! దూతకృత్యమునుబట్టి మహత్త్వవివక్ష చేయుదుమందురా; అపుడు జంబుకశబ్దమునకుఁగూడ మత్వడుజ్ఞులు రావలసి యుండును. అదిగాక యిట "అమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు" అనిగదా సూత్రకారుని వచనము ! స్త్రీత్వము నిత్యముకానిచో, మనమూహించి

చూపవలసిన ప్రత్యుదాహరణము 'అమహత్త్వము' నంచేగదా ! కాఁబట్టి యీ తావున 'మహత్త్వవివక్ష' అనుమాటయే పొసంగదు.

కావున 'సింగంబుదూతమగుజంబుకంబు' అను ప్రత్యుదాహరణమునకు మాత్రమే యిట సంభావ్యతగలదని యోజింపవలయును.

ఈ యుదాహరణవాక్యము నీతిచంద్రికలో జంబుకము సింగమునకు దూతయై నడపిన మిత్రభేదకథను స్మరింపఁజేయును.

**62.** పృథ్వీవాచి భూశబ్దంబునకు భువియగు. ఉ.౨.

భువి, భువులు; భువిని, భువులను.

**63.** నౌశబ్దంబునకు నావయగు. ఉ.౩.

నావ, నావలు. మహానావ.

కొందఱు నావియనియు నాదేశంబగునంద్రు.

ఇట్టి నిపాతవిధులగు తక్కినసూత్రములందు భువి — భువులు దివి — దివులు, హృది — హృదులు, ఇత్యాదిగా వ్యస్తపదములనుమాత్రమే యుదాహరించి యిట 'మహానావ'యను సమాసపదమునుగూడఁ జూపుటలో నిగూఢమగు నుద్దేశము గలదు.

'నావ'అను కేవలరూపమునకయి యీసూత్రమక్కఱయేలేదు. ఏలయన, ప్రాకృతహేమచంద్రవ్యాకరణమున 'నావ్యావః' (8-1-164) అని 'నౌ'శబ్దములోని ఔకారమునకు 'ఆవా'దేశము విధింపఁబడి 'నావా'అనురూపము సాధింపఁబడియున్నది. అది ప్రాకృతసమముగఁ దెలుఁగున గ్రహింపఁబడునెడ 'సిరీ—సిరి' ఇత్యాదులందువలె హ్రస్వముకలిగి 'నావ'అనురూపము సులభముగా సిద్ధించును. ఇట్లు ప్రాకృతసమముగా సిద్ధించిన నావశబ్దము, ఆచ్ఛికముగావున దీనితో కేవలసంస్కృతమగు మహచ్ఛబ్దము సమసింపదు. 'మహానావ' సిద్ధింపదు. అదికుదురుట యీసూత్రమునకు ప్రధానప్రయోజనము. ఈసూత్రముచే 'మహానౌ'అనుసిద్ధసమాసమునుండి 'మహానావ'సిద్ధించుటకవకాశము కలిగినది. ఆసూచనకే 'మహానావ' అని ప్రత్యేకముగా నుదాహరించుట.

'నావి'అనునాదేశము విధించినవారెవరో కంటఁబడకున్నారు.

**64.** రై గ్లౌశబ్దంబులకోత్వంబు విభాషనగు. ఉ.౪.

ఇగ్లౌ సూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు :
రో, రైః గ్లో, గ్లౌ.

**65.** ఐకారం బి తుల్యంబు. ఉదా.

రైని, రైకి; కైని, కైకి; పైని, పైకి.

ఆహ్నికమునందుఁగూడ నీ సూత్రము ప్రవర్తిల్లునని తెలుపుటకు కై, పై అను నుదాహరణములు.

ఇకారతుల్యతను విధించినను ఈ లక్ష్యములందు నభిలషితమయిన ఇత్వము (26) సిద్ధించును. కాని రై, కై మున్నగువానికి బహువచనము పరమయినపుడు "ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడుత్వంబగు" (45) అనుదానిచే రులు, కులు అనునపరూపములు సంభవించును. అవి రాకుండుటకయి ఇకారతుల్యతగాక, ఈకారతుల్యత విధింపఁబడినది.

ఐకారాంతమగు రైశబ్ద మీసూత్రముచే, ఈకారాంతమయ్యెనేగావున, ఇకారాంతములకుఁగలుగు ప్రథమైకవచనలోపము దీనికిని ప్రాప్తింపవచ్చునే! మఱి, ఇగ్లౌసూత్రమున రైశబ్దమును వేఱుగా గ్రహింపనేల? అని యొకశంక పొడమవచ్చును. సత్యమే.

కాని, రైశబ్దమునకు సులోపము సిద్ధించినను దానిరూపాంతరమగు రాశబ్దమున సులోపమునకయి యిగ్లౌరాసూత్రమున రైశబ్దమును దప్పక గ్రహింపవలసివచ్చినది.

**66.** కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు. ఉదా.

కంధరము, కంధర.

విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు: విధము.

కంధరా, నాసికా, భిక్షా, దంష్ట్రా, గ్రీవా, పాదుకోల్కా ప్రభృతులు కంధరాదులు.

సంస్కృతమునఁ బ్రసిద్ధములగుశబ్దములే తెలుఁగునఁ దత్సమములుగ గ్రహింపఁబడుటయు, నందుఁ గొన్ని కాలక్రమమున మార్పులనంది తద్భవము లగుటయు సహజము. సంస్కృతమున నప్రసిద్ధములయి నిఘంటువులలో మాఱుమూలలనున్న శబ్దములు తెలుఁగునఁ బ్రవేశించుట దుర్ఘటము. అసంభవము.

విధాశబ్దము సంస్కృతమునఁ బ్రసిద్ధము. తత్సమమున దానికి 'విధము' అనురూపమొక్కటియే కాననగుటవల్లను, 'విధ' అనురూపము లేకుండుట వల్లను, దీనికిఁ గ్లీబతుల్యత యిట నిత్యముగా విధింపఁబడినది. ఇట్లు విధించుట యావశ్యకము. సముచితము.

ఇటులుండ 'విఘో విఘానే హ_స్త్యన్నే' అని నిఘంటువులో నెచ్చటనో 'విఘః' అను పుంలింగశబ్దమొకటి గలదనియు, దానినుండి 'విఘము' అనురూప మగుననియు, 'విఘా'శబ్దమునకుఁ దెలుఁగుభాషయందు ప్రవేశమే లేదనవచ్చు ననియు, కాఁగా కంధరాదులలో 'విఘా'శబ్దమును బఠింపనక్కఱలేదనియు, ప్రౌ.వ్యా.కర్త యభిప్రాయము (ప్రౌ.వ్యా.-శబ్ద-21). ఇది భాషాగతుల మూల పద్ధతికే విరుద్ధము. అప్రసిద్ధము వచ్చునఁట! సుప్రసిద్ధము రాదఁట! ఎట్లు సమ్మతించుట?

## ఇంక హలంతప్రకరణము

**67.** హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు. ఉః.

రుక్; రాట్; మరుత్; వీరుత్; కర్మ; వర్మ.

శ్వశబ్దంబుదప్ప నకారాంతంబులెల్లం బ్రథమైకవచనతుల్యంబులె యగునని యెఱుంగునది.

ఈ హలంతములప్రథమైకవచనాంతములు రుక్, రుగ్, రాట్, రాడ్ మున్నగురీతిని రెండురూపములతో నుండును. ఉన్నను రుగ్, రాడ్ మొదలగు రెండవరూపములను, ఈ సూత్రమునుబట్టి తెలుఁగుప్రాతిపదికములుగ గ్రహింపరాదు.

"భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబులేదు" (87)

అను నిషేధముచే నట్టిశబ్దములు తత్సమములుగఁ దెలుఁగునఁ బ్రవేశింపవని సూత్రకర్త తలంపుగా భావింపవచ్చును.

వలసినచోట్ల 'ప్రత్యయ'శబ్దమునకు 'ప్రత్యయాంత'మనుసర్థమును గ్రహింపవచ్చును.

"ప్రత్యయగ్రహణే తదన్తస్యాపి గ్రహణమ్"

అనుపరిభాష యీ యంశమును బోధించును.

కావుననే యీ సూత్రమున వృత్తియందు 'ప్రథమైకవచనతుల్య'మనఁగా ప్రథమైకవచ'నాంత'తుల్యమనియే యర్థము.

మఱొక్కయంశము: రుక్, రాట్, మరుత్ ఇత్యాదులందుఁ బ్రథమైక వచనప్రత్యయము లోపించినను 'రామః' ఇత్యాదులవలె నవి ప్రత్యయాం తములుగనే పరిగణింపఁబడును.

"ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్"

(=ప్రత్యయే లుప్తేపి తదాశ్రితం కార్యం స్యాత్)

ప్రత్యయము లోపించినను దానినిబట్టి రావలసిన కార్యములు ప్రవర్తింప వచ్చును. అని పాణినీయపద్ధతి.

**68.** ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లునకగు. ఉదా.

ఉగాగమాంతంబుల కిగ్గొనసూత్రముచేఁ బ్రథమైకవచనలోపం బగు : రుక్కు; రాట్టు; మరుత్తు; వీరుత్తు.

ఉగాగమంబులేమింజేసి యుపటు నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు :

కర్మము; వర్మము; చర్మము; సుధన్వుఁడు; సుత్రాముఁడు.

ఈ యుదాహరణములలో 'రుక్కు, వీరుత్తు' అనునవి స్త్రీలింగములు. వీనికిఁ బ్రథమైకవచనలోపము కలుగుచున్నది. అట్లుగాని

"ఉకారాంతగోశబ్దంబుల కంతట ప్రువర్ణకంబగు" ననుసూత్రమునందు 'అంతట' అనుట స్త్రీలింగప్రథమైకవచనలోపమును బాధించి పుంనపుంసకము లందువలె స్త్రీలింగములందుఁగూడ 'ధేనువు' మున్నగుచోటులందు వువర్ణకము తప్పక ప్రవర్తించుటకేగదా ! అయినచో స్త్రీలింగములగు ఈ 'రుక్కు, వీరుత్తు'లలో లోపమెట్లువచ్చును ? లోపమునుబాధించి వువర్ణకమేలరాదు ? అని యడుగవచ్చును. అడుగవలసినమాటయే.

కాని, ఉకారాంతగోశబ్దసూత్రమునందలి 'అంతట'శబ్దము ఉకారాంత స్త్రీలింగములలోఁ బ్రవర్తించు ప్రథమైకవచనలోపములనన్నిటిని బాధింపదు. స్త్రీలింగప్రథమైకవచనలోపమునుమాత్రమే బాధించును. ప్రకృతము రుక్కు, వీరుత్తులలో వచ్చినది ఇగ్గొనయుగంతప్రథమైకవచనలోపముగాని, స్త్రీలింగ ప్రథమైకవచనలోపము (57వ సూ.) కానేరదు. 'అంతట' అనుశబ్దమునకుఁ బ్రయోజనమును నిర్దేశించువాక్యమందు (48వ సూ.) గుప్తమయిన సూత్రకారుని యాంతర్యమును సూక్ష్మదృక్కోణముతో సమీక్షింపుఁడు.

**69.** దీర్ఘంబుమీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు. ఉదా.

వాక్కు, వాకు; స్వరాట్టు, స్వరాటు.

"........లోకనింద్యమగు వర్తమునీ
వాకునకుఁ దెచ్చుటుచితమె
నాకుసహోదరివి నీవు నా చిత్తమునన్." —భార-ఆది-3-130.

ఇది ప్రాసనిబద్ధమయి మార్పరాని ప్రయోగము. ఇవి కమనివిగా వాగనుశాసనుల పలుకులు. వట్టివికావు. వ్యాకరణప్రియులకు, పులకలు పొడమించు పలుకులు:

దేవయాని ద్విత్వమును గోరుచున్నది. రచునికి ద్విత్వమునందిష్టము లేదు. క్రియలోనెగాదు. వాక్కునందుఁగూడ ద్విత్వము నాతఁడు సమ్మతింపఁడు. కావుననే 'వాక్కు'లోని ద్విత్వమును తేలఁగొట్టి 'వాకు' అనుచున్నాఁడు. "ఇట్టి జడ్డప్రసంగములు మాటవరుసకయిన నోటరానిచ్చుట ఉచితమురా"దని ఆతని హెచ్చరిక. అది ద్విత్వశూన్యమయిన 'వాకు' శబ్దమున గర్భితమయియున్నది. భట్టారకుల వాగనుశాసనభంగియెట్టిదో పరికింపుఁడు.

**70.** మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామంబగు. ౭౦.

శ్రీమంతమ్; గుణవంతమ్; విద్వాంసమ్; అనడ్వాహమ్; శ్వానమ్; ఉపానహమ్; అప్సరసమ్. ఇత్యాదులు.

ఈ మతుబంతములకు మూఁడులింగములందును ద్వితీయైకవచనాంత రూపములు భిన్నభిన్నములుగా నుండును :

i. శ్రీమంతమ్, ii. శ్రీమతీమ్, iii. శ్రీమత్.

ఏలింగమునందలి ద్వితీయాంతరూప మిటఁ బరిగ్రాహ్యమో సూత్రమున స్పష్టముగాఁ జెప్పబడియుండలేదే! ఉదాహరణములు పుంలింగరూపములు మాత్రమే చూపఁబడుచున్నవే! తక్కిన స్త్రీ నపుంసకరూపముల స్మరణమే కానరాదే! కారణమేమి? అవి గ్రహింపరానివయినచో ఆ మాట సూచింపఁబనిలేదా? లింగత్రయరూపములను యథేచ్ఛముగ గ్రహింపవీలగునట్లు సూత్రము రచింపనేల? "పుంలింగ ద్వితీయైకవచనాంతతుల్యంబు" అని స్పష్టముగ నిర్దేశించినచో నెట్టిసంశయమునకును దావులేకుండెడిదిగదా! అటులేల రచింపకుండెను?

అని కొందఱు ప్రశ్నింతురు. చక్కని ప్రశ్న—కాని,

ఇది పుంలింగరూపములనుమాత్రమే యుద్దేశించి రచింపఁబడినట్లు సూత్రము చెప్పక చెప్పుచున్నది. సూత్రాక్షరములుగాక ఈ సూత్రమును రచించు ప్రయత్నమే యీయంశమును వెల్లడింపఁగలిగియున్నది.

ఎట్లందురా? సూత్రమునుబట్టి స్త్రీనపుంసక ద్వితీయాంత రూపములు గూడ నేలగ్రహింపఁబడవు? అనిగదా ప్రశ్నము!

సరే: ముందు స్త్రీలింగద్వితీయాంతమును గ్రహించి చూడుఁడు. శ్రీమచ్ఛబ్దమునకు స్త్రీలింగద్వితీయాంతరూపమెట్లుండును? 'శ్రీమతీమ్' అని. అది మనకు ప్రాతిపదికమయినచో దానియంతిమ మకార మేమగును? లోపించును. ఇఁక మనకు మిగులు ప్రాతిపదికము ఏది? 'శ్రీమతీ' అనునది. ఇదే మనకు నపేక్షితమయినచో ఈ సూత్రమే యక్కఱలేదు. ఏలయన :

'శ్రీమతీ' అనునది అజంతములగు సంస్కృతప్రాతిపదికలలో సిద్ధమయి యున్నదేగదా! 'లక్ష్మి' మున్నగువానివలె 'శ్రీమతి' అనునది అప్రయత్నముగ రానేవచ్చునుగదా! దానికయి క్రొత్తగా ఈ సూత్రమెందులకు? ఇంత మాత్రమును బనిలేదు.

కావున స్త్రీలింగద్వితీయాంతరూపమునకయి యీ సూత్రమారంభింపఁ బడలేదనుట తేటతెల్లముగఁ దెలుచున్నది.

ఇంక నపుంసకద్వితీయాంతమును గ్రహించిచూడుఁడు. ఆరూపము 'శ్రీమత్' అనునదిగదా! ఇదేమనకుఁగావలసినచో ఈసూత్రముతోఁ బనియే లేదు. ఏమందురా:

శ్రీమచ్ఛబ్దమునకు నపుంసకమునఁ బ్రథమైకవచనాంతరూపమెట్లుండును? అదియు ద్వితీయలోవలె 'శ్రీమత్' అనునదేగదా! హలంత ప్రాతిపదికములు తెనుఁగునకువచ్చు సాధారణపద్ధతి ఏది? "హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బిందు నామంబగు" అని ప్రథమాంతములువచ్చును. మరుత్, వీరుత్, జగత్ మున్నగునవి ఆరీతిని వచ్చినవేగదా! వానితోపాటు 'శ్రీమత్' అను రూపమును, నప్రయత్నముగ రానేవచ్చునుగదా! తనంతదాను సిద్ధమగుచున్న యీ ప్రాతిపదికమును సంపాదించుటకయి క్రొత్తగా ఈ సూత్ర మెందులకు? లేశమును బనిలేదు. కాఁగా నపుంసక ద్వితీయాంత రూపమునకయి యీ సూత్రమారంభింపఁబడలేదనుటయు సుస్పష్టముగా విశదమగుచున్నది.

పయిరీతిని స్త్రీ నపుంసకలింగ రూపములకొఱకు నక్కఱలేని యీ సూత్రము పరిశేషన్యాయమునఁ బుంలింగములకొఱకుమాత్రమేయని పర్యవసానము తేలుచునేయున్నది.

కావున, అప్రయత్నముగా, నతిసులభముగా నతివిశదముగాఁ దెలియు చున్న యీ యంశమును మరలఁజెప్పనేలయని భావించి గంభీరుఁడుగాన సూరి సూత్రమున 'పుంలింగ' అని విశేషించి చెప్పకుండెను.

అంతగాంభీర్యమా యనరాదు. అదే సూత్రకారులకుండఁదగిన ముఖ్య లక్షణము. అది యక్కఱలేదన్నచో నందఱును సూత్రకారులే. అన్నియును సూత్రములే.

**71.** దాని యంతిమ మకారంబునకు లోపంబగు. ౭౧.

శ్రీమంత; గుణవంత; విద్వాంస; అనడ్వాహ. ఇత్యాది.

వీనికజంతములకుంబోలె డుజాదులు యథాయోగ్యంబుగ నగు: అతఁడు శ్రీమంతుఁడు. ఇతఁడు గుణవంతుఁడు. వానివంశము

శ్రీమంతము. వీనివంశము గుణవంతము. విద్వాంసుఁడు; విద్వాంసము; అనడ్వాహము; శ్వానము; అప్సరస.

వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదులు ఙ్యంతంబులె యిందు గ్రహింపంబడు : శ్రీమతి; గుణవతి; విదుషి; శుని.

మహతివాచ్యంబగునపుడు శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు.

పూర్వసూత్రమున నిర్దిష్టములయిన ప్రాతిపదికములు ఏడింటిలో నాలింటికి మాత్రమే యుదాహరణము లీసూత్రమునఁ జూపఁబడినవి. ఆ సూత్రమున శ్వానము పక్కనుంచిన 'ఉపానహము' (పాదరక్ష) ఇచటఁ గనఁబడుటలేదు. ఏమయినదో యనుకొందురు. అట్టె దూరముగఁబోదు. చుట్టుపట్టులనె వ్రాసం బడును.

ఉత్తర (72) సూత్రముచే ప్రథమైకవచనలోపమును నిషేధించిన పెమ్మట 'ఉపానహము' నచ్చట నుదాహరించు తలంపుతో నిచటఁ జూపకుండెను. ఆ తావున 'ముదము'తోడఁ జూడఁగలరు.

లేదనుకొన్న 'ఉపానహము'ను తోడనేచూపిన సూత్రకర్తను కృతజ్ఞతతో బహూకరింపనుగలరు. స్రజముకూడ ఆ పక్కనే సిద్ధముగనున్నది.

**72.** ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు. ౭౨.

ముదము; ఉపానహము; స్రజము.

**73.** ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు. ౭౩.

ఋత్విజుఁడు, ఋత్విక్కు; నీవృతము, నీవృత్తు.

ఋత్విగాదికంబాకృతిగణంబు.

'ఋత్విజుఁడు, ఋత్విక్కు' అనురూపములు రెండును ప్రసిద్ధములు.

ఋత్విక్కు, నీవృత్తు అనురూపములు కవిప్రయుక్తములు లేవనుచు ఒక టీకాగ్రంథమున ఈ సూత్రము మూలమునుండి తొలఁగింపఁబడినది. తట్టీకాకారులు "స్రుక్కులవిఱిచి ఋత్విక్కుల బాధించి ....." (వరాహ పురాణము, 5-115)అను కవిప్రయోగమును తామేచూపుచు, భారతమందంత టను 'ఋత్విజుఁడు' అని ప్రయుక్తమయియున్నదిగాన ఇటఁగూడ "స్రజములఁ జెఱిచి ఋత్విజులను బాధించి" అనియే కవిప్రయుక్తపాఠమయి యుండునని

యూహించుచు 'ఋత్విక్కు'లన్నరూపముల సాధించు నీ సూత్రమును తొలఁగించినాడు.

భారతమునఁగల శబ్దములన్నియు సాధువులు. శిరోధార్యములునగుచు సకలసమ్మతమేగాని భారతమునలేనివెల్ల అసాధువేయనుట యెవ్వరికిని సమ్మతము గాదు.

అదియటుండ, ఇప్పుడు పరిష్కృతమయిన యీ పాఠాంతరము ఆ పద్యమున సందర్భోచితముగాఁ గుదురుపడునట్లును గానరాదు. "హోమకుండములు సిద్ధామధామంబులుగా వించి పశువుల గావు పట్టి। స్రుక్కులు విఱిచి ఋత్విక్కుల బాధించి...." అను వరాహపురాణ పద్యమున ఋత్విక్కులనుదానిని ఋత్విజులుగా మార్చుటలో ప్రాసయతి కుదురుపాటునకయి 'స్రుక్కు'లనువానిని స్రజములుగా మార్చియుండిరి.

'స్రుక్కు'లనఁగా హోమోపకరణ పాత్రలు (చిన్నగరిటెవంటివి). 'స్రజము'లనఁగా పుష్పమాలలు. యాగమున ఋత్విక్కులయొద్ద నుండునవి హోమమున కుపచరించు పాత్రలుగాని పూలదండలుగావు. కావున నీసవరణము పద్యమున బొత్తిగా సరిపడకున్నది.

స్రుక్, స్రుచౌ, స్రుచః : (చకారాంతము) స్రుక్కు, స్రుచము.

స్రక్, స్రజౌ, స్రజః : (జకారాంతము) స్రక్కు, స్రజము.

రెండును భిన్నశబ్దములు. భిన్నార్థకములు. కాఁగా లభించిన కవి ప్రయోగమును దమయూహ కనుకూలముగా సవరించు సంకల్పముగాని, సవరించిన తీరుగాని ఇట తృప్తికరముగఁ గానరాకున్నది.

మఱియు 'ఋత్విక్కు'లను శబ్దమునకు నీ ఒక్కప్రయోగమేగాక

"అలఘు శ్రీనిధి విశ్వభూతలపురుండా ఋశ్యశృంగర్షి ము

ఖ్యుల ఋత్విక్కుల నప్పుడేర్పఱిచి" —రామాభ్యుదయము, 3-15.

అని వేఱొక ప్రయోగమును గానవచ్చుచున్నది. ఇంకను మఱికొన్ని లభింప వచ్చును.

ఇట్టి యీ కవిప్రయోగములనుబట్టియు, ఋత్విక్కు లను రూపమునకు లోకమునఁగల ప్రచారమునుబట్టియు నీ సూత్రము నిట్లునిలుపుటయే యావశ్యకము. సమంజసము.

ఇదియగాదు. ఏసూత్రమయినను నిరర్థకముగా మనకుఁ దోఁచినయెడ ఉన్నసూత్రము నున్నట్లెయుంచి దానిగుణదోషములుచర్చించి మనసిద్ధాంతములు వెల్లడింపవచ్చునేగాని సూత్రమునే యెత్తివేయుట ఆమోదకరము కానేరదు.

**74. ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్ప్రకారంబున కానాదేశంబు విభాషనగు.** ౭౪.

హనుమానుఁడు, హనుమంతుఁడు; భగవానుఁడు, భగవంతుఁడు.

ఇత్యాది.

'హనుమానుఁడు' అనురూపమును 'హనుమత్'అను ప్రాతిపదికము నుండియు, 'హనుమంతుఁడు' అను రూపమును 'హనుమంత' అను ప్రాతిపదికమునుండియు నిష్పాదించి కొందఱు వ్యాఖ్యాతలు ప్రక్రియ చూపియుండిరి.

మతుబంతములలో ద్వితీయైకవచనాంతతుల్యమును ప్రాతిపదికముగ గ్రహింపవలయునేగాని (70 సూ.) సంస్కృత ప్రాతిపదికమగు 'హనుమత్' అనుదానిని, తెలుఁగుప్రాతిపదికముగా గ్రహించుటకు మార్గమేమిగలదు? అదిగాక, ఆనాదేశము వైభాషికముగదా! లదిరానిపక్షమున సిద్ధింపవలసిన రూపాంతరమును ఆ 'హనుమత్'అను ప్రాతిపదికమునుండియేగదా చూప వలయును! ఏది ఆ రూపాంతరము? 'హనుమంతుఁడు' అనునదేయందురా? ఆ రూపము 'హనుమత్'అను దానినుండి సిద్ధింపదే! అది సిద్ధించుటకు 'హనుమంత' అను వేఱొక ప్రాతిపదికమును గ్రహించుచున్నారే! భిన్నప్రాతి పదికములనుండి నిష్పన్నములగు రెండు రూపములు, ఒకదానికొకటి రూపాంతరములగుట యెట్లు? అటులేయయినచో హనుమానుఁడు అనుదానికి రాముఁడు అనునది రూపాంతరమని యేలయనరాదు? ఈ మార్గము తడఁబాటుగా నున్నది. ఇది ప్రక్రియాపద్ధతిగా గోచరించుటలేదు.

ఇట్టి కొలఁదిమతుబంతములు, ఒకమాఱు సంస్కృత ప్రాతిపదిక తుల్యములును, ఒకమాఱు ద్వితీయైకవచనాంతతుల్యములును తెలుఁగునఁ బ్రాతిపదికములుగ గ్రహింపఁబడునని లక్షణనిరూపణమున్నయెడఁ బ్రసిద్ధములగు నీరెండు రూపములును వేఱువేఱు నామములనుండి సరళమార్గమునఁ జక్కఁబడి యుండెడివి. అట్టి లక్షణమూ కానరాదాయెను.

ఇఁక, నీ రెండు రూపముల నిష్పత్తిలో సూత్రకారుని తలంపెట్టిదయి యుండును? అని యాలోచించుట కర్తవ్యము.

ఈ హనుమానునికి భగవానునికిఁ బ్రాతిపదికములు, ఏవయియుండునో యని మనము గజిబిజిపడుచుండ, ఈ రూపములు కవిప్రయుక్తములే కావనియు ఆ కారణముచే అసాధువులనియు కావున వీని నిష్పత్తిమార్గమును లాక్షణికులు నిరూపింపరాదనియు ఒకటీకాకారులు వక్కాణించుచున్నారు. కాని

"సర్వే శబ్దాః ప్రయోక్తవ్యాః యది దోషవివర్జితాః
అప్రయుక్తత్వదోషస్తు నవిరుద్ధో హరేర్మతే,
శాస్త్రప్రయోగవచసోః శాస్త్రం బలవదుచ్యతే
అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితమ్."

ఏదేనొకశబ్దము రుచిరమయి వ్యాకరణ సాధితమయినచోఁ గవిప్రయోగము లేకున్నను బరిగ్రాహ్యమనియు, నట్టిచో లక్షణమునే ప్రబలప్రమాణముగా గ్రహింపవలయుననియు, నిట్లు వ్యవహార ప్రసిద్ధములగు శబ్దములకు నథర్వణులు సమ్మతి చూపియున్నారు.

"యత్ర శాస్త్రేణ విశిష్య కార్యముచ్యతే తత్ర శాస్త్రం బలవద్భవతి
యత్ర శాస్త్రేణ సామాన్యవిధానం తత్ర ప్రయోగో బలవాన్."

'ఒకశబ్దమును (ఏట్టి వ్యవహారరూపము బట్టియో) ప్రత్యేకముగా నిర్దేశించి వ్యాకరణము సాధించినపుడు దానిని బరిగ్రహింపవలయును: అనేక శబ్దములకు వర్తించునట్టి సామాన్య సూత్రముచే నొకశాస్త్రము విధించినపుడు దానినిబట్టి క్రొత్తశబ్దమును విష్పాదించుటయవశ్యమైన యెడలఁ గవిప్రయోగము కలదో లేదో పరికింప వలయును; అట్టిచోట లక్షణముకంటెఁ గవిప్రయోగమునకే యధికప్రామాణ్యము నొసంగవలయును.' అని యాథర్వణ మార్గమును విశాలదృష్టిని బరిశీలించి వివరించుచు లోకప్రసిద్ధ శబ్దముల ప్రయోగమునకు నహోబలపండితులును నంగీకారము చూపియున్నారు. వీరి మార్గము నామోదించుచు

"అదోషంబున కప్రయుక్తదోషములేదని యథర్వణాచార్యులంద్రు"

అని తమ శబ్దశాసనమందును

"అదోషంబున కప్రయోగదోషంబులేదని యార్యులు వక్కాణింత్రు"

అని తమ శబ్దలక్షణసంగ్రహమునందును సూరిగారు ఆథర్వణమతమును గౌరవించుచు సూత్రములు రచించి తమ దృక్పథమును వెల్లడించియున్నారు. ఆ ప్రసంగ మటుండనిండు.

హనుమానుఁడు, భగవానుఁడు, అను నివి కవిప్రయుక్తములా ? కావా ? అను పరిశీలనము మనకుఁ బ్రకృతోపయుక్తము కాదు. అప్రయుక్తములే యనుకొందము.

"హనుమద్భగవచ్ఛబ్దములు కొందఱమతమున గుణవద్గణములోనివి
కావుగాన హనుమానుఁడు, భగవానుఁడు అగును."

—[illegible]—టీక

అని యీ రూపములను బాలసరస్వతి పరిగ్రహించెను.

"హనుమానుఁడు, భగవానుఁడు ఇతి రూపంతు అగుణవద్గణత్వేన
బోధ్యమ్" —అన్యేషాంచ వా లుగ స్తస్య-వ్యాఖ్య

అని యహోబలపండితుఁ డంగీకరించెను.

"హనుమానుఁడు భగవానుఁడు
ననుచుఁ బ్రయోగింపఁజెల్లుఁ సంబరవసనా"

—సర్వలక్షణసారసంగ్రహ-ఆ.1-పు.3-ప.20.

అని తిమ్మకవియు సమ్మతించెను.

"హనుమత్యన్యతరస్యామ్ : హనుమతి పంతాదేశో వికల్పేనస్యాత్ :
హనుమానుఁడు, హనుమంతుఁడు"—ఆంధ్రకౌముది-హలంత-సూ.232.
అని ఆంధ్రకౌముదీకర్తయు అనుమతించెను.

వీరెల్లరును ఈ విషయమున కవిప్రయోగములు గాంచినవారో వ్యవహార ప్రసిద్ధిని గౌరవించినవారో విశదముగాఁ దెలియని యంశము. ఒకవేళ కవి ప్రయోగములు లేకున్నను శిష్టలోకప్రసిద్ధినిబట్టి యీ రూపముల సాధుత్వమును సమ్మతించినవారె యయినచో ఈ లాక్షణికుల ఉదారదృక్పథము నభినందించుట యుచితముగాని నిరాకరించుట న్యాయ్యముకాదు.

అదియునుగాక బహువ్యాకరణజ్ఞుఁడని పేరుగాంచిన హనుమానుఁడును, సర్వజ్ఞుఁడగు భగవానుఁడును మన వ్యాకరణమున తావుగోరుచుండగాఁ వలదని వారించుట శ్రేయమ్మునుగాదు.

చిన్నయసూరికూడ పూర్వులవలెనే ఏ చూపుతోనో హనుమానుఁడు, భగవానుఁడు అను నీరూపములు మనోజ్ఞములు, మాననీయములు నని తలంచినాఁడు. వీనికయి వనిఁబూని యొకసూత్రము రచించినాఁడు. తల్లక్ష్యములుగా ఈ రూపములు మనకుఁ జూపినాఁడు. రెండును రెండు దివ్యరూపములు.

ఇఁక వీని కుదురుపాటునకయి బాలవ్యాకరణ ప్రణాళికలో నాతఁడు తలంచిన ప్రక్రియామార్గ మేదయియుండును ? అని పరిశీలించుకొనుటమాత్రమే మనకు ప్రస్తుత కర్తవ్యము.

బాలవ్యాకరణమునకేగాక దీనికిఁ బూర్వరూపములగు సూత్రాంధ్ర వ్యాకరణ, శబ్దలక్షణ సంగ్రహములందుఁగూడ సూరి భగవానుఁడు మున్నగు శబ్దముల ప్రక్రియాసన్నాహము కొంత సాగించియుండెను. అందు

"మహతో భగవదాదే రానజ్వా"

అని ఆనాదేశసంకల్ప మొకటియు,

"భగవదాదులకుం బ్రథమాతుల్యత్వోత్వదుజ్ఞులగు"

అని 'భగవాన్' అను ప్రథమైకవచనాంతతుల్య ప్రాతిపదికమునకు ఉత్వదుజ్ఞుల విధానసంకల్ప మొకటియుఁ గానవచ్చును. ఇటులీ ప్రక్రియలో సంకల్పవికల్పముల మథనము కొంతసాగినవెనుక మతుబంతములెల్ల ద్వితీయైకవచనాంత తుల్యములే ప్రాతిపదికములగుచుండ, నందు ఒండు రెండు శబ్దములను మాత్రము ప్రథమైకవచనాంతతుల్యములను గ్రహించుట రుచింపక కాఁబోలును పర్యవసానమున బాలవ్యాకరణమునందామార్గము నుజ్జగించి, ఆనాదేశపద్ధతినే యవలంబించెను.

ఇఁక నీ ప్రక్రియకు 'భగవత్' అను సంస్కృత ప్రాతిపదికమునే యిందుఁగూడఁ బ్రాతిపదికముగా గ్రహింతమా యన్న నట్లు వలనుపడదు.

సంస్కృత ప్రాతిపదికమును యథారూపముగా, తెలుఁగు నామముగా గ్రహించుట పాణినీయపద్ధతియే కాదు. ఒక్క నకారాంతములు మాత్రమే యట్లు గ్రహింపఁ బడుటకు సూత్రకారుని సమ్మతి గలదు (తత్సమ-80). అదయినను అనుమేయముగాని వాచ్యముకాదు.

కాఁగా, హనుమంత్. భగవంత్ అను ద్వితీయైకవచనాంత రూపము లనే యిటఁ బ్రాతిపదికములుగా సూరి తలంచినట్లు భావింపవలసియున్నది.

'హనుమంత్' అనువానిలోని తకారమునకు 'ఆన్' ఆదేశముగ వచ్చినచో 'హనుమంఆన్' అని యేర్పడును. మనభాషలో నెచ్చటనయినను స్వరమునకుఁ బూర్వము అనుస్వారముండుట అసంభవము. స్వరమునకుఁ బరమయి దాని ననుసరించి బిందువుండునుగాని అచ్చునకుఁ బూర్వ మెచ్చటను నుండదు. కనుకనేగదా బిందువునకు ననుస్వారమను పేరు కలిగినది. అచ్చునకుఁ బూర్వము దానికి స్థానమే లేదన్నమాట. కావున నిచట ఆకారమునకుఁ బూర్వముగఁ దటస్థించిన బిందువు స్వయముగనే లోపించును. ఇట్టిపట్టునందుఁ బ్రత్యేకలోపవిధాన మంతగా నావశ్యకము గాదు.

తెలుఁగున బిందువునకు స్థిరపరకత్వము నిషిద్ధము. కావుననే నాఁడు + నాఁడు (సంధి-41) = నానాఁడు ఇత్యాదులందు డువర్ణలోపానంతరము బిందువునకు లోపవిధానము ప్రత్యేకముగా లేకపోయినను ఆ బిందువు లోపించినది. మఱియు వేసఁగి, వేసవి; పోఁడిమి, పోణిమి ఇత్యాదులందు స్థిరపరకత్వము తటస్థించిన బిందువులు స్వయముగనే లోపించుచున్నవి. అటులే యిటఁగూడ స్వరపరకమయి బిందువుండరాదుగాన, నయ్యది లోపింపఁగా హనుమ + ఆన అని యేర్పడును. అట్టియెడ, అపదాదిస్వరసంధి కలిగి 'హనుమాన' యగును. ఆమీఁద ఉత్వడుజ్ఞాలతో 'హనుమానుఁడు' సిద్ధమగును. ఆనాదేశము రాని పక్షమున 'హనుమంత' అను నా ప్రాతిపదికమునకే ఉత్వడుజ్ఞాలతో 'హనుమంతుఁడు' అవతరించును.

అని యారీతి ప్రక్రియ సూరిదృష్టిలో నున్నట్లు భావించుటలెస్స. ఇది యిప్పటికిం దోఁచినతెఱంగు.

కొసను మఱొక చిన్నమాట :

ఈ సూత్రమున నుదాహరణములు రెంటిటిలో వర్ణక్రమమునుబట్టిగాని, ఘనతనుబట్టిగాని 'భగవానుఁడు' ముందుగా నగపడవలసియుండ నట్లుగాక మొట్టమొదట 'హనుమానుఁడు' కానవచ్చుటకుఁ గారణముకలదేమో కనిపెట్టుఁడు. ప్రపత్తిసంప్రదాయమున భగవదారాధనముకన్న భాగవతారాధనము ప్రధానము. హనుమానుఁడు భక్తులలో నగ్రగణ్యుఁడు. ఆ ప్రాముఖ్యమునుబట్టి 'హనుమానుఁడు' మనలాక్షణికులదృష్టికి భగవానునికన్నను మొదటిలక్ష్యమయ్యెనేమో యించుక యాలోచింపుఁడు.

**75.** విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు. ౭౫.

స్త్రీలింగత్వాతిదేశంబుచేత నుత్వాదుజ్జులు లేవని యెఱుంగునది : విశ్వకర్మ ; కృష్ణవర్త్మ ; అశ్వత్థామ ; యువ ; యజ్వ. ఇత్యాదులు.

**76.** మహద్వాచకమయి పుంలింగంబగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు. ౭౬.

బ్రహ్మ : ఈశబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు. తత్త్వ తపో వేద యోగ వాచకంబగునేని బ్రహ్మమునాఁబడు.

తత్త్వమనఁగా పరమాత్మ – తద్వాచకబ్రహ్మశబ్దము నపుంసకము. దానికి స్త్రీత్వము రాకుండుటకయి పుంలింగవిశేషణము.

యోగమనఁగా సూర్యచంద్రుల సమావేశము. ఆ యర్థమున బ్రహ్మశబ్దము అమహద్వాచకము. దానికి స్త్రీత్వము రాకుండుటకయి మహద్విశేషణము.

**77.** ఆత్మమనిజంతంబులకు నాంతములగు మనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగానగు. ౭౭.

ఆత్మ, ఆత్మము, ఆత్ముఁడు; మహిమ, మహిమము; అణిమ, అణిమము ; గరిమ, గరిమము ; లఘిమ, లఘిమము ; దేవశర్మ, దేవశర్ముఁడు.

ఈ దేవశర్మ నీతిచంద్రికలో .... అల్ల యాషాఢభూతికి గురువయిన పరివ్రాజకబ్రువుండు గాఁబోలును.

**78.** మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజు నాఁబడు. ౭౮.

రాజు, ఖగరాజు. అమహత్త్వంబునందు : రాజము, వృక్షరాజము. ఉపసర్జనత్వంబునందు: హతరాజుఁడు పరశురాముఁడు.

ఉపసర్జనము = అప్రధానము = విశేషణము. ప్రధానులగు లక్షణకర్తలలో, టీకాకారులలో రాజుశబ్దమునుగూర్చి ప్రసంగింపనివారు లేరు. ఈ ప్రక్రియలో నొకరితోనొకరు పొత్తుకుదిరినవారును గానరారు. తుదికి ప్రక్రియను తృప్తికరముగా తేల్చినవారును గోచరింపరు. 'రాజు'ను సాధించుట సుకరమ్ముకాదు.

ఇది తత్సమమనువారు కొందఱు. తద్భవమనువారు కొందఱు. ఏమియు నిర్ణయములేక ఉభయము నన్నవారు మఱికొందఱు. దీని ప్రాతిపదికము 'రాజన్' అనువారు కొందఱు. 'రాజా' అన్నవారు కొందఱు. దీనికి సువిభక్తి పరమగుచో 'డు' (ఉ) వచ్చునని కొందఱు. సువిభక్తిస్థానముననే 'డు' వచ్చునని కొందఱు.

దీనియందలి జకారము దంత్యమనువారు కొందఱు. తాలవ్యమనువారు కొందఱు. ఉభయము ననువారు మఱికొందఱు.

సూటిగాఁ గుదురుపడనిపోటులందు నిట్టిభిన్నమార్గము లేర్పడకతప్పదు. వీనిలో నేదియు నిరాక్షేపముగా, నిష్కృష్టముగా నున్నట్టుల గానరాదు.

ప్రాతిపదికము 'రాజన్' అనుటకంటె నకారాంతమున్నట్టిదగు దీనిం గూడఁ బ్రథమైకవచనరూపమును 'రాజా'యనుదానిని నామముగా గ్రహించుటయే సముచితముగాఁ గన్పట్టును.

చింతామణ్యాథర్వణములు 'డున్నూత్సదా రాజ్ఞః' అనియు, 'రాజ్ఞో డుః పుంసి చేతనే' యనియు నిట డువర్ణమును విధించినవి. ఆ డువర్ణము(ఉ) సుప్రత్యయమునకు ముందువచ్చునా ? సుప్రత్యయస్థానమున వచ్చునా ? ముందు వచ్చినచో సులోపమునకు మార్గములేదాయెను ! సువిభక్తిస్థానమున వచ్చినచో 'రాజు' అనురూపము ప్రథమైకవచనాంతమగును. దానిపైని లు, ను, చేత (రాజులు, రాజును, రాజుచేత) మున్నగు తక్కిన విభక్తిప్రత్యయములు కలుగుటయెట్లు ? ఇవి ప్రాతిపదికమునకుఁ బరములయి రావలయునేగాని ప్రథమాంతమునకంటె వచ్చుట వ్యాకరణప్రక్రియాసంప్రదాయము కాదాయెను ! ఏ మార్గము పరిగ్రాహ్యమనుకొనుట ?

సూరియుఁ బయినిచూపిన ప్రక్రియారీతివాయలనే యనుసరించి యించుక మార్పుతో, తొలుత సూత్రాంధ్రవ్యాకరణమున 'రాజ ఉన్' అనుప్రక్రియ నుపక్రమించెను. పిమ్మట పూర్వుల 'డు'విధానమునను, తన'ఉన్'విధానము నను నెట్టియసంతుష్టి గోచరించియో తుదికిఁ బ్రక్రియామార్గమునే యుజ్జగించి, శబ్దలక్షణసంగ్రహమునను, బాలవ్యాకరణమునను "....రాజశబ్దము రాజు నాఁబడు"నని నిపాతవిధానము నవలంబించెను. సాధారణముగాఁ బ్రక్రియలో నేదేనొకచిక్కు గోచరించినపుడుగాని సూత్రకారులకు నిపాతవిధానసంకల్ప ముదయింపదు. ఈనిపాతమునందయినను పూర్వపుశంకలు పూర్తిగా నివర్తింప కున్నవి.

రూపసిద్ధికి మార్గమేదియయినఁగానిండు. 'రాజు' అని యీ సూత్రమున నిపతింపఁబడినది ప్రథమాంతమా ? ప్రాతిపదికమా ? ప్రథమాంతమయినచో దీనిపయిని దక్కినవిభక్తులు చేరుటెట్లు ? ప్రాతిపదికమయినచో దీనికి ప్రథమైక వచనలోపమెట్లు ? అనుప్రశ్నలు తొలఁగలేదు.

ప్రథమైకవచనాంతముమీఁద నితరవిభక్తులు చేరుట భాషోత్పత్తిమార్గము ననుసరించి కొన్నియెడల వాస్తవికమేయయినను వ్యాకరణప్రక్రియారీతులకుమాత్ర మది కేవలవిరుద్ధము. కావున నిపాతములనెల్ల ప్రాతిపదికములుగనే గ్రహింప వలయును. అటులయినచో వానిపయిని నెల్లవిభక్తులుచేరి సకలరూపములకు సౌకర్యమేర్పడును.

కావుననే ఇట్టివానినెల్ల ప్రథమాంతములుగఁగాక ప్రాతిపదికములుగనే సూరి నిపతింపఁదలంచెను. తత్సమ-82వ సూత్రమునఁగల "సలోప స్త్రీవద్భా వంబులు దీనిచే నిపతింపంబడియె" అనువాక్యముచే సూరితలంపు సువ్యక్తమగు చున్నది. 'వేధ' అను ప్రాతిపదికముపయినివచ్చు ప్రథమైకవచనము లోపించు టకేగదా స్త్రీవద్భావనిపాతనము. ఈ సందర్భమున బాలవ్యాకరణమునఁగల నిపాతములన్నింటిని ఒక్కమాఱు పరికింపుఁడు :

| | | |
|---|---|---|
| క్రుప, నావ (తత్సమ-51, 63) : | స్త్రీలింగములు | "స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబు నకు లోపంబగు" (చూ.తత్సమ-57) |
| వేధ, పురోధ (తత్సమ-82) : | స్త్రీతుల్యములుగా నిపాతితములు | |
| గుబ్బెత, ఓండత, పుట్టుత (తద్ధిత-21); పయ్యద (ప్రకీర్ణక-5) : | స్త్రీసమములు | |
| భువి (తత్సమ-62), దివి, హృది (తత్సమ-84) : | ఇకారాంతములు | "ఇగ్లౌరా........ లోపంబగు" (చూ.తత్సమ-44) |

పయిని సూచించినరీతిని వీనికెల్ల ప్రథమైకవచనలోపమార్గములు సుక రములు, లక్షణసిద్ధములు. 'రాజు' అనునది వీనిలోఁ జేరునదికాదు. దీనికి విష్ణుశబ్దమునకువలె 'వు, డుఙ్' వర్ణకములు ప్రసక్తములు కాకమానవు.

"నిపతించుట ప్రయోజనశూన్యమగునుగాన దీనిపైని వు, డుఙ్వర్ణకములు గలుగ"వని ఒకకల్పన పేటికాటీకలోఁ గానవచ్చును. ఆ కల్పన యీ తావున నసిపడునదికాదు.

ఈ నిపాతము వారన్నట్లు ప్రయోజనశూన్యముకాదు. ప్రాతిపదిక స్వరూపము 'రాజ'అనికాకుండ 'రాజు' అని యగునని తెలుపుచు ఈ నిపాత విధానము సప్రయోజనమే యగుచున్నది.

ఏప్రయోజనమునులేక సూత్రము వ్యర్థము కావలసిన పరిస్థితిలోమాత్రమే వారు సూచించిన సామర్థ్యకల్పన చెల్లును. విధానమునకుఁ బ్రయోజనముగల యిట్టిచోటులందు ఆ కల్పన సుకరముగాదు. ఈ తికమకలులేకుండ "ఉత్వస్త్రీ వద్భావంబులు దీనిచే నిపతింపంబడియె" అని సుస్పష్టమగురీతిని సూటిగా ఒక్కపలుకుతో సూరి ఈ ప్రథమైకవచనలోపమునకు దారిచూపిన మేలయ్యేడిది.

ఏలచూపలేదో! ఏద్దియేనియు నొక్కనిమిత్తంబులేక తక్కదు. ఏయుక్తవమిఁదం దెలియనగును. ఇఁక విషయాంతరము.

సూరి 'రాజు'శబ్దమును తత్సమముగాఁ దలంచుట నిస్సంశయము — కావుననే దీనిని ఈ 'తత్సమ' పరిచ్ఛేదమున సాధించియుండెను. మఱియు, సంస్కృత సమంబుల సమాసమునకు 'రాజునాజ్ఞ' యనియు, సంస్కృత సమమునకును, ఆచ్ఛికమునకునుగలుగు మిశ్రసమాసమునకు 'రాజుముదల' యనియు నుదాహరించియుండెను (సమాస-2). రాజుశబ్దము తత్సమమను దృష్టి యుండుటంబట్టియే "మఱియు రాజుశబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి" (సంజ్ఞా-10) అని విశేషముగాఁ బ్రతిపాదించుటయు నావశ్యకమయినది. ఇవియన్నియుంగాక యిది తద్భవమేయని యాతఁడనుకొన్నచో ఈ నిపాతసూత్రమును రచించియేయుండఁడు. ఈ వ్యాకరణమున తద్భవ ప్రాతిపదికములకుఁ బ్రక్రియనుజూపు సంకల్పమే యాతనికి లేదు. చింతామణ్యాథర్వణములును దీనిని తత్సమముగానే తలంచినవి.

ఇఁక రాజుశబ్దమునందలి జకారము దంత్యమగుట యుచ్చారణాను భవమునుబట్టి ప్రత్యక్షమగుటచే దానింగూర్చి యభిప్రాయ భేదములకుఁ బ్రసక్తియే యుండరాదు. ఉకారముతోఁడి జకారమాచ్ఛికములందు నెల్ల యెడల దంత్యమగుటచే, తత్సాదృశ్యమునుబట్టిగాని, వాజి........ వాజులు, రాజి........ రాజులు మున్నగు కొలఁది తత్సమములలోని దంత్యోచ్చారణమును బట్టిగాని రాజుశబ్దమునందలి జకారము దంత్యముగా నుచ్చరింపఁబడుట యసంభావ్యము కానేరదు. దీనికయి రాజుశబ్దము తత్సమము, తద్భవముగూడఁ గలదనియు, తత్సమమునందలి జకారము తాలవ్యమనియు, తద్భవమునందలిది దంత్యమనియు నిట్టి సమన్వయమార్గము కొందఱు చూపుదురు. ఒకేశబ్దము తత్సమము, తద్భవముకూడ నగునని అసంకోచముగా ననఁజాలము.

ఇఁక తద్భవమన్నచో 'రాజు'నందలి జకారము సహజముగ దంత్యమే యగుంగావున రాజుశబ్దమునకు వైకృతత్వము నంగీకరింతమనియు, నట్లయి నచో, సంస్కృతసమమునందలిచజలు దంత్యములయ్యెనే యనుకొనవలసిన యసంతృప్తి మఱియుండదనియు, వికృతికావ్యమగు యయాతిచరితమునఁగల 'రాజు' శబ్దప్రయోగము దాని తద్భవత్వమునకు నాధారము కాఁగలదనియు ప్రౌ. వ్యా. కర్త యభిప్రాయము.

కాని, యెటులో రాజుశబ్దమును వైకృతముగా సమ్మతించినను ఖగరాజు శబ్దమును వైకృతమనఁజాలరుగదా! ఖకారము వైకృతమున నుండదుగదా! ఆ తత్సమమునందలి జకారము దంత్యమగుటలోని విలక్షణత నంగీకరింపక యెట్లును దప్పదుగదా! అట్టియెడ వ్యస్తమగు రాజుశబ్ద జకారము దంత్యమగుట

విశేషమని యంగీకరించుటలో మాత్రము బాధయేమిగలదు? తన్మాత్రమునకయి పూర్వలాక్షణికులెల్లరును తత్సమమని తలంచిన శబ్దమును ప్రకృతివర్ణముల పరిణామములేనిదానిని వైకృతమనుటలోని సామంజస్యమెట్టిది? ఆవశ్యకత యెట్టిది?

ఇఁక, ప్రాణాయామముతో పద్యములనడకి సాగింపవలసిన ఒక్కయచ్చ తెనుఁగుకావ్యమున, ఏమూలనో ఎట్టియనవధానతవల్లనో, ఎట్టియవసరముననో ఒకతత్సమశబ్దము దొరలినయెడ, ఆశబ్దము వైకృతమనుటలో ఆప్రయోగమునే పరమప్రమాణముగా నంగీకరింపనురాదు. అచట నాతత్సమప్రయోగము దుష్టమని ఘోషింపనురాదు. నిర్బంధకవితలో నిట్టినెరసులు గణనీయములుకావను నుదారభావముతో అట్టివానిని చూచిచూడనట్లుపేక్షించుట యుచితమేమో, యోచింపుఁడు

**79.** జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు. ఱా.

జగము, జగత్తు; ఇంద్రజి, ఇంద్రజిత్తు.

ఋత్విగాదియగుటంజేసి యింద్రజితుండనియు వాడంబడు.

"ఇంద్రజి ననిలోఁజంపి మ
హేంద్రాది త్రిదశనుతులకెక్కినయనుజున్" —నిర్వచనోత్తర-1-81.

**80.** సాంతంబుల తుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు. లాం.

ఉరము, ఉరస్సు; వక్షము, వక్షస్సు; అర్చి, అర్చిస్సు; ధనువు, ధనుస్సు; ఆయువు, ఆయుస్సు.

బహుళగ్రహణంబునంజేసి పయః ప్రభృతుల సకారంబునకు లోపంబులేదు: పయస్సు, వయస్సు, సరస్సు.

సాంతశబ్దముతుదినుండునది సకారముగాక మఱియొకవర్ణము కానేరదు. కావుననే దీనియనంతరసూత్రమున సూరి "మహద్వాచకంబులగు సాంతంబుల కంతలోపంబేని..." అని వచించెనేగాని 'అంతసకారలోపంబు'అని నిర్దేశింప లేదు. అటులే యీ సూత్రమున 'తుదివర్ణమునకు లోపంబ'ని సాధారణ నిర్దేశము చేయక 'తుదిసకారంబునకు'అని పునరుక్తిగా వర్ణవిశేషనిర్దేశము చేయనేల? అనుశంక పొడమవచ్చును. పొడమఁదగినదే. కాని యిదివట్టి పునరుక్తికాదు.

సంస్కృతమునుండి తత్సమప్రాతిపదికములను గ్రహించుటలో అజంతములందు సంస్కృత ప్రాతిపదికములే యధాతథముగాఁ దెలుఁగున గ్రహింపఁబడును.

హలంతములం పద్ధతి విలక్షణము. అందు సాధారణముగా సంస్కృత ప్రథమైకవచనాంతతుల్యములు తెలుఁగున ప్రాతిపదికములు (తత్సమ-67). కొలఁది తావులందు ద్వితీయైకవచనాంతతుల్యములు గ్రహింపఁబడుటయుం గలదు (తత్సమ, 70, 73-81). ఒక్కసకారాంతములందేమాత్రము సంస్కృత ప్రాతిపదికములే తెలుఁగునఁగూడఁ బ్రాతిపదికములు.

సకారాంతప్రక్రియకు నిది మొదటిసూత్రముకావున నితర విలక్షణమగు నీ ప్రాతిపదికములతీరును సూచించుటకయి పునరుక్తమనఁదగినను నిందు 'తుది సకారంబునకు' అని నిర్దేశింపఁబడినది. అనఁగా 'సాంతశబ్దములందు, తుదిని సకారముండునటులు ప్రాతిపదికములను గ్రహింపుఁడీ' అని సూత్రకర్తసూచన. ప్రథమాంతములను పరిగ్రహించినచో 'మనః — అంగిరాః' మున్నగువానిలో విసర్గములేగాని తుదిని సకారమే లభింపమిగాన, సంస్కృతప్రాతిపదికములను, మనస్—అంగిరస్, అనుచున్నవానినున్నయటులు తెలుఁగునామములుగా గ్రహింపవలయునని సూత్రకారుని యాంతర్యము.

ఇట్లు సకారయుక్తములను గ్రహించినపక్షముననే మనస్ అనువాని సకారమునకు వైభాషికద్విత్వము (83) కలిగి మనసు, మనస్సు కుదురుపడును. అంగిరస్ అనుదానిలో సకారములోపించి (81) ఉత్వడుజ్జులతో 'అంగిరుడు' సులభముగా సిద్ధమగును.

**81.** మహద్వాచకంబులగు సాంతంబుల కంతలోపంబేని ద్వితీయైకవచనాంత తుల్యత్వంబేనగు. ౮౧.

> అంగిరుఁడు, అంగిరసుఁడు; ఉగ్రశ్రవుఁడు, ఉగ్రశ్రవసుఁడు; ప్రచేతుఁడు, ప్రచేతసుఁడు; ఊర్ధ్వరేతుఁడు, ఊర్ధ్వరేతసుఁడు.

**82.** వేధ పురోధ పురోధసుఁడు. ౮౨.

> వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు వైకల్పికముగా సలోపస్త్రీవద్భావంబులు దీనిచే నిపతింపంబడియె.

"అన్యథాప్రయోగే ప్రాప్తే అన్యథాప్రయోగకరణం నిపాతః"

సామాన్యప్రక్రియకు లోఁబడక విలక్షణముగానున్న యొకశబ్దమునకుఁ బ్రత్యేకప్రక్రియ చూపక, దానిరూపము 'ఇది' అని సిద్ధరూపమును మాత్రమే నిర్దేశించుటకు 'నిపాత'మని పారిభాషికవ్యవహారము.

**83.** మనఃప్రభృతుల సకారంబునకు ద్విత్వంబు విభాష నగు. ౮౩.

మనసు, మనస్సు; శిరసు, శిరస్సు; సదసు, సదస్సు.
సలోపంబయ్యెనేని : మనము, శిరము, సదము.

84. దున్హ్రూచ్ఛబ్దంబులకు దివి హృది యగు. లా.

దివి, దివులు; హృది, హృదులు.
దివ్, హృచ్, అని సంస్కృత ప్రాతిపదికములు.

85. స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులం గూడి యుండఁ బ్రవర్తిల్లు. లా.

| నామము | స్త్రీప్రత్యయాంతము | తత్సమము |
|---|---|---|
| కర్తృ | కర్త్రీ | కర్త్రి |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని |
| మతిమత్ | మతిమతీ | మతిమతి |
| గుణవత్ | గుణవతీ | గుణవతి |
| విద్వస్ | విదుషీ | విదుషి |
| వనజముఖ | వనజముఖీ | వనజముఖి |
| | వనజముఖా | వనజముఖ |
| మీననేత్ర | మీననేత్రా | మీననేత్ర |

అంగాదులకుఁదప్ప సంయోగోపధంబులకు ఙీ ప్రత్యయంబు లేమింజేసి మీననేత్రి, పద్మనేత్రి ఇత్యాదులసాధువులు.

పాణినీయమతముసుబట్టి
అఙ్గ: కోమలాఙ్గీ; గాత్ర. సుగాత్రీ; కణ్ఠ· కలకణ్ఠీ; ఓష్ఠ: బిమ్బోష్ఠీ; జఙ్ఘా: సుజఙ్ఘీ; దన్త: శుభ్రదన్తీ, కర్ణ: సుకర్ణీ; శృఙ్గ: దీర్ఘశృఙ్గీ; పక్ష: ఉలూకపక్షీ; పుచ్ఛ: సుపుచ్ఛీ; అక్షిన్: (జలజాక్ష) జలజాక్షీ; సక్థిన్: (దీర్ఘసక్థ) దీర్ఘసక్థీ
అనునివిదప్పఁ దక్కిన సంయోగోపధములగు శరీరావయవ వాచకములకు **ఙీష్ (= ఙీ = ఈ)** ప్రత్యయము రాదుగావున మీననేత్రి, పద్మనేత్రి **ఇత్యాదులు సాధువులుకావని** పయివాక్యమునకుఁ దాత్పర్యము.

సంస్కృతవ్యాకరణమున ఙీప్, ఙీష్, ఙీన్ అను స్త్రీప్రత్యయములు మూఁడింటిని నిర్దేశించునపుడు సంగ్రహమునకయి తుదిపొల్లులు విడిచి 'ఙీ' అని వ్యవహరింతురు. ఆరీతినిట ఙీష్ప్రత్యయమును 'ఙీ ప్రత్యయంబు' అని సూరి వ్యవహరించెను. ప్రథమముద్రణమున (1858) పాఠమిట్లేకలదు. ఇటీవలఁ గొందఱు 'ఙీష్ ప్రత్యయంబు' అని ముద్రించిరి. ఇట షకార మక్కఱలేనిది. సూరి లిఖింపనియది.

మఱికొందఱు 'ఙీప్ప్రత్యయంబు' అని ముద్రించిరి. అది తప్పుపాఠము. ఇట రెండవపకారము లిఖింపరాదు. ఇది 'ఙీప్' కానేకాదు. 'ఙీ ప్రత్యయంబు' అను సాధుపాఠమును భావిముద్రాపకులు గమనింతురుగాక.

**86.** మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ బ్లీబత్వంబు విభాషనగు. రా౩.

> పద్మలత మనోహరి. పద్మలత మనోహరిణి. హృద్యంబగు విద్య, హృద్యయగు విద్య. మొదవులలోఁ గపిల వరిష్ఠంబు, కపిల వరిష్ఠ.

> "'మొదవులలో'నెల్లఁ 'గపిల' మొదవు 'వరిష్ఠంబు' రాజముఖ్య
> నియతిమై....." —భార-అను. 3-19.

అనుభారతపద్యములోని పదములేర్చి పయివాక్యము కూర్చినటుల కానవచ్చును. సూరికి భారతమునందలి పదజాలమునెడ ప్రీతిమిక్కుటము. ఈ యంశము నీతిచంద్రికయందును దెల్లమగును.

**87.** భవచ్ఛబ్దాదులకిందుఁ బ్రయోగంబు లేదు. రా౪.

> భవదాదులగు హలంతసర్వనామంబులకును, శత్ర రేఫాంతాదులకును దెనుఁగుభాషయందు వ్యవహారంబు లేదనియర్థము.
>
> సమాసంబులం దొలుతం గదిసి యిందుం బ్రయుక్తంబులగు : భవద్గుణంబులు; త్వదాశ్రయము; మత్పుణ్యము; లసద్రూపము; భవిష్యత్కాలము; ధూర్వహము. ఇత్యాదు లెఱుంగునది.
>
> ఇది తత్సమపరిచ్ఛేదము.

ఈపరిచ్ఛేదమున వివిధములగు తత్సమశబ్దములు నిష్పాదితములు. ఇఁక అచ్చతెనుఁగుశబ్దములనిష్పత్తి యనంతరప్రకరణమునఁ జూపఁబడును.

---

# అచ్చిక పరిచ్ఛేదము

**1.** సంస్కృత సమేతరంబయిన యీ భాష యచ్చికంబనఁ
బడు. ౧.

స్పష్టము.

సంస్కృతసమములుగాక తద్భవము, అనఁగా, సంస్కృత భవములు, ప్రాకృత సమములు, ప్రాకృత భవములు, దేశ్యములు అను నాలుగు విధముల శబ్దములును, అచ్చికములేయని సూత్ర తాత్పర్యము. సుస్పష్టము.

ఈ సూత్రమును సంస్కృతీకరించునట్టి హరికారికాకర్త సంస్కృత సమమన్నను, తత్సమమన్నను నొక్కటియగదా యను భ్రాంతితో ఛందోనుకూలతకయి :

"తత్సమేతర భాషేయమ్ అచ్ఛేతి కవయో విదుః"
అని యనువదించెను.

తత్సమేతర మనఁగా సంస్కృత, ప్రాకృత సమభిన్నమని యర్థము. కావున సంస్కృత సమములవలెఁ బ్రాకృతసమములుగూడ అచ్చికములు గావను నభిప్రాయము ఆ యనువాదమునఁ దెలియుచున్నది. కాఁగా దీనినిబట్టి సిరి, అగ్గి, రాణి, జడ, మెర మొదలగు పెక్కుశబ్దము లాచ్ఛికములు కానేరకున్నవి. వీనినెల్ల నాచ్ఛికములుగ లాక్షణికు లెల్లరును వ్యవహరించియున్నారు. ఇవి యాచ్ఛికములను నిశ్చయముతోడనే సిరి, రాణి మొదలగు నీ ప్రాకృత సమముల నెన్నిటినో కవులు తమయచ్చతెనుఁగు కావ్యములందుఁ బ్రయోగించియున్నారు. శిష్టువారి యనువాదసూత్రమునుబట్టి యాప్రయోగములెల్లను అసాధువులనవలసివచ్చును. అది చెల్లనిమాట.

కవిహృదయము తెలిసికొన్నను దెలియకున్నను, కావ్యానువాదమయినచో స్వతంత్రానువాదమని సద్దుకొనవచ్చుఁగాని, లక్షణగ్రంథ సందర్భమున మాత్రము పూర్వాపరములు పరికింపక, ప్రణాళిక నాకళించుకొనక, అనవధానముతో ననువదించునెడ నిట్టిచిక్కులు సంభవించుట తప్పదు. మూలప్రణాళికయవగతము కామింజేసి తటస్థించిన తబ్బిబ్బులు హరికారికలలోఁ బెక్కులు గలవు. అనువాద వివేచన ప్రకరణమున వానిని విపులముగఁ జూచియుందురు.

**2.** అచ్ఛికశబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం గ్లీబసమంబులు నయియుండు. ౨.

స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపాదికంబును గ్లీబసమత్వాతిదేశంబుచే ముపర్ణకంబు నగునని యెఱుంగునది.

అన్న, మిన్న, అద్ద, గద్ద, జాణ, గాణ, ఓడ, గోడ.
ఇత్యాదులు స్త్రీసమంబులు.
బియ్యము, నెయ్యము, అల్లము, మొల్లము, సున్నము, సన్నము
ఇత్యాదులు క్లీబసమంబులు.
తఱుచు గననుటచేఁ బుంలింగతుల్యంబులుం గొండొకకలవని
తాత్పర్యము :

కొమరుఁడు, చందురుఁడు, జముఁడు, కందుఁడు—ఇత్యాదులు.

ఇట చింతామణికారులు
"వికృతౌ సర్వేశబ్దాః క్లీబసమాః స్త్రీ సమాశ్చ నాన్యేస్యుః"
అని సూత్రించి యుండిరి.

అచ్చతెనుఁగు శబ్దములు క్లీబసమములుగా స్త్రీ సమములుగా మాత్రమే యుండును. పుంలింగసమములు లేనేలేవు : అని యా చింతామణి సూత్రమునకుఁ దాత్పర్యము.

సంస్కృతశబ్దము లన్నిటికిని వ్యాకరణములందును, నిఘంటువు లందును లింగనిర్ణయము చేయఁబడినది. ఈ నిర్ణయమునకయి శబ్దముల వర్గీకరణము మిక్కిలి క్లేశదాయకము. కావుననే కాఁబోలును తెలుఁగు శబ్దములకు నట్టి లింగనిర్ణయము గావించుటకు మన లాక్షణికులెవ్వరును బూనుకొన్న వారుకారు.

శబ్దజాలము నేకరాశిగా నుంచుటకంటె శాఖలుగా విభజించినచో వాని స్వరూపమును వేఱువేఱుగా బోధించుటలో సౌకర్యముండుటంబట్టి, ఏదేనొక విభాగ మావశ్యకముగా చింతామణికర్తకుఁ దోఁచినది. తత్సమ శబ్దములను సంస్కృతమున నిర్ణీతములగు నాయాలింగములు కలవానినిగనే వ్యవహరించుటకు ఆయన నిశ్చయించుకొనిరి. వీనిలో స్త్రీలింగ శబ్దములకుఁ బ్రథమైకవచనము లోపించుటయు, నపుంసకశబ్దములకు మువర్ణకము కలుగుటయుఁ బ్రధాన చిహ్నములు. ఆ చిహ్నములంబట్టి ఆచ్ఛికశబ్దములలో ప్రథమైకవచనము లోపించిన వానిని స్త్రీసమములుగను, మువర్ణకము కలవానిని క్లీబసమములుగను నిర్దేశించిరి.

రెండేశాఖలుగ వారు విభజించియుండ, డువర్ణకాంతములుగూడఁ గొన్ని గానవచ్చుచుండుటంజేసి సూరి, పుంలింగతుల్యంబులును నల్పసంఖ్యాకములు గలవని యిట నిరూపించెను. ఇవి యత్యల్పసంఖ్యాకములుగావుననే పయిరెండుశాఖలశబ్దములను స్త్రీసమములు, క్లీబసమములుఅని వ్యవహరించినటులు వీనిని బుంలింగసమములని సమశబ్ద ఘటితముగా వ్యవహరించుటకు

మనసొప్పక, ఆ భేదము గోచరించుటకయి 'పుంలింగ తుల్యములు' అని తుల్య శబ్దమును సంఘటించెను. 'పుంలింగసము' అను శబ్దమును బాలవ్యాకరణమున ఏ సందర్భముననుు ప్రయోగించి యుండలేదు.

పయిని నిరూపించిన మూఁడుశాఖల శబ్దములలో స్త్రీసమములు హెచ్చనియుఁ, క్లీబసమములు తక్కువయనియుఁ, పుంలింగ తుల్యములు మిక్కిలి తక్కువ యనియుఁగూడ సూరి యభిప్రాయము. ఆ తలంపును సూచించుటకే యిచటి యుదాహరణముల సంఖ్యలోఁగూడ హెచ్చు తగ్గులను పాటించి యుండెను. పరిగణింపుఁడు. వరుసగా 8-6-4 కానవచ్చును.

మఱియు సూత్రమందలి 'తఱుచుగా' అను పదమును 'స్త్రీసమంబులు' అనుదానితో నన్వయించుట యాతని సంకల్పము. తఱుచుగా స్త్రీసమములును, తక్కువగాఁ క్లీబసమములును గలవని తాత్పర్యము. ఇదే యాతని తాత్పర్యమయినటులు నిర్ణయించుటకు నింతకంటె సుస్పష్టమగు వేఱొక యాధారమును గలదు.

ఈతఁడు తన సూత్రాంధ్ర వ్యాకరణమున
"ఆచ్ఛికా 'బహవః' స్త్రీసమాః" — "'కేచన' క్లీబసమాః"
అని సూత్రించి యుండెను. దీనినిబట్టి యాతని హృదయము సువ్యక్తమగుచున్నది.

దూరము నిదానింపఁగా, సూరి చూపునందు, ఈ స్త్రీసమ క్లీబసమశబ్దములు రెండును నాచ్ఛికపదములకు మాత్రమే చెల్లవలసిన సంజ్ఞలుగాఁ బొడగట్టెడును.

తత్సమములలోఁ గొన్నిపుంలింగములకు స్త్రీలింగసాదృశ్యమును, కొన్ని స్త్రీలింగములకు నపుంసక లింగసాదృశ్యమును నతిదేశింపవలసిన తావులందు
"సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబు లగు" —తత్సమ-60.
"కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు" —తత్సమ-66.
అని యిట్లు స్త్రీలింగతుల్యములు క్లీబతుల్యములు నని వ్యవహరించెనేగాని యెక్కడోనయినఁ దత్సమశబ్దములను స్త్రీసమ క్లీబసమశబ్దములతో వ్యవహరింపలేదు. అటులే ఆచ్ఛికశబ్దములను స్త్రీతుల్య క్లీబతుల్యశబ్దములతో వ్యవహరించియు నుండలేదు. అనఁగా

స్త్రీసమములు, క్లీబసమములు: ఇవి సంజ్ఞాప్రాయములు. ఆచ్ఛికములకు మాత్రమేచెల్లును. పుంలింగసమమను సంజ్ఞయే లేదు. ఆ శబ్దము బాలవ్యాకరణమునఁ బ్రయోగింపఁబడనేలేదు.

స్త్రీతుల్యములు, క్లీబతుల్యములు : ఇవి సంజ్ఞలవంటివికావు. స్త్రీసదృశ క్లీబసదృశ శబ్దపర్యాయములు. ఈ వాడుక తత్సమములకు మాత్రమే.

పుంలింగతుల్యము: పుంలింగసదృశమని యర్థము. ఇదియు సంజ్ఞకాదు. కావున ఈ శబ్దమును దత్సమాచ్ఛికసాధారణముగ వ్యవహరింపవచ్చును.

సాంకర్యము లేకుండుటకయి యేర్పఱుచుకొన్న యీ వ్యవహార నియమమునకు బాలవ్యాకరణము మొత్తమున నొక్కచోటనయిన శైథిల్యము గానరాదు.

సంధి : 25, 35; తత్సమ : 18, 60, 66; ఆచ్ఛిక : 2; కారక : 20; సమాస : 5, 6, 7.

ఈ సూత్రములు పరికించినచో సూరిదృష్టిలోఁగల యీ నియమము తేటతెల్లము కాఁగలదు.

ఇన్నితావులందు బింకము సడలనీక స్త్రీసమ క్లీబసమశబ్దములను ఆచ్ఛికవిషయమునమాత్రమే వ్యవహరించిన యీతని పారిభాషిక పదపద్ధతిని, అనువాదకుఁడగు హరికారికాకర్తయు, ప్రత్యేకించి పేరులేలగాని, పెక్కురు టీకాకర్తలును, బాలవ్యాకరణము నాధారముగాఁగొని భాషానుశాసనములు రచించిన అనంతరవ్యాకర్తలును, గుర్తించినటులే కానరాదు. వీరు తత్సమ శబ్దములనుగూడ స్త్రీసమములని కలగలుపుగా వ్యవహరించిన తావులనేక ములు గలవు. అట్లు వ్యవహరించుటలోఁ దత్సమాచ్ఛికసాంకర్యము సంభ వించి స్పష్టత చెడిపోవుటమాత్రమేగాక రూపసాధనప్రక్రియలో 'బాలకులు యోధయయిరి' మున్నగు నపరూపములుగూడఁ దటస్థించును. ఆయంశము లింతకుముందే వివరింపఁబడినవి (చూ. తత్సమ 60). ఈసందర్భమున సమతుల్యశబ్దముల వాడుకలో వివేచనదృష్టి సూరికిఁ బూర్వులగు లాక్షణికు లలో నెవ్వరికెటులున్నది ? అను నంశముగూడ నా సూత్రముననే వివరింపఁ బడినది.

ఇట సూత్రవృత్తిలోని 'ప్రథమైకవచనలోపాదికం' బనుచో ఆదిపద ముచే 'చిగురుంగయిదువు' 'నొగసుందనము' ఇత్యాదులందు నుగాగమాదులు గ్రాహ్యములు.

ఈ సూత్రమున

"స్త్రీసమంబులుం గ్లీబసమంబులయియుండు"

"స్త్రీసమంబులుం గ్లీబసమంబులనయియుండు"

అని రెండు పాఠములగపడుచున్నవి. ఇందేది చిన్నయసూరీయమో నిశ్చయించుకొనవలసియున్నది. అర్థభేదము లేనపుడు ఏదయిననేమియన రాదు. అది పాఠవిమర్శనమునం దనవలసిన మాటకాదు.

బాలవ్యాకరణమున ఉః సూత్రమునను మొదటి పరిచ్ఛేదములో పది సూత్రములందును, ఏతదనంతరము ఇరువదియయిదు సూత్రములందును సముచ్చయార్థక 'ను' శబ్దప్రయోగము గలదు.

ఈ 35 తావులందును సముచ్చీయమానములగు శబ్దములన్నిటియొద్దఁగాని తుదిదానియొద్దఁగాని 'ను' శబ్దము ప్రయుక్తమయియున్నది. మొదటివానికుండి తుదిదానికి లేకుండుట యొక్కచోటనయినఁ గానరాదు. సూత్రములందు రచనా సరణి యిట్లున్నది. మఱియు పరతావున విశేషణముల ప్రయోగరీతిని నిరూపించు సందర్భమున

"...తుదివిశేషణంబునకేని విశేష్యంబులన్నింటికేని మీఁద
సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపంబడు" - బాల. కార-311.

అని సూరి నుశబ్దప్రయోగ పద్ధతిని వక్కాణించియున్నాఁడు. కావున

'క్లీబసమంబులు నయియుండు'

అనుపాఠమే చిన్నయసూరీయముగా నెన్నఁదగును. ముద్రితములు గుర్తింపుఁడు.

3. బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు. ౬.

మహత్త్వంబున వీని కుత్వ డుజాదులు నమహత్త్వంబున ముప్వర్ణకాదులును స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ సమాసంబునుం గలుగునని యెఱుంగునది.

బల్లిదుఁడు....బల్లిదము....బల్లిదురాలు.

బల్లిద, అక్కజ, కావల, బెట్టిద, బెడిద, మిసిమింత, మొక్కల ఇత్యాదులు బల్లిదాదులు.

సంస్కృతమున విశేష్యమునుబట్టి కొన్ని విశేషణశబ్దములకు మూఁడు లింగములందును రూపములుండును.

సున్దరః పురుషః — సున్దరమ్ ముఖమ్ — సున్దరీ రమణీ.

ఇట్టి సుందరాది శబ్దములకు విశేష్యనిఘ్నములని వ్యవహారము. విశేష్యాధీనము లనియర్థము. తెనుఁగునఁగూడ నిట్టివిశేష్యనిఘ్నములు కొన్నిగలవని చూపుటకే యీసంస్కృతతుల్యతావిధానము.

ఈ బల్లిదాదులను సంస్కృతతుల్యము లనవలయుంగాని సంస్కృత సమములనుట సూరికి సమ్మతముకాదు. అటులే తత్సమములను సంస్కృత సమములనవలయునుగాని సంస్కృతతుల్యములనుటయు సమ్మతముగాదు.

బల్లిద, అక్కజ, కావల మొదలగునాచ్ఛికములు సంస్కృతతుల్యములు.

ఋతువు, పితృగాణము, క్ష్మాత్రము మున్నగుతత్సమములు సంస్కృత సమములు (చూ. సంజ్ఞ 4, 10, 16, 17; ఆచ్ఛిక 1; సమాస 2 మొ.). దేనిపేరు దానిదే. దేని ప్రయోజనము దానిదే. కలగలుపు వలనుపడదు. అసందిగ్ధత సూత్రభాషకు ముఖ్యలక్షణము.

"అల్పాక్షర 'మసందిగ్ధం' సారవ ద్విశ్వతోముఖమ్"
సమానార్థకములయిన సమతుల్యశబ్దముల వాడుకలో నయితము సాంకర్యము లేకుండ గ్రంథమునందెల్లయెడల నిశితమగు దృష్టి సారించిన సూరి వైశద్యాభిలాష యెంతటిదయియుండునో మెలఁకువతో పరికింపుఁడు. నచ్చినచో మెచ్చికొనుఁడు.

ఈ బల్లిదాదులు సంస్కృతతుల్యములుగవాయని రామాది సంస్కృత నామంబుల సంబుద్ధిడుజ్జునకువలె వీనిసంబోధన 'డు' వర్ణకమునకు లోపము గలుగదు.

'ఓ రామా' యనునటుల 'ఓబల్లిదా' యనరాదు. 'ఓబల్లిదుఁడా' యనునదే సాధురూపము (చూ. తత్సమ-34.).

4. మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుజ్జగు నుత్వంబుగాదు. ఆ.

మగఁడు; మనుమఁడు; కయిరఁడు; కత్తళఁడు.
మగ, మనుమ, రాయ, పాప; ప్రే, తే, ఈ, కా ప్రత్యయాంతంబులు — ఇత్యాదులు మగాదులు.
కయిర, కత్తళ, జన్న, నీల — ఇత్యాదులు కయిరాదులు.

కొమరుఁడు మున్నగువానికివలె మగాదులకుఁ బుంలింగతుల్యతాతిదేశమువల్లనే డుజ్జు ప్రాప్తించును. ఉత్వనిషేధమునకయి యీసూత్రమున మగాదిపరిగ్రహణము.

కయిరాదులు తిర్యగ్వాచకములగుటచే సమహత్తులుగాన వానికి డుజ్జు రాకుండుటచే, తత్ప్రాప్తికయి కయిరాదిపరిగ్రహణము. అమహత్తులగు వీనికి నుత్వము రానేరాదుగావున తన్నిషేధము ప్రసక్తమేకాదు.

కాఁగా మగాదులకు నుత్వమును వారించుటయు, కయిరాదులకు డుజ్జును సంపాదించుటయు ఈ సూత్రమునకుఁ బ్రయోజనములు.

ఈ మగాదిగణమున ప్రే, తే, ఈ, కా ప్రత్యయాంతములు చేర్పఁబడియున్నవి. ప్రేఁడు, తేఁడు, అటమటీఁడు, ఆటకాఁడు.

అకారమునకు విహితమైన ఉత్వము వీనిలోఁ బ్రాప్తించుటకు నవకాశమే కానరాదు. ఒకపక్షమున ఆటకాఁడు అనుచో దీర్ఘాకారమునకుఁ గూడ నుత్వము కలుగునేమోయని సందేహించినను దక్కిన మూఁడిటిలో నట్టిసందేహమునకు లేశమును దావులేదు. అప్రాప్తమునకు నిషేధ మనావశ్యకము గదా! ఇట్టియెడ 'ఉత్వ' నిషేధమాత్రమునకయి నిబద్ధమయిన మగాదిగణమున ప్రే, తే, ఈ, కా ప్రత్యయాంతముల పాఠమునకు సూత్రకారుని చూపులో నెట్టి ప్రయోజన ముద్దిష్టమయియుండునో; .... .... తడుకున బయలుపడకున్నది.

తద్ధితములలో 15, 11 సూత్రములందు 'ఈ' 'కా' ప్రత్యయములను విధించిన సందర్భమున 'ఈ' 'కా' ప్రత్యయాంతములకుఁగల మగాదిగణ పాఠమును సూరి తిరిగి స్మరణమునకుఁ దెచ్చియుండెను. మఱియు, తద్ధిత పరిచ్ఛేదమున 23వ సూత్రమున పగలాఁడు ఇత్యాదులు సాధించుచు, "ఆ ప్రత్యయాంతంబు మగాదిగణంబు" అని యుల్లేఖించియుండెను.

ఇటులీతద్ధితాంతములు మూఁడిటిని మగాదిగణగణ్యములుగఁ దాను స్పష్టముగ నిర్దేశించియు, ఆ మూఁడిటిలో 'ఈ' 'కా' ప్రత్యయాంతములను మాత్రమే గణమునఁ బేర్కొని, 'ఆ' ప్రత్యయమును నిర్దేశింపకుండుటకు హేతువేమి? అని కొందఱిటఁ బ్రశ్నింపవచ్చును.

పట్టుగలప్రశ్న. 'ఆ' ప్రత్యయము గణమున విడువఁబడినచో దానికి హేతువును నిరూపించుట దుష్కరమే యయ్యెడిది. కాని యిట 'ఆ' ప్రత్యయమును విడువలేదు.

పయికగపడదుగాని 'ఈ' 'కా' ప్రత్యయములలో 'ఆ' ప్రత్యయము గూడ నిముడియేయున్నది. ఎట్లన:

'ఈ + కా + ఆ + ప్రత్యయములు' అనుచో సవర్ణదీర్ఘముచే 'ఈ కా ప్రత్యయముల'ని సంధియేర్పడినది. సమాసమగుటచే సంధి తప్పనిదికాదు.

ఈసంధిలో 'ఆ'ప్రత్యయము నిలీనమయియున్నది. కావున 'ఈ, కా, ఆ' అను మూఁడిటిని మగాదిగణమున సూత్రకర్త పేర్కొనినటులే గ్రహింప వలయును.

కాప్రత్యయాంతమును కయిరాదులందుఁగూడఁ జేర్చుకొనుట లెస్స.
ఇబ్బందిగాఁడు మొ. (చూ. తద్ధిత-14.)

**5. పగతాదుల బహువచనలకారంబునకు రేఫంబగు. ఇ.**

పగతురు; అల్లురు; నెయ్యురు; బలియురు; మార్తురు.

**6.** కొన్నిడుమంతంబుల బహువచనలకారంబునకు రేఫంబును దానికిముందు పూర్ణబిందుపూర్వక డకారంబునగు. ఉ.

గండండ్రు, మిండండ్రు — ఇత్యాదులు.

ఈ ప్రకరణమున బిందుపూర్వక డకారమును విధించిన సూత్రములు మూఁడుగలవు.

i) గండండ్రు : అచ్చిక — 6 : ప్రకృతసూత్రము. ; ii) విలుకాండ్రు : అచ్చిక-7; iii) ఆండ్రు : అచ్చిక 11.

వీనియందు డకారము ఖండబిందుపూర్వకముగ వచ్చినను బయిరూపములు సిద్ధింపఁగలవు. ఏలయన, ఈ మూఁడుజాతులును రెండుశబ్దములుకలిసి ఏకమయి యేర్పడినవిగాక సమానపదములే అనఁగా, ఏకపదములేయగుటచే "సమానపదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండబిందువునకుఁ బూర్ణంబగు." (అచ్చిక-15) అనుసూత్రముచే నర్ధబిందువునకుఁ బూర్ణబిందువు గలుగును. కావున నీసూత్రత్రయమునందును బిందుపూర్వకడకారమని సాధారణముగ విధించినఁజాలును. పూర్ణబిందుపూర్వకమని విశేషించి విధింపఁబనిలేదు.

ఇటులుండ 'పూర్ణ' అనువిశేషణ మీమూఁడుసూత్రములలోఁ గొన్నిట నుండుటయుఁ, గొన్నిట లేకుండుటయు, వివిధములగు ముద్రణములలో వివిధ రీతులతో అవ్యవస్థితముగాఁ గానవచ్చుచున్నది. సూరియుద్దేశించిన పాఠ మేదయి యుండునో !

ఈ రూపములందు బిందుసామాన్యమును (బిందుద్వయము) విధించినచో ఖండమునకుఁ బూర్ణబిందువు కలుగుటకయి మరల 15వ సూత్రమును బ్రవర్తింపఁజేయవలసిన ప్రక్రియాక్లేశమును గలిగింపనేలయని ఏకముగా పూర్ణబిందువునే విధింపఁదలఁచెనేమో ! ఆ 'పూర్ణ'శబ్దమును మూఁడుసూత్రములలో మొదటిదగు ప్రకృతసూత్రమునమాత్రము సంఘటించి, తక్కిన రెండింటను నిటులే పూర్ణబింద్వాదేశమునే గ్రహింపుఁడని సూచించి విడిచెనేమో !

6వ సూత్రమున 'పూర్ణ'శబ్దముండుటయుఁ, దక్కిన 7, 11 సూత్రములలో లేకుండుటయు పెక్కుముద్రణములందు ననుగతముగాఁ గానవచ్చుచున్నది. ఇదియు పయియూహకుఁ గొంతసాధకము.

1858లోని ప్రథమముద్రణమునఁగూడ 6 లో పూర్ణశబ్దము గలదు. 7, 11 లలోఁ గానరాదు.

ఇదంతయుఁ బర్యాలోచింప నిట ఖండమునకుఁ బూర్ణమునకును మార్గ మున్నను, బ్రక్రియాక్లేశము తొలఁగించుటకుఁ బూర్ణమునే విధించుట సూరి సంకల్పమయినటులు తోఁచుచున్నది.

పూర్ణపదమునుంచియో, తొలఁగించియో మూఁడుసూత్రములను నేక రూపముగ రచించినచో నెట్టిసంశయమునకును దావులేకుండెడిది.

**7.** కాప్రత్యయంబుమీఁది బహువచనలకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘురేఫంబునకుముందు బిందుపూర్వకడకారంబు నగు. ౭.

విలుకాండ్రు—విలుకాఱు ; వేఁటకాండ్రు—వేఁటకాఱు ; వేడుక కాండ్రు—వేడుకకాఱు.

లక్ష్యములు వర్ణక్రమానుసారులు. అర్థమునుబట్టియు నొకక్రమము స్ఫురించును :

విల్లుపట్టుట, వేఁటాడుట, వేడుకనొందుట.

**8.** తేఁప్రభృతుల బహువచనమునకుముందు డుప్పగు. ౮.

తేఁడులు—తేండ్లు.

**9.** కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు. ౯.

కూఁతురు—కూఁతులు.

కూఁతురులు, కూఁతుళ్లు, కూఁతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబు లని యెఱుంగునది.

**10.** చెయువు బహువచనలకారంబున కలఘురేఫంబు విభాష నగు. ౧౦.

చెయువుఱు—చెయువులు; చెయువుఱను—చెయువులను.

చెయువులు, చెయ్వులు = పనులు. 'చైవులు' అనునది ఉచ్చారణ సాదృశ్యసంజాతమయిన ప్రామాదికరూపము.

**11.** ఆల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును ముందటి లు వర్ణంబునకు బిందుపూర్వక డకారంబునగు. ౧౧.

ఆండ్రు—ఆండ్రను.

ఆలు, చెలియలు, చెల్లెలు, కోడలు, మఱఁదలు — ఇవి యాల్వాదులు.

**12.** బహువచనము పరంబగునపుడు డ, ల, ట, ర, ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు. ౧౨.

గుండ్లు, గుండులు; గిండ్లు, గిండులు—కాళ్లు, కాలులు; మొసళ్లు, మొసలులు—గొంట్లు, గొంటులు; తుంట్లు, తుంటులు—గోర్లు, గోరులు; సీవిర్లు, సీవిరులు.

బహుళగ్రహణముచే విల్లులు, పిల్లులు, పులు లిత్యాదులందు లోపంబులేదు.

తత్సమంబులం గోటి, పిప్పలి శబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు: కోట్లు, కోటులు; పిప్పళ్లు, పిప్పలులు.

ఒక్కొకవర్ణమునకు రెండేసి లక్ష్యములు. మొదటివానిలోని ఉకారములు సహజములు; రెండవవానిలోనివి కృత్రిమములు.

**13.** బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డ, ల, ర, లకలఘులకారంబు బహుళంబుగానగు. ౧౩.

త్రాళులు—త్రాడులు; గుమ్మళులు—గుమ్మడులు; మొగిళులు—మొగిలులు; పిడికిళులు — పిడికిలులు; ఊళులు — ఊరులు; పందిళులు — పందిరులు.

**14.** బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగనగు. ౧౪.

త్రాళ్లు; గుమ్మళ్లు; మొగిళ్లు; మొసళ్లు; విళ్లు; సిళ్లు.

తెడ్డు, తెడ్డులు, తెడ్లు: ఇట ళకారము కలిగి 'తెళ్లు' అను నపరూపము కాకుండుటకయి 'యద్విరుక్తంబు'లనుట.

పూర్వసూత్రమునుండి బహుళపదము అనువర్తింపకుండ నివర్తించుట కయి 'నిత్యముగా'ననుట.

గోరు, పేరు మున్నగు రేఫాంతశబ్దములకుఁగూడ గోళ్లు, పేళ్లు మున్నగు రూపములు వ్యవహారక్షుణ్ణములు; కవిప్రయుక్తములు. ఇతరలాక్షణిక సాధితములు; సాధువులు.

ఈ సూత్రమున దకారలకారములుమాత్రము నిర్దిష్టములు. రేఫ యుపేక్షింపఁబడినది. గోళ్లు మున్నగురూపములు ప్రాచీనప్రయోగములలోఁ బ్రాసనిబద్ధములయి పట్టుగలవి లభింపమిచే రేఫనిర్దేశమునకు సూత్రకారునికి సంకోచమొదవియుండునేమో ! అని కొందఱూహింతురు. కావచ్చును. కాని యంతమాత్రమున నీరూపములు సూరికి సమ్మతములుకావేమోయని సంశయింపఁబనిలేదు.

ఈ సూత్రమున నెందులకు విడిచెనోగాని తన శబ్దలక్షణసంగ్రహమున 'ఇదంతంబు ద్రిక్కరేఫంబు' (3-150) అనుసూత్రముచే గోళ్లు మున్నగువానిని సాధించియుండెను. అచటి పూర్వాపరములు పరికించినచో నీరూపములు సాధువులుగా నాతనికి సమ్మతములయినట్లు కానవచ్చును.

మఱియు, బాల-అచ్చిక-24 లో 'ఒకరులు = ఒకళ్లు, ఒకొరులు = ఒకొళ్లు, ఒక్కరులు = ఒక్కళ్లు, ఒక్కొరులు = ఒక్కొళ్లు' అని రేఫకు ళాదేశము గలిగిన రూపములను దానే చూపియుండెను.

అంతియగాక నీతిచంద్రికలో 'గోళ్లు' అనియు, బాలవ్యాకరణపీఠికలో "లక్షణగ్రంథములపేళ్లు" అనియు రూపములు కానవచ్చుచున్నవి.

కావున 'గోళ్లు, పేళ్లు' ఇత్యాదులు సూరిదృష్టిలో సాధువులనుటకు సందియములేదు.

కాని ళాదేశమును విధించుచున్న యీ సూత్రమున దకారలకారములతో పాటు రేఫమును జేర్పకుండుటకు ప్రబలహేతువు గోచరింపకున్నది.

**15.** సమానపదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండబిందునకుం బూర్ణంబగు. ఉదా.

> అనఁటులు, అనంట్లు; పనఁటులు, పనంట్లు; గోఁటులు, గోంట్లు; తేఁటులు, తేంట్లు; ఏఁడులు, ఏండ్లు; కాఁడులు, కాండ్లు.
> ఏండ్లు కాండ్లిత్యాదులందు డాకు ళాదేశంబు కొందఱు వక్కాణించిరి. తెనుఁగున బిందుపూర్వకస్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు.

సమానపదము = ఏకపదము = అఖండపదము. రెండుగా విభజింప వీలులేనిది.

ఈ శబ్దము 'రషాభ్యాం నోణ స్సమానపదే' ఇత్యాదులగు పాణిని సూత్రములందు వ్యవహరింపఁబడినది.

శాస్త్రమాత్రవ్యవహృతమయి ప్రసిద్ధముకాకుండుటచే భ్రమఁజెంది ముద్రాపకులు పెక్కురు పెక్కుప్రతులలో ఈ సూత్రమున 'సమాసపదంబు నందు' అని ముద్రించియున్నారు. అది యపపాఠము.

'సమాసపదంబునందు' అనుటచే 'అడవిలోఁ ద్రోవ' మున్నగుచోటు లందు పూర్ణబిందువు సంభవింపదు.

ఎల్లచోననుటచే 'తేంట్లు' మున్నగువానిలో దీర్ఘముమీఁదనయితము పూర్ణబిందువు సిద్ధించును.

(1) అనఁటులు, అనఁట్లు, అనంట్లు అనుచో హ్రస్వముమీఁద (సంజ్ఞ 14 చే) వైకల్పికముగఁ బ్రాప్తించు పూర్ణబిందువు నిత్యముగా రావలయును. (2) 'తేంట్లు' అనుచో దీర్ఘముమీఁద (సంజ్ఞ 15 చే) నిషిద్ధ మయినను బూర్ణబిందువు ప్రాప్తింపవలయును. ఆ రెండుప్రయోజనములకును ఈసూత్రమురచింపఁబడినది. కావుననే 'ఎల్లచో'సనుట హ్రస్వదీర్ఘస్థలములు రెండింటను సార్థకము.

తెనుఁగుశబ్దములలో బిందుపూర్వకస్థిరవర్ణము లేదనుట సర్వసమ్మతము.

స్థిరవర్ణమునకుఁ బూర్వమున బిందువుగాని, బిందువునకుఁ బరముగా స్థిరవర్ణముగాని రాకుండఁ జూచుకొనుట ప్రక్రియలో ముఖ్యము.

ఒకచోట శబ్దసిద్ధినిబట్టి స్థిరవర్ణమును రానిచ్చుట యావశ్యకమగుచో దానికిఁబూర్వముగఁ దటస్థించిన బిందువును లోపింపఁజేయవలయును.

బిందువే యుండుట యావశ్యకమగుచో దానికిఁ బరముగా రాఁదలంచిన స్థిరవర్ణమును రాకుండఁజేయవలయును.

ప్రసిద్ధమగు సుశబ్దము సిద్ధించుటకు ప్రక్రియలో — ఈ రెండింటిలో ఏ మార్గమనుకూలమో దాని నవలంబింపవలయును.

బాలవ్యాకరణమున 'నానాఁడు' (సంధి 41) అనుచో మొదటిమార్గమును, ప్రకృతసూత్రమున 'ఏండ్లు', 'కాండ్లు' అనుచో రెండవమార్గమును అవలం బింపఁబడినవి.

'కాండ్లు' అనుచో డాకు ళాదేశమును వక్కాణించినవారు రావిపాటి వారు. వారివ్యాకరణమున విశేష్యప్రకరణమున 131, 132 సూత్రములలో గుంళ్లు, కాంళ్లు, పెండింళ్లు, పెంళింళ్లు మున్నగురూపములు చూపఁబడినవి. ఇవి అటు గ్రాంథికములా కావు; ఇటు వ్యావహారికములా కావు. ఏ తలంపుతోఁ జూపిరో యెఱుఁగరాదు. వీనివిషయముననే సూరి తన అసమ్మతి నిచట సూచించియుండవచ్చును.

**16.** ఔపవిభక్తికంబుల లివర్ణసలులువర్ణంబులగు బహువచనంబు పరంబగునప్పుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు. ౧౬.

కొడవలి....కొడవండులు—ఉల్లోపంబు : కొడవండ్లు—పక్షంబు నందలఘులకారంబు : కొడవళులు — కొడవళ్లు, కొడవలులు. రోఁకలి ప్రభృతుల కిట్లు రూపంబు లెఱుంగునది.

ఇల్లు ... ఇండులు, ఇండ్లు, ఇల్లులు. ఇట్లు కల్లు, పల్లు, ముల్లు, విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది.

మద్యనిమ్నార్థకంబులయిన కల్లు, పల్లు శబ్దంబులును తెల్లు ప్రభృతిశబ్దంబులు ననౌపవిభక్తికంబులగుటం జేసి వానికీకార్యంబులేదు.

కల్లు = ఱాయి, మద్యము ; పల్లు = దంతము, పల్లము.

పల్లుశబ్ద బహువచనమగు 'పండ్లు' అనుదానినిబట్టి 'కండ్లు' అనియు, పన్ను శబ్దైకవచనమగు 'కన్ను' అనుదానినిబట్టి 'పన్ను' అనియు భ్రాంతిమూలకముగా జరిగిన వినిమయమును (Exchange) గుర్తింపవలయును.

పన్నుకాదు — పల్లు. కండ్లుకావు -- కన్నులు.

**17.** ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యంబయి బహువచనంబు నెనయు. ౧౭.

కొడవండ్లులు—కొడవండ్లులను ; కొడవళ్లులు—కొడవళ్లులను.

ఇట్లు ప్రయోగదృష్టంబులు గ్రహించునది.

సూత్రమున 'ఒకానొకచో' అని నిర్దేశించియు, తుదివాక్యమున మరల హెచ్చరించుట, ఈ కార్యము మిక్కిలి యరుదని సూచించుటకు.

**18.** కలన్వాదుల నువర్ణంబు కుజ్ఞగు ; బహువచనము పరంబగు నపుడు నిత్యముగానగు. ౧౮.

కలఁకు, కలను ; కలఁకులు.

కలను, కెలను, కోఱను, కొలను, గవను, నెఱను, మ్రాను, వరను, వలను — ఇవి కలన్వాదులు.

కుజ్ఞ ఏకవచనములందు వైకల్పికమని స్ఫురించుటకయి సూత్రము నుత్తరభాగమున నిత్యశబ్దము ప్రయుక్తమయినది.

**19.** అట్లు రేను గోను శబ్దంబుల నువర్ణంబు గుఙ్గగు. ౧౯.

రేఁగు, రేను; రేఁగులు. గోఁగు, గోను; గోఁగులు.

**20.** బహువచనంబు పరంబగునపుడు చేను, పేను, మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు. ౨౦.

చేను....చేలు ; పేను....పేలు ; మీను....మీలు.

**21.** బహువచనంబు పరంబగునపుడు రేయిప్రభృతుల తుది యక్షరంబు లోపించు. ౨౧.

రేయి .... రేలు; ఱాయి .... ఱాలు; వేయి .... వేలు;
వ్రాయి .... వ్రాలు—ఇత్యాదులు.
ఈ లోపంబు సమాసంబులందుం జూపట్టెడు :
రేరాజు ; మగఱాపతకము ; వేవెలుఁగు.

i. దోయి, ii. పాయి, iii. ప్రాయి : శబ్దములు ఈ గణమునకుఁ జెందవలసినవే.

దోయి = ద్వయము. పాయి = క్షీరము. ప్రాయి = బియ్యము.

i. 'దోయి' — దోలు : ఈ బహువచనరూపము మిక్కిలి విరళము.

"భానుయుత నల ధ స గణంబుల లోన నిరుదోలును సగంబుల"

—ఛందోదర్పణము-3-61.

ఇరుదోలు = రెండుద్వయములు. $2 \times 2 = 4$ గణములు.

"రెండు చేదోల వెలుంగుతూపు." —కావ్యాలం. చూడా—5-98.

రెండు చేదోలన్ = నాలుగు హస్తములందు.

ii. 'పాయి'—పాలు: పాయి—అనునేకవచనరూపము వ్యవహారమునుండి నేఁడు తొలఁగినను స్తనంధయులగు శిశువులభాషలో నిలిచియున్నది. మొదట స్తన్యవాచకమయి క్రమేణ స్తనవాచకమయినది. దీని యాదివర్ణము తొలుత, పరుషమయినను శిశువులవాడుకవలనఁ గాలక్రమమున సరళముగా మాఱినది. సూక్ష్మముగా గుర్తింపుఁడు.

"మాయగారని, దైవమాయని, కొడుకుఁ
బాయని యక్కునఁ బట్టి, పాలిండ్ల
నొత్తి, యోయమ్మ చన్నొల్లఁడన్ శోక
మెత్తి, యాకఱచిన యురగంబు దలఁచి."

—హరిశ్చంద్ర ద్విపద-ద్వితీయ భాగము, 2030.

పాయి + అని = పాయని (పాలు ద్రాగు నాయనాయని).

iii. 'ప్రాయి' — ప్రాలు : ప్రాయి అను నేకవచనరూపము వ్యస్తముగా ప్రసిద్ధము కాకున్నను 'నసుఁబ్రాయి' 'నన్బ్రాయి' మున్నగు సమాసములలోఁ గానవచ్చును — దీనివాడుకరూపము 'నసువాయి'.

నసుఁబ్రాయి = పూర్తిగా ఉడుకని బియ్యము.

"రాగి లోహంపు నన్బ్రాయి తేటుంతంగి
పండి దించిన యిప్పుర్వంటకంబు".—కాశీఖండము—3, 121.

పయిరెండు (20, 21) సూత్రములను నేకసూత్రముచేయరాదా యని కొందఱు శంకింపవచ్చును. కాని లక్ష్యములలో భేదమున్నది. ఆ సూత్రమున లక్ష్యములు 'వు'వర్ణాంతములు — ఇవి 'యి' వర్ణాంతములు. అంతియగాదు. ఈ సూత్రముచేఁ గలుగులోపము సమాసములందును బ్రవర్తించును. ఆ శబ్దములకట్లు ప్రవర్తింపరాదు. ఇట్టిభేదముండుటవల్లనే రెండిటిని వేఱు సేయుట.

'రేయి' అనుదానికి 'రే' అనిగూడ వేఱుగా నొకశబ్దము గలదుగదా! దాని బహువచనము 'రేలు' అని యగునుగదా! మఱి యీ రూపమునకయి యీ గణమున 'రేయి' శబ్దమెందులకు? అని మఱికొందఱు శంకింతురు. నిజమే. ఈ గణమున 'రేయి' శబ్దమును బఠించుట 'రేలు' అనురూపమును సంపాదించుటకుఁగాదు. 'రేలు' అనునది 'రే'శబ్దమునుండియే సిద్ధింపవచ్చును. కాని 'రేయి'శబ్దము నిటఁ బఠింపకున్నచో దానిబహువచనము 'రేయులు'అని సిద్ధమగును. అట్టిరూపము లేకుండఁజేయుటకయి యీ సూత్రమున రేయి శబ్దమునకు 'యి'వర్ణలోపము విధింపఁబడినది.

వ్రాలు = అక్షరములు. ఇది వస్తుతః బహువచనాంతమయినను క్రమేణ దీనికి సంతకము (చేవ్రాలు) అనునర్థము గలిగి యేకవచనాంతముగా నేఁడు వ్యవహరింపఁబడుచున్నది.

**22.** బహువచనంబు పరంబగునపు డావుప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు. ౨౨.

ఆవు : ఆలు, ఆవులు ; జాము : జాలు, జాములు ; చుట్టము : చుట్టలు, చుట్టములు ; మీసము : మీసలు, మీసములు.

**23.** ఇయత్తు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు. ౨౩.

కన్నియ-కన్నె ; జన్నియ-జన్నె ; వన్నియ - వన్నె ;
కొంచియము-కొంచెము ; కొండియము-కొండెము.
బహుళగ్రహణముచే సందియము, కాటియ మొదలగు శబ్దంబు
లందెత్వము లేదు.
ఇయశబ్దంబునం దికారలోపంబు కొండఱు వక్కాణించిరి.
అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు. ముత్తియశబ్దంబు
నందుమాత్ర మిత్వలోపంబు గానంబడియెడి :
ముత్తియము : ముత్తెము - ముత్యము.

ఇట, ఇత్వలోపము వక్కాణించిన 'కొందఱ'లో మొదటివారు అథర్వణాచార్యులు.

"ఇయాన్తత్వే కుత్రచిత్స్యా దేత్వం యశ్చాపి తద్భవే
లఘు స్స్యోపిచ సంయుక్తః. —వికృతివివేకము-అజంత-61 కారిక.

రెండవవారు అహోబలపండితులు. వీరు

"ఏదన్తతాచ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్"

అను చింతామణిసూత్రమును వ్యాఖ్యానించుచు, అందు 'ముత్యము' అను రూపముతోపాటుగ వీడ్యము, విడ్యము, కడ్యము, మిర్యము, కన్య, పర్యాచకము అను రూపములనుగూడ ఇత్వలోపముతోఁ జూపియున్నారు.

దివ్వియ, కళ్లియము అను నీరెంటింటను ఇత్వలోపముగల దివ్య, కళ్యము అను రూపములకు తిక్కన భారతప్రయోగములు ప్రౌఢవ్యాకరణమునఁ బ్రదర్శింపఁబడినవి (ప్రౌఢ-శబ్ద-49). అందే పళ్యమునకు శ్రీనాథునిప్రయోగమును, వీడ్యమునకు రామకృష్ణునిప్రయోగమును జూపఁబడినవి.

ఈ ప్రయోగములు సూరికి గోచరింపకుండునా? గోచరించినను, పాఠాంతరములతో గోచరించియుండునా?

ఇత్వలోపము భారతాదులలోఁ బయిరీతినే తనకును గోచరించినచో శ్రీనాథునిముత్యమును శిరసావహించిన సూరి ఆ కవిసార్వభౌముని 'పళ్యము'ను జాఱవిడుచునా? సోమయాజులవారి 'దివ్య'ను జూపకుండునా? వారి 'కళ్య'మును గారవింపకుండునా? తెనాలివారి 'వీడ్యము'ను విడిచిపెట్టునా? సందిగ్ధము. సమాలోచనీయము.

ఇది యిటుండ, అహోబలపండితుఁడును భారతప్రయుక్తములుగాఁ బ్రౌఢవ్యాకరణము చూపుచున్న దివ్య, కళ్యము అనువానిం బేర్కొనఁడయ్యె. దీనింబట్టి యీ భారతప్రయోగములు రెండును సూరికివలె నాతనికిఁగూడ వేఱుపాఠములతో గోచరించియుండెనేమో ; ఎట్లు నిర్ణయించుట ?

తాళపత్త్ర గ్రంథములలోని పాఠములన్నిటిని పరిశీలించి ముద్రించిన భారతమేలేదాయెను; కవిప్రయోగమును కావనరాదు. కన్నులకద్దుకోవలసినదే.

కాని నేఁడు కంటఁబడుపాఠము కవిదో! లేఖకునిదో! పాఠకునిదో! పరిష్కర్తదో! ముద్రాపకునిదో! .... ఈసంశయము చింతలోఁ దీఱునదికాదు. మఱొక వంకకు మరలుదము.

ఈ సూత్రమున నామాంతమునకు 'ఇయ'కు ఎత్వము విధింపఁబడినది.

చెల్లియలు, చెల్లెలు : అనుచో తుదినిగాక నామమధ్యమున ఎత్వము గాన వచ్చుచున్నది.

దీనికి సాధనమెట్లు? అనుప్రశ్నము గలదు. ఎత్వమధ్యములగు నిట్టి రూపములు పెక్కులుతేవు. ఒక్కటి వైచిత్ర్యములు. అయినను వానిని సాధించు సూక్ష్మమార్గమేదేని సూత్రమునఁగలదాయని పరికించుటమాత్ర మావశ్యకము.

సంస్కృతమున 'అన్త' శబ్దమునకు 'చివర' అనునర్థమేగాక 'మధ్యము' అనునర్థముగూడఁ గలదు.

"సంబన్ధమాభాషణపూర్వమాహుః వృత్తస్సనౌ సంగతయో 'ర్వనాన్తే'"
వనాన్తే = వనమధ్యమున : వనములోపల —రఘువంశ-2-58.
"వసిష్ఠధేనో రనుయాయినం త మావర్తమానం వనితా 'వనాన్తాత్'"
వనాన్తాత్ = వనమధ్యమునుండి : వనములోపలనుండి
—రఘువంశ-2-19.

"అనేకశః కిన్నరరాజకన్యకాః 'వనాన్త'సంగీతసఖీ రరోదయత్"
వనాన్తే = వనములో : వనమధ్యమున —కుమారసంభవము-5-56.
"యుష్మదీయంచ 'జలాన్తే' గృహమ్"
జలాన్తే = జలమధ్యమున : జలములోపల —పంచతంత్రము.

ఇట్టి కాళిదాసాదిప్రయోగములారసి ఆప్టే, మోనియర్ విలియమ్స్, సూ. రా. నిఘంటువు మున్నగుకోశములు 'అంత'శబ్దమునకు మధ్యము, లోపలి భాగము అనునర్థమును నిర్దేశించియున్నవి.

దీనినిబట్టి నామాంతమనఁగా నామమధ్యమనికూడ నపేక్షితమగుతావున నర్థముచెప్పుటకు నంతగా బాధకానరాదు.

కావున నెటనయిన ప్రాతిపదికమధ్యమున ఎత్వముకలిగినచో నది యీ సూత్రముచే సాధితమే యనుకొనవచ్చును. ఇంకొక విషయము :

'ఇయ' అనునది 'ఎ'కారముగఁ దఱుచు మాఱుచుండుటంబట్టి యెట నయిన నొక్కచో విపర్యాసరీతిని 'ఎ'కారముగూడ 'ఇయ'గా మాఱవచ్చును. భాషాపరిణామసరణిలో అది అస్వాభావికము గాదు.

అగును = అవును—'గా'కు 'వా' వచ్చినది.

వారు = గాడు—'వా'కు 'గా' వచ్చినది.

ఇట్టిమార్పు నైసర్గికము. కావున

అంత + ఏ = అంతే : అంతె : అంతియ.

ఇంత + ఏ = ఇంతే : ఇంతె : ఇంతియ.

ఇట 'ఎ'కారము 'ఇయ'గా మాఱినది. ఈ రూపములు అవధారణార్థ కాంతములు.

వీనిపయిని మరల నవధారణార్థకమగు 'ఎ'కారమును జేర్చుట యనావశ్యకము. అనుపపన్నము. కాఁగా, అంతియే, ఇంతియే అనునవి సురూపములు కావు. మఱొక యంశము :

ఈ సూత్రమున "ఇయకు ఎత్వంబగును" అనక "ఇయకు మాఱుగా ఎత్వంబగును" అనుచున్నాఁడు.

ఆదేశమెప్పుడును స్థానికిబదులుగానే వచ్చునుగదా ! "ఇయకు 'మాఱుగా'" అని మరల నొక్కిచెప్పుట యెందులకు ? అని శంకించుకొన్నచో నొకయుద్దేశము స్ఫురింపఁగలదు.

విధాతృశబ్దమునకు అత్వమగునని చెప్పినచో అకారము విధాతృ అనుదాని కంతకును వచ్చునా ? రాదు. దానికొసనున్న ఋకారమునకుమాత్రమే యాదేశమగును. 'విధాత'. ఇటులే చేత, తోడ, వలనలకు ఇత్వమగునన్నచో వాని తుదికే ఇకారము కలుగును (నీచేతి ప్రోవు, నాతోడి చెలిమి మొ.).

ఈ రీతిగా దేనికి నేది యాదేశమందుమో అది దానితుదికి వచ్చుచుండుట వ్యాకరణమున సాంప్రదాయికమయిన మార్గము. ఇది

'అలోన్త్యస్య' (= షష్ఠీనిర్దిష్టస్య అన్త్యస్య అలః ఆదేశః స్యాత్) అను పాణినీయపరిభాషనుబట్టి యేర్పడినపద్ధతి.

స్థాని బహువర్ణమయి, ఆదేశము ఏకవర్ణమయినచోటులందెల్ల నిదే మార్గము.

ప్రకృతమున 'ఇయకు' ఎత్వమగునన్నచో దానికడపటి అకారమాత్రమునకే ఎత్వము కలుగునుగాని మొత్తమునకు రాదు. 'ఇయ' అనుదాని కంతకును సర్వాదేశముగ 'ఎ'కారము రావలయునను సూచనకయి, యిట

'మాఱుగా' అనుశబ్దము ప్రయుక్తమయినది. సర్వాదేశస్థలములందు నిట్టి సూచనలు చేయుట సూరిదృష్టిలోఁ గలదు.

ఉదా: "ఇచ్చునకు 'సర్వంబున' కీయగు" (క్రియా-92: ఈఁడు, ఈరు).

'ఈ' అనునది 'ఇచ్చు' అనుమొత్తమునకు వచ్చుటచే యిట సర్వశబ్దము చేర్చినాఁడు.

ఆదేశము అనేకవర్ణమయినచో
'అనేకాల్ శిత్ సర్వస్య'
అను పరిభాషచొప్పున సర్వాదేశముగనే వచ్చును.

ఉదా: 'తేతేరులు తెచ్చునకగు' (క్రియా-93: తేఁడు, తేరఁడు).

ఇట విశేషసూచనమక్కఱలేకుండఁగనే తే. తేరు అనునవి 'తెచ్చు' అనుమొత్తమునకే యాదేశములగును. కావుననే యీ సూత్రమున సర్వాదేశతను విశేషించి సూచింపఁబనిలేదు. సూచింపనులేదు. మఱొక చిన్నసూక్ష్మము. సూరి తొలుత

"నామ్నా మియాంతానా మేదన్తతా"

అనురీతినున్న చింతామణికూర్పునే యనుసరించి తన శబ్దలక్షణసంగ్రహమున

"నామంబున కియాంతంబున కెత్వంబు"

అని సూత్రము కూర్చుకొనియు, బాలవ్యాకరణమున నీసూత్రమున 'మాఱుగా' అనుశబ్దము సమన్వయించుటకుఁ దగునటులు "ఇయకుమాఱుగా నామాంతంబున కెత్వంబు" అని తొలుతటికూర్పును మార్చుకొనుట గమనింపఁదగినది.

మొదటిరచనమును అటులేయుంచి 'మాఱుగా' అనుపదమును జేర్చినచో 'ఇయాంతమునకు మాఱుగా' అను పదవిన్యాసమేర్పడును. దానివల్ల 'కన్నియ' అను ఇయాంతమెల్ల లోపించి 'ఎ' అనురూపమేర్పడునుగాని 'కన్నె' అని సిద్ధింపదు.

ఈ సూక్ష్మమునూహించి యాతఁడు తొలుతటిరచనలోని అంతశబ్దపు స్థానమును ఇచట మార్చినాఁడు.

ఇయాంతమగు నామంబు: తొలిరచన. నామాంతమగు ఇయ: తుదిరచన. రెండిటఁగల భేదము నవధానముతో గుర్తింపుఁడు.

## సర్వనామ ప్రకరణము

**24.** అన్నిప్రభృతులు సర్వనామంబులు. ౨౪.

అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు; ఆ, ఈ, ఏ; నీ, నా, మన, తా; సంఖ్యావాచకంబులు: అన్నిప్రభృతులు.

వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద. వీనిలో డుమంతంబులకెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు స్మరించునది. బహువచన లకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమాబహువచనంబునకుంబోలె నెఱుంగునది.

విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచో ద్వితీయవఱకును గొండొకచోఁ దృతీయయం దొక్కరూపంబువఱకును రూపభేదంబులు వక్కాణించెద. శేషంబూహించునది.

అన్ని మొదలగు శబ్దంబులాఱును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు. అమహదర్థంబులేకవచనాంతంబులగు.

ఇందు నీమొదలగు నాలుగుశబ్దంబులు సర్వార్థంబులం దుల్యరూపంబులయియుండు.

'మ' అనునది మహదర్థమనుటకు, 'అ' అనునది యమహదర్థమనుటకు, 'ప్ర' మొదలయినవి ప్రథమాదివిభక్తులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

| | | మ | అ |
|---|---|---|---|
| సర్వతావదర్థకము : | ప్ర | అందఱు. అందొఱు. | అన్ని. |
| ఇయదర్థకము : | ప్ర | ఇందఱు. | ఇన్ని. |
| కియద్యావదర్థకము : | ప్ర | ఎందఱు. | ఎన్ని. |
| కతిపయార్థకము : | ప్ర | కొందఱు. | కొన్ని. |
| బహ్వర్థకము : | ప్ర | పెక్కండ్రు. పెక్కురు. | పెక్కు. దీనికి బహువచనముం గలదు : పెక్కులు. |

ఈ శబ్దంబు లౌపవిభక్తికంబులగుటంజేసి—అన్నిటి, అన్నింటి; ఇన్నిటి, ఇన్నింటి; ఎన్నిటి, ఎన్నింటి; కొన్నిటి, కొన్నింటి; పెక్కిటి, పెక్కింటి యను రూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపు డమహత్త్వంబునం దగునని తెలియునది.

| [బహ్వర్థకము] | మ | అ |
|---|---|---|
| ప్ర | పలుగురు, పలుగుండ్రు. | అమహత్త్వంబున దీనికి వ్యస్తప్రయోగంబు లేదు. |
| **తదర్థకము :** | | |
| ప్ర (ఏ) | వాఁడు. | అది, అద్ది, ఆయది, అయ్యది. |
| (బ) | వారు, వారలు, వాండ్రు. | అవి, అవ్వి, ఆయవి, అయ్యవి. |
| ద్వి (ఏ) | వానిని. | దానిని, ఆదానిని, అద్దానిని. |
| (బ) | వారిని, వారలను, వాండ్రను. | వానిని. |
| **ఇదమర్థకము :** | | |
| ప్ర (ఏ) | వీఁడు. | ఇది, ఇద్ది, ఈయది, ఇయ్యది. |
| (బ) | వీరు, వీరలు, వీండ్రు. | ఇవి, ఇవ్వి, ఈయవి, ఇయ్యవి. |
| ద్వి (ఏ) | వీనిని. | దీనిని, ఈదానిని, ఇద్దానిని. |
| (బ) | వీరిని, వీరలను, వీండ్రను. | వీనిని. |
| **యత్కిమర్థకము :** | | |
| ప్ర (ఏ) | ఏఁడు, ఏవాఁడు, ఎవ్వాఁడు, ఎవ్వఁడు, ఎవఁడు. | ఎది, ఏది, ఎద్ది, ఏయది, ఎయ్యది. |
| (బ) | ఏరు, ఏవారు, ఏవారలు, ఏవాండ్రు, ఎవ్వారు, ఎవ్వారలు, ఎవ్వాండ్రు, ఎవ్వరు, ఎవ్వండ్రు, ఎవరు, ఎవండ్రు. | ఎవి, ఏవి, ఎవ్వి, ఏయవి, ఎయ్యవి. |
| ద్వి (ఏ) | ఏనిని, ఏవానిని, ఎవ్వానిని, ఎవ్వనిని, ఎవనిని. | దేనిని, ఏదానిని, ఎద్దానిని. |

[యత్కిమర్థకము] మ అ

(బ) ఏరిని, ఏవారిని, ఏవారలను, ఏవాండ్రను, ఎవ్వారిని, ఎవ్వారలను, ఎవ్వాండ్రను, ఎవ్వరిని, ఎవ్వండ్రను, ఎవరిని, ఎవండ్రను. — వేనిని, ఏవానిని, ఎవ్వానిని.

మహతివాచ్యంబగు నేనేరత్వంబున యత్కిమర్థక శబ్దంబు : ఎవ్వరిత, ఎవ్వర్త, ఎవ్వత — ఎవరిత, ఎవర్త, ఎవత — ఎవ్వరితి, ఎవ్వర్తి, ఎవ్వతి — ఎవరితి, ఎవర్తి, ఎవతి — ఎవ్వరితె, ఎవ్వర్తె, ఎవ్వతె — ఎవరితె, ఎవర్తె, ఎవతె — ఎవ్వర్తుక, ఎవ్వతుక — ఎవర్తుక, ఎవతుక అని యిరువదిరెండు రూపంబులు వడయు.

తదాదులు మూఁడు, మహద్వాచకంబు లేకత్వంబునం బూజ వివక్షించునపుడు : అతఁడు, ఆతఁడు; ఇతఁడు, ఈతఁడు; ఎతఁడు, ఏతఁడు అను రూపంబులు వడయు. మహతీవాచకంబులు : ఆమె, ఆపె, ఆకె; ఈమె, ఈపె, ఈకె; ఏమె, ఏపె, ఏకె అను రూపంబులు వడయు.

| | | (ఏ) | (బ) |
|---|---|---|---|
| యుష్మదర్థకము : | ప్ర | నీవు, ఈవు. | మీరు, మీరలు, ఈరు, ఈరలు. |
| | ద్వి | నిన్నును. | మిమ్మును. |
| | తృ | నీచేతను. | మీచేతను. |
| అస్మదర్థకము : | ప్ర | నేను, ఏను. | మేము, నేము, ఏము. |
| | ద్వి | నన్నును. | మమ్మును. |
| | తృ | నాచేతను. | మాచేతను. |
| ఉభయార్థకము (నిత్య బహువచనాంతము) : | ప్ర | — | మనము. |
| | ద్వి | — | మనలను. |
| | తృ | — | మనచేతను, మనలచేతను |
| ఆత్మార్థకము : | ప్ర | తాను. | తాము, తారు, తమరు. |
| | ద్వి | తన్నును. | తమ్మును. |
| | తృ | తనచేతను. | తమచేతను. |

ఇంక సంఖ్యావాచకంబులు వక్కాణించెద.

ఏకార్థకశబ్దము :

| మ |  | అ |
|---|---|---|
| (ఏ) | (బ) | ప్రథమైక వచనాంతములు |
| ప్ర. ఒకఁడు : | ఒకరు, ఒకండ్రు. | ఒకటి, ఒకాటి, |
| ఒకాఁడు : | ఒకారు, ఒకాండ్రు. | ఒక్కటి, ఒక్కాటి, |
| ఒక్కఁడు : | ఒక్కరు, ఒక్కండ్రు. | ఎక్కటి, ఒకఁడు, |
| ఒక్కాఁడు : | ఒక్కారు, ఒక్కాండ్రు. | ఒకాఁడు, ఒక్కఁడు, |
| ఒకరుఁడు : | ఒకరులు, ఒకళులు, ఒకళ్లు. | ఒక్కాఁడు, ఒండు. ఈ శబ్దంబునకు సంఖ్యావాచకంబునకు బహువచనంబు లేదు. |
| ఒకారుఁడు : | ఒకారులు, ఒకాళులు, ఒకాళ్లు. |  |
| ఒక్కరుఁడు : | ఒక్కరులు, ఒక్కళులు, ఒక్కళ్లు. |  |
| ఒక్కారుఁడు : | ఒక్కారులు, ఒక్కాళులు, ఒక్కాళ్లు. |  |
| ఒకరువుఁడు : | ఒకరువులు. |  |
| ఒకారువుఁడు : | ఒకారువులు. |  |
| ఒక్కరువుఁడు : | ఒక్కరువులు. |  |
| ఒక్కారువుఁడు : | ఒక్కారువులు. |  |
| ఒరుఁడు : | ఒరులు. |  |
| ఒరువుఁడు : | ఒరువులు. |  |
| ఒండు : | ఒండులు, ఒండ్లు. |  |
| ఒడ్డు : | ఒడ్డులు, ఒడ్లు. |  |

ద్వితీయాదివిభక్తిరూపంబు లూహించుకొనునది.

దీనికి మహతివాచ్యంబగునపు డేకత్వంబున వక్ష్యమాణరూపంబు లెఱుంగునది.

## మహత్యర్థకము

ఒకరిత, ఒకర్త, ఒకర్తు, ఒకర్తుక, ఒకత, ఒకతుక— ఒకొరిత, ఒకొర్త, ఒకొర్తు, ఒకొర్తుక, ఒకొత, ఒకొతుక— ఒక్కరిత, ఒక్కర్త, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కత, ఒక్కతుక— ఒక్కొరిత, ఒక్కొర్త, ఒక్కొర్తు, ఒక్కొర్తుక, ఒక్కొత, ఒక్కొతుక— ఒకరితి, ఒకర్తి, ఒకతి — ఒకొరితి, ఒకొర్తి, ఒకొతి — ఒక్కరితి, ఒక్కర్తి, ఒక్కతి—ఒక్కొరితి, ఒక్కొర్తి, ఒక్కొతి — ఒకరితె, ఒకర్తె, ఒకతె—ఒకొరితె, ఒకొర్తె, ఒకొతె—ఒక్కరితె, ఒక్కర్తె, ఒక్కతె—ఒక్కొరితె, ఒక్కొర్తె, ఒక్కొతె—ఓర, ఓర్తి, ఓర్తు, ఓర్తుక.

ఇంక ద్విప్రభృతిసంఖ్యావాచకంబులు ప్రథమాంతరూపంబులు వక్కాణించెద.

| మ | అ |
|---|---|
| ఇద్దఱు, ఇరుగురు | రెండు |
| మూగురు, ముగ్గురు, ముగురు | మూఁడు |
| నలుగురు | నాలుగు |
| అయిదుగురు | అయిదు |
| ఏగురు | ఏను |
| ఆఱుగురు | ఆఱు |
| ఏడుగురు | ఏడు |
| ఎనమండ్రు | ఎనిమిది |
| తొమ్మండ్రు | తొమ్మిది |
| పదుగురు, పదురు, పదుగుండ్రు, పదుండ్రు | పది |

| మ | అ |
|---|---|
| పదునొకరు | పదునొకటి |

ఇచ్చట నేకశబ్దార్థకరూపంబులెల్ల నర్థానురూపంబుగంగూర్చుకొనునది.

| మ | అ |
|---|---|
| పదునొకొరు | పదునొకొటి |

ఇత్యాదులు.

| మ | అ |
|---|---|
| పన్నిద్దఱు, పన్నిరుగురు | పండ్రెండు |
| పదుమూగురు, పదుముగ్గురు, పదుముగురు | పదుమూఁడు |
| పదునలుగురు | పదునాలుగు |
| పదునయిదుగురు | పదునయిదు |
| పదునేగురు | పదునేను |

| మ | అ | మ | అ |
| --- | --- | --- | --- |
| పదునాఱుగురు | పదునాఱు | నలువండ్రు | నలువది |
| పదునేడుగురు | పదునేడు | ఏఁబండ్రు | ఏఁబది |
| పదునెనమండ్రు | పదునెనిమిది | అఱువండ్రు | అఱువది |
| పందొమ్మండ్రు | పందొమ్మిది | డెబ్బండ్రు | డెబ్బది |
| ఇరువండ్రు | ఇరువది | ఎనుబండ్రు | ఎనుబది |
| ఇరువదియొకరు | ఇరువది యొకటి | తొంబండ్రు | తొంబది |
| | | నూఱుగురు | నూఱు |
| ఇత్యాదులూహ్యంబులు. | | వేగురు | వేయి |
| మ | అ | పదివేగురు | పదివేలు. |
| ముప్పండ్రు | ముప్పది | | |

రెండు మొదలగునవి యాపవిభక్తికశబ్దంబు లగుటంజేసి ద్వితీయాది విభక్తులు పరంబులగునపుడు టింటులగునని యెఱుంగునది:

రెండిటిని, రెండింటిని, రెంటిని; మూఁడిటిని, మూఁడింటిని, మూఁటిని ఇత్యాదులు.

ఏకశబ్దమునకు ఒంటి, ఒకానొకఁడు, ఒకానొకటి, ఒకానొకరిత, ఒరిమ, ఒండొకరు, ఓరట్టు అను రూపంబులును, ద్విశబ్దార్థంబునకు ఇనుమడి, ఈరాఱు అను రూపంబులు నర్థవిశేషంబులం జూపట్టెడు.

ఈ యర్థవిశేషములను గ్రంథాంతమున అనుబంధములలో 'శబ్దార్థ నిరూపిక' అను పట్టికలోఁ జూడఁగలరు.

ఇందు 'ఓరట్టు' అను శబ్దము నిఘంటువులందు నగపడదు. ఏ గ్రంథమందును గానరాకున్నది. టీకాకారులకును దీనిజాడ తెలియకుండెను. ప్రథమ ముద్రణమునుండి నేఁటిదాఁక అన్ని ప్రతులయందునుగలదు. సూరి యీ శబ్దము నెచటఁగాంచెనో, ఏ యర్థవిశేషము నిర్ణయించుకొనెనో తెలియకున్నది. ఎటనో చూడకుండ సూరి నిర్దేశించునా? అసంభవము. అన్వేషించుచుందము.

సాధారణముగా నన్నిభాషలందును సర్వనామశబ్దరూపములు అనియతములయి వివిధములుగా నేర్పడును.

అట్టివాని ప్రక్రియాక్రమమును సూత్రింపవలయునన్న, రూపములకంటె సూత్రములసంఖ్య యధికమగును.

ఒక్కసూత్రముచేఁ బెక్కులక్ష్యముల సాధింపవలయుంగాని యొక్క రూపమునకయి పెక్కుసూత్రములు రచింపరాదు. అది వ్యాకరణ స్వరూపమునకే విరుద్ధము.

ఆతలంపుతోడనే సూరి సూత్రాంధ్రవ్యాకరణ శబ్దలక్షణసంగ్రహాదులందుఁ గొన్ని సర్వనామశబ్దముల ప్రక్రియ నుపక్రమించియుఁ బర్యవసానమున వాల వ్యాకరణమున వానిప్రక్రియామార్గము నుజ్జగించి సిద్ధరూపములు మాత్రమే చూపియుండెను.

"అన్ని మొదలగు శబ్దంబులు .... ఏకవచనాంతంబులగు" అనఁగా నిత్యైకవచనాంతములు; వీనికి బహువచనము లేదన్నమాట.

ఏకవచనాంతములు గనుకనే 'అన్నిటిని, అన్నిటిచే' మున్నగు ద్వితీయాదులందు నేకవచనములందుమాత్రమే విహితమయిన ఔపవిభక్తిక 'టి' వర్ణము వీనికిఁగలుగుచున్నది.

'అన్ని' అనునది ఏకవచనాంతమేయన్నచో దీనికి బహువచనము లేదన్నచో 'అన్నివస్తువులుకలవు' అనుచో బహువచనప్రయోగములెట్లు కుదురు పడును? అని యిచటఁ గొందఱు శంకింతురు.

నిజమే. ఈ వాక్యమునందలివి బహువచనము లనకతప్పదు. పోనీ వీనినిబట్టి 'అన్ని' అనుదానికి ఎటులో బహువచనలోపము కలిగినదనుకొని నిత్యబహువచనాంతమే యందుమా 'అన్నిటిని' అనుచో నేకవచనములందు మాత్రమే రాఁదగిన 'టి' వర్ణము రాదాయెను? ఆ 'టి' వర్ణమునుబట్టి ఏకవచనాంతమందుమా యీ బహువచనములు కుదురవాయెను! ఏవచన మనుటకును దిక్కు కానవచ్చుచున్నదే! ఏదోయొకవచనమని నిర్ణయింపక తప్పదుగదా! అని నిదానించిచూడఁగా, అసలీశంకయే తలక్రిందుగా నగపడుచున్నది. 'అన్ని వస్తువులు కలవు' అను వాక్యమునఁగల వచనప్రయోగమున నెట్టితబ్బిబ్బును గానవచ్చుటలేదు. ఏలయన:

విశేష్యమునుబట్టి విశేషణమునకు లింగవిభక్తి వచనములుండవలయునని మనభాషలో నియమము. అంతియగాని విశేషణమునుబట్టి విశేష్యమునకు విభక్తివచనంబులు గలుగవలయునన్నది మార్గముకాదు.

"విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబులగు" అనునది యీ విషయము నుపపాదించిన సూత్రము.

కావున 'అన్ని' అను విశేషణము ఏకవచనాంతమయియుండ, 'వస్తువులు' అను విశేష్యమునకు బహువచన మెట్లుకలిగినదను ప్రశ్నమునకే తావులేదు. ప్రశ్న బోరగిల్లినది.

'వస్తువులు' అను విశేష్యము బహువచనాంతమయియుండ దాని విశేషణ మగు 'అన్ని' యనునదియు బహువచనాంతముగా నుండవలయుఁగదా! అట్లు లేదేమి? అని తిరుగవయిచి యడుగవచ్చును.

నిజమే, విశేషణము విశేష్యముననుసరించి యుండవలసినదే. 'సుందరములు వస్తువులు కలవు' అనవలయునేగాని 'సుందరము వస్తువులు కలవు' అనరాదు. కాని 'అన్ని' అనునది బహువచనరూపమే లేనిదయి నిత్యైకవచనాంతమగుటవల్ల బహువచనాంతముగా నెట్లుండఁగలదు? అసాధ్యము, అసంభవము, గావున ఏకవచనాంతముగనే నిలిచినది. అని యాప్రశ్నమునకు సమాధానము.

**25.** సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమంబగు. బా.

రెండవవాఁడు, రెండవది; మూఁడవవాఁడు, మూఁడవది.

'ఒకటి' యనుదానికీయాగమంబు గలుగదు. 'ఒకటవ' అనరాదు. కావుననే 'ఒకటిని విడిచి రెండవ, మూఁడవ' అనుశబ్దములే యిటఁ జూపఁబడినవి.

ఈ యాగమము పూరణార్థకము.

పూరణమనఁగా పూరించుట = పూర్తిచేయుట.

ఏకత్వసంఖ్య సిద్ధమయినచో ద్విత్వసంఖ్యను పూరించుటయు, అది సిద్ధమగుచో, త్రిత్వసంఖ్యను పూరించుటయు సంభవించును.

మొదటిసంఖ్యకు అనఁగా 'ఒకటి' అనుదానికి ముందు ఏసంఖ్యయు సిద్ధమయియుండదుగాన 'ఒకటి'ని పూరించుటయనుమాటయే పొసంగదు. శేషమును పూరించుట యనఁగా ముందు సిద్ధమయినది కొంతయుండవలయును. 'రెండు' అనుసంఖ్యకుముందు 'ఒకటి' సిద్ధమయియున్నటులు 'ఒకటికి' ముందు సిద్ధమయినసంఖ్య యేదియు లేదు.

కావుననే 'ఒకటి' అనుశబ్దమునకు అవగాగమము ప్రసక్తముకాదని యూహింపవలయును.

నెచ[illegible] ఈ చూపుతోడనే సంస్కృతమునఁగూడ 'ద్వి, త్రి' మున్నగు సంఖ్యా చూడకు[illegible]కు 'ద్వితీయ, తృతీయ' మున్నగు పూరణప్రత్యయాంతరూపములు [illegible]పొలయినటులు ఏకశబ్దమునకుఁ బూరణార్థకమేదియు నేర్పడియుండ ములయి [illegible]

[illegible]

సూత్రము[illegible] అను మహద్రూపముకూడ సంఖ్యావాచకమే యగుటంజేసి

యచట, ఈ 'అవ'కలిగి 'ఇద్దఅవ' అను రూపమేలకాదు ? అని శంకించు కొనవచ్చును.

పూరణార్థకము తొలుతటి మూలప్రాతిపదికలకే వచ్చుట మనభాషలలో సంప్రదాయము.

సంస్కృతమున ద్వి, త్రి, చతుర్ అను మూలప్రాతిపదికలకే పూరణార్థక ప్రత్యయములు కలుగును.

ద్వితీయ, తృతీయ, చతుర్థ అను రూపములు నిష్పన్నములగును. అంతియగాని స్త్రీ లింగమున మార్పు కలిగిన తిసృ, చతసృ అనువానికంటెఁ బూరణార్థకము వచ్చుట లేదు. ఆంధ్రమునకు సోదరియగు తమిళభాషయందును

| అమహత్తు | మహత్తు | పూరణార్థకాంతము |
|---|---|---|
| ఇరణ్డు | ఇరువర్ | ఇరణ్డాం |
| మూన్ఱు | మూవర్ | మూన్ఱాం |
| నాన్గు | నాల్వర్ | నాన్గాం |

అని మూలప్రాతిపదికలకే 'ఆం' అను పూరణార్థకము కానంబడును. ఇరువర్ ఇత్యాదులకు రాదు.

అటులే తెలుఁగునందును ఆదిమ ప్రాతిపదికమగు 'రెండు'నకే అవగాగమమగును గాని, దానినుండి యేర్పడిన మహద్రూపమగు 'ఇద్దఱు' అను దాని కవగాగమము కలుగదు.

"మహత్త్వంబున రెండున కిద్దయుఁ బై ఱుఅలునగు"

అని సూరి తన శబ్దశాసనమున 'ఇద్దఱు' అను మహద్రూపమునకు 'రెండు' అను దానిని ప్రాతిపదికముగా నిర్దేశించి యుండెను.

కాఁగా 'అవ' అను పూరణార్థకము ఇద్దఱు, ముగ్గురు మున్నగు మహద్రూపములకు రాక తన్మూల ప్రాతిపదికములగు రెండు, మూఁడు అను వానికే కలుగునని తెలియవలయును.

**26.** సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుం బోలె మహతికగు. ఉదా.

వారిద్దఱు రుక్మిణీసత్యభామలు ; వీరు మువ్వురు శ్రీభూనీళలు.

ఇచట వారు, ఇద్దఱు, వీరు, మువ్వురు అను సర్వనామములు అమహత్తులగుటచే అవి, రెండు, ఇవి, మూఁడు అనురూపములతో నుండ వలసియున్నది. అట్లు గాక యివి మహతీవాచకములుగూడ నగుటచే ఈ సూత్రమును బట్టి మహద్వాచకరూపముల నందినవి.

క్రియారూపములఁ జూపుటకు ప్రకరణౌచితిని బట్టి యీ యాచ్ఛిక పరిచ్ఛేదము తగినస్థలము కాకుండుటచే నిచట క్రియాపదములకు నుదాహరణములు చూపఁబడవయ్యెను. క్రియా పరిచ్ఛేదమున, ఈ సూత్రమునకుఁ బ్రసక్తి గలుగకుండుటచే నచటఁ జూపుటకును నవకాశము కలుగదయ్యెను.

చిలుకలు పలికెను, పలుకఁగలవు.

బాలురు పలికిరి, పలుకఁగలరు.

బాలికలు పలికిరి, పలుకఁగలరు.

ఇట్టివి క్రియాపదోదాహరణములుగ గ్రహింపవలయును.

ఈ సూత్రమునందలి యుదాహరణములు మతొక్క-మూలు సందర్శింపఁదగినవి.

మహతీవాచకములు మనకు వేనవేలు గలవు. ఏ స్త్రీవాచకముల నుదాహరించినను లక్ష్యములందు లక్షణసమన్వయము చూపుటకు లోపము కలుగదు.

కాని నిరంతర దివ్యనామ చింతనాపరుఁడగు చిన్నయసూరి తలఁపులో నెల్ల వేళలను దివ్యమూర్తులే మెలంగుచుండుట సహజము. సంభావ్యము.

దానినిబట్టియే యీ యుదాహరణములందు రుక్మిణీ సత్యభామలయు, శ్రీ భూనీళలయు దివ్య సందర్శనము బాలబాలికలకు సంప్రాప్తమయినది.

ఈ వాక్యములు చూడఁగనే మొదటి లక్ష్యమునందు రుక్మిణీదేవికిని, రెండవ లక్ష్యమునందు శ్రీ దేవికిని గల ప్రథమస్థానమునుబట్టి విష్ణుదేవుని యంతఃపుర కాంతలలో వైకుంఠవాసమున శ్రీదేవికిని, ద్వారకావాసమున రుక్మిణికినిగల అసామాన్య ప్రాముఖ్యము స్ఫురింపక తప్పదు.

అందును రుక్మిణీ సత్యభామలలో రుక్మిణి మొదటిదిగా నగపడుచుండుటంబట్టి ఆమె ఘనతకు స్థాపకమయిన శ్రీకృష్ణతులాభారాది కథలన్నియు బాలురకును, వారికంటెముందు బాలికలకును జ్ఞప్తికి రాకమానవు.

ప్రసంగవశమున నేర్పడి ప్రమోదకరములయిన పవిత్ర స్ఫురణములు.

**27. అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు. ౨౭.**

పలుగురు—పలువురు; ఇరుగురు—ఇరువురు; వేగురు—వేవురు; తొగ—తొవ; పగలు—పవలు.

అపదాద్యంబనుటచే 'గిన్నె'-'విన్నె' కాదు. - 'గీటు'-'వీటు' కాదు. అసంయుక్తంబనుటచే 'తగ్గు' - 'తవ్వు' కాదు. 'విగ్గు'-'వివ్వు' కాదు. సిగ, నద

యిత్యాదులందుఁ గొన్నింట నీవకారముకలుగునట్లు కానరాదు. ఆపాటివ్యవస్థను విభాషాపదమే కల్పింపఁగలదు.

## ఔపవిభక్తిక ప్రకరణము.

**28.** ఇ, టి, తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తి కంబులు. ౨౮.

> విభక్తినిమిత్తకంబులయి యాదేశాగమాత్మకంబులయిన ఇ, టి, తి అనువర్ణంబు లౌపవిభక్తికంబులనంబడు.

ఇవి వర్ణములే కాని వర్ణకములు కావు.

కొందఱు ఔపవిభక్తిక వర్ణకములు, ఔపవిభక్తిక ప్రత్యయములు నని వ్యవహరింతురు. ఆ వాడుక అలాక్షణికము. ఈ వర్ణములు కలుగు శబ్దములకుఁ గూడ ఔపవిభక్తికము లనియే వ్యవహారము. ఈ యంశమును

"యత్రైతే తత్ర తత్సంజ్ఞా నామ్నామస్యాస్య చాస్యథా"

అని యథర్వణాచార్యులు స్పష్టముగా వచించియున్నారు.

**29.** ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగనగు. ౨౯.

కాలు, కాలిని, కాలిచే; నాఁగలి, నాఁగటిని, నాఁగటిచే; నేయి, నేతిని, నేతిచే.

ద్వితీయైకవచనంబు పరంబగునపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబు.

రావని వక్కాణించిన ఆ కొందఱెవ్వరో బయటఁబడకున్నారు. లక్ష్య లక్షణములలో నొక్కదానికయిన ననుకూలింపనిమాట చెప్పెదులకంటెమాయని విడియపడుచున్నారు కాఁబోలు!

**30.** ఊరు మొదలగు వాని కిత్వంబగు. ౩౦.

ఊరు — ఊరిని; కాలు — కాలిని; మ్రాను — మ్రానిని; నోరు — నోరిని; చోటు — చోటిని.

**౨౧.** టివర్ణంబు గొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంతాగమంబును, గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు. ౘ౧.

ఆదేశము : త్రాడు—త్రాటిని. కాడు—కాటిని. నోరు—నోటిని. ఏఱు—ఏటిని.

ఆగమము : అన్ని — అన్నిటిని. ఎనిమిది — ఎనిమిదిటిని. వేయి — వేయిటిని.

ఉభయము : ఏమి — ఏటిని, ఏమిటిని; పగలు — పగటిని, పగలిటిని; మొదలు-మొదటిని, మొదలిటిని; రెండు-రెంటిని, రెండిటిని; మూఁడు—మూఁటిని, మూఁడిటిని; నూఱు—నూటిని, నూఱిటిని.

**౩౨.** హ్రస్వముమీఁది టివర్ణకంబునకుముందు పూర్ణబిందువు బహుళముగానగు. ౩౨.

అన్నింటిని; ఎనిమిదింటిని; పగంటిని, పగలింటిని; రెండింటిని; మూఁడింటిని.

బహుళమనుటచే మీఁదటికి, క్రిందటికి, అప్పటికి ఇత్యాదులందు బిందువు రానేరదు.

దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము నిషిద్ధమగుటచే త్రాటిని ఇత్యాదులందు దీర్ఘముమీఁదఁ బూర్ణబిందు వెట్లును రాదుగాన ఈ సూత్రమున 'హ్రస్వము మీఁది' అను విశేషణమావశ్యకమని తోఁచకున్నది. ఇది సిద్ధార్థకథనము కానోపును.

నీరు శబ్దమునకు 'నీంట' అనురూపము గలదనియు, కావున నీసూత్రమున 'హ్రస్వముమీఁది' అను విశేషణము ఉండనేరాదనియు నొక టీకలో నాక్షేపము గలదు. ఆ యాక్షేపమునకు నుపష్టంభకములుగా

"పతిఁ దేల్తు సౌఖ్యరసంబు 'నీంట' " —విరాట-2-310.

"రసంబు పె। 'న్నీంట'ను గూర్చుతామమును" —హరి-ఉ.భా-7-94.

అను ప్రయోగము లచ్చటఁజూపఁబడినవి.

పయిరెండు తావులను బ్రయోగము లిట్లు కానరావు.

"పతిఁదేల్తు సౌఖ్యరసంపు నిట్ట" —విరాట-2-310.

"....రసంబుపె। న్నింటను గూర్చుతామమును"—హరి-ఉ.భా-7-94.

అనియిట్లు 'నిట్ట, నింట' అను పాఠములు చూపట్టుచున్నవి.

శబ్దరత్నాకర, సూర్యరాయాంధ్ర నిఘంటువులందు ఈ 'నిట్ట, నింట' అను శబ్దములు ప్రవాహార్థకములుగా నిర్దేశింపఁబడినవి. అంతియగాక యచటి శబ్దార్థనిర్ణయమునకు ఈ పద్యభాగములే ప్రమాణములుగాఁ బ్రదర్శింపఁబడినవి. ఈ రెండు పద్యములందును 'నీరు' అనుదానికంటె 'ప్రవాహము' అను నర్థమే సందర్భోచితము సమన్వయానుకూలమును.

క్రమించి వెదకినచో ఈ పద్యములందు 'నీంట' అను పాఠములు ఏప్రతులందయిన గోచరించునేమో ! గోచరించినను బ్రసిద్ధములగు పెక్కు ప్రతులయందును నిఘంటువులందును నుచితములగు పాఠములగపడుచుండ, సూత్రము నాక్షేపించుటకు అనన్వితములు అనిశ్చితములునగు మాఱుమూల పాఠములకు బలముచాలదు.

**33.** పదాద్యంబగు హ్రస్వంబుమీఁది టివర్ణంబునకుముందు పూర్ణబిందువగు. ౩౩.

కన్ను-కంటిని; మిన్ను-మింటిని; ఇల్లు-ఇంటిని; పల్లు-పంటిని.

నుడి తొలిహ్రస్వముమీఁద ఖండబిందువుండదుగాన నిటఁ బూర్ణబిందు వగునని విశేషించి వక్కాణింపఁ బనిలేదు. కాని రెండు బిందువులును, ప్రసక్తములగుటయు, ఖండబిందువును 'నుడితొలి' సూత్రముచే వారించు కొనుటయు నీ ప్రక్రియాక్లేశ మేలయని కాఁబోలును గావలసిన పూర్ణబిందువును మాత్రమే విధించియుండెను.

**34.** అఱుమొదలగుశబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబునకొక్కటికి లోపంబునగు. ౩౪.

అఱు - అతితిని.
అఱు, కఱు, కొఱు, గొఱు, మిఱు, వఱు: ఇవి యఱు మొదలయినవి.

ఇత్వమును 36 వ సూత్రము విధించును.

పయి 31, 34 సూత్రములందు 'టి, తి' వర్ణము లంతాగమములుగ విధింపఁబడినవి: అన్నిటిని, అతితిని. కొఱకు రావలసిన యాగమములకు టుక్, నుక్ మున్నగువానికి కిత్త్వమును గుఱుతుగాఁ గల్పించియే యిందు సర్వత్ర ప్రక్రియామార్గ మవలంబింపఁబడినది. ఈ సూత్రమున నట్టిసులువు మార్గము వీడి, 'టి, తి'యనువానికి కిత్త్వముగూర్చక, "ఇవి అంతాగమంబులుగా

నగు"నని యింతపొడవుగఁ జెప్పనేల? అనుశంక యిచ్చట సంస్ఫురింపక మానదు.

నిజమేగాని యిట కిత్త్వము నుంచుటకుఁ బ్రసక్తిగలదు. 'టి, తి' వర్ణము లాగమములుమాత్రమే కావు. 'త్రాడు, త్రాటిని; గోయి, గోతిని' ఇత్యాదులందుఁ గొన్నిట నంత్యాక్షరములకు నాదేశములుగఁ గూడ రావలయును. ఇట్టివీనికి కిత్త్వమునుంచినచో నాగమములు మాత్రమయి యాదేశములుగఁ బ్రవర్తించుట కడ్డంకి యేర్పడును. ఆ తలంపుతో, కిత్త్వపద్ధతి నుజ్జగించినటు లూహింపవలయును.

ఈరీతిగా నంతాగమములకు కిత్త్వమును గూర్చినచోటులు బాల వ్యాకరణమున మఱి రెండుమాత్రమే కలవు: తత్సమ - 15; కారక — 33.

ఆ తావులందు కిత్త్వమార్గపరిత్యాగమునకు వేఱువేఱు కారణములు కలవు. అవి యా చోటులందు పరికించునది.

ఉకారంబుక్రింది ఉకారంబునకు లోపము ప్రకీర్ణము 7 వ సూత్రముచే విహితము కాఁగలదు. అది బహుళము.

ఈ 'తి'వర్ణము పరమగునపుడు ఉకారలోపము నిత్యము. అఱితిని అనుచో ఆ సూత్రముచేతనే ఉకారలోపము చేసి యా బహుళపదమువల్లనే నిత్యతను నిరూపింపవచ్చునుగాని, యిట నుదాహరింపవలసిన 'అఱితిని' అను రూపము సిద్ధించుటకయి సుదూరపరిచ్ఛేదమునందున్న సూత్రముచే లోపమును, నందలి బహుళపదముచే నిత్యతను నిరూపించుటకంటె, 'తి'వర్ణముతోపాటు ఉవర్ణలోపమును గలిపి విధించుటయే సులభమార్గమని సూరి తలంపయి యుండవచ్చును.

**35.** విభక్తి పరంబగునపుడు గోయిప్రభృతుల తుదియక్షరంబు తివర్ణంబగు. ఉదా.

గోయి — గోతులు; గోతిని — గోతులను.
గోయి, చేయి, దాయి, నూయి, నేయి, వాయి, రోయి ఇత్యాదులు.

**36.** టి, తి వర్ణంబులు పరంబులగునపు డుత్వంబున కిత్వం బగు. ఉదా.

రెండిటికి; మూఁడిటికి; నాలుగిటికి; పగలిటికి; మొదలిటికి; పెక్కిటికి.
కొండొకచో నుత్వంబున కిత్వంబు రావట్టదు: నెత్తుటికి.

తివర్ణమునకు నుదాహరణములు 34 వ సూత్రముననే ప్రదర్శితము లగుటచేఁ దిరిగి యిటఁ జూపఁబడవయ్యెను.

**37.** 'టి'వర్ణంబు పరంబగునపుడు క్రిందు మీఁదు ముందు పువర్ణంబుల కత్వంబగు. ఇఇ.

క్రిందు—క్రిందటిని; మీఁదు—మీఁదటిని; ముందు—ముందటిని; మాపు—మాపటిని; అప్పుడు—అప్పటిని.

క్రిందు = పూర్వము (చూ. ప్రకీర్ణక – 7).
మీఁదు = పరము (చూ. సంజ్ఞ-14).
ముందు = పూర్వము (చూ. సంజ్ఞ-16).

**38.** ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు. ఇలా.

గోరనుగిఱెను, ఊరనున్నాఁడు, గొడ్డటనఱికెను, ఇంటలేఁడు; వఱుతఁగలిసె, కఱుతదూఁటె.

పక్షంబునందు గోరిచేత నూరి యందిత్యాదులు.

ఇది యాచ్ఛికపరిచ్ఛేదము.

ఇ, టి, తి అను మూఁడింటను నొక్కొక్కదానికి రెండేసిగా తృతీయ కొకటియు సప్తమికొకటియు ననుతలంపుతో నాఱు లక్ష్యములు.

తివర్ణోదాహరణములలోమాత్రము తృతీయాసప్తములక్రమము విపర్యస్త మయినది. హేతు వేమయియుండునో! తొలిముద్రణమునను ఇటులే కలదు. ఈ విపర్యాసము ముద్రాపక ప్రమాదజనితమయి యుండునా? ఇట్టిమార్పు ముద్రాపకీయమయి సాధారణముగా సంభవింపదు. ఏటిలోఁగలిసెనను అమంగళ స్ఫురణచ్ఛాయగల యుదాహరణముతో పరిచ్ఛేదము ముగించుటకంటె కృషికర్మ సంబంధియయి శుభోదర్కమయిన లక్ష్యముతో ముగింతమను తలంపున సూరియే మార్చియుండెనేమో! మఱిమఱి పరికించినంగాని ఉన్నతెఱంగెఱుంగం బడదు.

ఈ అత్వాదేశము ఏకవర్ణము (ఏకాల్) గావున అలోన్త్యపరిభాషా తాత్పర్యమునుబట్టి యంతాదేశముగ రావలసియున్నది. ఆరీతిని జేసినచో చేత తోడల తుదినున్న 'అ'కారముననే 'అ'కారము కలిగి యీ విధానము నిష్ఫల మగును. కావున విధానసామర్థ్యమువల్ల తృతీయకు అత్వము అంతాదేశముగఁ

గాక సర్వాదేశముగనే చేయకతప్పదు. దీనినిబట్టి సప్తమికిఁగూడ సర్వాదేశమే గాని యంతాదేశము కానేరదని గ్రహింపవలయును.

సూత్రమున చేత, అందు అని ప్రత్యయరూపములనుగాక తృతీయా సప్తములని విభక్తులపేరితో నిర్దేశించుటవలన ఆ విభక్తుల మొత్తమునకే అత్వాదేశమగునను సూచనగూడ సూత్రమునఁ గానవచ్చుచున్నది.

మఱియు 'తృతీయాసప్తములకు అత్వమగు'నని యింతమాత్రమేగాక 'అత్వంబాదేశంబగు'నని ప్రత్యేకముగ ఆదేశపదమునుగూడ నిర్దేశించుటయు నిచట అకారము సర్వాదేశముగనే వచ్చుననుటకు సూచకము కాఁగలదు.

'నెత్తుటికి' అనుదానియందువలెనే 'అఱుతన్, పఱుతన్' అనుచోటు లందును ఉత్వంబున కిత్వంబు (36 సూ.) చూపట్టదని గ్రహింపవలయును.

ఈ తత్సమాచ్ఛిక పరిచ్ఛేదములందు నిష్పన్నమయిన శబ్దములకు నేయే యర్థములందు నేయేవిభక్తులు కలుగునో రాఁబోవు పరిచ్ఛేదమున నిరూపింపఁబడును.

---

# కారక పరిచ్ఛేదము

**1.** ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమయగు. ౧.

ప్రాతిపదికార్థమునందు : రాముఁడు, రావణుఁడు.

నియతోపస్థితికము ప్రాతిపదికార్థము.

సంబోధనంబునందు : ఓరాముఁడ, ఓరావణుఁడ.

ఉక్తార్థమందు : రాముఁడు రావణుని సంహరించెను. ఉక్త మనఁగాఁ జెప్పఁబడినది. ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినదిగావునఁ దద్వాచకమగు రామ శబ్దమునకుఁ బ్రథమ యయ్యె.

రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె : ఈ వాక్యమం దాఖ్యాతము కర్మమును జెప్పినదిగావునఁ దద్వాచకంబగు రావణ శబ్దంబునకుం బ్రథమయయ్యెనని యెఱుంగునది.

ఆఖ్యాతము = క్రియావిభక్తి. ఒండురెండుటీకలలో అఖ్యాతశబ్దమునకు 'క్రియాపదము' అను నర్థము నిర్దేశింపఁబడినది. అది ప్రామాదికము. ఉపేక్షణీయము.

**2.** కర్మంబున ద్వితీయయగు. ౨.

ధాత్వర్థఫలాశ్రయంబు కర్మమునాఁబడు.

దేవదత్తుఁడు వంటకమును వండెను : ఇట వండెననుమాటకు వంటచేసెనని యర్థము. వంట: ఫలము, చేయుట: వ్యాపారము. వంట యనఁగాఁ బాకము. పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మంబయ్యెనని యెఱుంగునది.

ధాతువునకు నర్థమగుఫలమునకు నాశ్రయమయినది కర్మము.

**3.** చేతవర్ణకంబు కర్తకగు. ౩.

ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు.

దేవదత్తునిచేత వంటకము వండఁబడియె. వండఁబడియెననఁగా వంటచేయఁబడియెనని యర్థము. చేయుటకాశ్రయుండగుటంజేసి దేవదత్తుండు కర్తయయ్యె.

ధాతువునకు నర్థమగు వ్యాపారమునకు నాశ్రయమయినది కర్త.

4. చేతవర్ణకంబు హేతుకరణంబులం ద్రహ్యాదియోగంబునం బగు పంచమికిని బహుళంబుగా నగు. ఉ.

ఫలసాధనయోగ్యంబగు పదార్థంబు హేతువు.

క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు.

హేతువునకు: ధనముచేత సౌఖ్యంబుగలుగు; విద్యచేత యశంబుగలుగు—పక్షంబున వలనవర్ణకంబగు.

కరణంబునకు: ఖడ్గంబుచేత ఖండించె; కోలచేతఁ గూలనేసె —పక్షంబునం దోడవర్ణకంబగు.

గ్రహ్యాదియోగంబునందు: జరాసంధుఁడు రాజులచేతఁ గప్పంబు గొనియె; మైత్రుండు చైత్రునిచేత ఋణంబుఁగొనియె: ఈయర్థంబును నీచేతనెఱింగితి; ఈ వృత్తాంతంబు వానిచేత వింటి—పక్షంబున వలన వర్ణకంబగు.

ఇత్యాదికంబు లెఱుంగునది.

5. కరణసహార్థ తుల్యార్థయోగంబులం దృతీయకుం దోడ వర్ణకంబగు. ఉ.

కరణంబునందు: కోలతోడఁ గూలనేసె.

సహార్థంబునందు: రాజు సేనలతోడ వచ్చె—సేనాసహితుండయి వచ్చెననియర్థము.

తుల్యార్థయోగంబునందు: చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు. తృతీయకనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థ యోగంబున షష్ఠియునగు.

ఈ తుదివాక్యమునకుఁ దాత్పర్యము పదిలముగా పరికింపఁదగినది.

తోడవర్ణకము ఎప్పుడును, ఎట్లును తృతీయకే వచ్చును. ఇతరవిభక్తికి రానేరాదు. ఆస్థితిలో ఈసూత్రమున 'తోడవర్ణకంబగు'నని చెప్పినంజాలును. అట్లుగాక, తోడవర్ణకంబు 'తృతీయకగు'నని విశేషించిచెప్పుట యెందులకు? అని మనము ప్రశ్నించుకొన్నచో 'ఈ కరణ సహార్థ తుల్యార్థస్థలములలోఁ గొన్ని చోట్ల తృతీయయేగాక యింకొకవిభక్తికూడ వచ్చునుగాఁబోలు'ననియు, 'అట్లు

వచ్చెడి యా రెండువిభక్తులలో నొకటియగు తృతీయకు; తోడవర్ణకమగునని యభిప్రాయము కాఁబోలు' ననియు మనకు స్ఫురించును.

సూత్రమున 'తృతీయకు' అనుపదమే లేనిచో ఏ ప్రశ్నయు మనకుఁ గలుగనుగలుగదు. ఇచట నింకొకవిభక్తిగూడ వచ్చునుగాఁబోలునని స్ఫురింపను స్ఫురింపదు. 'తృతీయకు' అనుటంజేసియే యా ప్రశ్నమును, దానినిబట్టి యీ స్ఫురణమును గలిగినవి. తోడవర్ణకము ప్రాప్తించు కరణ సహార్థ తుల్యార్థములు మూఁడింటిలో నొక్కతుల్యార్థయోగమున మాత్రమే యీ షష్ఠివచ్చుచుండుటచే సూత్రమున 'తోడ, కు' వర్ణకంబులగునని సూటిగాఁ జెప్పవలసుపడక యీ తిరుగుడు మార్గమునఁ దెలుపవలసివచ్చినది.

**6.** వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడ కువర్ణకంబులు ప్రాయికంబుగా నగు. ఉ.

> మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె; మైత్రుండు చైత్రున కిట్లనియె.
>
> ప్రాయికంబనుటచే నొకానొకచో ద్వితీయయునగు.

**7.** ఉపయోగంబునందాఖ్యాతకుం దోడ వర్ణకంబగు. ఉ.

> నియమపూర్వక విద్యాస్వీకారంబుపయోగంబనంబడు.
>
> రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి — సాందీపనివలనని యర్థము.

సకలవిద్యలందును వేదవిద్య ప్రధానము, పవిత్రము గాపున తదధ్యయన పద్ధతిలో గురుశిష్యులు పాటింపవలసిన నియమములు పెక్కులు విహితములయి యున్నవి. కనుక నియమపూర్వక విద్యాస్వీకారమనఁగా వేదవిద్యాస్వీకారమని తాత్పర్యము. కావుననే, యుదాహరణవాక్యమునఁగూడ వేదాధ్యయనసందర్భమే నిర్దేశింపఁబడినది.

భాషలో ఈ 'తోడ' వర్ణకము వేదాభ్యాససందర్భమునందుమాత్రమే వచ్చుటకును నితరవిద్యాభ్యాసప్రసంగములందు రాకుండుటకును గారణముగలదు.

సాధారణముగా, ఏవిద్యలయభ్యాసమునందయినను గురువు బోధించుట, శిష్యులు విని గ్రహించుట అనుపద్ధతి సాగుచుండును. వేదాభ్యాసపద్ధతి యట్టిది గాదు. వేదోచ్చారణమున ఒక్కపొల్లువర్ణమయినఁ దాఱుమాఱు కారాదు. అంతియగాక యుచ్చారణమున, ఉదాత్తానుదాత్తాది స్వరముల నియమముగూడఁ దప్పరాదు. స్వరము తప్పినచో నర్థము మాఱిపోవుటయు సంభవించును. కావున

వేదమునందు, ఉదాత్తాది స్వరోచ్చారణమున జాగరూకత యన్నిటికన్న ముఖ్యము. కాఁబట్టియే వేదమును గ్రంథములం జూచి చదువుటగాక పరంపరా యాతమగు వర్ణానుపూర్విని గురువుచ్చరించుచున్నదానిని శిష్యులు భద్రముగా వినుచు ఆయనతోఁ దాముగూడ నుచ్చరించుచు మూలగ్రంథమునంతను నిటులే కంఠస్థముగావించుట యాచారమయినది. ఇదే అనూచాన సంప్రదాయము. అనువాచనపద్ధతి అన్నమాట. కాఁగా గురువు'తోడ' శిష్యులుగూడ నుచ్చరించుచు నభ్యసింపవలసినదిగాన నిచట 'తోడ'వర్ణనము సమన్వితమయి రూఢమయినది.

వేదభిన్నవిద్యల సందర్భమున ఈ 'తోడ'వర్ణనము భారతాదులందు నొక్కచోటనయినఁ బ్రయోగింపఁబడలేదు. ఏప్రయోగము చూచినను వేద విద్యాస్వీకారమునకు సంబంధించినదే.

i. సుమతి'తోఁ' జదివె సకల'వేద'వేదాంగములు. ----ఆది-2-162.

ii. సకల'వేదంబులు' సదివె వసిష్ఠు'తో'. ----ఆది-4-168.

iii. విలువిద్య గఱచుచుండిరి .... కుమారకులు కృపద్రోణాచార్యుల'తోడ'. ----ఆది-5-181.

విలువిద్య = ధనుర్విద్య. అదియు వేదములలోనిదే. అందుఁగూడఁ గొన్నియస్త్రముల ప్రయోగోపసంహార శక్తిసంపన్నతరయి గురువు శిష్యుల కుపదేశింపవలసిన మంత్రములు పెక్కులుండుటచే ధనుర్వేదమని దానినిగూడ వేదములలోఁ బరిగణింతురు.

ఇట 'సాందీపునితోడ' అనుపాఠము ప్రామాదికము. ఈ ప్రమాదము ప్రథమముద్రణముననే తటస్థించినది. అనంతరముద్రణములందును ననువర్తించు చున్నది. 'సాందీపనితోడ' అని యుండవలయును. రామకృష్ణుల గురువు సాందీపని. 'సాందీపుఁడు' కాఁడు.

"అథో గురుకులే వాస మిచ్ఛన్తావుపజగ్మతుః
కాశ్యం 'సాందీపనిం' నామ అవన్తిపురవాసినమ్"
----భాగవతమ్-10-45.

"అప్పుడు 'సాందీపని' మన। చొప్పరయుచు వచ్చి.... ...."
----భాగవతము-దశమ-ఉత్తర-1003.

అని యిట్లు సంస్కృతాంధ్రభాగవతములలో 'సాందీపని'శబ్దమే స్పష్టముగాఁ గాననగును. సందీపనపుత్రుఁడు = సాందీపని.

ఇటమీఁదిముద్రాపకులు ఈ సాధుశబ్దమును గుర్తింతురుగాక।

**8. సంప్రదానంబునకుం జతుర్థియగు. లా.**

**త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు.**

జనకుండు రామునికొఱకుఁ గన్యనిచ్చెను.

కొన్నియెడల నుద్దేశ్యమాత్రంబునకగు : పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు.

చతుర్థికిమాఱుగా షష్ఠియె తఱుచుగాఁ బ్రయోగంబులం గానం బడియెడి : జనకుండు రామునకుం గన్యనిచ్చెను ; పురుషార్థంబునకు యత్నింపవలయును.

స్వ స్వత్వ నివృత్తిపూర్వక పరస్వత్వాపాదనము త్యాగము. అనఁగా నొకవస్తువుపయిని దనకున్న స్వత్వమును విడుచుకొని యితరుల యధీనము చేయుట. మఱి తనకు 'హక్కు'లేకుండఁ బూర్తిగా నిచ్చివేయుట అన్నమాట.

ఇట్టి త్యాగమునకు ఉద్దేశింపఁబడిన వ్యక్తికి సంప్రదానమని సంజ్ఞ. తద్వాచకమునకుఁ దెలుఁగున షష్ఠీ చతుర్థులు రెండునుం గలుగును.

సంస్కృతమున నట్లుకాదు. ఆ భాషలో స్వత్వమును మరలఁ దాను గోరకుండఁ బూర్తిగా నిచ్చివేసినపుడు చతుర్థినే ప్రయోగింపవలెను. షష్ఠి వలనుపడదు.

స్వత్వమును బూర్తిగా వదలని సందర్భమున షష్ఠినే ప్రయోగింపవలెను. చతుర్థి వలనుపడదు.

ఈ ప్రసంగమున మహాభాష్యమునఁ జూపఁబడిన యుదాహరణములు తిలకింపుఁడు.

> 'అథోదాత్త మనుదాత్తం కరోషీతి ఖణ్డికోపాధ్యాయః శిష్యాయ చపేటికాం దదాతి.'

అపస్వరముపలుకుచున్న శిష్యునికి దండనముగా వేదగురువు చపేటిక నిచ్చుచున్నాఁడు (చపేటిక = చెంపదెబ్బ).

ఇట 'శిష్యాయ'అను చతుర్థికిమాఱుగా 'శిష్యస్య'అన్నచో చపేటికా స్వత్వమును గురువు విడుచుకొన్నట్లు కాదు. కావున ఆ చపేటిక తిరిగి గురువునకుఁ జెందినను జెందవచ్చును. 'శిష్యాయ'అన్నచో మఱి తిరిగిరాదు.

ఇఁక 'రజకస్య వస్త్రందదాతి' —శుభ్రపఱుపుమని రజకునికి వస్త్రముల నిచ్చుచున్నాఁడేగాని స్వత్వము విడుచుకొని యిచ్చివేయుటలేదు. కావున షష్ఠియే ప్రయోజ్యము.

ఇట్టియెడ 'రజకాయ దదాతి' అన్నచో స్వత్వము పూర్తిగాఁ దొలఁగును. ఆ వస్త్రములను రజకుఁడు తిరిగి యప్పగింపఁ బనిలేదు.

ఈ చిక్కు సంస్కృతవాక్యములందెగాని తెలుఁగున లేదు. ఈ భాషలో షష్ఠీచతుర్థులలో దేనినయినఁ బ్రయోగింపవచ్చును. రజకునికొఱకు వస్త్రములు వేసితిమన్నను నష్టమురాదు. మనవి మనకుఁ దిరిగివచ్చును. కాని యిట్టివాక్యము లందుఁ దెనుఁగున 'కొఱకు'వర్ణకముకన్న 'కు'వర్ణకమే రమణీయము.

**9.** అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దానసగు దానికి వలన వర్ణకంబగు. బా.

అపాయము = విశ్లేషము. భయము = వెఱపు. జుగుప్స = ఏవ. పరాజయము = దయ్యుట. ప్రమాదము = పరాకు. గ్రహణము = కొనుట, ఎఱుంగుట, వినుట ఇత్యాది. భవనము = పుట్టుట. త్రాణము = కాచుట. విరామము = విరమించుట. అంతర్ధి = మఱుఁగుట. వారణము = వారించుట.

అపాయంబునకు : మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె.
భయంబునకు : చోరునివలన భయపడియె.
జుగుప్సకు : పాపంబువలన నేవగించె.
పరాజయమునకు : అధ్యయనమువలన డస్సె.
ప్రమాదంబునకు : పాడివలనం బరాకువడియె.
గ్రహణంబునకు : మైత్రునివలన ధనంబు గొనియె.
భవనంబునకు : మనువువలనం బ్రజలు పుట్టిరి.
త్రాణంబునకు : చోరునివలనం గాచె.
విరామంబునకు : భోగంబులవలన విరమించె.
అంతర్ధికి : కృష్ణుండు తల్లివలన దాఁగె.
వారణంబునకు : శోకంబువలన వారించె.

ఈ పంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు :
చోరునకు వెఱచె ; పాపంబునకేవగించె ; అధ్యయనంబునకు డస్సె ; పాడికిం బరాకుపడియె ; మనువునకు నిక్ష్వాకుండు పుట్టె. ఇత్యాదులూహించునది.

ఉపదేశరేఖలుగల యుదాహరణములు.

**10.** ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు. ౧౦.

హిమగిరివలననుండి గంగ వొడమె. నాకంబువలననుండి నారదుండు వచ్చె.

భాగీరథీనారదుల సందర్శింపఁజేయుచు రెండునురెండు పావనములయి మనోవికాసముగొలుపు నుదాహరణములు.

**11.** ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు. ౧౧.

వనమునుండి వచ్చె, వనమందుండి వచ్చె.
ఊరినుండి వచ్చె, ఊరనుండివచ్చె.
వనమునుంచి, ధనమునుంచి యని యుంచి శబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరుగాని యది సాధుకవి ప్రయోగారూఢంబు గాదని యెఱుంగునది.

పూర్వసూత్రమున అనుప్రయుక్తముగ విహితమయిన ఉండి 'పదము'ను ఈ సూత్రమున ఉండి'శబ్దము'గా నిర్దేశించుచున్నాఁడు. ఈ మార్పునకు ఉద్దేశవిశేషమేదయిన నుండునా ? ఉన్నట్లగపడదు. ఏదియోలేకపోదు. ఎపుడో స్ఫురింపకనుమానదు.

**12.** కంటెవర్ణకం బన్యార్థాదియోగజంబగు పంచమికగు. ౧౨.

రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు.
లోభంబుకంటె నితరంబు దోషంబు లేదు.
ఇచట షష్ఠియు నగు : రామున కన్యుండు ధానుష్కుండు లేఁడు.
అన్యము, ఇతరము, పూర్వము, పరము, ఉత్తరము ఇత్యాదు లన్యాదులు.

రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడఁట. లేనిమాట నిజము. ముల్లోకములందును లేఁడు. కావుననే యాతఁడు కోదండరాముఁడయినాఁడు.

లోభంబుకంటె నితరంబు దోషంబు లేదఁట. అవును. లోభము మోహమును బుట్టించును. మోహము దుఃఖము నుత్పాదించును. దుఃఖము జ్వలనమువలె స్వాశ్రయమునకు నాశము పుట్టించును. అట్టి లోభమునుమించిన దోషమేదియుండును ? అసాధారణములయిన యుదాహరణములు.

**13.** కంటెవర్ణకంబు నిర్ధారణ పంచమికగు. ౧౩.

ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబె కలిగియుండు నచటం బంచమియగు. ఆ పంచమికిం గంటెవర్ణకంబగునని యర్థము :

జానపదులకంటె నాగరులు వివేకులు. మానహానికంటె మరణము మేలు.

జానపదులు వివేకహీనులని యర్థముకాదు. నగరములకంటె జనపదములకు లోకసంబంధము తక్కువగాపున పల్లెపట్టులందుండువారు సాధారణముగా అమాయికులయి యుందురని తాత్పర్యము.

మానహాని భరించుట మిక్కిలి కష్టము. కుసుమస్తబకమువలె మానవంతుఁడు సర్వజనుల మూర్ధముమీఁదనయిన నుండవలె. లేదా వనమందు నమసిపోవలె.

లోకానుభవసంకలితములయిన యుదాహరణములు.

**14.** పట్టివర్ణకంబు హేతువులగు గుణక్రియలకగు. ౧౪.

జానముఁబట్టి ముక్తుఁడగు ; నీవువచ్చుటంబట్టి ధన్యుఁడనయితి.
ఇచట వలనవర్ణకంబునగు : జ్ఞానమువలన ముక్తుండగు.

'పట్టి'పరమగునపుడావశ్యకమగు నుగాగమవిధానము బాలవ్యాకరణమునఁ గానరాదు.

టీకాకారులలోఁ గొందఱు ఈ నుగాగమ ప్రసంగమే యెత్తకుండిరి. కొందఱు

"పరుషే సరళేచైవ సమాసే ను'ముతో' భవేత్
అద్రుతా త్సరసా దందు పట్టి పూర్వ విభక్తిషు"

అను నాథర్వణ నుగాగమమును ఎరవుతెచ్చికోవలెనని సూచించిరి.

మఱికొందఱు పట్టివర్ణకమును ద్రుతపూర్వకముగ విధింపకున్న సూరికి ద్రుతమెట్లువచ్చునోయని యధిక్షేపించి విడిచిరి.

ఈ నుగాగమము మిక్కిలి యావశ్యకమే. ఇది సూరి తలంపులో మొదట లేకపోలేదు. తొలుతఁ దన సూత్రాంధ్రవ్యాకరణమున దీనికయి ప్రత్యేకముగ 'నుక్పట్టి విభక్తౌ' అను సూత్రమును రచించియుండెను. ఇటులే తనశబ్దలక్షణ సంగ్రహమునఁగూడ ద్వితీయపరిచ్ఛేదమున నుగాగమప్రకరణమున

" 'నర్వంబునకుం' బట్టి విభక్తి రానగు " —శబ్దలక్షణ-2-41.

అని పయియథర్వణకారికను సవరించుచు ఉత్తునకేగాక అన్నియచ్చులకును వచ్చునటు లొకసూత్రమును రచించియుండెను.

ఇట్లు రెండుగ్రంథములందును శ్రద్ధతో సిద్ధపఱుచుకొన్న యీ నుగాగమమును బాలవ్యాకరణరచనాసమయమున నెట్లు పరాకుపడెనో యెఱుఁగరాదు.

సూక్ష్మములగు వ్యాకరణకార్యము లొక్కొకచో నెంతవారికిని జూపు తప్పించును. కావుననే పాణినియంతవాని సూత్రములకు వరరుచి సవరణలు సేయక తప్పినదికాదు. అంతతోఁజాలక ఆ రెండింటికిని భాష్యకారులు పెక్కుతావుల మెఱుఁగులు దిద్దవలసియువచ్చినది. ఉత్తరోత్తరుల పరిశీలనబలముచే మార్పులతో చేర్పులతో విరివిగాఁ బెరుగుచుండుట శాస్త్రములకు లక్షణము.

## 15. శేషషష్ఠికి యొక్కయు నగు. ౧౫.

ఇచట శేషంబనఁగా సంబంధంబు.

రామునియొక్కగుణములు; నాయొక్కమిత్త్రుఁడు; వానియొక్క తమ్ముఁడు.

కువర్ణకంబును గొన్నియెడల సంబంధంబునందగు :

నాకుం దమ్ముఁడు ; మీకు నెచ్చెలి.

ఈ ప్రయోగము భాగవతములోనిది.

"నాకుందమ్ముఁడు మీకునెచ్చెలి రణన్యాయైకదక్షుండు బా
హాకుంఠీకృత దేవయక్షుఁడు హిరణ్యాక్షుండు" —భాగవత-7-30.

## 16. నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకంబగు. ౧౬.

జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణంబనంబడు. ఎద్దానివలన నిర్ధారణంబగు నచ్చటిషష్ఠికి లోపలవర్ణకంబగునని యర్థము : మనుష్యులలోపల క్షత్త్రియుండు శూరుండు. గోవులలోపలఁ గపిల బహుక్షీర. అధ్వగులలోపలం బాఱువాఁడు శీఘ్రగామి. ఛాత్త్రులలోపల మైత్రుండు సమర్థుండు.

ఇట సప్తమియుంగలదు : మనుష్యులయందు క్షత్త్రియుండు శూరుండు.

ఇత్యాదు లెఱుంగునది.

ఒకసముదాయమునుండు నొకవ్యక్తికిఁగల మంచినో చెడుగునో మఱే విశేషమునో ప్రత్యేకించి చెప్పఁదలఁచినపుడు ఆ సముదాయమునుండి ఆవ్యక్తిని వేఱుపఱిచి నిర్దేశింతుము. ఆ సందర్భమున జాతినిబట్టిగాని, గుణమునుబట్టిగాని, క్రియనుబట్టిగాని, సంజ్ఞనుబట్టిగాని పెక్కువ్యక్తులనుండి ఒకవ్యక్తిని పృథక్క-రించుట సంభవించును.

ఆ పృథక్కరణమునకే నిర్ధారణమని పేరు. దేనినుండి పృథక్కరణము జరుగునో అది నిర్ధారణావధి. ఏది పృథక్కరింపఁబడునో అది నిర్ధార్యమాణము.

నిర్ధారణావధివాచకమునకు షష్ఠికి 'లోపల' అను ప్రత్యయము కలుగును.

ఇట జాతి, గుణ, క్రియా, సంజ్ఞలు నాలుగిటికి నుదాహరణములు వరుసగాఁ జూపఁబడినవి.

'లో' అనునది 'లోపల' అనుదాని సంగ్రహరూపము.

'లోపల' అనునది షష్ఠీప్రత్యయమేగాక వేఱొకశబ్దముగూడఁ గలదు. దానికి లోపలిభాగమందు (అన్తరే) అనియర్థము. 'పెట్టెలో ధనముండును. పెట్టెలలో గ్రంథములుండును' మున్నగురీతిని ఆశబ్దమునకు వాడుక. ఆ'లోపల' శబ్దమునకును, నిర్ధారణార్థమునవచ్చెడి యీ'లోపల'వర్ణకమునకును సంబంధము లేదు.

అనేకవ్యక్తివాచకమగు శబ్దమునకు బహుత్వసంఖ్యాబోధకముగావచ్చు 'లోపల'వర్ణకము బహువచనమే యయియుండును. కావుననే పయియుదాహరణములలో "మనుష్య'ల'లోపల" ఇత్యాదులు నాలుగును బహువచనాంతములు గనే ప్రదర్శింపఁబడినవి.

ఇచటనేగాక సంజ్ఞాపరిచ్ఛేదమున 12వ సూత్రమున 'నారంబెన్, నాకున్, మాలోపలన్' అనియు, తత్సమ 10వ సూత్రమున "రామునిచే, రామునితో, వనము'లలో'" అనియు తక్కినవర్ణకములను నేకవచనములుగఁ జూపుచు ఒక్క 'లోపల'వర్ణకమునుమాత్రము బహువచనముగనే సూరి నిర్దేశించి యుండుటయుఁ గానవచ్చును.

ఈ సందర్భమున సంస్కృత వ్యాకరణమునఁగూడ "మనుష్యాణాం క్షత్రియ శ్శూరః" ఇత్యాదులగు నుదాహరణములు నాలుగును బహువచనాంత ములుగనే ప్రదర్శింపఁబడినవి.

ఈ నిర్ధారణ షష్ఠీసందర్భమున "మనుష్య'ని'లోపల క్షత్రియుండు శూరుండు" అని ఏకవచనాంతముగ నుండుట అసంభవము.

ఇట్లుండ, విభక్తిప్రత్యయములలో ఏవి ఏకవచనములో, ఏవి బహు వచనములో, ఏవి ఉభయములో నిరూపింపవలసినతావున 'డు ము వు న

లేకవచనంబులు' 'లువర్ణంబు బహువచనంబు' 'తక్కినవి యుభయంబులు' (తత్సమ 11, 12, 13) అని సూరి 'లోపల'వర్ణకమును ఉభయవచనములలోఁ జేర్చియుండెను.

'లోపల'వర్ణకము, ఏకవచనముగాఁ బ్రయోగింపఁబడుటకు సంభవమే లేనపుడు దీనినిగూడ 'లు'వర్ణముతోపాటు కేవలబహువచనముగాఁ జేర్కొనవలయుంగాని, ఉభయముగా నెట్లుపేర్కొనఁగలిగెనో ! అని టీకాకారులొకరు విస్మయపడుచుఁ బ్రశ్నించియుండిరి. తికమకలుపెట్టినఁబెట్టనీగాని తిన్ననయిన ప్రశ్న.

ఈ నిర్ధారణస్థలములందు బహువచనాంత ప్రయోగములు అసంఖ్యాకములు, అతిప్రచురములు ననుటకు సందియము లేదు. కాని, యేకవచన ప్రయోగమునకు సంభవమేలేదాయనిమాత్రము సమాలోచింపవలసియున్నది.

మనుష్యులు, గోవులు, పాంథులు, శిష్యులు మున్నగు వ్యక్తివాచకశబ్దములయొద్ద, ఏకవచన ప్రయోగమునకు సంభవములేనిమాట సత్యమేగాని, మనుష్యసముదాయము, గోగణము, పాంథసమూహము, శిష్యసంఘము, కవిసమాజము, కౌరవసంఘము, వానరులమూఁక, రాక్షసులగుంపు మొదలగు సమూహవాచక శబ్దములలో ఈ నిర్ధారణసందర్భమున

మనుష్యసముదాయము'లో' క్షత్త్రియుఁడు శూరుఁడు.
గోగణము'లో' కపిల బహుక్షీర.
పాంథసమూహము'లోఁ' బలుగెత్తువాఁడు శీఘ్రగామి.
శిష్యసంఘము'లో' చైత్రుఁడు బుద్ధిశాలి.
కవిసమాజము'లో' కాళిదాసు ప్రథమగణ్యుఁడు.
కౌరవసంఘము'లో' అభిమన్యుఁడు వీరుఁడు.
వానరులమూఁక'లో' జాంబవంతుఁడు వృద్ధుఁడు.
రాక్షసులగుంపు'లో' ఇంద్రజిత్తు సమర్థుఁడు.

అను నేకవచనప్రయోగములు వ్యవహారదూరములు కావు. అన్వయరహితములు కావు. అసమంజసములు కావు. అలాక్షణికములును గావు.

నిర్ధారణలక్షణమున 'సముదాయంబునుండి యేకదేశంబునకుఁ బృథక్కరణంబు'అని పృథక్కరణావధిగా 'సముదాయము' నిర్దిష్టమయియున్నది. వ్యక్తులే నిర్ధారణావధులుగా నుండవలయునను నియమము ఆ లక్షణమునఁ గానరాదు.

తెలుఁగున 'మనుష్యులలో'—'మనుష్యసమూహములో' అను నీరెండిటను దుల్యముగనే నిర్ధారణార్థము స్ఫురించుటకు ప్రతిబంధకమును గానరాదు.

ఇఁక, సంస్కృతభాషలో 'సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్' అను వాక్యమొకటి యెవరిదోగాని అందఱనోటను వినంబడుచుండును. ఈవాక్యమున

కర్థము 'శరీరమునకు శిరసు ముఖ్య'మనియా? 'శరీరములో (శరీరభాగములలో) శిరసుముఖ్య'మనియా యని యాలోచించినచో నిర్ధారణచ్ఛాయగల రెండవ యర్థమే స్ఫూర్తికి నించుక సన్నిహితమేమోయనిపించును. ఇది యిటుండనిండు.

" 'అచోన్త్యాదిటి — మిదచోఽన్త్యాత్ పరః "

ఇత్యాది పాణినిసూత్రములు కొన్నింట 'అచః' మున్నగు శబ్దములందు నిర్ధారణ షష్ఠి ఏకవచనముగాఁ బ్రయుక్తమయియున్నది. కాని, ఋషిప్రయుక్తములయిన ఆ యేకవచనములు ఆయాసూత్రములందు మాత్రమే సాధువులుగాని, యితర స్థలములందు మనము ప్రయోగింపరాదన్నటులు వ్యాఖ్యాతలు తమ యభిప్రాయములు వెలుపరించియుండిరి.

అవి యటుండనిండు.

'ద్వన్ద్వ స్సామాసికస్య చ'

అని భగవద్గీతయందుఁ గలదు. సామాసికశబ్దము సమూహవాచకము. సమాస సముదాయమని దీనికర్థము. 'సమాససమూహములో నేను ద్వంద్వసమాసమను' అని యిది శ్రీకృష్ణభగవానుని వాక్యము.

ఇట సమూహవాచకశబ్దమున నిర్ధారణార్థమున ఏకవచనమే ప్రయుక్తమయి యున్నది.

ఇట్లు నిర్ధారణార్థమున నరుదుగా షష్ఠ్యేకవచనప్రయోగమునకు సంస్కృత భాషలో సూచీప్రవేశముండుటంబట్టియు, తెలుఁగున 'మానవసంఘమందు', 'మానవసంఘమున' అను నిర్ధారణ సప్తమ్యేకవచనములవలె 'మానవసంఘములో' (క్షత్త్రియుఁడు శూరుఁడు) మున్నగు షష్ఠ్యేకవచనములు నయితము వ్యవహారరూఢములయి ప్రసిద్ధములుగా నగపడుచుండుటంబట్టియు, ఇట్టివి నిర్ధారణార్థ స్ఫురణమునకు ననుకూలములుగనే గోచరించుచుండుటంబట్టియు, ఈ 'లోపల'వర్ణకము కేవలబహువచనమేగాక యచ్చటచ్చట ఏకవచనముగూడ కావచ్చునను నవకాశముండుట మేలనుతలంపుతో సూరి దీనిని కేవల బహువచనమనక ఉభయవచనములలోఁ జేర్చియుండునని యూహింపవలయును.

లోకవ్యవహారముమాత్రముగాక యీ యూహకు సమర్థకములయిన కవి ప్రయోగములును గానంబడుచున్నవి. ఎవరివో కావు. భారతకవులవి :

"అ'చ్చన్నలోన' నిద్రాసక్తులైనవా రున్నతద్వీపముల యుగ్రపాద
హతిఁజేసి మర్దితులైరి .... ...." —భారతము-అరణ్య-1-110.

"పరమమునులార .... అనిన అమ్మని'సంఘంబులోన' రామానుచరుం
డయిన యకృతవ్రణుండనుముని ధర్మరాజునకిట్లనియె."

—భారతము-అరణ్య-3-127.

ఇట్టి ప్రయోగములంబట్టియు నట్టి లోకవ్యవహారమునుబట్టియు సూరి పాణినీయులపద్ధతికి నించుక విలక్షణమయినను, ఆంధ్రభాషాస్వరూపమునకు

ననురూపముగా 'లోపల'వర్ణకమును నుభయవచనములలోఁ జేర్చుటయే యుచితమని యూహించియుండును.

చిన్నయసూరినిర్ణయములు సాధారణముగా నిరాధారములు కానేరవు.

**17.** అధికరణంబునకు సప్తమియగు. ౧౭.

అధికరణంబు నా నాధారంబు. ఔపశ్లేషికంబు వైషయికం బభివ్యాపకంబని యాధారంబు త్రివిధంబు.

ఘటమందు జలమున్నది; మోక్షమందిచ్ఛగలదు; అన్నింటి యందీశ్వరుండు గలండు.

**18.** ఉకారాంత జడంబునకు నవర్ణకంబగు. ౧౮.

ఘటంబున జలంబున్నది; దేవదత్తునకు మోక్షమున నిచ్ఛ గలదు.

**19.** విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తి వచనంబులగు. ౧౯.

సందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు.
దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు.
శుభవిధాయుల రామకృష్ణుల భజింతు.
భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు.

ఇది సూత్రకర్త స్వీయపద్యము. ఇందు నాలుగవపాదమునఁ బాఠము సందిగ్ధము. ప్రథమముద్రణమున 'పొగడుచుందు' అనుదానికిమాఱు 'ప్రస్తుతింతు' అనికలదు.

యతిభంగముకలిగిన యీ పాఠము సూరిదయియుండునా? అయి యుండదు. 'ప్రస్తుతింతు' అనుదానికి ననుగుణముగా పాదాదిని 'భువన' అనుచోట వేఱొకపదమును సూరి కూర్చియుండునా? చెప్పఁజాలము. ఆదినుండి నేఁటిదాఁక ఏప్రతియందును 'భువన' అనుచో మార్పు గానరాదు.

'ప్రస్తుతింతు' అనుదానికి మాఱుగా 'పొగడుచుందు' అని యతికి ననుకూల మయినమార్పు మాత్రము పెక్కుప్రతులందుఁ గానవచ్చుచున్నది. ఈ మార్పు ఏముద్రణమున ఎవరివలన నేర్పడినదో నిర్ణయముతేలకున్నది. గుప్తార్థ ప్రకాశికాముద్రణముతో 'పొగడుచుందు' అనుపాఠ మారంభించెనా? అంతకు మున్నే మూలముద్రణములందుఁ గలదా? సూరి మొదటిపాఠ మేదయి యుండును? అని యింకను బరిశీలింపవలయును.

**20.** స్త్రీసమంబులగు విశేషణంబులయు మువర్ణకాంతవిశేషణంబులయు బహువచనంబున నేకవచనంబు బహుళంబుగానగు. ౨౦.

మాటలు పెక్కేల ; మాటలు పెక్కులేల.
కులిశధారల్కుంఠితంబయ్యె ; కులిశధారల్కుంఠితంబులయ్యె.
ఇష్టమగు పదార్థములు ; ఇష్టములగు పదార్థములు.

స్త్రీసమ క్లీబసమశబ్దములు కేవలాచ్ఛికములకు సంజ్ఞలు. ఇట, క్లీబసమంబులనక మువర్ణకాంతములనుట తత్సమాచ్ఛికములు రెండిటను ఈ కార్యము ప్రవర్తించునని సూచించుటకు. కనుకనే, కుంఠితములు, ఇష్టములు అను తత్సమ శబ్దము లుదాహరింపఁబడెను. రెంటను దత్సమంబులేగాకుండ ఆచ్ఛికమునుగూడ నొకదానిం జూపిన నింకను బాగుండెడిది.

మొదటిరెండును విధేయవిశేషణములు. సహజవిశేషణమునకుఁగూడ నేకవచనమును జూపుటకయి మూఁడవ యుదాహరణము ప్రదర్శితమయి యుండును.

"'మాటలు పెక్కేల' మానిసి గుట్టు మేనుంగను పేరెల్ల ద్రుంగె...."
---భారతము-సౌప్తిక-1-202.

"భిక్షగొనరమ్ము మాటలు 'పెక్కులేల'" —భీమఖండ-2-118.

"సురపతిసభఁ జూడంజూడ నంగారపృష్ఠుల్
గురిసెఁ 'గులిశధారల్కుంఠితంబయ్యె'". —భారతము-ఆది-2-81.

మువర్ణకము, ఏకవచనమగుటచే బహువచనమున మువర్ణకాంతరూపమునకు సంభవమేయుండదు. బహువచనమున నుండునవి ముగాగమరూపములు. కావున, నిట మువర్ణకాంత విశేషణములనఁగా ప్రథమైకవచనమున మువర్ణకము గలుగు విశేషణములని యర్థమును గ్రహింపవలయును.

సూత్రమున మువర్ణకాంతవిశేషణములనుటకుమాఱుగా ముగాగమాంత విశేషణములనిగాని, మువర్ణాంతవిశేషణములనిగాని యన్నచో అర్థగ్రహణ క్లేశము లేకుండెడిది. అటులేలయనలేదో ;

"స్త్రీసమభేదకస్య బహుళ మేకవచనమ్ — త్వాపి మ్వన్తస్య"

అని సంస్కృత సూత్రమునను

"స్త్రీసమంబులగు విశేషణంబుల కేకవచనంబ తఱచుగనగు మ్వంతంబున కొకానొకచోఁ జూపడియెడి"

అను శబ్దలక్షణ సంగ్రహ సూత్రమునను, ఈ సందర్భమున మువర్ణకాంతమను శబ్దము కానరాదు. మ్వంతమని ప్రయోగించియుండెను. దీనింబట్టి సూరి మువర్ణాంతవిశేషణములనియే యీ ప్రకృతసూత్రమునను లిఖించియుండెనేమో ;

కకారము ముద్రాపకప్రవేశితమేమో! ప్రథమముద్రణమునందును కకారము గలదు. ఆ ప్రతియందును ముద్రణ ప్రమాదములు కొన్ని లేకపోలేదు. ఇదిగూడ నట్టిదేమో! అనియు నొకసందేహము.

**21.** ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియు నగు. ౨౧.

మైత్రుండు గృహమును వెడలెను: గృహమునుండి యని యర్థము.
వాఁడు వాహనమును దిగెను: వాహనమునుండి యని యర్థము.
వారు సుఖమున్నారు: సుఖముతో ననియర్థము.
ఇత్యాదు లెఱుంగునది.

**22.** జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు. ౨౨.

రాముఁడు వాలి నొక్కకోలం గూలనేసె: కోలతోనని యర్థము.
లంకం గలకలంబు పుట్టె: లంకయందని యర్థము.
బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు.
అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె: బాణములచే ననియర్థము.
మీనంబు జలంబులనుండు: జలంబులందని యర్థము.

**23.** ఉదంతజడంబు తృతీయకు నవర్ణకంబగు. ౨౩.

రాముఁడొక్కబాణంబున వాలిం గూలనేసె: బాణముచే నని యర్థము.

**24.** జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు. ౨౪.

వాఁడు పూవులు దెచ్చె; వాఁడు పూవులను దెచ్చె.
ఆకె బొమ్మలు దాల్చె; ఆకె బొమ్మలను దాల్చె.
వాఁడిల్లువెడలె; వాఁడింటిని వెడలె.
బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించిన ద్వితీయకుం బ్రథమరాదు.

వినోదకరములగు నుదాహరణములు: జడుఁడయినభర్త: చులుకైన భార్య. భార్యను సంతోషపెట్టుటకయి, పాపము, వాఁడు పూవులు తెచ్చినాఁడఁట. ఆమె అవి ముడుచుకొని నిష్టపడక తనకున్న మఱిపూసగలు దాల్చినదఁట. ఆ వాలకము చూచి రోషము కలిగి వాఁడిల్లువెడలిపోయినాఁడఁట. పోఁడా మఱి! ఎంతజడుఁడయినను పురుషుఁడుగదా! అంతగా నిసరికొట్టుచున్నచో ఎంతకని ఓర్చుకొనఁగలఁడు? ఆమె రవంత సర్దుకొనవలయుఁగాని అల్పాంశములందుఁగూడ అడుగడుగునను అవమానించుట ఏమిన్యాయము? అని పలువిధముల తలపోఁతలకుఁదావిచ్చు ఈ చిన్నిసాంసారికరంగము చదువరులను వినోదమొదవించును. వ్యాకరణోదాహరణములలో నిట్టి సన్నివేశములను స్ఫురింపఁజేయు లాలిత్యము ఎవరికోగాని యెల్లరకు నుండునదికాదు.

**25.** కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమయగు. ౨౫.

వాఁడు నిన్నవచ్చె, వీఁడు నేఁడు పోయె; మాపు నిలువుము, ఱేపు పొమ్ము; వారు క్రోశము నడచిరి, వీరామడ పోయిరి.

**26.** సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులయందెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు. ౨౬.

అన్నిగుఱ్ఱములకు, అన్నింటికి గుఱ్ఱములకు; గుఱ్ఱములన్నింటికి, గుఱ్ఱములకన్నింటికి; సాహిణులు మువ్వురు.
రెండుగుఱ్ఱములకు, రెండింటికి గుఱ్ఱములకు; గుఱ్ఱములు రెండింటికి, గుఱ్ఱములకు రెండింటికి; సాహిణులు నలుగురు.
లక్షగుఱ్ఱములకు, లక్షకు గుఱ్ఱములకు; గుఱ్ఱములు లక్షకు, గుఱ్ఱములకు లక్షకు రవుతులు లక్ష.
ఇత్యాదు లెఱుంగునది.

'అన్ని' మొదలయినవి సర్వనామములు.

అన్నిప్రభృతులగణములో సంఖ్యావాచకములుగూడఁ గలవు (చూ. ఆచ్ఛిక-24) దానింబట్టి సంఖ్యావాచకములుగూడ సర్వనామములేగదా! సర్వనామశబ్దమువల్లనే గృహీతములగుచుండ వానిని దిరిగి చెప్పుట వ్యర్థముకాదా? అని శంకింతురేమో! వ్యర్థముకాదు. వేఱుగాఁ జెప్పుటలోఁ బ్రయోజనము గలదు.

అన్నిప్రభృతులగణములోఁ జేర్పఁబడిన సంఖ్యావాచకములు ఒకటి, రెండు, మూఁడు మున్నగు తెలుఁగు శబ్దములుగాని ఏక, ద్వి, త్రి మున్నగు సంస్కృత శబ్దములు కావు. ప్రకృత సూత్రవిహితమగు ప్రథమ సంస్కృత సంఖ్యావాచకములకుఁగూడఁ గొన్నిటికి రావలసియున్నది. కావున, సంస్కృతాంధ్ర సాధారణముగ సంఖ్యాభిధానపదమును వేఱుగా గ్రహించియుండెను.

ఈ దృష్టియుండుటవల్లనే సూరి సర్వనామమునకు నుదాహరణముగా 'అన్నిగుఱ్ఱములకు' అని, అన్నిశబ్దమున కొక్కయుదాహరణమునే చూపి సంఖ్యావాచకమునకు 'రెండుగుఱ్ఱములకు, లక్షగుఱ్ఱములకు' అని యుదాహరణములు రెండిటిని జూపియుండెను.

లక్ష్యములు 'రెండిటి'నిచ్చుట--అందొకటి తెలుఁగు, ఒకటి సంస్కృతము నగుట పరికించినచో సూరియుద్దేశము స్ఫురింపఁగలదు.

మఱియు, రెండుమున్నగు సంఖ్యావాచకములు సర్వనామగణములో నుండఁగా, మరల సంఖ్యాభిధానశబ్దమును వేఱుగా గ్రహించుటలోఁ బ్రయోజనాంతరముగూడఁ గలదు. సంఖ్యావాచకములన్నింటికి, ఈ ప్రథమ తప్పక రావలయుననియు, సర్వనామములలోఁ గొన్నింటికి రాకపోవచ్చుననియు, నభిప్రాయము సూచించుటకు, పృథగ్గ్రహణము చేయఁబడినటు లూహింపవలయును. దానింబట్టి ఆ, ఈ, ఏలు సర్వనామములేయయినను వానికిట్టి ప్రథమ రాదని తోఁచెడిని.

కావున "అట్టివారితో బాలకులతోఁ జెప్పితిని" అనుచో "అట్టివారు బాలకులతోఁ జెప్పితిని" అని ప్రథమ రానేరదు.

ఈ సూత్రమున ప్రథమావిధానముసందు నతివ్యాప్తిలేకుండఁ గాచుకొనుటలో గజిబిజి చాలఁగలదు. కావుననే సూత్రము నెంతబింకముగ రచించినను మనసు నిబ్బరము చాలక యిచ్చట బహుళపదమునుగూడ సాయముగోరుట.

ఇటఁ గొందఱు 'మాతో ఇద్దఱితో' అనుచోట మొదటిది సర్వనామమగుటవల్ల 'మేము ఇద్దఱితో' అనియు, ఇటులే 'ఇద్దఱితో మాతో' అనుచోట మొదటిది సంఖ్యావాచకమగుటవల్ల 'ఇద్దఱు మాతో' అనియు, ఈ సూత్రముచే ప్రథమ కలిగి యపరూపములు సంభవించుచున్నవేయని శంకించుకొందురు. కాని అట్టితావులం దీసూత్రమునకుఁ బ్రవృత్తియే లేదు.

సర్వనామ తద్విశేష్యములు ; సంఖ్యావాచక తద్విశేష్యములు అను కూర్పులోని తీరునుబట్టియు, నుదాహరణముల రీతినిబట్టియు స్తిమితముగా నాలోచించినచో సర్వనామములు విశేషణములయి యుండవలెననియు, తద్విశేష్యములన్నవి సర్వనామేతరములయి యుండవలెననియు, సూత్రకారుని యుద్దేశము విశదము కాఁగలదు.

కావుననే 'నీ, నా, మన, తా' అనునవి సర్వనామములయినను విశేషణములు కావుగావున వానికిఁ బ్రథమ యెచ్చటను బ్రాప్తింపదు. కనుక, 'మాతో ఇద్దఱతో' అనుచోట 'మాతో' అనునది సర్వనామమయినను విశేషణము కాదు గావున దానికిఁ బ్రథమ రాదు.

'ఇద్దఱతో మాతో' అనుచోట 'మాతో' అనునది విశేష్యమయినను సర్వనామేతరము కాదుగావున దానినిబట్టి 'ఇద్దఱతో' అనుదానికి బ్రథమ రాదు.

పర్యవసానమేమన, నీ, నా, మన, తా శబ్దములకు సర్వనామత్వమును బట్టిగాని, తద్విశేష్యత్వమునుబట్టిగాని, యీ సూత్రముతో సంబంధమే లేదని యూహింపవలయును.

ఈ నాలుగుశబ్దములకును, వీనితో సహప్రయుక్తములగు సంఖ్యావాచకములకును, ఈ సూత్రముచే బ్రథమను శంకించుకొని తన్నివారణమునకయి చీకాకులువడిన టీకలు గొన్ని గలవు. సూత్రతాత్పర్యమునఁగల కీలకము గుర్తించినచో నీ, నా, మన, తా శబ్దముల విషయమున, ఈ తావున నపరూప శంక గలుగుట కవకాశమే కనంబడదు.

**27.** ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు. ౨౭.

సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద.

సుగుణాభిరామునకు రామునకు జోహారు వొనర్చెద.

'జోహారు వొనర్పుఁడు' అనిగాక 'జోహారు వొనర్చెద' ననుటలో ఆత్మాచరణరూపమగు హితోపదేశరీతి స్ఫురించుచున్నది.

**28.** భవత్యర్థవ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు. ౨౮.

అగు మొదలగునవి భవత్యర్థములు.

విద్యాశాలియగు పురుషుని సకలజనులు సన్మానింతురు.

భూతదయాపరగు మహాత్ములకు శ్రేయంబు గలుగును.

అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమయిన కేశవార్జున కృతిన్.

"అతిమానుష మత్యద్భుత
మతిదుష్కరమయిన కేశవార్జునకృతి గో
పతి సూచి మెచ్చి సురపరి
వృతుఁడయి చనుదెంచెఁ గృష్ణవిజయులకడకున్."

—భారతము-ఆది-8-318.

సూరి యీ భారతపద్యమందలి 'కృతి' అన్నంతవఱకుఁగల భాగమును, విశేషణములద్వితీయకుఁ బ్రథమవచ్చుట కుదాహరణముగఁ జూపియుండ వచ్చును. 'కృతిన్' అను ద్వితీయాంతమునకు విశేషణములు భవత్యర్థ వ్యవహితములగుటచేఁ బ్రథమాంతములయినవని చూపుట యుద్దేశము కావలయును.

కాని ఇందు 'కృతి' అనునది ద్వితీయార్థక ప్రథమ (24 వ సూ.) యనుకొన్నచో తద్విశేషణములు ప్రథమాంతములగుటలో విశేషములేదు గావున ప్రకృతసూత్రమునకు ఈ పద్యభాగముదాహరణమే కాఁజాలదు. సరళాది యగు గోపతిశబ్దము పరముగాఁగల ఈ కృతిశబ్దము ప్రథమాంతముకాదనియు, ద్వితీయాంతమేయనియు నిర్ణయించుట దుర్ఘటము.

ప్రకృతలక్షణమునకు పట్టుచాలని యీ భారతప్రయోగమును పనిఁబూని యెందులకు ప్రదర్శించియుండెనో ! ఏదియోయొక యుద్దేశవిశేషములేకుండ ఇంతపద్యభాగము సూరకచూపియుండఁడు. ఆలోచింపదగినది.

ఇది యిటులుండ, ఈ సందర్భమున

"భావ్యర్థ వ్యవధానేతు భేద్యస్య నిఖిలం భవేత్"

అను సథర్వణకారికయొద్ద ద్వితింత్రిణీసీతారామకవిటీకయందు

"........అతిదుష్కరమయిన కేశవార్జు'నుల' కృతిన్"

అని కొంతసవరణతో ఈ పద్యపాద ముదాహరింపఁబడియున్నది.

బాలవ్యాకరణమునందలి యుదాహరణములు పెక్కులాటీకయందుఁ గానగును.

ఆ టీకాకర్త బాలవ్యాకరణమునందలి యీ పద్యభాగమునుగాంచి, యిందు గణలోపమున్నదనుకొని, ఆ లోపము తీర్చుతలంపుతో, "అతిదుష్కరమయిన కేశవార్జు'నుల' కృతిన్" అని సవరించినటులు తేటతెల్లముగా గోచరించుచున్నది.

ఇది భారతపద్యమని సీతారామకవి గుర్తించినట్లగపడదు.

"స్వస్వ విభక్తి వికారైః"

అను చింతామణిసూత్రమునొద్ద అహోబలపండితీయమున నొకప్రసంగమున, ఈ పద్యభాగము

" అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమయిన కేశవార్జునకృతి —
ఇత్యాదివచన 'మాచార్యస్య' "

అని యీ తీరుగా నుదాహరింపఁబడియున్నది.

ఇది నన్నయభట్టారకుని ప్రయోగమని యహోబలపండితుఁడు స్పష్టముగాఁ జెప్పియుండెను.

సీతారామకవి యీ పద్యభాగమును నీ యహోబలపండితీయముననే చూచియున్నచో నిది నన్నయపద్యమని యాతనికిఁ దప్పక తెలిసియుండెడిది. అపుడు 'ఈ భాగమున గణభంగము రానవచ్చునున్నదే' యనుశంక తాత్కాలికముగాఁ గలిగి నన్నయభట్టారకుని సంపూర్ణపద్యము నాతఁడు కనుఁగొని యుండెడివాఁడు. అందు

"అతిదుష్కరమయిన కేశవార్జునసత్కృతి గో
పతి సూచి...."

అనుపాఠముగాంచి వెంటనే గణభంగశంకను దొలఁగించుకొని యుండెడివాఁడు.

అట్లుగాక యాతఁడు బాలవ్యాకరణమునందుమాత్రమే యీ యసంపూర్ణ పద్యభాగమును గాంచియుండుటవల్లను, నిది యెవరిదో యెక్కడిదో బాల వ్యాకరణమునుబట్టి తెలియకుండుటవల్లను తాత్కాలికముగా స్ఫురించిన యీ గణభంగమును దొలఁగించు తలంపుతోఁ బయిరీతిని సవరించినటు లగపడు చున్నది.

బాలవ్యాకరణమునఁగాక భారతమునందుఁగాని యహోబలపండితీయ మునఁగాని యాతఁడీపద్యభాగమును జూచియున్నచో ననావశ్యకముగా సమన్వయభంజకముగా మూలపాఠవిరుద్ధముగా — అట్లు సవరించుట యెంత మాత్రమును సంభవించియుండదు.

కావున సీతారామకవి బాలవ్యాకరణమునుండియే యీ యుదాహరణము గ్రహించినటులు తెలుచున్నది.

**29.** భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునపరము, దానిముందు విశేషణంబుల కయిపదంబును, బహుళంబుగా ననుప్రయుక్తం బగు. ఉదా.

అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు.

**30.** అయిపదానుప్రయోగంబు లేనిచోఁ దుదివిశేషణంబునకేని విశేషణంబులన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపంబడు. ఉం.

ఆద్యుఁ డప్రమేయుఁడునగు హరిని గొలుతు.
ఆద్యుఁడు నమేయగుణుఁడునౌ హరిని గొలుతు.
ఆద్యుఁ డప్రమేయుండగు హరిని గొలుతు.

**31.** ధాతుజవిశేషణవ్యవధానంబున విశేషంబులన్నింటి కయి పదం బనుప్రయుక్తంబగు. ౩౧.

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యెసంగెడు దేవుని నభినుతింతు.

ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబుగలదది ప్రయోగంబుల నెఱుంగునది.

**32.** భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమయగు. ౩౨.

రాముఁడు వచ్చుట ; రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె ; రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు ; రాముఁడు పట్టినప్రతిన వారింపం దరంబుగాదు.

**33.** ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వు, ను లును బహుత్వంబున రు, ము లు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు. ౩౩.

**34.** ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వం బగు. ౩౪.

నీవు ధన్యుఁడవు, నేను ధన్యుఁడను ; మీరు ధన్యులరు, మేము ధన్యులము.

ఇకారంబుమీఁది కు, ను, వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు ననుసూత్రముచేత వు, నుల కిత్వంబగు :

నీవు సుకృతివి, నేను సుకృతిని.

"ఆర్తిహరుఁడవౌ నినుఁ గొల్తు నంబుజాక్ష."

"గర్వగరిష్ఠుండగు నన్ను", "మీరలు పెద్దలు".

ఇత్యాదులు ప్రాయికగ్రహణముచే రక్షితంబులయ్యె.

వు, ను, రు, ము అను నాగమములకు నాలుగిటికి లక్ష్యములు సరిగా నాలుగింటినింజూపి, పిమ్మట 'ధన్యుఁడవు'వంటిదేయగు 'ఆర్తిహరుఁడవౌ' అను వేఱొకలక్ష్యమును మరలఁజూపనేల ? సూరి సాధారణముగా లక్ష్యములను అన్యూనముగను అనతిప్రసక్తముగను నిర్దేశించునేగాని, ఆవశ్యకములను

విడుచుటయఁగాని అనావశ్యకములను బ్రదర్శించుటయఁగాని యుపక్రమింపఁడే! పునరుక్తులకు సమ్మతింపఁడే! అయిన తానూహించి చూపిన నాలుగు లక్ష్యములలో నొక్కదానికేని కవిప్రయోగమును జూపఁజాలండి 'ఆర్తిహరుఁడవౌ నినుఁ గొల్తు నంబుజాక్ష' అను పద్యపాదము నిచ్చియుండునేమో యనుకొందమన్నను, దీనికిముందున్న సూత్రములకు (29, 30, 31) లక్ష్యములుగా తానేరచించి చూపిన తేటగీతి పాదములవలె ఈ పద్యభాగమునుగూడ తానేరచించి చూపినటులున్నదేగాని యిది అన్యదీయముగఁ గన్పట్టదే! దీనినధికముగాఁ జూపుటకు హేతువేదయియుండునో! అని కొందఱిట సందియమునొందవచ్చును. చిన్నయసూరి లక్ష్యప్రదర్శనకౌశలముపయి కన్నువెట్టినవారికిట్టి సందియము ఉదయించుట సాజము.

కాని యిచట పునరుక్తి లేదు. ఈ లక్ష్యములు సమానములు కావు. రెంటికిని భేదముగలదు.

'నీవు ధన్యుఁడవు' అనుచో విశేషణమునందలి ప్రథమసహజము; 'ఆర్తిహరుఁడవౌ నిను' అనుచోటనున్న ప్రథమ కృత్రిమము. అనఁగా, 'నీవు ధన్యుఁడవు' అనుచోట 'నీవు' అను ప్రథమాంతవిశేష్యమునుబట్టి 'ధన్యుఁడు' అను విశేషణమునందున్న ప్రథమ సహజము.

'ఆర్తిహరుఁడవౌనిను' అనుతావున 'నిను' అను ద్వితీయాంతవిశేష్యమును బట్టి 'ఆర్తిహరుఁడు' అను విశేషణముగూడ ద్వితీయాంతముగనే యుండవలసినను అటులుండక భవత్యర్థవ్యవధానమున 28 వ సూత్రముచే ఆ ద్వితీయ ప్రథమగా మాఱియుండుటంబట్టి 'ఆర్తిహరుఁడు' అను విశేషణమునందలి ప్రథమ కృత్రిమము.

ఇట్టి భేదముండుటగమనించి సహజప్రథమాంత విశేషణములకువలెనే కృత్రిమప్రథమాంత విశేషణములకుఁగూడ ఈయాగమమురావచ్చునని తెలుపుటకయి వేఱొక యుదాహరణము చూపఁబడినట్లు గుర్తించినచో నయిసందియము తీరఁగలదు.

ఈ సూత్రముచే అంతాగమములుగా రావలసిన వు, ను, రు, ము అను వానికి కిత్త్వము గూర్పక అంతాగమశబ్దముతోనే విధించుచున్నాఁడు. నిక్, టుక్ ఇత్యాదులందువలె కిత్త్వముంచినచో వస్తుతః సౌకర్యము గలదు.

కాని యీతని ప్రక్రియాప్రణాళికలో, ఇతరస్థలములందు వుగాగమము, నుగాగమము, రుగాగమము, ముగాగమము అను నీ నాలుగును పెక్కుచోట్లఁ బ్రసిద్ధములయి యుండుటచే బాలుర కయ్యవి స్ఫురించి, సాంకర్యముకలిగి, పదేపదే సందేహము జనింపవచ్చును. అది లేకుండవలయునని కిత్త్వమును గూర్పలేదు. మఱియు, కిత్త్వకల్పనమున 'వుగ్నుత్కులు', 'రుగ్ముత్కులు'

అని యనవలసివచ్చును. ఆ కూర్పులోఁ గటుత్వము గలదు. ఈ రెండు హేతువులచే నిట కిత్త్వపద్ధతి విడువఁబడినది.

ఇట్లు విడిచినతావులు బాలవ్యాకరణమున మఱి మూఁడుమాత్రమే గలవు: తత్సమ 15; ఆచ్ఛిక 31, 34.

అచ్చటి కిత్త్వపరిత్యాగమునకు హేతువులు వేఱు. ఆ చోటులు తిలకించునది.

ఈ యాగమములు కొన్నితావులందు రావని తెలుపుటకు నిటఁ జూపఁబడిన యుదాహరణములు కల్పితములు కావు. కవి ప్రయుక్తములు.

"'గర్వగరిష్ఠుండగునన్ను' నిద్దెసకుఁ దేరంజాలుటన్ వాసవీ"

—నిర్వచనోత్తరరామా-7-91.

"'మీరలు పెద్దలు' త్రైలోక్యారాధ్యుల రేమియన్న నంటిరిగాక"

—కళాపూర్ణోదయము-1-57.

ఈ యాగమములురాని ప్రయోగములు:

"ఏమీసుప్పురున్ మన్ననల్ వడయంగాఁదగునట్టివారము"

—భారతము-ఉద్యోగ-2-282.

"భరతవంశముఁజొచ్చితి నందుఁ బాండుభూవరునకుఁ గోడలైతి"

—భారతము-ఉద్యోగ-3-108.

ఇత్యాదులు భారతమునను గొన్నిగలవు. వానినిజూపక యిచట నిర్వచనోత్తరరామాయణ కళాపూర్ణోదయ ప్రయోగములను నిర్దేశించుటంబట్టి భారత మొక్కటియగాక యితరప్రబంధములును సూరిదృష్టిలో ప్రమాణములేయనుట సువిశదమగుచున్నది.

**35.** అది శబ్దంబునకు వునులు పరంబులగునపుడును సంబోధనంబునందును దానయను నాదేశంబగు. ౘ౫.

నీవు చిన్నదానవు; నేను జిన్నదానను; ఓ చిన్నదాన!

**36.** అన్య యుష్మ దస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు. ౘ౬.

వారును మీరును ధన్యులరు; మీరును మేమును ధన్యులము.

ఈ సూత్రమునుబట్టి అన్యముకంటె యుష్మదర్థము బలీయమయినపుడు దానినిమించిన అస్మదర్థము మఱింత బలీయమగుట సుస్పష్టముగాన 'వారును మేమును ధన్యులము' అను నుదాహరణము చూపఁబనిలేదని విడువఁబడినది.

ఈ బలీయస్త్వము ఏకార్యమువిషయముననో విశేషించి చెప్పకుండుట వల్లను, 'కార్యంబులందు' అని బహువచనము ప్రయోగించుటవల్లను, ఈ పూర్వసూత్ర విహితమయిన యాగమకార్యమువిషయముననేగాక ఏకార్యమునందయినను వీని యుత్తరోత్తరబలీయస్త్వము నిరూపింపఁబడినటులే గ్రహింపవలయును.

కావునఁ గ్రియాపదములందలి 'అన్య యుష్మ దస్మ' త్కార్యములగు ప్రథమ మధ్యమోత్తమ పురుషముల ప్రవృత్తియందును, ఈ బలీయస్త్వమునే పాటింపవలయును :

వారును మీరును జదివితిరి : (మీరును వారును జదివితిరి)
మీరును మేమును జదివితిమి : (మేమును మీరును జదివితిమి)
వారును మేమును జదివితిమి : (మేమును వారును జదివితిమి).

**37.** ఏకవాక్యంబునం దొకానొక్కండుతక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంబడును. ఎల.

పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్యమందెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపందగును.
ఏనిప్రభృతిశబ్దములు కొన్ని నియమసాపేక్షంబులయి యుండు.
గాలి చల్లగా వీచెను ; వీచెను జల్లగా గాలి ; చల్లగా గాలి వీచెను ; వీచెను గాలి చల్లగా ; గాలి వీచెను జల్లగా ; చల్లగా వీచెను గాలి.

ఇది కారక పరిచ్ఛేదము.

విభక్త్యర్థవిశేష నిరూపకమయి, యించుక క్లిష్టమయిన యీ కారక పరిచ్ఛేదమున చదువరులు కొంత శ్రమఁజెందియుండవచ్చును. వారు సేద దేఱుటకో యన్నటులు పరిచ్ఛేదాంతమున చల్లగాగాలి వీచునట్లు సమకూర్చుటలో సారస్యము గోచరించును.

ఈ పరిచ్ఛేదమున విభక్త్యంతములుగానేర్పడిన వ్యస్తపదములను గలిపి సమాసములుగఁగూర్చుటలోని పద్ధతులు ఈ పిమ్మట వివరింపఁబడును.

# సమాస పరిచ్ఛేదము

**1.** సమర్థంబులగుపదంబు లేకపదంబగుట సమాసంబు. ౧.

పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు.
పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము.

ప్రతిశబ్దద్వయమునకును సమాసము కలుపుదమన్న వలనుపడదు. ఏరెండు శబ్దములకుఁ బ్రసిద్ధములయి విడివిడిగానున్న యర్థములు రెండును నొక్కటిగా మేళవించి ఒకేయర్థమును దెలుపఁగలవో యట్టిశబ్దములకే సమాస రూపమగు కలయిక యేర్పడునని తాత్పర్యము.

**2.** సాంస్కృతి కాచ్ఛిక మిశ్ర భేదంబుచే సమాసంబు త్రివిధంబు. ౨.

సాంస్కృతికంబని, యాచ్ఛికంబని, మిశ్రంబని సమాసంబు త్రివిధంబు.
అందు సాంస్కృతికంబు సిద్ధంబని, సాధ్యంబని ద్వివిధంబు.
కేవల సంస్కృత శబ్దంబుల సమాసంబు సిద్ధంబునాఁబడు :
రాజాజ్ఞ, తటాకోదకము, లక్ష్మీవల్లభుఁడు.
సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబునాఁబడు :
రాజునాజ్ఞ, తటాకంబునుదకము, లక్ష్మీవల్లభుఁడు.
తక్కిన తెనుఁగులసమాసం బాచ్ఛికంబనంబడు :
తేనియానతి, చెఱువునీరు, సిరిచెలువుఁడు.
ఉభయంబులు గూడినది మిశ్రంబనంబడు :
రాజుముదల, చెఱువునుదకము, సిరివల్లభుఁడు.

**3.** తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబయగు. ౩.

తత్పురుష, బహువ్రీహి, ద్వంద్వంబులను సమాసంబులెల్లం ద్రివిధంబులయియుండు. అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయ పదార్థ ప్రధానంబులయియుండు.

అందుఁ దత్పురుషంబు వ్యధికరణంబని, సమానాధికరణంబని ద్వివిధంబు.

ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు:

నెలతాల్పు, నెలతక్కువవాఁడు, దేవరమేలు, దొంగభయము, రామునిబాణము, మాటనేర్పరి.

విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు; ఇదియె కర్మధారయంబు నాఁబడు: సరసపు వచనము, తెల్లగుఱ్ఱము, మంచిరాజు; ఇది సంఖ్యా పూర్వంబు ద్విగువునాఁబడు: ముజ్జగములు, ముల్లోకములు.

బహువ్రీహి: ముక్కంటి, చలివెలుఁగు.

ద్వంద్వము: తల్లిదండ్రులు, అన్నదమ్ములు.

ప్రాయికంబుగాననుటచే సంస్కృతలక్షణంబుఁ దొడరని సమాసంబుం గలదని సూచింపంబడియె. దానంజేసి చిగురుఁగేలు, జుంటిమోవి యిత్యాదులయిన యుపమానపూర్వపద కర్మధారయంబులు గ్రాహ్యంబులు. ముఖపద్మము, చరణకమలములు: ఇట్టి యుపమానోత్తరపదంబులు గలవుగాని, విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది.

సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు: రాజపురుషుఁడు, నీలోత్పలము, పీతాంబరుఁడు, రామలక్ష్మణులు.

కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ, సమసింపదు: దానంజేసి యనేకమాఱులు లల్పదండిత్యాదులు దుష్టములని తెలియునది.

సమాసమున రెండవది యాచ్ఛికపదమయినపుడు మొదటిశబ్దము కేవల సంస్కృతప్రాతిపదికమయినచో నట్టిసమాసము సాధువుకాదు. ఆ సంస్కృత ప్రాతిపదికమును తత్సమముగ మార్చి, 'అనేకపుమాఱులు, అల్పపుదండు', అన్నచో సమాసము సాధువగును.

**4.** ఆ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు. ౪.

ఈ త్రికసంజ్ఞ పూర్వులవ్యాకరణములందు లేదు. సూరి క్రొత్తగాఁ గల్పించుకొన్నది. 'మూఁడు' అనునర్థము స్ఫురించి చదువరుల జ్ఞప్తికి సౌకర్యము గలుగవలయునని అర్థవంతమగు సంజ్ఞను గల్పించెను. ఈతని నూతనసంజ్ఞలన్నియు నిట్లు అన్వర్థములే. రచనాప్రణాళికాప్రకరణమున నవి యెల్ల నేకముఖముగా వివరింపఁబడినవి.

**5.** కర్మధారయంబు త్రిక, స్త్రీసమ, ముగంత, ధాతుజ విశేషణ పూర్వపదంబయియుండు. ౫.

> ఆ చందము, ఈ చిందము, ఏ బృందము; వాఁడిమాట, ప్రోఁడి పాట, బెడిదపు టడిదము; మడిసెడు దడములు.
> ఈ నియమముచే బల్లిదుఁడు మల్లుఁడు, కావలుఁడు రావణుఁడు ఇత్యాదుల సమాసంబులేదు.

ముగంతములనఁగా 'ముగాగమము కలుగుటకు నర్హతగల శబ్దములు' అనియర్థము. ఆ జాతిశబ్దములకు ప్రథమైకవచనమునఁ గలుగునది 'ము' వర్ణకము. తక్కిన యెల్లచోటులందుఁ గలుగునది 'ము'గాగమము.

సూత్రమున 'ముగంత' అన్నను మువర్ణకాంతములుగూడ గ్రాహ్యములని సూచించుటకే 'సరసపువచనము' అను మువర్ణకాంతమయిన యేకవచనమే యుదాహరణముగఁ జూపఁబడినది. సూత్రమున 'మువర్ణకాంత' అనుట లెస్స. మువర్ణకము ముగాగమమును గ్రహింపఁగలదు (తత్సమ-41). ముగాగమము మువర్ణకమును గ్రహించుట కష్టము.

వండెడు, పండు మున్నగు ధాతుజవిశేషణములకుఁ బ్రథమైకవచనము తఱుచు స్పష్టముగఁ గానరాకుండుటంబట్టి అవి స్త్రీసమములని కొందఱు భ్రమింతురు. వానిని స్త్రీసమములనరాదు. వాని ప్రథమైకవచనము లోపింపదు. విభక్తిని వివక్షించునపుడు వానికి తచ్ఛద్ధి మనుప్రయుక్తమగును. దానిపయిని విభక్తి నిలుచును: వండెడువాఁడు, వండువాఁడు అనియగును. ధాతుజ విశేషణములు స్త్రీసమములు కాకుండుటవల్లనే యీ సూత్రమున స్త్రీసమములను వేర్కొనియు ధాతుజవిశేషణములను వేఱుగాఁ బేర్కొనినటులు గ్రహింపవలయును.

**6.** స్త్రీసమ షష్ఠీతంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు. ౬.

ముక్కంటి, వేగంటి, చలివెలుఁగు, వేవెలుఁగు, మోటబరి
ఇత్యాదులు వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులు.

తెనుఁగున బహువ్రీహిసమాసములు మిక్కిలి తక్కువ. ఆ యంశము సూచించుటకే 'ఒకానొకండు', 'చూపట్టెడు', 'వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులు' అని పలువిధముల నొక్కినొక్కి పలికెను.

ఈ బహువ్రీహులలోఁ బూర్వోత్తరపదములు రెండును స్త్రీసమములే కావలయును.

ఇచట 'ముక్కంటి' అను నుదాహరణమున 'మూఁడు' అనుశబ్దము స్త్రీసమమని యంగీకరింపక తప్పదు. కావున 'మూఁడు' శబ్దములోని డువర్ణము శబ్దసిద్ధముగాని డుజ్వర్ణకము కాదని గమనింపవలయును. డుజ్వర్ణక మనుకొన్నచో నీ శబ్దము స్త్రీసమము కానేరదు. కాకున్నచో 'ముక్కంటి' అను బహువ్రీహిసమాసమే కుదురువడదు. (చూ. 17వ సూ.).

**7.** ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు. ఉ.

అన్నదమ్ములు, తల్లిదండ్రులు, ఊరుపల్లెలు, ఆలుమగలు.
మగడును బిడ్డలును, పల్లమును గళ్లెమును ఇత్యాదులు
సమసింపవని యీ నియమంబున నెఱుంగునది.

సూత్రములందు సమాసము విధింపఁబడు శబ్దములు రెంటిలో ఒకటి ప్రథమాంతముగను ఇంకొకటి తృతీయాంతముగను సాధారణముగ నిర్దేశింపఁబడుచుండును. సూత్రమున ఏది ప్రథమాంతమో యది సమాసమునఁ బూర్వపదమై యుండవలయును. ఈ నియమము పాణినీయమున :

'ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్'
'ఉపసర్జనం పూర్వమ్'

అనుసూత్రములచే బోధింపఁబడినది.

ఈ సూత్రమున 'స్త్రీసమంబు' ప్రథమాంతముగా నిర్దేశింపఁబడుటచేఁ బయిని వివరించిన నియమమునుబట్టి తెలుఁగున ద్వంద్వసమాసమునఁ బూర్వపదము స్త్రీసమమైయుండవలయునని తేలుచున్నది. 'మగఁడును బిడ్డలును' మున్నగుచోట్లఁ బూర్వపదము స్త్రీసమము కాకుండుటచే నిట్టియెడ సమాసము కానేరదని తాత్పర్యము.

**8.** సర్వశబ్దంబులు సంబంధంబునందుం దచ్ఛబ్దంబుతోడ సమసించు. దా.

నావాఁడు, నాయది; ఇంటివాఁడు, ఇంటిది; రామునివాఁడు, రామునిది.

**9.** ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తంబగు. ౯.

వచ్చినవాఁడు, వచ్చినది; రానివాఁడు, రానియది.

**10.** ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టియనుపదంబు విభాష ననుప్రయుక్తంబగు. ౧౦.

వచ్చినట్టిరాముఁడు, వచ్చినరాముఁడు ; వచ్చునట్టివాఁడు, వచ్చువాఁడు.

వచ్చినట్టిరాముఁడు : ఇది సమాసపదము.
వచ్చునట్టివాఁడు : ఇది యేకపదము. సమాసము కాదు.

ఇట 'వాఁడు' అనునది ధాతుజవిశేషణమునకు విభక్తి వివక్షయందుఁ బూర్వసూత్రముచే ననుప్రయుక్తమయినది. సమాసములందేగాక వ్యస్తము లందును 'అట్టి'యనుపదము వచ్చునని తెలుపుటకే సూత్రమున 'ఎల్లయెడల' అని ప్రయోగించుట. అది వచ్చినట్లు చూపుటకే రెండవయుదాహరణ మిచ్చుట.

**11.** యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగు నపుడు దుగాగమంబు విభాషనగు. ౧౧.

నీదుకరుణ, నీకరుణ ; నాదునేరిమి, నానేరిమి ; తనదురూపు, తనరూపు.

లక్ష్యములన్నియు నేకవచనముననే చూపఁబడినను, బహుత్వమునఁ గూడ, ఈ దుగాగమము వచ్చుటకు సూత్ర మనుమతించినటులే కానవచ్చు చున్నది. బహుత్వమున కవిప్రయోగములు అరుదుగాఁ గలవు :
"రాచకొడుకులెల్లఁ 'దమదు' రాచఱికంబుల్"—హరి-పూర్వ-2-172.
"మీరీమొదలెఱుఁగ రివియె 'మీదు' విమర్శల్"—భోజరాజీయ-5-302.

**12.** గుణవచనంబులగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు. ౧౨.

నల్లనిగుఱ్ఱము, నల్లగుఱ్ఱము.

నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య, కమ్మ, పుల్ల, పిన్న, తిన్న, అల్ల ఇత్యాదులు నల్లాదులు.

**13.** ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబు నకు హ్రస్వంబగు. ౧౩.

**14.** త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. ౧౪.

అక్కన్య, అకన్య ; ఇక్కాలము, ఈకాలము ; ఎల్లోకము, ఏలోకము ; అయ్యశ్వము, ఆ యశ్వము.

బాహుళకముచే సూక్ష్మరేఫంబులకు ద్విత్వంబు గలుగదు :

ఆరూపము, ఈశబ్దము, ఏషండము, ఆసుకృతి, ఆహయము.

ఆ, ఈ, ఏలకు మూఁడుదాహరణములు చూపియు యడాగమ యకారము నకుఁగూడ ద్విత్వమును జూపుటకు నాలుగవ యుదాహరణము.

ఇందలి వర్ణసమామ్నాయమున శకటరేఫము వేఱువర్ణముగ లేకుండుట వల్లను, అది రేఫమునకు వలఘురూపమే యగుటవల్లను రేఫమునకువలె దానికిని ద్విత్వము గలుగదని సూత్రకారుని తాత్పర్యము : ఆఱాయి, ఈఱంకె, ఏఱేఁడు మున్నగుచోట్ల ద్విత్వము గలుగదు.

ద్విత్వము కలిగినయనంతరము అదిపరముకాఁగా హ్రస్వము వచ్చుటయే ప్రక్రియాక్రమముగావున, ద్విత్వవిధానమునకుఁ బిమ్మట నుండఁదగిన హ్రస్వ విధాయక సూత్రమును ముందే నిర్దేశింపనేల ? అని యెవరికేని తోఁపవచ్చును.

కాని, ఈ ద్విత్వసూత్రమునకు వెనువెంటనే హ్రస్వసూత్రము నుంచినచో, ఆ హ్రస్వము ఈ త్రికముమీఁది ద్విత్వమునకు మాత్రమే సంబంధించునను భావము కలుగక తప్పదు.

ఆ హ్రస్వము ఈ త్రికసంబంధి ద్విత్వస్థలములందేగాక త్రికములేని చోటులందు అయ్యేను, వియ్యము, ఉయ్యేల, తొయ్యలి, ముజ్జగములు, ఎల్లిదము, తిన్నియ మున్నగు పలువిధముల రూపములందుఁ బ్రవర్తింపవలసి యున్నది.

కావున, ఈ ద్విత్వమునకుమాత్రమే సంబంధించునదను స్ఫురణము రాకుండుటకయి దాని ననంతరసూత్రముగఁగాక వేఱువఱిచి యితరములకుఁ గూడ నుపయోగించునటులు ముందటిసూత్రముగా నుంచినట్లు తలంపవలయును.

వర్గద్వితీయ చతుర్థములకు ద్విత్వ మేర్పడునెడ నందలి మొదటివర్ణములు ప్రథమతృతీయములుగ మాఱుట సహజము, సార్వత్రికము. కావుననే, అచ్ఛత్రము, ఇద్ధరణి, ఎబ్భంగి మొదలగుచోటులందు ప్రథమ తృతీయములు కలుగుచుండును.

**15.** కృతహ్రస్వంబగు త్రికంబుమీఁది చోటుశబ్దంబు నోత్వంబున కత్వహ్రస్వంబులు విభాషనగు. ౧౫.

అచ్చోటు, అచ్చటు, అచ్చొటు; ఇచ్చోటు, ఇచ్చటు, ఇచ్చొటు; ఎచ్చోటు, ఎచ్చటు, ఎచ్చొటు.

వీనిద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగ లోపంబగు : అచటు, అచొటు; ఇచటు, ఇచొటు; ఎచటు, ఎచొటు.

ముచ్చోటులు, ముచ్చటులు, ముచ్చొటులు అనురూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.

వక్ష్యమాణవిధి : ప్రకీర్ణకము 8 వ సూత్రము.
ముచ్చటులు = మూఁడుచోటులు.
"చరణములు కేళ్లు గడిగి ముచ్చట్లు చఱిచి"
—విజ్ఞానేశ్వరీయము—ఆచారకాండ.

**16.** ఉత్తరపదంబగు చోటుశబ్దము టాక్షరమునకు లోపంబు విభాషనగు. ౧౬.

చోటుశబ్దం బౌపవిభక్తికంబుగావున దానియంతిమాక్షరంబు సప్తమ్యాదేశమయిన యకారంబుతోడం బాక్షికంబుగ లోపించు నని యర్థము.

అచ్చోనున్నాఁడు, అచ్చోటనున్నాఁడు; ఒకచోనుండె, ఒకచోట నుండె.

త్రికమేగాక యితరశబ్దము పూర్వపదముగా నున్నను, ఈ టకారలోపము రావచ్చునని తెలుపుటకయి రెండవయుదాహరణము చూపఁబడినది.

**17.** సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డువర్ణంబునకు లోపంబును, మీఁదిహల్లునకు ద్విత్వంబునగు. ౧౭.

మూఁడు జగములు : ముజ్జగములు ; మూఁడు లోకములు : ముల్లోకములు.

ద్విత్వమునకుఁ బూర్వము బిందువుండుట సాంప్రదాయికముకాదుగాన, మూఁడుశబ్దమునందలి యర్ధబిందువు లోపించినటు లూహింపవలయును.

ఉత్తరపదమనఁగా సమాసములోని తుదిపదము.

'ఉత్తరపదత్వంచ సమాసచరమావయవే రూఢమ్'

అని పాణినీయవ్యవహారమున నిది ప్రసిద్ధమయినయర్థము. ఇది వ్యాకరణప్రసంగములలో వేఱువిధమున వాడరాని పారిభాషిక పదము.

ఈపదము బాలవ్యాకరణమున సమాస - 3, 11, 16, 17 సూత్రములందు మాత్రమే ప్రయుక్తమయినది. ఈనాలుగుచోటులందును సంప్రదాయానుసారముగ సమాసచరమావయవ మనునర్థమునకే వ్యవహరింపఁబడినది.

ఈశాస్త్రీయసంప్రదాయమును గుర్తింపనికొందఱు వ్యస్తపదములు రెండిటిలో రెండవది యుత్తరపదముగదా యనుభ్రాంతితో 'బాలుఁడు చదువుట' అనుచోట 'చదువుట' అనునది యుత్తరపదమనుకొందురు. దానిని పరపద మనవచ్చునుగాని యుత్తరపద మనరాదు.

ప్రౌఢవ్యాకరణకారులు 'రాహుకంఠము వెగి దేహము ధరణిఁబడియె' అనుప్రయోగమున 'రాహుకంఠము' అనుసమాసములోఁ బూర్వపదమగు రాహుశబ్దము దూరమున వ్యస్తముగానున్న 'దేహము' అనుదానితో నన్వయించునని తెలుపుటకు "వ్యవహితోత్తరపదముతో నన్వయించెడి" అని సూత్రించియుండిరి (చూ. ప్రౌఢ-సమాస-34). చిన్నయసూరికి శిష్యులయి చేవదేఱినవారు పారిభాషిక పదములపట్టు జాఱవిడిచి చప్పనిమాటలు పలికినచో మనసు చివుక్కుమనును. లోకవ్యవహారమున ఉత్తరపదమన్నను పశ్చిమపద మన్నను నంతగాఁ దగవు రాదుగాని వ్యాకరణమునం దిట్టివెలితిమాటలుండరాదు. వేదమున అపస్వరములును, గానమున అపశ్రుతులునునెట్టివో, వ్యాకరణమున నివియట్టివి. అది యటుండనిండు.

ఈసూత్రమున 'మూఁడుశబ్దముదుజ్వర్ణమునకు' అని కొన్ని ప్రతులలో జకారయుక్తముగఁ బాఠము గానవగును. కొన్నిట జకారము కానరాదు. జకారము లేనిది సాధుపాఠము, జకారము గలది (జ్వ) అపపాఠము.

1858 ముద్రణమునందు 'డుజ్' అని జకారము ముద్రణప్రమాదపతితమయినది. దానింబట్టి యనంతరముద్రణములందుఁ గొన్నింటఁ గానవచ్చుచున్నది. భావిముద్రాపకులు తొలఁగింతురుగాక. సూరిదృష్టిలో మూఁడు శబ్దమునందలిది డువర్ణముగాని డుజ్జుకాదు. ఏలయందురేని

మూఁడులోని 'డు' వర్ణము శబ్దసిద్ధముగాక ప్రథమావిభక్తిప్రత్యయమే యగునెడ 'మూఁడిటిని, మూఁడిటికి' ఇత్యాదిగా సర్వవిభక్తులందును డకార ముండుట సంభవింపదు.

మఱియు సూరితలంపున నిది విభక్తియే యగుచో సమాసవిభక్తికి లోప మును ప్రత్యేకముగ(25చే)విధింపఁబోవుచు, మరల నీసూత్రముచే 'డు'లోపము విధించుట యనావశ్యకమయి యసమంజసమగును.

అదిగాక, బహువ్రీహి స్త్రీసమ ఘటితమయి యుండునని సూత్రించి (సమాస-6) సూరి 'ముక్కంటి' అనునుదాహరణము చూపియుండెను. దానిం బట్టి యందుఁ బూర్వపదమగు మూఁడుశబ్దము స్త్రీసమమని యాతనిదృష్టి తేట తెల్లమగుచున్నది.

ఈ యంశములు వివేచింపక హరికారికాకర్త 'డుజ్' అనునపపాఠముఁ జూచియు, మూఁడుశబ్దమునందలి యర్ధబిందువునుజూచియు ఇది డుజ్లు అని భ్రమించి

'ఉత్తరస్మిన్ సమానాధికరణేతు పదే డుజః'

అని యనువదించుట మూలమునకు విరుద్ధము. అపమార్గమునకు దర్శకము.

**18.** ద్విగువున నేకవచనంబు ప్రాయికంబుగా నగు; మిశ్రంబు నకుఁ గాదు. ఉదా.

ముచ్చిచ్చు, ముక్కారు, ముప్పాతిక, ముత్త్రోవ, మువ్విధములు.

**19.** కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు పఱ్ఱువర్ణంబులగు. ఉదా.

నాఁపచేను, పాఁపఱేఁడు; కనుపపులు, జనుపనార.

నాము, పాము, ప్రేము, వేము, అమ్ము, ఎమ్ము ఇవి నామ్వాదులు.

కనుము, ఇనుము, ఉడుము, ఎనుము, జనుము, మినుము ఇత్యాదులు కనుమ్వాదులు.

**20.** నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ఉదా.

నిక్కల, కవ్వడి, పువ్విలుకాఁడు ఇత్యాదులు.

కవ్వడి = కవవడి = సవ్యసాచి = అర్జునుఁడు.

కొంత వర్ణసామ్యముండుటచే కవ్వడిశబ్దము కపర్దిశబ్దభవమని భాషా చరిత్రకారులొకరు వక్కాణించిరి. కపర్దమనఁగా ఘనమయిన కేశపాశమనియు,

అది కలవాఁడుగాన అర్జునుఁడు కపర్దియనియు, అర్థమునుగూడ నిరూపించిరి. ఆమార్గము సమీచీనము కాదు. శివుని జటాజూటమునకు ఒక్కదానికే కపర్దమని పేరు. ఇతరుల కేశపాశ మెంతఘనమయినను ఆపేరు చెల్లదు. అంతియగాక అర్జునునికిఁదప్ప నన్యులకులేని రెండుచేతులవాఁడితనమును స్ఫురింపఁజేయుచు సుప్రసిద్ధమయిన 'సవ్యసాచి' శబ్దముతో సాటియగునట్లు మొచ్చటపడి యాంధ్రులు కూర్చుకొన్న 'కవ్వడి' శబ్దమునకు సామాన్యార్థము కల్పించుట యాశబ్దమునకే గాక దానిచే బోధింపఁబడవలసిన అర్జునునికిఁగూడ విలువ తగ్గించుట. చిన్నయ సూరి 'కవ్వడి'శబ్దము నీసూత్రమున విభజించి చూపకున్నను

"కోలలఁ బరఁగింపంగాఁ
గేలుంగవ వడిగలట్టి కృతహస్తుండై
గ్రాలుకతంబున జిష్ణుఁడు
పోలం గవ్వడియనంగ భుజగశయానా!
నిక్కాలాదియగుటంజేసి కవశబ్దాంతంబగు నత్వంబునకు లోపంబగు."

అని తన శబ్దశాసనమున కవ + వడి అను విభాగమును విశదీకరించియుండెను.

**21.** ఆకారంబున కామ్రేడితంబునందుం దత్పరంబున నయి యాయి యను శబ్దంబులు విభాషనగు. ౨౧.

వక్ష్యమాణ విధిచేత నయి యనుదాని త్రైకారాదేశంబునగు:
ఆయయి కాలము, ఆయాయి కాలము, అయ్యయి కాలము,
అయ్యాయి కాలము, ఆయ్యె కాలము, అయ్యొ కాలము ;
ఆయాకాలము, ఆయక్కాలము, అయ్యాకాలము, అయ్యక్కాలము.
వక్ష్యమాణము క్రియా-103 వ సూత్రము.

**22.** బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గానంబడియెడి. ౨౨.

ముక్కంటి, కడలిరాచూలి, నలువ, గట్టువిలుతుఁడు.

**23.** బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకు బోఁడియగు. ౨౩.

అలరుబోఁడి, ననబోఁడి, పూబోఁడి, విరిబోఁడి.

ఈయాదేశమున మొదటివర్ణము వకారము కాదు. బకారము. సరళము. ఇది 'బోఁడి'గాని 'పోఁడి'కాదు. కావున సూరిమతమున 'బోఁడి' లోని 'బ' కారమునకుఁ బూర్వమున నెచ్చటను నర్ధబిందువుండరాదు.

ప్రథమ ముద్రణమున ఒక్క-పూబోఁడి శబ్దమున ముద్రణప్రమాదము సంభవించినది గాని, తక్కి-న అలరుబోఁడి, ననబోఁడి, విరిబోఁడి అను నుదాహరణములందును, సూత్రమునందలి బోఁడిశబ్దమునందును గల బకారము నకుఁ బూర్వము అర్ధబిందువులాముద్రణమునను లేవు. కావుననే యీ యాదేశము బకారాదిగనే సూరిసమ్మతమగుట సుస్పష్టము.

అలరుబోఁడి, చిగురుబోఁడి, పువుబోఁడి మున్నగుచోట్ల ఉదంత స్త్రీసమములకు సరళపరత్వమున నుగాగమము రావచ్చును. ఆ ద్రుతమునకు పూర్ణబిందువును రావచ్చును. కావున, అలరుంబోఁడి, చిగురుంబోఁడి, పువుంబోఁడి మున్నగురీతిని పూర్ణబిందురూపములు మాత్రము సమ్మతములు.

మనభాషలో తీవబోఁడి, అలరుబోఁడి మున్నగుసమాసములు లతాఙ్గీ, సుమాఙ్గీ మొదలగు సంస్కృతసమాసములనుబట్టి కల్పించుకొన్నవయి యుండవచ్చును. పయి సంస్కృత సమాసములలో నుత్తరపదము శరీరార్థకమగు 'అంగ' శబ్దము గావున లతవంటిశరీరముగలది యనురీతి నర్థము లభించును. తీవబోఁడి మున్నగువానిలోని యుత్తరపదమగు 'బోఁడి'కి నట్టి యర్థము లేదాయెను. 'పోఁడి' అను శబ్దముత్తరపదమనుకొందమన్న తీవబోఁడి, ననబోఁడి, విరిబోఁడి ఇత్యాదులందు 'పోఁడి' అనునది 'బోఁడి' యగుటకయి బకారాదేశము కలుగుటకు మార్గము లేదాయెను; ఏ నుగాగమమునో విధించి సరళాదేశము కల్పింతమన్నను, ద్రుతస్థానమున బిందువులు తప్పవాయెను; 'ననంబోఁడి' మున్నగురీతిని బిందుఘటితరూపములు ప్రామాణిక ప్రయోగము లందుఁ గానరావాయెను; ఇంతవాఙ్మయమున నెచ్చటను గానరాక, ఏదోయొక మాఱుమూల, పాంచాలీపరిణయమున 'తీయంబోఁడి' అని, ఒక్క-శబ్ద మగపడి నంత మాత్రాన నట్టి ప్రయోగములు సకల కవిసమ్మతములని సమ్మతింపఁ జాలముగదా!

అదియుఁగాక 'ననబోఁడి'లోనిది 'పోఁడి'శబ్దమనుకొనుటకు మఱియొక చిక్కు-గూడఁ గానవచ్చుచున్నది. ఏదియన, ఇది 'పోఁడి' యే యయినచో 'పోఁణి'అనియు రూపాంతరముండునుగదా; 'ననబోఁణి'అని ణకారఘటిత రూప మొక్క-టియుఁ గవిప్రయోగములందుఁ గానరాదాయెను; కావుననే విరిబోఁణీత్యాదులు ణకారఘటితములు లేవని అహోబలపండితుఁడు వక్కా-ణించి యుండెను. (సమాస్త సమాః-సూత్రవ్యాఖ్య).

కావున నీచిక్కు-లు తొలఁగుటకును, అర్థము సంస్కృతసమాసాను సారముగఁ గుదురుపడుటకును, ఇట్టియెడ శరీరార్థకమగు 'మేను' శబ్దము నుత్తరపదముగ భావించి దానికి బోఁడ్యాదేశము విధించుటయే యుత్తమ మార్గము.

ఈ రీతిప్రక్రియలో అలరు, పువు మున్నగు నుదంతస్త్రీసమశబ్దములకు నుగాగమము గలిగి అలరుంబోఁడి, పువుంబోఁడి మున్నగు పూర్ణబిందుఘటిత రూపములు సిద్ధించుటకును నవకాశమున్నది.

కావున, ఈసమాసములలో సర్వత్ర వినఁబడు టకారము సిద్ధించుటకును, దానిముందర్ధబిందువు కలుగకుండుటకును, ఉదంతస్థలములందుఁ బూర్ణబిందువులువచ్చుటకును, సమాసమునకు 'కోమలమగు శరీరముగలది' యనునర్థము కుదురుపడుటకును, 'మేను'నకు 'బోఁడి'నాదేశించుటయే యనుకూలమార్గము. ఇదియ యిప్పటికుచితంబని తోఁచుచున్నది.

మేనునకు 'బోఁడి'వచ్చుటలో నారెండిటికి వర్ణసాదృశ్యము లేశమును లేదు. నిజమే. వాఙ్ధాతువునకు 'యచ్ఛ'ఆదేశమగును. 'యచ్ఛతి' అను రూపమగును. అచట సాదృశ్యము గలదా? స్థాన్యాదేశములకు సాదృశ్యము కుదురుపడుట యభిలషణీయమేగాని యదుప్పరతప్పదను నిర్బంధము సౌత్రిక వ్యాకరణములకుఁగాని ప్రక్రియావ్యాకరణములయందదు.

అని యీయంశములెల్లఁ బర్యాలోచించి సూరి ఈయాదేశమును విధించినట్లు తోఁచెడిని.

ఈయూహ లేకున్నచో పోఁడిపాట (సమాస-5), పోఁడిమి (తద్ధిత-5), పోఁడి = పోణి (ప్రకీర్ణక-13) అని యిట్లు బాలవ్యాకరణముననే ప్రసంగాంతరములందు తానే చూపిన, తనస్ఫురణలోనున్న 'పోఁడి' శబ్దమును విడిచి యుండునా? అనియు భావింపవలసియున్నది.

**24.** ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు. ౨౪.

మాత్రపితలు, మాతాపితలు ఇత్యాదులు.

సిద్ధసమాసమున 'ఆనఙ్ ఋతో ద్వన్ద్వే' అనుసూత్రముచేఁ బ్రాప్తమగు ఆనజాదేశమును ఆఁపి పాక్షికముగా ఈ రేఫాదేశము కలుగును: మాత్రపితలు. ఇది రానిపక్షమున ఆనజాదేశము ప్రాప్తించును: మాతాపితలు.

సిద్ధసమాసమధ్యమున నిట్టి తెలుఁగువ్యాకరణకార్యము వచ్చుటను గానరాదు.

**25.** సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు. ౨౫.

రామునిబాణములు, సరసపువచనములు, వేవెలుఁగు, గుణముల ప్రోక.

'యదాగమా స్తద్గుణీభూతాః తద్గ్రహణేన గృహ్యన్తే'
అను పాణినీయపరిభాష మనవ్యాకరణప్రక్రియలలో గ్రహింపఁబడినది (చూ. తత్సమ-25, 31). దేనికి ఏది ఆగమమగునో, అది దానికి అవయవమే యగునుగాని వేఱుకాదు. దీనినిబట్టి 'గుణములయొక్క ప్రోక' అనుచో లగాగమము విభక్తికి నాగమముగాపున, దానికి నవయవమగుటచే దానితోపాటు లోపింపవలసియుండ, అట్టిలోపము లట్టుసకురాదని యిచట నిషేధింపఁబడినది.

**26.** కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు. ఉదా.

> రాముఁడు రక్షించిన భృత్యుఁడు; రాముఁడు వాలినేసిన బాణము; రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు; రాముఁడు వెడలిన వనంబు; రాముఁడు వసించినపర్ణగృహము; రాముఁడు వసించినచోటు.
> ఇది సమాసపరిచ్ఛేదము.

ఇట వస్తుతః రక్షించినవాఁడు రాముఁడుగాన 'రక్షించిన' అను విశేషణము తనకు విశేష్యమగు 'రాముఁడు' అనుదానితో సమసింపవలయును. అపుడు 'భృత్యుని రక్షించిన రాముఁడు' అను విన్యాసమేర్పడును. ఈ వాక్యమందు 'రాముఁడు' అనునది ప్రధానమయి కర్తయయి క్రియాన్వయము నొందును.

ఇట్టి ప్రాధాన్యమును 'భృత్యుని' అనుదానికిఁ గల్పింపఁదలఁచినపుడు, 'భృత్యుని' అను ద్వితీయాంతము ప్రథమాంతమగును. ఆ 'భృత్యుఁడు' అను దానికి 'రక్షించిన' అనునది విశేషణము కాకున్నను 'రాముఁడు' అనుదానితో వలె 'భృత్యుఁడు' అనుదానితో సమసించి 'రక్షించిన భృత్యుఁడు' అగును.

ధాతుజ విశేషణము తనకుఁ గర్తయయిన విశేష్యముతోఁగాక యితర విశేష్యముతో సమసించుట యీకూర్పులో వింతగొలుపు విశేషము. భాషాగతులు చిత్రవిచిత్రములు. ఇంతటితో సమాసవిషయము సమాప్తము.

ఇఁక భావాద్యర్థములందు ప్రత్యయములు కలుగుటచే సిద్ధములగు తద్ధితాంతప్రాతిపదికములు ప్రదర్శింపఁబడును.

---

# తద్ధిత పరిచ్ఛేదము

**1.** తసవర్ణకంబు త్వార్థంబునం బగు. ౧.

త్వార్థంబనఁగా భావంబు: ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకా రంబు భావంబు.

రామునితనము, రాముతనము; మనుమనితనము, సీతతనము, గొప్పతనము, కొంటెతనము, నల్లఁదనము, పుల్లఁదనము.

సాధారణముగా ప్రాతిపదికములకు భావాద్యర్థములందుఁ గలుగు ప్రత్యయములకు తద్ధితములని సంజ్ఞ. తద్ధితాంతములును ప్రాతిపదికము లగును. వీనిపయిని విభక్తిప్రత్యయములు చేరును. ఇవి విశేష్యములో, విశేషణములో యగుచుండును.

సంస్కృతమున 'సున్దరస్య భావః' అనునర్థమున 'త్వ' ప్రత్యయము కలిగి 'సున్దరత్వమ్' అనియగును. సుందరుఁడనఁగా సుందరత్వవిశిష్టుఁడని యర్థము. 'ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు'. 'సుందర' అనుప్రకృతివలనఁ గలుగునట్టి 'సుందరత్వవిశిష్ట'అను శాబ్దబోధమున సుంద రత్వము ప్రకారమగును, అనఁగా విశేషణమగును. ఇటులే

మనుమఁడనఁగా మనుమనితనము (పౌత్రత్వము) గలవాఁడని యర్థము. దీనిలో మనుమనితనము 'ప్రకారము' (విశేషణము) అగును. అదే భావార్థము.

మనుమనియొక్క + తనము అనుచో 'యొక్క'లోపించును. తద్ధిత వృత్తి, సమాసవృత్తి అని వీనిని వృత్తులందురు. వృత్తిత్వము వీనికి సామాన్య ధర్మము. ఈసాదృశ్యమునుబట్టి 'సమానవిభక్తికి లోపంబగు'నని విహిత మయిన విభక్తిలోపము తద్ధితవృత్తియందుఁగూడఁ బ్రవర్తించుననుతలంపుతోఁ గావలయును సూరి వేఱుగా నిట విభక్తిలోపమును విధింపకుండెను.

**2.** ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకంబగు. ౨.

స్పష్టము.

ఉత్సర్గమనఁగా సామాన్యవిధి.

ఇటన్ అనఁగా ఈపరిచ్ఛేదమునందని యర్థము.

సామాన్యవిధికి విశేషవిధి నిత్యముగ బాధకమగుచుండుటయే వ్యాకరణమున సార్వత్రికమయిన సాధారణపద్ధతి. కాని యీపరిచ్ఛేదమునమాత్రము విశేష విధులు సామాన్యవిధికి వికల్పముగా బాధకములగును. అనఁగా విశేష విహితములగు ఱికాదులు ప్రవర్తించినచోటులందన్నిటను సామాన్యవిహితమగు 'తన'వర్ణకమునయితము కలుగుచుండునని తాత్పర్యము.

**3.** చిన్నాదులకు ఱికవర్ణకంబగు. ౩.

చిన్నఱికము, కన్నెఱికము.

చిన్న, కన్నె, చుట్టము, దొంగ, పేద, మిండ, లంజె ఇత్యాదులు చిన్నాదులు.

**4.** ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగునపుడగు. ౪.

తొత్తఱికము, వెడ్డఱికము, వెజ్జఱికము.

**5.** పేర్వాదుల కిమివర్ణకంబగు. ౫.

పేరిమి, కడిమి.

పేరు, కడు, ప్రుచ్చు, మేలు, చెలి, పోఁడి, వాఁడి, వేఁడి ఇత్యాదులు పేర్వాదులు.

**6.** నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు. ౬.

నల్లన, తెల్లన.

నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య, కమ్మ, పుల్ల, చప్ప, విన్న, తిన్న, అల్ల, ఒయ్య, తిమ్మ, చక్క, ప్రేఁక ఇత్యాదులు నల్లాదులు.

**7.** ఇకవర్ణకం బగ్గలాదులకగు. ౭.

అగ్గలిక, ఒమ్మిక—అగ్గలము, ఒమ్మి.

**8.** మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ౮.

మగఁటిమి, మగతనము ; పేదఱిమి ; ఒజ్జసము ; కోటరము, కోడంట్రము, కోడంట్రికము, కోడఱికము; కోమలికము ;

చెలికారము; తెలుపు; ఎరుపు; పసుపు; నలుపు.
అకాదులు రానిపక్షమందుఁ దనప్రత్యయం బన్నింటికగు :
చిన్నతనము, ముచ్చటఁదనము, నల్లఁదనము. అగ్గలంపుఁదనము,
ఒజ్జతనము.

9. అరమరాదులకు స్వార్థంబున ఁ దికవర్ణకంబగు. ౯.

అరమరిక, అమిక.
అరమర, అము, అల్లిబిల్లి, గంది, నడవడి, నాడు, నివ్వాళి,
పొత్తి, మాన, మెలి, వాలు ఇత్యాదు లరమరాదులు.

10. ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం బగు. ౧౦.

చిఱుతుక, నాతుక.
చిఱుత, నాతి, నెలఁత, మెలఁత, పడఁతి, మడఁతి, పొలఁతి,
వెలఁది, నిప్పు, ఎమ్మె ఇత్యాదులు చిఱుతాదులు.

11. కా కత్తియ వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతుబర్థం
బునం దాటాదులకగు. ౧౧.

కా ప్రత్యయాంతంబునకు మగాదిగణగణనంబునం జేసి డుజ్జగు :
ఆటకాఁడు, ఆటకత్తియ.
ఆట, అడపము, ఎమ్మె, ఓయారము, కటారి, కొల్ల, చెలిమి,
చేరువ, చొరవ, జట్టి, జాజర, జూదము, తిండి, తేర, దొడ్డ,
నీటు, నేస్తము, బేరము, వగ, విలు, వెచ్చము, సొగసు ఇత్యాదు
లాటాదులు.

12. కా కత్తియల కకారంబునకు గకారంబు కొండొకచోఁ
గానంబడియెడి. ౧౨.

అందగాఁడు, అందగత్తియ ; కొండెగాఁడు, కొండెగత్తియ ;
బేరగాఁడు, బేరగత్తియ ఇత్యాదులు.

13. కా కత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు. ౧౩.

చెలికాఁడు, చెలికత్తియ ; హెగ్గడికాఁడు, హెగ్గడికత్తియ.

**14.** కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి. ౧౪.

ఇబ్బందిగాఁడు, ఒంటిగాఁడు, కొమ్ముకాఁడు, పరికాఁడు ఇత్యాదులు మృగవిశేషవాచకంబులు.

మగాదులందువలె కయిరాదులందుఁగూడ కాప్రత్యయమును జేర్చు కొన్నచో అమహత్తులయినను 'ఇబ్బందిగాఁడు' ఇత్యాదులందు డుపర్ణకము సులభము (చూ. ఆచ్ఛిక-4).

**15.** అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబు నందగు. ౧౫.

ఈ ప్రత్యయాంతంబు మగాదిగణంబు :
అటమటీఁడు, కమ్మతీఁడు.
అటమటము, కమ్మతము, కన్నడము, కొండెము, బానసము, బూటకము, మందడి, మన్నెము, సుంకము.
ఉక్కివంబునకు వలోపంబునగు : ఉక్కీఁడు ఇత్యాదులు.

మగాదిగణంబు = మగాదులందు గణింపఁ బడునది (ఆచ్ఛిక-4). 'మగాదిషు గణ్యత ఇతి మగాదిగణః' అని వ్యుత్పత్తి.

**16.** ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునందగు. ౧౬.

మొక్కలీఁడు, కల్లరీఁడు.

**17.** అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు. ౧౭.

జాలరి, ఒఱపరి.
జాల, ఒఱపు, కల్ల, చదువు, జూదము, టక్కు, తగవు, తీరుపు, తెంపు, తెరువు, నేరుపు, మతకము, వెరవు, వేఁట, సిగ్గు, సుంకము ఇత్యాదులు.

**18.** ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునందగు. ౧౮.

ఓయారి, అక్కసి.
ఓయారము, అక్కసము, కడలు, చాగము, జోగము, మతకము, తుటారము, బండారము, బిత్తరము, బిటారము,

బేహారము, మచ్చరము, మిటారము, విన్నాణము, వెక్కసము ఇత్యాదులు.

**19.** తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యంబగునప్పుడు మతుబర్థంబునందగు. ౧౯.

కొలువత, చాకిత.

కొలువ, చాకి, బోయ, వాసె, వ్రే, సాలె ఇత్యాదులు కులవాచకంబులు.

**20.** తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు. ౨౦.

చెంచెత, మాలెత.

**21.** యువతి వెటీ రజస్వలలు గుబ్బెత మిండత పుట్టుతలు నాఁబడుదురు. ౨౧.

స్పష్టము.

**22.** వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యంబగునపుడు మత్వర్థంబునం దాఁడివర్ణకంబగు. ౨౨.

వగలాఁడి.

వగ, చిన్నె, కులుకు, వన్నె, దొమ్మి, ఎమ్మె ఇత్యాదులు వగాదులు.

**23.** వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారంబగు. ౨౩.

ఆప్రత్యయాంతంబు వగాదిగణంబు : వగలాఁడు, చిన్నెలాఁడు.

వగాదిగణంబు = వగాదులందు గణింపఁబడునది.—చూ. 15 సూ.

**24.** ముక్కు లోనగువానికిం దదభావద్యోతకంబయి మతుబర్థంబునం దిఁడివర్ణకంబగు. ౨౪.

ముక్కిఁడి : ముక్కులేనివాఁడని యర్థము.

ముక్కు, వాలు, వెరవు, సిగ్గు ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.

**25.** మానార్థంబున కేకత్వంబునం డెండువర్ణకంబగు. ౨౫.

తూమెండు, ముంతెండు, ఎత్తెండు, వీసెండు, జేనెండు, మూరెండు, కుండెండు, గంపెండు.

**26.** ఎండువర్ణకంబు పరంబగునపుడు ఉవర్ణంబు లోపించు. ౨౬.

కమికెండు, కొడిదెండు, దోసెండు, పిడికెండు, పుడిసెండు, సందెండు.

**27.** పక్ష్యార్థంబున బంటి కొలందులగు. ౨౭.

మోంకాలిబంటి, మోంకాలికొలంది ; తొమ్మబంటి, తొమ్మ కొలంది.

**28.** అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది. ౨౮.

మంటమారి, తిండిపోతు : తాచ్ఛీల్యంబున మారి, పోతు వర్ణకంబులు.
అడప = తాంబూలకరండవాహి : మతుబర్థంబునం డప్రత్యయంబు.
పెండ్లము = ఊఢ : పెండ్లి శబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు.
ఇత్యాదు లూహ్యంబులు.
ఇది తద్ధిత పరిచ్ఛేదము

తద్ధితములలో, ఏ ప్రత్యయము, ఏ యర్థమునం గలుగును ? ఎట్టి రూపము నిష్పన్నమగును ? అను నంశములు సులభముగా విశదమగుటకు గ్రంథాంతమున ననుబంధములలో 'కృత్తద్ధితప్రదర్శిక' అను పట్టిక చూచునది.

వాక్యఘటకములగు కారక విభక్త్యంతపదములకు సంబంధించిన వివిధ ప్రక్రియలును ఈ పరిచ్ఛేదముతో సమాప్తమయినవి. ఇంక ధాతువులనుండి నిష్పన్నములగు క్రియాపదముల ప్రక్రియ విపులముగా నిరూపింపంబడును.

# క్రియా పరిచ్ఛేదము

## 1. ధాతువునకు. ౧.

ఇది యధికార సూత్రంబు. ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువునకగునని యెఱుంగునది.

ఈ పరిచ్ఛేదమునందలి కార్యములెల్ల నించుమించు ధాతువులకు సంబంధించినవే. ప్రతిసూత్రమునను 'ధాతువునకు' అని పలుమాఱు పలుకవలసిన క్లేశమును తగ్గించుటకయి యీయధికారము విధింపఁబడినది. ఇది క్రియా, కృదంతపరిచ్ఛేదములు రెండిటను ననువర్తించును. 'ధాతువునకు' అనునీ పదము ఉత్తరసూత్రములన్నిటితో సంబంధించి, ఆయాకార్యము ధాతువునకగునని తెలుపుచుండును.

ఈ యధికారసూత్ర ప్రయోజనమును వివరించుచు సూరి వయినిల్వాసిన వాక్యము గమనింపుఁడు.

పాణినీయమునఁ బ్రాచీనగ్రంథములగు కాశికావృత్త్యాదులలో నిట్టి సందర్భమున

"ఇత ఊర్ధ్వం యదనుక్రమిష్యామః తద్ధాతోరితి వేదితవ్యమ్"

అనువాక్యము కాననగును.

ఈ వాక్యమునందలి పదములక్రమమునయిన మార్పులేకుండ, అదే వరుసలో తుఁచ తప్పకుండ రచించిన సూరి వాక్యమునకును, వృత్తికారుని వాక్యమునకును గల పోలికను గుర్తింపుఁడు.

ఇత ఊర్ధ్వం : ఇంక

యత్ : ఎయ్యది

అనుక్రమిష్యామః : ఉపక్రమింపఁబడును

తత్ : అయ్యది

ధాతోరితి : ధాతువునకగునని

వేదితవ్యమ్ : ఎఱుంగునది.

ఇట్టి యధికార సూత్రములయొద్ద వివరణము వ్రాయునందర్భమున పాణినీయప్రాచీనగ్రంథరీతినే వరరుచి మున్నగు ప్రాకృత వ్యాకరణకర్తలును ననుకరించిరి.

పయినిజూపిన వివరణ వాక్యరచనాపద్ధతిని ప్రత్యక్షరము పరిశీలించినచో ప్రాచీనములగు కాశికావృత్త్యాదులందును, ప్రాకృతవ్యాకరణములందును సూరికి గాఢమగు వ్యాసంగమున్నట్లును, కావుననే వానియందలి రచనారీతులు బుద్ధిలో గట్టిగ నాటుకొని యీతనిరచనలోనికి సంక్రమించినట్లును సులభముగా గ్రహింపవచ్చును.

సూరి ఆఱు లకారములతో క్రియాపదప్రక్రియను నిర్వహింపఁదలంచెను. వర్తమానము, భూతము, భావి అను కాలత్రయమును బోధించుటకు సంస్కృతమున ఉన్నవానినున్నటులే 'లట్టు', 'లిట్టు', 'లృట్టు' అను మూఁడింటిని గ్రహించెను. అర్థవిశేషభేదము లుండుటచేఁ దక్కిన లకారములను ఏడింటిని నుపేక్షించి, 'లాట్టు', 'యాట్టు', 'లజీ' అని మూఁడిటిని క్రొత్తగాఁ గల్పించు కొనెను.

అర్థసామ్యముగలవానినిమాత్రమే గ్రహించుటయు, అర్థభేదముగలచోటులందు సంస్కృతలకారములను గ్రహింపక క్రొత్తవానిని గల్పించుకొనుటయు, బాలురయర్థస్ఫురణమున సాంకర్యములేకుండ సౌకర్యమేర్పడుటకయి సూక్ష్మదృష్టితో నవలంబింపఁబడిన రుచిరమార్గము.

**2. వర్తమానంబున లట్టగు. ౨.**

వర్తమానక్రియావృత్తియగు ధాతువునకు లడ్వర్ణకంబగు.
వర్తమానంబునాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు : అప్పటికి ముగియకుండునది.

**3. భూతంబున లిట్టగు. ౩.**

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు.
భూతంబు నా విద్యమాన ధ్వంస ప్రతియోగి : ముందుండి యప్పటికి లేకుండునది.

ధ్వంసమనఁగా అభావము. అభావము దేనిదో దానిని ప్రతియోగి యందురు. విద్యమానమగు క్రియాభావమునకు ప్రతియోగి జరిగినక్రియ. వస్తువునశించినపిమ్మట ఏర్పడునట్టి యీఅభావమునకు ప్రధ్వంసాభావమని పేరు.

**4. భావిని లృట్టగు. ౪.**

భావిక్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకంబగు.

భావినా విద్యమాన ప్రాగభావ ప్రతియోగి: అప్పటికిఁ బుట్ట కుండునది.

ప్రాగభావము: వస్తువు పుట్టకముందుండునట్టి యభావము.
విద్యమానమగు ప్రాగభావమునకు ప్రతియోగి ఇకముందు పుట్టఁబోవునది.

5. తద్ధర్మాదులందు లాట్టగు. ౫.

తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు. తచ్ఛీల సంభావనా సంప్రశ్న సాతత్య వర్తమాన భావ్యాశీరాదు లాదిపదగ్రాహ్యంబులు.

6. ఆశీ శ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు. ౬.

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

7. వ్యతిరేకంబున లజీ యగు. ౭.

వ్యతిరేక విశిష్ట క్రియావృత్తియగు ధాతువునకు లజీవర్ణకంబగు.

8. లకారంబునకు డు ళ్ళు వు.రు సు ము ఙ్ణగు. ౮.

లడాదిలకారంబులం దొక్కొక్కటికి డుణాదు లాదేశంబులగు. ఇందు ఙకారంబు ప్రత్యాహారార్థంబు.

'ఆది రన్త్యేన సహేతా'

తుదినుండు ఇద్వర్ణముతోఁ గలిసిన మొదటివర్ణము ఆరెండిటికి నడుమ నున్నవానికిని దనకును సంజ్ఞయగును.

ఇచట 'ముఙ్' అనుదానిచివరనున్న ఙకారముతో 'డు' వర్ణమును గలిపినచో 'డుఙ్' అను సంజ్ఞ ఏర్పడును. ఈ సంజ్ఞ డు....ఙ్ అనువానినడుమ నున్న రు, వు, రు, ను, ము అనువానికిని, డువర్ణకమునకును సంజ్ఞయగును. కావున 'డుఙ్' అనఁగా ఈ యాఱు ప్రత్యయములని యర్థము తేలును.

సంక్షేపమునకయి యీప్రత్యాహారపద్ధతి కల్పింపఁబడినది.

9. అందు వరుసను రెండేసి ప్రథమ మధ్యమోత్తమంబు లనంబడు. ౯.

డుఙ్, రు: ప్రథమము; వు, రు: మధ్యమము; ను, ము: ఉత్తమము.

**10.** వానిలో రుములు బహువచనంబులు ; పెఱ లేకవచ నంబులు. ౧౦.

డుఙ్, వు, ను : ఏకవచనములు; రు, రు, ము : బహువచనములు.

వచనక్రమానుసారముగ, ఏకవచనములను ముందు పేర్కొని తక్కినవిబహువచనములని యిట నిర్దేశింపవలసియున్నది. అటులయినచో 'డుఙ్వును లేకవచనంబుల'ని మూఁడిటిని బేర్కొనవలసియుండును. అంతకంటె రెండిటిని బేర్కొనుటలోని సౌకర్యము నూహించి క్రమమును బాటింపక బహువచనములను ముందు పేర్కొనెను. దీనినిబట్టి సూత్రరచనమున నుండఁదగిన సంక్షేపాభిలాష వ్యక్తమగుచున్నది.

**11.** నామ యుష్మ దస్మ దర్థంబులందుం బ్రథమమధ్యమోత్తమంబులగు. ౧౧.

**12.** అమహదర్థంబునందు డుబ్రులకు దువులగు నున్నాను బంధంబుమీఁద దివియగు. ౧౨.

క్రియావిభక్తులాఱింటిలో 'రు' వర్ణకములు రెండుగలవు.

i. ప్రథమబహువచనము : రు ; ii. మధ్యమబహువచనము : రు.

అయినను 'డుఙ్రులకు' అనుచో డుఙ్తోడి సాహచర్యమునుబట్టి యిట 'రువర్ణకము'ను ప్రథమబహువచనమును మాత్రమే గ్రహింపవలయును. మధ్యమబహువచనమును గ్రహింపరాదు. అని సూత్రకర్తహృదయము.

సాహచర్యముకలదియు లేనిదియు రెండుతటస్థించినపుడు సహచరితమునే గ్రహింపవలయునన్నది సంస్కృతశాబ్దికపరిభాషితము.

"సహచరితాసహచరితయోః సహచరితస్యైవ గ్రహణమ్."

ఇట నీయంశమును గుర్తింపనిచో :

'మేఘములు గర్జిల్లఁగలవు' అనుదానివలెనే 'మేఘములారా! మీరు గర్జిల్లఁగలవు' అనునపరూపముగూడ ఈసూత్రముచే సాధువు కావలసి వచ్చును. కావున 'డుబ్రు'లనుచో మధ్యమపురుష రువర్ణకమును గ్రహింపరాదు.

తిర్యగ్జడములతోపాటు స్త్రీలుగూడ నమహత్తులేగావున 'స్త్రీపాడఁగలదు' అని ఏకవచనమున డుఙ్నకు 'దు'వర్ణము వచ్చినటులే 'స్త్రీలు పాడఁగలరు' అనుచో బహువచనమున రువర్ణకమునకు 'వు' వర్ణము కలిగి 'పాడఁగలవు' అను రూపము కావలదా యనుసందేహము ఆపాతతః కలుగవచ్చును. కాని,

తన్నివృత్తికయి "సర్వనామ 'క్రియాపదంబుల' బహువచనంబు మహత్తునకుం బోలె మహతికగు" (అచ్చిక-26) అను విధానమును స్మరణకుఁ దెచ్చుకొనవలయును.

సమనంతర (13) సూత్రమున ఉదంత ధాతువునకు లట్టు పరమగు నపుడు 'ఉన్న' అనునది అనుబంధముగా విధింపఁబడును. "అది వండుచున్నది", "అవి వండుచున్నవి" అని యుదాహరింపనగును.

ఉన్నానుబంధము లట్టునందుమాత్రమే వచ్చునుగాన, ఈసూత్రమున సంక్షిప్తముగా 'లట్టునందు ది, వి యగు' అనరాదా యనిశంకింపవచ్చును. సత్యమే.

కాని 'బాలునకు నేర్పుకలదు', 'బాలునకు శక్తులు కలవు' అనువాక్యము లందు 'కలదు, కలవు' అనునవి వర్తమానార్థక క్రియారూపములు, లడంతములు. ఇట ఉన్నానుబంధము రాదు. 'లట్టునందు ది, వి యగు' నన్నచోఁ బయివాక్యములలోని క్రియా రూపములందుఁగూడ ది, వి ప్రవర్తింపవలసి వచ్చును. వర్తమానార్థమున 'కలదు, కలవు' అనురూపములే సిద్ధింపకపోవును. ఉన్నానుబంధమువచ్చుచోటనే 'ది, వి యగు' ననుటవల్ల ఆచిక్కు తొలఁగినది.

లడంతములలో 'ఉన్నానుబంధము' రానితావు బాలవ్యాకరణ ప్రక్రియలో ఇదొక్కటిమాత్రమే కలదు. —చూ. క్రియా-13, 104.

సూత్రమున మొదటివాక్యమున 'దువులు' అని బహువచనాంతముగఁ బ్రయోగించినటులే రెండవవాక్యమునఁగూడ 'దివులు' అని యన్నచో నందు రెండవ వర్ణము 'వు' అను భ్రాంతి కలుగునను సంకోచముచే 'ది, వి యగు' నని విడివిడిగా ఆదేశములు చూపఁబడినవి.

**13. ఉదంతంబునకు లట్టు పరంబగునపు డున్నానుబంధం బగు. ఆఱ.**

> ఉదంతంబయినధాతువునకు లట్టుపరంబగునపుడు 'ఉన్న' అనుశబ్దం బనుప్రయుక్తంబగు.

బాలవ్యాకరణమున ధాతుస్వరూపనిష్పత్తి నాలుగువిధములుగఁ జూపఁబడినది :

i. సంస్కృతధాతువులకు 'ఇంచు' చేర్చుటవల్ల ఏర్పడునవి :
వచించు - వచించు మొ. —చూ. క్రియా-63.

ii. అంగలాదులకు 'ఇంచు' చేర్చుటవల్ల ఏర్పడునవి :
అంగలించు - అవులించు మొ. —చూ. క్రియా-63.

iii. ప్రాతిపదికములకు 'ఇంచు' చేర్చుటవల్ల ఏర్పడునది :
శయనించు - పయనించు మొ. (నామధాతువులు) —చూ.క్రియా-65.

iv. వండు - పండు - విను - కను మొ. సహజములగు దేశ్యధాతువులు.

ఈరీతిగాఁ దెలుఁగున ధాతువులన్నియు ఉకారాంతములేగదా ! ఇట్టియెడ సూత్రమున 'ఉదంతమునకు' అను విశేషణ మెందులకు? అని ప్రశ్నింపవచ్చును.

ఈ విశేషణము లేకున్నచో 'కలదు - కలరు' ఇత్యాదులందుఁగూడ 'ఉన్నానుబంధము' రావలసివచ్చును. ఎట్లన, 'కలుగు' ధాతువునకు లట్టునందు 'కల' ఆదేశమగును (క్రియా-104). ధాతుస్థానమునవచ్చిన యాదేశమగుటచే 'కల' అనునదిగూడ ధాతువేయగును. దానికి లట్టుపరమయినదిగాన 'కలఁడు, కలరు' అనుచో 'ఉన్నానుబంధము' సంభవించును. దానిని వారించుటకయి 'ఉదంతంబునకు' అను విశేషణ మావశ్యకమయినది.

'ధాతువునకు' అనునధికారసూత్రము పరిచ్ఛేదము తుదివఱకు ననువర్తించునని నడుమనడుమ జ్ఞప్తికిఁ దెచ్చుటకై వృత్తిలో ధాతుపదసమన్వయము చూపఁబడినది.

## 14. ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకంబగు. ౨౪.

పూర్వసూత్రమున (13) 'ఉన్న' అనునది అనుబంధముగా (అనుప్రయోగముగా) విధింపఁబడినది.

ఏతదనంతరసూత్రమునఁగూడ (15) ఉన్నానుబంధమనియే యది వ్యవహరింపఁబడినది.

ఆరెంటికి నడుమనున్న యీప్రకృతసూత్రమున 'ఉన్నానుబంధ'మనక 'ఉన్నశబ్ద'మనుటలో నొక యభిప్రాయము నిగూఢమైయున్నది.

46వ సూత్రమున ధాతుజవిశేషణముల ప్రక్రియలో 'ఉన్న' అనునది మఱికొన్నిటితోపాటు ప్రత్యయముగా విధింపఁబడినది.

'వండుచున్నాఁడు' అను క్రియారూపమునందువలెనే 'వండుచున్న రాముఁడు'అను ఆ విశేషణరూపమునందుఁగూడ ఈ చువర్ణకము రావలయును.

ఒకచో ననుబంధముగను, వేఱొకచోఁ బ్రత్యయముగను, విహితమయిన రెండువిధములగు 'ఉన్న'లకును గ్రహణము కలుగుటకయి, ఉభయానుకూలముగ 'ఉన్నశబ్దంబు పరమగునపుడు' అని రచించినటు లూహింపవలయును.

ఉభయానుకూలమగు ఈ సూక్ష్మదృష్టిని 56వ సూత్రమునఁగూడ పరికింపుఁడు.

క్రియాపదములలో 'చువర్ణకములు' రెండుగలవు: మొదటిది 'వండుచున్నాఁడు' మున్నగు సమాపక క్రియలలోనిది. ప్రకృతసూత్రవిహితము. ఇది యర్థరహితము. రెండవది 'వండుచున్' మున్నగు అసమాపకక్రియలలోనిది వర్తమానార్థకము (శత్రర్థకము). —క్రియా-43.

ఒక్కటేగాక చువర్ణకములు రెండుండుటవల్లను, అందు రెండవదానికే వైకల్పికసంధి రావలసియుండుటవల్లను, ప్రథమేతర సూత్రమున (సంధి-2) 'చువర్ణకంబులందున్న యుకారమునకు' అని సాధారణముగఁ జెప్పుటకు వలనుపడక, 'శత్రర్థ చువర్ణంబులందున్న యుకారమునకు' అని ప్రత్యేకించి విశేషణ సహితముగాఁ జెప్పుకొనవలసివచ్చినది.

'వండుచున్' ఇత్యాదులందు వర్తమానార్థమును బోధించు పదాంతమునఁ గానవచ్చెడి 'చు' అను దానిని ప్రత్యయముగఁ బేర్కొనుట యుక్తమే. కాని 'వండుచున్నాఁడు' మున్నగుచోట్ల నర్థరహితమయి, పద మధ్యమునఁ బ్రాప్తించిన 'చు' అను దానిని వర్ణకమనుటకంటె ఆగమముగా విధించుట యుచితముగదా? అట్లుగాక రెంటిని వర్ణకములుగనే విధింపనేల? అని శంకింపవచ్చును. నిజమే కాని

దీని నాగమముగాఁ జేయఁదలఁచినపుడు కిత్త్వముంచి ధాతువునకు అంతావయవముగ చుగాగమ మనియో, టిత్త్వముంచి 'ఉన్న' శబ్దమునకు ఆద్యవయవముగా చుడాగమ మనియోగదా విధింపవలసియుండును.

రెండుపక్షములందును చిక్కులు గలవు.

i. చుగాగమమొకటి ప్రేరణార్థమున విహితమయి ప్రసిద్ధముగా నున్నది. దానికి సంబంధించి విధింపఁబడు కార్యములును గొన్నిగలవు. (చూ. క్రియా-73, 75, 76, 77, 80, 81, 82 మొ.). ఆచుగాగమముతో సాంకర్యము సంభవించునుగాన దీనిని చుగాగమమన వలనుపడదయ్యెను. ప్రక్రియలో సాంకర్యమునకు తావుండరాదుగదా!

ఇట్టి సాంకర్యములను దొలఁగించి ప్రక్రియకు వైశద్యమును సమకూర్చు ప్రయత్నము సూరిదృష్టిలో పెక్కుతావులందు గోచరించును.

ii. చుడాగమమన్నచో నింతకన్నను పెద్దచిక్కు కలిగెడిది.

ఉండుధాతువునకు వర్తమాన సమాపక క్రియారూపములు (లడంతములు) 'ఉన్నాఁడు, ఉన్నారు' ఇత్యాదులు సిద్ధింపవలయును.

ఉన్నశబ్దము పరమగునపుడు, ఉండుధాతువు లోపించి యీరూపములు నిష్పన్నములగును. (క్రియా-56) ధాతువంతయు లోపించుటచే దానికిఁ బరముగా రావలసిన చువర్ణకము, ఆరూపములందుఁ బ్రకృతసూత్రముచే సంభవింపనేరదు. ఉన్నాఁడు మున్నగునవి నిర్బాధముగా సిద్ధించును.

'ఉన్న'కు చుడాగమమును విధించినచో 'చున్నాఁడు, చున్నారు' ఇత్యాదులు సంభవించును. కావున దీనిని చుడాగమమనుటయుఁ గుదురువడదు.

ఆగమమనుటకు వలనుపడకుండుట యటుండ దీనిని వర్ణకముగ నిర్దేశించుటలో వేఱొకప్రయోజనముగూడఁ గలదు. 'అనుచున్' ఇత్యాదులందు చువర్ణకము పరమగునపుడు ఉత్వలోప బిందువులచే అన్చున్, అంచున్ మున్నగు శత్రర్థకరూపములు సాధింపఁబడును. (క్రియా-55).

వయికార్యములు 'అనుచున్నాఁడు' ఇత్యాదులందుఁగూడఁ బ్రవర్తించి 'అన్చున్నాఁడు, అంచున్నాఁడు' మున్నగురూపములు సిద్ధింపవలయును.

శత్రర్థకచువర్ణమును వర్ణకమనక యెట్లును దప్పదు. దానితోపాటు ప్రకృతచువర్ణమునుగూడ వర్ణకముగనే నిర్దేశించినచో ఉభయవిధరూపములకును నొక్కసూత్రమువల్లనే నిష్పత్తి కలుగును. ఈప్రయోజనముల నుద్దేశించియే యీసూత్రమున దీనినిగూడ వర్ణకముగా నిర్దేశించియుండెను.

ఒక్కయత్నముచే రెండుఫలములు సిద్ధించుట సర్వత్ర అభిలషణీయము. అందును వ్యాకరణమున అత్యంతాభిలషణీయముగదా ! కాఁగా, ఇట ఉన్నానుబంధమును శబ్దమనుటలోను, 'చు' వర్ణమును ప్రత్యయమనుటలోను గల యుద్దేశములు మిక్కిలి సరసములు, సప్రయోజనములు. సరేగాని, వేఱొక సందేహమిటఁగలదు.

కూర్చు, నిలుచు అనుధాతువులకు 'ఉండు' ధాతువనుప్రయుక్తమయి కూర్చుండు, నిలుచుండు అను శబ్దపల్లవధాతువు లేర్పడును. వాని వర్తమాన క్రియారూపములు 'కూర్చున్నాఁడు', 'నిలుచున్నాఁడు' అని కావలయును.

'ఉన్నాఁడు' అనుచోటవలెనే యిటఁగూడ ఉన్నశబ్దము పరమగునపుడు ఉండుధాతువు లోపించును. అది లోపించినను 'కూర్చు', 'నిలుచు' అనుధాతు రూపములు మిగిలియున్నవి. వానికి 'ఉన్న'శబ్దము పరమయినది. అట ఈ 'చు'వర్ణకము రాకుండుట యెట్లు ? వచ్చినచో 'కూర్చుచున్నాఁడు', 'నిలుచుచున్నాఁడు' అనురూపములు సంభవించునేగాని కూర్చున్నాఁడు, నిలుచున్నాఁడు అని సిద్ధింపవే ! దీనికి మార్గమేమి ? అన్నచో

ఏ ధాతురూపముమీఁద 'ఉన్న'శబ్దము కలిగినదో ఆధాతురూపమునకే 'చు'వర్ణకమగునని వ్యాఖ్యానించినచో ఈచిక్కు తొలఁగునట్లున్నది.

ఇచటి ఉన్నానుబంధము కూరుచుండు, నిలుచుండు అనుధాతురూపములకు వచ్చినదిగాని, కూరుచు, నిలుచు అనువానికి వచ్చినది కాదు. కావున చువర్ణకము నివారితము కావచ్చును అనితోఁచుచున్నది.

**15.** ద్వితీతరంబగు డుజ్ఞు పరంబగునపు డున్నానుబంధంబునకు దీర్ఘంబగు. ౨౫.

ప్రథమము : వాఁడు వండుచున్నాఁడు, వారు వండుచున్నారు.
అది వండుచున్నది, అవి వండుచున్నవి.
మధ్యమము : నీవు వండుచున్నావు, మీరు వండుచున్నారు.
ఉత్తమము : నేను వండుచున్నాను, మేము వండుచున్నాము.

**16.** లిఙ్లాట్టుల డుఙ్జున వెను నువర్ణంబులగు. ౧౬.

లిడాదేశంబగు డుఙ్జునకు ఎను అనునదియు లాడాదేశంబగు డుఙ్జునకు ను అనునదియు నాదేశంబులగు.

**17.** ఘూతంబునం దిగాగమంబగు. ౧౭.

ఘూతార్థవృత్తియగు ధాతువున కిగాగమంబగు.

**18.** లిట్టువుఙ్ఙుల పరంబగునపుడు తివర్ణకంబగు. ౧౮.

ఇకారంబుమీఁది కు, ను, వు క్రియావిభక్తుల యనుసూత్రముచే రుఙ్ఙున కిత్వంబు :
ప్ర : వండెను, వండిరి. మ : వండితివి, వండితిరి.
ఉ : వండితిని, వండితిమి.

**19.** కలఙ్యనుబంధంబు ల్ృట్టు పరంబగునపుడగు. ౧౯.

ల్ృట్టుపరంబగునపుడు ధాతువున కు కలజీ అనునది యను ప్రయుక్తంబగు.

**20.** జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు. ౨౦.

జీత్తుపరంబగునపుడు 'ధాతువు'నుత్వంబున కత్వంబగు.

జీఅను ఇద్వర్ణముగలవియెల్ల జీత్తులు : లజీ, కజీ ఇత్యాదులు. జీత్తు పరమగుచో ధాతూకారము అకారమగును. వండరు, వండక మొదలగునవి.

'జ్' అను హల్మాత్రము ఇద్వర్ణముగాఁగలవి జిత్తులు : డుజ్, తజ్ ఇత్యాదులు. జిత్తునకు ముందు బిందువు వచ్చును ; రాముండు, చేయుండు, చేఁత, కోఁత మొదలగునవి.

జిత్తులు వేఱు, జీత్తులు వేఱు.

జిత్త్వప్రయోజనము: బిందువు వచ్చుట. జీత్త్వప్రయోజనము: అకారము వచ్చుట.

ఈభేదమును గమనింపనేరక ప్రమాదపడి బాలవ్యాకరణము సంస్కృతీకరించిన హరికారికాకర్త యన్నిటిని జిత్తులుగనే నిర్దేశించెను.

'జిత్ బిన్దుపూర్వః' అనియు

'అత్ర జీతి అత్ ఉతః భవేత్' అనియు

జిత్తులకే రెండుకార్యములను విధించెను.

ఈప్రమాదపురచనలోఁ బొటిల్లినయనర్థములు పెక్కులుగలవు. చూడుఁడు.

(మీరు) చేయుండు ఇత్యాదులందు డువర్ణకము జిత్తుగావున నచటఁగూడ అత్వము ప్రాప్తించి మధ్యమపురుషమున మీరుచేయండు ఇత్యాదులు అపరూపములు సంభవించును.

ఇటులే, చేయక ఇత్యాదులందు కవర్ణకము జిత్తుగావున నచటఁగూడ బిందువు ప్రాప్తించి చేయంక ఇత్యాదులు కురూపములు సంభవించును.

గుప్తార్థప్రకాశికాకారులుగూడ నిట్టియనిష్టరూపాపత్తిని గుర్తింపక యిచ్చోట బాలవ్యాకరణవిధానముకన్న, కారికావిధానమే సమంజసమని స్థాపింపఁ బెనఁగులాడుట మిక్కిలి విషాదకరము.

ఈయంశము అనువాదవివేచనప్రకరణమున విపులముగాఁ జర్చింపఁబడినది.

**21.** కలజి పదుఁబులు పరంబులగునపుడు నుగాగమంబగు. ౨౧.

ద్రుతకార్యంబు.

ప్ర : వండఁగలఁడు, వండఁగలరు, వండఁగలదు, వండఁగలవు.

మ : వండఁగలవు, వండఁగలరు.

ఉ : వండఁగలను, వండగలము.

నుగాగమమును విధించినతావులందు పరుషములు పరమగుచో ద్రుతకార్యము సహజముగనే కలుగును. దానిని బ్రత్యేకించి సూచింపఁబనిలేదు. సూరి యెచ్చటను సూచింపను లేదు. ఇటులుండ, ఈసూత్రమున "ద్రుతకార్యంబు"అని విశేషించి నిర్దేశించుటకు హేతువేమి? అని మనము ప్రశ్నించుకొనవలయును. ఈవిశేషనిర్దేశమునకు హేతువు గలదు.

ద్రుతప్రకృతికములనఁగా ద్రుతాంతములయిన 'పదములు' (సంజ్ఞా-12).

ఇచటి లక్ష్యములందలి ద్రుతాంతభాగములు పదములు కానేరవు. కాకున్నను ఆభాగములను ద్రుతప్రకృతికములుగా భావించి ద్రుతకార్యము

చేసికొనవచ్చునని తనసమ్మతిని వెల్లడించుటకే "ద్రుతకార్యంబు" అని ప్రత్యేకముగా సూచించినట్లు గుర్తింపవలయును. ఈసూచనము హేలగా నుపేక్షింపఁ దగినదికాదు.

**22.** లాట్టుపుజ్ఞు పరంబగునప్పుడు ముగాగమంబగు. ౨౨.

ప్ర : వండును, వండుదురు.

మ : వండుదువు, వండుదురు.

ఉ : వండుదును, వండుదుము.

లాడర్థంబులయం దోలి నుదాహరణంబులు వక్కాణించెద :

తద్ధర్మంబు : కులాలుండు కుండలు వానును.

తచ్ఛీలంబు : జ్వాలజ్వాలంబు లుప్పరంబెగయును.

సంభావన : ఇప్పుడు వాఁడింటనుండును.

సంప్రశ్నము : ఉండునా ? పోవునా ?

సాతత్యము : సర్వంబునం దీశ్వరుఁడుండును; సర్వంబీశ్వరుని యందుండును.

వర్తమానంబు : మేన నిప్పుడుం బులకలు పొడమెడును.

వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడు గాద్యాగమంబులగు.

భావి : వాఁడు రేపు వచ్చును.

ఆశీస్సు : శుభంబగును.

వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడును.

'ధవళాయతలోచన వాని కిట్లనున్' (అనున్ = అనెను)

---మనుచరిత్ర-2-49.

తద్ధర్మ శబ్దము

"ఆక్వేస్తచ్ఛీల 'తద్ధర్మ' తత్సాధుకారిషు"

అను పాణినిసూత్రమున ప్రయుక్తమయియున్నది.

సః (ధాత్వర్థః) ధర్మః యస్య (కర్తుః) సః తద్ధర్మా (తద్ధర్మాణౌ, తద్ధర్మాణః)

అని దీనికి కాశికావృత్త్యాదులందు విగ్రహము ప్రదర్శింపఁబడినది. సః అనఁగా ఆధాత్వర్థము : ఆ క్రియ ధర్మముగాఁగల కర్తయని తద్ధర్మశబ్దార్థము. అట్టి కర్తను బోధించుచు వచ్చు ప్రత్యయము తద్ధర్మార్థక ప్రత్యయము.

'తస్య ధాతోః ధర్మః తద్ధర్మః'

(ఆధాతువుయొక్క ధర్మము తద్ధర్మము)

అని అహోబలపండితాదులు దీనికి విగ్రహము చూపియుండిరి. అది పొసఁగు నట్లు కానరాదు. ధర్మము, శీలము అనునవి కర్తృగతములుగాని ధాతునిష్ఠములు కానేరవు.

ఈ తద్ధర్మశబ్దార్థమును నిరూపించుటలో ఒక్కగుప్తార్థప్రకాశికయందుఁ దప్ప తక్కినటీకలలోఁ గొంతతడఁబాటు కానవచ్చును. పదిలముగా పరికింపుఁడు.

'వండుదురు'ఇత్యాదులందలి 'దు'వర్ణమును, 'వండితిరి'ఇత్యాదులందలి 'తి'వర్ణమును చింతామణిలో నొకే సూత్రమునఁ బ్రత్యయములుగా విధింపఁ బడియున్నవి :

"దుతివర్ణకౌ క్రమాత్ స్తః."

అది పరికించి సూరి "లిట్టుపుఙ్ఞు పరంబగునపుడు తి వర్ణకంబగు"నని 'తి' అనుదానిని బ్రత్యయముగనే యుంచి, 'దు'అనుదానిని ప్రకృతసూత్రమున ఆగమముగా విధించెను. అందును, ధాతుప్రత్యయములకు నడుమ రావలసిన దీనిని రువర్ణకమునకు సంబంధింపఁజేయక ధాతువునకు అవయవముగా విధించుచున్నాఁడు. ఈమార్పునకు నాతనియుద్దేశమును పరికింపవలసియున్నది.

(పోషించు-దు-రు) పోషింతురు, పోషింత్రు ఇత్యాదులందు రావలసిన ఉత్వలోపము ధాత్వధికారమున "రువర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది తదడలయుత్వంబునకు లోపంబు విభాషనగు" అనుసూత్రముచే (క్రియా-62) విధింపఁబడినది. కావున నది ధాతూకారమునకే వచ్చును.

ఇచటి 'దు'వర్ణము ప్రత్యయమయినచో ప్రత్యయస్థోకారమునకు లోపము రానేరదు. పోషింత్రు మున్నగు రూపములు సిద్ధింపవు. కావున, దీనిని ప్రత్యయమనరాదు. ఆగమముగనే నిర్దేశింపవలయును. ఆయాగమమయినను ధాతువునకే సంబంధించి యుండవలయును. రువర్ణకమునకు సంబంధింపఁ జేసినచో ధాతూకారమునకు విహితమయిన ఉత్వలోపము పయిస్థలములందుఁ బ్రాప్తింపదు. పోషింత్రు ఇత్యాదులు సిద్ధింపవు.

ఈరీతిని, ఇష్టప్రాప్తిలేకపోవుటయగాక మఱొక యనిష్టముగూడ సిద్ధ మగును. ఎట్లందురా ?

చెందు-దురు, పొందు-దురు మున్నగుచోట్ల దుకారము రువర్ణకమునకు అవయవమగుచో అపుడు, 'దురు'అనుమొత్తమే రువర్ణకమనిపించుకొనును గావున, అది పరమగుటచే 'చెందు, పొందు' మున్నగు వానిలోని ధాతూకార ములు లోపింపవలసివచ్చును. కురూపములు సంభవించును.

ఇవియెల్ల సుదూరము పరికించి 'దు'వర్ణమును ప్రత్యయమునక, ఆగమముగా నిర్దేశించియు, ఆయాగమమునయినను చిహ్నమునుగాక ధాతువునకు సంబంధింపఁజేసియు, ప్రక్రియను సమకూర్చినటులూహింపవలయును.

తద్ధర్మాద్యర్థములకు వరుసగాఁ బైనిఁజూపఁబడిన యుదాహరణములు పరికింపుఁడు. అవియెల్ల నాయా యర్థములకు నత్యంతసంగతములగుట గమనింపుఁడు. సూక్ష్మదృష్టితో నిర్దిష్టములు.

మఱియు నిచట నీతద్ధర్మాద్యర్థములలో సంప్రశ్నార్థమునకు ఉండునా? పోదునా? అని ఉదాహరణములు రెండు చూపఁబడినవి. తక్కిన యర్థములకు నొక్కొకటే యుదాహరణము చూపుచు దీనికి రెండిటిని జూపనేల? మఱియు నీరెండిటియందును ప్రశ్నార్థకమగు ఆకారము చేర్పఁబడినది. ఇట ప్రశ్నార్థమును బోధించెడిది ఆకారమా? క్రియాప్రత్యయమా? ఆకారమును తొలఁగించి 'ఉందును, పోదును' అనినచో, ప్రశ్నార్థము లేశమును స్ఫురింపదే! ఆకారము చేర్చినయెడ లృలకారము (లాట్టు) మాత్రమేయననేల! లడాది లకారములెల్లను ప్రశ్నార్థకములే యనవలసివచ్చునే! ఉన్నాఁడా? ఉండెనా? ఉండఁగలడా? ఉండఁడా? మున్నగు వానిలోనెల్ల ఆకారయోగముచే ప్రశ్నార్థము స్ఫురించుచునే యుండునే! ఇంతయేల? క్రియాపదములకేగాక వాఁడా? వీఁడా? అనియిట్లు, ఆకారము దేనికొననుంచినను నవియెల్ల ప్రశ్నార్థకములే యగుచుండునే! ఇట్టిస్థితిలో 'లాట్టు'మాత్రమే ప్రశ్నార్థకమని ప్రత్యేకించి చెప్పుట యెట్లు పొసంగును?

అని కొందఱు శంకింపవచ్చును. కమనీయముగు శంక గాని కుశంక గాదు. సూరిహృదయమునఁగల సమాధాన మేదయియుండునో సమీక్షింతము.

ప్రశ్నయనునది సాధారణముగ సమాధానసాపేక్షము. అనఁగా 'వచ్చెనా' అనుప్రశ్న 'వచ్చె'ననియో 'లేద'నియో సమాధానమును కోరెడిదయి యుండు ననుట. అతఁడు రాముఁడా? గోవిందుఁడా? అనుప్రశ్న రాముఁడనియో, గోవిందుఁడనియో, ఏదేనొక సమాధానము నపేక్షించునదయి యుండును. అట్టిచోట్ల 'ఆ' అనునది ప్రశ్నార్థమును బోధించుచుండును.

తద్ధర్మాదులందలిది అట్టిప్రశ్నార్థము కాదు. ఇది సమాధాననిరపేక్షము. సాధారణ ప్రశ్నకంటె విలక్షణము. ఆ విలక్షణత స్ఫురించుటకే సూరి దీనిని 'ప్రశ్న'మనక 'సంప్రశ్న'మని నిర్దేశించెను.

కర్తవ్యములయి రెండుపనులు (క్రియలు) తటస్థించినపుడు వానిలో, ఏపని చేయుటకును తోఁచని సందిగ్ధపరిస్థితి (Dilemma) యేర్పడినపుడు కర్తవ్యము నిర్ణయింపరాని సందర్భమున ఇట్టి సంప్రశ్నప్రయోగ మేర్పడును.

శాకుంతలమందలి యొక చిన్న సన్నివేశమును గుర్తునకుఁ దెచ్చుకొన్నచో దీనిస్వరూపము సూటిగా తేటపడఁగలదు.

కణ్వాశ్రమమున దుష్యంతుఁడు

"ఇత స్తపస్వికార్యమ్, ఇతో గురుజనాజ్ఞా, ద్వయమ ప్యనతిక్రమణీయమ్ కిమత్ర ప్రతివిధాతవ్యమ్ ?"

ఋషికార్యము నెఱవేర్చుటకయి ఆశ్రమమున ఉండకను దప్పదు, పురమునుండివచ్చిన గురుజనాజ్ఞను బాలించుటకు అటుపోవకను దప్పదు. ఉందునా ! పోదునా ! = ఉండుటా ! పోవుటా ! ఏ మిచేయుటకును వీలుకాన రాకున్న దే ! అనుచున్నాఁడు.

అదివిని 'త్రిశఙ్కు రివ అంతరాలే తిష్ఠ' ఆశ్రమముననుండుటయుఁ గుదు రదు, నగరికి వెళ్లుటయుఁ గుదురదు. త్రిశంకువువలె నంతరాళమున వ్రేలాడు చుండుము. అని విదూషకుఁడు పలుకుచున్నాఁడు.

ఇట్టిచోట్ల, కింకర్తవ్యతానిర్ణయము తేలనిసందర్భములందు, తనలోఁదాను వేసికొనెడి యిట్టిప్రశ్న మే సంప్రశ్నము. ఎదుటివారు కర్తవ్యము నిర్ణయించి సమాధానము చెప్పవలసినప్రశ్న యిది కానేకాదు.

పరస్పరవిరుద్ధములగు రెండు (కొన్ని) పనుల వికల్పసందర్భమునందే యీ సంప్రశ్నము గోచరించును. ఈ సంప్రశ్నార్థము పాణినీయమునందును నిర్దేశింపఁబడియున్నది.

వికల్పము లేకుండ 'ఉందునా?' అని యొక్కపదమునుమాత్ర మే ప్రయో గించినచో నది తద్ధర్మాద్యర్థకలాడంత మే యయినను నచటిది సాధారణ ప్రశ్న మే — 'సం'ప్రశ్నముకాదు. ఈప్రశ్నకు ఉండుమనియో, వెళ్ళుమనియో సమాధాన మపేక్షితము. ఆ రెండిటిలో, ఏదోయొక సమాధానమునకు సంభ వమును గలదు. అట్టియెడ ఆ'లాట్టు' భవిష్యదర్థకముగాని సంప్రశ్నార్థకము కానేరదు.

ఈసూక్ష్మమునుగూడ గుర్తించియే సూరి కుండలు'వానును', ఉప్పరం 'బెగయును' ఇంట'నుండును' మున్నగు తక్కినయుదాహరణములందువలె క్రియాపదమును నొక్కదానినే యిచ్చుటకు వీలుపడకుండుటవల్లనే యీ యొక్క చోటమాత్రము 'ఉందునా', 'పోదునా' యని పరస్పర విరుద్ధార్థకములగు క్రియా పదములు రెండిటిని గలిపి యీ యుదాహరణము చూపియుండెను. కాఁగా, లకారములలో లాట్టుమాత్ర మే సంప్రశ్నార్థకమని సమాధానము తేలుచున్నది.

క్రింది భారతప్రయోగమునుగూడ గమనింపుఁడు :

"అరయమిఁజేసి కోడలనకప్పుడు దాసిగఁజేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు వోవఁగ వీరలతోన యేనుఁజె
చ్చెరఁజని కోటరంబు దగఁ'జేయుదునో' యటుగాక పాడిమై
వరవుడ మోపి'చేయుదునొ' వారికి మాధవ విశ్చయింపుమీ."

—భారత-ఉద్యోగ-3-112.

ఇది ద్రౌపదివాక్యము.

జూదమున ఒడుచుకొనఁబడి, దాసినై వారిచేఁత కోడలిరికము నెఱపుట యెట్లు? అదా సాధ్యముకాదాయెను! కోడలనుగదా అత్తవారియింట దాసీత్వము నవలంబించుటయెట్లు? ఇదా భావ్యముకాదాయెను! ఏతీరున మెలఁగుటయును దారి కానరాకుండెనే! అని ద్రౌపది యేటుచేయుటయును తోఁపని తన సందిగ్ధావస్థను (సంప్రశ్నమును) పూర్వము తానసుభవించినదానిని రాయబారమునకేగుచున్న తరుణమున శ్రీకృష్ణునికి నివేదించుచున్నది.

ఈ సందర్భమున సోమయాజులు లాట్టునే ప్రయోగించియున్నారు. ఈచూపున పరికించినచో నిట్టికవిప్రయోగములు పెక్కులు లభింపఁగలవు.

భాషలో నిట్టియర్థవిశేషమును నిగూఢముగ బోధించు నీ తెలుఁగునుడికారమును గుర్తించియు, తద్ధర్మాద్యర్థకలాడంతప్రయోగమునందే యీ యర్థవిశేషము స్ఫురించుట భారతాదులప్రయోగములందుఁ బరిశీలించియు, ఇది సామాన్యప్రశ్నగాక విలక్షణప్రశ్నమని స్ఫురింపఁజేయుటకే 'ప్రశ్న'మనక 'సంప్రశ్న'మని పేరుపెట్టియు, లక్ష్యసమన్వయమునకు సనుకూలముగా, తన యాంతర్యమునకు సూచకముగా 'ఉందునా! పోదునా!' అని జంటపదములయుదాహరణము చూపియు, మిక్కిలి పూనికతో సూరి యీ యర్థవిశేషమును తద్ధర్మాదులలోఁ జేర్చి, ఉచితమయిన యుదాహరణము చూపి, భాషలో దాఁగియున్న భావవిశేషము నొకదానిని వెల్లడించియుండెను. ఇట్టిచోటులందు సంప్రశ్నార్థమునకు లాట్టువాచకమనియు, 'ఆ'కారము ద్యోతకమనియు సూరితాత్పర్యము.

ఇటులుండ నీయుదాహరణములలోని సూత్రకారుని యాంతర్యసారస్యమును వెలువరింపక న్యాయమొనసంగని టీకలు కొన్నియు, ఇందలివిశేషమితరులకయిన స్ఫురింపకుండ నుదాహరణములరూపునే మార్చి మూలమునకు అన్యాయమొనరించిన టీకలు గొన్నియుఁ గానంబడును. టీకలు పరికించి కలరూపు గమనింపుఁడు (క్రియా-5, 22). మెఱుఁగులు చూపకున్నఁబోయెఁ గాని తఱుఁగులు దెచ్చుట ధర్మముగాదు.

**23.** లాట్టురుణ్ణు పరంబగునపు డెదగాగమంబును, బ్రథమ నువర్ణకంబు పరంబగునపు డెదుగెడి గాగమంబులును బహుళంబుగా నగు. ౨౩.

ప్ర : వండెదును, వండెడిని ; వండెదరు.

మ : వండెదవు ; వండెదరు.

ఉ : వండెదను ; వండెదము.

**24.** లిఙ్లోట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు. ౨౪.

వండితి, వండితివి; వండుదు, వండుదువు; వండెదు, వండెదవు.

ఈ లోపము వకారమాత్రమునకే. అజ్విశిష్టమునకుఁ గాదు.

వండితి, వండుదు అనుచో దేనికి లోపమన్నను చిక్కు గలుగదుగాని 'వండెద + వు' అనుచో స్వరవిశిష్టమున కనుకొన్నచో 'వండెద' అగునుగాని 'వండెదు' అను ఇష్టరూపము సిద్ధింపదు. హల్మాత్రమునకే లోపమన్నచో 'వండెద + ఉ' అని యేర్పడును. సంధిచే 'వండెదు' అని సిద్ధించును.

లోపమువచ్చినరూపము మొదటిదిగను, రానిరూపము రెండవదిగను బయి యుదాహరణములక్రమము గోచరించుచున్నది. సమంజసమే.

కాని ప్రథమ (1858) ముద్రణపుఁబ్రతిలో వండెదవు, వండెదు అని పయిక్రమము వ్యత్యస్తమయి గానవచ్చుచున్నది. ఈ వ్యత్యాసము తొలుతటి ముద్రణమున ప్రమాదమూలకమయి యుండవచ్చును. అనంతరముద్రణము లందలి యీ పయిపాఠమే సమీచీనము.

**25.** తిర్యగ్జడంబులు వాచ్యంబులగునపుడు లిఙ్లోట్టుల ప్రథమ బహువచనంబున కేకవచనంబగు. ౨౫.

చిలుకలు పలికెను; చిలుకలు పలుకును, చిలుకలు పలికెడును.
మేఘములు గర్జిల్లెను; మేఘములు గర్జిల్లును, మేఘములు గర్జిల్లెడును.

**26.** లూట్టుడుఙ్ఞునకెడుతవర్ణంబులు ద్రుతాంతంబులగు. ౨౬.

ఆశీస్సు: మీకు మేలు గలిగెడును, మీకు మేలు గలుగుతను.
శాపంబు: నీకు రాక్షసత్వంబు గలిగెడును, నీకు రాక్షసత్వంబు గలుగుతను.
సంప్రార్థనంబు: హరి ననుఁ గృపఁ గాంచెడును, హరి ననుఁ గృపఁ గాంచుతను.

**27.** విధియందు లూట్టునకు మాఱుగా నదియను తచ్ఛబ్దంబును ముందు నుగాగమంబునగు. ౨౭.

మైత్రుండు వానిర్దిష్ట కార్యంబు చేయునది.
వానికి నీవు బాసటయయి యుండునది.

ఇవి ప్రథమ మధ్యమ పురుషములకు లక్ష్యములు. తన్నుఁ దానాజ్ఞాపించు కొనుట అసంభవమను తలంపుచేఁ గాఁబోలును ఉత్తమ పురుషమునకు నుదాహరణము చూపకుండెను.

**28.** ఎడుతల ప్రత్యయంబున కిచ్ఛపరంబగునప్పుడు మకారంబగు. ఉదా.

నీకు మేలు గలిగెడుమనియెను ; నీకు మేలు గలుగుతమనియెను.

సూత్రమున తవర్ణకముతోడి సాహచర్యమునుబట్టి లాట్టునకు నాదేశమగు 'ఎడు' వర్ణకమే (26 సూ) యిట గ్రహింపఁబడును. తద్ధర్మార్థకమగు లాట్టునందు ఆగమముగావచ్చు (23 సూ) 'ఎడు' అనునది గ్రహింపఁబడదు. కావుననే 'రేపు వాఁడువచ్చెడుననియె' మున్నగుచోటులందు ఈ మకారము రానేరదు.

**29.** ఆశీరాద్యర్థమున పురుషలకు ముఙ్ఙులగు. ఉదా.

ఆశీస్సు : దీర్ఘాయువవగుము. దీర్ఘాయులరగుఁడు.
శాపంబు : రాక్షసుఁడవగుము. రాక్షసులరగుఁడు.
సంప్రార్థనంబు : నన్ను రక్షింపుము. నన్ను రక్షింపుఁడు.
విధి : నాచెప్పినపని చేయుము. నాచెప్పినపని చేయుఁడు.

దీర్ఘాయువవగుము అనుచో యుష్మద్విశేషణమునకు నేకవచనమున వువర్ణాగమము కలిగినది (కారక-33). ప్రాయికముగాన నయ్యది రాకున్నను బాధలేదు. కాని తక్కిన యుదాహరణములన్నియు నాగమసహితములుగ నుండుటచే నిదిగూడ నాగమసహితమే యగుట యుచితము. కాని ప్రథమ ముద్రణమున (1858) 'దీర్ఘాయువగుము' అని కలదు. ఆగమము గానవచ్చుట లేదు. అది ముద్రణస్ఖలితము కానోపును.

విధ్యర్థమున 27 వ సూత్రముచొప్పున (నీవు, మీరు) 'నా చెప్పినపని చేయునది' అనియు నుండఁదగునుగాన, ఈ ముఙ్ఙులు నిత్యములుకావని తెలియవలయును.

**30.** ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు. ఉదా.

మనము వందుదము.

జిత్తుపరంబగునపు డుత్వంబున కత్వంబగునను సూత్రముచే అజి పరంబగునపుడత్వంబు.

ప్ర : వండ(డు, వండరు ; వండదు, వండవు.
మ : వండవు, వండరు.
ఉ : వండను, వండము.

లాట్టునందు దుగాగమము విధింప(బడియుండలేదు. అది లేకుండ దాని యుత్వమునకు అత్వమును విధించుట యెట్లుపొసంగును ? అనుశంక యిట పొడమవచ్చును.

అత్వవిధాన సామర్థ్యమువల్లనే, అన(గా దుగాగమమే లేనిచో దానికి సంబంధించు అత్వవిధానము వ్యర్థమగునుగావున దుగాగమముగూడ నీసూత్రము వల్లనే విహితమయినటు లూహించుకొనవలయును. వాచ్యములుగనేగాక యిట్లు అనుమేయములగు విధులుగూడ( గొన్ని యరుదుగా నుండుట వ్యాకరణరచనా పద్ధతికి విరుద్ధముగాదు (చూ. క్రియా-65 నామములకు ఇంచుగాగమము).

'వండుదము' అనురూపము సిద్ధించుటకు నావశ్యకమయినది 'ద'కారము గాని 'దు' వర్ణము కానేకాదు. ఇట్టియెడ లేని 'దు' వర్ణాగమమును ఊహించు కొననేల ! దానికి అత్వమును జేసికొననేల ! దగాగమమని 'ద'కారమునే విధించినచో నెట్టిశ్రమయు లేకుండెడిదే !

అనియు మఱొకశంక తో(పవచ్చును.

ఆ మార్గమున ఆపాతతః సౌకర్యము గోచరించుట సత్యమేకాని, దగాగమ మనకుండుటకు హేతువులు లేకపోలేదు. ఈ 'ద'కారము దుగాగమ సంబంధి కావలసిన యక్కఱలు కొన్నిగలవు.

'పోవుదుము' అనుచో దుగాగమము పరమగునపుడు వువర్ణలోపము విధింప(బడినది. 'పోదుము' అనురూపము సాధింప(బడినది (క్రియా-98).

ఇటులే 'పోవుదము' అనుచో(గూడ ఆ 'వు' లోపమే ప్రాప్తించి 'పోదము' అనురూపాంతరము సిద్ధించుట యావశ్యకము. ఇచటి 'ద'కారము దుగాగమసంబంధికాక వేఱొకటియయినచో ఆలోపము ప్రవర్తింపకపోవును. 'పోదము' అను రూపము సిద్ధింపకపోవును. అది సిద్ధించుటకయి యిదిగూడ దుగాగమమేయనకను దప్పదు. అత్వమును విధింపకను దప్పదు. ఈ యొక్కటియగాక మఱొకహేతువును గలదు.

ఆకర్ణింపుదుము, ఆకర్ణింతుము ఇత్యాదులలో లాట్టునందు దుగాగమ సందర్భమున( బ్రవర్తించిన పకార తకారములు (క్రియా-90, 108) ఉభయ ప్రార్థనమున లూట్టునందు(గూడ( బ్రవర్తింపవలయును. ఆకర్ణింపుదము, ఆకర్ణింతము అనురూపములు సిద్ధింపవలయును. ఈదకారము దుగాగమ సంబంధి కానియెడ( బయికార్యములు ప్రవర్తింపనేరవు.

వీనినన్నిటిని యేకపదముగ సమీక్షించి యుపర్ణ వసర్ణములను వేఱువేఱుగ రెండిటినిగలిపి కార్యములు సాధించుటలోని లఘుమార్గసౌకర్యము నాలోచించి, యీచకారమునుగూడ మగాగమసంబంధిగా పెద్దలు గ్రహింపవలయును.

**31. మధ్యమ మదుఙ్ఙులు ముఙ్ఙు నాఁబడు. ౪౫.**

ఉత్తమపురుష బహువచనము ముచ్చటింపఁబడును, ప్రథమపురుషైక వచనము డువర్ణకమునను, గ్రహించుటకరయి మదుఙ్ఙులకు 'మధ్యమ' అనువిశేషణము. ఈవిశేషణము లేనియెడ ఉత్తమ ప్రథమపురుష ముదుఙ్ఙులుగూడ ముఙ్ఙు కావలసివచ్చును.

మేము వండము, వాఁడు వండెఁడు ఇత్యాదిరూపములకు మాఱుగా 32వ సూత్రముచే టుక్ప్రాప్తించి మేమువండెము, వాఁడువండెఁడు మున్నగు సనిష్టరూపములేర్పడును.

బాలుర స్ఫూర్తిసౌకర్యమునకయి యీసంజ్ఞను (ముదుఙ్ = ముఙ్) ప్రత్యాహారమనుకొన్నను ఆరీతికిఁగూడ ననుపపత్తియుండునట్లు చిల్పించుట అందమయినతీరు.

ఇది ప్రత్యేకముగ స్వతంత్రసంజ్ఞయేగాని ప్రత్యాహారము మాత్రము కాదు. బాలవ్యాకరణప్రక్రియ మొత్తమున ప్రత్యాహారపద్ధతి ఒక్కచోట మాత్రమే కలదు (క్రియా-8). దానివలన సిద్ధించుప్రత్యాహారములు దుఙ్, రుఙ్, పుఙ్ అని మూఁడుమాత్రమే కలవు. ముఙ్ఙునకువలె వానికిఁబ్రత్యేక ముగా సంజ్ఞాసూత్రములు రచింపఁబడిలేదు. రచింపనులేదు.

వానికిని యీముఙ్ఙునకును భేదముగలదు. అచటిఙకారమునకు ప్రత్యా హారముతప్ప ప్రయోజనాంతరము లేదు. కావుననే "ఇందు ఙకారంబు ప్రత్యాహారార్థంబు" (క్రియా-8) అని సూరి యచట వివరించియుండెను. ఇచటి ఙకారము, అట్లు ప్రయోజనశూన్యము కాదు. బిందుపూర్వకతా సంపాదకము.

సూత్రకారునిదృష్టిలో నిట్టిభేదము గోచరించుచుండ, ముఙ్ఙు, దుఙ్ఙు రుఙ్ఙులవంటిదేయని పేటికాటీక వివరించుట సారస్యమును దూరీక రించుట. అది యటుండనిండు.

ఇంతదూరము క్రియాపదముల ప్రక్రియ సాగినవిమ్మటఁగాని 'ముఙ్ఙు' అనునీసంజ్ఞను విధింప వలనుపడదు. సంజ్ఞను విధింపకుండ 'ముఙ్ఙు' అను శబ్దమును సూత్రకర్త వ్యవహరించుట సమంజసమునుగాదు. కావుననే, సంధి 49వ సూత్రమున 'ముఙ్ఙు' అనక 'మధ్యమముదుఙ్ఙు'లనవలసివచ్చినది. అచ్చట అట్లనుటయే సముచితము.

**32.** వ్యతిరేకంబున ముజ్జు పరంబగునపుడు కుజీయగు. ౩౨.

నీవు వండకుము, మీరు వండకుఁడు.

కుజీ జీత్తుగావున, అదిపరమగుటచే ఉత్వమునకు అత్వము ప్రాప్తించి నది (క్రియా-20). జీ_త్త్వ జీ_త్త్వములకుఁగల ప్రయోజనభేదమును గు_ర్తింపని హరికారికాక_ర్త యీసూత్రమును

"ముడుజోః పరయో ర్మధ్యే వ్యతిరేకే కుజుచ్యతే"

అని యనువదించెను. ఈయనువాదమునందు 'కు' జీత్తుగావున బిందుపూర్వక మయి, 'అత్ర జిత్యదుతో భవేత్' అనుసూత్రముచే అత్వముకలిగి, 'వండం కుము, వండంకుఁడు' మున్నగు నపరూపపరంపర లావిర్భవించును.

ఇటులే వ్యతిరేక క్త్వార్థకమగు 'కజీ'వర్ణకమును (క్రియా-39) "భావ క్త్వార్థఇ కజ్ క్రమాత్" అని విధించెను.

దీనివలన 'వండంక' 'పండంక' అనునిట్టి కురూపములు కుప్పలు తిప్పలుగా నుప్పతిల్లును. అపరిశీలనానువాదములలో నిట్టియనర్థములు తప్పవు.

**33.** సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాష ననుప్ర యు_క్తంబులగు. ౩౩.

వండుమ, వండుమా ; వండుమి, వండుమీ ; వండుఁడ, వండుఁడా ; వండుఁడి, వండుఁడీ.

అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ, అమ్మ, అయ్య ఇత్యాదులదాదులు.

**34.** ఎదాదు లనుప్రయు_క్తంబులగునపుడు ముజ్జునకు వుజీ రుజీ యగు. ౩౪.

వినవె, వినవే ; వినరె, వినరే ; వినకువె, వినకువే ; వినకురె, వినకురే.

పయివానిలోఁ దొలిసూత్రమున 'సంప్రార్థనంబున' అని ఏకవచనాంత పాఠము పెక్కుప్రతులందుఁ గాననగును. అది ప్రమాదపతితము.

ప్రథమముద్రణమున (1858) బహువచనాంతపాఠమే కలదు. బహు వచనమే సూత్రకారోద్దిష్టము. ఏలయన

భావప్రార్థనము, వ్యతిరేకప్రార్థనము అనురెండువిధముల ప్రార్థనములను సూచించుటకయి సూత్రక_ర్త బహువచనమునే నిర్దేశించియుండును. కనుకనే

రెండవసూత్రమున (34) అనుప్రయుక్తములగు ఎ, ఏ లను లక్ష్యములలో తుదిని వ్యతిరేక ప్రార్థనోదాహరణములనుగూడ నాలుగిటిని జూపియుండెను.

కావున బహువచనాంతపాఠమే సూరిసమ్మతమని భావిముద్రాపకులు గుర్తింతురుగాక !

ఏదాద్యనుప్రయోగములలనే 'ఆ'కారానుప్రయోగమునుఁ గూడ 'నామొఱ యాలకింపవా !' 'ఆలకింపరా !' 'నన్ను రక్షింపవా !' 'రక్షింపరా !' మున్నగు చోట్ల వుజీ, రుజీ శిష్టవ్యవహారమున రూఢములయి కానవచ్చుచున్నవి. ప్రాచీన కవిప్రయోగములు గోచరింపక కావలయును సూరి యిట్టివానిని సూచింపకుండెను.

ప్రయోగములు లేకుండునాయని పరికింపుచుందము.

వినకుమె, వినకురె ఇత్యాదులందు మజీ జీత్తుగావున ధాతూకారమునకు అత్వము ప్రాప్తించినది. కువర్ణోకారము ధాతుస్థము కాకుండుటచే దానికి జీత్తు (వుజీ, రుజీ) పరమయినను అత్వము రాకుండుట గమనింపుఁడు.

**35.** టువర్ణకంబు భావంబునందగు. ఇవి.

భావంబనఁగా ధాత్వర్థంబు.
వందుట, పండుట, వినుట, కనుట.

డుజ్, రు, వు, రు, ను, ము అను సమాపకక్రియా ప్రత్యయములఁ దప్ప, ధాతువునకు విధింపఁబడిన తక్కిన ప్రత్యయములన్నిటికిని కృత్తులనియే పేరు (కృదంత-1).

ఈ టువర్ణకము మొదలు వరుసగాఁ గొన్ని ప్రత్యయములు విధింపఁబడును.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | టు | వందుట | భావార్థకము | విశేష్యములు. |
| 2. | మిజీ | వందమి | వ్యతిరేక భావార్థకము | |
| 3. | ఇ | వంది | క్త్వార్థకము | అవ్యయములు. |
| 4. | కజీ | వందక | వ్యతిరేక క్త్వార్థకము | |
| 5. | ముజీ | వందన్ | తుమున్నాద్యర్థకము | |
| 6. | నన్ | వందినన్ | చేదాద్యర్థకము | |
| 7. | డున్ | వందుడున్ | అనంతర్యార్థకము | |
| 8. | మున్ | వందుమున్ | శత్రర్థకము | |

| | | | | |
|---|---|---|---|---|
| 9. | ఎడి | వండెడి | తృవర్ణకార్థకము | విశేషణములు: ఇవి సత్త్వాభిధానం బనందగు. — చూ. క్రియా-46. సత్త్వము = ద్రవ్యము: ఇవి ద్రవ్యములకే విశేషణములగును. క్రియలకుఁ గావు. |
| 10. | ఎడు | వండెడు | తృవర్ణకార్థకము | |
| 11. | ఉన్న | వండుచున్న | వర్తమానార్థకము | |
| 12. | కలజీ | వండఁగల | భవిష్యదర్థకము | |
| 13. | న | వండిన | భూతార్థకము | |
| 14. | నిజీ | వండని | వ్యతిరేక తృవర్ణకార్థకము | |

ఇవియెల్లను కృత్తులే.

కృదంతపరిచ్ఛేదము ప్రత్యేకముగ నుండఁగా వీనినన్నిటిని ఆ పరిచ్ఛేదమున విధింపక యీ క్రియాపరిచ్ఛేదమునఁ జేర్పనేల? అనుప్రశ్న కలుగ వచ్చును.

ఇటఁజేర్చుటకు హేతువు గలదు.

కృత్తులు రెండువిధములు. ప్రతిధాతువునకు వచ్చునవి కొన్ని; కొన్ని ధాతువులకే వచ్చునవి కొన్ని.

ఈ విభాగమును గమనించి సర్వధాతుసాధారణములయినవానినెల్ల నొక వర్గముగా నేర్పఱిచి యీ క్రియాపరిచ్ఛేదమున నిర్దేశించెను.

కతిపయధాతువులకుమాత్రమే వచ్చు విశేషకృత్తులనెల్ల వర్గీకరించి ప్రత్యేకముగా కృదంతపరిచ్ఛేదమున నిర్దేశించెను. రచనాప్రణాళికలో నిట్టి వర్గీకరణవిధానము వైశద్యసాధనము.

అంతమాత్రమెగాక సాధారణవిశేషకృత్తులను విభజించి వేఱువేఱు పరిచ్ఛేదములలోఁ జేర్చుటకు మఱొకకారణముగూడఁ గలదు. అది ప్రక్రియా విషయకము. ఎట్టిదన

కృదంతపరిచ్ఛేదమందలి కృత్తులకు సంబంధించిన క, గ, త, ప, వ, ఇమి అనునవి పరమగుచో క, గ, చ, య, వ లకు లోపము కలుగును (కృదంత-2). ఈ టవర్ణకాది కృత్తులుగూడ, కృత్పరిచ్ఛేదముననే చేర్పఁబడిన యెడ కజీ, కలజీ వర్ణకములు పరమగునపుడుగూడ తాఁకక, త్రాగక, ఏఁచక, చేయక, పిలువక; తాఁకఁగల, త్రాగఁగల, ఏఁచఁగల, చేయఁగల, పిలువఁగల ఇత్యాదులందు క, గ, చ, య, వలు లోపించి యసాధురూపపరంపర సంభవించును. ఆ ప్రమాదము తొలఁగుటకయి కజీ కలజీలను క్రియాపరిచ్ఛేదమునఁ జేర్పక యెట్లును దప్పదు. తప్పనినాఁడు వానితోపాటు తత్సజాతీ

యములగు సాధారణప్రవృత్తులనెల్ల నొక్కయెడనే క్రియాపరిచ్ఛేదమునునే చేర్చుట ఉచితము. అను కుశలపరిశీలనముతో వృత్తులు వేఱువేఱుగా లక్షణశాస్త్రములందు ప్రదర్శితములయినవి. మనకింక శంకింపం బనిలేదు.

**36.** కటి వర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు. ఉదా.

> వండకమునుపు : వండుటకుమునుపు ; చేయకమునుపు : చేయుటకుమునుపు.
>
> మునుపు, ముందు, మున్ను, తొల్లి.

పురార్థశబ్దముల సంబంధములేని చోటులం గూడ 'చెప్పకచెప్పుదు.' 'చేయకతీఱదు' ఇత్యాదులందు భావార్థమున కటివర్ణకము గానవచ్చును. దాని నీసూత్రమున సంగ్రహింపమికి హేతువు సమాలోచనీయము.

**37.** వ్యతిరేకభావంబున మిఁజీయగు. ఉదా.

> వ్యతిరేక విశిష్ట క్రియాభిధాయి ధాతువునకు మిటియగు.
>
> వండమి, పండమి.

**38.** సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకంబగు. ఉదా.

> ఏకాశ్రయంబులగుక్రియలలోపల నెయ్యది పూర్వకాలికంబగుం దద్వాచియగుధాతువున కివర్ణకంబగు. ఇదియె క్త్వార్థంబు నాఁబడు: వండి, పండి, విని, కని.
>
> సమానకర్తృకంబులనక సమానాశ్రయంబులనుటం జేసి చైత్రుని చేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధంబయ్యె.

ఈ 'ఇ' ప్రత్యయమునకు, ప్రసిద్ధమును ప్రచురమునునయినది క్త్వార్థము. దీనికి హేత్వర్థమును గలదని నిర్దేశించుచు ప్రౌ-వ్యా-కర్త 'రాహు కంఠముదెగి దేహము ధరణిఁ బడియె' మున్నగు కొన్నిప్రయోగములు చూపి యుండెను.

క్త్వాప్రత్యయమునకు హేత్వర్థము సంస్కృతమునఁగూడ నరుదుగాఁ గన్పట్టును.

"కిం'కృత్వా' సుకృతం భవేత్?" —భారత-ఆది-అధ్యా-120-శ్లో-13.

"శ్రీశైలశిఖరం 'దృష్ట్వా' పునర్జన్మ నవిద్యతే" —(?)

"స్మర 'సంస్మృత్య' న శాన్తి రస్తిమే" —కుమారసంభవ-సర్గ4-శ్లో-17.

ఇట్టితావులందు హేత్వర్థమే కుదురుపడుచుండును.

ఇప్రత్యయమునకేగాక వ్యతిరేకక్త్వార్థకమగు కజివర్ణకమునకును హేత్వర్థము గలదు :

తండ్రి చదివింపక బాలుఁడు మూర్ఖుఁడయ్యెను. వ్యాకరణము తెలియక వ్రాఁతతప్పు లధికమయ్యెను. ఇత్యాదులందు హేత్వర్థమే గోచరించును.

ఇదియగాక ఇవర్ణమునకు, ప్రభృత్యర్థమును గలదు.

'శిశువు పుట్టి రెండునెలలయ్యెను.'

'ఏతేర బొరకొని యెన్నియో నాళ్ళయ్యె' —కళాపూర్ణో-2-31.

'ఏనేఁడు లగుచెంచె నర్జునుండేగి' —భారత-అరణ్య-4-2.

ఇత్యాదులందు 'పుట్టుట మొదలుకొని' ఇత్యాదిగా ప్రభృత్యర్థమే స్ఫురించి సమన్వయయోగ్యమగును.

'నీవంటివానిని విని కని యెఱుంగను.' —మిత్రలాభము.

'....ఎన్నఁడున్ మఱి యిట్టివేఁగియెఱుంగవు' —కళాపూర్ణో-3-139.

'...ఏనెన్నఁ డుఁడొల్లి చూచియెఱుఁగను నిన్నున్'—భారత-ఆది-4-99.

"బాలుఁడు సుకుమారుఁడు పె

ద్కాలములం జొచ్చియెఱుఁగఁడనక మొనసొరం

జాలుదు చొరుమని పనిచితి

నేలా నన్నానదోస మెఱుఁగఁగనిచ్చున్". —భారత-ద్రోణ-2-141.

ఇత్యాదులందు కేవలభావార్థమే స్ఫురించును.

సమానకర్తృకములు, సమానాశ్రయములు అనువానికిఁగల భేదము గమనింపఁదగినది.

సమానకర్తృకములనఁగా, ఏకకర్తృకములు = ఒకేకర్తగల క్రియలు.

సమానాశ్రయములనఁగా, ఏకాశ్రయములు = కర్తృరూపమునఁగాని,కర్మరూపమునఁగాని, ఒకేవ్యక్తినాశ్రయించిన క్రియలు.

'రాముఁడు లంకకేగి రావణుని బరిమార్చెను.' ఇట ఏగుట, పరిమార్చుట అనుక్రియలు రెండిటికిని కర్త రాముఁడేగాన ఆ రెండుక్రియలును ఏకకర్తృకములు.

'రామునిచే రావణుఁడు కొట్టంబడి మడిసె.' ఇట కొట్టినవాఁడు రాముఁడు మడిసినవాఁడు రావణుఁడు. కాఁగా, కొట్టు, మడియు అను క్రియలు భిన్నకర్తృకములు.

ఇవి సమానకర్తృకములు కావు. కాని సమానాశ్రయములు కావచ్చును; ఎట్లన :

కొట్టు అను క్రియకు కర్మ రావణుఁడు.

మడియు అను క్రియకు కర్త రావణుఁడు.

'కొట్టు' అనుక్రియ తనకు కర్మగా, రావణు నాశ్రయించియున్నది. 'మడియు' అనుక్రియ తనకు కర్తగా రావణునే ఆశ్రయించియున్నది. ఇట్లు ఈ రెండుక్రియలును సమానాశ్రయములగుట పొసఁగుచున్నది. కావుననే 'ఇ' ప్రత్యయము కలిగినది.

వాక్యములోని క్రియలు రెండును సమానకర్తృకములే కావలయునని పాణినీయానుసారముగ సూత్రించినచో 'కొట్టఁబడి మడిసె' అనుచో 'ఇ' వర్ణకము రాకపోవును.

**39.** కటీ వ్యతిరేకక్త్వార్థంబునందగు. ౩౯.

వండక, పండక, కొట్టక, తిట్టక.

**40.** తుమర్థ భావలక్షణంబులందు నుటీయగు. ౪౦.

భావలక్షణంబనా నన్యక్రియకు లక్షణభూతంబగుక్రియ.

తుమర్థంబందును భావలక్షణంబునందును ధాతువునకు నుటీ వర్ణకంబగు.

తుమర్థంబు: చైత్రుండు వండను బోయెను — పాకక్రియార్థము పోయెనని యర్థము.

భావలక్షణము: చైత్రుండు వండ నతిథివచ్చెను — ఇచట వంట లక్షణము వచ్చుట లక్ష్యము.

పయిసూత్రములు రెండింటను వండక, వండన్ అనువానిలో ధాతూకారమునకు అత్వమును (20 వ సూ) సంపాదించుటకై కటీ, నుటీ అనువానికి జీత్వము ఘటింపఁబడినది.

వండక, వండన్ అనునవి సమాపకక్రియనుబట్టి పూర్వకాలికములే యగుచుండును. అయినను వీనిలో 'భూతంబునం దిగాగమంబగు' (క్రియా-17) అనుసూత్రముచే ఇగాగమము ప్రవర్తించినచో అత్త్వముకొఱకయి ఘటింపఁబడిన జీత్త్వము నిష్ఫలమగును గావున నిట్టిచోట్ల ఇగాగమము ప్రవర్తింపదని తలంపవలయును.

**41.** చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణకంబు ద్రుతాంతంబగు. ౪౧.

వానలుగురిసినం బంటలు వండును; వాఁడు రమ్మనినఁ బోయితిని.

చేత్ ( = అయినచో) అనునర్థమునందును, వృత్తమయిన ( = జరిగిన = భూతకాలికమగు) భావలక్షణార్థమునందును 'నన్' అనుప్రత్యయము వచ్చు ననిభావము.

పయివాక్యములలో ఐరియు, అను అనుక్రియలు భూతకాలికములు గాన ఇగాగమము కలిగినది (క్రియా-17.).

భావలక్షణమనఁగా నొకక్రియను దెలుపుచున్న యింకొకక్రియ : 'చైత్రుండు వండ నతిథివచ్చెను'; అతిథి యెపుడువచ్చెను? చైత్రుండు వండఁగా వచ్చెను. ఇట 'వచ్చుట' అనుక్రియాసందర్భమును, వండుట అను క్రియ తెలుపుచున్నది.

వండుట : లక్షణక్రియ. వచ్చుట : లక్ష్యక్రియ. మొదటిది జ్ఞాపకక్రియ, రెండవది జ్ఞాప్యక్రియ. ఇట్టిభావలక్షణమున నుజివర్ణకము కలిగి (క్రియా-40) 'వండన్' అనురూపమేర్పడును. ఈలక్షణక్రియాసందర్భము వృత్తమయినచో, అనఁగా భూతకాలికమయినచో, ఈసూత్రముచే 'నన్'వర్ణకము వచ్చును. 'వండినన్' అనురూపమేర్పడును.

సూత్రమునందలి రెండర్థములకును రెండువాక్యములను వేఱువేఱు లక్ష్యములుగా సూత్రకర్త చూపియుండెను. ఇంతియగాక నవర్ణకమును బేర్కొన పలసినతావులందు సూరి దీనిని, చేదర్థకమనక, చేదాద్యర్థమని, ఆదిశబ్దమును జేర్చియే వ్యవహరించి, దీనికర్థములు రెండునుఁడీయని సూచించుచునేయుండెను.

శత్రు తు మానంతర్య చేదాద్యర్థకంబులు. —సంజ్ఞా-12.

చేదాద్యర్థ నాంతంబయిన యుండున కున్నాదేశంబు విభాషనగు.

—క్రియా-57.

ప్రకృతసూత్రమునకు లక్ష్యములు రెండిటి నిచ్చుటను గమనింపక, రెండవలక్ష్యమున చేదర్థస్ఫురణము లేశమయిన లేకుండుటను బరిశీలింపక, చేదాద్యర్థకమని సర్వత్ర ఆదిపదసహితమగు సూత్రకారవ్యవహారమును గుర్తింపక, 'చేదర్థమునమున్నట్టి భావలక్షణార్థమ'ని సూత్రమున నొక్కయర్థమే నిర్దేశింపఁబడినట్లు భ్రాంతిపడి గుప్తార్థప్రకాశికాకారులు ప్రకృతసూత్రమును సమన్వయించియుండిరి. ఆసమన్వయము లక్ష్యములకు విరుద్ధము. లక్షణమునకు నసమ్మతము. మనకు నుపేక్షణీయము.

ఇట 'నవర్ణకంబు ద్రుతాంతంబు' అనుటకుమాఱు 'నన్'వర్ణకమనరాదాయని తోఁపవచ్చును. కాని, యిటమీఁద (46 వ సూ.) క్త్వవదర్థమున వేఱొకనవర్ణకము విధింపఁబడును. దానికిని, దీనికిని 'పద్వాదుల నవర్ణకంబున కత్వంబు'మున్నగు కొన్నికార్యములు కలిపి విధింపవలసియున్నది. కావున, ఈ రెండిటికిని ఏకరూపత సంపాదించుటకయి దీనినిగూడ నవర్ణకముగనే పేర్కొని ద్రుతాంతత్వమును వేఱుగా నిర్దేశించినటు లూహింపఁదగును.

ఇందులకయి యిట 'సువర్ణకంబు ద్రుతాంతంబు' అని సువర్ణకమును, ద్రుతమును, విడివిడిగా నిర్దేశించి, యిట్టి ప్రయోజనము లేకున్నను ఆనుపూర్వ్యమునకయి యనంతరసూత్రమునందును 'మువర్ణకంబు ద్రుతాంతంబు' 'మువర్ణకంబు ద్రుతాంతంబు' అనువచనారీతిని యుపలంబించినట్లును నూహింపనగును.

**42.** ఆనంతర్యంబున మువర్ణకంబు ద్రుతాంతంబగు. ఉ.ఎ.

జాబిలి తోఁతెంచుచుం గువలయంబులు వికసిల్లె.

ఆనంతర్యమున 'ము'వర్ణకము కలుగును. చంద్రుఁడుదయించిన యనంతరము కలువలు వికసిల్లునుగావున తోఁతెంచుధాతువునకు 'ము'వర్ణకము ప్రాప్తించినది.

ఈయిరుక్రియలు రెంటిలో తోఁతెంచుట మొదటిది ; వికసిల్లుట రెండవది. వీనిలో తోఁతెంచుట భూతకాలికముగావున దానికి 'భూతంబునం దిగాగమంబగు'ననుసూత్రముచే 'వానలు గురిసినం బంటలు పండును' ఇత్యాదులందువలె 'ఇ'వర్ణము రావలయునే! ఏలరాకున్నది? అని యిట నొకకుశల ప్రశ్న ఉదయింపవచ్చును.

సూత్రమునందలి 'ఆనంతర్య'శబ్దమునందే దానిసమాధానము దాఁగియున్నది. అంతరమనఁగా రెండిటినడుమను నుండు కాలవ్యవధి. అంతరము లేనిది అనంతరము. అనంతరమే ఆనంతర్యము.

రెండుక్రియలనడుమ తెప్పపాటుకాలమయిన వ్యవధిలేదనునర్థమును బోధించుటకుమాత్రమే భాషలోఁ దొలుత నిష్పన్నమయిన యీ'అనంతర' శబ్దము కాలక్రమమున అచిరము వీడి 'పిమ్మట, పిదప, తరువాత' అను సాధారణార్థమును బోధింపఁజొచ్చినది. 'వచ్చినయనంతరము పదిదినముల కగపడెను'అని మనము ప్రయోగింతుము. పదిదినముల వ్యవధియున్నదని మనమే వక్కాణించుచు స్థూలదృష్టితో 'అనంతర' శబ్దమునే యుపయోగింతుము. అర్థవిరోధము గలదే యని గ్రహింపము. గ్రహించినను సంకోచింపము. సంకోచింపఁబనియులేదు. వ్యవహారమున శబ్దశక్తులు మాఱుచుండుట సహజము. సాధారణములు విశేషములగును. విశేషములు సాధారణములగును. అది భాషాపరిణామస్వభావము.

ఈసూత్రమునందలి యానంతర్య శబ్దమును నట్టి స్థూలదృష్టితోఁ జూడరాదు. 'అంతరము లేకుండుట'అని దాని తొలుతటియర్థమును గ్రహింపవలయును.

దూరముపరికించినచో నిట్టితావులందు రెండుక్రియలు జరిగినపుడు, ఆరెండిటికిని నడుమ ఏస్వల్పమయినను వ్యవధి యుండకమానదు. కాని

ఆ వ్యవధి మనకు గోచరించునదిగా నుండదు. ఆ కార్యములు అసంలక్ష్య క్రమములన్నమాట. అనఁగా వానిపౌర్వాపర్యమును గుర్తుపట్టఁజాలమని భావము. అట్టియెడలనే 'డు'వర్ణకము కలుగునని సూత్రకర్తృహృదయము.

ఇట్టియీయానంతర్యార్థము బాలురకు నిశ్శంకముగా సూటిగా స్ఫురించుట కయి సుదూరము పర్యాలోచించి 'జాబిలి తోఁచెంచుడుంగువలయంబులు వికసిల్లె' అని లక్షణమునకునత్యంతసంగతమగుచు, నాహ్లాదకరమగుచు, మచ్చటగొలుపు చల్లని లక్ష్యమునుజూపుట మెచ్చుకొనఁదగినది.

చంద్రుఁడుదయించుటకును గలువలవికాసమునకును నడుమ కాలవ్యవధి వస్తుతః ఏలేశమో యున్నను మనకది గోచరింపదు. కావున వ్యవధి లేనేలేదని తలంతుము.

కాఁగా, నిచటిక్రియలు రెండిటిలో, ఇది పూర్వము, అదిపరము అను వివేచనమే పొసఁగదు గావున, భూతము, భావి యనుప్రసంగమే లేకుండుటచే 'భూతంబునం దిగాగమంబగు' అనుసూత్రమునకు నిటఁ బ్రసక్తియే లేదని పయి కుశలప్రశ్నకు నుత్తరము.

**43.** చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబు నందగు. ౪౩.

> చూచుచుం బోవుచున్నాఁడు, చూచుచుం బోయెను, చూచుచుం బోవఁగలఁడు.

శత్రర్థము = శతృప్రత్యయార్థము = వర్తమానార్థము.

**44.** తృవర్ణకార్థంబునం దెడి యెడు వన్నియలగు. ౪౪.

> ప్రహరించెడివాఁడు, ప్రహరించెడువాఁడు. ప్రహర్తయని యర్థము.

తృవర్ణకార్థము = కర్త్రర్థము = తద్ధర్మార్థము.

**45.** వానికి లోపంబు బహుళంబుగా నగు. ౪౫.

> ప్రహరించువాఁడు : ప్రహర్తయనియర్థము.

**46.** ఉన్న కలజీ నవర్ణకంబులు భవ ద్భావి శతృ క్తవదర్థంబు లందగు. ౪౬.

> ఉన్నవర్ణకంబు వర్తమానార్థకశత్రర్థంబునందగు.
> కలజీవర్ణకంబు భవిష్యదర్థకశత్రర్థంబునందగు.

న వర్ణకంబు క్త్వవదర్థంబునందగు.

ఇవి సత్త్వాభిధానంబునందగునని యెఱుంగునది. సుబంత వాచ్యంబు సత్త్వంబు నాఁబడు.

వండుచున్నవాఁడు, వండఁగలవాఁడు, వండినవాఁడు.

సత్త్వమనఁగా ద్రవ్యము. ఈ ధాతుజవిశేషణములు ఏదేనొకద్రవ్యము యొక్క విశేషమును దెలుపుచుండును. కావున సత్త్వాభిధాయకములు.

క్త్వవదర్థము = భూతార్థము.

**47.** వ్యతిరేక తృవర్ణకార్థంబున నిజీయగు. ఇం.

వండనివాఁడు.

ఎడిప్రభృతి వర్ణకాంతంబు లేడును ధాతుజవిశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు.

ప్రహరించెడి, ప్రహరించెడు (44), ప్రహరించు (45), వండుచున్న, వండఁగల, వండిన (46), వండని (47) ఇవియేడును ధాతుజవిశేషణములు.

ఇందు తద్ధర్మార్థకములగు మొదటి మూఁడింటను ప్రత్యయములు ఎడి యెడులు తృవర్ణకార్థమున విధింపఁబడుటచే (సూ. 44, 45) వీనికి సమానమగు తృప్రత్యయాంత సంస్కృతరూపమును 'ప్రహర్త' అనుదానిని జూపుటకు వీలుగా వీనియొద్ద 'ప్రహరించు' అను సంస్కృతధాతువు గ్రహింపఁబడినది. తక్కినవానిలో నట్టి యావశ్యకత లేకుండుటచే పరిచ్ఛేదమున నంతటను సాధారణముగాఁ జూపఁబడిన వండుధాతురూపములే చూపఁబడినట్లు గమనింపఁదగును.

**48.** లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును లాఁతికిం గర్తయందునగు. ఇలా.

సకర్మకంబునాఁ గర్మాకాంక్షోత్థాపకంబు.

అకర్మకంబునాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు.

**49.** పడుఙ్యనుబంధంబు కర్మంబునందగు. ఇకా.

కొట్టఁబడుచున్నాఁడు, కొట్టఁబడుచున్నది ; కొట్టఁబడుట, కొట్టఁబడనివాఁడు.

ఉదాహరణములలో మొదటిది : సమాపకక్రియ, వర్తమాన ప్రథమ పురుషైకవచనము. రెండవది : అసమాపకక్రియ (కొట్టఁబడుచున్ + ఉన్నది) శత్రర్థకము. మూఁడవది : విశేష్యము, భావార్థకము. నాలుగవది : విశేషణము, వ్యతిరేక తృవర్ణకార్థము (తద్ధర్మార్థకము).

ధాతుజన్యరూపములలో జాతికినొక్కొక్కటిగా నుదాహరణములు.

ఇచట విధింపఁబడిన 'పడు' అనునది ధాతురూపమేగాన, అది యింకొక దానికి ననుబంధముగా వచ్చినను, తాను ధాతువు కాకపోదు. కొట్టఁబడు అనుచో కొట్టు, పడు అనునవి విడివిడిగను ధాతువులే. విశిష్టమును (మొత్తమును) ధాతువే.

ఇటులే 'వండుకొను' ఇత్యాదులందును గ్రహించునది.

—చూ. క్రియా-53.

అనుబంధసహితమగు మొత్తమునకువలెనే, అనుబంధమగు పడు అనుదానికిఁగూడ ధాతుత్వము లేనియెడ ఏకస్వర ద్విస్వర ధాతువులకు మాత్రమే రాఁదగిన 'ఇయుడాగమము' (క్రియా-50) చతుస్స్వరమగు 'వండఁబడు' అనుదానికి రానేరదు, వండఁబడియెను అనురూపము కానేరదు.

ఇయుడాగమసహితరూపములు సుప్రసిద్ధములు. సూత్రకార ప్రదర్శితములును. —చూ. సకర్మకాకర్మక రూపపట్టికలు.

**50.** గురువిరహితంబులయి యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు. ౨౦.

> ఏకస్వరధాతు ద్విస్వరధాతువులమీఁది యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాషనగు.
>
> గురుమంతంబగు ధాతువునకును, యాంతంబగు ధాతువునకును మీఁది యించుగ్వక్రంబుల కియుడాగమంబు రాదు.
>
> భుజ్ + ఇయ్ + ఇంచు : భుజియించు. పక్షంబున : భుజించు.
>
> గుణ + ఇయ్ + ఇంచు : గుణియించు, గుణించు.
>
> ఇంచుగ్వ్యవధానంబునంజేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుఁగునది.
>
> యాచ్, అర్థ ఇత్యాదులు గురుమంతంబులు ; వ్యయ — ఇది యాంతము : యాచించు, అర్థించు, వ్యయించు.
>
> జి + ఇంచు అనుచో నిత్యంబగుటంజేసి యయుగాగమంబు

రాఁగా యాంతంబగుటంజేసి యియుడాగమంబులేదని యెఱుంగు
నది — కృతాకృతప్రసంగి నిత్యంబనాఁబడు.

నగు + ఇయ్ + ఇంచు : నగియించు, నగించు.

నగు + ఇయ్ + ఎను : నగియెను, నగెను.

పడు + ఇయ్ + ఎను : పడియెను, పడెను. ఇత్యాదులెఱుంగునది.

ఒకలక్ష్యమునఁ బ్రవర్తించుటకు నొక్కొకచోట రెండుసూత్రములకు విప్రతిషేధము (తుల్యబలవిరోధము = పోటీ) ఏర్పడవచ్చును. అట్టిచోటులందు ఆ తగవు పరిష్కరించుటకు వ్యాకరణమున నొకనిబంధనము గలదు. ఎట్టిదన :

సమానబలముగల యాసూత్రములలో రెండవసూత్రము ప్రవర్తింపని దశయందును, ప్రవర్తించినదశయందును, రెండుపక్షములందును, ఏ సూత్రము నకు ప్రాప్తియుండునో అది కృతాకృతప్రసంగి = నిత్యము. ఇట్టినిత్యకార్యము రెండిటిలో ప్రబలము. ఏలయన :

పూర్వముకంటె పరమును, పరముకంటె నిత్యమును, నిత్యముకంటె అంతరంగమును, అంతరంగముకంటె అపవాదమును ప్రబలములని

“పరనిత్యాన్తరఙ్గాపవాదానా ముత్తరోత్తరం బలీయః”

అనుపరిభాష నియమించుచుండును.

ప్రకృతమున ‘జి + ఇంచు’ అనుచోట ఇయుడాగమము వచ్చినను అది వచ్చుట ఇంచుక్కునకుఁ గావున యదాగమన్యాయముచే ఇయుట్టు ఇంచుక్కుతో మేళవించి దానికి నవయవమగునుగాని విడిగా నుండదు. అపుడు ‘ఇయించు’ అనుమొత్తమునకే ఇంచుక్కను వ్యవహారముండును. ‘జి + ఇయించు’ అని యేర్పడును. ఈ స్థితిలో ‘ఇయించు’ పరమయినను ఇంచుక్కు పరమయినటులే గావున అయుక్కు ప్రవర్తించుట కవకాశము గలదు.

ఇయుట్టు చేయనపుడు, అనఁగా ‘జి + ఇంచు’ అనుస్థితిలో అయుక్కునకు అడ్డంకి లేశమును లేదు.

ఈ రీతిని కృతాకృతపక్షములు రెండిటియందును ప్రసక్తి గలదిగావున అయుక్కు నిత్యమగుటచే అది ప్రబలము.

ఇయుట్టునకు ఇట్టినిత్యత సంభవింపదు. ఏమన :

‘జి + ఇంచు’ అనుదశలో అయుక్కు ప్రవర్తించినచో అది ధాతువు నందలి ఇకారమునకు అవయవమయి, ‘జయ్ + ఇంచు’ అని ఏర్పడును. అపుడు ధాతువు యకారాంతమగుటచే, యాంతభిన్నములకు విధింపఁబడిన ఇయుట్టు ప్రవర్తించుటకు నవకాశమే యుండదు.

కావున నిట్లు నిత్యత లేకుండుటచే దుర్బలమై ఇయుట్టు తొలఁగిపోవును. ప్రబలమై అయుక్కే ప్రవర్తించును. జయించు అనురూపము సిద్ధించును.

**51.** పడ్వాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాషనగు. ౫౧.

పడ్డ, పడిన ; పడ్డను, పడినను.

పడు, ఇడు, చెడు, తగు, అను, కను, కొను, తిను, మను, విను, చను : ఇవి పడ్వాదులు.

అత్వము అంతాదేశముగ రావలసియున్నను అకారమునకు అకారము వచ్చుట వ్యర్థముగావున, అది నవర్ణకమునకంతకును సర్వాదేశమయినది.

నవర్ణకములు రెండు గలవు. i. క్త్వవదర్థకము (46వ సూ), ii. చేదాద్యర్థకము (41వ సూ). రెండిటికి రెండుదాహరణములు.

**52.** క్రియాఫలంబు కర్తృగామియగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తంబగు. ౫౨.

ఇదియె యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు.

వందుకొనుచున్నాఁడు.

**53.** కొనుధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగానగు. ౫౩.

వందికొనియె, వందుకొనియె.

బహుళంబనుటచే యాంతంబునకు నిత్యంబు : చేసికొనియె.

పయిసూత్రములు రెండింటను 'కొను' అనిమాత్రమే యనక 'కొను ధాతువు' అని ధాతుపదమునుగూడఁ జేర్చుట గమనింపఁదగినది.

అనుప్రయుక్తమేయయినను 'కొను' అనుదానికి ధాతుత్వము గలదు సుమీయని హెచ్చరించుటకు ధాతుపదము చేర్పఁబడినది.

ఒకదానికనుప్రయుక్తమగుచున్నను దీనికిఁగూడఁ బ్రత్యేకత యావశ్యకము. అట్లు దీనికిఁ బ్రత్యేకత లేక 'వందుకొను' అనుమొత్తమునకు మాత్రమే ధాతుత్వమున్నచో నది చతుస్స్వరమగునుగాన, ఏకస్వర ద్విస్వరములకు మాత్రమే ప్రాప్తించు ఇయుదాగమము (క్రియా-50) ఇచట రాఁజాలదు. 'వందుకొనియె' మున్నగురూపములు సిద్ధింపనేరవు.

౫౩సూత్రమున ఇగాగమమునకు నుదాహరణముగ 'వందికొను' అన్నంతమాత్రమే చాలియున్నను 'వందికొనియె'అని సమాపకక్రియారూపము జూపుట 'వందుకొను' అనుమొత్తమునకేగాక వందు – కొను అను

వానికి విడివిడిగాఁగూడ ధాతుత్వమున్నదనియు 'కొను'అనునది ద్విస్వరము కావున ఇయుడాగమము కలిగినదనియు సూచించుటయేయని యూహింప వలయును.

మఱియు 'కొను'అనుదానికిఁ బ్రత్యేకత యున్నపక్షమునసే పండు కొనుఁడి: 'పండుకొండి' అనుచో ఒకారము నుడితొలిహ్రస్వమై ఖండబిందువు నడ్డగించును. అట్లుగానిచో సర్ధబిందువు దుర్నివారమయి పేరుపండు'కొఁడి' మున్నగురీతిని దురూపములుత్పత్తిల్లును.

ఇట్టిసూక్ష్మదృష్టి యీయొక్కతావుననే గాదు. తెంచుధాతు పర్యాయముల కనుప్రయుక్తమయిన రూపములందుఁగూడ నిరూపింపఁడు (క్రియా-113). అగుదెంచు....అగుదెండు, ఏగుదెంచు .... ఏగుదెండు ఇత్యాదులందు అర్ధ బిందుఘటితరూపములను వారించుటకే అనుప్రయుక్తమగు'తెంచు'ను ధాతు వుగానిర్దేశించి దానికి ప్రత్యేకతను గల్పించియుండెను. అచట 'తెంచు' ప్రత్యేక ధాతువయినపక్షముననే 'ఎ'కారము 'నుడి' తొలిహ్రస్వమగును. అయిన పక్షముననే ఖండబిందువు నివారితమగును.

**54.** ఇకారవక్రంబు లుక్తంబులంతటివి పరంబులగుచో యాకు సకారంబగు. ౫౪.

> చేయు....చేసిరి, చేసి, చేసికొను, చేసెను, చేసెడిని ఇత్యాదు
> లెఱుంగునది.

ఇకారవక్రములు ఉక్తంబులందలివే కావలయును. అనఁగా ఈసూత్రము నకుముందు చెప్పఁబడినవే కావలయును. ఇటమీఁద, కృదంతపరిచ్ఛేదమునఁ గాని, యీక్రియాపరిచ్ఛేదముననేగాని చెప్పఁబడువానిని గ్రహింపరాదు. అట్లు గ్రహించినచో అరయు + ఇక = అరయిక (కృదంత-12), చేయు + ఇ = చేయి (కృదంత-22) ఇత్యాదులందు యకారమునకు సకారము రావలసి వచ్చును. ఇటులే చేయు + ఇంచు = చేయించు (క్రియా-70) ఇత్యాదులందును యాకు సకారము ప్రసక్తమగును.

ఆచిక్కులు రాకుండుటకే యింతకుముందు చెప్పఁబడినవి యనునర్థ మును బోధించుటకయి భూతార్థక 'క్త'ప్రత్యయాంతముగ 'ఉక్త'శబ్దము సూత్ర మున ప్రయుక్తమయియుండుట గుర్తింపఁదగినది.

ఈసూత్రము ఇప్పుడున్నటులు ఈ 54వ సూత్రముగా నుండక వేఱొక చోట నున్నచో పయిని జూపినరూపములు సిద్ధింపవు. అనఁగా సూరి రచనలో సూత్రమేగాక సూత్రస్థానమునయితము రూపసాధకమని గమనింపవలయును.

సూత్రమున 'యాకు సకార'మనుచో యకారసకారములను జాతిపరములుగా గ్రహింపవలయును. ఒక్కయకారమునకే ఒక్కసకారమే వచ్చుట సూత్రతాత్పర్యముకాదు. డయ్యు — డస్సి, వ్రయ్యు — వ్రస్సి ఇత్యాదులందు రెండుయకారములకు రెండుసకారములు కలుగును. స్థానికిని, ఆదేశమునకును ఆనురూప్యము సముచితముగదా!

ఇట్టిపరిపాటి యీప్రణాళికలో మఱికొన్నితావులందును గన్పట్టును.

పిలుచు + ఇంచు = పిలిపించు ; మెచ్చు + ఇంచు = మెప్పించు.
—క్రియా-87.

పిలుచు + దురు = పిలుతురు; వచ్చు + దురు = వత్తురు.—క్రియా-108.

మఱొకయంశము :

చేసి, చేసెను అనుచోవలెనే అయి, ఆయెను అనుచో ఇకారవక్రములు పరమయినవిగాన యాకు సకార మేలరాదు? అనుశంక కలుగును. కాని యచటియకారము సహజము కాదు. 'అగు'ధాతుగకారమునకు ఇకారవక్రపరత్వమున ఆదేశముగా విధింపఁబడినది. —క్రియా-99.

అచట నీసకారాదేశము ప్రవర్తించినచో యకారవిధానము వ్యర్థమగును. ఆయకారమునకు సకారము వచ్చుటయే సమ్మతమగుచో ఆదిని గాకు సకారమునే విధించియుండును. మొదట యకారమును విధింపనేల! వెంటనే దానికి సకారము చేయనేల!

దీనింబట్టి సూత్రకారుని యసమ్మతి విశదమగుచునేయున్నది గావున అయి, ఆయెను అనుచోట సకారాదేశమును శంకించుకొనరాదు.

**55.** చవర్గకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాషనగు. ౫౫.

అన్చున్నాఁడు, అంచున్నాఁడు, అనుచున్నాఁడు ; అన్చును, అంచును, అనుచును.

అను, కను, కొను, తిను, మను, విను ఇవి యన్వాదులు.

**56.** ఉన్నశబ్దంబు పరంబగునపు డుండుధాతువునకు లోపంబగు. ౫౬.

ప్ర : ఉన్నాఁడు, ఉన్నారు, ఉన్నది, ఉన్నవి.
మ : ఉన్నావు, ఉన్నారు.
ఉ : ఉన్నాను, ఉన్నాము.
ఉన్నవాఁడు.

అనుబంధముగ నున్నదను (క్రియా-13) ప్రత్యయముగ నున్నదను (క్రియా-46) రెండిటికిని నిచట గ్రహణము కలుగవలయును. కావుననే ఉన్నానుబంధమనిగాని, ఉన్నవర్ణకమనిగాని యనక ఉభయానుకూలతరముగ 'ఉన్నశబ్ద'మని నిర్దేశించెను. ఇచట మొదటి 8 లక్ష్యములు 'ఉన్నా'నుబంధ సహితములు. సమాపకక్రియలు. తుదిది (ఉన్నవాఁడు) 'ఉన్న'వర్ణకసహితము, ధాతుజవిశేషణము. వర్తమానార్థకము.

కూర్చుండు, నిలుచుండు అను శబ్దపల్లవములలో అనుప్రయుక్తమగు ఉండుధాతువునకుఁగూడ నీసూత్రముచే లోపము గలుగును. కూర్చున్నాఁడు, నిలుచున్నాఁడు. ఇట ఉండుధాతువు లోపింపఁగా మిగిలిన కూర్చు, నిలుచు అనునవి ధాతువులేయయినను. వానికి ఉన్నశబ్దము పరమయినను ఉవర్ణకము రాదు. ఏలరాదో పూర్వము నిరూపింపఁబడినది. ---చూ. క్రియా-14.

**57. చేదాద్యర్థనాంతంబయినయుండున కున్నాదేశంబు విభాష నగు. ౩౦.**

ఉన్నను, ఉండినను.

నవర్ణకాంతమని సామాన్యముగఁ జెప్పక 'చేదాద్యర్థనాంత'మని సవిశేషముగఁ జెప్పుటచే నీ 'ఉన్నా'దేశము అసమాపకక్రియారూపమునందే కలుగుననియు, ధాతుజవిశేషణములందు భూతార్థమున నవర్ణకము (సూ. 46) వచ్చిన చోట, అనఁగా, 'ఉండిన'అను విశేషణస్థలమునందు నిది ప్రవర్తింపదనియు సూత్రతాత్పర్యము గ్రహింపవలయును. అట్లుగానిచో 'చేదాద్యర్థ'అను విశేషణమే వ్యర్థమగును.

'పద్యాదుల నవర్ణకంబునకు' (51) సూత్రమున పడ్డ - పడిన, పడ్డను - పడినను అని యిట్లు నవర్ణకములు రెండిటికిని నుదాహరణములను జూపి, యిచట 'ఉన్నన్-ఉండినన్'అని చేదర్థనవర్ణకమునుమాత్రమే చూపుటయుఁ బయితాత్పర్యమును బలపఱుచుచున్నది.

ఈ సూత్రమున, ఆదిపదము క్త్వవదర్థమునుగూడ గ్రహించునేమోయని సంశయపడరాదు. 'నన్'వర్ణకమునకు చేదర్థమేగాక వృత్తభావలక్షణమని మఱొకయర్థము గలదు. దానినిగూడ సూచించుటకు సూరి 'నన్'వర్ణకమును బరామర్శింపవలసినచోటులందెల్ల 'చేదాద్యర్థకము' అనుచుండునేగాని 'చేదర్థక'మని యెచ్చటను వ్యవహరింపఁడు. కావున నిందలి ఆదిపదముచే భావలక్షణార్థమునుమాత్రమే గ్రహింపవలయుంగాని 'క్త్వవదర్థము'ను గ్రహింపరాదు.

దానినిగూడ గ్రహింపఁదలంచుట చిక్కులకు దారిచేసికొనుట. ఎట్లన :

సంజ్ఞా-12 వ సూత్రమునఁ బలువిధములగు ద్రుతప్రకృతికములను జేర్కొనుచు, 'శతృతుమానంతర్యచేదాద్యర్థకంబులు' అని నిర్దేశించియున్నాఁడు.

అచటఁగూడ ఈసూత్రమునందువలె, ఆదిపదముచే క్త్వవదర్థము సిద్ధమగును. 'చదివిన' అనువిశేషణము 'చదివినన్' అని ద్రుతప్రకృతికము కావలసివచ్చును. 'చదివినపురుషుఁడు అనునది 'చదివినఁబురుషుఁడు' అని మాఱవలసివచ్చును. ఆమార్పు ఎవ్వరికిని సమ్మతముకాదు. పయిని జూపినది (చదివిన పురుషుఁడు) సమాసముగావున నందలిద్రుతము లోపింపరాదాయని యందురేని, లోపింపవచ్చును. ఆద్రుతమునెటులో తప్పించుకొనవచ్చునుగాని, వ్యస్తప్రయోగమున ధాతుజవిశేషణమునకు విభక్తివివక్షయందు తచ్ఛబ్దానుప్రయోగము చేసినపుడు చదివిన + అది = చదివినది అని కావలసినచోట 'చదివిననది' అను నపరూపము సంభవించును. అంతమాత్రమేగాక సురూపమని యెల్లరును భావించుచున్న 'చదివినది' అనునది అపశబ్దమనవలసివచ్చును.

చేదాద్యర్థశబ్దములోని ఆదిపదముచే క్త్వవదర్థమునుగూడ గ్రహించుటలో, ఇన్ని చీకాకులు గలవు.

ఆదిపదమునకు ఆయర్థమును ఈ సూత్రమునమాత్రమే గ్రహింతుమనియు, ద్రుతప్రకృతికసూత్రమున గ్రహింపమనియు అందురేని, అంతకన్నఁ జప్పనిమాట యుండదు. అల్పాల్పముగనయిన వినిగమకములేనియపుడు, ఇచ్చవచ్చినరీతి నర్థము చెప్పఁబూనుట వ్యాకరణమునందుఁ జెల్లదు.

కాఁగా. ఈసూత్రమునుబట్టి 'ఉండిన' అనుదానికిమాఱు, 'ఉన్న' అని ప్రయోగింపరాదనియే తేలుచున్నది.

'ఉన్న' అనువిశేషణరూపమొకటి లేకపోలేదు. కాని, అది వర్తమానార్థకము ; భూతార్థకము గాదు. —చూ. క్రియా-56.

'ఉండిన' అను భూతార్థకవిశేషణమునకుఁ బర్యాయముగ 'ఉన్న' అను రూపము ప్రాచీనప్రయోగములందుఁ గానరాకకాఁబోలును సూరి యీ ప్రక్రియా ప్రసంగమున దానిని సాధింపకుండెను.

కాని లోకవ్యవహారమున 'ఉన్న' అనువిశేషణము భూతార్థమున గాఢముగా నాటుకొనియున్నది. ఈశిష్టవ్యవహారమును చిన్నయసూరియు నభిరుచితో నామోదించినటులే గోచరించును. ఏపాటియయిన నామోదము లేనిచో నీతి చంద్రికలో 'నిన్న యున్నవాఁడు నేఁడు లేఁడు' అని భూతార్థమున స్పష్టముగాఁ బ్రయోగించి యుండఁడు అని తోఁచెడిని.

**58. తిరుటలు పరంబులగునపు డన్వాదుల నుస్థానంబున నున్నయు నుండు డులోపంబును విభాషనగు. ఇలా.**

అందురు, అంట ; ఉందురు, ఉంట.

పక్షంబున: అనుదురు, అనుట ; ఉండుదురు, ఉండుట ఇత్యాది.

అను, కను, కొను, తిను, మను, విను : ఈ 6 మాత్రమే అన్వాదులు. చూ. 55. పద్యాదులలోని (51) చనుధాతువు వీనిలోఁ జేరదు.

**59.** ఇట బిందువుమీఁది తదలకు నిత్యవైకల్పికంబులయి టడలగు. ఉదా.

అంటివి, అనితివి ; అండురు, అందురు.

ఉంటివి, ఉండితివి ; ఉండురు, ఉందురు.

సూత్రమున 'ఇటన్' అనునది డిఁతపదముగా నుపేక్షింపరానిది. మిక్కిలి యర్థవంతము. ఎట్లన :

చింతురు, పెంతురు ఇత్యాదుల తకారమును, చెందును, పొందును ఇత్యాదుల దకారమును బిందువులమీఁదివే. ఆ 'త, ద' లకు ట, డ, లు రావచ్చునా? రాఁగూడదు. రాకుండవారించు మార్గమేదియన :

'ఇటబిందువుమీఁది తదలు' అనఁగా ఈప్రకరణమున పూర్వసూత్రముచే నువర్ణమునకు బిందువుకలుగుటచేఁగాని, దువర్ణమునకు లోపముకలుగుటచేఁగాని బిందువుమీఁదివిగా ఏర్పడిన తదలని యర్థము. ఇట్టి తదలకే టడలు కలుగునని తాత్పర్యము.

చింతురు, చెందును ఇత్యాదులందలి తదలు పయిరీతిగా నిచ్చట నేర్పడిన బిందువుమీఁదితదలు కావుగాన వానికి టడలు రానేరవు.

ఉంటివి, ఉండురు అనురూపములలోని బిందువు అన్వాదులందువలె ఆదేశముగా వచ్చినదిగాక సహజమేయయినను వీనిలోని తదలు ఈపూర్వ సూత్రముచే దువర్ణలోపము వచ్చుటచే 'బిందువు మీఁదివి'గా నిచ్చట ఏర్పడినవే గావున వానిలోని తదలకు టడలు వచ్చుట నిరాఘాతము.

కాఁగా అన్వాదులు (అను, కను, కొను, తిను, మను, విను) ఆఱింటను, ఉండుధాతువునందును మాత్రమే యీ టడల విధానము చెల్లునని సూత్రతాత్పర్య పర్యవసానము. ఈయంశమును సూచించుటకే సూత్రమున 'ఇట' అను శబ్దము ప్రయుక్తమయినది. ఇచ్చటనేగాక

'ఇట విశేషంబుత్సర్గంబునకు విభాషను బాధకంబగు' — తద్ధిత-2.

'ఇటం గృత్కృగతవవేములు .... .... .... ....' —కృదంత-2.

అనుసూత్రములందును 'ఇట'శబ్దము ప్రయుక్తమయినది.

ఈశబ్దము ఈవ్యాకరణమున నీమూఁడు సూత్రములందు మాత్రమే గలదు. ఉన్నటులే యగపడదు. మూఁడు తావులందును సప్రయోజనమే. గోరంతశబ్దము : కొండంత ప్రయోజనము.

**60.** ముఙ్ఞు పరంబగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు. ౬౦.

> బహుళంబనుటచే దీనికి నొకానొకచో నతిచారంబని యెఱుంగునది.

కొమ్ము, కొండు అనునవి లక్ష్యములు.

అతిచారము = అతివ్యాప్తి. అనఁగాఁ దనపరిధిని దాఁటి ప్రవర్తించుట. హద్దునతిక్రమించినది సాధారణముగా ఆహద్దునకు సమీపముననే యుండుట కొంతవఱకు సహజము.

ప్రక్రియాప్రసంగములలో పెక్కుకార్యములకు నిమిత్తములగుటలో ముఙ్ఞునకు సన్నిహితములు జీత్తులు. అవి పరమగునపుడు సయితము క్వాచిత్కముగ 'కో'రావచ్చునని తాత్పర్యము. అందును కేవలమునకుఁగాక అనుప్రయుక్తమగు కొనుధాతువునకే గలుగును.

చదువుకోక, చదువుకోని, చదువుకోఁగలఁడు ఇత్యాదులు.

కేవలకొనుధాతువునకు 'కొనక, కొనని' అనియే యుండునుగాని 'కోక, కోని' అనురూపములుండవు.

**61.** ముఙ్ఞు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముపర్ణకంబునకు మాముడియునగు. ౬౧.

> కొమ్ము, కొనుము ; కొండు, కొనుఁడు.

**62.** రువర్ణకంబుపరంబగునపుడు సున్నమీఁది తదడలయుత్వంబునకు లోపంబు విభాషనగు. ౬౨.

> పోషింత్రు, పోషింతురు ; కొంద్రు, కొందురు ; కొండ్రు, కొండురు.

పిలుతురు, చేయుదురు ఇత్యాదులందు ఉత్వలోపము రాకుండుటకయి 'సున్నమీఁది' అనువిశేషణము.

పొందుదురు, చెందుదురు అనుచో దుష్టరూపము పరమయిన వకారము మున్నుఁడిదికాదు; మున్నుఁడి వకారమునకు దుష్టరూపము పరమగునది. కావున నిట్టియెడ ఉత్వలోపము ప్రసక్తమేకాదు.

కొంద్రు అనుచో ఉత్వలోపముతోడను సూత్రమున తదులతోపాటు 'ద'కారము చేర్పఁబడినది. కాని యీసూత్రమునందలి వకారమునుబట్టి 'కొందురు' అనుదానినుండి 'కొంద్రు' అనురూపము సిద్ధమేగదా ! అయోగములో బిందుపూర్వ 'ద'కారమునకు "ఇట బిందుపూర్వ తదల ...." (క్రియా-59) సూత్రముచే దకారము ప్రాప్తించి 'కొంద్రు'అని సిద్ధించుటకు అభ్యంతరమేది యును గానరాదే ! అయోగమునందలి యీసూత్రమున వకారమునుగూడఁ జేర్చుట యెందులకో ! ప్రయోజనము గోచరించకున్నది. విద్వాంసులెందరూ ? మఱికొంత యాలోచించి యనుకొందము. ఇంతలోనున్న మిగిలినను కార్యం భేదియుఁ గానము.

**63.** సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు. ఉ.

సంస్కృతధాతువుల కంగలాదుల కించుగాగమంబగు.
పచించు, వచించు, త్యజించు, భజించు ; అంగలించు.
అంగల, అడర, అరగ, అవుల, ఉండ, ఉగ్గడ, ఓసర, కార, గాల, జాడ, తిలర, తులద, పండ, పరిర, పలప, అప్ప, ఒప్ప, అల ఇత్యాదులంగలాదులు.

**64.** ఇ, ఉ, ఋల కించుక్కు పరంబగునపు డయుగాపుగాదుద్దు లగు. ఉ॥.

| | | |
|---|---|---|
| జి...జయించు | ద్రు...ద్రవించు | ధృ...ధరించు |
| నీ...నయించు | లూ...లవించు | తౄ...తరించు. |

ఇది సంస్కృతధాతుప్రకరణమగుటవల్ల శ యాగమములు సంస్కృత ధాతువులకేయని వ్యాఖ్యానింపవలయును. అట్లుకానిచో పండు+ఇంచు ఇత్యాదులందు అవుగాగమము దుర్నివారమగును.

ఇట్లు వ్యాఖ్యానించినను జయించు + ఇంచు( = జయింపించు) ఇత్యాదు లందు అవుగాగమము ప్రసక్తమే యగుచున్నది. కావున సంస్కృత ధాతువులకే యనుటకంటె 'స్వార్థేంచుక్కు పరమగునపుడే' అని వ్యాఖ్యా వించుకొన్నచో వండించు మున్నగువానితోపాటు జయింపించు ఇత్యాదులందును ఆగమము సిద్ధపడక తప్పకొనఁగలదు.

అయ్, అవ్, అర్ అనువానిని ఆగమములుగఁజేసి పిమ్మట స్వరసంధి చేసికొనుటకంటె ఇ, ఉ, ఋలకు ఆదేశములుగనే చేసినచో ప్రక్రియాలాఘవము గలుగును. ఆ సౌకర్యము నపేక్షింపక ఆగమములుగా నేల విధించెనో!

ఇందేదియోకీలక మంతర్లీనమయి యుండును. పరిశీలనీయము.

**65.** నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు. ఉజ.

నిర్జికి, నామధాతువుల కయుగాగమంబు గలుగదు :
నిర్జించు, నుతించు, స్తుతించు.
ఈ జ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వవివక్షయం
దించుగాగమంబగునని యెఱుంగునది :
శయనించు, పయనించు.

'ధాతువులకువలె నామములకు ఇంచుగాగమము ఏ సూత్రమునను విధింపఁ బడియుండలేదు. ఇంచుక్కు లేనపుడు అది పరమయినచో రావలసిన అయుగాగమమునకు ప్రాప్తియే యుండదు. ప్రాప్తింపని దానిని నిషేధించుట యెందులకు? ఎచ్చటను అప్రాప్తమునకు నిషేధ ముండదుగదా! ఇట్టి నిషేధము వ్యర్థముగదా! కావున ఈ నిషేధమునుబట్టియే కొన్నినామంబులనుగూడ ధాతువులుగ భావించి వానికించుగాగమము చేసికొనవచ్చునని సూత్రకర్త తాత్పర్యమయియుండవలయును. లేనిచో నిట్లు వ్యర్థముగా నిషేధించి యుండఁడు.' అని మనమూహించుకొనవలయును. ఇదే జ్ఞాపకపద్ధతి.

ఇట్టినిషేధములు అప్రాప్తములయినకార్యములకుఁ బ్రాప్తిని గలిగించును. ఈ తీరున ప్రాప్తములయినకార్యములు సార్వత్రికములుకావు. అరుదుగా ప్రవర్తించును. అంతటను ప్రవర్తించునవే యగుచో నన్నిటివలె వానికిని ప్రత్యేకవిధానమే యుండును.

కాఁగా నిచట జ్ఞాపకసిద్ధమయిన యీ యించుగాగమము అన్ని నామములకు రాదు. ఏ కొన్నిటికో యరుదుగా వచ్చునన్నమాట.

'జ్ఞాపకసిద్ధం న సర్వత్ర' అని పాణినీయ పరిభాష.

ఇచట ధాతువులకువలె కొలఁది నామములకుఁగూడ నించుక్కు రావచ్చునని నిరూపింపవలయును. అది మిక్కిలి యరుదని తెలుపవలయును. ఆ రెండంశములను సూత్రవిధానము లేకుండఁగనే సూచింపవలయును. ఇట్టి సందర్భమునందు నవలంబింపవలసినది యీ జ్ఞాపకపద్ధతియే. ఇట్టిది పాణినీయమున పలుతావులందుఁ గాననగును.

సూత్రమున నొకపదమునకు: i. వైయర్థ్యము, ఆపదము వ్యర్థమయి ii. ఒక యర్థకల్పనము చేయుట ; ఆ యర్థకల్పనచే ఆ పదము తిరిగి ఆ

సూత్రమున ఉండక తప్పని పరిస్థితి యేర్పడుట; అనఁగా iii. స్వాంశమున చారితార్థ్యము; పిమ్మట iv. అన్యత్రఫలము, అనఁగా నిట్టి జ్ఞాపనపద్ధతివల్ల మఱికొన్ని లక్ష్యములందుఁ బ్రయోజనము గలుగుట, అను నీ నాలుగు భాగము లను ఈ జ్ఞాపనపద్ధతిలో నిమిడియుండును.

ప్రకృతసూత్రమున i. 'నామంబులకు' అను పదము మొదట వ్యర్థ మయినది. ii. వ్యర్థమయి ధాతువులకేగాక కొన్ని నామములకుఁగూడ ధాతుత్వ వివక్ష చేసికొన్నచో ఇంచుగాగమము చేయవచ్చునని అర్థకల్పనము చేసినది. iii. ఈ కల్పనచే 'మతి + ఇంచు' అనుచో ఇంచుగాగమము వచ్చిన పిమ్మట 'అయుక్' రాకుండుటకై సూత్రమున 'నామంబులకు' అను పదము ఆవశ్యకమై చరితార్థమయినది. iv. ఈ కల్పనకు ఫలితముగా 'శయనించు' మున్నగువాని యందు ఇంచుగాగమము సిద్ధించినది. దీనికే జ్ఞాపకచతుష్టయమని వ్యవ హారము. ఈ పాణినీయపద్ధతిని బాలవ్యాకరణమున ఈ యొక్కతావుననే సూరి సూచించియుండెను.

**66.** సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగు నప్పుడు గుణంబగు. ఉ.ఊ.

అ, ఏ, ఓ ఈ మూఁడును గుణంబులు నాఁబడు. ఋస్థానికం బగు గుణంబు రపరంబయియుండు.

సంస్కృత ధాతూపధలకు ఇ, ఉ, ఋ అనువానికి వొరిదిని ఏ, ఓ, అర్ అనునవి యించుక్కు పరంబగునపుడగునని యెఱుంగునది.

ఛిద్....ఛేదించు ఘుష్....ఘోషించు వృష్....వర్షించు
భిద్....భేదించు పుష్....పోషించు హృష్....హర్షించు

**67.** స్పృశికి గుణంబు విభాషనగు. ఉ.ఐ.

స్పర్శించు, స్పృశించు.

**68.** లిఖ, భుజ, రుచ, కృశంబులకు గుణంబులేదు. ఉ.ఆ.

లిఖించు, భుజించు, రుచించు, కృశించు.

కుచధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబుగాదు.

గుణములేదన్నవాఁడు అహోబలపండితుఁడు.

కుచధాతువు 'సంకోచించు' అని గుణయుక్తముగనే సర్వత్ర ప్రయుక్తము.

"సంకోచించు ; కుచరోధే—సంకుచింపుచున్నాఁడు. ఇతి రూపం సంప్రతేరపి"

—అహోబలపండితీయము, 'అనుబంధ ప్రార్థనయోః' సూత్రవ్యాఖ్య.

చింతామణి ప్రక్రియలో ధాతువులు ఉపకృతులు, పరిణతులు, సంవృతులు అని మూఁడువిధములుగ విభజింపఁబడినవి.

i. ఉపకృతులు = కృదంతనామములనుండి యేర్పడునవి :

ఆమోదించు, కోపించు, స్తుతించు మొ.

ii. పరిణతులు = అయ్, అవ్, అర్ చేర్పఁగా నేర్పడునవి.

జి - జయించు, ద్రు - ద్రవించు, ధృ - ధరించు మొ.

iii. సంవృతులు = మార్పులేకుండ సంస్కృతధాతువులనుండి యేర్పడునవి.

భజ్-భజించు, భుజ్-భుజించు, వచ్-వచించు మొ.

ఈమార్గమున 'సంకోచించు' అనుధాతువు 'సంకోచ' అను కృదంతము నుండి కలిగినదిగాన 'ఉపకృతి' యగునని చూపుచు నహోబలుఁడు 'సంకుచించు' అనురూపమును నిర్దేశించి, ఇది యిట్లు మార్పులేని సంవృతిధాతువుగఁగూడ నుండవచ్చునని వక్కాణించియుండెను.

ఇదే ప్రకృతసూత్రమున సూరి పరామర్శించిన ప్రసంగము.

"సుందరత్వమునకుఁ జోటిచ్చి తా సంకు
చించెననఁగఁ గడుఁగృశించె నడుము"

—కవికర్ణరసాయనము-1-76.

అని యొకప్రయోగము గుణ (ఒకార) విరహితముగాఁ గానవచ్చుచున్నది. ఆ యిల్లాలి నడుము కృశించెనోలేదో గాని యిచట 'సంకోచించు' అనుశబ్దము నందలి నడిమిదీర్ఘము కృశించుటమాత్రము యథార్థము. ఈ ప్రయోగమున వ్యాకరణగుణము (ఓకారము) మాత్రమేగాక శ్రావ్యతాగుణమును నన్నగిల్లినది. కావుననే యీ రూపము గ్రాహ్యముకాదని సూరి వక్కాణించియుండును.

**69.** సృజికి నిర్మితిని గుణంబు లేదు. ఉదా.

చతుర్ముఖుండు ప్రజలను సృజించెఁ; అతండు విషయంబుల విసర్జించె.

ప్రజలను 'సృ' జించుటలో గుణములేదు.

విషయంబుల వి'సర్జి' ంచుటలో గుణమున్నది.

**70.** సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు. ఐం.

పఠింపించు, వచింపించు; ఆవులింపించు; వండించు, పండించు.

సర్వంబునకున్ = అన్నివిధములగు ధాతువులకు. అనఁగా ఈ ప్రణాళికలో తెలుఁగుధాతువులు నాలుగువిధములుగా నిష్పన్నము లగును :

i. సంస్కృతధాతువులకు ఇంచుక్కు చేర్పఁగా నేర్పడునవి : పఠించు, వచించు మొ. —క్రియా-63.

ii. అంగలాదులకు ఇంచుక్కు చేర్పఁగా నేర్పడునవి : ఆవులించు మొ. —క్రియా-63.

iii. దేశ్యభాషలో సహజముగా నేర్పడినవి : వండు, పండు మొ.

iv. నామములకు ధాతుత్వవివక్షచే ఇంచుక్కు చేరఁగా నేర్పడునవి, అనఁగా నామధాతువులు : మతించు మొ. —క్రియా-65.

ఈ నాలుగుజాతులకును బ్రేరణార్థమున ఇంచుక్కు వచ్చునని సూత్ర తాత్పర్యము.

ఇందు నాలుగవజాతికి నుదాహరణము చూపనేలేదు. దానికి బొత్తిగా చూపకుండుట, చూపఁబడిన మూఁడిటిలో ఒకజాతికి రెండు, ఇంకొకజాతికి నొక్కటి, పిమ్మట మఱొకజాతికి రెండు, ఇటులు సంఖ్యాభేదముతోఁ జూపుట రవంత చూపుపెట్టఁదగిన యంశములు.

భాషాసమష్టిలో ఏయేజాతిధాతువులకు నెంతెంతప్రాచుర్యముగలదో పరి కించినచో, సంస్కృతధాతువులును దేశ్యధాతువులును నించుమించు తుల్య సంఖ్యాకములనియు, అంగలాదులసంఖ్య యంతకు సంగోరు తక్కువయనియు, అంతకన్న నామధాతువులసంఖ్య మిక్కిలి తక్కువయనియు స్థూలదృష్టికి గోచరించును. ప్రయోగసరణిలో ధాతువుల ప్రాచుర్యతారతమ్యమును సూచిం చుటకే సంస్కృతమునకు 2, దేశ్యమునకు 2, అంగలాదులకు 1, నామధాతు వులకు 0 అనుసంఖ్యారీతి, ఉదాహరణప్రదర్శనమున సూత్రకారుని చూపులో నున్నటులు గ్రహింపవలయును.

**71.** రంజాదుల యించుక్ప్రకారంబునకు సబిందుకంబున కఁ బ్రేర ణంబున ద్విరుక్తలకారంబగు. ఐం.

రంజిల్లు, భాసిల్లు, వర్ధిల్లు, విలసిల్లు, రాజిల్లు.
ఈ యాదేశయోగంబున భిదాదు లకర్మకంబులగు:
భేదిల్లు, కంపిల్లు, సంధిల్లు.

**72.** ఇంచుకు పరంబగునప్పుడు రంజాదుల యించుకునకు లోపంబగు. ఉ.

లాదేశంబున కపవాదంబు: రంజించు, భేదించు, సంధించు.

**73.** చుగాగమం బాచ్ఛికంబున కనంయుక్తనలకారాంతంబునకుం బ్రేరణంబున బహుళకంబుగానగు. ఉ.

పూను....పూనుచు, పూనించు ; తేలు....తేలుచు, తేలించు ;
మగుడు....మగుడుచు, మగిడించు ; కుదురు....కుదురుచు,
కుదిరించు ; విను....వినుచు — వక్ష్యమాణంబు పుగాగమంబు —
వినిపించు.

బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు :
అను....అనిపించు ; తిను....తినిపించు ; కను....కనిపించు —
దీని యత్వంబునకు దీర్ఘంబునగు — కానిపించు.

చనుధాతువునకు, ప్రేరణార్థమున ఇంచుక్, చుక్, పుగాగమములలో నేదియు వచ్చునట్లు కానరాదు. దీనికి ప్రేరణమున 'చేయు'ధాతు వనుప్రయుక్తమయి 'చనఁజేయు' అని యగును. ఈయనుప్రయోగము సూరి శబ్దలక్షణ సంగ్రహమున 4-113, 114 లలో విహితమయియున్నది.

"జనమత బ్రాహ్మణకార్యము సనఁజేసిన...." —భారత-ఆది-6-284.

**74.** అట్లు పుగాగమంబును మాన్వాదులకగు. ఉ.

మాను....మానుపు, మానుచు ; మను....మనుపు, మనుచు.
బాహుళకంబున దీనికించుక్కు లేదు.

**75.** చుక్పువర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వంబగు. ఉ.

**76.** అట్లు చుప్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదులకగు నగుచో వానికడ ద్రావాలు లోపించు. ఉ.

అడఁగు .... అడఁచు, అడఁగించు ; మాయు .... మాపు, మాయించు.

అడఁగు, కరఁగు, కలఁగు, నలఁగు ఇత్యాదులడంగ్వాదులు.

మాయు, ఉడుగు, కడచు, కుడుచు, బిగియు ఇత్యాదులు మాయ్వాదులు.

ఆఁగు ప్రభృతు లుభయగణంబులు.

బాహుళకంబునంజేసి కొన్నింటి కించుక్పుక్పుగాగమంబులు మూఁడును, గొన్నింటికందు యథాసంభవముగా రెండును, గొన్నింటి కొక్కటియు నగునని యెఱుంగునది.

ఆఁగు....ఆఁచు, ఆఁపు, ఆఁగించు ; రేఁగు....రేఁచు, రేఁపు, రేఁగించు ; పాయు....పాచు, పాపు ; విఱుగు....విఱుచు ; చూచు .... చూపు ; నేరుచు .... నేరుపు ; మేయు .... మేపు ; లేచు .... లేపు ; కలియు .... కలుపు ; తడియు .... తడుపు ; తెలియు....తెలుపు ఇత్యాదులెఱుంగునది.

ఈ లక్ష్యములలో కలియు, కలుపు ఇత్యాదులందు పువర్ణము పరమగు నపుడు పూర్వసూత్రముచే విహితమయిన 'ఉత్వము' కానవచ్చుచున్నది. చుగాగమము పరమగునపుడు ఇత్వమునకుత్వము కలిగిన లక్ష్యమొక్కటియు నిందుఁ గానరాదు.

చుక్పువర్ణములు రెండును పరమగునపుడు ఇత్వమునకుత్వము విధించి, అందు చువర్ణమునకు ఒక్కలక్ష్యమునయినఁ జూపక విడిచియుండునా? అది యంతగా సంభావనీయముగాదు. ఒకసందేహము పొడముచున్నది.

పుగాగమముకలుగునట్టి మాయ్వాదులలో 'బిగియు' ధాతువొకటి చేర్పఁ బడియున్నది. దానికి 'బిగుపు' అను ప్రేరణరూపమే కానరాకున్నది. కావున దానిని మాయ్వాదులలోఁ జేర్చియుండఁదేమో.

చుగాగమము కలిగి 'బిగియు' ధాతువునకు 'బిగుచు' అను ప్రేరణరూప మగపడుచున్నది.

"పదపడిచేతులుబిగిచిన...." —విష్ణుపురాణ-ఆ-6.

కావున చుగాగమము కలుగునట్లు దీనిని అడంగ్వాదులలోనే చేర్చియుండె నేమో! అట్లయినచో, లేనిరూపమును (బిగుపు) స్మరింపనట్లును, ఉన్నరూప మును (బిగుచు) సాధించినట్లును, చుక్పరత్వమునఁగూడ ఉత్వమునకు లక్ష్య మును సూచించినట్లును సంతయుఁగుదురుపడును.

కావున 'ఓగిరు' ధాతువును సూరి తొలుత అదంతాదులలోనే చేర్చి యుండ ప్రథమ ముద్రణావసరముననే అది యెటులో ప్రమాదవశమున ఇతరులచే మాయ్యాదులలోఁ జేర్పఁబడియుండెనేమో: కావున 'ఓగిరు' ధాతువును మాయ్యాదులలోఁగాక అదంతాదులలో చేర్చుకొందమా? మఱి కొంత యాలోచింతము.

**77.** ఇంచుక్కుప్పుగాగమంబులు పరంబులగునప్పుడు ధాతువులకాదేశ లోపంబులు పెక్కుతెఱంగులం గానంబడియెడి. ఉ.

అగు .... కావించు ; వచ్చు .... రావించు, రప్పించు ; విన్న పము....విన్నవించు ; మోఁకాలు....మోఁకరించు ; కేక....కేక రించు ; పలవ....పలవరించు, పలవించు ; ఆల....ఆలకించు, ఆలించు ; వ్రక్క .... వ్రక్కలించు ; నొచ్చు .... నొంచు, నొప్పించు ; ఉండు .... ఉనుచు, ఉంచు ; డిగు .... డించు, డిగించు ; పెరుఁగు .... పెనుచు, పెంచు ; తునుఁగు .... త్రుంచు ; మునుఁగు .... ముంచు, మునుచు ; మొగుడు .... మొగుడుచు, మొగుచు, మోడుచు, మొగిడించు ; చొచ్చు.... చొనుపు, చొప్పించు ; చినుఁగు....చించు, చింపు ; త్రెగు.... త్రెంచు, త్రెంపు ; తిరుగు .... త్రిప్పు ; చచ్చు .... చంపు ; నిలుచు....నిలువరించు, నిలుపు ; కొను....కొలుపు ; పోవు.... పుచ్చు, పనుచు, పంచు, పనుపు, పంపు, అనుచు, అంచు, అనుపు, అంపు.

అనుప్రయుక్తంబగు పోవునకుం బుచ్చుమాత్రంబగు :
మోసపోవు .... మోసపుచ్చు.
ఇత్యాదులెఱుంగునది.

**78.** అన్వాదుల కించుక్కుపరంబగునపుడు పుగాగమంబగు మానునకు విభాషనగు. ఉదా.

అనిపించు : అను, కను, తిను, విను.
మానిపించు, మానించు.

అన్వాదులాఱింటిలో (55 వ సూ.) కొను, మను ఈ రెండును ఇచట విడువఁబడినవి. మనుధాతువునకు ఇంచుక్కు రాదు (74 వ సూ.) గనుక దాని

నిచట వివరింపవలసినవే. కొసు (వెలకుఁదీయు) ధాతువునకు ప్రేరణమున 'కొనిపించు' అనురూపము మిక్కిలి వ్యవహారరూఢమై యున్నది. తగిన కవి ప్రయోగము కానరాకకాఁబోలును అదియు నిర్దేశింపఁబడదయ్యెను.

**79.** అడ్డాదుల కిం చుక్క పరంబగునపుడు గుగాగమంబగు నవ్వాదులకు విభాషనగు. ౬౯.

అడ్డము .... అడ్డగించు.
అడ్డము, ఓర, చిత్తము, పంతము, పెల్ల, బోర, మట్టము, మేళము ఇత్యాదులడ్డాదులు.
అప్ప .... అప్పగించు, అప్పించు.
అప్ప, ఒప్ప, పల్లము, కోపము : ఇవి యప్పాదులు.

**80.** ఆడోడుకూడుల డకారంబునకుం జుక్క పరంబగునపుడు రేఫంబగు. ౭౦.

ఆడు .... ఆరుచు, ఆడించు ; ఓడు .... ఓరుచు, ఓడించు ;
కూడు .... కూరుచు, కూడించు.

ఆడు, ఓడు, కూడు అనువానిలోని డకారమునకును, చుక్కనకును, నడుమ ఉకారముతో వ్యవధానమున్నదేయని శంకింపఁబనిలేదు. ఈ స్థలము లందు ఉకారవ్యవధానము ఎట్లును తప్పనిదేగావున ఆ వ్యవధానము సూత్ర ప్రవృత్తి నడ్డగింపదు. దేనితో వ్యవధానము అపరిహార్యమో దానితో వ్యవధాన మున్నను గార్యము ప్రవర్తింపవచ్చునని పాణినీయపరిభాషితము :
'యేన నావ్యవధానం, తేన వ్యవహితేపి.'

**81.** చెడునకుం జుక్కుగాగమంబులును డాకలఘురేఫంబునగు. ౭౧.

చెఱుచు, చెఱుపు.

**82.** పడునకుం జుక్కను డాకలఘురేఫంబునగు. ౭౨.

పఱుచు.

పఱుచు అను అకారమధ్యమునకు పరుగెత్తు అనియర్థము. అది పడు ధాతు ప్రేరణరూపము కాదు. కావుననే స్పష్టపఱుచు, వ్యక్తపఱుచు మున్నగు రూపములు బాలవ్యాకరణ సమ్మతములు కావు.

**83.** శబ్దపల్లవంబగు పడున కించుక్కు విభాషను నగుచో డాకు లఘురేఫంబగు. బా.

వెలువడు .... వెలువరించు, వెలువఱుచు. చొప్పడు .... చొప్పరించు, చొప్పఱుచు.

**84.** ప్రేరణంబునందించుక్కుమీఁద నించుక్కు లేదు. బా.

ఇటనుటంజేసి ప్రేరణార్థంబయిన యితరాగమంబుమీఁదం ప్రేరణార్థంబుగాగమంబగునని యెఱుంగునది.
నొచ్చు .... నొంచు .... నొంపించు. చచ్చు .... చంపు .... చంపించు.

ప్రేరణంబునందించుక్కు అనఁగా ప్రేరణార్థమునవచ్చిన యించుక్కని యర్థము. దానిపయిని మఱి యించుక్కురాదని భావము.

పఠించు + ఇంచు = పఠింపించు : ఇట ఇంచుక్కుమీఁదనే యించుక్కు వచ్చినది. ప్రేరణార్థమునవే వచ్చినది. రావచ్చును. అడ్డులేదు. ఏలయన

ఇచట స్వార్థంబుక్కుమీఁద ప్రేరణంబుక్కు వచ్చినది. ప్రేరణంబుక్కుమీఁద ఇంచుక్కు వచ్చుట నిషిద్ధముగాని స్వార్థంబుక్కుమీఁద ఇంచుక్కు వచ్చుటకు నిషేధములేదు.

మఱియు ప్రేరణార్థకమయిన 'యించుక్కు'మీఁదనే నిషిద్ధముగాని ప్రేరణార్థకములగు చుక్ పుగాగమములమీఁద నిషేధము లేదు. కావుననే

'నొంచు' అనుచో ప్రేరణచుగాగమముమీఁదను, 'చంపు' అనుచో ప్రేరణపుగాగమముమీఁదను రెండవప్రేరణార్థమున ఇంచుక్కు కలుగుటకును బాధలేదు.

ఇంచుక్కుమీఁద నించుక్కు రావచ్చును. ప్రేరణార్థకముమీఁద మఱొక ప్రేరణార్థకమును రావచ్చును.

కాని, ఒకసారి ప్రేరణార్థమున ఇంచుక్కు వచ్చినచో మఱి యించుక్కు రాదని సూత్రతాత్పర్యము. చదివింపించు, వ్రాయింపించు మున్నగు రూపము లుండవనుట పర్యవసన్నము.

**85.** ఇత్వంబుగాని యెత్వంబుగాని పరంబగుచో సనాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు. బా.

నిగుడు .... నిగిడి, నిగిడె ; మగుడు .... మగిడి, మగిడె ;

ఉడుగు .... ఉడిగి, ఉడిగె ; మునుఁగు .... మునిఁగి, మునిఁగె.

ఉడిగి, మునిఁగి అనుచో ఆద్యములగు ఉకారములకు ఇత్వము రాదు. అనాద్యమనఁగా ఉకారము ధాతువునకు మొదటిది కాఁగూడదని మాత్రమే యర్థముకాదు. ధాతువునందలి యచ్చులలో మొదటిది కాఁగూడదని యర్థము. కావుననే 'మునిఁగి' యనుచో మొదటి యుకారమునకు ఇత్వము రాలేదు. ఈ యంశము సూచించుటకే 'మునుఁగు' ధాతువునుగూడ నుదాహరించుట.

ఈ విధానము ధాత్వధికారస్థమగుట విస్మరింపరాదు. ధాతూకారమునకే ఇత్వము గలుగును. 'వినకువె' ఇత్యాదులందు 'కు'లోని ఉకారము ధాతుస్థము కాకుండుటచే ఇత్వము రాదు.

మఱియు, ఇత్త్వైత్వములు ధాతువునకే కూడవలెనను నర్థమునుగూడ గ్రహింపవలయును. ఆ యర్థమువల్లనే 'వండుము, వండుఁడి' ఇత్యాదులందు ధాతూకారమునకు ఇత్వము తొలంగును. ఇట్టిచోటులందు ఇత్వము అనుప్రయుక్తమయి ప్రత్యయమునకుఁ గూడినదిగాని ధాతువునకుఁ గూడినది కాదు.

—చూ. క్రియా-33.

**86.** ముజ్ఞిత్తులు ముత్తు నాఁబడు. బా.

ముజ్ఞవలెనే ఈ సంజ్ఞనుసయితము సులభప్రతీతికయి ప్రత్యాహారరీతి బోధకముగా కల్పించుట రమ్యమార్గము. —చూ. క్రియా-31.

**87.** ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబును కగు. బా.

పచించు....పచింపించు ; వచించు....వచింపించు ; పిలుచు....
పిలిపించు ; వలచు....వలపించు.
పత్వంబు హెచ్చునకుంగలుగదు ; మెచ్చునకు విభాషనగు :
హెచ్చించు; మెప్పించు, మెచ్చించు.

మెచ్చులోని చకారములు రెండిటికి పకారములు రెండు. స్థానికి అనురూపమగు నాదేశము. —చూ. క్రియా-54.

**88.** ఆగమాన్త్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు పవలగు. బా.

ఆగమంబు: పచింపఁడు, పచింపుము. అడఁపఁడు, అడఁపుము.
అన్త్యము : పిలువఁడు, పిలువుము.

నిష్పందుకమగు 'ఏచు' ధాతువునందలి చకారమునకు ముత్తు పరమగునపుడు ఈ సూత్రముచే పకారము ప్రసక్తమగుచున్నది. అది ప్రయోగములందుఁ గానరాదు. తన్నివారణమార్గమన్వేషణీయము.

**89.** ఖండబిందుపూర్వంబగు ద్విత్వేతరచకారంబునకు ముత్తు పరంబగు నప్పుడు పకారంబు ప్రాయికంబుగనగు. తా.

తలఁపక, త్రేఁపక, తోఁపక.
ఏఁచునకు వైభాషికంబు : ఏఁపక, ఏఁచక.
నోఁచునకుంగలుగదు : నోఁచక:

**90.** ఆగమచకారంబునకు నెఱసున్న మీఁదివానికి ముత్తు పరం బగునప్పుడు పకారంబు విభాషనగు. తా.

ఆకర్ణింపుదురు, దంపుదురు, చింపుదురు.
పత్వంబు రానిపక్షంబున వక్ష్యమాణతాదేశంబు ;
ఆకర్ణింతురు, దంతురు, చింతురు.

దంగుధాతువునకు : దంచు, దంపు అనియు ; చినుఁగుధాతువునకు : చించు, చింపు అనియు ప్రేరణరూపములు. వీనిలో దంచు, చించులకు దంతురు, చింతురు అనియగును. క్రియా-108.

దంపు, చింపులకు దంపుదురు, చింపుదురు అనియగును.

ఇట్లు పత్వసహితములగు ధాతువులు వేఱుగా నుండ, వానినుండి దంపుదురు, చింపుదురు అనురూపములు సుసాధములయియుండ, దంచు చించులకు ఈ సూత్రముచే పత్వప్రాప్తిని గలిగించి దంపుదురు, చింపుదురు అనువానిని సంపాదించు క్లేశ మెందులకో ! సహజముగా పత్వఘటితములు కాని ఉంచు, పెంచు, మించు మున్నగువానికి పత్వము ప్రాప్తింపఁజేసి ఉంపుదురు, పెంపుదురు, మింపుదురు ఇత్యాదుల నుదాహరింపక, దంచు చించుల నుదాహరించుటలో నుద్దేశమేదియో యుండకతప్పదు. తెరమఱుఁగు వీడి తేటపడకున్నది.

**91.** అగు, వచ్చు, చొచ్చు, చూచులకు ముత్తు పరంబగు నపుడు కా, రా, చొరు, చూడులగు. తా.

అగు.... కాఁడు.
వచ్చు.... రాఁడు, రమ్మె.

చొచ్చు....చొరఁడు, చొరుము.

చూచు....చూడఁడు, చూడుము.

పయియుదాహరణములలో నాలుగుధాతువులకు జీత్తునొకటి, ముజ్జున నొకటిగా నుదాహరణములు చూపుచు 'అగు' ధాతువునకుమాత్రము ముజ్జునఁ జూపలేదు. చూపఁదలంచినచో 'కమ్ము' అని చూపవలసియుండును. చూప రాదను తలంపుతోడనే సూత్రకర్త దాని నిచ్చట విడిచియుండెను. మఱచికాదు.

ప్రథమముద్రణమున (1858) ఈ యుదాహరణములలో 'కమ్ము' అను రూపము కానరాదు.

ఇచట దానిని జూపకుండుటకు హేతువేమియన 'అగు'నకు ముజ్జు పరమగునప్పటి ప్రక్రియ ఈ సూత్రముతోఁ బరిపూర్ణము కాదు. 'అగునకు, అనుకనులకు' అనుసూత్రమున (క్రియా-96) అగుధాతువునకు ముజ్జునందు 'కా'దేశము వికల్పింపఁబడనున్నది. దీనిప్రక్రియ యాసూత్రమునఁ బరిపూర్ణ మగును. కావున నచ్చట 'కమ్ము, అగుము' అనురూపములు రెండిటిని జూప వలయును. 'కమ్ము' అనుదానిని జూపవలసినతావు అదిగాని, ప్రకృతసూత్రము కాదు. అని వివేచించియే దానిని వికల్పసూత్రమునకై దాఁచియుంచెను.

ఉదాహరణప్రదర్శనమున నవలంబింపవలసినదియు, బాలవ్యాకరణమున పెక్కుతావులందు నవలంబింపఁబడినదియు నగుపద్ధతి యిదేయని పరిశీలకులు గుర్తింపఁగలరు.

ఈ వివేచనమును గుర్తింపని ముద్రణపరిష్కర్తలెవ్వరో తక్కిన వానితోపాటు 'కమ్ము' అనుదానింగూడఁ జేర్పవలయుననియు, అది ప్రమాదముచేఁ దొలఁగియుండుననియు భ్రాంతిపడి యీ సూత్రమునఁ జొప్పించినారు.

ఆ వెనుక గతానుగతికరీతిని పెక్కుముద్రణములందు 'కమ్ము' అను రూపముకూడ ఈ యుదాహరణములలోఁ జొరఁబడినది. గుప్తార్థప్రకాశిక తప్ప తక్కిన టీకాగ్రంథములందుసయితము ఈ రూపము చూపఁబడియే యున్నది. ఇది యిచట నుండఁదగునో తగదో యని టీకాకారులయినను దృష్టి పెట్టరయిరి.

ఈ సూత్రమునొద్ద దీనినధికముగాఁజేర్చుట సూరి సూక్ష్మదృష్టితోఁ బాటించిన లక్ష్యప్రదర్శనపద్ధతిని భగ్నముసేయుట.

కాఁబట్టి యిచట నెంతమాత్రము నుండరాని యీ 'కమ్ము' అను రూపమును భావిముద్రాపకులు భద్రముగా తొలఁగింతురుగాక.

**92.** ఇమ్మునకు సర్వంబున కీయగు. కా౨.

ఇచ్చు.... ఈఁడు, ఇమ్ము.

ఈయ యను నాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి :

'బలిమినీయని భూమివలయపతుల.'

ఇచ్చు అనుధాతువునకు అంతటను 'ఈ' అనునాదేశము కలుగును.

| | | | |
|---|---|---|---|
| ఉండు : ఉన్న | 57 సూ. | చచ్చు : చావు | 94 సూ. |
| కొను : కో | 60 సూ. | నొచ్చు : నోవు | |
| అగు : కా | 91 సూ. | అను : నా | 95 సూ. |
| వచ్చు : రా | | కను : కాన | |
| చొచ్చు : చొరు | | పోవు : పొవ, పడ | 98 సూ. |
| చూచు : చూడు | | కలుగు : కల | 104 సూ. |
| తెచ్చు : తే | 93 సూ. | కలుగు : కే | 106 సూ. |
| తెచ్చు : తేరు | | వలచు : ఒల్ల | 107 సూ. |

క్రియాపరిచ్ఛేదమునందలి యీ యాదేశములన్నియు స్థానియగుధాతువు నంతను తొలఁగించి వచ్చునవే. అనఁగా సర్వాదేశములే. అయినను ఆ సూత్రములందెచ్చటను 'సర్వంబునకు' అనక ప్రకృతసూత్రమునమాత్రము 'సర్వంబునకు' అని ప్రత్యేకముగ వక్కాణించుట యెందులకో పరికింపుఁడు. కారణమున్నది.

ఆదేశములవిషయమున పాణినీయమున నొకపద్ధతి గలదు.

అందు 'అల్' అనఁగా వర్ణమనియర్థము. ఆదేశము అనేకవర్ణము (అనేకాల్)అగుచో నది సర్వాదేశమగును. ఏకవర్ణము (ఏకాల్) అగుచో నది స్థానిలోని తుదివర్ణమునకు మాత్రమే యాదేశమగును.

'అనేకాల్ శిత్ సర్వస్య', 'అలోన్త్యస్య' అనుసూత్రములీమార్గమును విధించును. ఇది పాణినీయమున మిక్కిలి ముఖ్యమయిన విధానము.

ఇచటఁ బయినిజూపఁబడిన 'ఉన్న' మున్నగు నాదేశములన్నియు అనేకాల్లులు. ఆదేశసంప్రదాయమునుబట్టి యవి యెట్లును సహజముగ సర్వాదేశములుగనే ప్రవర్తిల్లును. 'ఈ' అను నీయాదేశము ఏకాల్లు (ఏకవర్ణము) గావున సంప్రదాయముచొప్పున నిది 'ఇచ్చు' అనుదానితుది ఉకారమునకు రావలసి యుండును. అట్లుగాక మొత్తమునకే రావలయుంగావున 'సర్వంబునకు' అని సూత్రమునఁ బ్రత్యేకముగా వక్కాణింపవలసివచ్చినది.

"బలిమి'నీయని' భూమివలయపతుల" —భారత-ఆది-1-7.

ఇది భట్టారకుని భారతరచనారంభమున ప్రప్రథమదివసపు రచనలోని పద్యభాగము. ఆంధ్రలాక్షణికులలో నెవ్వరిదృష్టికిఁగాని వాగనుశాసనులకంటె ప్రామాణికులు మఱియొకరులేరు. ఆ విషయమున ఆయనదే ఆచార్యపీఠము. అయినను ఈ 'ఈయ' అను నాదేశమునకు సూత్రరూపమున నిచట విధానము గానరాదు. అట్లని 'ఈయని, ఈయక' ఇత్యాదులు సాధువులుకావని నిరసించుట గాని ఉపేక్షించుటగాని సూరి తలంపందుమా! ఎంతమాత్రమును గాదు.

రుచిరములయి ప్రచురములయిన రూపములనే సూత్రమార్గమున సాధించి చూపుట సూరిదృక్పథము.

భట్టారకులుగాని, యితర భారతకవులుగాని 'ఈయని' ఇత్యాదులను మఱిఎచ్చటను బ్రయోగించినటులు కానరాదు. అట్టిదీనికి సూత్రము రచించుట యీ యాదేశమునకుఁ బూర్వులప్రయోగములలో ప్రాచుర్యమున్నటులు చదువరులకు దృష్టిగల్పించుట: వాస్తవము తాఱుమాఱుసేయుట. అవునని సూత్రింపరాదు. కాదని నిరసింపరాదు. ఎత్తిచూపకుండ నుపేక్షించి ప్రయోగమును మఱుఁగుపఱుపనురాదు. కింకర్తవ్యమ్మని మథనపడిపడి తుదికి, ఈయాదేశమును సూత్రింపనులేదు. ఉన్నప్రయోగమును చూపక ఉపేక్షింపను లేదు.

మొట్టమొదట నతివిరలములయినను గాలక్రమమున ఈయని, ఈయక, ఈయఁడు మున్నగురూపములు ప్రచురముగా వ్యవహారమున నాటుకొన్నవి. కవులుగూడఁ గొందఱు గౌరవించిరి. అంతమాత్రమేగాక 'ఈయశ్వము = ఇయ్యశ్వము, వీయము = వియ్యము, ఈయకొను = ఇయ్యకొను' (= సమ్మతించు) మున్నగువానిలోని హ్రస్వద్విత్వముల సాదృశ్యమును (Analogy)బట్టి 'ఇయ్యని, ఇయ్యక, ఇయ్యఁడు' మున్నగు రూపములుగూడ నేర్పడినవి. వీనిని గూడ కవులు కొందఱాదరించిరి. ఆధునికములగు కొన్నిలక్షణగ్రంథములందు వానికిఁ బ్రవేశమును మెల్లగాఁ గుదురుకొనుచున్నది. అవి ఏకొలఁది కాలమునకో లాక్షణికులెల్లరును కన్నులకద్దుకొను సుశబ్దములు కావచ్చును. ఇవియకాదు: వీనివెంట నొవ్వక, నొవ్వనిమున్నగువాని సాదృశ్యమునుబట్టి ఏర్పడిన 'ఇవ్వక, ఇవ్వని' మున్నగుశబ్దములుగూడ శిష్టవ్యవహారప్రవాహమున పయనించుచున్నవి. తొందరపాటుఁజెందక మందమందముగా కొలఁది కాలములో గ్రాంథికత నాశించుచూపులోనున్నవి .... దురాశయని యీసడింపవలదు.

**93.** తే తేరులు తెచ్చునకగు. జాతి.

తెచ్చు .... తేఁడు, తేరఁడు ; తెమ్ము, తేరుము.

**94.** చావుచోవులు చచ్చుచొచ్చులకగు. జాతి.

చచ్చు....చావఁడు, చావుము ; నొచ్చు....నోవఁడు, నోవుము.
వక్ష్యమాణంబు ద్విత్వంబు : నొవ్వఁడు.

వక్ష్యమాణంబు ప్రకీర్ణక-6.

**95.** జేర్తు పరంబగునప్పుడు వానివర్ణంబు విభాషను లోపించు. చావు.

చాక, చావక, చాకుము, చావకుము.
నోక, నోవక, నోకుము, నోవకుము.

**96.** అగున కనునొనులకు ముట్టిత్తులు పరంబులగునప్పుడు కా, నా కానలు విభాషనగు. కాఁ.

అపవాద్యసూత్రముచే గాకు వకారంబు. వక్ష్యమాణంబౌత్వంబు.
కమ్ము, అగుము, అవుము, ఔము, కండు, అగుఁడు, అవుఁడు, ఔఁడు ; నాఁడు, అనఁడు ; కానఁడు, కనఁడు.

వక్ష్యమాణంబు క్రియా-103.

పయి యుదాహరణములలో ఔము, ఔఁడు అనురూపములందు ముట్టు పరమయినదిగాన కమ్ము, కండు అను చోటులందు దీర్ఘమునకు హ్రస్వమును, ఋవర్ణకమునకు మాముడియు (16 సూ.) రాలేదేమి ? అని యెవరేని ప్రక్రియా వినోదులు ప్రశ్నింపవచ్చును. నిజమే. కాని, భాషలో ఐఔలకు హ్రస్వములే లేవు. లేనిహ్రస్వము లాదేశములుగా వచ్చుట యసంభవముగావున నిచటఁ బయి సూత్రము ప్రవర్తిల్లుటకుఁ దావులేదని తలంపవలయును.

**97.** నేరుచునకు లిట్టాద్యులు ముట్టుం బరంబులగునప్పుడు రుచు లకు లోపంబు బహుళంబుగానగు. కాఁ.

నేచెను, నేరిచెను ; నేచును, నేరుచును ; నేరఁడు, నేరువఁడు.

ఈ సూత్రమున లిట్టుఅనునది భూతార్థకములగు కొన్నికృత్తులకుఁగూడ నుపలక్షణమనుకొన్నచో

"కాచికొనివచ్చి తగ నా
'నేచిన'యట్లచట నచట నిలిపితి మునివా
థా, చేటును భంగంబును
నై చిత్తము శోకమునకు నగ్గంబయ్యెన్". —భారత-మౌసల-215.

ఇత్యాదులందు 'నేచిన' యను భూతార్థక విశేషణమునందుఁగూడ రువర్ణలోప మీ సూత్రమువల్లనే కుదురుపడుటకుఁ గొంత యవకాశము కలుగఁగలదు.

**98.** పోవునకు దుర్ముత్తులు ముజ్ఞుం బరంబులగునప్పుడు వులోపంబుం బొదపదలును విభాషనగు. ౯౮.

> పోదురు, పోవుదురు ; పోఁడు, పోవఁడు ; పోవుము, పొదము, పదము, పొమ్ము.

ఉదాహరణములలో ఆదేశము వచ్చిన రూపము, అది రాని రూపము అను క్రమము తుదిదాఁక సరిపడుటకు 'పోవుము' అను రూపమును తుట్టతుదిని జూపుట రుచిరము. అటులేల చూపలేదో !

**99.** అగుపోవుల కడద్రావల కిత్వైత్వంబులు పరంబులగునప్పుడు యకారంబగు. ౯౯.

> వక్ష్యమాణం బైత్వంబు :
> అయి .... ఐ, అయిరి .... ఐరి.
> పోయి, పోయిరి; పోయెను, పోయెడు.

**100.** అగునకు వక్రంబు గూడుచో దీర్ఘంబగు. ౧౦౦.

> వక్ష్యమాణంబు ద్విత్వంబు.
> ఆయెను, అయ్యెను, ఆయెడు, అయ్యెడు.

వక్ష్యమాణంబు ప్రకీర్ణక-6.

ఈ సూత్రములెల్ల ధాత్వధికారస్థములగుట నడుమనడుమ జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలసిన ముఖ్యాంశము.

కడద్రావలనఁగా : తుదియక్షరములు. అగుపోవులతుదినుండునవి గకార వకారములు. అవి ధాతుస్థములయి యుండవలయును.

పోవిపుడు, పోవెచటికిని, పోవేల, పోవాక్కఁడవు, పోవోర్పుతో అను తావులందు ఇకారవక్రములు పరమయినవి. కాని యిచట 'పోవు' అనుదానిలోని వకారము ధాతుస్థము కాదు; ప్రత్యయస్థము. ధాతువకారము లోపించినది (సూ. 98). కావుననే ఈ వకారమునకు యకారము ప్రసక్తము కాదని యూహింపవలయును. మఱియు నీ విధానమున స్థానులగు కడద్రావలును నిమిత్తములగు ఇద్వక్రములును ఏకపదస్థములయి యుండవలయునను

నియమముగూడ బహుళరీతినిబట్టి గోచరించును. ఇయ్యెడఁజూపిన రూపములలో స్థాని, నిమిత్తములు భిన్నపదస్థములగుటచే యకారము ప్రాప్తింపదనియుఁ దలంపవచ్చును.

అగుధాతువునకు వక్రపరత్వమునఁ గలుగు రూపము, ఈ రెండవ సూత్రముచే (100) విహితమగు దీర్ఘముచేఁగాని సంపూర్ణముగ సిద్ధించదు గావున, తొలిసూత్రమున వక్రపరోదాహరణము చూపవలసివచ్చెను.

ఎ ఏ, ఒ ఓ లు నాలుగును వక్రములేయయినను ప్రకృతసూత్రమునందు ఈ యకారాదేశమునకును దీర్ఘమునకును నుదాహరణములు చూపుటలో 'ఏ'కార మొక్కదానికే సంభవము గలదు. అసంభవములగుటవల్లనే ఎ ఒ ఓ లు చూపఁబడవయ్యెను.

పయిరెండుసూత్రముల యుదాహరణములలో మొదటిప్రత్యయమునందు పోయెడు'ను', ఆయెడు'ను', అయ్యెడు'ను' అనునవి ప్రత్యయాంతములుగాఁ గానవగును. అంతమాత్రపు భేదమునకేమి? అనుకొనరాదు. అట్లు 'ను'వర్ణ సహితములను నిర్దేశించినచో సమాపక క్రియారూపములకేగాని విశేషణ రూపములకు గ్రహణము రానేరదు. నువర్ణరహితముగ నిర్దేశించినచో రెండు విధముల రూపములకును నవకాశ మేర్పడును. ఆ దృష్టితో సూత్రకర్త నువర్ణ రహితముగనే నిర్దేశించియుండును. ప్రథమ ముద్రణమున (1858) నువర్ణము చూపట్టదు.

ఇటమీఁది ముద్రణములలో 'ను'వర్ణము తొలఁగింపఁబడుఁగాక.

**101.** పిలుచుమొదలగువానికి ముత్తుపరంబగునప్పుడు చద్వయి బహుళంబుగ లోపించు. ౧౦౧.

పిలఁడు, పిలువఁడు ; పిలుము, పిలువుము.
లేచునకు ముజ్జు పరంబగునపుడు చులోపంబగు :
లెమ్ము, లెండు.
పిలుచు, నిలుచు, తలఁగు ఇత్యాదులు.

'లేచునకు ముజ్జు పరంబగునపుడు చులోపంబగు' : అనఁగా 'సూత్రస్థ మగు బహుళపదముచే లేచుధాతువునకు ముజ్జు పరమగునపుడు చులోపము నిత్యముగానగును, వైకల్పికముకాదు, కావున లేవుము, లేవుఁడు అను రూపము లుండవు' అని యొక యర్థము.

'లేచుధాతువునకు ముజ్జు పరమగునపుడే, చులోపము కలుగును. జిత్తు పరమగునపుడు రాదు. కాఁగా లేవఁడు, లేవక, లేవని ఇత్యాదులుండవేకాని.

లేచుధాతువునకు జీత్తులందు లేఁడు, లేక, లేని ఇత్యాదులుండవు' అని మఱొక యర్థము.

కలఁడు — 'లేఁడు' ⎫ ఇవి కలుగుధాతు నిష్పన్నములుగాని లేచుధాతు
కలిగి — 'లేక' ⎬ రూపములు కావు.
కలుగు — 'లేని' ⎭

ఇటులుండ, భారతమున మౌసలపర్వమున యాదవకుల క్షయానంత రము మఱునాఁడు సముద్రముపొంగి ద్వారకను ముంచునని యెఱింగి తొలి దినమున బాలకులను, వృద్ధులను, స్త్రీజనమును ద్వారకనుండి తరలించు సమయమున త్రోవలో కిరాతు లా సంఘము నడ్డగించిన సమాచారమును అర్జునుఁడు వ్యాసునితోఁ జెప్పుసందర్భమున

"ఘనతర బాహుశక్తియును గాండివశక్తియు నస్త్రశక్తియు
న్మనమున నచ్చి యప్డు మునినాథ, కడంగితి నెట్టకేలక
ద్ధనువు గుణంబుఁగూర్చితి నుదగ్రత బాహుల 'లేక' యుండె న
స్త్రనికర మంత్రతంత్రములు సంస్మృతిఁ బొందవ యేమిచెప్పుదున్"

అను పద్యము గలదు. —మౌసల-211.

కష్టపడి యెట్టెటులో గాండీవమున నారి సంధించితినిగాని దానినెత్తి బాణము ప్రయోగించుటకు 'బాహుల లేకయుండె' — అనఁగా, చేతులు లేవ వయ్యెను. అని యిది యర్జునుని వాక్యము.

ఇట లేచుధాతువునకు కజీపరత్వమున చులోపము రాకున్నచో 'లేక' యను రూపము సిద్ధింపదు. ఇది కలుగుధాతు వ్యతిరేకరూప మనుకొందమన్న పద్యభావము కుదురుపడదు. ఇచట చేతులు లేవలేదనుట పొసఁగునుగాని, చేతులు లేనేలేవనుట బొత్తిగా పొసంగదు.

సూరి ఈ ప్రయోగము చూడకుండునా? చూచినచో దీని సాధన మార్గము సూచింపకుండునా? ఒకవేళ 'లేకయుండె' అని గాక 'లేవకుండె' అనియే సోమయాజులు ప్రయోగించియుండిరేమో!

అట్టిపాఠము సూరికగపడియుండెనేమో! ఆపాఠాంతరము మనకు లభింపదయ్యెను. ఇంకను తాళపత్త్రమాతృకలు పెక్కిటిని బరిశీలించినంగాని యీసంశయములు తొలంగవు.

పయిని గణమున నిర్దిష్టమయిన 'పిలుచు'మొదలగువాని చకారాంతత్వ సామ్యమునుబట్టి 'తలఁగు'అనుదానిని 'తలఁచు'గా కొందఱు టీకాకారులు భావించిరి. అది యనాలోచితమని తోఁచెడిని. తలఁవఁడు, తలఁపక, తలఁ పని మున్నగువానికి తలఁడు, తలక, తలని మున్నగు రూపాంతరములు భాషలోఁ గానరావు. 'తలఁగు'ను 'తలఁచు' ధాతువుగా నెట్లు భావింపఁగలిగిరో!

**102.** లాంతిపోసహితము కాదేశములు కావంబగునెడి. ౧౦౨.

కావుతను, కాతను ; అగుటి, కావుటి ; అగుడును, కావుడును ;
కానను, కావునను; అనుడును, అనవుడును, నావుడును ఇత్యాది
తెలియందగునది.

'రక్షింపఁగావుతన్' అనుదానికి పర్యాయముగ 'రక్షింపఁగాక' అను రూపము శబ్దలక్షణసంగ్రహమున సాధితమయియున్నది. —శబ్దలక్షణ-4-55.

**103.** అచ్చికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగానగు. ౧౦౩.

అయిదు....ఐదు, అయిరేని....ఐరేని ; అవుడు....ఔడు,
గవునెన....గౌనెన.

అచ్చికంబులందనుటచే, జయించు మున్నగు తత్సమక్రియలయందుఁ గాని, దయితుఁడు, రవులు మున్నగు తత్సమసుబంతములందుఁగాని యీవిధి ప్రవర్తింపదు.

బహుళగ్రహణముచే అలయించు, వెలయించు మున్నగువానియందు ఈవిధికి ప్రవృత్తిలేదని తలంపవలయును.

ఈసూత్రము ధాత్వధికారస్థమయినను ఈవక్రతమములు క్రియలయందే గాక యితరములగు నాచ్ఛికశబ్దములన్నింటను ప్రవర్తింపవచ్చును. ఈ యంశము సూచించుటకే యిందలి యుదాహరణములన్నియు సుబంతపదములే చూపఁబడినవి : ఐదు = సంఖ్యావాచకము. ఐరేని = పెంట్లికుండలు. ఔడు = పెదవిక్రిందిచోటు. గౌనెన = బురకా, గరీబు.

క్రియాపదోదాహరణములు అయిరి, ఐరి; అవును, ఔను మున్నగునవి వక్ష్యమాణంపైత్వంబు వక్ష్యమాణంబౌత్వంబు అని 99, 96 సూత్రములలో నింతకుముందే చూపఁబడియుండుటచే నిటమరలఁ జూపుట పునరుక్తి యగునని విడువఁబడినవి.

పంకరవ్రాఁతలు సూరికి రుచింపవు. కావుననే కాఁబోలును ప్రక్రతమము లగు ఐఔలు అతనిరచనమునఁ గానంబడవు. వానికిమాఱుగా 'అయి, అవు'లే సర్వత్ర గానవచ్చును. బాలవ్యాకరణముమొత్తమున 'అయి' అనురూపము సుమారు డెబ్బదియయిదుతావులందుఁ గానంబడును. 'ఐ'అనునది ఉదాహరణముగాఁ జూపవలసిన 3, 4 చోటులందుఁదప్పఁ దక్కినవచనరచనలో నొక్కచోటను గానరాదు. నీతిచంద్రికయందుఁ జూచినను 'అయి'శబ్దము పెక్కుచోటుల గోచరించును. 'ఐ' కానరాదు.

అగు, అవు, ఔ అనురూపములలో 'అగు' అనునదిమాత్రమే యాతనికి రుచించును. 'అగు' అనుశబ్దము బాలవ్యాకరణమున ఎన్నియోతావులందుఁ గలదు. అవు, ఔలు మిక్కిలి యరుదు. వానియెడ నభిరుచి తక్కువ. భిన్నరుచిర్హి లోకః.

ఐఔలు, అ+ఇ, అ+ఉ అని రెండేసిస్వరములకలయికచే నేర్పడినవిగాని స్వతంత్రస్వరములు కావు. కావుననే వీనికి సంధ్యక్షరములని వ్యవహారము. దీనినిబట్టి యివి ద్విస్వరములవంటివయి అనేకాల్లులగునుగావున 'అయి, అవు'లకు సర్వాదేశములుగా వచ్చునని సూరి తలంచియుండవచ్చును. అట్లుగానిచో అంతాదేశములగునేగాని సర్వాదేశములగుటకు మార్గమగపడదు.

**104.** కలుగున కస్త్యర్థంబునందు లట్టుపరంబగునపుడు కల యగు. ౧౦౪.

ప్ర : కలఁడు, కలరు, కలదు, కలవు.
మ : కలవు, కలరు.
ఉ : కలను, కలము.

**105.** త్రర్థంబునం గలాదేశంబు విభాషనగు. ౧౦౫.

ఎడియెడులకు లోపం బిట నిత్యంబు.
కలవాఁడు — కలుగువాఁడు.

బహుళముగా విహితమయిన ఎడియెడులలోపము (క్రియా-45) ఈ తావున కలాదేశపక్షమున నిత్యముగాఁ బ్రవర్తించును.

**106.** అస్త్యర్థంబునకు లజీ, మి, క, ని, వడి వర్ణకంబులు పరంబులగునపుడు లే యగు. ౧౦౬.

ప్ర : లేఁడు, లేరు, లేదు, లేవు.
మ : లేవు, లేరు.
ఉ : లేను, లేము.
లేమి, లేక, లేని, లేవడి.

అస్త్యర్థమనఁగా కలుగుధాతువు.

లజీ, మి, క, ని, వడి అనునివియన్నియు వ్యతిరేకార్థములేగావున వమనంతరమాత్రమునందువలె "వ్యతిరేకంబున నస్త్యర్థంబునకు లేయగు"

అని సంగ్రహముగ సూత్రింపరాదాయని పఠనాపేక్షకులు శంకింపవచ్చును. కాని అట్లు రచించినచో వ్యతిరేకమున్ను వర్తించునప్పుడుగూడ ఆ సూత్రము ప్రవర్తించి కలుగకుము, కలుగకుఁడు అని కావలసినరూపములు లేకుము, లేకుఁడు అని సిద్ధమగును. అట్లుకాకుండుటకయి సూత్ర మీరీతిని రచింపఁబడిన దని తలంపవలయును.

**107.** వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాషనగు. ౧౦౬.

ప్ర : ఒల్లఁడు, ఒల్లరు, ఒల్లదు, ఒల్లవు.
మ : ఒల్లవు, ఒల్లరు.
ఉ : ఒల్లను, ఒల్లము.
ఒల్లమి, ఒల్లక, ఒల్లని. పక్షంబున వలవఁడిత్యాది.
ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులం గానంబడియెడి.
కుటిపరమగుచో ఒల్లకుము, ఒల్లకుఁడు అనియగును.

**108.** చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారంబగు. ౧౦౭.

నిలుతురు, పిలుతురు, అడఁతురు, కడతురు, చింతురు, పెంతురు, పచింతురు, వచింతురు.
చేతురు, కోతురిత్యాదు లసాధువులని యెఱుఁగునది.

వత్తురు, మెత్తురు ఇత్యాదులందు స్థానిలోని చకారద్విత్వమునకు తుల్యముగా తకారద్వయమాదేశమగును.

**109.** పడుజీకొను లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు. ౧౦౮.

చొచ్చు....చొరఁబడు ; నిలుచు....నిలువఁబడు ; కూడు.... కూడఁబడు ; పండు....పండుకొను.

**110.** తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తంబగు నగుచో నుత్వంబుపయిని దానితకారంబు దకారంబగు. ౧౧౦.

అగుదెంచు, నెగయుదెంచు, పోవుదెంచు.
అగు, నెగయు, పోవు, చొచ్చు, పుచ్చు, తోఁచు, నడచు, పఱచు, మొలచు, వీచు ఇత్యాదులు.

**111.** అభ్యాగతి నరుగ్వాదుల కయ్యాది యనుప్రయుక్తంబగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు. ౧౧౧.

అరుదెంచు; అరుగుదెంచు, ఏతెంచు, ఏగుదెంచు; చనుదెంచు.

**112.** అయ్యాది పరంబగునపుడు చువర్ణంబు లోపించు. ౧౧౨.

చొచ్చు .... చొత్తెంచు ; పుచ్చు .... పుత్తెంచు ; తోఁచు .... తోఁతెంచు.

అయ్యాది అనఁగా, అనుప్రయుక్తమగు తెంచుధాతువు.—క్రియా-110. చొచ్చు, పుచ్చులలో లోపించినది ద్విరుక్తచకారముగావున ధాత్వాది గురుత్వమును నిలుపుటకయి తెంచులోని తకారమునకు ద్విత్వము గలిగినది.

అరుదెంచు, ఏగుదెంచు మున్నగువానిలో ఉత్వముపయినున్న తెంచు ధాతుతకారమునకు దకారము గలుగుచున్నది (క్రియా-110). అంతియగాక 'తెంచు'నకు నాదేశములయిన 'తే, తేరు'ల తకారముగూడ దకారమగుచున్నది (క్రియా-113). అరుదేఁడు, అరుదేరఁడు. మఱి, పుత్తెంచులోని తాకు దకార మేలరాదు ? అని చర్చాకౌతుకులు శంకింపవచ్చును.

కాని పుత్తెంచులో ఉకారముపయి తకారము ద్విత్వరూపమున నాదేశముగ వచ్చి చేరినదేగాని తెంచుధాతుతకారము కాదు. తెంచుధాతువులోని తకారమునకే దకారము విధింపఁబడినది. "ఉత్వముపయిని 'దాని' తకారంబు దకారంబగు" (క్రియా-110) అను సూత్రమునందలి "దాని" అను శబ్దముచే సూరితాత్పర్యము సూచితమయియున్నది.

అట్లుగానిచో 'ఉత్వంబుపయితకారంబు దకారంబగు'ననియే సూత్రింపవచ్చునుగదా ! అధికముగా 'దాని' అనుపదమెందులకు ? ఆపదమునుబట్టియే ఆతని తలంపు నూహింపవచ్చును.

**113.** అద్దానికి ముత్తు పరంబగునపుడు తేతేరులగు. ౧౧౩.

అగుదేఁడు, అగుదేరఁడు ; అగుదెమ్ము, అగుదేరుము.

అద్దానికి అనఁగా ననుప్రయుక్తమగు తెంచుధాతువునకని యర్థము. అగుదెండు : ఇచట అగుదెంచు అనుమొత్తమేగాక అనుప్రయుక్తమయిన 'తెంచు'అమనదికూడ ప్రత్యేకధాతువేగావున 'ఎ'కారము నుడితొలిహ్రస్వమగుటచే ఖండబిందువు రాదు. 'అగుదేఁడు'అను నపరూపము సంభవింపదు. 'తెంచు'అనుప్రయుక్తమగుననక, సూత్రమున (క్రియా-110) తెంచు'ధాతు' వనుప్రయుక్తమగునని వక్కాణించుట యిందులకేయని గ్రహింపవలయును.

**114.** భూతంబున లఙికి లిడంతంబగు నగుధాతువు ప్రయుక్తంబగు. ౧౧౪.

వాఁడు రాఁడయ్యెను, వారు రారయిరి ; అది రాదయ్యెను, అవి రావయ్యెను ; నీవు రావయితివి, మీరు రారయితిరి ; నేను రానయితిని, మేము రామయితిమి.

**115.** నుజ్యంతంబగు నగుధాతువు క్రియావిశేషణంబుల వను ప్రయుక్తంబగు నుజికి విభాషనగు. ౧౧౫.

కాను అనునది నుజ్యంతంబగు నగుధాతువురూపంబు.

**116.** దానికి హ్రస్వంబు విభాషనగు. ౧౧౬.

లెస్సగాను, లెస్సగను ; న్యాయ్యముగాను, న్యాయ్యముగను : ఇట సరళంబు నిత్యంబు.
చూడఁగాను, చూడఁగను, చూడను : ఇట హ్రస్వత్వంబులేదు.

**117.** ఉన్న, కల, న వర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాషనగు. ౧౧౭.

బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు.
వండుచున్నవాఁడు .... వండుచున్నాఁడు; వండుచున్నవారు .... వండుచున్నారు ; వండుచున్నవాఁడవు .... వండుచున్నాఁడవు ; వండుచున్నవారరు .... వండుచున్నారరు ; వండుచున్న వాఁడను .... వండుచున్నాఁడను ; వండుచున్నవారము .... వండుచున్నారము.
ఇట్లు వండఁగలవాఁడు, వండఁగలాఁడు, వండినవాఁడు, వండినాఁడిత్యాదులెఱుంగునది.

భూతార్థమున, నవర్ణకాంతవిశేషణములుగా

| | | |
|---|---|---|
| 1. వండినాఁడు | 3. వండినావు | 5. వండినాము |
| 2. వండినారు | 4. వండినారు | 6. వండినాము |

ఈ యాఱును వ్యవహారమున దృఢముగా నాటుకొనియున్నవి. ఇందు, 1, 2, 4 లు వ్యాకరణ సాధ్యములు ; 3, 5, 6 లు అసాధితములు. ఈ

మూఁడును పండినాఁడవు, వండినాఁడను, వండినారము అన్నంతమేరకే సాధితములు. వీనిలో డకారరేఫముల లోపము విహితముకాలేదు. ఈయాఱును క్రియాపదములకు మాఱుగా ప్రయుక్తములగుచున్న సుబంతవిశేషణములేగాని క్రియాపదములు కానేరవు. కారకక్రియలని వీనికి వాడుక గలదు.

**118.** ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు. ౧౧౮.

> కూరుచుండు, నిలుచుండు, పరుండు, పన్నుండు, ఆఁకొను, ఈకొను, ఈయకొను, ఇయ్యకొను, రక్కొను, త్రెక్కొను, మేకొను, మయికొను, మేలుకొను, మేలుకను, మేలుకాంచు, అలవడు, ఏరుపడు, చొప్పడు, వెలువడు, తలపోయు, వాసపోయు, ఆపోవు, కొంపోవు, కొనిపోవు, విజయంచేయు, కయివ్రాలు, తూపోడుచు ఇత్యాదులు శబ్దపల్లవంబులు.

**119.** చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. ౧౧౯.

> ఆఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్.
> వాఁడు రేపు వచ్చెనేని నీవు కార్యంబు దొరకొనుము.

ఈరెండును ఆపాతతః వచనములవలె గోచరించును. కాని, మొదటిది పద్యపాదము.

> "పేరు ఋష్యశృంగుఁడంట ! పిల్వఁబంపు పంపఁగాన్
> ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁగార్యముల్."
>
> —రామాభ్యుదయ-2-75.

**120.** ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయి వచనంబు ధాతువిశేషణంబులకగు. ౧౨౦.

> రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబునకేతెంచె.

**121.** అగతికంబులగు ఖ్యాదుల కిందు యోగంబు లేదు. ౧౨౧.

ఖ్యా, స్మృ, కౄ, రేకౄ, లోకౄ, లోచ, పచి, లప ఇత్యాదులకు గతివిరహితంబులగు ధాతువుల కీభాషం బ్రయోగంబు లేదు.

ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప, ఊరీ ప్రభృతులును, సాక్షాత్ప్రభృతులును గతిసంజ్ఞా కంబులు.

ప్రాదు లిరువదిరెండు నుపసర్గంబులు నాఁబడు.

ప్రభవించు, ఆవిర్భవించు, ప్రసరించు, సంస్కరించు, భస్మీకరించు, సాక్షాత్కరించు, అతిరేకించు, అలోకించు, ఆలోచించు, ప్రపంచించు, ప్రలపించు ఇత్యాది లాద్య ప్రయోగంబుల నెఱుఁగునది.

**122.** వలయ్వాదిక్రియలకుం గర్తయగు ధాతువునందు నుజె యగు. ౧౭౨.

వలయ్వాదిక్రియలకుం గర్తృభూతక్రియావృత్తియగు ధాతువునకు నుజివర్ణకంబగు :

వాఁడు చూడవలయు, వారలు చూడఁగా వలయు ; నీవు చూడ వలయు, మీరు చూడవలయు ; నేను జూడవలయు, మేము చూడవలయు, మనము చూడవలయు.

వలయును, వలదు ; కూడును, కూడదు ; చెల్లును, చెల్లదు ; తగును, తగదు ఇత్యాదులు వలయ్వాదులు.

సకర్మకంబునకు స్వరూపప్రేరణార్థంబులు రెండును, గొను పద్వనుబంధంబులం దొక్కొక్కటితోడ, రెంటితోడం గూడుచో నగునవి యాఱుం, గూడ రూపంబు లెనిమిదయ్యె. వాని నీరీతి నుదాహరించెద :

i. కర్త్రర్థకము : మైత్రుఁడు వంటకమును వండెను.

ii. ఆత్మనేపద కర్త్రర్థకము : మైత్రుఁడు వంటకమును వండుకొనియెను.

iii. కర్మార్థకము : మైత్రునిచేత వంటకము వండఁబడియెను.

iv. ఆత్మనేపదకర్మార్థకము : మైత్రునిచేత వంటకము వండుకొనఁబడియెను.

v. ప్రేరణకర్త్రర్థకము : చైత్రుఁడు మైత్రునిచేత వంటకము వండించెను.

vi. ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము : చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించుకొనెను.

vii. ప్రేరణకర్మార్థకము : చైత్రునిచేత, మైత్రునిచేత వంటకము వండింపఁబడియెను.

viii. ప్రేరణాత్మనేపద కర్మార్థకము : చైత్రునిచేత, మైత్రునిచేత వంటకము వండించుకొనఁబడియెను.

పయి సూత్రోదాహరణములలో 'వాఁడు + చూడ + వలయు' ఇత్యాదివాక్యములందు చూడన్ అనుదానికి చూచుటయని యర్థము. ఇవన్నియు మూఁడుపదముల వాక్యములు. వాఁడు + చూడన్ + వలయు. 'చూడవలయును' అనునది ఏకపదమనుకొనరాదు.

వీనియన్నింటను 'వలయును' అను సమాపకక్రియకు 'చూడన్' అనునదియే కర్తృపదము. వాఁడు, వారలు ఇత్యాదులు దానికి కర్తృపదములు గావు. చూడన్ = చూచుట, వలయును = ఆవశ్యకమగును. అనిసమన్వయము.

భావార్థమున 'నుజీ' వచ్చినదని చూపుటకు 'వాఁడు చూడ వలయు' అని యొక్కయుదాహరణమే చాలియుండ, ఏడుదాహరణములు చూపుట పయియభిప్రాయమును సూచించుటకే. అనఁగా, చూడన్ అనునది కర్త గావుననే 'వలయును' అనునది వాక్యములన్నిటను ప్రథమపురుషైకవచనాంతముగనే నిలిచినదనియు, వాఁడు—వారు, నీవు—మీరు, నేను—మేము అనువానినిబట్టి పురుషవచనభేదములచే దానికి మార్పు కలుగలేదనియు సూచించుటకేయని యెఱుంగవలయును.

నుజీకి నిట్టిభావార్థకత భాషలోఁ బలువిధములగు ప్రయోగవిన్యాసములందు గాటముగా నాటుకొన్నది.

క్రింది ప్రయోగరీతులు పరికింపుఁడు :

i. "అడుసు త్రొక్కనేల ! కాలు కడుగనేల !" ---మిత్రలాభము.

త్రొక్కుట యెందులకు ? కడుగుట యెందులకు ?

"ఇంకఁ గొఱఁతవెట్టనేల యే నర్జునుఁడన్" —విరాట-4-134.

"మీ ! లో నభిమన్యుఁడు లేఁడే ! మో నాకుం జెప్పఁడేల యూరక యుండన్." —ద్రోణ-2-233.

ఇట్టిచోట వలయ్వాదిక్రియాపదములతో సంబంధములేకున్నను భావార్థ మున 'టజ్' ప్రత్యయము రావచ్చుచున్నది.

ii. వాఁడుచెప్ప, వీఁడువిన : చెప్పుట, వినుట.
నేనుపాడ, నీవువిన : పాడుట, వినుట.
వాఁడుతిట్ట, వీఁడుకొట్ట : తిట్టుట, కొట్టుట.
వాఁడియ్యను, వీఁడుపుచ్చుకోను : ఇచ్చుట, పుచ్చుకొనుట.
అటుచూడ, ఇటుచూడ : అటుచూచుట, ఇటుచూచుట.
చెప్పనుజడితిని : చెప్పుటకుజడితిని. చదువ మొదలిడితిని : చదువుట మొదలిడితిని—ఇట్టివెల్ల భావార్థకములే.

iii. ప్రతికార్యమునకు తానే సిద్ధపడనా ! = సిద్ధపడుటయా !
ఎవరు వద్దనుకొన్నామో అతఁడే [illegible] : [illegible] పడుటయా !

ఇట్టివాక్యములందును వలయ్వాదుల సంబంధము లేకున్నను టజ్ భావార్థకమే.

iv. ఎప్పుడు పిలువను ? = పిలుచుట ?
ఎప్పుడు పంపను ? = పంపుట ?
ఎప్పుడు రాను ? = వచ్చుట ?

మున్నగుతావులందెల్ల టజ్ భావార్థకమే.

v. ఒకరిని తూలనాడుమాటలలోఁ దఱచు ఈ భావార్థక టజ్ ప్రత్యయమే కాననగును.

కాలువిఱుగ = విఱుగుట, తలపగుల = పగులుట, నోరుపడ = పడి పోవుట — ఇట్టితిట్టులందు భావార్థకమున టజ్ప్రత్యయము వ్యవహరింపఁ బడును.

లోకవ్యవహారముననేగాక కవుల గ్రంథములందును తిట్టుమాటలసంద ర్భమున నిట్టిప్రయోగసరణి గలదు.

కాళహస్తి మాహాత్మ్యమున (4-35) వేశ్యమాత తనకూఁతుల శివభక్తి పరతను తూలనాడుచు వారకాంతాధర్మము లుపదేశించుటలో

"రసికులు మీగానరస మానవచ్చిరి పాడరే శివభక్తి పాడుగాను
.... .... .... .... .... చూడరే శివభక్తి చూఱవోను
.... .... .... .... .... పలుకరే శివభక్తి పాఱిపోను
.... .... .... .... .... పిలువరే శివభక్తి పెంపుచెడను"

అనియు, పల్నాటివీరచరిత్రమున (47, 48 పుటలలో) బాలుని బొంగరము తాకికిఁదగిలిన వైశ్యాంగన వానిని తూలనాడుటలో

> "మురియంగనేల నీపొంగెల్ల నణఁగ
> మురిదె మదంబు నీ మురిపెంబు గ్రుంగ
> సమరంబులో నిన్ను శత్రులు గ్రుమ్మ
> నడిచెడు పదముల నారసాలేయ
> చూచెడుకన్నుల సూదులు గ్రుచ్చ"

అనియుఁ గానవచ్చును.

ఇట్టి తూలనాడుప్రసంగములందు భావార్థక నుజ్ప్రత్యయమునే ప్రయోగించుతీరు భారతకాలమునకే యేర్పడినట్లు గానంబడును.

అభిమన్యుమరణానంతరము ధర్మజాదులు దీనవదనులై కూలఁబడి యుండ, అర్జునుఁడు వచ్చి వారిదుఃఖమునకు నిమిత్తమెఱుంగక తెల్లవోవుచు వారిలో నభిమన్యునిఁగానక తల్లడపడుచు పరిపరివిధముల తలపోఁతలతో

"మీరు పద్మవ్యూహమున చొరఁబడుమని వానిని ఆ వ్యూహములోనికి త్రోయలేదుగదా! ఏ తెలివి పాడుగాను" అనుచున్నాఁడు.

> ధనురాచార్యుఁడు తగఁ బ
> న్నిన పద్మవ్యూహ మెఱుఁగు నేరఁడు చొరుమం
> చనుమానింప కతనిఁ జొరు
> మనటుగదా మీయుపాయ మాఱడిఁ'బోవన్' —భారత-ద్రోణ-2-234.

ఉపాయము ఆఱడిఁబోవన్ = వ్యర్థమగునట్లుగా అని క్రియావిశేషణముగా చెప్పనిసమన్వయముకంటె తూలనాడుటగా సమన్వయించుటయే ప్రకృత ప్రసంగమున తిక్కనహృదయ మయియుండును. పరిశీలింపుఁడు.

ఇటులిన్నివిధముల వ్యవహారములందు నుజ్ప్రత్యయము భావార్థమునే బోధించుచున్నను, వలయ్యాదిక్రియలతోడి సంబంధముననే సార్వకాలికము సార్వత్రికమునగు వ్యవహారమునుబట్టి వలయ్యాదిక్రియాసంబంధమును సూరి నిర్దేశించియుండును.

అంతియగాక పయినిజూపిన భావార్థకనుజ్యంతముల యన్వయమునకు నేదోయొక క్రియాపదము నధ్యాహరించుకొనకతప్పదు. అధ్యాహరింపఁబడు నాక్రియలు వలయ్యాదులందే చేరవచ్చును. అపుడివియన్నియు నీసూత్రమునకే సూటిగా లక్ష్యములు కాఁదగియుండుననియు సూత్రకారుని యుద్దేశము కానోవును.

మఱియు, కాఁబట్టి = అగుటవలన, రాఁబట్టి = వచ్చుటవలన, చెప్పఁబట్టి = చెప్పుటవలన—ఇత్యాదులందు పంచమ్యర్థమున పట్టివర్ణకము కలుగుట

గూడ నుడిపర్ణకము భావార్థక ఉపసర్గకముతోఁ [illegible]
సూచింపుచున్నది.

'వలయును' అనుదానికి 'వలెను' అనురూపాంతరము [illegible].

"నీ వరోక్షంబున రాజు గావలె" —ఆది-1-17[illegible].

"శ్రీగావలెనంచుఁ బోలితము గామియుఁ గోరెద" —ఉద్యోగ-3-2[illegible].

అని యిట్లు 'వలయును' అనుదానికి 'వలెను' అనురూపాంతరము భారతము నందును గలదు.

**123.** గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్తయగునది ప్రేరణంబునం గర్మంబగు. [illegible]

పొందు మొదలయినవి గత్యర్థకంబులు.
తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు.
తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు.
విను, చెప్పు, చదువు మొదలయినవి శబ్దకర్మంబులు.
అకర్మంబులు ప్రసిద్ధంబులు.
మైత్రుండు గ్రామంబుం బొందెను....చైత్రుఁడు మైత్రుని గ్రామంబుం బొందించెను.
లాఁతిచోసహిత మిక్కార్యంబు గానంబడియెడి :
మైత్రుండు పుడమి నేలెను....చైత్రుఁడు మైత్రునిం బుడమి నేలించెను.

ఈ సూత్రమునకు అనువాదమగు హరికారిక పరిశీలింపఁదగినది. దీనిని సూక్ష్మదృష్టిని పరికించితిమేని బాలవ్యాకరణమే మూలగ్రంథమనియు, హరికారికావళి దీనికి ననువాదమనియు, వాస్తవికమగు సిద్ధాంతము ఎల్లవారలకుఁ దెల్లముకాఁగలదు. ఆ సిద్ధాంతములకు స్థాపకములగు నుపపత్తులు ప్రబలములు పెక్కులున్నను, వాస్తవమును పట్టిచూపుటకు నీ స్థలమొక్కటియె చాలును. పరికింపుఁడు.

ఈ యనువాదమున నవలంబింపఁబడిన పద్ధతి యొకటి గలదు.

ఏ సూత్రమునకాసూత్రము వృత్త్యుదాహరణసహితముగ సంస్కృతీకరింపఁబడలేదు. ఒకేసూత్రమునకు ఒకేకారిక ఛందస్సునఁ గుదురుపడదు గానఁ దఱచుగ నొకకారికలో రెండు, మూఁడు సూత్రములను నిముడ్పవలసి వచ్చును. ఆ కూర్పులో సౌకర్యమునకయి సూత్రములు కారికారూపమునవను,

వివరణోదాహరణములు వచనరూపమునను వేఱువేఱుగ సంస్కృతీకరింపఁ బడినవి.

ఈ సూత్రమునకు కారికరచించుటలో శబ్దకర్మాకర్మకంబులు అనువరుస ఛందస్సునఁ గుదురుపడక అకర్మక శబ్దకర్మంబులని క్రమము తాఱుమాఱు చేయఁబడినది. పిమ్మట బాలవ్యాకరణమునను్న క్రమముననే వివరణ వాక్యములు సంస్కృతీకరింపఁబడి కారికకు అదికింపఁబడినవి. తిలకింపుఁడు:

"గతి[1]బుద్ధ్య[2] ద[3]నార్థాయేఽకర్మకా[4] శ్శబ్దకర్మకాః[5]
తేషామప్రేరణే కర్తా ప్రేరణే కర్మభావభాక్
పోంవ్వాదయః గత్యర్థా[1]ః, తెలియ్వ్వాదయః బుద్ధ్య[2]ర్థాః
తిన్వ్వాదయః అదనా[3]ర్థాః, వినుచదువు చెప్ప్వ్వాదయః శబ్దక[5]ర్మాణః
అకర్మ[4]కాః ప్రసిద్ధాః"

ఈ రచనలో కారికలోని క్రమమునకును, వృత్తిలోని క్రమమునకును విరోధము సంభవించినది. బాలవ్యాకరణమునుబట్టి యనువదించుటగాక స్వతంత్రముగనే కారికాగ్రంథము రచింపఁబడినచో, కారికలోనిక్రమమునకును తదుదాహరణక్రమమునకును విరోధము సంభవించుటకు లేశమును నవకాశము లేదు. అది మిక్కిలి యసంభవము.

దీనింబట్టియే హరికారికలు స్వతంత్రములు కావనియు, బాలవ్యాకరణమును బట్టి సంస్కృతీకరింపఁబడినవనియుఁ దేటతెల్లమగును. అయినను మఱికొన్ని ప్రబలసాక్ష్యములకు 'అనువాద వివేచన' ప్రకరణము పరికింపుఁడు.

**124.** అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగానగు.

౧౨౪.

రాముఁడు మిథిలం గనియె....రామునకు మిథిల గనంబడియె, రామునిచే మిథిల గనంబడియెను.

మైత్రుండు తత్త్వంబుం దెలిసెను....చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను.

కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగానగు: విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను; కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను.

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్మానుబంధంబులు లేమింజేసి రూపభేదంబు లియిదని యెఱుంగునది—

i. కర్త్రర్థకము : మైత్రుండు మనియెను.

ii. ప్రేరణ కర్త్రర్థకము : చైత్రుండు మైత్రుని మనిపెను.

iii. ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము : చైత్రుండు మైత్రుని మనుపుకొనియె.

iv. ప్రేరణకర్మార్థకము : చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె.

v. ప్రేరణాత్మనేపద కర్మార్థకము : చైత్రునిచేత మైత్రుండు మనుపుకొనఁబడియె.

వెండియుం బ్రేరణంబునం దిందుఁ గాగమంబు గలిగినచో నకర్మకంబునకుం బంద్రెండు సకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహింపునది.

ఇది క్రియాపరిచ్ఛేదము.

పయినిజూపినది అకర్మకధాతురూపముల పట్టిక. ఇట్టిదే సకర్మకముల పట్టికయొకటి 122వ సూత్రమున వివరణోదాహరణముల తుదిని జూపఁబడినది. ప్రథమ ముద్రణమునుండి నేఁటిదాఁక ముద్రణము లన్నింటను ఆ రావుననే గానవచ్చుచున్నది. ఆ సూత్రమునకును ఆ పట్టికకును సంబంధము లేశమును గానరాకున్నది. ఈ సకర్మకాకర్మక ధాతురూప పట్టికలు రెండును పరిచ్ఛేదము మొత్తమునకు సంబంధించునవిగాని, ప్రత్యేకముగ ఏ సూత్రమునకును సంబంధించునవికావు. కావున సకర్మక రూపపట్టికకూడ, ఈ అకర్మక రూపపట్టికకుముందు ఇచటనే — పరిచ్ఛేదాంతముననే — యుండఁదగినది. సూరి రెండు పట్టికలను ఈ తావుననే ప్రచురించియుండును. "వెండియుం బ్రేరణంబునందు" అనువాక్యమున రెండవపట్టిక తుదిని పట్టికలరెండిటినిగూర్చి ఒక యంశమును జోడించి ఉల్లేఖించుటయే ఆతని ఆంతర్యమును వెల్లడించుచున్నది. ఇటులుండ, సకర్మక పట్టిక 122వ సూత్రమునిడ కెట్లుచేరినదో ! ఆ స్థానముమార్చి దానింగూడ ఇచ్చోటనే ముద్రింపింతమా ! ఆలోచించి ఆ మార్పు గావింతము. పూరంబు విచారించి చేసిన దానం గొఱంతలేదు.

ఈ పరిచ్ఛేదమున సకలధాతుజన్యములగు రూపములు విశదమగు ప్రక్రియతో విపులముగా నిష్పాదింపఁబడినవి. ఇఁక, కొన్నికొన్నిధాతువులనుండి జన్యములగు విశేషరూపములు రాఁబోవు ప్రకరణమున ప్రదర్శింపఁబడును.

---

# కృదంత పరిచ్ఛేదము

1. కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు. ౧.

ధాతువునకు విహితంబగు డుజ్భిన్న ప్రత్యయంబు కృత్తు నాఁబడు. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృకర్మాద్యర్థంబులు మహాజన వ్యవహారానుసారిగా నెఱుంగునది.

ఆఁక = బంధనము; మొలక = నవోద్భిదము ; ఏలిక = పాలకుఁడు ; కోరిక = వాంఛయు, వాంఛితంబును ; మూఁక = సంఘము ; ఆడిక = నింద ; ఓడిక = స్రోతస్సు.

ఆఁగు + క = ఆఁక : (బంధనము = అడ్డగింత) భావార్థము.
మొలచు + క = మొలక : (నవోద్భిదము = మొలచునది) కర్త్రర్థము.
ఏలు + ఇక = ఏలిక : (పాలకుఁడు = పాలించువాఁడు) కర్త్రర్థము.
కోరు + ఇక = కోరిక : (వాంఛ = కోరుట ; వాంఛితము = కోరఁబడునది) భావ, కర్మార్థములు.
మూఁగు + క = మూఁక : (సంఘము = మూఁగునది) కర్త్రర్థము.
ఆడు + ఇక = ఆడిక : (నింద = ఆడుట, ఆడఁబడినది) భావ కర్మార్థములు.
ఓడు + ఇక = ఓడిక : (స్రోతస్సు = ఓడునది = ప్రవాహము) కర్త్రర్థము.

క్రియాపరిచ్ఛేదమును, కృదంత పరిచ్ఛేదమును ధాతువులకు సంబంధించినవి. 'ధాతువునకు' అను నధికారసూత్రము కృదంతపరిచ్ఛేదమునఁగూడ ననువర్తించును.

సమాపకక్రియలయందలి డుజ్, రు, వు, రు, ను, ము అను నాఱును గాక ధాతువునకుఁ బరముగావచ్చు తక్కినప్రత్యయముల కన్నింటికిని కృత్తులనియే పేరు. అనఁగా

| | |
|---|---|
| ట—వండుట<br>మిజీ—వండమి | విశేష్యములు |
| ఇ—వండి | అవ్యయములు |
| కజీ—వండక | అసమాపకక్రియలు |

మజీ—పండన్
నన్—పండినన్
డున్—పండుడున్
చున్—పండుచున్

} అవ్యయములు అసమాపకక్రియలు

ఎడి—పండెడి
ఎడు—పండెడు
ఉన్న—పండుచున్న
కలజీ—పండఁగల
న—పండిన
నిజీ—పండని

} విశేషణములు

అని క్రియాపరిచ్ఛేదమున విహితములయిన ఈ ప్రత్యయములు పదునాలుగును గూడ కృత్తులే.

అయినచో వానినిగూడ కృత్తులన్నిటితోపాటుగ నీకృదంత పరిచ్ఛేదము ననే చూపుట ప్రకరణోచితముగదా! వానిని క్రియాపరిచ్ఛేదమునఁ జెప్పనేల? అనరాదు. కృత్తులలోఁ గొన్నిటిని విడఁదీసి క్రియాపరిచ్ఛేదమునఁ జేర్చుటకు సూరిదృష్టిలో ప్రబలమగు కారణము గలదు.

అతఁడు బాలవ్యాకరణమున నిర్దేశింపఁబడిన కృత్తులు మొత్తము ముప్పదియెనిమిది. వీనిస్వరూపస్వభావములలోని భేదమును సుమారుగ వివేచించి వీనిని రెండుజాతులుగా విభజించినాఁడు.

మొదటిజాతి — 24 ; రెండవజాతి — 14.

ఈరెండు జాతులకును గలభేద మెట్టిదన, మొదటి జాతిలోని కప్రత్యయములు కొన్నికొన్ని ధాతువులకు మాత్రమే వచ్చుచుండును.

రెండవజాతిలోని టవర్ణకాదు లట్లుగాక సర్వధాతు సాధారణములు. అనఁగా నయ్యవి ఏధాతువునకయినను రావచ్చునన్నమాట.

మఱియు, మొదటిజాతిలో కృత్ప్రత్యయములలోని క, గ, త, ప, వ, ఇవి అనునవి పరమయినయెడ ధాతువుతుదినున్న క, గ, చ, య, వ లు లోపించును.

రెండవజాతికృత్తులలోని క, గ, త, ప, వేములు, అట్లు క, గ, చ, య, వ, ల లోపమునకు నిమిత్తములు కానేరవు. అనఁగా నవి పరమగుచో ధాత్వంతములకు లోపము రాదన్నమాట.

అలుగు + క = అలుక : గకారము లోపించును. (మొదటిజాతి)
అలుగు + కజీ = అలుగక : గకారము లోపింపదు. (రెండవజాతి)

ఇంతియగాక మొదటిజాతి కృత్తులలో ఒక్కొక్కదానికి అనేకార్థము లుండుట, ఒకేయర్థమున అనేక కృత్తులు వచ్చుట, యను గజిబిజి యుండుటచే ఈ కృత్తులకు సూటిగా నర్థములు నిర్దేశించుట కుదురుపడదు. కావుననే యీ ప్రకృతసూత్రము

'కృత్తులకర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు'

అని యవతరింపవలసివచ్చినది.

రెండవజాతి కృత్తులగు టవర్ణకాదులు పదునాలుగింటికిని భావాద్యర్థము లను సునిశ్చితముగా నిర్దేశింప వీలుగలదు.

ఇట్టిభేదములను బర్యాలోచించి సూరి కృత్తులమొత్తమునుండి సర్వధాతు సాధారణములగు వానిని వేఱువఱిచి యాపదునాలుగింటిని క్రియాపరిచ్ఛేదమునఁ జేర్చియుంచెను.

క్రియాపరిచ్ఛేదమయినను, కృత్ప్రత్యయములకు, కృదంతపరిచ్ఛేద మంతటి స్వస్థానము కాకపోయినను, కేవలము పరస్థానము కాదు. క్రియయనఁగా ధాతువు. ధాతువులకు వచ్చునవి కృత్తులు. కావున కృత్తులప్రసంగము క్రియా ప్రకరణమునను౦డుట యనుచితము కాదు. మఱొకయంశము.

ధాతువులనుండి నిష్పన్నములగు సమాపకక్రియా రూపములనేగాక, అసమాపకక్రియలగు నవ్యయములను, ప్రధానములగు కొన్ని విశేష్యములను, విశేషణములనుగూడ క్రియాపరిచ్ఛేదముననే నిర్దేశించుటలో ధాతుజన్యములగు శాఖలనన్నిటిని జూపినట్లగునుగాన, ఆ క్రియాపరిచ్ఛేదమునకు నొకరీతి సంపూర్ణతసయితము సిద్ధించినది.

పయిని జూపినరీతిని, ఈపరిచ్ఛేదమునందలి కృత్తులలో నొక్కొక్కదాని కర్థములు అనేకములుండుటయు, నొకేయర్థమున ననేకకృత్తు లుండుటయుఁ గలదు. ఈస్థితిలో దీని కిది యర్థమని నిష్కృష్టముగా నిర్దేశింపవలనుపడదు. కావుననే సూరి

'కృత్తులకు వక్ష్యమాణంబులకు భావ కర్తృ కర్మాద్యర్థంబులు మహాజన వ్యవహారానుసారిగా నెఱుంగునది'

అని పరిచ్ఛేదమున కంతకును నవతారికగా నీవాక్యము నుల్లేఖించియుండెను.

ఇంతకుముందు క్రియాపరిచ్ఛేదమున ఉక్తములగు కృత్తులకు నర్థనిర్దేశము చేయఁబడినదనియు, నిటమీఁద నీపరిచ్ఛేదమున వక్ష్యమాణములగు కృత్తులకు అర్థనిర్దేశము చేయుతలంపు లేదనియు, కేవలప్రత్యయములు మాత్రమే విధింపఁ బడునవియు, అర్థములను సందర్భోచితముగా నూహించుకొనవలయుననియుఁ దనప్రణాళికను దేటపఱిచెను.

ఇన్నికారణములచే ఇన్నియుదాహరణలతో ఇన్నిరీతులుగా సంతరించిన యీ ప్రకారిత వ్యవహారమును నిరుపకయు గమనింపఁజాలక కృష్ణకృష్ణకవి పయి యుపతారికావాక్యమును స్థూలదృష్టితో

"వక్ష్యమాణాః భావకర్తృకర్మాద్యర్థాః కృతామిహ
మహాజనస్య విజ్ఞేయాః వ్యవహారానుసారతః"

అని యుపదేశించెను.

ఈ యనువాదమునఁ దాత్పర్యమంతయుఁ దలక్రిందులయినది.

'ఈప్రకరణమున, కృత్తులకు నిటమీఁదఁజెప్పఁబడు భావాద్యర్థములు
పెద్దలవ్యవహారము ననుసరించి తెలియంగవలయును'

అని యీకారికవలనఁ దేలుచున్న తాత్పర్యము.

మూలవాక్యములోని 'వక్ష్యమాణములు' కృత్తులుగాని యర్థములుగావు. పరిచ్ఛేదమంతటను కేవలప్రత్యయములనేగాని యర్థము నొక్కఁ డానియును నాతఁడు నిర్దేశించియుండలేదు. కారికాకర్తయు కారికలన్నిటిలో మూలసూత్రాను సారముగా కేవలకృత్తులనే యర్థనిర్దేశశూన్యముగనే ప్రసక్తించియుండెను.

ఇటమీఁది సూత్రములలో కృత్తులకర్థములు చెప్పఁబడునని ప్రతిజ్ఞారంభమునఁ బలుకుటయు, ప్రకరణములోపల ఒక్కకృత్తునకయిన ఒక్కయర్థమయినఁ జెప్పకుండుటయు పరికించినచో ఈసందర్భమున హరికారికలలో నేర్పడిన పూర్వాపర విరోధము, ఇంత-అంత అనరానిది : ఎట్లు సరిపుచ్చుటకును శక్యముకానిది.

కారికాకర్త యసమర్థుఁడు కాఁడుగదా యిట్టి స్వవచన వ్యాఘాతము సంభావ్యమా యనుకొందురేమో !

ఈ పూర్వాపర విరోధము అపరిశీలన మూలకము, భ్రాంతిమూలకమును గాని, యసమర్థతా మూలకముగాదు.

ఈతాపున ఆయనకు భ్రాంతిని గలిగించిన సన్నివేశ మొకటి గలదు. సూక్ష్మదృష్టితో పరిశీలింపుఁడు.

సాధారణముగాఁ దెలుఁగున వాక్యరచనలో విశేషణములను ముందుంచి పిమ్మట విశేష్యములుంచుట యిటీవలి శైలిలో మనయభ్యాసము. 'సుందరుఁడగు బాలుని జూచితిమి' అందుమేగాని 'బాలుని సుందరుని జూచితిమి' అనము. విశేష్యమును ముందు ప్రయోగించుశైలి మన కంతగా వభ్యస్తముగాదు.

ప్రాచీనశైలిలో నన్నయాదుల వచనములందు

'అప్సరసను మేనకయనుదానిం జూచి'

అని యిట్లు విశేష్యమును ముందు ప్రయోగించుపద్ధతియుఁ గాననగును.

ఆరీతికూర్పునందు సూరికి నభిరుచి మెండు. కావుననే

'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు'

—తత్సమ-39.

'ఇంచుక్ప్రత్యాంతంబునకు నబిందుకంబునకు....' —క్రియా-71.

'ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబునకు....'

—సమాస-21.

అని యిట్లు విశేష్యమును ముందుంచి వాక్యము రచించు నభ్యాస మాతనికిఁ గలదు. ఆ యభ్యాసము చొప్పున నిట

'కృత్తులకు వక్ష్యమాణంబులకు భావ కర్తృకర్మాద్యర్థంబులు'

అని 'కృత్తులకు' అను విశేష్యమును ముందుంచి ఆ పిమ్మట విశేషణమును ప్రయోగించి వాక్యము రచించెను.

కారికాకర్త యీ వాక్యమును స్వయముగాఁ జూచుచునో ఒరులచేఁ జదివించుచు వినుచునో 'వక్ష్యమాణంబులకు' అనుచో కువర్ణ గువర్ణములకు సాదృశ్యముండుటంబట్టియు, విశేషణమును దానితరువాతనుండు విశేష్యముతో నన్వయించు నభ్యాస ముండుటంబట్టియు, 'వక్ష్యమాణంబులగు భావకర్తృకర్మాద్యర్థములు' అని భ్రమఁజెంది

'వక్ష్యమాణాః భావకర్తృకర్మాద్యర్థాః'

అని యనువదించియుండును. లేశమును సందియములేదు.

అనువాదకారికలలోఁ బూర్వాపరవిరోధమును దెచ్చిపెట్టిన యీతబ్బిబ్బునకు, ఈ భ్రాంతియే కారణముగానిచో, అనువాదకుఁడు మిక్కిలి యసమర్థుఁడనవలసివచ్చును. లేదా, తాను మీఁదఁ జెప్పఁదలఁచుకొన్నదేదో, ప్రస్తుతము చెప్పుచున్నదేదో, ఆ వివేచనము లేశమును లేనివాఁడని యయిన ననవలసివచ్చును. ఈ కారికాకర్త అట్టి యసమర్థుఁడు కాఁడు. ఏ రచయితవిషయమునను నంత మైమఱపును సంభావించుట ఉచితముసుగాదు. విలక్షణమగు సూరివాక్యమునందలి విశేష్యవిశేషణవ్యత్యాసమే యనువాదకునిభ్రాంతికిఁ గారణమయినదనుకొనుటయే సర్వథా సముచితము.

బాలవ్యాకరణమునుబట్టియే హరికారికలు పుట్టినవను పరమసత్యమును ఈ కారిక యొక్కటే పట్టిచూపఁగలదు.

**2.** ఇటం గృత్కగతపవేములు పరంబులగునపుడు క, గ, చ, య, వ లకు లోపంబగు. వి.

కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువునంతంబులగు క, గ, చ, య, వ లకు లోపంబగు. మీఁది లక్ష్యంబులం జూడంబడు.

ఈ కృత్తులలో 'క, గ, త, ప, వ, ఇమి' అను వానిలో ఏది పరమగు నను ధాతువుతుదినున్న క, గ, చ, య, వ లలో ఏది యున్నను లోపించును.

బ్రదుకు + ఇమి = బ్రదిమి — క లోపము

కలుగు + ఇమి = కలిమి — గ లోపము

కూరుచు + ఇమి = కూరిమి — చ లోపము

మాయు + తక్ = మాఁత — య లోపము

పోవు + క = పోక — వ లోపము

ఈ సూత్రమునుబట్టి కృత్తుల మొత్తములో, ఏవేవి పరమగునప్పుడు ఏవే వర్ణములు లోపించును — అనువార్తతో ఈ పరిచ్ఛేదమునందలి లక్ష్యముల నన్నిటిని విభజించి శోధించినయెడ నీ క్రిందిరీతి వివరములు తెల్లమగును :

| | పరమగుకృత్తులు | లోపించువర్ణములు | | పరమగుకృత్తులు | లోపించువర్ణములు |
|---|---|---|---|---|---|
| క : | క : | గ, చ, వ | వ : | వడి : | చ |
| | కువ : | గ, య, చ | | వి : | య |
| గ : | గడ : | గ, చ | | వు : | చ, య |
| త : | త : | చ | | | |
| | తక్ : | య | ఇమి : | ఇమి : | గ, చ, య, క |
| ప : | ప : | య | | | |
| | పు : | య, చ | | | |

పయిపట్టికలో నవ్యవస్థితములయి విప్రకీర్ణములయియున్నను లుప్యమాన వర్ణములు క, గ, చ, య, వ లను నిర్ణయము తేలుచున్నది.

ఇఁక నిమిత్తకోటిలోని కృత్తులు పదునొకొండు గానవచ్చును. వీని నన్నిటిని విడివిడిగ నిర్దేశించుట జ్ఞప్తిసౌకర్యమును దూరముసేయుట, సూత్ర శైలికి సొగసుమాపుట. కావున, క, గ, త, ప, వ లు అనుగతముగా ఈ కృత్తులకు మొదటి వర్ణములయియుండుట నారసి వానివి మాత్రము నిర్దేశించెను.

ఇమి వర్ణకమునొద్ద ఈ మార్గము కుదురుపడదు. ఏలయన

దీనితోపాటు, ఇకారాదులయిన కృత్తులు ఇ, ఇక, ఇకి యని మఱి మూఁడు గలవు. అవి పరమగునెడ ఈ లోపము ప్రవర్తింపరాదు. కాన నిచటి నిమిత్తములలో వానికి సంబంధము కలుగకుండుటకయి తక్కినవానివలె, ఆది వర్ణమును మాత్రమే గ్రహింపక 'ఇమి' వర్ణకమునంతను వేర్కొనియెను.

కాఁగా 'క, గ, త, ప, వేములు' నిమిత్తములుగా నేర్పడి సులభ మార్గము చొప్పడినది. కాని యిప్పటికిని నొకచిక్కు మిగిలియేయున్నది.

సూత్రములు రచించునెడ ఉద్దేశ్యవిధేయములు అనేకములున్నచో వాని వర్గీకరణము 'సుఖసుఖాల' కుదురునది కాదు. అది యొకొక్కచోట మండూకముల తూకమువలె తికమకలు పెట్టును. ఎన్నోచీకాకుల కోర్చుకొన్నఁగాని యొక్కొక సూత్రము రూపొందదు. అమర్చిన పిమ్మట వంకలెన్నుట అత్యంత సుకరము.

ప్రకృతము : వ్యతిరేకక్త్వార్థకమగు కజ్‌ప్రత్యయము కృత్తేగావున పలుకక, అలుగక, నోఁచక, చేయక, నుడువక ఇత్యాదులందు కృత్సంబంధి కకారము పరమగుటంబట్టి క, గ, చ, య, వ లకు లోపమేలరాదు — అను ప్రశ్న మిట నుద్భవింపవచ్చును. ముద్దయిన ప్రశ్నగాని మోటుప్రశ్నకాదు.

వానికి సమాధానముగనే ఆ క, గ, చ, య, వ లోపమును వారించుటకే, సూత్రమున 'ఇటన్' అను శబ్దము ప్రయుక్తమయినది. పయికిది అర్థములేని యూఁతపదముగాఁ గనంబడునుగాని వస్తుతః మిక్కిలి ప్రయోజనము గలది. ఇటన్ : ఈ కృదంతపరిచ్ఛేదమందు — అని దాని కర్థము.

అనఁగా, ఈ పరిచ్ఛేదమున విహితములగు కృత్తులు పరమగునపుడే యీలోపకార్యము గలుగునని యిది బోధించును. 'కజ్' అనునది క్రియాపరిచ్ఛేదవిహితముగాన నది పరమగునపు డీలోపము ప్రవర్తింపదన్నమాట.

ఈ లోపవిధాయకసూత్రము పరిచ్ఛేదమునంతను సంబంధించినదగుటచే దీని రచనాప్రకారము రవంత విపులముగా వివరింపవలసివచ్చినది.

**3.** కవర్ణకం బలుగ్వాదులకగు. ఇ.

అలుగు .... అలుక ; ఆఁగు .... ఆఁక ;
ఎఱుఁగు .... ఎఱుక ;

ఇట బిందు లోపంబు. ఇట్లు కొన్నింట గ్రహించునది ;
కడఁగు .... కడఁక ; కలఁగు .... కలఁక ; కాఁగు .... కాఁక ;
తునుఁగు.... తునుక ; నడచు.... నడక ; నలఁగు.... నలఁక ;
పోవు .... పోక ; మడఁగు .... మడఁక ; మలఁగు .... మలఁక ; మునుఁగు .... మునుక ; మూఁగు .... మూఁక ;
మొలచు.... మొలక ; వచ్చునకు .... రా : రాక ; వంగు .... వంక ; వీఁగు .... వీఁక.

ఇక క, వు లు పరంబులగునపుడు కనునకు దీర్ఘంబగు : కానుక.
కినియు మొదియులకుత్వంబునగు : కినియు .... కినుక ;

ముడియు ... ముడుక.

ఇత్యాదులలుగ్వాదులు.

ఇత్యాదులు = పయివానిలోని రూపములుగాక ధాతువులును, తత్సిద్ధరూపము లును అని యిట్టివోట్ల (సూ. 11, 12 సూ.) సమన్వయము.

4. ఇమివర్ణకంబు కలుగ్వాదులకగు. ఉ.

కలుగు...కలిమి ; ఓరుచు...ఓరిమి ; కూరుచు...కూరిమి ; నేరుచు...నేరిమి ; ప్రేలుచు...ప్రేలిమి ; ఐడియు...ఐడిమి ; బ్రదుకు ... బ్రదిమి ; ఒద్దు ... ఒద్దిమి ; తాలు ... తాలిమి.

5. తజ్ వర్ణకంబు చేయ్వాదులకగు. ఉ.

చేయు...చేఁత ; అలయు...అలఁత ; కూయు...కూఁత ; కోయు ... కోఁత ; గీయు ... గీఁత ; నేయు ... నేఁత ; పూయు...పూఁత ; పోయు...పోఁత ; మూయు...మూఁత ; మేయు...మేఁత ; మ్రోయు...మ్రోఁత ; రోయు...రోఁత ; లాయు ... లాఁత ; వ్రాయు ... వ్రాఁత ; వ్రేయు...వ్రేఁత.

గణమునందలి శబ్దముల తీరుచూడ ఈతజ్వర్ణకమును యువర్ణాంత ధాతువులకే సూరి తలంచినట్లు స్ఫురించును. కాని ఈఁదు, ఈఁత; ఈను, ఈఁత; నలఁగు, నలఁత; కలఁగు, కలఁత ; మడఁగు, మడఁత మున్నగు యువర్ణాంతభిన్నములకుఁగూడ 'తజ్'వర్ణకము కానవచ్చుచున్నది. పోనీ గణమునఁజేర్చెదమన్నను ఈఁదు, ఈనులలోని తుదివర్ణములకు లోపము సిద్ధించుటయెట్లు ? క, గ, చ, య, వలకుమాత్రమే లోపము విధింపఁబడినది. ఇంతప్రసిద్ధములగు రూపముల నాతఁడు చూడకుండుటయెట్లు ? చూచినచో నుపేక్షించుటయెట్లు ? వీనిసాధనమునకు మార్గాంతరము నూహించియుండునా ? యోజింపవలయును.

6. కువవర్ణకం బడంగ్వాదులకగు. ఉ.

అడఁగు...అడఁకువ ; ఎఱుఁగు...ఎఱుకువ ; కలఁగు... కలఁకువ ; నలఁగు...నలఁకువ ; పెనఁగు...పెనఁకువ ; పొలయు...పొలకువ ; మఱచు...మఱకువ ; మెలఁగు... మెలఁకువ ; లోఁగు...లోఁకువ ; వేగు...వేకువ.

7. టవర్ణకం బాడ్వాదులకగు నగుచో నంతలోపంబగు. ఓ.

ఆడు....ఆట ; ఊరు....ఊట ; ఊఁటడు....ఊఁటట; ఏఁకరు....
ఏఁకట ; ఓడు....ఓట ; తీవురు....తీవుట ; తేరు....తేట ;
త్రిమ్మరు...త్రిమ్మట ; పండు....పంట ; పాడు....పాట ;
మండు....మంట ; వండు....వంట ; వేసఱు.... వేసట.
అనుప్రయుక్తంబయిన యాటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లిబ
సమంబగు.
కోలాటము, పోరాటము, మంద్రాటము ఇత్యాదులు.

ఈ టవర్ణకమునకును క్రియాపరిచ్ఛేద విహితమగు టవర్ణకమునకును
భేదముగలదు :

ఈ టవర్ణకము భావ కర్తృ కర్మార్థములు మూఁడింటను వచ్చును. కొలఁదిధాతువులకే వచ్చును. ఇది పరమగునపుడు ధాతువు తుదివర్ణము లోపించును : ఆట.

ఆ టవర్ణకము భావార్థమున మాత్రమే వచ్చును. అన్నిధాతువులకు వచ్చును. అది పరమగునపుడు ధాతువు తుది వర్ణము లోపింపదు : ఆడుట.

| | | |
|---|---|---|
| ఏఁకరు — ఏఁకట | .... భావార్థకము | = కోరుట |
| త్రిమ్మరు — త్రిమ్మట | .... భావార్థకము | = తిరుగుట |
| వేసరు — వేసట | .... భావార్థకము | = అలయుట |
| ఊరు — ఊట, ఊరునది | .... కర్త్రర్థకము | = సారము |
| పండు — పంట, పండునది | .... ,, | = ఫలము, ధాన్యాదికము |
| మండు — మంట, మండునది | .... ,, | = జ్వాల |
| ఆడు — ఆట, ఆడఁబడునది | .... కర్మార్థకము | = క్రీడ |
| పాడు — పాట, పాడఁబడునది | .... ,, | = గీతము |
| వండు — వంట, వండఁబడునది | .... ,, | = పాకము |

'పలుకు' అనునర్థముగల 'ఆడు' ధాతువునకు ఈ 'ట' వర్ణకము భావార్థమునఁగూడఁ బ్రాప్తించును. తుదివర్ణము లోపించి 'ఆట' అనురూపము సిద్ధించును.

"తగుమాటగా 'నాట' గాదు నాదుహృదయగతియు నిట్లు".

—భారత-ఆశ్రమ-1-34.

క్రియాపరిచ్ఛేదమునందలి టవర్ణకమునకు వండుట, పండుట, ఆడుట, పాడుట మొన్నగునవి యుదాహరణములు.

ఈ రెండు ఉవర్ణకములకును గల యర్థభేదమును ప్రయోగములనుబట్టి గుర్తింపనగును.

ఆడుట = క్రీడించుట (Playing), ఆట = క్రీడ (Play)
పాడుట = గానముచేయుట (Singing), పాట = గీతము (Song)
వండుటవేళ, వంటవేళ — పండుటవేళ, పంటవేళ.

8. ఉవర్ణకంబు పచ్చాదులకగు. నపుడు వీని యాద్యక్షర శేషంబులయి దీర్ఘంబునొందు. ౮.

పడు .... పాటు ; చెడు....చేటు ; అడుచు ....ఆటు ; కఱచు.... కాటు ; పొడుచు ....పోటు ; వడుచు .... వాటు ; ఏయు.... ఏటు ; ఓడు....ఓటు ; వ్రేయు .... వ్రేటు.

9. పవర్ణకంబు తిరియాద్యులకగు. ౯.

తిరియు....తిరిపము ; కలియునకత్వంబునగు : కలపము ; పొలయు....పొలపము ; మురియు....మురిపము; సొలయు.... సొలపము ; వలియు....వలిపము.

10. తవర్ణకం బావులించులోనగువానికగు. ౧౦.

ఆవులించు....ఆవులింత; ఇగిలించు ....ఇగిలింత; ఓకిలించు.... ఓకిలింత ; కుళ్లగించు....కుళ్లగింత ; కుసిలించు ....కుసిలింత ; కొక్కరించు....కొక్కరింత ; కొప్పరించు .... కొప్పరింత ; గిలిగించు....గిలిగింత.
ఇత్యాదులెఱుంగునది.

11. పువర్ణకంబు మాయ్యాదులకగు. ౧౧.

మాయు....మాపు ; మేయు.... మేపు ; అడుచు....అడుపు ; ఇంచు....ఇంపు ; ఏఁచు....ఏఁపు ; ఏచు....ఏపు ; కను.... కానుపు; కాచు....కాపు; చూచు....చూపు; తలఁచు....తలఁపు; తోఁచు....తోఁపు ; త్రేఁచు....త్రేఁపు ; త్రోచు....త్రోపు ; పూఁచు....పూఁపు ; పెనుచు....పెనుపు ; పొలుచు....పొలుపు;

ప్రోచు....ప్రోపు ; మెచ్చు....మెప్పు ; మోచు....మోపు ; వలచు....వలపు ; వాచు....వాపు.

ఇత్యాదులు మాయ్యాదులు.

ఇత్యాదులు = చూ. 3 సూ.

పువర్ణకపకారము పరముగుటచేఁ బయిలక్ష్యములలో యకారచకారములు లోపించినవి. —చూ. 3 సూ. వృత్తి.

మెచ్చుధాతువునందు నొకచకారము లోపించినచో శేషించినచకారమునకు పత్వము కలుగుమార్గము గానరాదు. ద్విరుక్తచకారమునంతను లోపింపఁ జేయుదమన్నను, ఆ పిమ్మట పువర్ణకపకారమునకు ద్విత్వవిధానము గానరాదు.

చకారలోపమనఁగా ద్విత్వచకారమునకుఁగూడ లోపము కలుగుటయు, ద్విత్వము లోపించినపుడు తల్లోపనిమిత్తమగు వర్ణమునకు ద్విత్వము కలుగుటయు, ఈరూపమునందువలెనే మఱికొన్ని శబ్దములందును గానఁబడుచున్నది.

ప్రుచ్చు, ప్రువ్వు : చకారద్విత్వము లోపించినది. తల్లోపనిమిత్తమగు పకారమునకు ద్విత్వమువచ్చినది.

చొచ్చు + తెంచు = చొత్తెంచు.

పుచ్చు + తెంచు = పుత్తెంచు.

ద్విరుక్తచకారము లోపించినది; లోపనిమిత్తమగు తెంచుధాతుతకారమునకు ద్విరుక్తి కలిగినది.

వీనినిబట్టి ద్విత్వలోపము కలిగినపుడు లోపనిమిత్తమునకు ద్విత్వము వచ్చుననుకొనుటయే యిప్పటికి గోచరించుమార్గము.

పేటికాటీకలో 'మెప్పు'అను ద్విరుక్తపకారరూపము సిద్ధించుటకు 'వడిప్రభృతులలోఁ జేర్చి సాధింపఁదగునేమో' అనియు, 'లేక యక్కాటాదులలోఁ జేర్చి ద్విత్వమును జేయవలెనేమో' అనియు వికల్పమార్గములు రెండు ఈసూత్రమునొద్ద సూచింపఁబడియున్నవి.

అవి ప్రక్రియకుదురని చీకాకుదశలోని తడఁబాటు తలంపులు. ఏలయన వడిప్రభృతుల తీరేవేఱు. కృత్తులలో, వడి, వి, అవు, ఇ, కలి అనుప్రత్యయములు రెండేసి, మూఁడేసి ధాతువులకుమాత్రమే కలుగుచున్నవి. అట్టివానికి నొకొక్కసూత్రమేలయని సూరి ఆయయిదుప్రత్యయములను పరిచ్ఛేదాంతమున నొకేసూత్రమున గుదిగ్రుచ్చినాఁడు. ప్రత్యయవిధానమాత్రమేగాని యితర కార్యముల ప్రసక్తియే యాతావునఁ గానరాదు. ఆసూత్రము ప్రకృతమునకు నెంతమాత్రమును సంబంధింపదు. సాయమొనర్పఁజాలదు.

ఇఁక 'అక్కటాదుల'మాటయే యిటఁ దలంపరానిది. అక్కటాది సూత్రము ద్విత్వలోపవిధాయకము. అక్కటాదులలోఁ జేర్చినచో, ఉన్న ద్విత్వము లోపించునుగాని లేనిద్విత్వము రానేరదు.

కావునఁ బయివికల్పమార్గములు చేకొనఁదగినవిగాఁ గానరావు.

**12.** ఇకవర్ణకం బంజ్యాదులకగు. ౧౨.

అంజు....అంజిక ; అమరు....అమరిక ; అరయు....అరయిక ; అలయు....అలయిక ; ఆడు....ఆడిక ; ఓడు....ఓడిక ; ఓపు....ఓపిక ; కను....కానిక ; కూడు....కూడిక ; కోరు....కోరిక ; పొందు....పొందిక ; పోలు....పోలిక.

తూను తూఁగుసకగు : తూనిక.

ఇత్యాదులంజ్యాదులు.

ఇత్యాదులు = చూ. 3 సూ. 'ఇక' పరమగునప్పుడు 'కను'నకు దీర్ఘము 3 వ సూత్రమున వృత్తిలో విహితమయినది.

**13.** అప్పాదులకు నజియగు. ౧౩.

అప్ప....అప్పన ; ఒజ్జ....ఒజ్జన ; ఒప్ప....ఒప్పన ; గట్టి....గట్టిన; గడ....గడన; దట్టి....దట్టిన; దీవ....దీవన; పాట....పాటన ; మన్న....మన్నన ; వీచు....వీవన.

**14.** బడి యేల్వాదులకగు. ౧౪.

ఏలుబడి, కట్టుబడి, కనుబడి, కొనుబడి, గిట్టుబడి, చెల్లుబడి, చేరుబడి, తగులుబడి, తీఱుబడి, పెట్టుబడి, పోబడి, మ్రొక్కుబడి, వచ్చుబడి, సాగుబడి.

'పోబడి'లో వులోపము సూచింపఁదగినది. వచ్చుబడికి 'రాబడి' అనియు రూపము గలదు. వికల్పముగా రాదేశము సూచింపఁదగినది.

**15.** గడ చేర్వాదులకగు. ౧౫.

చేరుగడ, తిరుగడ, తీఱుగడ, తేఱుగడ, త్రేగడ, మనుగడ, విడుగడ, పీడుగడ.

ఇందలి యుదాహరణములలో :

'త్రేగడ' అని కొన్నిప్రతులందును, 'తేగడ' అని కొన్నిప్రతులయందును రెండుపాఠములు గానవచ్చుచున్నవి. ప్రథమముద్రణమున 'త్రేగడ' అని కలదు.

నిఘంటువులందుఁగాని మఱి యెచ్చటనుగాని 'త్రేగడ' అనుశబ్దమే కానరాకున్నది. ప్రథమముద్రణమునందున్నంతమాత్రమున 'త్రేగడ' అనునదే సాధుపాఠమనుకొనుటకు వలనుపడదు. ఆప్రతియందును ముద్రణప్రమాదములు గొన్ని గలవు.

తేయు + గడ = తేగడ : కృశించినది, అఱిగినది అను నర్థమున తేయుధాతువునుండి నిష్పన్నమయిన 'తేగడ' అను శబ్దమొకటిగలదు. దానినే సూరి యుదాహరించియుండునేమో ; అదే సత్యమయినచో నిచటి పూర్వోత్తర సూత్రములలో లక్ష్యములందుఁ బాటింపఁబడిన అకారాదిక్రమమునుబట్టి యిది నాలుగవలక్ష్యముగాఁ జూపఁబడియుండవలయును.

'తేగడ' అనుదానికి, ఎట్టిప్రమాదముననో యెవరివల్లనో రేఫము చేరుటయు, రేఫయుక్తమయినపిమ్మట వర్ణక్రమమునుబట్టి యిది లక్ష్యములలో అయిదవదిగాఁ గూర్పఁబడుటయుఁ దటస్థించియుండవచ్చును.

కావున 'తేగడ' శబ్దమే సూరికి సమ్మతమయియుండుననియు, అది లక్ష్యములలో నాలుగవదిగా నుండవలయుననియు తోఁచుచున్నది. పాఠపరిష్కారాభిలాషులు పరిశీలింతురుగాక.

**16.** ఇకి కోర్యాదులకగు. ౧౬.

కోరికి, పూనికి, పోలికి, మనికి, వినికి.

చూడు చూచునకగు : చూడికి.

**17.** వువర్ణకంబు మన్వాదులకగు. ౧౭.

మను....మనువు ; కాచు .... కావు ; కొలుచు .... కొలువు ;
చచ్చు....చావు ; తడయు....తడవు ; నిలుచు....నిలువు ;
నొచ్చు....నోవు ; పూచు ....పూవు ; ప్రుచ్చు....ప్రువ్వు.

ఇట చావు, నోవు అనువానిసిద్ధికి చచ్చు, నొచ్చులలోని ద్విత్వచకార లోపమును బూర్వస్వరమునకు దీర్ఘమును గలుగునని కొన్నిటీకలు వివరించినవి. వేఱొకటీకలో 'చచ్చు' లో వర్ణలోపాది వికృతి యనియు, 'నొచ్చు' నకు 'నో' వచ్చుననియు, వింతమించు పయిటీకలమార్గమే నిర్దేశింపఁబడినది. ఇంచుకయిన సూత్రాధారములేనిచోట నెట్టెటో ప్రక్రియ సరిపుచ్చుకొనుట తప్పదుగాని ఆధారము రవంతయయిన లభించుచో మనము దానిని విడుచుకొనరాదు.

ముత్తుపరమగునపుడు విశేషధాతువులకు విధింపఁబడిన రా, చా, పోవు, మొదలగు నాదేశములు ముత్తులేనిచోఁగూడఁ గానవచ్చుట గుర్తించి సూరి 'కాఁతిపోసహితము కాదేశములు వానంబడియుడి' (క్రియా-1?) అని సూత్రించియుండెను. వానిచే

వచ్చు + వు = రావు + వు = రావు

పోవు + వు = పోవు + వు = పోవు

ఈకీతని ప్రవర్తకము పరమయినపుడుగూడ 'రావు, పోవు'లు ఆదేశములుచేసి పిమ్మట కగచయులోపసూత్రమును (కృదంత-2) ప్రవర్తింపఁ జేసినచో 'రావు, పోవు'లు సాధ్యములుకావచ్చును.

ఒక్క సూత్రాక్షరమయిననేని మాగప్రక్రియకన్న నిది కొంతమేలేమో ! యోచింపుఁడు.

కాదేశాదులు క్త్వార్థపరమగుచోనయితము వచ్చుట యీ యొక్క చోటనే గాదు.

చూచు + ఇకి = చూడు + ఇకి = చూడికి

వచ్చు + క = రా + క = రాక

పోవు + బడి(వులోపము) = పో + బడి = పోబడి

వచ్చు + బడి = రా + బడి = రాబడి

మున్నగు పెక్కుతావులందుఁ గలదు. ఇందుఁ గొన్ని సూరి సూచించినవే.

అన్నిచోటులందును సూచించిన బాగుండును. నిజమే. అదిలేదుగావుననే మనకిన్ని మార్గభేదములు.

ప్రువ్వు + వు = ప్రువ్వు. ఇట కగచయవలోపసూత్రముచే చకారములు రెంటిటికిని లోపము. ఆపిమ్మట లోపమునకునిమిత్తమగు వకారమునకు ద్విత్వము. —చూ. మొవ్వు, 11 సూ.

ఇట నొక చిన్నయంశము.

ప్రువ్వు = ప్రుచ్చు + వు. 'చద్వయమునకు వద్వయము' అని యొక టీకలోఁ గలదు.

చద్వయమునకు వద్వయము వచ్చినచో వుప్రత్యయమునందలి వకార మొకటి ఉండక తప్పనిదిగావున మొత్తము మూఁడు వకారములగుచున్నవి. మూఁడవది యభిలషితము గాదు.

అదియుఁగాక వుప్రత్యయవకారము పరమయియుండ చకారస్థానమున వచ్చిన వకారములు కృత్కగతసూత్రముచే (కృదంత-2) లోపింపవలయుఁ గాని నిలుచుటకు వీలుగానరాదు. అవుడు మరల మొట్టమొదటి ఏకవకారరూపమే సిద్ధమగును. ఘట్టకుటీప్రభాతము.

ఈ చిక్కులులేకుండ, చకారద్విత్వమునకు లోపమును, లోపనిమిత్తము నకు ద్విత్వమును జేసికొనుటయే నిర్బాధమగు మార్గముగా నిప్పటికిఁ దోఁచు చున్నది.

**18.** అవర్ణకంబు గీజ్ఞాదులకగు. ౧౮.

గీఱ, ఊఁద, ఎండ, కాయ, చదియ, తునియ, పరియ, పాయ, పిడుచ, మీట, ముడియ, వదర, వ్రయ్య.

**19.** అకవర్ణకంబు మాజ్ఞాదులకగు. ౧౯.

మాఱు....మాఱకము ; అమ్ము....అమ్మకము ; అంపు.... అంపకము ; పంచు : పంపు....పంపకము ; వండు : డకారంబు టకారంబగు....వంటకము ; తోము....తోమకము ; అద్దు.... అద్దకము.

పంచు చకారమునకు పకారాదేశము సూచితమయినది.

**20.** డువర్ణకం బాజ్ఞాదులకగు నగునపుడు పకారంబు చయల కగు. ౨౦.

ఆఱు....ఆఱుడు ; అమ్ము....అమ్ముడు ; అల్లు....అల్లుడు ; ఎక్కు....ఎక్కుడు ; క్రుమ్ము....క్రుమ్ముడు ; చోపు.... చోపుడు ; త్రొక్కు....త్రొక్కుడు ; త్రోచు....త్రోపుడు ; దంచు....దంపుడు ; దాఁచు....దాఁపుడు ; దిగు....దిగుడు ; దోఁచు....దోఁపుడు ; పెంచు....పెంపుడు, ప్రేఁపుడు ; ప్రాఁకు....ప్రాఁకుడు; మాయు....మాపుడు; రాచు....రాపుడు. ఇత్యాదులు.

ఈ సూత్రమున తొలుత మూలధాతువును వేర్కొని, పిమ్మట దాని కృదంతమును నిర్దేశించుచు లక్ష్యములన్నింటను రెండేసిశబ్దములు ప్రదర్శింపఁ బడినవి.

ఈ లక్ష్యములమధ్యమున నొక్కచోటమాత్రము 'పెంచు....పెంపుడు, ప్రేఁపుడు' అని ధాతురూపమొక్కటియు, కృదంతరూపములు రెండును, గానవచ్చుచున్నవి.

ఇట నధికముగాఁ గానవచ్చుచున్న యీ 'ప్రేఁపుడు' అనుశబ్దము 'పెంపుడు' అనుదానికి రూపాంతరమా? లేక యీ 'ప్రేఁపుడు' అనుదాని మూలధాతువు ముద్రణప్రమాదమున లోపించియుండునా? అను జిజ్ఞాస మనకుఁ గలుగుట సహజము.

ఇట్టిసందేహమే కలిగి గుప్తార్థప్రకాశికాకారులు 'పెంపుడు' అనుదానికి 'ప్రేఁపుడు' అనుదానిని రూపాంతరముగా సరిపుచ్చవచ్చునని ప్రయత్నించి యుండిరి. ఆ టీకలో పెంచుధాతువునకు డుపర్థకము పరముగునపుడు 'ప్రేఁచు' ఆదేశముగా వచ్చుననియు, పిమ్మట చకారమునకు ప్రకృతసూత్రమువల్లనే పత్వము వచ్చి 'ప్రేఁపుడు' కావచ్చుననియు వివరణమగపడుచున్నది.

నిఘంటువులలో 'ప్రేఁపుడు' శబ్దమునకు 'అధికుఁడు' అనునర్థము గలదు. 'పెంపుడు' (చిలుక) అనుదానియర్థమునకు 'అధికుఁడు' అనునర్థము మిక్కిలి దూరముగా నగపడుచున్నది. ఈ సంశయమునుగూడఁ గలిగియే ప్రకాశికాకారులు "ప్రేఁపుడు = పెంచువాఁడు = వర్ధిల్లఁజేయువాఁడు = అధికుఁడని ఫలితార్థము" అని వివరించుచు, పరంపరలమీఁద పెంపుడు, ప్రేఁపుడులకు సమానార్థకత్వమును సరిపుచ్చితిమని తృప్తిఁజెందినారు.

కాని, యీ రెండుశబ్దముల యర్థమునకును సంబంధము గానరాదు. ఇట్టియెడ నొకదానికొకటి రూపాంతరమనుకొనుట ఉపపన్నముగాఁ దోఁచుట లేదు. అర్థవిషయమటుండనిచ్చి శాబ్దికముగఁ జూచినను నీమార్గము తృప్తికరము కాకున్నది. ఏలయన

కృత్తు పరమగునపుడు పెంచుధాతువునకు 'ప్రేఁచు' అనునంతటిమార్పు సూరిదృష్టిలో నున్నచో నాతఁడు దానిని దప్పక యుల్లేఖించియుండెడివాఁడు.

తూను తూఁగునకగు: తూనిక.

వండు: డకారంబు టకారంబగు....వంటకము.

వచ్చునకు: రా, రాక.

చూడు చూచునకగు: చూడికి.

కనునకు దీర్ఘంబగు: కానిక, కానుక, కానుపు.

అని యిట్లు ధాతువునందుఁ గలుగు మార్పులను పెక్కుస్థలములందు సూచించియుండి, యింతయధికమగు క్రొత్తమార్పుగల యీ తావున ఆ యాదేశము నాతఁడు సూచింపక యూరకుండుట అసంభవముగాఁ దోఁచుచున్నది.

కావున, నిది సూరితలంచినమార్గమని తోఁపదు.

ఇఁక, ఉద్ద్యోతటీకలో ఈ 'ప్రేఁపుడు' అనునది 'పెంపుడు' అనుదానికి రూపాంతరము కాదనియు, దీనిమూలధాతువు ముద్రణమున ప్రమాదవశమునఁ

5. పయ్యెద పయ్యద. ఇ.

“యానవేగమునఁ బయ్యదకొంగు సడలిన”—చూ. ‘పయ్యెద’-శబ్దరత్నా.

6. ఊయేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనం బొండెనగు. ఉ.

ఉయ్యేల — ఊయేల.
ఊయేల, ఊయెల, ఊయాల, ఊయల, ఆయె, ఏలిచము, ఓయ, ఓయారము, కోపు (ధనురగ్రము), జాజర, తీనియ, తీయము, తేప (ప్లవము), తేమ, తోయలి, దీవియ, నూవు, నోవి, నోవు, పూవు, పేయ, మోక (అంకురము), మోటిక, మోవు, వీయము ఇత్యాదు లూయేలాదులు.

7. ఱకారంబుక్రింది ఱకారంబునకుం దుదినులులక్రింది నల లకు లోపంబు బహుళంబుగనగు. ఉ.

| | | |
|---|---|---|
| అఱ్ఱు, అఱు | కన్ను, కను | పల్లు, పలు |
| గొఱ్ఱియ, గొఱియ | సన్ను, సను | విల్లు, విలు |

నులులక్రింది నలలనఁగా నులులకుఁ బూర్వమందున్న నలలనియర్థము.

కన్ను, పల్లు అను మనలేఖనరీతినిబట్టి నలలు నులులకుఁ బరమం దున్నటులు భ్రాంతి కలుగును. కాని,

కన్‌ను = కన్ను, పల్‌లు = పల్లు అను వర్ణక్రమమును రవంత గమ నించినచో నలలు నులులకుఁ బూర్వమందున్నటులు తెల్లమగును.

క్రిందు = పూర్వము (క్రిందటిజన్మము, పూర్వజన్మము)

—చూ. ఆచ్చిక-37.

ఇట నలలద్విత్వముపయిని, ఉకారమే యుండవలయును. (న్ను, ల్లు) ఆద్విత్వము శబ్దముతుదిదే కావలయును. (కన్ను, పల్లు) అందలి నలలు లోపించును (కను, పలు).

ఱకారవిషయమట్లుగాదు. ఱకారద్విత్వము శబ్దముతుదిదే కానక్కఱలేదు. ఆద్విత్వముమీఁద ఉకారమే యుండనక్కఱలేదు. ఏ యచ్చయినను నుండవచ్చును. (అఱ్ఱు, అఱు ; గొఱ్ఱియ, గొఱియ.)

ఇట్టిభేదముండుటవల్లనే సూత్రమున వర్ణములు మూఁడిటిని గలిపి విధింపవలనుపడక ఱకారమును విడిగా నిర్దేశించినాఁడు.

ఉకారోదాహరణములలో శబ్దమధ్యస్థమును, ఇకారసహితమునునగు ద్విత్వముగల 'గొట్టియ' అనుదానినిగూడఁ జూపుట ఉకారలోపమునకును, నలలలోపమునకును గలభేదమును సూచించుటకేయని యూహింపవలయును.

అట్టుమొదలగుశబ్దములకు సౌపవిభక్తికముగా తివర్ణమును, నిత్యముగా ద్విత్వలోపమును, ఆచ్చికపరిచ్ఛేదమున (34) విధింపఁబడినవి (అట్టితిని). ప్రకృతసూత్రముచేఁగలుగు ద్విత్వలోపము నిత్యముకాదన్నను 'సౌపవిభక్తిక పరత్వమున ఈ లోపము నిత్యమగుట యిచటి బహుళశబ్దప్రయోజనము' అని ప్రతిపాదించినచో ఈసూత్రమువల్లనే యచటి నిత్యలోపముగూడ సిద్ధింపకపోదు గాని, యింతకంటె నచటనే తివర్ణముతోపాటు కలిపి ఉవర్ణలోపమును నిత్యముగ విధించుటలో ప్రక్రియా సౌలభ్యముండుననుతలంపుతో ఆలోపముచ్చటనే (ఆచ్చిక-34) వేఱుగా విధింపఁబడినది.

ఈద్విత్వలోపమునకుఁ గొన్నియెడల నిషేధముగలదు. 9 వ సూత్రము పరికించునది.

8. అక్కటాదులజడ్డకు లోపంబు విభాషనగు. బా.

అకట, అక్కట.

అక్కట, అట్టిక, అట్టుక, అట్టె, అయ్యారె, అయ్యో, అవ్వారి, ఇట్టిక, ఉప్పవడము, ఉమ్మి, ఎక్కసక్కియము, ఎక్కసెక్కియము, ఎక్కిరింత, ఎడ్డ, ఎన్నిక, ఎమ్మిక, కజ్జాయము, కట్టా, కట్టిక, కప్పురము, కమ్మటము, కమ్మతము, కువ్వాడము, కొట్టిక, కొమ్మ, కొయ్యగూర, గయ్యాళము, గిజ్జిగాఁడు, గుజ్జరాతి, చిట్టి, చిన్న, చిమ్మట, చెన్నఁటి, చెప్పుము, చెప్పుఁడు, చెమ్మట, చెల్లియలు, జవ్వాజి, జాబిల్లి, తమ్మటము, తమ్ములము, తల్లి, తుమ్మికి, తువ్వర, తెల్ల, దవ్వు, దివ్వియ, నవ్వు, నిద్దుర, నివ్వరి, నివ్వాళి, నువ్వు, నెట్టిక, నెమ్మలి, పవ్వళించు, పిన్న, పుల్లియ, పువ్వు, పెద్ద, పొట్టి, ప్రాకెన్న, ప్రెగ్గడ, బెగ్గడు, బొమ్మ, బొమ్మికము, బొమ్మిడికము, బొమ్మిడీకము, మజ్జి, మత్తాబు, మల్లారము, ముక్కు, ముద్దియ, మెట్టిక, మొక్కరము, మొగ్గరము, మొల్లాము, రడ్డి, లొట్టిపిట్ట, వట్టి, వయ్యాళి, సన్నియ, సవ్వడి, సివ్వంగి — అట్టు, ఇట్టు, ఎట్టు, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, మమ్ము, మిమ్ము,

తమ్ము, అమ్మ, అక్క, అవ్వ, అయ్య, అప్ప, అచ్చోటు, ఇచ్చోటు, ఎచ్చోటు, అచ్చటు, ఇచ్చటు, ఎచ్చటు ఇత్యాదు లక్కటాదులు.

9. జడక్కారంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడత్వ లోపంబులేదు. ఉ.

అట్టెత్తె, కన్నదరె, నన్నడిగె, పల్లొత్తె, విల్లందె.

'పదాదిస్వరంబు గూడుచో' అనఁగా సంధి చికీర్షితమగుచోనని యర్థము. సంధి చేయఁదలంచినచో నని తాత్పర్యము.

అతెత్తె, కనదరె, ననడిగె, పలొత్తె, విలందె—ఇట్టియపసంధులు ద్విత్వరహితరూపములందు సంభవింపకుండుట యీ సూత్రమునకుఁ బ్రయోజనము.

ఈ సూత్రము రచింపనుద్దేశించిన సందర్భమున సూరితలలో మెలఁగిన సమాలోచనరీతులను పదిలముగా భావనసేయవలయును.

ప్రథమేతరవిభక్తిసూత్రమున 'నన్నడిగె' అనునుదాహరణము నిచ్చుట తోడనే ఆతనికి 'ననడిగె' అని సంధిరాఁగూడదే ; దానిగతియేమి ? అనుశంక పొడమియుండును. ననడిగె అనుసంధి కాకుండుటకుఁ గర్తవ్యమేమి ?

ద్విత్వరహిత ద్వితీయావిభక్త్యుకారమునకు సంధిని నిషేధింపవలయును. అట్లు నిషేధించినచో 'ననడిగె' అనుచో సంధి వారింపఁబడును.

కాని, గురువును + అడిగె అనుచో 'గురువునడిగె' అనుసంధి యభిలషితముగదా ! ఇచటిదిగూడ ద్విత్వరహిత ద్వితీయోకారమేగావున దీనికిఁగూడ ఆ నిషేధము తగులుచున్నదే ! దానిని వారించుట యెట్లు ?

అందులకయి ఆనిషేధమున 'ద్విత్వరహిత'మనక 'లుప్తద్విత్వ ద్వితీయోకారమునకు' అనుటమంచిది. గురువును అనుచో 'ను'వర్ణము, నను(నన్ను) అనుదానిలోవలె ద్విత్వము లోపింపఁగా శేషించినది కాదుగావున నచట నీనిషేధము నడ్డుకొనవచ్చును.

లేదా ద్రుతము పరమందుఁగల ఉకారములే ప్రథమేతరసూత్రలక్ష్యము లనియు, 'గురువును + అడిగె' అనుచో ఉకారము ద్రుతపరకము కాదుగాన నయ్యది 'ఉత్తునకు సంధి'యను నిత్యసూత్రమునకే లక్ష్యమనియు సరిపుచ్చ వచ్చును. ఇదే యుత్తమమార్గముగఁ దోఁచుచున్నది. ఈ మార్గమున 'ననడిగె' అనుదానిని వారింపనువచ్చును, గురువునడిగె అనుదానిని సంరక్షింపనువచ్చును.

కాని, 'కను + అదరె' అనుచో 'కనదరె' అని కాఁగూడదే ; ఇందలిది ద్వితీయోకారము కాదుగానఁ బయినిషేధము ద్వితీయోకారవిషయకమగుటచే నిటఁ బ్రవర్తింపదుగదా ? దీనిగతియెట్లు ?

ఇఁక దీనిని వారించుటకయి పయినిషేధసూత్రమున 'ద్వితీయ' అను పదమును దొలఁగించుటగాని లేదా 'ఉత్తునకచ్చు' సూత్రముగూడ లుప్త ద్విత్వములందు వర్తింపదని యొకనిషేధవిధిని వేఱుగఁ గల్పించుటగాని కర్తవ్యము.

అటులయినచో 'కను + అదరె' అనుచోట సంధిని వారింపవచ్చును.

సరేగాని, యీ దారిలో మఱొకచిక్కు గానవచ్చుచున్నదే.

కను + అదరె అనుచో సంధిని నిషేధించినచో, సంధిలేనిచోట స్వరము కంటెఁ బరమయినస్వరమునకు యడాగమము రాకమానునా ? వచ్చినచో 'కనుయదరె' అని యర్భకులుసయితము పరిహసించు వికృతరూపము సంభవించునే !

అట్టిది సంభవింపకుండ యడాగమమునకుఁగూడ నొకనిషేధసూత్రము రచింపవలసియుండును.

ఇన్నినిషేధములా ? అదిగాక భాషాస్వరూపమునుబట్టి మెచ్చుటఁగాని విరోధమునెఱుంగక నిత్యమయి నిబ్బరముగ సాగుచున్న ఉకారసంధికిని, యడాగమమునకును విరోధకల్పనమా ? ఆ రెండిటిని నిషేధించి మనము సంపాదించురూపమేది ? 'కనుఅదరె' అనునదిగదా ! అదిమాత్రము సమ్మతమా ? మఱింతయపరూపము. తెలుఁగున సంహితలో రెండచ్చులు వరుసగా నుండుట కంటె నసంభావ్యము లేదాయెను.

కావున నీ పరిచ్ఛేదమున ఈ సంధినిషేధములప్రసంగములేల యొత్తక ననడిగె, కనదరె అనునపరూపములు తొలఁగించుటకు మార్గాంతరమాలో చించుట సమంజసము.

స్వరసంధివచ్చునీతావులందు ద్విత్వము లోపించుటవల్లఁగదా యీచిక్కులు తటస్థించినవి ! లేనిద్విత్వములు వచ్చుట, ఉన్నద్విత్వములు లోపించుట మున్నగుద్విత్వప్రసంగములన్నియుఁ బ్రకీర్ణకపరిచ్ఛేదమున నిరూపింపఁబడును గాన నట నీరూపములను సమర్థించుకొందము.

అనునాలోచనలతో సూరి యీ రూపములనుగూర్చి సంధిప్రకరణమున ప్రసంగింపఁడయ్యెను.

ఈ పరిచ్ఛేదమున (7), (8) సూత్రములలో ద్విత్వలోపము విధింపఁ బడినది. అఱ్ఱు....అఱు, నన్ను....నను, కన్ను....కను, విల్లు....విలు. పరపదాదిస్వరముతో సంధిచేయదలఁచినపుడు వీనిలో ద్విత్వమునకు లోపము రాదని ప్రకృతసూత్రముచే నిషేధించుచున్నాఁడు.

ద్విత్వలోపమే రానపుడు అఱెత్తె, ననడిగె, కనదరె, విలందె అను నపరూపములకుఁ బ్రసక్తియేలేదు.

దీనింబట్టి మనస్సు, 'మనసు'; శిరస్సు, 'శిరసు' మున్నగుశబ్దములలో ద్విత్వములేనిరూపములకుఁ బదాదిస్వరముతో సంధిచేయ వలనుపడదేమోయని సంశయింపఁబనిలేదు.

శిరసెత్తిచూడుము, మనసిచ్చిమాటాడుము ఇత్యాదులందు సంధికి లేశమును బాధకలుగదు. ఏలయన:

అవి ద్విత్వలోపముగల శబ్దములుకావు. వానిలో లేనిద్విత్వము (వికల్పముగా) విధింపఁబడినదిగాని, ఉన్నద్విత్వమునకు లోపము విధింపఁబడలేదు.

అప్రాప్తమగు ద్విత్వలోపమునకు నిషేధము ప్రసక్తమేకాదు. కావున నట్టి శబ్దములీసూత్రమునకు విషయములే కానేరవు. అదియుఁగాక, ఈ అచ్చిక శబ్దప్రక్రియాసందర్భమున మనస్సు, మనసు మున్నగు తత్సమ శబ్దములకు ప్రసక్తియే యుండదనుకొన్నను ననుకొనవచ్చును.

పయిని వివరించినరీతిని 'నమస్ + అడిగె' అనుచోట సంధినివారణము జరిగినను, నయ్యది యీపరిచ్ఛేదమున విషయాంతరసంఘటనమయి స్థూలదృష్టికి నదృశ్యమగుటవల్లను, ప్రధానస్థలమగు సంధిపరిచ్ఛేదమున 'నన్నడిగె' అనుతావున ఈ ప్రసంగము లేశమును గానరాకుండుటవల్లను, సూరి 'ననడిగె' అనునపసంధిని వారించుట మఱచియుండునని త్రిలింగలక్షణశేషకర్త కొంత భ్రాంతియుదయించి యుండవలయును. ఆభ్రాంతియయినను దన సంధిపరిచ్ఛేద రచనాసమయమునఁ గలుగక ప్రౌఢవ్యాకరణముద్రణము సమాప్తమయిన వెనుక జనించియుండును. కావుననే అప్పటికపుడు "ముక్తలక్షణవివేచనము" అనుపేరితోఁ జిన్నయనుబంధమును గ్రంథాంతమునఁ జేర్చి, అందు

"ద్విత్వరహితంబగు ద్వితీయావిభక్తియుకారమున కచ్చుపరంబగుచో సంధిరాదు: ననునెఱిఁగె, నినునెఱిఁగె ము."

అని యొక సూత్రము రచించెను.

'ననునెఱిఁగె' మున్నగురూపములను బాలవ్యాకరణమే సాధించియుండుటచే నీసూత్రము మిక్కిలి యనావశ్యకము. భ్రమవల్లనో, ప్రమవల్లనో, యెక్కుడు పూనికతో రచింపఁబడిన యీ సూత్రమున విషయ సమగ్రత యున్నను గొంత మేలయ్యెడిది. అదియుఁ గానరాదు. ద్వితీయావిభక్తి సంధికి మాత్రము సంబంధించునటులు రచింపఁబడుటచే 'ననడిగె' వంటివానినేగాని 'కనదరె' మున్నగు రూపముల నీసూత్రము వారింపఁజాలదయ్యెను. వానిని సాధించుటకయి మరల బాలవ్యాకరణవిధానము నాశ్రయించుటతప్ప గత్యంతరము లేదాయెను. ఈపాటిదానికీసూత్రమెందులకో యెఱుకపడదు.

ఇఁక విచ్చట మఱొక్క యంశము మిగిలియున్నది. బాలవ్యాకరణమున ద్విత్వలోపమును విధించిన సూత్రములు రెండే గలవు (ప్రకీర్ణక-7, 8).

ప్రకృతసూత్ర మాలెండిటికిని నిషేధమా? ఒక్కదానికా? అయినచోదేనికి? అని పరిశీలింపవలయును.

7వ (అకారంబు క్రిందివకారాలు) సూత్రమునఁ జూపఁబడిన శబ్దములే అదేవరుసలో నీసూత్రమునఁ జూపఁబడుటచే దానికిని నిషేధమనుటలో సందియమే లేదు.

అక్కటాది (8) సూత్రముచేఁ గలుగు ఐద్దలోపమునుగూడ దీనిచే నిషేధించుట సూరి సంకల్పమగునా కాదా యనునదే పరిశీలనీయమగు నంశము.

అక్కటాదులు నూటయేడింటిలో ద్విత్వాంతములు పన్నెండియనిమిది. అందు ఉదంతములు పదునొకొండు మాత్రమే గలవు.

| | | |
|---|---|---|
| 1. దప్పి | 5. మక్కు | 9. అట్టు |
| 2. నప్పి | 6. మమ్ము | 10. ఇట్టు |
| 3. నువ్వు | 7. ముమ్మ | 11. ఎట్టు |
| 4. పువ్వు | 8. తమ్మ | |

పదాదిస్వరము పరమగుటయు, నిత్యముగు నుత్వసంధి తప్పక ప్రసక్త మగుటయు, వీనిలోమాత్రమే సంభవించును.

ఇందు 'దపేగె', 'తమడిగె' మున్నగు రూపములుండవు గాన, మొదటి యెనిమిదింటను నీనిషేధము తప్పదు.

అటేల, ఇటెంచులకు, ఎటయిన అను నీమూఁడు తావులను నీరీతి స్వరసంధి శ్రుతిరంజకముగనే తోఁచుచున్నది. కవిప్రయోగములును గానవచ్చుచున్నవి :

"ప్రార్థనము చేకొను 'మటం' చుఁ బలికె జముఁడు"

—శృంగారనై-3-74.

"ఎన్నఁడున్ మఱి 'యిట్టేగి' యెఱుంగవు" —కళాపూర్ణో-3-139.

"ఈనీరాన నిటేలవచ్చితి భయంబెట్లోగదే యీశ్వరా"

—భాగవత-8-72.

"ఎటాడుకొన్నసుం జెల్లుఁగదమ్మ నీకు" —కళాపూర్ణో-1-166.

"ఎటాడఁబోఁగా నెటువచ్చనో" —ప్రభావతీ. ప్ర-5-3.

ఇట్టిశ్రుతిహితములగు కవిప్రయోగములనుబట్టి "అక్కటాదులలోని అట్టు, ఇట్టు, ఎట్టు అను నీమూఁడు శబ్దములకును బదాదిస్వరముకూడినను వీనిలో ద్విత్వలోపమునకు ఈ జడ్డక్కరసూత్రముచే నిషేధము కలుగక ద్విత్వమునకు లోపము తప్పక రావచ్చు"నను వ్యవస్థను మనము కల్పించుకొనవచ్చును.

అవసరముకలిగినచో విభాషకు వ్యవస్థను గల్పించుట సంప్రదాయ విరుద్ధము కాదు (చూ. సంధి-17, 37). ఆద్యంత మాలోచింపుఁడు.

**10.** హాదులయు నీలుగులోనగువాని తొలిహల్లునకు లోపంబు బహుళంబుగనగు. ౧౦.

హడపము: అడపము; హరిదళము: అరిదళము; హలఁది: అలఁది.
నీలుగు: ఈలుగు.
నీలుగు; నెగయు; పొందు; పొనరు.
పూనుపొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచార మూలకంబు.

పూనుపొదవులకు ఆదివర్ణలోపము వచించినయాతఁడు అప్పకవి :
ఆ॥ వె॥ "పూనె నెగసెఁ బొదవెఁ బొనరెఁ బొందె నటన్న
పలుకులందు మొదలఁ గలుగునట్టి
వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు
నిలుచు వలసినపుడు నీరజాక్ష". —అప్పకవీయ-2-75.

అప్పకవివచించిన శబ్దములయిదింటిలో మూఁడిటిని సూరియుఁదనగణ మునఁ జేర్చెను. i. నెగయు: ఎగయు, ii. పొందు: ఒందు, iii. పొనరు: ఒనరు. వీనిలో నర్థభేదము లేకుండుటచే, ఆదిహల్లోపము నామోదించినాఁడు. పూను = పూనుకొను : కడఁగు. ఉదా. : కార్యమునకు పూనుకొనిరి. ఊను = మోపు : ఊఁదు : నాటు : అను. ఉదా. : కాలూనుకొనిరి.

పూనికవేఱు ; ఊనికవేఱు.
పొదవు = ఆక్రమించు : వ్యాపించు : క్రమ్ము.
ఒదవు = కలుగు, ఉపయోగించు
పొదవుటవేఱు ; ఒదవుటవేఱు.

ఈరీతి నర్థభేదముగల ధాతువులలో నొకదానికొకటి రూపాంతరమనుట కంటె నవి వేఱువేఱు ధాతువులనుట యుచితమని సూరితలంపు.

ఊను, ఒదవు అనువానికి నప్పకవిచూపిన లక్ష్యములందును నీయర్థ భేదము స్పష్టముగ గోచరించును.

"మదిలో మూనినప్రేమము" : నాటుకొన్నప్రేమగాని పూనుకొన్న ప్రేమగాదు.

"ఆశ్చర్యంబొదవ" : ఆశ్చర్యముకలుగుటగాని ఆశ్చర్యము వ్యాపించుట గాదు.

పూర్వలాక్షణికుల మార్గమేదేని, తనకు సమ్మతము కానియెడ, ఆ యంశమును మృదువుగ సూచించి విడుచుటయేగాని యావ్యక్తుల పేరెత్తుటయు, తదుక్తులను నీచముగా నిరసించుటయు సూరికి రుచింపదు.

ఇతరులు నిరూపించిన విషయములలోఁ దనయసమ్మతిని సూచించిన తావులు బాలవ్యాకరణమునఁ బదిపంద్రెండు గలవు. అంతటను ప్రతిపాద్య విషయనిరూపణము తప్ప వ్యక్తులపరామర్శ యొక్కచోటను గానరాదు. ఇతరాభిప్రాయము నీతఁడు ఖండించు పట్టులందయినను మరియాదకు లోపము గోచరింపదు.

"అది యవిచారమూలకం"బఁట

అనఁగా,అప్పకవి యీ శబ్దముల యర్థభేదమును విచారింపఁడయ్యెఁగాని, ఆ దృష్టిపెట్టినచో నాతఁడును వీనిని భిన్నధాతువులుగనే తలంచియుండెడి వాఁడు——అని తాత్పర్యము. ఎంతమార్దవమో ఎట్టిమర్యాదయో పరికింపుఁడు. ఇచ్చిపుచ్చుకొనవలసినది అదొక్కటే.

పూనుపొదవులప్రసంగమును నహోబలుఁడును రవంత నిరూపించెను. అది ఆతని స్వతంత్రప్రసంగము కాదు.

పెక్కుధాతువులరూపములు చూపుచు, ఆ నడుమ నీ యప్పకవిపద్యమునే యెదుటనిడుకొని యిదేక్రమములో

"పూనె, నెగసె, పొదవె, పొనరె, పొందె — నిత్యత్ర ఆద్యస్య హల్మాత్రస్య లోపే ఊనె నిత్యాదిరూపాణి కవి ప్రయోగ సిద్ధాని"

అని యప్పకవిమాటలనే యనువదించుట గోచరించును. కావున నీ సందర్భమున సూరి యప్పకవినే పరామర్శించినట్లు తలంపవలసియున్నది.

**11.** ఆరాటాదులం బ్రథమేతరదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు. ౧౧.

ఆరాటము : ఆరటము.

ఆరాటము, కకూ్కటితి, కేళాకూళి, కొమారుఁడు, కొమారిత, గంబూరము, పెండారము, బంగారము, బేహారము, వీటతాటము, సంతోసము.

**12.** ఓయూరాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు. ౧౨.

ఓయారము : ఒయారము.

ఓయారము, కేళాకూళి, కోలె, గూడారము, గోరువంక (పక్షి), జోహారు, నీలుగు, పేఁడ, బేహారము (దీర్ఘమధ్యంబు), మాఱు, మూలుగు, మోఱకు, వీటతాటము, వీడియము ఇత్యాదులు.

పేఁడకు 'పెండ' యను రూపాంతరము కొన్నిమండలములలో వ్యవహారమునందుఁగలదు.

**13.** అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు. ౧౨.

అడఁగు : అణఁగు.

అడఁగు, కడఁగు, చిల్లాడము, తడగము, నాఁడెము, పోఁడి, మిడుఁగు, వడఁకు, మిడుఁగురు ఇత్యాదు లడంగ్వాదులు.

ప్రథమముద్రణమున (1858) "ఇవి యడంగ్వాదులు" అని కలదు. గొడఁగు, పెడక, మడఁగు మున్నగు కొలఁదిశబ్దములకు ణకారఘటితములగు రూపాంతరములు శిష్టవ్యవహారమున వినంబడును. కావున గణమున 'ఇత్యాదుల'ని యుండుటయే మేలు.

**14.** దక్కాలోనగువాని దాకు డకారంబు విభాషనగు. ౧౩.

దక్కు : డక్కు.

దక్కు, దగ్గఱు, దాఁగు, దాకలి, దిగు, దిగ్గియ, దూయు, దెందము, దెప్పరము, దెప్పు, దొంగ, దొప్ప ఇత్యాదులు.

ఇచట పదాదిదకారమునకే డకారమగునని లక్ష్యరీతి తెలుపుచున్నది. కావున 'దెందము'లోని మధ్యదకారమునకు డకారము ప్రసక్తము కాదు.

**15.** ఏతాదులకు ముపర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు. ౧౪.

ఏతము : ఏతాము.

ఏతము, కళ్లము, గాలము, గుడ్డము, గోణము, గోతము, జాజము, జుంజము, జోతము, తణగము, బొండ్లము, మండము, లాతము, వీణము ఇత్యాదులు.

**16.** పదాంతంబులయి యసంయుక్తంబులయిన సుబంత యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు. ఉదా.

ఇందు నురులకుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు.

ప్రూన్పడె. మినుపడె, మిన్పడె. వత్తురువారు, వత్త్ర్వారు.
కారుకొనియె, కార్కొనియె.
రాములు, రాముల్. వనములు, వనముల్.

'ప్రూన్పడె' అని ఒక్కటేరూపము చూపుటచే నచట ఉత్వలోపము నిత్యమను నభిప్రాయముతోఁచుచున్నది. ప్రథమముద్రణమునందును (1858) ఒక్కరూపమే కలదు.

**17.** ఆచ్ఛికంబులగు బహ్వచ్కంబుల నంతరంబు యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు. ఉదా.

కినుక : కిన్క. కానుక : కాన్క. చిలుక : చిల్క. కాలువ : కాల్వ. అడుగు : అడ్గు. కడుపు : కడ్పు. పెరుగు : పెర్గు. కూరుకు : కూర్కు.

**18.** లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి. ఉదా.

కలికి : కల్కి. ములికి : ముల్కి. బుడిపి : బుడ్పి. పొలఁతి : పొల్తి.

**19.** అబ్బురాదులందుత్వంబునకు లోపంబు విభాషనగు. ఉదా.

అబ్బురము : అబ్రము.
అబ్బురము, కప్పురము, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, చప్పుడు, నెత్తురు ఇత్యాదులు.

భాషలో నెచ్చటఁగాని ద్విత్వమునకు వేఱొకహల్లుతో సంయోగ మేర్పడినచో ద్విత్వము పనిఁబూని పలుకఁబడినను శ్రుతికి గోచరింపదు. ద్విత్వమున నొక్కవర్ణమే పలుకఁబడినట్లు వినఁబడుచుండును. కనుక వ్యంజనాంతరసంయోగమున ద్విత్వమునందలి యొకవర్ణము శ్రుతిరహితమయి నిరర్థకమగుటచే నయ్యది లోపించుట సహజము.

ఇట్టిలోప ముచ్చారణస్వభావముచే సహజసిద్ధంబగుటంబట్టి సూరి బాలవ్యాకరణమున దీనిని ప్రత్యేకముగ విధించియుండలేదు. కాని తన శబ్ద లక్షణ సంగ్రహమున

"హల్మధ్యగంబున కన్యతరసవర్ణంబునకు హల్లునకు లుక్కగు"

—శబ్దలక్షణ-5-30.

అని వచించియుండుటచే, ఈ లోప మాతనిదృష్టిలో నున్నటులుమాత్రము తెలియఁగలదు. ముత్తియము : ముత్యము అను తావున, తకారలోపమునకుఁ గూడ ఇదియేమార్గము. —చూ. అచ్చిక-23.

**20.** ఋత్వరకరువర్ణంబునకు ముందటిదువర్ణంబునుత్వంబునకు లోపంబు విభాషనగు నగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు. ౨౦.

అదురుచు : అద్రుచు. ఎదురుచు : ఎద్రుచు. పదురుచు : పద్రుచు.

**21.** జూదాదులదాకు జకారంబు విభాషనగు. ౨౧.

జూదము : జూజము.

అవుదు, జవాది, జాది, జాదు, విరవాది.

**22.** నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వ దీర్ఘంబులకు గిగీలగు. ౨౨.

కుంభకర్ణుఁడు : గింభకర్ణుఁడు. రావణుఁడు : గీవణుఁడు.
నిందార్థమునకు సుసంగతములగు నుదాహరణములు.

**23.** పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరములు వళిప్రాసంబులు నాఁబడు. ౨౩.

**24.** యవలలు లఘ్వలఘువులు మైత్రింబొరయు రేఫంబులు పొరయవు. ౨౪.

**25.** రేఫంబులు లఘ్వలఘువులుం దక్కంగల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు. ౨౫.

ఇది గ్రంథాంతము. ఈ తుది మూఁడు సూత్రములును వ్యాకరణకార్య విధాయకములు గాకున్నను, ప్రసక్తములు ఆవశ్యకములును.

మన లాక్షణికులు పెక్కుమంది ఛందోలంకార వ్యాకరణ లక్షణములు మూఁడిటిలో నొక్కదానిని, తాము ప్రధానముగఁ జెప్పఁదలఁచిన దానిని విపుల ముగ నిరూపించి, తక్కినవాని స్వరూపమునుగూడ నల్పముగ నిర్దేశించుట యొకపరిపాటి.

అదిగాక, సూరి సంజ్ఞాపరిచ్ఛేదమున యరలవలకు లఘుత్వాలఘుత్వ భేదముచే ద్వైవిధ్యమును నిరూపించియుండెను. సింహావలోకనము గావించు కొనఁగా ఈ భేదనిరూపణము వ్యాకరణకార్యములందునెచ్చటను నుపయుక్తము ప్రసక్తమును గాకుండెను. మీఁదు మిక్కిలి యీ లఘువులను నలఘువులను భిన్నములుగ నిరూపింపఁబడుటచే వీనికి యతిప్రాసములందు సాజాత్యము కూడునా కూడదా యను సంశయమొకటి దీనివలన నుద్భవించును. ఆ సంశయ మును వారింపవలయును.

అదియుఁగాక, ఛందోవిషయము లేవిచెప్పినను నేవిమానినను, ఇవి రేఫలు, ఇవి శకటరేఫలు, అని లాక్షణికులలో నొకరయిన వర్గీకరించి సూత్రింపఁజాలకున్నను, రేఫ ఱకారములకు యతిప్రాసమైత్రికూడదని నిరూ పించుట మాత్రము వారిదృష్టిలో ముఖ్యాతిముఖ్యము.

ఈ యంశముల ప్రసంగమునకు ముందు యతిప్రాసముల స్థూలస్వరూప మాత్రమునయిన సూచించుట యుచితము.

కావున సూరి, పద్యపాదమునందుఁ బ్రథమాక్షరము వళియనియు, ద్వితీయాక్షరము ప్రాసమనియు లఘు 'య, వ, ల లకును,' అలఘు 'య, వ, ల' లకును యతిప్రాసములందు మైత్రికలుగవచ్చుననియు, రేఫఱకారములకు మాత్రము మైత్రి చెల్లదనియు, ఏ శబ్దములందలివి రేఫములో యెందలివి శకట రేఫములో వివేచించి నిరూపించుట యత్యావశ్యకమే యయినను, అది యీ వ్యాకరణమునఁ గుదురువడినదిగాదనియు, అదియగాక ముఖ్యములగు వ్యాకరణ విశేషములు మఱికొన్నిటినిగూడ సంక్షేపదృష్టితో విదువవలసివచ్చినదనియు, వానినెల్లఁ బెద్దలవాడుకను గుర్తించి గ్రహించుట శ్రేయోమార్గమనియు, ఈ మూఁడుసూత్రములందును బ్రసక్తానుప్రసక్తముగ నిరూపించుచు బాలురకు మంగళాశాసనముగూడ సూచించుచు గ్రంథమును ముగించుచున్నాఁడు.

గ్రంథము శుభాంతమగుటకు తుది నొకమంగళ శ్లోకమును రచింపఁ దలంచినను, నంతమాత్రమున, తృప్తిఁజెందక మిత్త్రలాభమును సుఖాంతముగను మిత్త్రభేదమును హర్షాంతముగను సంతరించినటులే యీ వ్యాకరణమునుగూడ శుభాంతముగ ముగింపఁదలంచి చిట్టచివరి సూత్రమున, తుట్టతుది పదముగా, సూత్రములోని భాగముగా సమన్వయించురీతిని శ్రేయఃపదమును గూర్చుట సూరికున్న సుకుమారదృష్టిని శుభాశంసాతత్పరతను వెల్లడించుచు గ్రంథ సమాప్తికి వన్నెదెచ్చుట గమనింపఁదగిన యంశము. సూరి తలంచినటులు

మిత్రలాభము సుఖమును, మిత్రభేదము హర్షమును, బాలవ్యాకరణము శ్రేయమును చేకూర్చుననుటకు సందియములేదు.

ఇట సూరి సూచించిన యతిప్రాసముల స్వరూపమును సులభమార్గమున విశదపఱుచుట యావశ్యక మనుతలంపుతో యతిప్రాసముల వర్ణమైత్రిని దేటపఱుచునొక పట్టిక అప్పకవీయానుసారముగ కూర్పఁబడినది. దానిని గ్రంథాంతమున ననుబంధములలోఁ జూడఁగలరు.

శ్లో॥ శ్రీస్తనాఞ్చిత కస్తూరీ పఙ్క సంకలితోరసే,
పఙ్కజాక్షాయ నాథాయ వేంకటేశాయ మఙ్గళమ్.

సూరి ప్రత్యహము దివ్యప్రబంధము (నాలాయిరము) ననుసంధించుకొనుచు నిత్యదేవతార్చనమును (తిరువారాధనము), నియమ నిష్ఠలతో భక్తి శ్రద్ధలతో నిర్వహించుకొనుచుండు నైష్ఠికప్రవరుఁడు.

విశిష్టాద్వైత మతావలంబకులు తమ తిరువారాధన సమయములందు మంగళాశాసన సందర్భమున పూర్వులు పూజనీయులునగు, ఆళ్వారులు సంతరించిన మంగళ శ్లోకములను గురుపరంపరా ప్రాప్తములను నెన్నిటినో నిత్యము పారాయణము గావించుట సంప్రదాయము.

నిరంతరావృత్తిక్షుణ్ణములయిన యీ మంగళశ్లోకముల శైలియు ఛాయలును నీతని యీ మంగళశ్లోకరచనాసరణిలో ప్రతిఫలించుట సహజము. క్రిందిశ్లోకము పరికింపుఁడు:

అమన్దానన్దమన్దారా యేన్దిరారఞ్జితోరసే,
నన్దాత్మజాయ కృష్ణాయ నాథాయాస్తు నమోనమః.

కూర్పువిషయమున సూరిశ్లోకము ఈ మంగళ శ్లోకమునకు సన్నిహితమగుట గుర్తింపఁదగినది.

మఱొక శ్లోకము :

అస్తు శ్రీస్తనకస్తూరీ వాసనా వాసితోరసే,
శ్రీహస్తిగిరినాథాయ దేవరాజాయ మఙ్గళమ్.

సూరిశ్లోకము ఈ శ్లోకమునకు ప్రతిబింబమువలె గోచరించుట గమనింపఁదగినది.

పయి మూఁడిటియందును పూర్వార్ధముతుదిని రఞ్జితోరసే, వాసితోరసే, సంకలితోరసే, అను సమాసముల సాదృశ్యము ముఖ్యముగా నిదానింపఁదగినది.

పూర్వాచార్యరచనమునందలి రఞ్జితోరసే, వాసితోరసే అను ఉరశ్శబ్దాంత బహువ్రీహులందు 'ఉరః ప్రభృతిభ్యః కప్' అనుసూత్రముచే రావలసిన కప్ప్రత్యయము కానరాదు. సుస్పష్టముగానున్న యీ కప్ప్రత్యయ రాహిత్యమును సూరిగారు గుర్తింపకపోరు. గుర్తించియే

"సమాసాన్తవిధి రనిత్యః"

అని పాణినీయులు ప్రతిపాదించియుండుటచే వ్యాకరణవిహితములయిన సమాసాంతప్రత్యయములు ప్రవర్తింపకతప్పదను నిర్బంధము లేదు గదా యనియు, శాబ్దికులసమ్మతినిబట్టియే మురారియంతవాఁడు అనర్ఘరాఘవమున

"జేతారం దశకన్ధరస్య......విజయశ్రీపూర్వమాజోరసమ్" 5-33 శ్లో॥

అని కప్ప్రత్యయవిరహితముగ ఉరశ్శబ్దాంతబహువ్రీహిని ప్రయోగించి యున్నాఁడుగదాయనియు, అంతియగాక, ఆధ్యాత్మికతాముద్రితములయి గురు పరంపరాప్రాప్తములయి, పవిత్రతామహితములయి ఆర్షములనఁదగిన యిట్టి ధ్యానశ్లోకములందలి ప్రయోగములను, అనిత్యమగు లక్షణమునుబట్టి యప శబ్దములనుకొనుట ఆచార్యులయెడ నపచారము గావించుటగదాయనియు, సూరి యిన్నిరీతుల వివేచించి, సమాసాంతవిధి నిత్యముకాదని శాబ్దికులు వక్కా ణించుచుండ, సమాసాంతరాహిత్యమును సంస్కృతమహాకవులు సమ్మతించి ప్రయోగించుచుండ, మన మీనాఁడు, ఈ మంగళశ్లోకమున కప్ప్రత్యయము చేర్చుట పరోక్షముగ నాచార్యుల నాక్షేపించుటయే యగునను భావనతోఁ దానుగూడ 'సంకలితోరసే' అని కబ్విరహితముగనే ప్రయోగించియుండెను.

ఈ సమాసాంతకప్ప్రత్యయాభావ ప్రసంగమునకు ఇంతపూర్వరంగము గలదు. దీని నించుకయు గుర్తింపక ఈ ప్రయోగమసాధువని కొందఱు వాదింతురు. ఏమనుకొందుము ! గ్రంథము ఇష్టదేవతాస్మరణముతో, మంగళా శాసన సమర్పణముతో శుభాంతముగా సమాప్తమగుచున్న సందర్భమున అట్టి తలంపులు చిత్తమునకుఁ జేరనీయరాదు. వివాదప్రసంగములు వినిపింపరాదు. భగవత్పరములయి, కస్తూరీపంకసౌరభ సంకలితములయిన మంగళసూక్తులను కర్పూరనీరాజనమువోలె కన్నుల కద్దుకొని యానందించుట ధన్యతాపాదకము, శ్రేయోదాయకము.

శుభప్రసంగములె విందుముగాక
శుభదృశ్యములే కందుముగాక

భద్రం కర్ణేభి శ్శృణుయామ
భద్రం పశ్యేమ

శివాయ గురవే నమః

---

# అనుబంధములు

## 1. కృత్తద్ధిత ప్రదర్శిక

### కృత్తులు

| | ధాతువు | ప్రత్యయము | రూపము |
|---|---|---|---|
| 1. | గీఱు | అ | గీఱ |
| 2. | మాఱు | అక | మాఱకము |
| 3. | తగు | అవు | తగవు |
| 4. | చేయు | ఇ | చేయి |
| 5. | అంజు | ఇక | అంజిక |
| 6. | కోరు | ఇకి | కోరికి |
| 7. | కలుగు | ఇమి | కలిమి |
| 8. | అడుకు | ఉ | అడుకు |
| 9. | అలుగు | క | అలుక |
| 10. | కను | కలి | కనుకలి |
| 11. | అడఁగు | కువ | అడఁకువ |
| 12. | చేరు | గడ | చేరుగడ |
| 13. | ఆడు | ట | ఆట |
| 14. | పడు | టు | పాటు |
| 15. | ఆఱు | డు | ఆఱుడు |
| 16. | ఆవులించు | త | ఆవులింత |
| 17. | చేయు | తజ్ | చేఁత |
| 18. | అప్ప — వీఁచు | నజ్ | అప్పన — వీవన |
| 19. | తిరియు | వ | తిరివము |
| 20. | మాయు | పు | మాపు |
| 21. | ఏలు | బడి | ఏలుబడి |
| 22. | కొలుచు | వడి | కొలువడి |
| 23. | తనియు | వి | తనివి |
| 24. | మను | వు | మనువు |

### కృత్తులు పరమగునపుడు కలుగుకార్యములు

1. క, గ, త, ప, వ, ఇమి పరమగుచో, క, గ, చ, య, వ లకులోపము:

బ్రదుకు — బ్రదిమి, కలుగు — కలిమి, కూరుచు — కూరిమి, మూయు — మూఁత, పోవు — పోక మొ.

2. 'ట' పరమగుచో, అంత్యవర్ణలోపము :
ఆడు — ఆట మొ.

3. 'టు' పరమగుచో, ఆద్యక్షరశేషము, దీర్ఘము :
కలుచు — కాటు.

4. 'డు' పరమగుచో, చ, య లకు పకారము :
త్రోచు — త్రోపుడు ; మాయు — మాపుడు.

## తద్ధితములు

| | అర్థము | ప్రకృతి | ప్రత్యయము | రూపము |
|---|---|---|---|---|
| 1. | మతుబర్థము (కలవాఁడు) | అడపము | అ | అడప |
| 2. | ,, | పెండ్లి | అము | పెండ్లము |
| 3. | ,, | జాల | అరి | జాలరి |
| 4. | ,, (పుం) | వగలు | ఆ | వగలాఁడు |
| 5. | ,, (స్త్రీ) | వగలు | ఆఁడి | వగలాఁడి |
| 6. | ,, | ఓయారము | ఇ | ఓయారి |
| 7. | భావార్థము | అగ్గలము | ఇక | అగ్గలిక |
| | స్వార్థము | అరమర | ఇక | అరమరిక |
| 8. | మతుబర్థము (అభావ ద్యోతకము) | ముక్కు | ఇఁడి | ముక్కిఁడి |
| 9. | భావార్థము | పేరు | ఇమి | పేరిమి |
| 10. | స్వార్థము | చిఱుత | ఉక | చిఱుతుక |
| 11. | మతుబర్థము | అటమటము | ఈఁ | అటమటీఁడు |
| | స్వార్థము | మొక్కలము | ఈఁ | మొక్కలీఁడు |
| 12. | పరిమాణార్థము | టూము | ఎఁడు | టూమెఁడు |
| 13. | మతుబర్థము (స్త్రీ) | ఆట | కత్తియ | ఆటకత్తియ |
| | స్వార్థము (స్త్రీ) | చెలి | కత్తియ | చెలికత్తియ |
| 14. | మతుబర్థము (పుం) | ఆట | కా | ఆటకాఁడు |
| | స్వార్థము (పుం) | చెలి | కా | చెలికాఁడు |
| | స్వార్థము (తిర్యక్కులకు) | ఇబ్బంది | కా | ఇబ్బందిగాఁడు |
| 15. | పరిమాణార్థము | టొమ్ము | కొలఁది | టొముకొలఁది |

| | అర్థము | | ప్రకృతి | ప్రత్యయము | రూపము |
|---|---|---|---|---|---|
| 16. | మతుబర్థము | (స్త్రీ) | పాకి | త | పాకిత |
| 17. | భావార్థము | | గొప్ప | తన | గొప్పతనము |
| 18. | భావార్థము | | నల్ల | న | నల్లన |
| 19. | స్వభావము (శీలము) | | తిండి | పోతు | తిండిపోతు |
| 20. | పరిమాణార్థము | | మోఁకాలు | బంటి | మోఁకాలుబంటి |
| 21. | స్వభావము (శీలము) | | మంట | మారి | మంటమారి |
| 22. | భావార్థము | | చిన్న | ఱిక | చిన్నఱికము |

## తద్ధితములు పరమగునపుడు కలుగుకార్యములు

1. 'ఱిక' పరమగుచో, ఉత్వమునకత్వము :
   తొత్తు — తొత్తఱికము.

2. కా, కత్తియల కకారమునకు గకారము :
   అందగాఁడు — అందగత్తియ.

3. 'త' పరమగుచో, ఎత్వము :
   చెంచు — చెంచెత.

4. 'ఎఁడు' పరమగుచో 'లి' వర్ణలోపము :
   దోసిలి — దోసెఁడు.

# 2. యతిప్రాసపట్టిక

## యతిమైత్రి

| | వర్ణము | మిత్రములు | | నామము |
|---|---|---|---|---|
| 1. | అ | ఆ, ఐ, ఔ | .... | స్వరయతి |
| | | య, హ | .... | సరసయతి |
| 2. | ఆ | అ, ఐ, ఔ | .... | స్వరయతి |
| 3. | ఇ | ఈ, ఋ, ౠ, ఎ, ఏ | .... | స్వరయతి |
| | | కృ, ఖృ, గృ, ఘృ మున్నగు ఋకార విశిష్ట హల్లులన్నియు | .... | ఋత్వసంబంధయతి |
| 4. | ఈ | ఇ, ఋ, ౠ, ఎ, ఏ | .... | స్వరయతి |
| | | కృ, ఖృ, గృ, ఘృ మున్నగు ఋకార విశిష్ట హల్లులన్నియు | .... | ఋత్వసంబంధయతి |
| 5. | ఉ | ఊ, ఒ, ఓ | .... | స్వరయతి |
| 6. | ఊ | ఉ, ఒ, ఓ | .... | స్వరయతి |
| 7. | ఋ | ఇ, ఈ, ౠ, ఎ, ఏ | .... | స్వరయతి |
| | | రి, రీ, రె, రే | .... | ఋవళి |
| | | కృ, ఖృ మున్నగు ఋకార విశిష్ట హల్లులన్నియు | .... | ఋత్వసంబంధయతి |
| 8. | ౠ | ఇ, ఈ, ఋ, ఎ, ఏ | .... | స్వరయతి |
| | | కృ, ఖృ మున్నగు ఋకార విశిష్ట హల్లులన్నియు | .... | ఋత్వసంబంధయతి |
| 9. | ఎ | ఇ, ఈ, ఋ, ౠ, ఏ | .... | స్వరయతి |
| | | కృ, ఖృ మున్నగు ఋకార విశిష్ట హల్లులన్నియు | .... | ఋత్వసంబంధయతి |
| 10. | ఏ | ఇ, ఈ, ఋ, ౠ, ఎ | .... | స్వరయతి |
| | | కృ, ఖృ మున్నగు ఋకార విశిష్ట హల్లులన్నియు | .... | ఋత్వసంబంధయతి |
| 11. | ఐ | అ, ఆ, ఔ | .... | స్వరయతి |
| 12. | ఒ | ఉ, ఊ, ఓ | .... | స్వరయతి |
| 13. | ఓ | ఉ, ఊ, ఒ | .... | స్వరయతి |

| | వర్ణము | మిత్రములు | | నామము |
|---|---|---|---|---|
| 14. | ఔ | అ, ఆ, ఐ | .... | స్వరయతి |
| 15. | క్ | ఖ్, గ్, ఘ్ | .... | వర్గయతి |
| | | క్ష్ | .... | విశేషయతి |
| 16. | ఖ్ | క్, గ్, ఘ్ | .... | వర్గయతి |
| | | క్ష్ | .... | విశేషయతి |
| 17. | గ్ | క్, ఖ్, ఘ్ | .... | వర్గయతి |
| | | క్ష్ | .... | విశేషయతి |
| 18. | ఘ్ | క్, ఖ్, గ్ | .... | వర్గయతి |
| | | క్ష్ | .... | విశేషయతి |
| 19. | ఙ్ | ంక్, ంఖ్, ంగ్, ంఘ్ | .... | బిందుయతి |
| 20. | చ్ | ఛ్, జ్, ఝ్ | .... | వర్గయతి |
| | | శ్, ష్, స్ | .... | సరసయతి |
| 21. | ఛ్ | చ్, జ్, ఝ్ | .... | వర్గయతి |
| | | శ్, ష్, స్ | .... | సరసయతి |
| 22. | జ్ | చ్, ఛ్, ఝ్ | .... | వర్గయతి |
| | | శ్, ష్, స్ | .... | సరసయతి |
| 23. | ఝ్ | చ్, ఛ్, జ్ | .... | వర్గయతి |
| | | శ్, ష్, స్ | .... | సరసయతి |
| 24. | ఞ్ | ంచ్, ంఛ్, ంజ్, ంఝ్ | .... | బిందుయతి |
| 25. | ట్ | ఠ్, డ్ ఢ్ | .... | వర్గయతి |
| 26. | ంట్ | ంత్, ంథ్, ంద్, ంధ్ | .... | అనుస్వారసంబంధయతి |
| | | న్ | .... | అనునాసికాక్షరయతి |
| | | ణ్ | .... | బిందుయతి |
| 27. | ఠ్ | ట్, డ్, ఢ్ | .... | వర్గయతి |
| 28. | ంఠ్ | ంత్, ంథ్, ంద్, ంధ్ | .... | అనుస్వారసంబంధయతి |
| | | న్ | .... | అనునాసికాక్షరయతి |
| | | ణ్ | .... | బిందుయతి |
| 29. | డ్ | ట్, ఠ్, ఢ్ | .... | వర్గయతి |
| | | ల్, ళ్ | .... | అభేదయతి |
| 30. | ండ్ | ంత్, ంథ్, ంద్, ంధ్ | .... | అనుస్వారసంబంధయతి |
| | | న్ | .... | అనునాసికాక్షరయతి |
| | | ణ్ | .... | బిందుయతి |
| 31. | ఢ్ | ట్, ఠ్, డ్ | .... | వర్గయతి |

| | వర్ణము | మిత్రములు | | నామము |
|---|---|---|---|---|
| 32. | ంఢ్ | ంత్, ంథ్, ంద్, ంధ్ | .... | అనుస్వారసంబంధయతి |
| | | న్ | .... | అనునాసికాక్షరయతి |
| | | ణ్ | .... | బిందుయతి |
| 33. | ణ్ | ంట్, ంఠ్, ండ్, ంఢ్ | .... | బిందుయతి |
| | | ంత్, ంథ్, ంద్, ంధ్ | .... | అనునాసికాక్షరయతి |
| | | న్ | .... | సరసయతి |
| | | జ్ఞ్ | .... | తద్భవవ్యాజయతి |
| 34. | త్ | థ్, ద్, ధ్ | .... | వర్గయతి |
| 35. | ంత్ | ంట్, ంఠ్, ండ్, ంఢ్ | .... | అనుస్వారసంబంధయతి |
| | | ణ్ | .... | అనునాసికాక్షరయతి |
| | | న్ | .... | బిందుయతి |
| 36. | థ్ | త్, ద్, ధ్ | .... | వర్గయతి |
| 37. | ంథ్ | ంట్, ంఠ్, ండ్, ంఢ్ | .... | అనుస్వారసంబంధయతి |
| | | ణ్ | .... | అనునాసికాక్షరయతి |
| | | న్ | .... | బిందుయతి |
| 38. | ద్ | త్, థ్, ధ్ | .... | వర్గయతి |
| 39. | ంద్ | ంట్, ంఠ్, ండ్, ంఢ్ | .... | అనుస్వారసంబంధయతి |
| 40. | ధ్ | త్, థ్, ద్ | .... | వర్గయతి |
| 41. | ంధ్ | ంట్, ంఠ్, ండ్, ంఢ్ | .... | అనుస్వారసంబంధయతి |
| | | ణ్ | .... | అనునాసికాక్షరయతి |
| | | న్ | .... | బిందుయతి |
| 42. | న్ | ంత్, ంథ్, ంద్, ంధ్ | .... | బిందుయతి |
| | | ంట్, ంఠ్, ండ్, ంఢ్ | .... | అనునాసికాక్షరయతి |
| | | ణ్ | .... | సరసయతి |
| | | జ్ఞ్ | .... | తద్భవవ్యాజయతి |
| 43. | ప్ | ఫ్, బ్, భ్ | .... | వర్గయతి |
| | | వ్ | .... | అభేదవర్గయతి |
| 44. | ఫ్ | ప్, బ్, భ్ | .... | వర్గయతి |
| | | వ్ | .... | అభేదవర్గయతి |
| 45. | బ్ | ప్, ఫ్, భ్ | .... | వర్గయతి |
| | | వ్ | .... | అభేదయతి |
| 46. | భ్ | ప్, ఫ్, బ్ | .... | వర్గయతి |
| | | వ్ | .... | అభేదవర్గయతి |

| | వర్ణము | మిత్త్రములు | | నామము |
|---|---|---|---|---|
| 47. | మ్ | ంప్, ంఫ్, ంబ్, ంభ్ | .... | బిందుయతి |
| | | ంయ్, ంర్, ంల్, ంవ్, ంశ్, ంష్, ంస్, ంహ్ | .... | మువర్ణయతి |
| | | ఉకార సజాతీయాశ్లిష్టము లగు ప్, ఫ్, బ్, భ్ లు బిందుపూర్వకములు గాకున్నను ము, మూ, మొ, మో లతోఁ జెల్లును. | .... | ముకారయతి |
| 48. | య్ | హ్ | .... | ఋజుయతి |
| 49. | ర్ | ర్ | .... | ఏకతరయతి |
| 50. | ఱ్ | ఱ్ | .... | ఏకతరయతి |
| 51. | ల్ | డ్, ళ్ | .... | అభేదయతి |
| 52. | వ్ | బ్ | .... | అభేదయతి |
| | | ప్, ఫ్, భ్ | .... | అభేదవర్గయతి |
| 53. | శ్ | ష్, స్ | .... | ఊష్మయతి |
| | | చ్, ఛ్, జ్, ఝ్ | .... | సరసయతి |
| 54. | ష్ | శ్, స్ | .... | ఊష్మయతి |
| | | చ్, ఛ్, జ్, ఝ్ | .... | సరసయతి |
| 55. | స్ | శ్, ష్ | .... | ఊష్మయతి |
| | | చ్, ఛ్, జ్, ఝ్ | .... | సరసయతి |
| 56. | హ్ | య్ | .... | ఋజుయతి |
| 57. | ళ్ | ల్, డ్ | .... | అభేదయతి |

1. యతులలో అచ్చులకు హల్లులకుఁగూడ సాజాత్యముండ వలయును.

2. సంయోగమున్నపు డొకహల్లునకు సాజాత్యము సరిపడినఁ జాలును.

3. ఋకార విశిష్టహల్లులన్నియుఁ బరస్పరము సజాతీయములే యని భావింపవచ్చును. కృ, పృ మున్నగునవి. —ఋత్వసామ్యయతి.

4. ఋకారము కకారాదిహల్లులపైనున్నను రి రీ రె రే లతోఁ జెల్లును. .... —ఋవళి.

5. ప్రాసమక్కఱలేని పద్యములలో యతిస్థానమున యతికి బదులుగాఁ బ్రాసము వేయవచ్చును. —ప్రాసయతి.

6. యతిస్థానములలోని యకారహకారములకు సాజాత్యమున ప్రత్యేకత లేకుండుటచే అవి ఉన్నను లేవనియే భావింపవచ్చును.

## ప్రాసమైత్రి

పాదమున ప్రథమద్వితీయాచ్చుల నడుమనుండు వర్ణముగాని వర్ణసముదాయముగాని ప్రాసము.

ప్రాసపూర్వాక్షరమునకు లఘుత్వగురుత్వములు తుల్యములై యుండవలయును.

| | | |
|---|---|---|
| 1. దీర్ఘపూర్వఖండబిందు సహితమునకును, బిందురహితమునకును ప్రాసము చెల్లును. | మూఁడు : త్రాడు | ఖండాఖండ ప్రాసము |
| 2. ప్రాసముగానున్న సంయుక్త వర్ణము కొనను రేఫలకారము లున్నచో అవి అంతటను రానక్కఱలేదు. | తండ్రి : వెండి<br>బండ్లు : దండు | సంయుతాసంయుతప్రాసము |
| 3. వాఙ్మాలము మున్నగుచోట్ల అనునాసికసంధులలో ఏర్పడిన పంచమాక్షరములకు ఆయావర్గులలోని తృతీయాక్షరములుగూడ చెల్లును. | వాఙ్మాల : యుగ్మ<br>ప్రాఙ్నగ : అగ్ని | వికల్పప్రాసము |
| 4. సహజములుగాక ఆదేశముగా వచ్చిన షకారణకారములకు సకారనకారములు చెల్లును. | విషమ : అసమ<br>ప్రణతి : వినతి | ఉభయప్రాసము |
| 5. మకారద్విత్వమునకును బిందుపూర్వకమకారమునకునుచెల్లును. నకారద్విత్వమునకును బిందుపూర్వకనకారమునకును చెల్లును. | తమ్ములు : సంమద<br>మిన్నేఱు : సంనుతి | అనునాసిక ప్రాసము |

| | | |
|---|---|---|
| 6. మకారద్విత్వమునకును బిందుపూర్వక బకారమునకును చెల్లును. | కమ్మతము : సంబరము | ప్రాసమైత్రి ప్రాసము |
| 7. థధలకును దధలకును చెల్లును. | గ్రంథము : అంధుఁడు<br>అదనము : అధమము | స్వవర్గజ ప్రాసము |
| 8. రేఫ ఋకారములకు చెల్లును. | తీరము : ఆఋషి | ఋప్రాసము |
| 9. ల, డ, ళ లకు చెల్లును. | జలము : జడము<br>కాలము : తాళము<br>కొడుకు : దళము | అభేదప్రాసము |
| 10. రేఫ ఱకారములకు చెల్లదు. | కరము : విఱుగు | రెంటికి వేసినచో, ప్రాసవైరము |

## 3. గణశబ్ద సూచిక

| గణము | సూత్రము | కార్యము | చేర్పఁదగినవి |
| --- | --- | --- | --- |
| అంజ్వాదులు | కృదంత-12 | 'ఇక' వర్ణకము | అల్లు, ఆను, ఇముడు, ఎన్ను, ఒడంబడు, కదలు, కలయు, చేరు, తీఱు, తేలు, పూను, పొగడు, పొలయు. |
| అందదుకు ప్రభృతులు | సంధి-42 | యథాప్రయోగము | తుందునకలు, దుందుడుకు, వఱువట్లు, వేనవేలు. |
| అక్కటాదులు | ప్రకీర్ణక-8 | ద్విత్వలోపము | కుయ్యి, తొల్లి, దివ్వటీ, నుయ్యి, పొయ్యి, ప్రమ్మద, ప్రొయ్యి. |
| అగ్గలాదులు | తద్ధిత-7 | 'ఇక' వర్ణకము | ఎచ్చరము, ఒరిమ. |
| అటమటాదులు | తద్ధిత-15 | 'ఈ' వర్ణకము | కోడిగము, గారడము, తిండి, మావటము, పెట్టి. |
| అడంగ్వాదులు | కృదంత-6 | 'కువ' వర్ణకము | అఱుగు, అలయు, అలుగు, ఊఁగు, తెఱచు, మను. |
| అడంగ్వాదులు | ప్రకీర్ణక-13 | 'ఱ' కారము | గొడఁగు, పెడక, మడఁగు. |
| అడుక్వాదులు | కృదంత-21 | 'ఉ' వర్ణకము | అడలు, అడ్డు, అలుకు, ఎదురు, కట్టు, కప్పు, కలుసు, కసరు, కుట్టు, కొసరు, క్రొవ్వు, చమపు, చుట్టు, తగ్గు, తన్ను, తిట్టు, తిప్పు, తిరుగు, తెగడు, దగ్గు, నవ్వు, నిక్కు, నుడుపు, నోము, పండు, పగులు, పలుకు, పుట్టు, పెట్టు, పొంగు, పొందు, పొగడు, పోరు, బడలు, బెదరు, బొంకు, మొత్తు, మ్రొక్కు, వెలుఁగు, హెచ్చు. |

| గణము | సూత్రము | కార్యము | చేర్పఁదగినవి |
| --- | --- | --- | --- |
| ఆటాదులు | తద్ధిత-11 | కా-క త్తియలు | అంటు, ఒంటి, కన్న, కొండెము, జీతము, నంటు, నట్టువ, ననుపు, నాణెము, మొన, సంగడి, సంగాతము, వన్నె. |
| ఆత్వాదులు | కృదంత-20 | 'డు'వర్ణకము | చేఁపు, తాఁకు, తిరుగు, దిద్దు, నిక్కు. |
| అవులించు లోనగునవి | కృదంత-10 | 'త'వర్ణకము | అప్పగించు, ఒప్పగించు, చౌకళించు, దాఁగురించు, పలవరించు, పలుకరించు, వెక్కిరించు, వ్రక్కలించు. |
| ఊరు మొదలగునవి | ఆచ్ఛిక-30 | ఇత్వము | ఆలు, ఒడలు, కోడలు, చెల్లెలు, చేను, తేరు, పేను, పేరు, పోరు, ప్రోలు, మఱఁదలు. |
| ఋత్విగాదులు | తత్సమ-73 | ద్వితీయైకవచనాంత తుల్యత | ఆపత్, ఇంద్రజిత్, త్వక్ (త్వచ్), పరీక్షిత్, మరుత్, వణిక్ (వణిజ్), సంపత్, సుహృత్. |
| ఏలాద్యాదులు | కృదంత-14 | 'బడి'వర్ణకము | అందు, పలుకు. |
| ఓయూరాదులు | తద్ధిత-18 | 'ఇ'వర్ణకము | కంచర, కమసాల, కమ్మర, కుమ్మర, చాకల, దొమ్మర, మంగల, మేదర. |
| కీడాదులు | సంధి-40 | ద్విరుక్తటకారము | అడుగు, కౌను, బిట్టు, మిట్టు. |
| కనుమ్వాదులు | సమాస-19 | 'వ'వర్ణకము | అనుము, మిరెము. |
| కలుగ్వాదులు | కృదంత-4 | 'ఇమి'వర్ణకము | బలియు, ముదియు. |
| గీత్వాదులు | కృదంత-18 | 'అ'వర్ణకము | కట్టు, చుట్టు, చేఁదు. |
| చరిత్రాదులు | తత్సమ-58 | 'ము'లోపము | అనుస్వార, అపవాద, ఆభరణ, కాండ, కోకిల, చిహ్న, తోరణ, నిబంధన, నిష్కర్ష, పాత్ర, ప్రశ్న, ప్రాస, ప్రేత, మిష, రేఫ, విమర్శ, వివాద, విసర్గ, శ్రమ, సర్గ, స్పర్శ. |

| | | | |
|---|---|---|---|
| చిన్నాదులు | తద్ధిత-3 | 'ఇక' ప్రత్యయము | ఇల్లు, ఎద్దు, గొడ్డు, మేన. |
| చిఱుతాదులు | తద్ధిత-10 | 'ఉక' ప్రత్యయము | పొడి, పెలి (తెల్ల). |
| చేయ్వాదులు | కృదంత-5 | 'తజ్' వర్ణకము | తీయు, మోయు. |
| చేర్వాదులు | కృదంత-15 | 'గడ' వర్ణకము | ఎత్తు, పన్ను. |
| జాలాదులు | తద్ధిత-17 | 'అరి' వర్ణకము | కాపు, కూర్పు, చనవు, చూపు, చొరవ, చెక్కు, తెగువ, త్రిప్పు, దోపు, పొడుగు, పొదుపు, మేపు, లాపు, వేగు. |
| దక్కులోనగునవి | ప్రకీర్ణక-14 | దకారము | దప్పి, దబ్బాటు, దాపల, దాయు, దీకొను, దొర్లు, దోచు. |
| దూతాదులు | తత్సమ-61 | స్త్రీత్వము | వత్స |
| నల్లాదులు | సమాస-12 | నిగాగమము | గుండ్రు, చక్కి, చప్పు, చిక్కి, సున్న, పలుచ, ప్రన్న, మెత్త, వ్రేరి, సన్న. |
| నల్లాదులు | తద్ధిత-6 | 'న' వర్ణకము | ఉప్పు, గుండ్రు, సున్న, పలుచ, ప్రన్న, మెత్త. |
| నిక్కలాదులు | సమాస-20 | యథాప్రయోగము | చిత్తడి, నిక్కలి, విజ్జోడు. |
| పడ్వాదులు | సంధి-46 | 'ము' లోపము | పాటు, పెట్టు (అడ్డపాటు - భయపెట్టు). |
| పేదాదులు | సంధి-30 | రుగాగమము | వియ్యము. |
| పేర్వాదులు | సంధి-29 | టుగాగము | అలరు, కాలు, నిలుపు, పొదురు. |
| పేర్వాదులు | తద్ధిత-4 | ఇమివర్ణకము | వేలు. |
| ప్రాంతాదులు | సంధి-36 | ఆద్యక్షరశేషము | పొన్ను (పొంబట్టు), హొన్ను (హొంబట్టు). |
| మగాదులు | ఆచ్ఛిక-4 | ఉత్వాభావము | కుట్టు, గొల్ల, నాయి, పిల్ల, బాప, బిడ్డ, బోయ. |
| మాయ్వాదులు | క్రియా-76 | పుగాగమము | బాగు. |

| గణము | సూత్రము | కార్యము | చేర్పఁదగినవి |
|---|---|---|---|
| మాయ్వాదులు | కృదంత-11 | 'పు'వర్ణకము | అనుచు, కూర్చు, చాఁగు, తారుచు, తాలించు, తీర్చు, తుడుచు, త్రుంచు, దంచు, ననుచు, నేరుచు, పంచు, పిలుచు, పేర్చు, విడుచు, వెలుచు. |
| మాత్వాదులు | కృదంత-19 | 'అక'ప్రత్యయము | అల్లు, నమ్ము. |
| ముక్కులోనగునవి | తద్ధిత-24 | 'ఇఁడి'ప్రత్యయము | ఉప్పు. |
| రంజాదులు | క్రియా-71 | ద్విత్వలకారము | అతిశయిల్లు, ఉత్పాదిల్లు, ఉద్భవిల్లు, ఉల్లసిల్లు, ఓసరిల్లు, గర్జిల్లు, తేజరిల్లు, ప్రణమిల్లు, ప్రవర్తిల్లు, భీతిల్లు, పత్తిల్లు, విస్తరిల్లు, శోభిల్లు, సంతసిల్లు, సంతోసిల్లు, సంపాదిల్లు. |
| తేయిప్రభృతులు | అచ్చిక-21 | అంత్యాక్షరలోపము | దోయి, పాయి, ప్రాయి. |
| వగాదులు | తద్ధిత-22 | 'ఆఁడి'వర్ణకము | ఒప్పు, టక్కు, టెక్కు, బొంకు, ముద్దు. |
| వలయ్వాదులు | క్రియా-122 | 'నుజ్'వర్ణకము | అగును-కాదు, పోలును-పోలదు, చనును-చనదు, వచ్చును-రాదు. |
| వృద్ధాదులు | తత్సమ-56 | డుజ్లోపము | దాసు, దుష్టు, ధూర్తు, భట్టు, యోధు, లుబ్ధు, శిష్టు, స్తబ్ధు. |

## 4. శబ్దార్థ నిరూపిక

అంగలించు : దుఃఖించు
అంజిక : భయము
అందదుకు : మిక్కిలిఅదుకులుగలది
అక్కసము : సంతాపము
అగుదెంచు : గతించు
అగ్గలిక : ఆధిక్యము
అటమటము : మోసము
అడకించు : పంచించు
అడపము : వక్కలాకులుంచుబరణి
అడిదము : ఖడ్గము
అదుకు : భయము
అణిమ : ఒకశక్తి, అణుత్వము
అదురుచు : చలించు
అద్ద : సగము
అధ్వగులు : బాటసారులు
అనడ్వాహము : ఎద్దు
అపత్యము : సంతానము
అప్పన : అనుమతి
అయిరేని : నాగవల్లిపాత్రము
అఱ్ఱు : కంఠము
అలఁత : ఆయాసము
అలఁది : పసుపురంగు
అవుడు : పెదవిక్రిందిభాగము
అవుదు : నీటికాలువ
అవ్వారి : అపరిమితము

ఆఁక : అడ్డు
ఆఁకొను : ఆఁకలిచెందు
ఆటు : కొట్టుట
ఆడి : ఒకవిధమగుపక్షి
ఆడిక : నింద
ఆడేలు : పక్షివిశేషము
ఆపోవు : తృప్తిపడు
ఆమంత్రణము : సంబోధనము
ఆమొర : గర్వము
ఆరుచు : ఆడించు
ఆఱడు : నశించుట

ఇందము : ఇదిగోతీసికొనుము
ఇనుమడి : రెట్టి, ద్విగుణము
ఇబ్బందిగాఁడు : ఒకజాతిపులి
ఇఱ్ఱింకులు : మిక్కిలియింకుటలు
ఇల్లిగ్గులు : మిక్కిలివెనుదీయుట, తగ్గుదల

ఈఁకొను : అంగీకరించు
ఈరాఱు : పండ్రెండు

ఉక్కివము : కపటము
ఉజ్జన : విడుపు
ఉప్పరము : ఆకాశము
ఉప్పవడము : మేలుకొనుట
ఉపానహము : పాదుక
ఉజవు : ఔచిత్యము
ఉల్క : బొగ్గునిప్పు, తోఁకచుక్క

ఊర్ధ్వరేతుఁడు : జితేంద్రియుఁడు
ఊఱట : విశ్రాంతి

ఋక్షము : ఎలుఁగుబంటి, నక్షత్రము

ఎక్కిరింత : వాహనము
ఎడ్ద : హృదయము
ఎత్తిలి : గట్టిగా
ఎమ్మె : విలాసము

ఏఁచు : బాధించు
ఏఁపు : బాధ
ఏచు : విజృంభించు
ఏపు : విజృంభణ
ఏలిదము : చులుకఁదనము

ఒంటి : ఒంటరితనము, ఏకాకిత్వము
ఒంటిగాఁడు : పంది
ఒండొకరు : మఱియొకరు, అన్యోన్యము
ఒకానొకటి : నిర్దేశింపఁబడనివస్తువు
ఒకానొకఁడు : నిర్దేశింపఁబడనివాఁడు
ఒకానొకరిత : నిర్దేశింపఁబడనిస్త్రీ
ఒజ్జసము : గురుత్వము
ఒడిఁబ్రాలు : ఒడికట్టుబియ్యము
ఒడ్డిము : పందెము
ఒత్తిలి : గట్టిగా
ఒప్పన : అర్పణము
ఒమ్మిక : ఇమిడిక
ఒరిమ : ఐకమత్యము, మైత్రి
ఒరపు : అందము, నేర్పు

ఓడిక : ప్రవాహము
ఓయ : తిన్నగా
ఓరట్ల : (అర్థముతెలియదు)
ఓలి : వరుస, పంక్తి

కంధుఁడు : కుమారస్వామి
కడఁక : పూనిక
కనుకలి : చూపు
కనుపపులు : తెల్లగడ్డి
కనుబడి : ఉత్పత్తి
కన్నడము : అనాదరము, ఉపేక్ష
కపిల : పుల్లావు, తెలుపునలుపు కలిసినరంగు
కమ్మటము : కమసాలిసంపటి
కమ్మతము : కమతము, వ్యవసాయము
కమికిలి : పుడిసిలి
కయిదువు : ఆయుధము
కయిరఁడు, కత్తెరఁడు : ఒకజాతి గుఱ్ఱము
కయిబ్రాలు : పంగు
కలకంఠుఁడు : కంఠమునందునలుపు గలవాఁడు (శివుఁడు)
కట్టు : నాగటిదుంపయందమర్చబడి యినుపముక్క
కలఁకప : కలఁత, కలఁతపడుట
కలను : స్థానము, యుద్ధము
కలపము : పరిమళద్రవ్యము
కల్లు : ఱాయి, మద్యము
కవ్వడి : సవ్యసాచి, అర్జునుఁడు
కళత్రము : భార్య
కారించు : బాధించు
కాపలుఁడు : గర్వితుఁడు, పాపాత్ముఁడు
కుట్టుసురు : చిన్నఊపిరి, కొనఊపిరి
కుఱుచ : హ్రస్వము
కువ్వాడము : కపటము
కుసిలింత : అతృప్తిచే దుఃఖించుట
కృష్ణవర్త్మ : అగ్ని

కెలను : దిక్కు, పార్శ్వము
కేకరించు ; నకిలించు, అదలించు
కేళాకూళి : క్రీడాసరస్సు
కొట్టిక : గ్రామము
కొడిదిలి : చేర
కొప్పరింత : అతిశయించుట
కొమ్ముకాఁడు : పంది
కొఱను : పశుపక్ష్యాదు లాహారము తినుచోటు
కొఱపత : కొఱవది (ఒకానొకజాతివి)
క్రొక్కారు : వర్షాకాలము, క్రొత్త కాలము
క్రొన్నన : క్రొత్తమొగ్గ, పూవు
కోటరము : కోడంత్రికము

గండఁడు : శూరుఁడు
గంత : వెడలువాఁడు
గంబూరము : కర్పూరము
గట్టన : గట్టించుట
గట్టు : పర్వతము
గరిమ : గొప్పతనము
గరువపున్మరువు : గొప్ప సౌందర్యము
గవను : గోపురము, సింహద్వారము
గవుసెన : గలీబు
గాణ : పాటకాఁడు, పాటకత్తె
గిండి : సన్నపుమెడగలచెంబు
గిజిగాఁడు : పచ్చపిట్ట
గుడ్డము : చేను
గొంటు : దుష్టుఁడు
గొఱ్ఱు : దున్నినపొలముమీఁద దున్నెడుసాధనము
గోఁటు : ఒయ్యారము
గోణము : కౌపీనము, గోఁచి
గ్లౌ : చంద్రుఁడు
గ్రీవ : మెడ

చదియ : నలఁగుడు
చిందము : శంఖము
చిల్లాడము : ఆయుధవిశేషము
చుఁడు : చూడుఁడుఅనుదాని లుప్తశేషము
చుక్రిక : పులిచింతచెట్టు
చెనఁకు : తాఁకు
చెన్నఁటి : కుత్సితము
చెన్ను : శోణము, ఎఱ్ఱనిది
చెయివు : కృత్యము, పని
చేరుగడ : సమీపము
చేరుబడి : సమీపము
చొక్కు : మోహము
చొప్పఱుచు, చొప్పరించు : చొప్పడఁ జేయు, ఆరోపించు
చోపుడు : కలఁత

జట్టి : వెల, బేరము
జనయిత్రి : కన్నతల్లి
జన్నఁడు, నీలఁడు : ఒకజాతి గుఱ్ఱము
జన్నియ : వ్రతము
జాజము : పాలికలయందు పోసిన నవధాన్యముల నారు
జాజర : వంచన
జాది : జాజి
జాదు : ఎఱుపు
జీవగఱ్ఱ : జీవాధారము
జుంజము : దివ్వటీ
జూటము : జడముడి

జోతము : నమస్కారము
జ్రొకు : బురద
ఝురము : ప్రవాహము

తగులుబడి : తగులుట
తడగము : ఎద్దుమీఁద నీళ్ళుతెచ్చెడి తోలుసంచి
తమగము : మంచె, మండపము
తమ్మటము : తప్పెట
తావి : పరిమళము
తిమ్మన : నెమ్మది, చక్కనిది
తిరిపము : బిచ్చము
తిరుగడ : మరపెట్టినగొట్టము
తీఱుగడ : తెలివిడి
తుటారము : దిట్టతనము
తుత్తుమురు : మిక్కిలిపొడి
తులకించు : ప్రకాశించు, కుతూహలపడు
తువ్వర : వానబొట్లు
తూపొడుచు : ఉమియు
తొత్తఱికము : దాస్యము
తొడరు : సక్తమగు, సంబంధించు
తొవ : కలువ
త్రిమ్మట : తిరుగుట
త్రెక్కొను : కలఁచు, పాడుచేయు

దంట : జంట (దిట్టతనము కలవాఁడు, కలది)
దాకలి : లోహములు సాగఁగొట్టు ఇనుపదిమ్మ
దాయి : దాకలి
దిగ్గియ : దిగుడుబావి
దూఁటు : పొడుచు
దొడ్డ : కొల్ల (పోవు)
దొమ్మి : కలహము
దోయి : ద్వయి : జత

నలఁకువ : శ్రమ
నలుఁగడ : నాలుగుదిక్కులు
నాఁపచేను : కోసినపిమ్మట మొలకెత్తినచేను
నాడిక : దేశము
నిక్కల : నిజమగుకల
నిడుద : దీర్ఘము
నిలుపరించు: అఁపు, ఆటంకముచేయు
నిర్మితి : నిర్మించుట
నివ్వెఱ, నివ్వెఱగు : నిశ్చేష్టత, భ్రమ
నీవృతము : గ్రామము, దేశము
నెగడెను : వ్యాపించెను
నెగయు : ఎగయు
నెగయుఁదెంచు : పైకిలేచు, వెడలు
నెట్టిక : కీళ్ళకదలికలోనిచప్పుడు
నెత్తఱి : పెద్దఅల, కడుపుమీఁదిముడుత
నెఱను : మర్మము, జీవస్థానము
నోవి, నోవు : వేదన

పగతురు, మార్తురు : శత్రువులు
పదురుచు : త్వరపడఁజేయు
పనఁటి : కుండ
పరికాఁడు : ప్రధానగజము
పరియ : బద్ద
పల్లగించు : గుఱ్ఱమునకుజీనుకట్టి స్వారికిసిద్ధముచేయు
పల్లము : గుఱ్ఱపుజీను
పల్లు : దంతము, వల్లము
పాటన : అలంకారము

పాళలు : భాగములు
పురోధ, పురోధసుఁడు :
పురోహితుఁడు
పూరేడు : పక్షివిశేషము
పెండారము : శూరుఁడు,
కాలికిధరించెడి అందియ
పెనఁకువ : యుద్ధము
పెన్నేరు : అశ్వగంధి (ఓషధి)
పొలకువ : జాడ
పొలపము : వ్యాప్తి
ప్రపంచార్థము : స్పష్టతకొఱకు
ప్రపంచించు : విస్తరింపఁజేయు
ప్రాకెన్న : పెండ్లియందు
మూఁడవనాఁటి బువ్వము
ప్రాణగొడ్డము : ప్రాణాపాయకరము,
చిక్కు
ప్రువ్వు : పురుగు
ప్రోవు : రక్షణము

బడిమి : భూతబలి
బానసము : వంట, వంటయిల్లు
బిటారము : విలాసవిశేషము
బిత్తరము : శృంగారచేష్ట, సరసము
బెట్టిదము : కఠినము
బొమ్మికము, బొమ్మిడికము,
బొమ్మిడీకము : కిరీటము
బ్రదిమి : జీవనము

మండము : చేఁపలఁబొడుచుచిల్లకోల
మంద్రాటము : సంతాపము
మందడి : గుఱ్ఱపుసాల
మగఱాయి : వజ్రము
మగుడు : మరలు
మజ్జ : ప్రశంసను దెలుపునది
మడఁక : మడఁచుట
మతకము : మోసము
మనికి : జీవించుట
మను : జీవించు
మన్నెము : పన్నులేనిభూమి,
కొండభూమి
మయికొను : సమ్మతించు
మల్లారము : మట్టిగాజులగుది
మానేరు : ఎక్కుడుతీఁగ
మాముడి : మకారద్విత్వము
మిండఁడు : విటుఁడు
మిండఱికము : జారత్వము
మిటారము : అతిశయము,
విలాసము
మిడుఁగు : మిడుఁగుఱు
మిసిమింతము : అలసినది,
కాంతితగ్గినది
(మీరు) తలఁడు :
(మీరు) తొలఁగుఁడు
ముచ్చిచ్చు : త్రేతాగ్నులు—
1. దక్షిణాగ్ని, 2. గార్హపత్యము,
3. ఆహవనీయము.
ముడియ : మూట
మృగ్యము : వెదుకఁదగినది
మెట్టిక : సోపానము
మేకొను : సమ్మతించు
మొక్కరము : స్తంభము
మొక్కలము : ధైర్యము,
ఉత్సాహము
మొక్కలీఁడు : ముష్కరుఁడు
మొగిలు : మేఘము
మొగుడు : ముకుళించు
మొదవు : ఆవు

మొల్లము : ధనము, అధికము
మొల్లాము : బంగారులోనగువాని పూఁత
మోటబరి : బరువుమోసెడియెద్దు
మోవి : పెదవి

యజ్వ : యజ్ఞముచేసినవాఁడు

రక్కాను : తేఱుకొను
రడ్డి : రెడ్డి
రుక్క : కాంతి
రోయి : వేశ్యకిచ్చెడుశుల్కము, కుదువ
రై : ధనము

లకోరీలు : బాణములు
లఘిమ : చులుకన
లవించు : కోయు
లాఁత : విజృంభించుట
లాఁతి : ఇతరము, అన్యము
లాతము : సన్న్యాసులు చేతఁబట్టెడు దండము
లేవడి : దారిద్ర్యము, పేదఱికము

వంజెఱఁగు : చీర చెరఁగు, చెంగు
వగ : విలాసము, టెక్కు
వచ్చుబడి : రాబడి
వదర : వదరుఁబోతు
వయ్యాళి : విహారము
వరను : చిక్కు
వర్మము : కవచము
వరిష్ఠము : శ్రేష్ఠము
వఱ్ఱు : ప్రవాహము
వలను : దిక్కు, పార్శ్వము
వలిపము : సన్నని
వాను : తయారుచేయుట
వానెత : కోమటిది
వాయి : నోరు
వాలు : తోఁక
విడి : పరాక్రమము
విడుగడ : విడుదల
వినుకలి : వినికిడి
విన్న : వెలవెలపాటు
విన్నాణము : నేర్పు
వీఁక : ఉత్సాహము
వీటతాటము : తాఱుమాఱు
వీడుగడ : వీడుట
వీణము : సన్ననివస్త్రము
వీరుత్తు : లత
వెక్కసము : అధికము
వెజ్జఱికము : వంచన, మోసము
వెడ్డఱికము : వంచన, మోసము
వెరవు : ఉపాయము
వేఁకన : బరువు, భారము
వేధ : బ్రహ్మ
వేసట : అలసట
వేసడము : కంచరగాడిద
వ్రయ్య : వ్రక్క
వ్రాయి : అక్షరము
వ్రేఁడు : గొల్లఁడు
వ్రేఁత : దెబ్బ
వ్రేత : గొల్లది
వ్రేలిమి : హోమము

షండము : సమూహము

సంబోధ్యుఁడు : పిలువఁబడువాఁడు
సదము, సదస్సు : సభ

సాహిణి : గుఱ్ఱపువాఁడు
సిడి : అంకుశము
సీవిరి : వింజామరము
సేసఁబ్రాలు : మంత్రాక్షతలు
సొలపము : మూర్ఛ

స్వరాట్టు : ఇంద్రుఁడు

హంత : చంపువాఁడు
హెగ్గడికాఁడు : అంతఃపురముకాచువాఁడు

---

# 5. సూత్రానుక్రమణిక

| సూత్రము | పుటసంఖ్య |
|---|---|

| సూత్రము | పుటసంఖ్య |
|---|---|

| సూత్రము | పుటసంఖ్య |
|---|---|

| సూత్రము | పుటసంఖ్య |
|---|---|
| భవత్యర్థవ్యవహితంబులగు విశేషణంబులకు—కారక-28 | 350 |
| భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమయగు—కారక-32 | 353 |
| భావిని లృట్టగు—క్రియా-4 | 377 |
| భూతంబునం దిగాగమంబగు—క్రియా-17 | 384 |
| భూతంబున లజికి లిడంతంబగు—క్రియా-114 | 437 |
| భూతంబున లిట్టగు—క్రియా-3 | 377 |
| మగటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు—తద్ధిత-8 | 371 |
| మతుబాదికంబు ద్వితీయైకవచనాంత—తత్సమ-70 | 282 |
| మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధియగు—సంధి-7 | 195 |
| మధ్యమపురుష మువర్ణకంబునకు—సంధి-47 | 226 |
| మధ్యమపురుషయోగంబునం డాటగాగమంబు—తత్సమ-37 | 259 |
| మధ్యమముడుఙ్ఞలు ముఙ్ఞ నాఁబడు—క్రియా-31 | 394 |
| మనఃప్రభృతుల సకారంబునకు ద్విత్వంబు—తత్సమ-83 | 295 |
| మహతీతరంబులగు స్త్రీలింగంబుల—తత్సమ-86 | 297 |
| మహత్తులగు మగాదులకుం గయిరాదులకును—ఆచ్ఛిక-4 | 303 |
| మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము—తత్సమ-78 | 290 |
| మహద్వాచకంబులగు సాంతంబులకు—తత్సమ-81 | 295 |
| మహద్వాచకమయి పుంలింగంబగు—తత్సమ-76 | 290 |
| మానార్థంబున కేకత్వంబునం దెఁడువర్ణకంబగు—తద్ధిత-25 | 375 |
| ముక్కులోనగువానికిం—తద్ధిత-24 | 374 |
| ముఙ్ఞిత్తులు ముత్తునాఁబడు—క్రియా-86 | 424 |
| ముఙ్ఞపరంబగునపుడు కోశబ్దంబు—క్రియా-60 | 413 |
| ముఙ్ఞపరంబగునపుడు దీర్ఘంబునకు—క్రియా-61 | 413 |
| ముదాదులకుఁ బ్రథమైకచనలోపంబులేదు—తత్సమ-72 | 284 |
| మువర్ణకంబునకు మాముడియేనిన్—తత్సమ-42 | 265 |
| మువర్ణకంబునకు విధించుకార్యము—తత్సమ-41 | 265 |
| యకారంబును వువూవొవోలును—సంజ్ఞా-17 | 178 |
| యరలవలు లఘువులని—సంజ్ఞా-18 | 179 |
| యవలలు లఘ్వలఘువులు—ప్రకీర్ణక-24 | 478 |
| యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు—తద్ధిత-21 | 374 |
| యుష్మదస్మదాత్మార్థకంబులకు—సమాస-11 | 361 |

# స్వ వి ష య ము

జననము : మార్చి 25, 1898 (విలంబి వైశాఖ శుద్ధపంచమి)

జన్మస్థలము : మసకపల్లి (దాక్షారామ సమీపము)

జననీజనకులు : వర్ధనీపార్వతీశ్వరులు

విద్యాభ్యాసము :

మసకపల్లి (1909 – '11)....

సంస్కృత గురువులు : శ్రీ దువ్వూరి లింగయశాస్త్రులుగారు (కనిష్ఠపితామహులు)

పితాపురము (1912 – '14)....

పాణినీయ గురువులు : శ్రీ వేదుల సూర్యనారాయణశాస్త్రులవారు

విజయనగరము (1915 – '18) : మహారాజ సంస్కృత కళాశాల ....

సంస్కృత గురువులు : మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రులవారు

శ్రీమత్తిరుమల గుడిమెళ్ళ వరదాచార్యులవారు

ఆంధ్రగురువులు : శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారు

పరీక్షలో ఉత్తీర్ణత : విద్వాన్ (1918), మద్రాసు విశ్వవిద్యాలయము

అధ్యాపనము :

1919 – '21 : మహారాజ సంస్కృత కళాశాల, విజయనగరము

1922 : ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము, కొవ్వూరు

1923 – '40 : నారసింహ సంస్కృత కళాశాల, చిట్టిగూడూరు

1941 – '63 : ఆంధ్ర విశ్వకళా పరిషత్కళాశాల, వాల్తేరు

సమీక్షారచనము : 1960 – '63

విశ్రాంతి : పర్ణశాల, మసకపల్లి

ముద్రణము : ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు